శ్రీ

శ్రీమహాభారతముతోఁ జేరిన

# హరివంశము.

శంభుదాసుఁడను నామాంతరముగల

యెఱ్ఱాప్రెగ్గడ రచియించినది.

ఇది

శ్రీమాన్ ॥ కో॥ అనంతాచార్యులవారిచేఁ

బరిష్కరింపఁబడి

యద్దనపూడి-సంజీవయ్యగారిచే

చెన్నపురి:

స్టార్ ఆఫ్ ఇండియా ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1901.

# పీఠిక.

శ్రీమదఖిలభువనహేతుభూతుఁడై నిఖిలకల్యాణగుణోపేతుఁడై వేదాంతప్రతిపాద్యుఁడై యాద్యుఁడై యొప్పారు సప్పురుషోత్తముఁడు లీలామానుషవిగ్రహుఁడై శ్రీకృష్ణభగవదభిధానంబున భువినవతరించి చరించిన చిత్రచరిత్రంబులం బ్రతిపాదించునదియయి పంచమవేదంబనఁబరఁగి పఠనశ్రవణమననాదుల నిఖిలాస్తికసముదయంబునకు నభీష్టదాయకంబయి శ్రీమహాభారతోత్తరభాగంబయిన హరివంశము శ్రీవత్సగోత్రపవిత్రుండును పోతమాంబికకు సూరనార్యునకుఁ బుత్రుండును శంభుదాసలక్షణాభిధేయుండును నైన యెఱ్ఱయ నామధేయునిచే (ఎఱ్ఱాప్రెగ్గడచేఁ) బండితపామర సాధారణంబై వెలయఁ దెనిఁగింపఁబడియె.

## ఎఱ్ఱాప్రెగ్గడ,

ఆంధ్రకవులలోపలఁ బ్రథమగణ్యులై కవిత్రయంబనం బరఁగిన మహాకవిముఖ్యులందు మూఁడవవాఁడు. ప్రబంధపరమేశ్వర బిరుదాంకముగలవాఁడు. ఇతని నివాసగ్రామము నెల్లూరిమండలములోని యద్దంకికి సమీపమునందుండెడి నీలకంఠేశ్వర స్థానమయిన గుడ్లూరు. ఇతఁడు వినుకొండకొండవీడు మొదలుకొని రాజమహేంద్రపురపర్యంతమయిన దేశము స్వాధీనముచేసికొని యద్దంకి రాజధానిగా రాజ్యముచేసిన యనవేమ భూపాలునాస్థానకవి. ఈయన తానురచియించిన హరివంశమహాప్రబంధము నా యనవేమభూపాలునకంకితముచేసెను. అనవేమన క్రీస్తుశకము పదునాలవ శతాబ్దమధ్యమున నున్నవాఁడు గనుక, ఎఱ్ఱాప్రెగ్గడయు నాశతాబ్దమునందున్నవాఁడని యేర్పడుచున్నది. ఇతనికి పూర్వికులయినకవులలో నన్నయభట్టారకుఁడు క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దమునందును, తిక్కనసోమయాజి పదుమూడవ శతాబ్దమునందు నున్నవారగుటఁబట్టియు, ఇతని కవిత్వమాయుభయులకవిత్వపద్ధతులచేఁ బొందుపడియుండుటఁబట్టియు, నితఁడెల్లవిషయములందు నామువ్వురలోను మూఁడవవాఁడై యొప్పెడి.

మఱియు నీమహాకవి బ్రహ్మాండపురాణోక్తంబయిన శ్రీయహోబిలమహాత్మ్యమును లక్ష్మీనృసింహావతారమనుపేర నహోబిలనృసింహాంకితము

గాఁ గావించెను. దానిని నృసింహపురాణమనియు నందురు. అది మృదుమధుర శైలికలిగి సలక్షణము సతిశ్రావ్యమునై యితని ప్రబంధపరమేశ్వర బిరుదనామ ధేయమున నన్వర్థముం జేయుచున్నది.

ఇదిగాక యితఁడు నన్నయభట్ట కృతమయిన భారతారణ్యపర్వశేషము నతనికవిత్వమువలెనే కావించి వన్నెగన్నవాఁడు. ఇంతియకాక మునుపు తిక్కన సోమయాజి తాతయైయిన కవి భాస్కరుఁడు చేసిన శ్రీరామాయణము శిథిలమయి యునేకులచేఁ బూరింపఁబడి బహుప్రకారంబయియుండ నాకొఱంతఁ దీర్పనీతఁ డొకరామాయణమును రచియించినట్లు తెలియవచ్చుచున్నది. అయిన నదియు నిప్పుడు నామమాత్రావశిష్టమైయున్నయది.

ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమెవ్వరియొద్దనే నున్నయెడ వారద్దాని మా యొద్దకుఁబంపి యచ్చొత్తించునట్లు చేయుదురని నమ్మెద. అట్లా పుస్తకము నంపు వారికి ముద్రించిన పిమ్మట నేఁబదిప్రతులు బహుమానముగాఁ బంపనగును.

ఇట్లు,
శ్రేయోభిలాషి,
☞ య-సంజీవయ్య.

శుభమస్తు.

శ్రీహయగ్రీవాయనమః,

విషయసూచిక.

# శ్రీమహాభారతములోఁ జేరిన హరివంశము.

## పూర్వభాగము – ప్రథమాశ్వాసము.

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| కథాప్రారంభము. | ౨ |
| సంక్షేపరూపంబగు నాదిసృష్టిప్రకారము. | ౯ |
| ఇంద్రుఁడు వజ్రాయుధముచేత దితిగర్భంబు భేదించినప్రకారము. | ౧౦ |
| పృథుచక్రవర్తి భూమిని గోవుగాఁజేసి వస్తువులు గొన్నప్రకారము. | ౧౨ |
| వేనుశరీరమథనంబునఁ బృథుఁ డుద్భవించినప్రకారము. | ౧౩ |
| పృథుచక్రవర్తికి భూదేవికి నైన సంవాద ప్రకారము. | ౧౪ |
| వైశంపాయనుఁడు జనమేజయునకు మన్వంతరంబుల నెఱింగించుట. | ౧౮ |
| వైశంపాయనుఁడు జనమేజయునకు ననాగతమన్వంతరములఁ జెప్పుట. | ౧౯ |
| ఛాయాదేవియందు సావర్ణిశనైశ్చరతపతులు పుట్టినప్రకారము. | ౨౧ |

## ద్వితీయాశ్వాసము.

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| రైవతుఁడు రేవతిని బలరామున కిచ్చినప్రకారము. | ౨౪ |
| కువలయాశ్వుండు దుందుండను రాక్షసునిం జంపినప్రకారము. | ౨౭ |
| సత్యవ్రతుండను రాజు వసిష్ఠవచనంబునఁ ద్రిశంకుండైనప్రకారము. | ౨౯ |
| సగరపుత్రులు కపిలుని కోపాగ్నిచేత భస్మీభూతులగుట. | ౩౧ |
| జనమేజయునకు వైశంపాయనుఁడు పితృదేవతల నెఱిఁగించుట. | ౩౩ |
| సనత్కుమారుఁడు మార్కండేయునకుఁ జెప్పిన పితృదేవతాప్రభావము. | ౩౬ |
| పితృగణంబులలో మూర్తిసహితులమూర్తిరహితుల వివరించుట. | ౩౮ |
| పితృదేవతాసమారాధన ఫలవిశేషప్రకారము. | ౩౯ |
| భీష్ముఁడు ధర్మరాజునకుఁ గౌశికపుత్రుల చరిత్రంబు జెప్పినప్రకారము. | ౪౨ |
| భీష్ముఁడుగ్రాయుధుండను రాజుం జంపినప్రకారము. | ౪౨ |
| కౌశికపుత్రులు గురువంచనంబున హీనజన్ములై పుట్టినప్రకారము. | ౪౪ |
| బ్రహ్మదత్తుఁడు దేవీసహితంబుగాఁ బరమసిద్ధి వడయుట. | ౪౯ |

## తృతీయాశ్వాసము.



## చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము.

## షష్ఠాశ్వాసము.



## సప్తమాశ్వాసము.

## అష్టమాశ్వాసము.



## నవమాశ్వాసము.





# ఉత్తరభాగము.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.

## షష్ఠాశ్వాసము.



## సప్తమాశ్వాసము



## అష్టమాశ్వాసము.

శుభమస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

# శ్రీమహాభారతములోఁ జేరిన హరివంశము

## పూర్వభాగము - ప్రథమాశ్వాసము.

శా. శ్రీకిం బ్రేమపదంబు భూమికి సతిస్నిగ్ధుండు దుగ్ధాబ్ధిక
న్యాకేళీరతుఁ డాదివేధకు గృహం బై యొప్పునాభిస్థనా
ళీకంబుం గలవేల్పు లోకములఁ బాలింపం బ్రభుం డుత్తమ
శ్లోకుం డన్నమవేమభూవిభున కిచ్చున్ సుస్థిరైశ్వర్యముల్.

శా. శర్వాణీస్తనచక్రవాకములు వక్షస్స్ఫారకాసారమున్
గర్వం బింపెసలారఁగాఁ దఱిసి వేడ్క ల్సల్ప రోమాంచమున్
సర్వాంగీణముగా ధరించికొని యిచ్చున్ బేర్చు శంభుండు స
ర్వోర్వీరక్షణదక్షు వేమనృపు నత్యూర్జస్వలుం జేయుతన్.

ఉ. తమ్మికిఁ జూలి లోకములతాత తపస్వులయొజ్జ యోగివ
ర్గమ్ముల కాద్యుఁ డాగమపరంపరకుం బ్రభవంబు ధర్మభా
గమ్ములకర్త భారతికి గాదిలి మువ్వురతొల్తపేరు ని
త్యమ్ముగ నాయువీవుతఁ గళాఢ్యుఁడు ప్రోలయవేమశౌరికిన్.

మ. కమలాక్షస్మరఘస్మరాబ్జభవులున్ గైవారులంబోధిపూ
రములున్ బుక్కిటిసామ గోత్రగిరివర్గంబున్ గసత్కందుకా
భము సంక్రీడనవేళ నేవిభున కారాధ్యుండు ప్రత్యూహసం
తమసాదిత్యుఁ డిభాననుం డొసఁగు భద్రంబుం గృతిస్వామికిన్.

మ. వరవస్తుప్రతిపత్తిధుర్య మగునైశ్వర్యంబు పంచాశద
క్షరసంసిద్ధసమస్తశబ్దరచనాసంవ్యాప్తి నుద్దీప్తమై
పరఁగం గల్పలతాసమృద్ధి యగుచుం బ్రజ్ఞావిశేషాఢ్యులన్
గరుణం బ్రోచుసవిత్రి వాణిఁ ద్రిజగత్కల్యాణిఁ బ్రార్థించెదన్.

శా. సందీప్తార్కసమప్రకాశు జలదశ్యామాంగుఁ గ్లప్తాఖిల
చ్ఛందోబృందవిభాగుఁ బావనయశస్సందోహు నస్పందధీ

సందర్భాంచితు భారతాగమకథాసద్భావు లోకత్రయా
నందప్రాప్తికరుం బరాశరసుతున్ సర్వజ్ఞుఁ గీర్తించెదన్.

మ. చతురోద్యన్మతి వాతపోతకమహాసాంయాత్రికుండై తగన్
జతురామ్నాయపయోధుల న్మెలఁగి భాస్వద్రత్నముల్ రామస
న్నుతిరూపంబుగఁ గూర్చి విశ్వజగముల్ భూషించె నేధన్యుఁ డా
వ్రతిముఖ్యుండు ప్రసన్నుఁ డయ్యెడుఁ గృపన్ వాల్మీకి మాకెప్పుడున్.

ఉ. ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడునన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెంతయు గ్రాలుటఁ బ్రస్తుతించెదన్.

మ. తనకావించినసృష్టి తక్కొరులచేతం గామనా నేముఖం
బునఁ దాఁ బల్కినపల్కు లాగమములై పొల్పొందు నా వాణి న
త్తను నీతం డొకరుండ నాఁ జనుమహత్త్వప్రాప్తిఁ గవిబ్రహ్మనా
వినుతింతున్ గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

ఉ: కామవిలోభకస్పృహల గర్వపరంపరఁ గ్రిందువాసి హృ
త్తామరసస్థితుం బగుసదాశివుఁ గాంచి తదేకచింత చిం
తామణిగా తలిర్పఁ దుదిదాఁకినయున్నతిఁ గన్న శంకర
స్వామి గురుండు మాతలఁపు సర్వముఁ దానయి యుండుఁగావుతన్.

వ. అని యిట్లు పూజ్యపూజాతత్పరుండ నై ననాకు సభీష్టార్థదాత వై యవ
దాతచరితంబున సకలజనరంజనం బొనర్చుటం జేసి రాజశబ్దంబునకు భాజనం
బగుచుఁ దేజోవిలాసైకనిత్యుండు పల్లవాదిత్యుం డనియు నుదాత్తపౌరు
షోద్దండుండు జగనొబ్బగండం డనియు సంగతానేకనరపాలపరిపాలనశీలుం డం
గరక్షాపాలుం డనియును సకలకథావిశ్రుత విస్మయకరకేలివిధేయుండు కేళాధిరా
యం డనియును ననుభూతాద్భుతసమరవిజయుండు సంగ్రామధనంజయుం డని
యును నఖిలశత్రువిదారణప్రతిజ్ఞాపూరణోద్దాముండు భుజబలభీముం డని
యును నసాధ్యసాధకవీరవ్రతనిర్వాహణపరాయణుండు వీరనారాయణుం డని
యును దురవగాహరిపువ్యూహవ్యపోహనాభీలుండు గుజ్జరిదళవిభాళుండనియు
నాశ్రితరక్షణవ్యవసితదయాలోలుండు జగరక్షపాలుం డనియును జతుర్విధదుర్గ
విదళనోదారుండు చంచుమలచూఱకారుం డనియును బ్రతిభటవేదండఖండన
ప్రచండుండు మండలీకరగండం డనియును, బహుప్రకారంబుల వీరవ్యవహారం
బులవలన నిశ్శంకంబులై బిరుదాంకంబులు ప్రవర్తిల్ల విలసిల్లు వేమజనేశ్వ
రుండు.

క. సకలకవివర్ణనీయుఁడు, సకలనృపతిపూజ్యుఁ డతనిసంపద్విభవం
బకలంక మనాతంకము, సకలజగన్మంగళప్రసంగము పేర్మిన్.

సీ. కేయూరకంకణాంకితపరాక్రమవితరణములు బాహుభూషణత నొంద
ననుకూలగృహిణిచాడ్పున నృపశ్రీ యెద్దఁ గదలక సకలసౌఖ్యముల నొసఁగ
నమృతసేవనము చందము సమస్తసుధర్మతాత్పర్యమధికమోదంబుఁ బెనుపఁ
గరతలామలకవిఖ్యాతి నాతతనీతిగరిమంబు నిజవివేకమున వెలయ
జాహ్నవీప్రవాహముభంగిఁ జరితమఖిల, భువనపావనపరిపూర్తిఁ బొలుపుమిగులఁ
బరఁగు వేమక్షమానాథుపాటి నృపులు, గలరె యెవ్వారు ధారుణీతలమునందు.

ఉ. వాలి మదోద్ధతారిజయవాంఛ నుదగ్రభుజుండు వేమభూ
పాలుఁ డనంతసైన్యచయబంధురలీలఁ గడంగి యెత్తెనన్
గ్రాలఁగఁ దీవ్రఘోటఖురఘట్టన మొందనిచోటు లేదు వా
చాలవిలోలవీచిశతసంకులసాగరవేష్టితక్షితిన్.

శా. కాంతారంబులు దాటి శైలములు ప్రాఁకన్ బాఱి యంభోధిపా
యాంతర్ద్వీపముల దాఁగి యెన్నఁడు విపత్త్యబ్ధిం బడం గానక
త్యంతక్లేశము నొందుచుండుదురు వేమాధీశుధాటిం బరి
భ్రాంతిత్యక్తకళత్రపుత్రసుహృదాప్తశ్రీకులై శాత్రవుల్.

మ. గజతాఘోటకహాటకప్రముఖముల్ గప్పంబు లొప్పించుచున్
విజితారాతులు ప్రగ్గ దిక్కుల హిమానీకాశనీకాశలై
నిజకీర్తుల్ నిగుడంగ లక్ష్మికతులోన్మేషంబు పోషించె స
క్కజమై వేమనరేంద్రుపేర్మి జగదాకల్పంబు గా కల్పమే.

క. ఘనుఁడు పరాక్రమసంభృత, ధనకోటికి ఫలము పాత్రదానమ యనియెం
దును బహుపురాణముఖముల, వినుచుండుటఁ జేసి యధిక విశ్వాసమునన్.

వ. ఇష్టాపూర్తరూపం బగుక్రియాకలాపంబు నిజకర్తవ్యానురూపంబుగాఁ దొడంగి.

సీ. అగ్రహారములు విద్యాతపోవృద్ధవిప్రుల కిచ్చి యజ్ఞకర్తలుగ నునిచెఁ
గొమరారఁ జెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి లోకసంభావ్యంబులుగ నొనర్చె
నిధులు నల్లిండ్లును నిలిపెఁ దోఁటలు సత్రములు చలివిందరల్ వెలయఁ బెట్టె
హేమాద్రిపరికీర్తితామితవ్రతదాననివహంబు లన్నియు నిర్వహించెఁ
జేసెఁ జేయుచునున్నాఁడు సేయనున్న, వాఁడు పునరుక్తకృతిశుభావలుల నెల్ల
నన్నఁగ శ్రీవేమవిభున కయ్యలకుపేర్మి, వశమె వర్ణింపఁ దద్భాగ్యవైభవంబు.

ఉ. చుట్టు నిజప్రభాపరిధిసోఁకున సర్వదివేలుశైలముల్
గట్టపసిండిగాఁ దనరుకాంచనభూధ్రముఁ బోల్పఁ బాత్రమై

చుట్టము లెల్ల నాత్మసమశోభితసంపద నొంద నొప్పెఁ దాఁ
జుట్టపుమేరు వన్వినుతి సొంపున వేమనరేంద్రుఁ డున్నతిన్.

చ. కులజలరాశిచంద్రుఁ డగుకోమటిపోలనయున్నతంబినీ
తిలకము పుణ్యురాలు పతిదేవత యన్నమయుం గృతార్థతా
కలితులు ధీరు వేమవిభుఁ గానఁగఁ గాంచినపుణ్య మెద్ది యే
కొలఁదుల నెన్నిజన్మములఁ గూర్చిరొ నాఁ బొదలున్ జనస్తుతుల్.

సీ. పంటకులస్వామి ప్రఖ్యాతుఁ డౌర వేమయపితామహుఁ డనుమాన్యతయును
ధూతకలంకుండు దొడ్డయసైన్యనాయకుఁడు మాతామహుం డనువినుతియు
నాదిరాజన్యతుల్యాచారవిధి మాచవిభుఁడు పూర్వజుఁ డనువిశ్రుతియును
శ్రీయుతుల్ పోతయ చిట్టయ నాగయ ప్రభులు మాతులు లనుభవ్యతయును
దనమహత్త్వంబు భూషింపఁ దాను వారి, పేరు వెలయింపఁ జాలుగభీరమహిమ
నాత్మగుణముల నొదవించునన్వయైక, పావనుఁడు వేమజనపతి కేవలుండె.

తే. తనకు నద్దంకి తగురాజధానిగాఁ బ, రాక్రమంబున బహుభూము లాక్రమించి
యనుజతనుజబాంధవమిత్రజనుల కిచ్చె, నెదురె యెవ్వారు వేమమహీశ్వరునకు.

క. దైతేయారికి మాఱట, చేతులక్రియ నొప్పి రెండుఁ జేదోడై వే వి
ఖ్యాతులు తమ్ములు వేమ, క్ష్మాతలపతి కన్నవిభుఁడు మల్లప్రభుఁడున్.

వ. అయ్యిరువురయందును.

ఉ. అన్నచమూవరుండు సకలార్థసమన్వితుఁ డన్నదానసం
పన్నుఁ డభిన్నబాహుబలభాసి భవాంఘ్రిసరోజపూజనా
సన్నుతితత్పరాత్ముఁ డవసన్నవిరోధి ప్రసన్నభావుఁ డ
భ్యున్నతశాలి కీలితశుభోదయుఁ డూర్జితుఁ డయ్యె నెయ్యెడన్.

వ. తదనంతరప్రభుండు

శా. బాహాదర్పమునం బ్రతీపధరణీపాలావలిం దోలి యు
త్సాహోపాదగ్రుఁడు మోటుపల్లి గొని సప్తద్వీపసద్వస్తుసం
దోహంబున్ దన కిచ్చునెచ్చెలి సముద్రుం బ్రీతిఁ గావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్.

క. రామునకు లక్ష్మణుఁడు సు, త్రామసుతుఁడు ధర్మజునకుఁ దగసౌభ్రాత్రం
బేమెయి నెఱపుదు రామెయి, వేమప్రభుఁ గొల్చె మల్లవిభుఁడును భక్తిన్.

శా. వేమక్ష్మాధిపుకూర్మిపుత్త్రుఁడు దయావిభ్రాజి యవ్యాజతే
జోమార్తాండుఁడు కీర్తనీయనుగుణస్తోమంబులం దేమియున్
రామస్ఫూర్తికి లొచ్చుగాక సరియై రాజిల్లె గాజార్చితుం
డాముష్యాయణుఁ డెందుఁ బోతయచమూపాగ్రేసరుం డిమ్మహిన్.

వ. తదీయానుజుండు.

క. దానంబునఁ గర్ణునిసరి, మానంబునవేర్మి ననుసమానుఁడు బుధస
న్మానచతురుండు పోలయ, సూనుఁడు గోమటి సమస్తసులభుఁడు కరుణన్.

వ. వేమధాత్రీపతికిఁ బరమమిత్త్రుండును సకలజగతీజైత్రుండును సగుణామాత్యులప్రియ
పుత్త్రుండు.

మ. జయమే కయ్యమునందు నెంతటరిపుక్ష్మానాథులం జెంపినీఁ
డయసంపన్నత నెన్నఁడున్ వెలితిగాఁ డాగ్యక్రమాయత్తమై
నయ మాత్మీయముగాఁ జిరస్థితుల నానందించు నాఢ్యుండు చి
ట్టయనూకప్రభుఁ డిద్ధసత్యగుణనిష్ఠం బట్టి పుణ్యుం డిలన్.

వ. ఇట్లు సకలసమృద్ధులఁ బ్రసిద్ధప్రభావుం డైనవేమజననాథుం డొక్కనాఁడు
ప్రమోదంబు మిగులం బేరోలగంబున నుండి.

క. అంబుజభవసభుఁడును బో, తాంబావిభుఁడు నగుసూరనామాత్యునిసుతు న
న్నం బూజితధూర్జటిచర, ణాంబుజు శ్రీవత్సగోత్రు సంచితచరితున్.

వ. సవినయంబుగా నర్చించి యిట్లనియె.

తే. సకలభాషాకవిత్వవిశారదుఁడవు, సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి
భవ్యుఁ డవుగాన నీమీఁదఁ బరఁగఁబక్షు, మేను గలిగియుండుదు నెప్డు సజ్జనార్య.

శా. నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింకనున్ దనియ నేఁ గావ్యామృతాస్వాదనన్.

క. భారతపరాంశ మని యిం, పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్యకథ దెనుంగున, ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్.

వ. అనినం బ్రహ్మర్షితపులకితదేహుండనై యమ్మహాభాగునిసమగ్రసంప్రార్థనంబుఁ
గృతార్థతాకలితవృత్తం బగుచిత్తంబునం గైకొని యిట్లంటి.

ఉ. నన్నయభట్టతిక్కకవినాథులు చూపినత్రోవఁ బావనం
బెన్నఁ బరాశరాత్మజమునీంద్రునివాఙ్మయ మాదిదేవుఁడా
వెన్నునివృత్తి మీఁవు కడువేడుకతో వినునాయకుండ వి
ట్లన్నియు సంఘటించె మదభీప్సితసిద్ధికి రాజపుంగవా.

క. కావునఁ జెప్పెదఁ గల్యా, ణావహమహనీయరచనహరివంశము స
ద్భావమున నవధరింపుము, భూవినుతగుణాభిరామ పోలయవేమా.

వ. అని యమ్మహీనాయకుఁ గృతినాయకత్వంబున కభిముఖుంగా నొనర్చి జగద
ర్చితం బగుప్రబంధంబు నిర్మింప నుపక్రమించితి నవ్విధం బెట్లనిన.



కథాప్రారంభము.

సీ. కామ్యంబు జగదేకరమ్యంబు నగునైమిశారణ్యమునఁ బుణ్యయజనశీలు
రై యున్నయాశౌనకాదిసన్మునులు ప్రసిద్ధుఁ డావ్యాసునిశిష్యు ననఘు
రోమహర్షణపుత్త్రు రుచిరవాగ్వైభవు నుగ్రశ్రవసుఁ డనుకథకవర్యు
నర్థిఁ బూజించి మహాభారతాఖ్యాన మఖిలంబు వరుసతో నతనివలన
విని మనంబులు సమ్మోదవనధి నోల, లాడుచుండంగ వెండియు నంత తృప్తి
సనక నూతనకౌతుకసంప్రయుక్త, హర్షరభసులై యిట్లని రతనితోడ.

శా. వ్యాసప్రోక్తము భారతాగమము నీవత్యంతహృత్యోక్తివి
న్యాసం బొప్పఁగఁ జెప్పఁగా విని కడున్ హర్షించె వీనుల్ సము
ల్లాసోద్భాసిత యయ్యె బుద్ధి శ్రుతితుల్యం బప్పుతార్థోదయ
శ్రీసంభావిత మిప్పురాణము ప్రశంసింపంగ నిట్లొప్పునే.

ఉ. ఇమ్మహితేతిహాసమున నెందును సద్భరతాన్వయప్రసం
గమ్మునఁ బూర్వభూపతులకర్మవిశేషములున్ గుణప్రకా
రమ్ములు దేవదైత్యమునిరాక్షసయక్షఖగాదిపుణ్యవృ
త్తమ్ములు ధర్మనిశ్చయవిధమ్ములు పెక్కటిఁగించి తింపుగన్.

ఉ. కౌరవపాండవప్రవరగౌరవలీలలు నీవు చెప్పఁ దీ
పారెడుభంగి వింటిమి గుణాకర యింక జగత్త్రయంబునన్
ధీరులు శూరులున్ విభవదీప్తులు నా నుతిగన్నయాయదు
శ్రీరమణాన్వయోత్తములచందములున్ విన వేడ్కయయ్యెడున్.

వ. తదీయ జన్మచరిత్రప్రపంచంబు సమస్తంబును విస్తరప్రశస్తంబుగా నుపన్యసింప వలయు ననిన నక్కథకుండు ప్రముదితహృదయుండై వారలం గనుంగొని మీరు వినంగోరినయీయర్థంబు జనమేజయజననాయకునకు వైశంపాయనుండు చెప్పి నది యేను జెప్పెద వినుండు మహాభారతశ్రవణానంతరంబ యాపరిక్షిత్తన యుండు పరాశరతనయశిష్యున కిట్లనియె.

సీ. మునివర కురువంశమును యాదవాన్వయంబును నామదికి నొక్కప్రోవ కాఁగఁ
దోఁచుఁ గౌరవకోటిఁ దొడఁగి కీర్తించుచు యాదవులను జెప్పి తచటనచట
నంతటఁ దృప్తి నాయంతరంగంబున కొదవదు తద్వృత్త మొకటి గొఱఁత
పడకుండఁ బ్రత్యక్షపరిచితం బైనదికాదె నీబుద్ధికిఁ గాన నిప్పు
డీవు సెప్పఁగ వినుట సమిద్ధహర్ష, కరము పరమేష్ఠి మొదలుగాఁ గ్రమముతోడ
వలయుప్రఖ్యాతపురుషులవర్తనములు, గూడ నెఱిఁగింపుమా వృష్ణికులముపిధము.

క. అని సబహుమానముగ నడి, గినజనమేజయున కతులకృప వైశంపా
యనముని యిట్లను నభినం, దనపూర్వకముగ నుదాత్తతరహృద్యోక్తిన్.

చ. విను హరివంశనామమున విశ్రుతమైనపురాణ మగ్రిమం
బనుపమవాగ్విశేషవిభవాఢ్యుఁడు సత్యవతీసుతుండు సె
ప్పినయది యేను నీకు వినిపించెదఁ బూజ్యతమంబు వంశ
వర్ధనము సమస్తపుణ్యఫలదం బిది శ్రోతకు వక్తకున్ నృపా.

ఉ. భాసితసిద్ధియుక్తుఁడవు భవ్యయశుండవు నైన నీన యు
ద్భాసితసిద్ధియుక్తమును భవ్యయశంబును నైనయీహరి వ్రా
ల్లాసచరిత్రమున్ వినఁ దలంపఁగ నర్హుఁడ విద్ధవైభవ
శ్రీసుఖసుస్థిరాయువులఁ జెందఁగఁ బాత్రమవై తనర్చుటన్.

## సంక్షేపరూపంబగు నాదిసృష్టి ప్రకారము.

వ. తత్ప్రకారంబునకుఁ బ్రారంభం బెట్టనిన సకలలోకేశ్వరుం డగు పరమాత్ముం డాత్మ
యోగంబున నాత్మయుం బ్రకృతియు ననుతత్త్వమిథునంబు నిర్మించెఁ బ్రకృ
తికి మహత్తును మహత్తునకు నహంకారంబును నహంకారంబునకుఁ బంచ
భూతంబులుం బ్రభవించె నాభూతంబులవలన ననేకభూతభేదంబు లుద్భూతంబు
లయ్యె నిది సనాతనమైనసృష్టికి సంక్షేపంబు తక్కినయవి దీనికి విస్తారానయవం
బు లవి యెట్టి వనిన నవహితుండవై యాకర్ణింపుము.

సీ. అఖిలజగత్సృష్టి నాత్మ నపేక్షించి యాత్మసంభవుండు నారాయణుండు
జలముల సృజియించి సమధికం బగునిజవీర్యమం దిడుటయు విస్మయముగ
విమలహేమాకృతి నమరుమహాండమై కర మొప్పఁ దద్గర్భగర్భమూర్తి
యై యుండి బహువత్సరాత్మకం బగుకాల మేగిన నది యవియించుకొనుచుఁ
బుట్టె నజుఁడు క్రిందటిప్రవ్య్య భువియు మీఁది
వ్రయ్య దివియు ను నడు మంబరంబుఁ జేసి
దిశలు కాలంబు మనసు బుద్ధియును వాక్క
గామకోపరత్యాదిసర్గము నొనర్చె.

వ. మఱియు నతండు మరీచి యత్రి పులస్త్యుండు పులహుం డంగిరసుండు గ్రతువు
వసిష్ఠుండు ననువారి నేడ్వుర నుత్పాదించె నమ్మహాత్ములు క్రియానిరతులుఁ
బ్రజాపతులునై వెలసి రాహిరణ్యగర్భుండు నిజకోపంబున నంతకుం గలిగించె
యోగవిద్యాప్రభుండుగా సనత్కుమారు సృజియించె మేఘవిద్యుదింద్రధనువుల
నశనిరోహితనిర్ఘాతకేతువులఁ బర్జన్యపూర్వకంబుగాఁ బుట్టించె ఋగ్యజుస్సామా
థర్వణంబులు సంపాదించి యజ్ఞసిద్ధికిం బ్రతిష్ఠించె సర్వగాత్రంబుల ననేకభూతం
బుల నిర్మించె నిట్లు ప్రవర్తిల్లి నసృష్టికి నభివర్ధనంబు గోరి.

క. తనమేనిరెండుసగములు, వనితాపురుషులుగఁ జేసి స్వాయంభవుఁడన్
మనువును శతరూపాహ్వయ, మనుపత్నియుఁ గా నొనర్చె మహిమోజ్జ్వలుఁడై.

వ. వారి లిద్దఱకుఁ బ్రియవ్రతోత్తానపాదులు జనియించి రందు.

సీ. ధర్మునిసుతసూనృతాదేవి యుత్తానపాదునివలన సంపన్నయశులు
ధ్రువుఁ డనఁ గీర్తిమంతుం డనఁగాను నా యుష్మంతుఁడన మహాద్యుతి యనంగ
ననఘులనలువురఁ గనియెఁ బుత్రుల నందుఁ ధ్రువుఁడు నిర్మలనిష్ఠతోడ మూఁడు
వేలు దివ్యాబ్దముల్ విశ్రుతతపము గావించి విరించి మెప్పించి సప్త
మునులకంటె మీఁదై యొప్పుననుపమాన, సుస్థిరజ్యోతిరాత్మకస్ఫురితపదవి
వడసె సర్వగీర్వాణతపస్విసిద్ధ, సమితి యాశ్చర్యమునఁ దన్ను సంస్తుతింప.

వ. అట్టి ధ్రువునకు శంభు వనుదానికి శ్లిష్టియు భవ్యుండును ననుకొడుకులు పుట్టిరి శ్లిష్టికి సుచ్ఛాయ యనునది రిపు రిపుంజయ విప్రవృకల వృకతేజసులననేవురం గనియె నందు రిపునకు బృహస్పతికిం జాక్షుషమనువు జనియించె.

క. ఆతండు పుష్కరిణి యను, నాతికి వీరణసమాఖ్యనందనుఁ గనియెన్.
బ్రీతి యొసఁగ నడ్వల యను, గోతి యతనివలనఁ గాంచెఁ గొడుకులవరుసన్.

వ. ఊరుండును బూరుండును శతద్యుమ్నుండును దపస్వియు సత్యుండును సత్యవాక్కును గవియు నతిరాత్రుండును నగ్నిష్టువును సత్యద్యుమ్నుండునభిమన్యుండు ననం బరఁగిన యాపదుండ్రయందును బెద్దవాఁడై నయూరునకు మహాప్రభ యందుఁ గ్రమంబున నంగుండు సుమనుండు స్వాతి క్రతు వంగిరసుండు గయుండు ననునార్వురు పుట్టి రందు నంగుండు మృత్యుపుత్రి సునీథం బరిణయంబై వేనుం డనుకొడుకుం బడసె నతండు.

ఉ. ధర్మువు దప్పి తాపసమతంబున కంకిలిపాటొనర్పఁ గ్రో
ధోర్మిమహాత్ములై తపసు లొక్కట నాతని దక్షిణంపుఁగే
ల్మినమథనంబు సేసిన జనించెఁ బృథుం డనురాజతండు స
త్కర్మధురీణుఁడై నిలిపె ధార్మికసేవిత మైనమార్గమున్.

క. అంతియ కాదు వసుంధర, నెంతయు గోరూపఁ జేసి యొసఁగెఁ గుశలుఁడై
సంతతబహువస్తునివహ, మెంతవలచి రంత యంత యేర్పడఁ గురియన్.

వ. అతనికి హవిర్ధాన యనుమానినికి శిఖండిహవిర్ధానులు జనియించిరి శిఖండికి ధిషణ యనుతెఱవకుఁ బ్రాచీనబర్హియు శుక్లుండును గయుండును గృష్ణుండును నధ్వరుండును నజినుండును ననునార్వురు పొడమిరి ప్రాచీనబర్హికి సముద్రపుత్రి యైనసవర్ణయందుఁ బ్రచేతసు లనువారు పదుండ్రు ప్రభవించి పదివేలవర్షంబులు ఘోరతపంబు సేసి సోమకన్యక యగుమారిషం దమకు ధర్మపత్నిఁగా వరియించి యయ్యింతియందు.

క. దాక్షిణ్యధనున్నిఁ గాంచిరి, దక్షు నశేషక్రియైకదక్షుఁ బ్రభుఁ బ్రజా
ధ్యక్షు ననదృక్షతేజున్, సాక్షాత్పరమేష్ఠిఁ బరమసంయమశీలున్.

వ. అని చెప్పిన విని జనమేజయుం డతని కిట్లనియె.

తే. ఆయజుని కాలిపెనువ్రేలియందుఁ బుట్టి, దక్షుఁ డన వింటిఁ దొంటికథాప్రసక్తి
నిపుడు ప్రాచేతసుం డనియెదు మునీంద్ర, యివ్విధం బేమి దెలియంగ నెఱుఁగఁ బలుకుము.

వ. సోమదౌహిత్రుం డైనయతం డయ్యాసోమునికి మామ యెట్లయ్యె నని యడి
గిన వైశంపాయనుం డిట్లనియె.

మ. విను సర్గంబు లయంబు భూతముల కుర్వీనాథ నిత్యంబు లెం
దును జన్మింతురు దక్షుఁ డాదియగునాద్యుల్ సర్వకల్పంబులన్
జనికిం గారణముల్ పృథగ్విధములై సంధిల్లు నీ తద్విధం
బున నూహింపఁగఁ జిన్న పెద్ద యగుచొప్పు న్లేదియున్ వారికిన్.

ఉ. గౌరవలాఘవంబులకుఁ గారణ మిందఱకున్ దపస్సమా
చారము తారతమ్యము నిజం బిది జన్మగురుత్వహీనతల్
గోరి గణింప రివ్విధి యకుంఠితబుద్ధి నెఱుంగు ప్రాజ్ఞుఁ డిం
పారఁగఁ బొందుఁ గాంక్షితసుఖాగమముల్ బరలోకభద్రముల్.

సీ. తొలితొలి సృష్టికిఁ దొడఁగి యంబుజసూతి దలపోయ నాతనితలఁపు సంధి
మునిదేవదానవమనుజాదిభూతంబు లొక్కట జనియించె నక్కజముగ
నవి యెన్నియును గల్గె నన్నియయై యుండెఁ గాని వర్ధిల్లుట గలుగ దయ్య
నవ్విధం బటుచూచి యాకర్త చింతించి భూతవృద్ధికి హేతుభూతోపాయకల
గాంచి మిథునధర్మంబు నిర్మించెఁ దత్ప్ర, ధానసంప్రయోజనకారి జంతులకును
దక్షుఁ డొక్కఁడ సంకల్పదర్శనములు, తొల్లి హేతువులై చెల్లు దురితదూర.

వ. ఆదక్షప్రజాపతికి వీరణపుత్రి యైనయసిక్నియందుఁ బుత్రపంచకసహస్రంబు పుట్టి
తండ్రిపనుపున భూతసృష్టి చేయ నుత్సహించినయెడ నారదుండు సనుదెంచి.

ఉ. బాలురు మీర లిద్ధరణిభాగము క్రిందును మీఁదు దిక్కులున్
మూలలు నెంత యక్కొలఁది ముందర నిక్క మెఱింగి కాక యు
క్కీలయి యిట్లు సృష్టిపనికిం దమకింపఁగఁ జన్నె యన్న వా
రోలిన యన్నివంకలకు నొక్కట నారయ నేగి రంతటన్.

క. అమ్మెయిఁ జని యొకఁడైనన్, గ్రమ్మఱఁ జనుదేఁడ తత్ప్రకారంబునకు
ల్లమ్మెరియఁగ నాదక్షుఁడు, క్రమ్మఱ నాత్మజసహస్రకమ్ముఁ బుట్టించెన్.

వ. వారు మున్పటివారియట్ల ప్రజలసృజియింపం దొడంగినఁ దొంటిచందంబున నార
దుం డరుగుదెంచి పలికిన.

తే. ఇయ్యకొని లెస్సపని సెప్పె నిమ్మునీంద్రుఁ, డాదిఁ జన్నవారలక్రమ మరయవలదె
యనుచు నన్నిదిక్కులకు నత్యాదరమునఁ, బోయి యాపోకలన చిందిపోయి రనఘ.

క. అదిఁ గతముగ భ్రాత యనిన, పదవి యరయఁ బోక యనఘ భ్రాతల కని చె
ప్పుడు రాజ్య లవ్విధమ్మున, వదలి చనినయాత్మజులకు వగచుచు మఱియున్.

వ. దక్షుండు నిజపత్నియందు నఱువండ్రఁ గూఁతులం గని ధర్మునకుం బదుండ్రను
గశ్యపునకుం బదుమువ్వురను జంద్రునకు నిరువదియేడ్వుర నరిష్టనేమికి నలువు
రఁ గృశాశ్వునకుఁ బహుపుత్రునకు నంగిరసునకు నిద్దఱిద్దఱి నిచ్చె వా
రివలన వసురుద్రాదిత్యవిశ్వసాధ్యాదిదేవతలును దైత్యదానవయక్షరాక్షసగంధ
ర్వాప్సరోవిహంగభుజంగమక్రిములును బ్రభవించిరి మఱియు గోగజాశ్వఖరో
ష్ట్రసింహశార్దూలాద్యనేకచతుష్పదజంతువులును వృక్షతృణలతాగుల్మాదులు ను
ద్భవించె నందుఁ గశ్యపభార్య యైనదితిదేవి హిరణ్యకశిపుహిరణ్యాక్షులం గని
యెం దత్సంతానం బపరిమేయంబై యదితిసంతతి యైనయాదిత్యులతో విగ్ర
హించె నట్టివిగ్రహంబున.

ఇంద్రుఁడు వజ్రాయుధముచేత దితిగర్భంబు ఛేదించినప్రకారము.

మ. అమరశ్రేణికి దైత్యసంతతికి నన్యోన్యాహవం బుద్ధత
క్రమరోషంబున నైన నందు సురవర్గం బేచి యవ్వైరిసం
ఘములో ముఖ్యులఁ బల్వురం దునుము శోకంబంద దైతేయమా
త మనోవల్లభుఁ గశ్యపుం బ్రకటతాత్పర్యంబునం గొల్చినన్.

క. ఆతఁడు ప్రీతుండై యా, న్నాతి నరం బడుగుమనిన నాకేశు ననిన్
ఘాతింపఁగ నోపెడుసుతు, నాతతబలు నవ్వరాంగి యర్థించుటయున్.

తే. అమ్మహాత్ముఁ డాయమతోడ నబల నీవు, శుచిత యెప్పుడు నేమఱ కచలనియతి
నగలి నూఱబ్దములు చూలు దాల్పనోపు, దేని నట్టిపుత్రుఁడు జనియించు ననిన.

వ. అయ్యిగ్గలి యయ్యుగ్రవ్రతంబు నడప నొడంబడియెం గశ్యపమునియు గర్భ
ప్రదానంబు సేసి తపోవనంబున కరిగె నమ్మగువ నిత్యంబుగాఁ ద్రికాలస్నానం
బును వివిధోపవాసవ్రతంబులుం బూని శుచియై యుండె సంతఁ దదంతరాయా
న్వేషకుండై సహస్రాక్షుండు సనుదెంచి నమస్కరించి తల్లీ నీవు వ్రతస్థితవై యునికి
నెఱింగి శుశ్రూష యాచరింప వచ్చితి ననిన నమ్ముగ్ధ సంతసిల్లి.

మ. తనయా యెంతయు మేలు సేసితివు మత్సామీప్యసంసేవివై
యనుకూలస్థితి నుండు మబ్దశతపర్యాప్తిన్ జనింపంగ నీ
యనుఁగుందమ్ముని జూచునుత్సవము నీకబ్బున్ జగం బంతయున్
విను మీ రిద్దఱుఁ గూడి యేలుఁడు కడున్ విఖ్యాతి సంధిల్లెడున్.

క. అనిన నతండును దత్సే, వనతాత్పర్యంబు తెగ నెవం బిడి యేప్రొ
ద్దును నెడమడుగకుమదితో, ననువర్తింపంగఁ గించిదవశిష్టముగాన్.

వ. సంవత్సరశతం బతిక్రాంతంబైన నొక్కనాఁ డమ్ముదితపాదశౌచంబు సేయ మఱచి నిద్రితయైన నది రంధ్రంబుగాఁ దదీయోదరంబు సొచ్చి జంభారి దంభోళిం గొని తద్గర్భం బేడుద్రయ్యలుగాఁ జేయ నయ్యర్భకుండు రోదనంబు సేసిన.

క. మారుద యని పలుకుచు నతి, దారుణరోషంబుతోడ నచ్చికలను ల
క్షీణుఁ డొక్కటొకటి యేడే, డై రూపులు నడచె నంత నప్పూర్తితమై.

క. అసురజనని కడునార్తిని, వసమతి యిట్లు సేయఁ దగు నే వారిని యనఁగాఁ
ద్రసదంతరంగుఁ డగుచును, వెస వేలుపుఁ విబుధవిభుఁడు వినతాంగిఁ గనెన్.

చ. అడుగులయందు శౌచవిధి యాత్మ నొసప్పఁ దొలంగి నేఁపు నా
ల్గడ దలయందిగా నిమరగ్ని కొని నేసది యంతరంబుగాఁ
గడఁగి మదంతహేతు వగుగర్భము నొంచితి దీనిఁ దప్పఁగాఁ
దడవక నైపుఁగా వలయుఁ దల్లి నినుం గొనియాడ లోకముల్.

చ. అనవుడు నింద్రుతోఁ బనిరెు నమ్మునిపత్ని దెలిసెంతయోనిఁ గీ
డన వశమై ధనచ్ఛరిత మంతయు లెస్సయ కాక యింక నా
కు నొకఁడు మేలు సేయఁగఁ దగున్ గులిశాహతిచేత నైనయ
త్తనుశకలంబు లన్నియు వశం బొనరింపక కావు మింపొటన్.

వ. ఈసలువదితొమ్మిదియును దేవతలై నీవు వారలకు యనుట కారణంబుగా మరు
దుతు లనం బరఁగి దేవాసురసమరంబులందు నీకుం జేదోడై నవువదరయు దీనికి
నొడంబడు మనిరెు నతం డవ్విధంబునకుం బ్రియంబు నొందె నిది సర్వభూత
సంభవప్రకారంబు.

క. ఈసృష్టివిధం బెఱిఁగిన, భాసురపుణ్యుం డు సకలభయములనలనన్
బాసినయతులైశ్వర్య. శ్రీసౌఖ్యము నొంది మోక్షసిద్ధియుఁ గాంచున్.

వ. విను మివ్విధంబునం గలిగినభూతవిశేషంబులకు నజుండు ప్రత్యేకంబ యధికారం
బుం గల్పించి యభిషేకం బొనర్చె నంతయు వివరించెద.

సీ. పృథుఁడు భూపతులకుఁ బెద్దవాఁడై యుర్వి యంచితరీతిఁ బాలించువాఁడు
ద్విజతారకాతరుప్రజములకును యజ్వలకుఁ దపంబునకుఁ బాలకుఁడు సోముఁ
డధికసంపదలకు నంబుధివితతికి రాజన్యులకును వైశ్రవణుఁ డొడయఁ
డఖిలభూతముల ననంతపిశాచసంచయముల శాసించుఁ జంద్రధరుఁడు.
విష్ణుఁ డాదిత్యులకు వసువితతి కగ్ని, జలములకుఁ బాశపాణి, వేల్పులకు నింద్రుఁ
డసురకోటికిఁ బ్రహ్లాదుఁ డంతకుండు, పితృసమూహంబునకు నధిపతులు వరుస.

క. నాగులకు వాసుకియుఁ బెఱ, భోగులకుం దక్షకుఁడుఁ బ్రభులు పక్షులకున్
నాగాంతకుండు మనుజవరా గంధర్వులకుఁ జిత్రరథుఁడును నొడయుల్.

క. కరులకు నైరావతమును, హరులకు నుచ్చైశ్శ్రవంబు నవనీస్థలిపై
నరులకు నృపతియు హిమగిరి, గిరులకు నేఱుల కుదధియుఁ గీర్తితభర్తల్.

వ. ఇదిమొదలుగా నాదిసర్గంబునం బరమేష్ఠి నియమించినయాధిపత్యంబు లిట్లు నిశ్చ యించి యాజగద్ధాత ధాత్రియంతయు నాలుగుచెఱంగులుగా నేర్పఱిచి యం దుఁ బూర్వదిక్కున విరాట్పుత్రుం డగువైరాజును దక్షిణదిక్కునం గర్దమ పుత్రుం డగుశంఖపదుండునుం బశ్చిమదిక్కున రజఃపుత్రుం డగుకేతుమంతుం డును నుత్తరదిక్కునం బర్జన్యపుత్రుం డగుహిరణ్యరోముండును బరిరక్షకులు గాఁ బ్రతిష్ఠించె నన్నలువురు రాజులును మధ్యమభూమీశ్వరుం డగుపృథుండు తమకు ననుశాసకుండుగా భాసిల్లి రివ్విధంబునం బూర్వులచేత నీయుర్వి సప్తపర్వత ద్వీపసాగరసమేతయై యనుభూతిం బొందె నంతంజాక్షుషమన్వంతరానంతరంబున వినజభవుండు వైవస్వతమనువునకు సమగ్రసామ్రాజ్యం బొసంగె ననిన విని జనమేజయుండు.

చ. మునివర యెవ్విధంబున సముద్భవ మొందెఁ బృథుండు ధాత్రి యే యనువున దోహయోగ్య యగునట్టులుగా నొనరించె నవ్వర మ్మనుజవరేణ్యుపన్నున సమంచితవస్తువిశేషదోగ్ధలై రనయముఁ జిత్ర మట్టితెఱఁ గంతయు నా కెఱిఁగింపు నాప్రదుఁడా.

పృథుచక్రవర్తి భూమిని గోవుఁగాఁ జేసి వస్తువులుగొన్న ప్రకారము.

వ. అతనికి వైశంపాయనుం డిట్లనియె.

సీ. ఆదియుగంబున నంగుండు నాఁ జనుభూమీశ్వరుఁడు మృత్యుపుత్రియైన నీరజనయన సునీథయం దధికబాహాసముద్ధతు వేనుఁ డనుతనూజుఁ గనియె రాజై వాఁడు తనమాతామహుఁ బోలి క్రౌర్యంబునఁ బుడమిజనులఁ బీడించి ధర్మంబుఁ బెడవాయఁగాఁ ద్రోచి వేదవిరుద్ధదుర్వృత్తి మరిగి యెల్లవారలఁ బిలిచి మీరేసుకృతము, నాచరింపఁగ వలదు నానాధ్వరముల తెరువు పోకుఁడు మేర యతిక్రమింతు, రేనిఁ జంపుదుఁ జెఱుతు నెవ్వారలైన.

తే. యజన మిజ్యుండు యష్ట నా నతిశయిల్లు, నిన్ని తెఱఁగులవస్తువు లేన కాఁగఁ దలఁపుఁ డేమేనిభర్గంబు గలిగె నేనిఁ, బన్నుగా నది చేయుఁడు నన్నుఁ గూర్చి.

వ. అని యాజ్ఞాపనంబు సేసిన.

సీ. జపములు గాయత్రిసహితంబుగా మాసె వేదంబు పేరును వినఁగ లేద సోమపానక్రియచొప్పులు రూపఱె హుతములు కఱవయ్యె హుతవహునకు సర్వదైవతసమర్చలు గిట్టిపెట్టంగఁబడియె బూర్తంబులపనులు సమసెఁ బరహితంబులు బానపరతలుఁ గడతేఱె సతతవ్రతోపవాసములు పొలిసె

క. తారక పితికికొనఁ జాలి కు-బేరునివత్సముగ విడిచి పితికిరి యక్షుల్
ధీరమతు లామపాత్రను, దారాంతర్ధానశక్తి తగుదుగ్ధముగన్.

తే. రజతనాభుఁడు దోగ్ధగా రాక్షసులు పి, శాచములు పృకపాలభాజనములందుఁ
గనిరి నరరుధిరాఖ్యదుగ్ధము సుమాలి, వత్సమై పెంపొసగ్ఁగ ననుగఁ బిశిత.

క. వాసుకి పితికెడువాఁడుగ, భాసితఫణపాత్ర గరళబహుదుగ్ధము లు-
ల్లాసమునఁ గ్రేపు తక్షకుఁ, డై సమకొనఁ గొనిరి దాగనాదిప్రబలభుజగుల్.

క. మేరుగిరిదోగ్ధగా నీ, హారనగముఁ గ్రేపుఁ జేసి యద్రులు పితికన్
బూనిశిలాపాత్రికలన్, గోరిమహౌషధులు రత్నకోటులు నుర్విన్.

క. వృక్షములు లతలు గొనియెన్, బ్లక్షము గ్రేపుగఁ బలాశపాత్రికలన్ బాల్
ప్రక్షతిపునఃప్రరోహత, నక్షత సాలంబు దోగ్ధయై తిలకింపన్.

వ. ఇవ్విధంబున సకలచరాచరభూతంబులు నాత్మీయ వాంఛితంబులు శాశ్వతంబులుగాఁ బడసి పరమానందంబునం బొందిలం జైత్రిలోక్యకామదోహిని యై ధాత్రియు విధాత్రియు పావనియు ననుభవ్యనామంబులం బ్రాజ్ఞవర్ణితయై వసుంధరాదేవి పృథునిశాసనంబున నిలిచి యతనికిఁ బుత్రియై పృథ్వి యనుపేరం బరఁగి మధుకైటభమేదోమేదుర యగుటఁ దొల్లియు మేదిని యనం బేర్కొనియె నంత ననేకసస్యశోభితయు ననేకవసురత్నాకరయు నపరిమితపురగ్రామప్రతిష్ఠాగరిష్ఠయు నవిరతప్రాణిసముదయసంకీర్ణయు నై యతిశయిల్లె నిట్లు ప్రభావనిత్యధన్యుం డైన యవ్వైన్యుండు రాజన్యులకు నాకర్ష్యుండయి వెలింగి భువనపూజ్యుం డయి సామ్రాజ్యంబున సుఖం బనుభవించె నని చెప్పి వైశంపాయనుండు.

సీ. సకలభూతములకు సంభావనీయుఁడు పృథుచక్రవర్తి ప్రస్ఫీతకీర్తి
వేదవేదాంగపవిత్రవర్తను లైనవిప్రులకును నీతివిక్రమములఁ
బరఁగురాజులకును బశుపాలనాకృషివాణిజ్యరతు లైనవైశ్యులకును
ద్విజవర్ణికార్చనాతత్పరు లగుశూద్రులకు నమస్కారార్హుఁ డలఘుగుణుఁడు
వృత్తిదాత యాదిమధర్మవృద్ధికరుఁడు, శూరవర్యుఁడు గావున శూరులకును
మాన్యుఁ డాజికిఁజను చోట వైన్యుఁ డలఁచి, భటులు గెలుతురనాయాసభంగిఁ బగఱ.

క. ఈపృథుచరితము జనులకుఁ, బాపహరము భూరిపుణ్యఫలదము నిత్య
శ్రీపుత్రదారవర్ధన, మోపి పఠించినను వినిన నొసఁగును ముక్తుల్.

వైశంపాయనుఁడు జనమేజయునకు మన్వంతరంబుల నెఱిఁగించుట.

వ. అనిన విని జనమేజయుండు మన్వంతరంబుల తెఱం గడిగిన వైశంపాయనుం డిట్లనియె.

క. తోయజసంభవుసాటి, త్యాయసముద్భవుఁడు సర్వధర్మాధ్యక్షుం
డాయతమతి యాద్యమనువు, స్వాయంభవుఁ డపరపద్మసంభవుఁ డధిపా.

వ. అతనికాలంబున యామాభిధానులు పన్నిద్దఱు దేవతలైరి పరమేష్ఠితేజం బపర
మూర్తియై యింద్రత్వంబు నొందె మరీచి యత్రి యంగిరసుండు పులస్త్యుండు
పులహుండు క్రతువు వసిష్ఠుండు సప్తమునిపదంబు గైకొనిరి ప్రియవ్రతోత్తాన
పాదులు మనుపుత్రులు ధాత్రీపరిపాలనంబునకు నభిషేకంబు భజియించి రందుఁ
బ్రియవ్రతునకు నగ్నీధ్రుం డగ్నిబాహుండు మేధుండు మేధాతిథి వసువు జ్యోతి
ష్మంతుండు ద్యుతిమంతుండు హవ్యుండు వపుష్మంతుండు సవనుండు ననం బదుండ్రు
కొడుకులు గలిగిరి వారిలో నగ్నిబాహుమేధహవ్యు లనువారు మువ్వురు విరక్తు
లయి పోవం దక్కినయేడ్వురు నేడుదీవులకు నేలికలై వేర్వేఱ పెక్కండ్రఁ దన
యుల నుత్పాదించి వర్షాధిపతులం గావించిరి.

క. స్వారోచిషుఁ డనుపేరను, దారుండు ద్వితీయమనువు తద్దయు వెలసెన్
బారావతులుఁ దుషితు లనం, గా రెండుగణంబు లైరి క్రతుభుజులు నృపా.

వ. విపశ్చిన్నామధేయుండు యజ్ఞశతసుకృతంబున నింద్రుం డయ్యె నూర్జుండు
ప్రాణుండు దత్తుం డత్రి ఋషభుండు చ్యవనుండు బృహస్పతి యనువారు సప్త
మునిత్వంబు సంగీకరించిరి చైత్రుండు కింపురుషుం డాదిగా మనుపుత్రులు రాజ
కులంబులం గలిగించిరి.

సీ. విను ముత్తముఁడు నాఁగ వెలసె మూఁడవమను వతనికాలంబున నమరగణము
లైదు సుధామసత్యశివప్రతర్దనవశవర్తు లన నొప్పె వాసవత్వ
మొందె సుశాంతినా నొకపుణ్యకృత్తు సుతేజుఁడు మొదలై నదీప్తతేజు
లనఘు లేడ్వురు వసిష్ఠాత్మజన్ములు మునులై రొగి నిషుం డూర్జుఁ డనఁ దనూర్జుఁ
డనఁగ మధుమాధవులు నాఁగ ననఁగ సహుఁడు
శుచి యనఁగ శుక్రుఁ డన నభస్యుఁడు నభుఁ డన
మనుతనూభవదశకంబు మహి భరించెఁ
దత్తదన్వయములు పెక్కు దనరె నెందు.

తే. తామసుఁడు నాఁ జతుర్థుఁ డతామసాత్ముఁ, డధికుఁడై యొప్పెమనువు తదంతరమున
దేవతలు సత్యహరసుధీసుధాపు, లనఁగ నాలుగుగణములై యమరి రోలి.

వ. శిబి యనుమహాభాగుండు వేల్పులం బాలించె హవ్యుండును బృథుండు నగ్నియు
జన్యుండును ధాతయుఁ గపివంతుండును బవనుండును సప్తర్షిభావంబులఁ బడసిరి
ద్యుతియు తపస్యుండును సుతపుండును దపోమూలుండును దపోశనుండును దపో
రతియు తన్వియు ధన్వియు నకల్మాషుండును బరంతపుండును ననుమనుతనూజులు
పదుగురు రాజులైరి పంచమమనువయినరైవతుకాలంబునం గలవారల వినిపించెద.

తే. విను సుమేధసు లనఁగ భూతరజసులన, వరుసతోడ వైకుంఠులు స్వామిభోగు
లనఁగ నాలుగుగణములై రమరులమర, విభుతఁ గాంచెఁ బుణ్యాత్ముఁడు విభుఁ డనంగ.

వ. వేదబాహుండు వినిద్రమరీచు వేదశిరుండు హిరణ్యరోముండు పర్జన్యుం డూర్ధ్వ బాహుండు సత్యనేత్రుండు ననువారు సప్తమును లై రి ధృతిమంతుం డవ్య యుండు తత్త్వదర్శి నిరుత్సుకుం డరణ్యుండు ప్రకాశకుండు నిర్మోహుండు సత్య వాక్కు కృతియు నై నతుండు ననుమనుప్రభవులు ఘనప్రభావు లై రి చాక్షుషుం డాఱవమనువు తత్కాలంబున.

తే. ఆద్యులు ప్రభూతయజ్ఞభుజులు నాఁ బృథుకుఁ, డనఁగ లేఖులు నాఁ బల్కఁ బరఁగుగణము లై రి వేల్పుల నేలె శతాధ్వరక్రి, యూఢత్రిలోకుండు మనోజవుండు.

వ. అంగిరసుపుత్రుఁ డత్రిష్వాసు మునులై వెలసిరి మనుసంభవు లై యురుప్రభృతు లుర్వి పాలించిరి సప్తమం బగు వైవస్వతమన్వంతరం బిప్పుడు వర్తిల్లెడు నిందు వసురుద్రాదిత్యమరుద్విశ్వదేవసాధ్యాశ్వినులనునవి యెనిమిదిగణంబులు నూర్జస్వియనువాఁడు దేవేంద్రుండు కశ్యపాత్రివిశ్వామిత్రగౌతమభరద్వాజజమ దగ్నివసిష్ఠులు సప్తమునులు మనుజాతు లయిన యిక్ష్వాకుప్రముఖులు మహీపాలు లయి నిజవంశంబులు ధరణిం బ్రతిష్ఠించిరి.

క. మనువులు నమరులు నింద్రులు, మునులును నిజవిహితకాలములతుద నిట్లుం గం జనఁగా నన్యులు వెసఁ గై, కొని తత్పదముల నిలుతు రనంతగరిమన్.


వైశంపాయనుఁడు జనమేజయునకు ననాగతమన్వంతరంబులఁ జెప్పుట.

క. వీరెల్లను దమతమయధి, కారంబులు నిర్వహించి కడపట నాత్మో త్తారకమగు బోధము గని, చేరుదు రక్షయ్యముగఁ బెంపగు పదము నృపా.

వ. అతీతవర్తమానమన్వంతరంబులు లెక్కింగించితి నిటమీఁద సూర్యసుతుండగు సావర్ణుం డష్టమమన్వంతరంబు నొందెడు నతనికాలంబున సుతపస్సునాభముముఖ్యులన సమర్త్యులు మూఁడుగణంబు లయ్యెడరు బలిదైత్యుండు దివిజాధిపత్యంబుఁ బడయుఁ బరశురాముండు పారాశర్యుండు ఋశ్యశృంగుండు గృపాచార్యుం డశ్వత్థామ దీప్తిమంతుండు గాలవుం డయోధ్యుఁడు మహామునిపదంబున వెలుంగుదురు సమ్మ తుండు ధృతిమంతుండు సునరీఘుండు వృష్ణి సుమతి మొదలుగా మనుజవిభులు గాఁగలరు మఱియు దక్షుదౌహిత్రులు నలువురు మేరుసవర్ణులయి సావర్ణులనం బరఁగి యాకనకశైలంబుతటంబునఁ దపోనిష్ఠనున్నారు రుచిప్రజాపతిపుత్రుండు రౌచ్యుండును భూతిసంభవుండు భౌత్యుండును గా ననాగతమనువు లేడ్వురు వీరల యందును సురలు సురేంద్రులు మునులును మనూద్భవులును వేఱువేఱ పురా ణంబులం బరికీర్తితులయి యుండుదురు.

సీ. యుగచతుష్టయమును నొక్కటియై యేకసప్తతివారముల్ సనియె నేని మన్వంతరం బగు మన్వంతరంబున సలిలప్లవం బగు సలిలసంప్ల

వానసానము సృష్టి యంచితచరిత యీాసరణిని యుగసహ్రసంబు దెగిన
సజ్ఞానసునకు దినాత్యయం బొందు సత్తటి సర్వభూతబృందముల నుక్క-
పెట్ట యాదిత్యరశ్ములు పేర్చి చేసు, సట్టిబెడిదంబునకు నోర్వ కమరవరులు
మునులు సజుఁడు మున్నుగమహామూర్తివిష్ణునుదరదేశంబుసొత్తురుబ్రదుకుగోరి

వ. ఇప్పుడు చెప్పంబడినయీప్రపంచవర్తనం బంతయుం గల్పంబులం దెల్లను సాధా
రణం బైనవిధంబు నీవడిగినయట్లు లమన్వంతరంబులు సంక్షేపరూపంబున నీకెఱిం
గించితి నేలదీయవిస్తరకథనంబు వర్షశతంబునకైన నశక్యవిభానం బనియుపన్య
సించి వైశంపాయనుం డన్నరనాయకుతో మఱియు నిట్లనియె.

తరువోజ. ఈవిశ్వమును సృజయింపఁగఁ గర్త యీశ్వరుఁడాఢ్యుఁడజితుఁడక్షరుండు
గోవిందుఁడనఘుయేకులమునందాత్మగోరియుద్భవముం దెఁగువలయంబులర
నావృష్టిభూవరాస్వయము కీర్తించునట్టియీకథనంబునంద దేను జెప్ప
వైవస్వతుండిష్టపవర్తిల్లుమనువువంశంబు వినుము భవ్యముగానఁ దొలుత.

క. తనహృదయేశ్వరుఁ గశ్యపు, ననుకూలప్రీతిఁ గొలిచి యదితి యతనిపా
వనతేజంబునఁ దాల్చెను, దనయుం జాలుగ సహస్రధాము మహాత్ముర్.

క. ఆచందంబున నుండి వి, రోచనుఁ డాత్మీయతిగ్మరుచిఁ దల్లితనూ
గోచరరక్తాంతి యట్లలమును, వే చెన్నఱఁ జేసెఁ జిత్రవిభవస్ఫూర్తిర్.

వ. కశ్యపసంయమియు నయ్యతివం జూచి యవ్విధంబెఱుంగమింజేసి నీయుదరంబు
లోనిగర్భాండంబు మృతంబు గాఁ దుడుపవే యని పలికె నది కారణంబుగా
మార్తాండుం డనుపేర నుదయించి యాదిత్యుం డుగ్రతేజంబున జగత్త్రియంబు
నకు నధికసంతాపంబు సేయుచుండె నతనికిఁ ద్వష్టకూఁతురు సంజ్ఞాదేవి దేవియై
యసాధారణం బగుసౌకుమార్యంబు గలయది గావున.

చ. గనగన నెల్లప్రొద్దుఁ గొని క్రాలెడు వేఁడిమిఁ బేర్చుభర్తమే
నెనయను డగ్గఱ్ర నయిన కెంతయు భీతి నెమంగుచుర్ లస
ద్వనరుహపత్రలోచన యవంధ్యచరిత్రమునర్ వదాత్మకిం
పునెఱయఁజేయుచుం గనియెఁ బుత్రుల నిద్దఱు నొక్క-కన్నియర్.

వ. వైవస్వతమనువును యముండును యమునయు నన నిట్లు ముప్పురంగని యవ్వ
రాంగి యోర్వలేక నిజచ్ఛాయంజేసి ఛాయయనుదానిం బుట్టించి తనయెదురం
బనియేమి యనికేలుమొగిచి యున్నయన్నాతిం జూచి.

క. తాను బతివేఁడిమిఁబరి, మ్లానాకృతినై కడుం దలంకెడు తెఱఁగ
మ్మానవతికి నెంతయు న, న్మానన సెఱిఁగించియనియె మంజులరీతిర్.

తే. పుట్టినింటి కేను బోయి మొక్కించుక, యూఱడిల్లి వత్తు నుపిడ సీవు,
వింతతనము లేక విభునకుఁ బ్రియము నా, మాఱుగా నొసర్చి మనుము నెమ్మి.

క. మఱచియయిన నాయి త్తెఱఁ, గెఱిఁగింపకు పతికి బిడ్డ లేముఫ్వురకున్
నెఱసినగారామేమియుఁ, గొఱఁతవడకి యుండి సడపి క్రొలుము శుభముల్.

క. నావుడు నది యాయమతో, దేవి తలవట్టియూడ్చి తిట్టకొలఁదిగో
షావేశము పతి యొందిన, నేవిధమున నిన్నుఁ జెప్ప నిది నిజ మనినన్.

వ. సంప్రీతమానసయై సంజ్ఞాదేవి తండ్రిపాలికిం జని తినవచ్చినకారణంబు వెఱింగించి
సిగ్గునం దలవాంచి యున్న నవ్విశ్వకర్మ యక్కొమ్మం గినిసి బుజ్జనంబులుఁ నిర్ద
నంబులు బెరయ నశ్రుకణకరాళికపోలం బగుతదాననం బాలోకించి.

క. ఎంతయుఁ గ్రూరుం డయినను, శాంతుఁ డయినఁ బతియె చువ్వ నలకారయ న
త్యంతపుబంధువు తద్గతి, శ్రాంతి దలఁచుకాంతయంహఁ జనునే శుభముల్.

తే. పొమ్ము నీప్రియుపాలికి నమ్మ తగను, విడువు తలఁ కని కన్నీరు నుడిచి మూర్ధ్నఁ
గౌఁగిలించి వీడ్కొలిపినఁ గ్రమ్మఱంగఁ, బోక బెగ డగ్గలింప నప్పువ్వుఁబోఁడి.

వ. నిజాకారంబు మఱుఁగుపఱుపం దురంగరూపంబు దాల్చి యుత్తరకురు క్షేత్రప్రదేశం
బునఁ బతిసమాగమంబుఁ గోరుచుఁ డదీయధ్యానపరివశ్యయై యుండ నంత నక్కడ.

ఛాయాదేవియందు సావర్ణి శనైశ్చరతపతులు పుట్టిన ప్రకారము.

సీ. ఛాయసంజ్ఞాదేవిచందంబునను సూర్యునకు శుశ్రూషణం బాచరించు
చుండంగ నతఁడును నొం డెఱుంగక యనురాగవిహారిణియై రతిఁ దేల్చ
సావర్ణుఁడును శనైశ్చరుఁడును దపతినాఁ బరఁగు కన్యయు జనించిరి క్రమమున
నయ్యింతి దనపాపలందు మిక్కిలికూర్మి బెరయ సంజ్ఞాదేవిబిడ్డ లయిన
ముఫ్వురను గేరడము సేయ నవ్విధంబు, సైపలేక యొకప్పుడు శమనుఁ డలిగి
చరణమమ్మాఱుదల్లిపైఁ జాచెఁ దన్న, దాని శాయమ గోపసంతాప మొసఁగ

క. జననియనక యిట్లింతయు, నను లంకించి తటుగావుసం బదము మహిం
బనిసినడుఁ గాక యని పెలు, చన శపియించుటయు వెఱచి జముఁ డాతుసుఁడై.

వ. తండ్రిపాలి కరిగి ప్రణతి యొనర్చి తనయపచారంబు తల్లి కోపించియిచ్చినశాపం
బును నెఱింగించి.

ఉ. ఎందఱు గల్గినం బ్రజల కేకవిధం బగులాలనంబుఁ జే
యం దగరే పవిత్రలు మదంబ మమున్ ముగురన్ సహింప దే
చందమొ పిన్నవారలకుఁ జాలఁగఁ బతుముశేయు దీనికిన్
డెంద్యములోనఁ దాలిమి ఘటింపక యే నిటు తప్పుసేసితిన్.

తే. బాల్యమందును నజ్ఞానభంగి నైన, యదియు దీని సహించి శాపానుభవము
దగులకుండంగఁ జేయవే జగదధీశ, యనినఁ గరుణించి కమలాప్తుఁ డతనితోడ.

క. వినయయుక్తుఁడు ధార్మికుఁ డితఁ, డనుఁ బరఁగిన నీవు నిట్లు లగుట యరిది యి
ప్పనికి నిమిత్తం బేమో, యనఘా కలుగంగఁ జాలు నాత్మఁ దలంపన్.

వ. అది యట్లుండె మాతృవాక్యంబ మోఘంబు గావున నొక్కతెఱంగు సేసెదం గ్రిములు భవచ్చరణమాంసంబు ధరణిపయిం దొరఁగింపఁ గలయవి యంతట శాపఫలం బనుభూతంబ యగు నని పలికి ఛాయాదేవిం జూచి నీవు సర్వసంతతి యందును సదృశవాత్సల్యవు గామికిఁ గతం బేమి యని యడిగిన నది యేమేని యుత్తరం బీఁబోయినం గనలి యిమ్మునుండు నిజంబు చెప్పుము చెప్పకున్న నిన్నుఁ గఠోరశాపానలంబు పాల్పఱుతు ననుటయు.

ఆ. సంజ్ఞ సనిన తెఱఁగు సకలంబుఁ జెప్పె న, త్తెఱవ యతఁడు రోషదీప్యమానుఁ
డగుచు విశ్వకర్మ నావాసమునకు నే, గుటయు నమ్మహాత్ముకోప మాఱిగి.

వ. అతండు తనకుమారుతుని మఱిగి మగనిపాలికిం బోనకుంయు నాత్మసృష్టిం దెలిసి, యట్లునిం బ్రియవినయసంభావనంబుల ననునయించి ప్రసన్నుం గావించి.

శా. నీతేజం బతితీవ్రమై పరఁగుట న్నిక్కంబు సైరింపలే
కాతంకంబునఁ బొంది సంజ్ఞ భవదీయాకారశాంతత్వముల్
జేతోవృత్తమునందుఁ గోరుచుఁ దపస్వేలాత్మయై యున్నదీ
వాతన్విన్ జరితార్థఁజేయఁ దగదే యాత్మానుకూలంబుగన్.

మ. భవదీయం బగుదివ్యయోగిము గిరీంపన్ శక్యమే యప్పుతం
బవికారం బది చెప్పనేల నను నీవాజ్ఞాపనం బిప్పునే
యువిధం బెంచుక గల్గె నేని విను చిత్రోపాయసంధాయినై
భువనాధ్యక్షతె యొండుచందం బిల నొప్పం జేయ నీమూర్తికిన్.

చ. అనుటయు నవ్విధంబునకు సంబుజబాంధవుఁ డియ్యకొన్న నా
తనిపటుదీప్తిమండలి ముఖంబున నుగ్రముఖం బమర్చి పే
తునియఁగఁ ద్రచ్చెఁ జిత్రకృతినైపుణ్యఁ డవార్యజగత్ప్రమోదివ
ర్ధనుఁడు సురేంద్రవర్ధకి యుదంచితతేజము ద్రవిస్సి రాలఁగన్.

వ. ఇట్లు కిరణంబు లెల్ల నురవడి దుల్లి విన్ననై సంగాంతి మాత్రదేహుండై పద్మినీకాంతుండు నిజకాంత యున్నరూపంబు యోగదర్శనంబునం గని తానునుం దురంగ మూర్తియై యచ్చోటికి కరిగి కలియుటయు నమ్మగువ యన్యపురుషుం డనుతలం పునఁ బెఱుకు దాఁచి మొగపగటయు నిరుపురినాసాపుటంబులు మోచిన నాసత్యులు పుట్టిరి తదనంతరంబ.

శా. ఆరూపంబటు వాసి నైజతను వుప్పారంగఁ దాల్పంగఁ జే
తోరాగంబున నవ్వెలంది నిజనాథున్ గాంచి తానున్ శుభా

కారం బేర్పడ నిల్చె నయ్యిరువురుం గామోపభోగక్రియా
ధౌరేయుం బగునుజ్జ్వలోత్సవమునం ధన్యాత్ములై రెంతయున్.

వ. ఆవివస్వంతునకు తనయాగ్రపుత్త్రుం డగు వైవస్వతమనునకు సప్తమమన్వంతరాధిపత్యం బొసంగె యముండు నిజధర్మవివర్ధనంబున ధర్మరాజను విఖ్యాతియు మహత్త్వంబునుం గనియె సావర్ణుం డిటమీఁద నష్టమమనుస్థానంబు భజియింపం గలవాఁడై మేరుశిఖరంబునందు గరిష్ఠ యగుతపోనిష్ఠ నుండి యుండె శనైశ్చరుండును గ్రహాసనంబు బ్రతిష్ఠుండై నిలిచె యమున మహానదియై లోకపావనమూర్తిం బ్రవర్తిల్లెఁ దపతి సంవరణుం డనురాజునకు రమణియై భారతవంశప్రదీపకరం బగునపత్యంబు వడసె నాసత్యు లాశ్వినేయులను నామంబులను వైద్యులై యనవద్యవిద్యాగరిమంబునం బెంపొందిరి బృందారకశిల్పియు ననల్పం బగు తపనతేజోరజఃపుంజంబున నజునకుఁ బ్రతిమానవిమానంబును దానవధ్వంసనఁ బ్రశంసనీయవిక్రమం బగుచక్రంబును ఫాలలోచనునకు నాఖీలం బగుశూలంబును రచియించె నిట్లు కీర్తితం బైన.

క. ఈదేవజన్మకథనం, బాదరమున వినినఁ బ్రీతులై చదివిన స
మ్మోదంబున వ్రాసిన ల, క్ష్మీదీర్ఘాయువులు సుతసమృద్ధియుఁ గలుగున్.

క. అని జనమేజయవిభునకు, మునివైశంపాయనుండు మును పరిపాటిన్
వినిపించినకథ యంతయు, ననుపమచారిత్ర యస్నమాంబాపుత్త్రా.

శా. లక్ష్మీలాభవిధావిసర్గలగుణాలాపైకధర్మా యశో
లక్ష్మ్యాకల్పితలోకలోలుపవధూలభ్యావలోకా సమ
స్తక్ష్మాభోగఫలాత్మభాగ్యవిలసత్సౌభాగ్యయోగ్యా మహో
సూక్ష్మోపాయహృతాన్యభూపవిభవాశూరత్వశక్రోద్భవా.

క. సకలద్వీపాంతరచర, త్సకలాపనిరంతరార్చనాకలనారం
భకకురుమలూరిపురనా, యకమల్లచమూవరేణ్యహారినివేద్యా.

మాలిని. బహుళహయగజేంద్రదస్సారసేనాసహస్ర
ప్రహతకటకరాష్ట్రభ్రష్టవిద్విష్టసంప
ద్గ్రహణపరమధన్యోదగ్రధాటీభటశ్రీ
మహితజయవిజృంభామంజురాజ్యోపలంభా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసాంద్ర ధర్యధుర్య శ్రీసూర్యనారాయణసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైన శ్రీహరివంశంబునందుఁ బూర్వభాగంబునందుఁ బ్రథమాశ్వాసము.

పూర్వభాగము - ద్వితీయాశ్వాసము.

క. శ్రీలీలాలక్షణని, త్యాలంకృతధామ పూరితాశ్రితకామా.
కేళీసుఖసుత్రామా, భూలోకసహస్రధామ పోలయవేమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు వైశంపాయనుండు వైవస్వతుజన్మం బెఱింగించి మఱియు జనమేజయున కిట్లనియె.

క. వైవస్వతమనువునకు ధ, రావర తొమ్మండ్రు సుతులు ప్రభవించిరి బా హావిజితలోకు లధిక, శ్రీవిలసితు లమ్మహాత్ముచిత్తం బలరన్.

వ. ఇక్ష్వాకుండు నాభాగుండును ధృష్టుండును శర్యాతియు నరిష్యుండును ప్రాంశువును నరిష్టుండును గరూషుండును బృషధ్రుండు ననుపేళ్లుగలవీరలు జనించిరి వీరు జనియింపకమున్న యమ్మనువు పుత్రకామేష్టి చేసి యందు మిత్రావరుణు లనుదేవతల నుద్దేశించి యొక్కయాహుతి వేల్చిన నయ్యగ్నియందు భవ్యరూపాభిరామయు దివ్యాంబరాభరణభాసితయు నగుకన్య యుదయించిన జనకుం డిల యనునామ్ం బొనరించి యింపురమ్మని వాత్సల్యం బెసఁగఁ బిల్చిన నయ్యతివ యతనిం జూచి.

క. చిరపుణ్య యేను మిత్రా, వరుణులయంశమున సంభవము నొందితి న స్వరమతిఘనుస్వలపాలికి, సరిగెద నిది ధర్మ మర్హ మయినది నాకున్.

సీ. అని యాక్షణంబ తా నటఁ జని వారలఁ గని కేలుమొగిడించి వినత యగుచు
నిలిచి మీయంశంబువలన నేఁబుట్టితి ననుఁ బంపుఁ జెయ్యవి పనులు మీకు
ననుటయు మిత్రుండు నవ్వరుణుండును దరుణి నీ వెంతయు ధర్మశీల
వీబుద్ధి యీసత్య మీవినీతత కన్య లెవ్వారలకుఁ గల దివ్విధంబు
మెచ్చు గావించె మామది మచ్చెకంటి
మాకుఁ గూతురవై తింక మనుకులంబు
వెలయఁజేయుపుత్రుఁడవు గా వలయుఁ జువ్వె
యిపుడు సుద్యుమ్నుఁ డనునామ మమరునీకు.

వ. అట్టిపురుషత్వంబునందుఁ బరమధర్మపరతయు లోకప్రియకారితయు సర్వసమర్చనీయతయు నిన్ను నధికయశోవిజృంభితుంగావించు నవైవస్వతమనువుం గాన నెరుగుమని పనిచిన మగిడి చనునప్పు డమ్మార్గంబున.

తే. సోమనందనుఁ డత్యంతసుందరుండు, బుధుఁడు కామించి పొందె నప్పువ్వుఁబోఁడి
నైలుడనఁగఁబురూరవుం డపుడుజనన, మొందెనమృతాంశువంశకరోద్ధయుండు.

క. ఇలపద్దపడిసుద్యుమ్నత, వెలిఁగి మహారాజ్యవిభవవిభ్రాజితతో
నిలయేలె ధర్మనీతి, స్ఖలనమొకింతయును లేక కడుదీర్ఘముగన్.

వ. ఆసుద్యుమ్నునకు నుత్కలుండును వినీతాశ్వుండును గయుండును దనునా పుట్టి
రందు నుత్కలుం డుత్కలవిషయంబునకుఁ బతియయ్యె వినీతాశ్వుఁడు పశ్చిమ
ధరణిపాలనంబు పరిగ్రహించె గయుండు గయాభూమి యగుపూర్వదేశంబు
నేలె వైవస్వతమనువు మనుజలోకంబున దండనీతిఁ బ్రవర్తించి మహర్లోకం
బున కరిగినపిదప నిక్ష్వాకుండు మధ్యమదేశంబు శాసించె నాసుద్యుమ్నుండు
వసిష్ఠానుమతంబునఁ బ్రతిష్ఠానపురంబునం బ్రతిష్ఠితుండై యుండె.

క. తనవనితాదశఁ గాంచిన, తనయునకుఁ బురూరవునకుఁ దత్పురసామ్రా
జ్యనిరూఢి యొసఁగి మోదం, బునఁ దపమొనరింప విపినభూమికిఁ జనియెన్.

వ. ఇక్ష్వాకువెనుక వైవస్వతమనుపుత్రు లెనమండ్రయుండిరి.

సీ. వినుమరిష్యంతునకు జనియించెఁ బుత్రశతంబు నాభాగుఁడు తనయునొకని
నంబరీషునిఁ గాంచె ననఘ ధృష్టునకు ధార్ష్టిక నాముల్బహుక్షత్రియులు
పుట్టిరి శర్యాతి పుత్రు నానర్తుఁ గన్నియ సుకన్యాఖ్యను నెమ్మిఁ గనియె
నయ్యింతి భార్గవచ్యవనుని గాదిలిభార్యయై సద్వృత్తిఁ బనఁగె నంత
వీరుఁ డానర్తుఁ డానర్తవిషయమునఁ గు, శస్థలీనామనగరవాసమునఁ గనియు
ప్రీతి నుండంగ సూతుఁడు రేవతుఁ డన, గలిగినూర్వురుకొడుకులఁ గలుగఁ జేసె.

రైవతుఁడు రేవతిని బలరామున కిచ్చినప్రకారము.

వ. అందఱకు నగ్రజుం డైనరైవతుండు కకుద్మి యనుపేరువెలయ విలసిల్లుచు నాత్మీ
యకన్యయైనరేవతిం దోడ్కొని తనసుచరితంబున బ్రహ్మలోకంబునకుం గార్యా
ర్థియై చని.

క. ఒక్కముహూర్తము వనజజుఁ, డక్కడ గాంధర్వగోష్ఠియందుండ భువిన్
పెక్కుయుగము లిటఁ బోయిన, నక్కజముగఁ దాను సప్ప చప్పరిమేష్ఠిన్.

తే. కాంచి మగుడ నేతెంచుచో ఘనులు వృష్ణి, భోజవంశజుల్ కృష్ణుఁడు రాజుగాఁగ
నాకుశస్థలి ద్వారక యనఁగఁ బరఁగు, దివ్యనగరిగాఁ జేసి వర్తిల్లుచుండ.

క. ఆతఁడు రేవతిసతి వి, ఖ్యాతబలుం డైనబలున కాత్మేశ్వరిగాఁ
బ్రీతి నొసఁగి తపమునకై, గీతయశుం డరిగె మేరుగిరితటమునకున్.

సీ. ఆఁకలి నీరువ ట్టలఁత జరారోగములు కాలగుణములు మొదలుగాఁగ
దోషంబు లెవ్వియుఁ దోయజభవులోకముఖఁ బ్రభవింపవు మనుజనాథ
గాన రైవతుఁడు దత్కన్యయు విక్రృతులఁబొందరై రతఁ డటఁబోయి యుండ
నిటఁ దత్సహోదరు లేకోనశతమును నుండఁ గుశస్థలి యుగ్రులైన
రాక్షసులు దోఁచి కొనుటయు రాజసూను, లఖిలదిశలఁ జెల్లాచెదరైరి భీతి
నాకకుద్మికి సుతులు లే రయిరి గాని, తక్కుఁగలయందఱకును సంతతులు గలిగె.

వ. తత్కులప్రభువులు సర్వదేశంబులను శర్యాతు లన మహాక్షత్రియపూజ్యులైరి నాభాగునికులంబు వా రన్నివర్ణంబులం గలిసి పోయి రరిష్టున కిద్దఱుకొడుకులు గలిగి, వైశ్యత్వంబు నొందిరి కరూశతనూజులు కారూషు లన వేర్వేఱ వంశకరత్వంబు నొందిరి పృషధ్రుండు గురుహోమధేనువు వధియించి తదీయశాపంబున శూద్రభావంబు నొందె నిట్లు వైవస్వతమనునందను లెనమండ్ర కులంబులుం దెలిపితి నందు ఱకు నగ్రజుం డైనయిక్ష్వాకుండు.

క. ఆనతులై మానవపతు, లానతి యొసఁగంగ దాల్చి నక్షోణివలయు స ర్వానందుం డగుచు నయో, ధ్యానగరము తనకు రాజధానిగ నేలెన్.

క. అతనికిఁ బుత్రులు నూర్గురు, ప్రతాపవిభవైకనిధులు ప్రభవించిరి త ద్వితతికి నాద్యుఁడు తేజో, యుతుఁడు వికుక్షి యనునాతఁ డుర్వీశవరా.

వ. శకునిప్రముఖు లయినతక్కినకొడుకులు పూర్వోత్తరాపరదేశంబులకు వేర్వేఱ శాసకు లైరి వికుక్షియు జనకనియోగంబున నొక్కనాఁడు పితృకార్యార్థంబు శశమాంసంబు దేర నడవికిం జని బుభుక్షితుండై శశంబు భక్షించుటం జేసి శశాదుండనుపేర వసిష్ఠువచనంబునఁ దండ్రిచేత సంత్యక్తుండై తత్పరోక్షంబున గురుండ యభిషేకింప నయోధ్యాపతి యయ్యె నతనికి.

క. జనియించెఁ గకుత్స్థుం డను, జనపతి కాకుత్స్థనభవ్యసంజ్ఞ నిజకులం బునకు వారికెల్లఁ దేజో, జనకంబై పెరయఁ బరయశశ్శ్రీయుతుఁడై.

తే. వినుము నేనఁ డనఁగ నుద్భవించె ననుఁడు, నాక కకుత్స్థునకు నయ్యనేనుండు కొడుకుఁ బృథునిఁ గనియె విష్టరాశ్వుండు తత్తనయుఁ డతని, కార్ద్రుఁ డుదయించె సుజనసౌహార్దశాలి.

వ. ఆర్ద్రునకు యువనాశ్వుండు జనియించె యువనాశ్వునకు శాబస్తి పుట్టె శాబస్తి యనుపురంబు నిర్మించెఁ దత్తనూజుం డగు బృహదశ్వుండు కువలయాశ్వుం గనియె నతండు పుత్రశతవంతుండై నపిదప నాత్మీయవిభవంబు తత్పుత్రుల కిచ్చి తపోవనంబున కరుగి నున్న నుదంకుం డను బ్రహ్మర్షి వచ్చి యిట్లనియె.

కువలయాశ్వుండు దుందుండను రాక్షసునిం జంపిన ప్రకారము.

సీ. మధువనుసురయాత్మజుఁ డుగ్రకూరుఁడు దుంధుఁ డనుదానవుఁడు మదీయాశ్రమంబు చేరువ నంభోధితీరవాలుకలలో బిలమున నిద్రించి వెలుచ నేఁట నొకమాటు నిడుపయూర్పు వ్యంగ మంటయుఁ బొగయుఁ బెంధూళితో నెగసినభయము గప్ప నావనభూమి కంపంబు సప్తవాసరములు ఘోరమై పరఁగు నధిప ఘోర్వరాదు మా కయ్యెడ నొక్కమాక, కాదు సర్వభూతములకుఁ గరము బాధ యట్లు కావున నవ్విబుధారిఁ దునిమి, వెండి చనుము తపంబు గావించుపనికి.

వ. అమ్మహాదైత్యు వధియింపం బూనువానికి నాత్మీయతేజంబున నాప్యాయనం బొసంగి జయంబు గావింతు నని నారాయణుండు నాతో నానతిచ్చె నీవు దక్క

నెక్కటి వానిం బరిమార్చి సముద్రులయందును శేషుండు లేఁ డెట్లు చేయు మనిన నన్నరేంద్రుండు.

క. విను శత్రునిర్యాసంబే, నొనర్చి తపమునను దీప్తి నొందితి నింకన్
జనునే క్రౌర్యంబు భవ, ద్వినియుక్తియుఁ జేసి యుండువిధ మొనరింతున్.

వ. అని తదాజ్ఞాకరణంబునకుఁ బుత్రసమేతుం డగునాత్మజాతు నప్పగించి యప్పర మతపస్వి చేత ననుజ్ఞాతుండై యాతం డరిగెఁ గువలయాశ్వుండు నుదంకు మున్నిడుకొని కొడుకులతోడ ససైన్యంబుగా నిక్కనుపై నడచె నప్పుడు.

ఉ. ఈతఁడు పుంమనిం బనిమి యెల్లజగంబుల దుంధుమారివి
ఖ్యాతపదైకభాజనత నందెడునంచు దినంబునన్ సుర
వ్రాతము పల్కుచుం గుసుమవర్షము పంపుభిసంక్రమయున్
బ్రీతి ఘటించుచుండె మునిబృందము సమ్మదమంది నంతయున్.

క. వారిజనాభుని తేజం, బారాత్తముని మాహాత్మ్యయం బొలయఁగ ఘోరా
రాతిజయహేతుభూత, స్ఫారవికాసమయి యతనిభాసం బలరెన్.

వ. ఇట్లరిగి యమ్మహాతేజుండు తనబాహుబలం బనిచి సముద్రసికతాఖననంబు సేయించి తన్మధ్యసుప్తుం డగుదనుజుం గనిపెట్టె నంత నమ్మహాసురునానానేత్రవదనంబులం దలువడి యుద్దీప్తదహనజ్వాలాజాలంబు భూపాలపుత్రులు ముప్పదియొక్కండొక్క నవారి నెల్ల భస్మీకరించి విస్మయావహంబై కదియ నతండు తనయోగవిద్య వలన నప్రమేయంబగు తోయంబు నుత్పాదించి యాకృశానుఁ బ్రశమితుం జేసి పైతామహం బగునస్త్రంబునం బగతుం బడవైచి తదీయకాయం బుదంకునకుం జూపి సమ్మోదం బొవాగించిన నమ్మహాతపస్విసంఘము.

చ. నృపునకుఁ బ్రాజ్యరాజ్యపదనిత్యతయున్ సుకృతైకబుద్ధియున్
రిపుజయలక్ష్మియున్ శుభగరిష్ఠముగాఁ జెడ దివ్యమైభవా
భ్యుపగమము వ్వరంబులుగ నొప్పెసఁగన్ గృపఁ జేసి సంగర
కుపితసుతాళి కక్షయసుఖం బగునాకము నిచ్చె నచ్చటన్.

వ. కువలయాశ్వుండను మునీంద్రు వీడ్కొని పురంబున కరుగుదెంచెఁ దత్పుత్రులు మువ్వురయందును బెద్దవాఁడు దృఢాశ్వుండు వంశకరుం డయ్యె నతనికి హర్యశ్వుండు నాతనికిఁ గుంభుండు నమ్మహీపతికి సంహతాశ్వుండును బుట్టి రన్నరపతి యకృతాశ్వుండును గృతాశ్వుండు నన నిద్దఱం గాంచె నకృతాశ్వునకుఁ బ్రసేనజిత్తును బ్రసేనజిత్తునకు యువనాశ్వుండును యువనాశ్వునకు మాంధాతయు నుద్భవించిరి.

సీ. శశిబిందుఁ డనుజనేశ్వరుపదికోటులు కొడుకులను బెద్ద గుణనిధాన
మగుబిందుమతి భార్యయయ్యె నయ్యువనాశ్వసుతునక మ్మాంధాత శూరవర్యుఁ

ఉదయార్కనిభతేజుఁ డుదయాస్తశైలపర్యంతభూచక్ర మత్యంతమహిమ
నేలి తనూజుల నిరువురఁ బురుకుత్సు ముచికుందుఁ గనియెఁ బ్రమోదలీల
నందుఁ బురుకుత్సుఁ డింపుజ యైనతటిని, యాలుగాఁ గాంచెఁ ద్రసదశ్వనవిభుండు
పుత్రుసంభూతనాము సంభూతుఁ జేసెఁ, దత్తనూజుఁడు సరఁగెఁ ద్రిధన్వుఁ డనఁగ.

వ. ఆత్రిధన్వునకు సూర్యారుణుండు పుట్టి యుత్తరకోసలంబులు శాసించుచు సత్యవ్రతుం డనుసుతునిం గనిన నక్కుమారుండు కృతదారపరిగ్రహుండై యంత నిలువక.

తే. పరుఁడొకఁడు పెండ్లియైనయక్కాలఁ దాను, బలిమిఁ బాల్యమునను జెల్లుబడిని బుచ్చు
కొనినఁ దద్విఘ్న మొక్కఁగఁ దజ్జనకుఁ డలిగి, తిట్టి వెడలిపొమ్మనుడుఁ బార్థివసుతుండు.

క. ఎక్కడి కేఁగుదు ననినఁ, గుక్కలఁ జంపితినుజనులఁ గూడి తిరుగు నీ
దిక్కునఁ బుత్రుఁ డనుమమత, నెక్కొన దేమియును నాకు నిజము దురాత్మా.

చ. అనుటయుఁ దండ్రివాక్యమున కాతఁడు వెల్వడిపోయె బట్టణం
బనఘు పురోహితుం డయినయట్టి వసిష్ఠుఁడు నూరకుండెఁ బు
త్రుని నతఁ డాఁపవైచి నిజపుర్యతయంతయు నుజ్జగించి కా
ననమున కేఁగ భూమిపుఁ డనాథతఁ గుందె ధరిత్రి యంతయున్.

వ. ఆయధర్మంబువలనఁ దద్విషయంబునఁ బండ్రెండేండ్లు పర్జన్యుండు వర్షింపక నిలిచె నమ్మెయిం గలఁగు రాష్ట్రంబును బురంబును నంతఃపురంబును నాశ్వాసించి విశ్వసనీయం బగుప్రభుత్వంబు పెంపొనర వసిష్ఠుండు గరిష్ఠం బగునాజ్ఞాబలంబున రక్షించుచుండె నటమున్న.

సీ. తనకుటుంబంబు తద్దేశమునఁ బెట్టి వినుము విశ్వామిత్రమునివరుండు
సాగరోపాంతికస్థలిఁ దీవ్రతపమున వర్తిల్లునప్పు డవ్వనమునందుఁ
గూడులే కాతనిచేడియ ముప్పదికొడుకులలోపల నడిమివాని
మెడఁ ద్రాటఁ గ్రాసి యమ్మెద నూటిగోవుల కెవ్వరేఁ గొనుఁ డనునెడ నెఱింగి
కరుణ సత్యవ్రతుం డది గాను గూడ, దేను బ్రోచెద నిందఱినింత నిజము
వినుఁడు నా గళబంధంబు విడిచె నాని, కయ్యెఁ గాలవుఁ డనునామ మవితథముగ.

వ. ఆరాజపుత్రుండు విశ్వామిత్రునివాఁ డయ్యెడుకొఱకును గృపావశంబునను విప్రకుటుంబపోషణంబు పుణ్యం బనుబుద్ధివలనను నిరతంబును మృగమహిషవరాహాదివన్యసత్త్వంబుల నచ్చినవానిం జంపి తెచ్చి కౌశికకళత్రపుత్రసముదయంబున కొసంగుచు నదియ మహనీయం బగుయజనంబుగా సంకల్పించి ద్వాదశవార్షిక యగుమానసదీక్షవహింపి పితృవాక్యకరణంబును దప్పకుండ నడిపినవాఁడై వర్తిల్లె నవ్వర్తనంబున.

క. తనుఁ దొరఁగు తండ్రినుడుపఁడు, మునివరుఁ డని యలిగి దిత్తిమునఁ బ్రొద్దున్
బెనుపగు కోపంబు వసి, ష్ఠునిదిక్కునఁ గలిగినట్టిచో నొక్కలేన్.

వ. అక్కుమారుఁ డెక్కడం దిరిగి మాంసంబు గానక యొక్కెడఁ గామదోహిని యగు వసిష్ఠు హోమధేనువుం గని.

తే. ఆఁకటను సీరువట్టున నగ్గలంపు, డప్పిఁ బలుఁగును నొకచోటఁ బొప్పవిమిసి
దాంటిపగను నెట్టనఁ గిరాతుండుఁబోలెఁ, జంపి యగ్గోవు రిత్తమాంసములఁ గొనియె.

సత్యవ్రతుండను రాజు వసిష్ఠుని శాపంబున త్రిశంకుం ... ము.

వ. అదియెఱింగి వసిష్ఠుండు కసలి యోరీ నీవు తండ్రి చిత్తంబునకు రోషంబు గుఱు దోగ్ధ్రీవధంబును నప్రోక్షితమాంసభోగంబు ననుమూఁడు శంకువులు ప్రాప్తి యశంకువులు గావించితివి త్రిశంకుండ వైతి నిన్నిమిసెయనే త్రిశంకుం డమ్మనియె నిట్లు సత్యవ్రతుండు గురువాక్యంబునఁ ద్రిశంకుం డన నొప్పెను వినంబడియె నంత.

తే. కఱవు దీఱను నాలిని గన్నప్రజల, వెంటఁ గొని వచ్చి కౌశికుం డుదితమహిముఁ
డానరేంద్రనందనుచేత కాత్మ లోన, నగ్గలము మెచ్చి పరిమిత్తు నెమ్మగు మునిస.

క. తనకుఁ గ్రతుదీక్ష నుపడి, ప్పన మొనరింపు మని వేఁడె సత్యవ్రతుఁ డ
మ్మునిసింహుఁడు నొడఁబడి యతఁ, డనుమానప్రపంచయంబులు గూర్పన్.

వ. సర్వగీర్వాణవశిష్ఠులు వశిష్ఠుండును జూచుచుండ నతనిం బూజ్యరాజ్యాభిషేక పూర్వకంబుగా నఖర్వగర్వ తేజం బగు యాజనంబునం బూజనార్హుం జేసి శరీరంబుతో డనదివంబునకుం బుచ్చె నట్టి సత్యవ్రతుభార్య కేకయకన్య సత్యవ్రత యనునది హరిశ్చంద్రుని గనియె నమ్మనుజేంద్రచంద్రుండు.

మత్తకోకిల. తేజ మొప్పఁగ విస్ఫురద్భుజదీప్తి కీలికృపాణిచే
రాజవంశసమాజ మొల్లఁ బరాజయంబున ద్రొక్కఁగా
రాజసూయము సేసి సర్వధరాజనంబులఁ బ్రోచి సం
భ్రమాజనం బెనుపొందె నెందు విరాజితామలకీర్తులన్.

క. అతనికి లోహితుఁ డనియెడు, సుతుఁ డుద్భవ మయ్యె వృకుఁ డను సుతుఁ డాధరణీ
పతికి వృకసుతుఁడు బాహుఁడు, శ్రుతవంతుం డయ్యెఁ గామసుఖసక్తమెయిన్.

వ. రాజ్యానుసంధానం బేమఱి యుండ నయ్యవసరంబున హైహయులు శకయవనకాంభోజపారదోపప్లవులం గూర్చుకొని యతనిపై నడతెంచి రాజ్యంబు గొనుటయు

ఉ. బాహుబలంబు మోఘముగ భామిను లిద్దఱుఁ దోడరా వెన
న్బాహుఁడు పోయి ఘోరవిపినంబులు దూఱి యడంగి యుండి దుః
ఖావహచిత్తుఁడై యచటఁ బ్రాణవియోగము నొందె నంతఁ ద
ద్గేహిని సారగర్భవతి తీవ్రపుశోకము నైపఁజాలమిన్.

క. పతితోడ నగ్నిసొరను, వ్రత యగుటయుఁ జూచి యప్పు డనుకంపాకం
పితమతియై భార్గవకుల, పతి యౌర్వుఁడు సొప్పు మాన్చి బంధుఁడ పోలెన్.

వ. నిజాశ్రమంబున నిడుకొని రక్షింప నటఁ దల్లి సవతి సగరాపోషక చూలు చెడు టకై పెట్టిన చెడిపెంపుగరంబు లెనయుపెరంబునను యుండె నయ్యువిద ప్రసూత యయ్యె నవ్విధంబు లెనదివ్యభానంబున నెఱుంగుం గావున నమ్మునిదేవుం డట్లు జనియించిన కొడుకునకు గరళంబుతోడన గర్భంబున నునికం జేసి సగరుం డను నామం బొనరించి.

క. క్రమవర్ధితుఁ డగు బాలుని, సమస్తవేదముల వివిధశాస్త్రములఁ బరి
శ్రమశాలిఁ జేసి రిపువి, క్రమమర్దనదండమాగ్నికాంతం బొసఁగెన్.

శా. ఆదివ్యాస్త్రము పేర్మిఁ జేసి పటుబాహాశక్తి నుగ్రిస్తుఁడై
యామర్త్యోరుబలుండు క్రోధమతి యత్యంతంబు చేసెన్ హైహయో
చ్ఛేదక్రీడ యొనర్చి సంధి సమరం బెందాఁకఁ దన్మిత్రులం
జాడింపం దిందికిఁ గీడుచేసిన యనేకామిత్రధాత్రీశులన్.

వ. ఇవ్విధంబునఁ బగఱ నిర్మూలంబు గావింపం బ్రతిన చేసి కల్పాంతరుద్రుండుం బోలె భూత జాతంబు బారిసమయింపఁ గినిసిన నంత శకయవనకాంభోజపారదపహ్లవుల్ పైఁ ద్రాడిసేయ వారు దలరి యానగరుగుటం దగు వసిష్ఠమహామునిశరణంబు సొచ్చి యభయంబు వేఁడిన.

క. ధీరుఁ డాకలిరుతోడన, వారలఁ జేకొని కకుత్స్థవంశవరేణ్యున్
వారించిన నతఁడు నిజ, ప్రారంభము గుఱిని పంపుఁ బరికించి తగెన్.

వ. అవ్విరోధులం బరిభవించి విడుచుటయ చంపుట యగునని తలంచి శకుల శిరం బులు గొఱిగి ముఖరోమచయంబులు నిలిపి యవనకాంభోజుల మస్తకంబులు సర్వముండితంబులు చేసి పారదుల ముక్తకేశులం గావించి యుపప్లవుల సన వరతశ్మశ్రుధారులుగాఁ బనిచి తత్సంబంధు లగు కోలసర్పుల మహిషకుల దా ర్వులఁ జోళులం దాన్యశులుగా నాజ్ఞాపించె వీరెల్లం దొల్లి యుత్తమక్షత్రియు లారాజశ్రేష్ఠుండు వసిష్ఠవచనంబున నిట్లు తదీయ ధర్మధ్వంసం బొనర్చుట నది మొదలు వేదాధ్యయనయజనప్రముఖంబులకు బాహ్యులై మ్లేచ్ఛులం గలసిరి తదనంతరంబ.

సీ. ఆ పృథ్వీవరమున నాత్మభార్యలలోన నొకతెకుఁ దుంబీఫలోదరమున
నఱువదివేవు రుదాత్తతేజులును మఱియొక్కెత కాత్మజుం డొక్కరుండు
పంచజనుఁ డనంగఁ బరఁగి యన్వయకరుఁ డగువాఁడు కలుగుట నన్నరేంద్రుఁ
డఖిలదిక్కులు ప్రతాపాఢ్యుఁడై సాధించి తను ధర్మవిజయి యీతఁడ యనంగ

నతులకీర్తి నున్నతి గని యశ్వమేధ, దీక్షఁ గైకొని యశ్వంబుఁ ద్రిప్పి తేరఁ
బనిచె నందఱఁ గొడుకుల వినుము వారు, వీరులై యవ్విధంబు గావించుచుండ.

వ. ప్రాగ్దక్షిణజలధితీరంబున నత్తురంగంబు నింద్రుం డపహరించి రసాతలంబున నడంచుటయు.

తే. తండ్రిపనుపున నందఱు ధరణి యెల్లఁ, దిరిగి కానఁ ద్రవ్వి దిగిపోయి యుత్తరభూమి
నాదిపురుషు నవ్విష్ణుని యపరమూర్తిఁ, గనిరి సంవర్తమార్తాండకపిలుఁ గపిలు.

వ. తత్సమీపంబునన యధ్వరహయంబు గాంచి కలుషించి.

క. అవినీతులై యెఱుంగక, యవనీశ్వరసుతులు హాఱుఁ డశ్వహరుఁ డితఁ
డవుఁ జంపుఁడు ద్రుంగుఁ డనుచుఁ, గవిసి పొదివి రసురలట్ల కపిలున్మూర్తిన్.


సగరపుత్రులు కపిలు కోపాగ్నిచేత భస్మీభూతు లగుట.

వ. అట్టి యవజ్ఞత సైరింపక యమ్మునిభావుండు.

క. ఎఱమంటలు మియుచుఁ గాన్కల, ఁజూచుటయు నప్పుడే చోద్యంబుగ
నందఱు దగ్ధదేహులై రా, పఱి తఱుచుగ భస్మరాసులయిరి నరేంద్రా.

వ. ఇట్లు బర్హికేతు సుకేతుశూరపంచజను లనునలువురు దక్క నఖిలసుతసముదయంబు పొలిసిన నవ్విధం బెఱింగి సగరుండు సనుదెంచి యమ్మునిదేవుం దలంచినం బ్రీతుండై యతం డారాజునకుం గీర్తిస్వర్గంబు లక్షయంబులుగా నొసంగి సముద్రుం బుత్రుంగా నిచ్చె సరిత్పతియు సాగరుండై సగరునకుం బ్రణామంబు సేసి యశ్వమేధీయం బగు నశ్వంబు సమర్పించినం గైకొని వచ్చి క్రమంబున.

క. రాజన్యమౌళిమణి నీ, రాజనరాజితపదాబ్జరమ్యుం డగునా
రాజొనరించెను దివిజస, మాజ మలర నశ్వమేధయాగశతంబున్.

వ. అమ్మహాత్ముండు బాహుబలంబునఁ బాలించినపురంబులకొలఁది యఱువదివే లని విందు మట్టి సగరునకుం బుత్రుండై యసమంజసునకు నంశుమంతుండు పుట్టె నతనికి ఖట్వాంగుం డతనికి దిలీపుఁడుం బుట్టె నాదిలీపమహీపతికి భగీరథుండు జనియించి యేకరథంబునన వసుంధర యంతయు జయించి సార్వభౌమపదంబు నొందె.

చ. గిరిశజటాటవీనియతఖేలనలోలతరంగయై సురా
సురవరసేవనీయజలశోభితయై యసమానపావన
స్థిరమహిమాఢ్యయై పరఁగు దేవతరంగిణిఁ దెచ్చి యుర్విపైఁ
బరపి నిజప్రసూత యనుప్రస్తుతి నొందఁగఁ జేసె నెల్లెడన్.

తే. ఆభగీరథజనపతి యనఘుఁ గాంచె, శ్రుతుఁడు నాఁగఁ ద్రిలోకవిశ్రుతుని సుతుని
నతఁడు గనియె నాభాగుఁ బుణ్యైకభాగు, నంబరీషుండు నిర్దోషుఁ డతనిపట్టి.

సీ. ఆయంబరీషున కఖిలాన్వయప్రదీపుఁడు సింధుద్వీపుఁడు పుట్టె నధిప
యనపాయుఁ డగు నయుతాయువు తత్పుత్రుఁ డారాజు నలసఖుఁ డృతుపర్ణుఁ డయ

విధ్యావిదునిఁ గాంచె వినయస్ఫూర్ణుని ఋతుపర్ణునిఁ గల్మాషపాదు నతఁడు
గనియె నాతఁడు సర్వకర్మునిఁ బుట్టించె నస్వరణ్యభూపతి యతనిసుతుఁడు
తత్తనూజుఁడు నిఘ్నుఁ డాతనికి సూను, లిద్ద అనమిత్రరఘువు లుదీర్ణతేజ
లందుఁ బెద్దవాఁ డడవికి నరిగెఁ దపము, సేయ రెండవవాఁడు శాసించె నుర్వి.

క. భూమిఁ సమున్నతుఁ డగునా, భూమీశుఁడు గాంచెఁ బుత్రుఁ బుణ్యచరిత్రుం
రామప్రపితామహును, ద్దామబలు దిలీపుఁ గ్రతుశతప్రవిధాయిన్.

క. విఘటితరిపుదర్పోదయుఁ, డఘవిరహితుఁ డాదిలీపుఁ డాత్మజుఁ బడసెన్
రఘు ననఘునిభువనవన, ప్రఘనోజ్జ్వలరత్నదీపభాస్వరతేజున్.

మ. అజుఁ డారాజతనూజుఁ డూర్జితవివేకాలోకవిస్ఫూర్తియం
దజుఁ డాభూపతికిం దనూభవుఁడు నిత్యౌదార్యసత్యక్షమా
భజనోద్యన్నతిపక్షపక్షరథభూపాలుండు భూపాలక
వ్రజగోపాలకకేళితత్పరభుజవ్యాపారధన్యుం డనన్.

చ. అతనికి నగ్రనందనుఁడు హరిపితృప్రియకారి దారుణ
వ్రతవహనైకసంపదభిరాముఁడు రాముఁడు భూమికన్యకా
స్మితయుతవీక్షణప్రసరసిద్ధమనోరథుఁ డిద్ధచాపుఁడు
ద్ధతదశకంధరోన్మథనదర్పధురంధరుఁ డవ్వసుంధరన్.

క. ఆరామున కనుపమధ, ర్మారాముఁడు కుశుఁడు పుట్టె నతిథి యనుమహా
వీరుఁడు జనించెఁ గుశునకు, నారాజోత్తముఁడు నిషధుఁ డనుసుతుఁ గాంచెన్.

వ. ఆనిషధునకు నలుండు జన్మించె వినుము రఘుకులజాతుండైన యన్నలుండును
వీరసేనసంభవుం డగునలుండునుంగా నుర్వీశ్వరులలోనం బ్రసిద్ధులిద్దఱునలులింతి
య యుట్టినలునకు నభుండునునభునకుఁ బుండరీకుండును బుండరీకునకు క్షేమధ
న్వుండును క్షేమధన్వునకు దేవానీకుండును దేవానీకునకు నహీనగుండును న
హీనగునకు సుధన్వుండును బ్రభవించి రిది వైవస్వతమనుప్రసూతి యైన యి
క్ష్వాకువంశంబు.

చ. త్రిభువనదీపమై వెలుఁగుదేవుఁడు భానునియన్వయంబు భ
క్తిభరితబుద్ధియై వినినఁ గీర్తనసేసినఁ బాయుఁ దీవ్రపా
పభయము లిష్టసంపదయు భవ్యయశంబును జెందు నెందుదు
ర్లభ యనఁ గల్గు దివ్యపదలక్ష్మియుఁ జేకుఱు మర్త్యకోటికిన్.

వ. అనిన విని జనమేజయుండు మునీంద్రా సూర్యదేవుండు పితృగణంబులకుఁ బ్ర
భుం డని వింటిమి పితృగణంబు లనువా రెవ్వరు తత్సమారాధనంబున నయ్యె
డుఫలం బెట్టిది యెఱింగింప వలయు నని యడిగినఁ బితృకల్పంబు మార్కండే
యుండు సనత్కుమారువలన విని పిదప భీష్ముం డడుగ వివరించె నాగాంగేయుం

వ. ఇది సంక్షేపరూపంబునం జెప్పితి వీఁడె మార్కండేయుండు నీచేత నేఁడు నిమం
త్రితుండై యస్మదనుగ్రహంబు వడసి యున్నవాఁ డిమ్మునీంద్రుండు నిఖిలార్థ
వేది యితని నడుగుము తాను బితృభక్తుండు పైతృకవిధివిశేషంబులు వివరిం
చు నని యానతిచ్చి యంతర్హితుం డయ్యె నంత నేను వినయంబునం బూర్వప్ర
శంసనం బొనర్చిన నప్పరమతపస్వి యిట్లనియె.

సీ. విను పితృపూజనం బొనరించి తత్ప్రసాదమునన యేను మోదంబు నెరయ
దీర్ఘాయువును యశోదీప్తతయును గాంచి పరఁగుదు నిట్లుండి బహుసహస్ర
యుగకాల మేగుటయును మేరుతటమునఁ బ్రకటితనిష్ఠఁ దపంబు సేయ
నొకనాఁడు భానుబింబోజ్జ్వలం బగువిమానము నాకుఁ జేరువ నభమునందుఁ
దోఁచు నంగుష్ఠమాత్రగాత్రుని నుదగ్ర, తేజు నగ్నియం దగ్ని ప్రదీప్యమాన
మగు తెఱంగున నొప్పారి యందు వెలుఁగు, పురుషు నొకరునిఁ గంటి నద్భుత మెలర్ప.

మ. కని యత్యర్థపుసంభ్రమం బెలయ రాఁగా భక్తిఁ బ్రత్యుద్గమం
బున్ బాద్యగ్రహణంబుఁ జేసి యెలమిన్ బూజించి ప్రీతుండనై
నిను. నాస్యం బగుదైన్యతంబుగ మదిన్ దేవా వితర్కించెద
న్నను ధన్యాత్మునిఁ జేయునే కృప భవన్మాహాత్మ్యమున్ దెల్పుటన్.

వ. అనవుడు నప్పురుషుండు నామీఁద ననుగ్రహంబుతోడి పరిగ్రహదృష్టి దీపింప
నాస్నిగ్ధస్వరం బగువాక్యంబున నిట్లనియె.

చ. వనజభవాగ్రసభ్యమానసభవప్రకరంబున కెల్లఁ బెద్ద నే
ననఘ సనత్కుమారుఁ డని యాగమకోటియు నన్ను సంప్రకీ
ర్తన మొనరించుఁ బుట్టువు మొదల్దగ నిట్ల కుమారతాదశం
దనరుటఁ గీర్తితంబు నభిధానము నాకు జగత్త్రయంబునన్.

వ. మఱి మరీచ్యాదు లగుమదీయభ్రాత లేడ్వురు తపోవిద్యాజ్ఞానంబులందు నన్ను
మన్నింతు రవ్వారు ప్రజావంతులై నిజవంశంబు లెందును బ్రతిష్ఠించి లోకధా
రణంబు సేయుచు సర్వసమర్చితులై వర్తిల్లుదు రేము యతిధర్మపరాయణు
లము నారాయణధ్యానతత్పరం బగుభావంబున నస్మద్భావనాపరులకుఁ బ్రజాధ
ర్మంబులు వర్ధిల్లం జేయుచు విహరింతుము నీవు భృగువంశపావనుండవు నాద
ర్శనంబు గోరి తపంబు సేయుటవలనం బ్రసన్నుండ నైతి నెయ్యది యభీష్టం బది
వేఁడు మనిన నేను బితృగణంబుల ప్రథమసృష్టియుఁ దత్పూజాఫలంబులు నీయ
డిగినయట్ల యడిగిన నమ్మహాయోగీశ్వరుండు నా కిట్లనియె.

**సనత్కుమారుఁడు మార్కండేయునకుం జెప్పిన పితృదేవతాప్రభావము.**

సీ. అబ్జాసనుఁడు తన్ను నర్థితోఁ గుఱిచి యజించుట గోరి సృజించె సురల
నాతని విడిచి వా రాత్మఫలార్థులై యన్యముఖంబుల యజనవిధులు

నపహంగఁ గోపించి నలువ. తత్త్వజ్ఞాన మెడలునట్లుగ శపయించుటయును భ్రష్టవిజ్ఞానులై పాడటి రందఱుఁ బ్రదికులచేయనఁ బ్రదిభావనములు మోహావార్థిలోన మునిఁగిన నార్తులై, వారి లాసిమ స్తవదిసు లెంఱు సొచ్చి రతఁడు కరుణ యచ్చుగ నర్వలో, కాహితైకబుద్ధి నానతిచ్చె.

క. మీా రక్కటి కష్టవ్యాధి, చారము చేసితిరి దీని సైఁచితి నింకన్
బోరనఁ బ్రాయశ్చిత్త, ప్రారంభుల రగుఁడు బోధపడెనాతి దయనెన్.

వ. ప్రాయశ్చిత్తవిధియును మీాతనయుల నడిగి తెలిసికొని తాను క్షమార్గంబున నడుపుం డనిన నిర్జరులు నిజతనూజులపాలికిం జని ప్రపశోధం బభ్యర్థించిన వారు వాఙ్మనఃకర్మంబు లగుమస్కృతులను గర్తవ్యంబు లగుమంగళపరిణాంబులు దెలుపం దెలుపఁ గర్మకాండతత్త్వంబు విశదం బగుటయు లబ్ధసంజ్ఞులై తద నంతరంబ.

ఆ. పుత్రులార యింకఁ బొందు విజ్ఞానుల, రైతి రనుచుఁ దమ్ము నాత్మసుతులు పలుకుటయు నిలింపు లలఘుసంతాపంబు, గదురఁ జని బ్రహ్మకడకు మగుడ.

వ. చని తద్వాక్యంబులు విన్నవించిన విని విరించి నవ్వుచు నద యట్లగా వారలు ప్రజ్ఞాప్రదాతలు గావునఁ దంద్రులై మిమ్ముఁ బుత్రులని పలికిరి శిరికర్తల గుటంజేసి మీాయందును బితృత్వంబు సిద్ధంబ యిట్లనన్యసంభావితులై మీా రిరుదెఱంగులవారును దేవతలును బితరులు నై త్రైలోక్యసంభావితులు సొరఁ డని నం గ్రమ్మఱ వచ్చి సురలు సురజ్యేష్ఠువలన సంశయచ్ఛేదం బై సవిధంబు కొ డుకులకుం జెప్పి.

క. పితృభావము మీా కిట్లు, ప్రతిహతమై చెల్లె నింకఁ బ్రఖ్యాతులరై
సతతంబును సకలసమ, ర్చితుల రగుఁడు మముఁ బురస్కరించి ముదమునన్.

వ. పితృసమారాధనతత్పరు లగువారికిఁ బుత్రపౌత్రధనధాన్యాదు లగునైహికవిభ వంబులు నక్షయంబు లగు నాముష్మికసుఖంబులును సిద్ధించు నస్మదాప్యాయ నంబు సోమునకు నాప్యాయనం బగు నతండు సచరాచరం బగులోకంబున కాప్యా యనం బొనర్చు నని పలికి రని పితృగణంబునకుం గలిగినయాదిసర్గంబును దత్పూ జాఫలంబును జెప్పిన విని మార్కండేయుండు మహాత్మా పితరు లెన్నిగణంబులై వర్తిల్లుదు రేలోకంబున నుండుదు రానతీవే యనిన సనత్కుమారుం డిట్లనియె.

తే. ఏడుగణములై వెలుఁగుదు రెలమిఁ బితరు
లమరలోకంబునందు సంయమివరేణ్య
యందులో నమూర్తులు నాలు గరయ మూర్తి
విరహితంబులు మూఁ డమ్యో విను గణములు.

సీ. ఘనుఁడగు విరాజునాఁ జనుప్రజాపతి తనూభవులు వైరాజు లనఁ బరమసంజ్ఞఁ
బరఁగెడుపితరులు భవ్యు లమూర్తులు మూఁడుగణంబులు మోదమాను
లగుచు సనాతనం బగులోకమునఁ జరింతురు వారిమానసోద్భూత యొక్క
కన్నియ మేనాఖ్య గలిగి హిమవన్నగేంద్రునిభార్యయై యిష్టలీల
సుతులు మైనాకుఁ డనఁగఁ గ్రౌంచుం డనంగఁ, బడసె నిద్దఱ మఱియు నపర్ణ యేక
పర్ణ యేకపాటల యనుపడఁతుకలను, గనియె నమ్మువ్వురును దపంబునకుఁ దొడఁగి.

వ. స్థాపనంబగుమాహాత్మ్యకం బగుజగంబంతటికి భరం బగువ్రతభారంబుఁ బూని రం
డవయపర్ణ యొక్కపర్ణంబును నేకపాటల యొక్కపాటలపుష్పంబును నాహారం
బుగాఁ గొనుచు నదియు నొక్కసహస్రవర్షంబు నిండిన నొక్కమాఁటు నియతం
బుగాఁ జేసి పదివేలసంవత్సరంబులు గడప నపర్ణ యెయ్యదియు నొల్లక నిరా
హారయై యుండె నవ్విధంబునకుఁ దల్లి సస్నేహదుఃఖాకులయై యుమా యని
నివారించె నది కారణంబుగా నుమాభిధానం బాయమ
కుఁ ద్రైలోక్యవిదితం బయ్యె నివ్విధంబునఁ దపస్సిద్ధి వడసి కన్యారత్నంబులు.

చ. అనుపమనిత్యయౌవనము లస్ఖలితయోగబలోదయంబు శా
శ్వతమగు బ్రహ్మచర్యము నవంధ్యములై తముఁ బొంద సజ్జన
ప్రతతులు లోకపూజ్య లని ప్రస్తుతి చేయఁగఁ దత్త్వబోధవి
భ్రమితభవబంధనం బగుయశోవిభవంబునఁ బేర్చి రందఱున్.

తే. వారిలోనఁ బెద్దాయమ భూరిపుణ్య, య య్యుమాదేవి సర్వలోకైకజనకు
సమ్మహాదేవుఁ బొంది యర్ధాంగభాగ, యై యనన్యమాహాత్మ్యధన్యత వహించె.

వ. అప్పరమేశ్వరికిఁ గృత్రిమపుత్త్రుం డైనశుక్రుండు యోగాశ్రయుండై పరఁగె
[illegible] యాయమ యేకపర్ణ యసితునకు భార్యయై దేవలుం గనియెఁ దృతీయ
యైన యేకపాటల జైగీషవ్యుం డనుభవ్యమునిం బొంది శంఖలిఖితులం గాంచె
శుక్రప్రముఖు లయినవీరందఱు యోగవిద్యాప్రవర్తకులు మఱియును.

సీ. అనఘు లగ్నిష్వాత్తు లనఁగ మరీచిపుత్త్రులు దేవగణసేవితులు పితరులు
సోమపదాఖ్యవిశ్రుతలోకనిత్యవాసులు వారిమానససూతి యైన
కన్య యచ్ఛోదనాఁ గలిగి యచ్ఛోదసరస్సుఁ బుట్టించె నారమణియొక్క
తఱి నాత్మజనకుఁ డంతర్ధానముం బొంది యుండంగఁ గానక యుదితతేజుఁ
డద్రికాభిధాన యగునప్సరయుఁ దాను, వరవిమానమున దివంబునందుఁ
గరము వెలుఁగునుపరిచరు నింద్రతుల్యునిఁ, గాంచి వాంఛితంబు గడలుకొనఁగ.

క. పతనికిం గూఁతు రగుట, యేతపముఫలంబో యనుచు నిచ్చఁ దలఁచి తా
నాతప్పున యోగచ్యుత, యై తూలి యధోముఖత్వ మంది యడలఁగన్.

తే. భానుబింబంబుతో నుపమాన మగుచు, మానమునఁ ద్రసరేణుప్రమాణదేహు
లై వెలుంగుచుఁ దోఁచి రాయమపితరులు, కావరే యని పలికె నక్కన్యకయును.

క. వా రోడకు మని దానిని, ధారుణిపైఁ బడకయుండఁ దిగి నిల్పుటయుం
గోరి యది ప్రస్తుతించినఁ, గారుణ్య మెలర్ప నయ్యఖండితతేజుల్.

వ. అవశ్యభావి యైనయర్థంబు తమయోగదృష్టిం జూచి యక్కన్నియతో సమ్మా నీకొక్కటి సెప్పెదము దేవదానవమానవలోకంబులం దెవ్వారికిం జేసినకర్మం బనుభవింపక పోలియను నీవు వసుప్రం సంప్రదింపఁ గోరితివి గాన నతనికూఁతురవై యష్టావింశతితమం బగుద్వాపరయుగంబున నీయద్రిక మత్స్య రూపధారిణివై యున్నఁ దదీయోదరంబున జన్మింపం గలదాన వప్పుడు.

మ. మునివంశ్యుండు వసిష్ఠపౌత్రుఁడు వినిర్ముక్తప్రభావాభిన
ర్థనధర్ముండు పరాశరుండు నినుఁ బుత్రశ్రీసముద్దీప్తఁగా
నొనరించుం బ్రభవదాత్మజుండును మహాయోగాత్ముఁడై కాకృతిం
జను వేదంబు చతుర్విభాగములుగా శాసించు నీనందనుల్.

వ. మఱియు మహాభిషుం డనురాజు శంతనుండై యి పుట్టి నతనికిం బత్నివై చిత్రాంగదవిచిత్రవీర్యు లనుపుత్రులం గనియెదవు నీకన్యాత్వం బెట్టియును వైకల్యంబు నొందక యుండు నట్టిశుద్ధితోడన క్రమ్మఱ నిష్టలోకయోగస్థితిం బొందంగలదాన వని యనుగ్రహించిన నక్కన్యకయు నట్టిదయయ్యె నిట్లు సెప్పంబడిన యేడు తెఱంగులపితృగణంబులు సమస్తులకుఁ బూజనీయులు వెండియు.

పితృగణంబులలో మూర్తిసహితులమూర్తిరహితుల నెఱింగించుట

సీ. వినుము దివంబున విభ్రాజములు నాఁగ వెలుఁగులోకంబులు గలుగు నందు
బర్హిషదాఖ్యులై పరఁగినపితరులు సుతులు పులస్త్యుని కతులతేజ
మూర్తులు గణములు మూఁడయి వసియించె యక్షగంధర్వరక్షోహిమాగ
పతులచేఁ బూజలు సతతంబుఁ గాంతురు వారిమానసమైనవనితనాఁగ
యలఘుయోగాఢ్య పీవరి యనఁగ నొప్పు, నింక నప్పరాశరసుతుఁ డిష్టతేజుఁ
డరణిఁ గనియెడుపుత్రుఁడు దత్తయోగ, ధనుని శుకుని భర్తగఁ బ్రమోదమునఁ జెందు.

వ. అమ్మహాభాగుం డయ్యోగినియందుఁ గృష్ణుండు గౌరుండు ప్రభుండు శంభుండు భూతుండు జయుండు భూరియు నన నేడ్వురుకొడుకులను కీర్తిమతి యనుకన్య కను గనంగలవాఁ డాకన్నియ యణుహుం డనురాజునకుం బత్నియై యోగసిద్ధుం డగుబ్రహ్మదత్తుం గనియెడు నిట్లు క్రమంబునఁ గీర్తింపఁబడినవై రాజులు నగ్నిష్వాత్తులు బర్హిషదులు ననుమూఁడుతెఱఁగులపితరులు మూర్తిరహితులింక మూర్తిసహితులైనవారిం జెప్పెద.

క. జ్యోతిర్భాసము లనఁ(బ, ఖ్యాతంబులు సురపదములు గల వందుఁ గడుం
(బ్రీతి వసింతురు పితరులు, (శీతోదం బూరు లన వశిష్ఠతనూజుల్.

తే. వారు పూజనీయులు విప్రవర్ణములకు, వారిమానసయగుకన్య వారిజాక్షి
గోసమాహ్వాయ శుక్రునికూర్మిపత్ని, యై వెలింగించె భార్గవాన్వయము నెల్ల.

క. తనరును మరీచిగర్భము, లనులోకము లధికశుభము లంగిరసునినం
దను లగుపితరుల్ భాస్వరు, లనువారు వసింతు రచట నతులవిభూతిన్.

క. భూవరులు వారి నెప్పుడు, భావింతురు తన్మనఃప్రభవ యైనయశో
దావినుతాహ్వాయ గన్నియ, యావిశ్వ మహత్తుపత్నియై కడుఁ బేర్మిన్,

వ. దిలీపాభిధానుం డయినవమానవపతిం గనియె నతనితురంగమేధంబునం దృప్తు లై నభూదేవత లితండు లోకపావనుం డీయజమానుం జూచినవారికి నిమ్మహాత్ము తోడ నవభృథస్నాతు లైనవారికి నక్షయస్వర్గం బగు ననువాక్యంబు లుగ్గడింతురు,

సీ. పులహనందనుఁ డగుభూరిపుణ్యుఁడు కర్దమప్రజాపతికి నాత్మజులు వసువు
లనుపేరిపితరు లుదాత్తతేజులు కామపము లనఁబరఁగులోకములయందు
వెలుఁగొందుచుందు రావైశ్యకులమున కర్చనీయులు వారి మనసుననుద్భవించి
కన్నియ నహుషునిగాదిలిదేవియై వైధాత్రి యనునది నసుమతీశు
నయ్యయాతిఁ గాంచె ననఘు హిరణ్యగ, ర్భాత్మజాతుఁ డైనయవ్వసిష్ఠు
సుతులు పేరు కలరు సుకలాఖ్యపితరులు, వారు శూద్రవర్ణ వంద్యు లెందు.

క. మానసము లనంబరఁగిన, మానితలోకములు వారిమహితపదంబుల్
మానససుత వారికి రే, వానది పురుకుత్సధరణివరుభార్య మహిన్.

వ. పితృగణంబులరూపంబులు లోకంబులు వినియోగంబులు వేర్వేఱ వివరించితిఁ బితృసమారాధనంబు సర్వయుగ సాధారణంబు.

క. పితృవిధియొక్కఁడు విను దై, వతకార్యముకంటె దివిజవరదానవసి
ద్ధతపస్వితతికిఁ బూజ్యులు, పితరు లనుచుఁ జెప్ప (శుతు లభిన్నప్రతిభన్.

మ. సుతసౌభాగ్యజయాయురర్థసుఖతాశుద్ధిక్షమావైభవ
స్మృతివిద్యావినయాదిసర్వశుభముల్ జెందించు వైరాగ్యసం
యుతవిజ్ఞానము మృత్యుమోచనమహాయోగంబుఁ గైవల్యక
ల్యతయుం జేయుఁ బితృప్రమోదనఫలం బల్పంబె యూహింపఁగన్.

## పితృదేవతా సమారాధన ఫలవిశేష ప్రభావము.

సీ. స్వర్గకాములు పితృవర్గంబు గొనియాడి యిహలోకసుఖలీల లెల్లఁ గాంచి
మౌక్తికమాణిక్యమరకతమయములై యమరుకాంచనవిమానములు వచ్చి
హంససారమయూరాభియుక్తంబులై తముఁ గొనిపోవ గంధర్వగీతు

లప్సరోలాస్యంబు లనిమిషసిద్ధచారణకీర్తనంబులు రమ్యములుగఁ
జని యనేకమనోరథసంప్రణీత, వివిధవిషయానుభవములఁ దవిలి పెక్కు
యుగసహస్రములిట్లు విహరింతురూర్ధ్వలోక, పదములెన్నియన్నింట నొప్పి మెలర్ప.

తే. గ్రహణతిథు లమావాస్యసంక్రమము లధిక
ముఖ్యకాలముల్ పితృకార్యములకు ననఘ
యపరపక్షంబు మేలు మూఁడష్టకలును
నాగ్రహాయణసమయంబు లగ్రిమములు.

క. అనురూపదినముల గృహ, స్థునిగృహమును గుఱించి వాంఛతోఁ బితృగణముల్
చనుదెంచు నివాసస్థల, మునకుం జనుదెంచు గోసమూహములక్రియన్.

తే. అష్టకలఁ బితృకోటియభ్యర్చనంబు, గాన కరిగిన నుభయలోకములు తప్పు
నరున కవ్విధియం దొంకునాస్తికత్వ, మొప్ప దనుపమశ్రద్ధ యత్యుత్తమంబు.

సీ. పాడ్యమిఁ బితృపూజ భావింపఁ గాంచనాగమము భానురసశౌత్యమువిదియఁ
దదియశాత్రవగణాధ్వంసంబు చవుతిఁ బరిచ్ఛిద్రదర్శనప్రాప్తి ప్రకట
లక్ష్మి పంచమిఁ గీర్తిలాభంబు షష్ఠి సప్తమి మహీసర్వప్రధానశక్తి
యష్టమి నవమి సుత్కృష్టతయును బ్రభుత్వము బ్రహ్మవర్చసవాప్తి దశమి
వేదసమ్మతైశ్వర్యంబు వినుతవేద, వాదితయును నేకాదశి వసుమతీశ
పదముజయమునుద్వాదశిఁ బ్రజలపెంపు, పుష్టతయును త్రయోదశిఁ బొందుజనుల.

క. తరుణవయస్సున సమసిన, పురుషులకును శస్త్రనిహతిఁ బొరసి తెగినయ
న్నరులకుఁ గర్తవ్యము పితృ, పరిచరణము భూతతిథిఁ దపస్వివరేణ్యా.

క. అమవసఁ బితృనియతి ప్రయ, త్నమున నొసర్పంగ వలయుఁ దత్క్రియ సోమున్
బ్రముదితునిఁ జేయు సోమ, ప్రమదంబునఁ బ్రీతినొందుఁ ద్రైలోక్యంబున్.

వ. శశిబిందుఁ డడుగఁ బితృపతి పితృవిధానంబునందు నక్షత్రఫలంబెఱింగించె న
త్ప్రకారంబు వినుము.

సీ. కృత్తికఁ బైతృకక్రియఁ జేసి విపులతేజంబు రోహిణిఁ బ్రజాసంప్రవృద్ధి
యోజస్సు మృగశిర నుగ్రక్రియాశుద్ధి యార్ద్రఁ బుత్రప్రీతి యదితితారఁ
బుష్టి పుష్యంబున భుజగతారను బ్రభ సుతలబ్ధి పితృతార నతులబంధు
గణవరిష్ఠత పుబ్బఁ గమనీయసౌభాగ్య ముత్తరఁ బ్రచురదానోత్సవంబు
హస్తమున సంపదలు చిత్ర నధికరూప, వంత మగునపత్యము వణిగ్వైభవంబు
పవనతార విశాఖ సత్పాత్రయుక్తి, మైత్రమ్మునఁ జక్రవర్తిత్వ మహిమనొందు.

క. శతమఖతార జనాఢ్ది, శత యారోగ్యంబు విను నిశాచరతారన్
శ్రుతకీర్తి సలిలతారను, గతశోకత విశ్వతారఁ గలుగుజనులకున్.

తే. అభిజిదాదికంబు లగుమూఁట నాగమూ, ర్త్యతియు సద్గతియును నర్థచయముఁ
జెందు వెండి రెంటఁ జేరుఁ బు సొషధ, సిద్ధియును సమృద్ధజీవనంబు
క. గోక్షులపేర్మియు రౌప్యధ, నావాప్తియు హయవిభవము నాయువు పెనుపున్
గావించు సహిర్బుధ్న్యుఁడు, దైవత మగుతార దొడఁగి తక్కినవాల్గున్.
తే. రజతదానంబు రజతపాత్రంబు రజత, కథయుఁ బితరుల కానందకరము తొల్లి
యంచితాస్పదరజత మైనపాత్రఁ, బితరు లీమహీదేవిని బితికికొనుట.
క. రజతంబుభంగిన మహా, రజతంబును బితృహితమ్ము రమ్యతిలలు మే
షజకంబళము కుహూర్తా, త్మజుఁడుఁ గుతపమును బితృప్రమదకారణముల్.
క. ఆజ్యంబు నశ్రుపాయంబులు, యోజ్యంబులు ముద్గమాషయుక్తము మాంస
ప్రాజ్యమునై పితృగణముల, యిజ్యాతంత్రంబు నడచు టిచ్చుశుభంబుల్.
క. విను కృష్ణమృగాజినము, చ్చినఁ జూపిన సన్నిహితము సేసినఁ బితృమో
దమ మగుఁ ద్రిదండియగుయతి, యనుయోగియుఁ బాత్రములుతమ త్తమభ్రాజన్.
సీ. ఫులప పితృసమారాధనం బాచరించు, నపుడు తక్కి-యి నాదిమధ్యాంతవేళ
లనుసేసీఁయతితోడ దేవతాభ్యఃపితృభ్య,యనుమహాసూక్తిజపియించుటధికశుభము.
వెలుఁగుచుండ దానసమయం, బునయందును భక్తిపూర్వముగ దీనిఁ బఠిం
కరిసి సయ్యన్నం బమృతము, నెనయుఁ దురగమేధఫలము నిచ్చుఁ గృతాత్మా.
క. రాక్షసులు తొలఁగుదురు ప్ర, త్యక్షత నొందుదురు పితరు లప్పుడు సుకృతం
బక్షయ మగు నీసూక్తి య, ఘక్షయకారిణిగఁ జదువుకళ్యాణులకున్.
సీ. మూర్తివియుక్తులు మూర్తిమంతులు పరిజ్ఞానులు యోగవీక్షణులు నైన
ప్రభు లింద్రముఖ్యనిర్జరులకు దక్షకశ్యపులాదియైనప్రజాపతులకు
సప్తమహామునీశ్వరులకు మన్వాదులకును సరిత్పతులకును శేష
నక్షత్రతారాగ్రహార్క్షోణిగగనంబులకుఁ దంద్రుడు లిందుపావకమయాత్ము
లఖిలలోకైకదాతలు నఖిలవంద్యు, లామ్య లధ్వరంబులును బ్రహ్మంబుఁ దార
యనఁగఁ బరఁగి సప్తవిధంబు లగుగణముల, నమరుపితరులఁ బ్రాంజలినై భజింతు.
తే. పదుదీవులయం దర్చ్యమీ స్తవంబు, పరఁగు సప్తర్చ మనుపేరఁ బరమపుణ్యా
మబ్జభవుఁడు చెప్పినయది యధికసిద్ధి, కరము పితృగణసమ్మోదకారణంబు.
వ. నీవు పితృభక్తుండవు కావున నుపదేశించితి విశేషించి నాయందు సభక్తితాత్ప
ర్యం బగుచిత్తంబుతో నర్తిల్లుదు నీకుం బరమజ్ఞానసమేతం బగుదివ్యచక్షువు
ప్రసాదించెద దానంజేసి యోగసిద్ధుండవై సిద్ధమూర్తు లగుపితరులం బ్రత్యక్షం
బుగాఁ గనియెద వని చెప్పి సనత్కుమారుండు మఱియు నిట్లనియె.
సీ. పూర్వయుగంబునఁ బుణ్యశీలుఁడు భరద్వాజమునీంద్రునితనయు లేడ్వు
రుత్తమయోగధర్మోపేతులై యుండి దుశ్చరిత్రము కొంత దొడరుటయును

భీష్ముఁడు ధర్మరాజునకుఁ గౌశికపుత్రుల చరిత్రంబుచెప్పినప్రకారము.

క. అతినిందితజన్మము లే, గతిఁ బొందిరి కౌశికప్రభవులు స
ద్గతి నెమ్మెయిఁ గలిగెఁబిదప, నతులయశా దీనిఁ దెలుపు మంతయు వరుసన్.

వ. అనిన భీష్ముం డిట్లనుఁ బూరువంశంబునం బురమిత్రుం డనురాజు గలిగె నతనికి బృహద్రథుండును నాతనికి బృహద్ధన్వుండును నన్నరనాథునకు సత్యకర్ముండును సత్యజిత్తునుం బుట్టిరి.

తే. విశ్వజిత్తనఁగాఁ బుట్టె వినుము సత్య, జిత్తునకుఁ దత్తనూజుండు సేనజిత్తు
వాసికాత్మజుల్ నలువు రవార్యబలులు, పుట్టి రందులో రుచిరుండు భూరిబలుఁడు.

క. పాంచాలేశ్వరుండై తేజరిల్లి పృథుసేనుం డనురాజుం గనియెఁ బృథుసేనునకుఁ
బ్రాగుండు పుట్టెఁ బారునకు నిశాభిధానుం డుద్భవించె.

క. విను శతముఁగాంచె నాతం, డతిరథులై నిపుణు లనుసమాఖ్య వడసి రం
దుఁ జ్యేష్ఠుఁడు సమరుం డను, నతఁ డభిమతిసమరుఁ డెంచు నభినుతి నెంతయున్.

సీ. సమరునకుఁ బృథుండును బృథునకు విభ్రాజుండును జనియించిరి విభ్రాజునకణుహుండు పుట్టె నతనికి శుకదుహిత యైనకీర్తిమతి బ్రహ్మదత్తుం గనియె నయ్యణుహుండు మత్పితామహుం డగుప్రతీపభూపాలునాఁటివాఁడు తత్సుతుం డగు బ్రహ్మదత్తునకు విష్వక్సేనుండును నతనికి దండసేనుండును జనియించిరి దండసేనుఁడు కాంపిల్యంబునకు రాజై తక్కినన్నృపుల నందఱం బరిపాలించుచుండు ద్రుపదపితామహుండును బృషతజనకుండును నగుదండసేనునిపై నజామీఢ వంశోద్భవుం డగునుగ్రాయుధుండు వచ్చి వరదానలబ్ధం బగుచక్రంబుకలిమి నతి దుర్జయుండు గావున.

క. సమరంబు చేసి యతనిని, సమయించి తదీయవంశజాతుల నెల్లన్
గ్రమమునఁ బెక్కండ్రఁ దునిమె, సమదభుజాటోపచటులసంభరితమతిన్.

వ. ఇవ్విధంబున దండసేనుం దొట్టి నృపాలాన్వయులం బెక్కండ్ర మడియించి.

భీష్ముఁడు ఉగ్రాయుధుండను రాజుం జంపినప్రకారము

ఉ. ఎంతయు మాఱు లేక ధరణీశులఁ బల్వుర నాజి వెండియున్
గ్రుందఁగఁ జేసి కైకొనక నన్ను జయించు తలంపుతోడ నా
మందవిచారుఁ డుద్యమసమగ్రతమైఁ జనుదెంచెఁ గుంజర
స్యందనఘోటకప్రకటసైన్యసమూహవిజృంభణంబునన్.

వ. ఆసమయంబున నేను శంతనుండు లోకాంతరగతుం డైన నతనికిం బితృమేధంబు నడపుచు ధరణీశయనప్రముఖవ్రతంబు లవలంబించి యుండ నమాత్యులు సేనాపతులు నుత్సాహులై శోకింప నద్దురాత్ముండు దూతం బుత్తెంచిన వాఁడు తద్వాక్యంబులుగా నాయెదుర నిట్లనియె.

క. నీమాటువల్లఁ ద్రిభువన, భామారత్నంబు గంధవతిపై నాకున్
గామంబు గలదు భీష్ముఁడ, యేమియు నన లేదు వేగ నిమ్మా వెలఁదిన్.

ఆ. ఇట్లు సేసితేని నిలయును రాజ్యంబు, ధనము నిపుడు నీకుఁ దక్కు నేఁడు
దుర్విమోహపరత గర్వంబు సూపిన, బ్రతుకు టరిది యొండు పలుకు లేల.

క. నాచక్రము పేరు వినిన, రాచకొడుకు లెల్లఁ దమకు రాచటికంబుల్
వే చెడిపోవఁగఁ బాఱుదు, రేచినిలిచి రేనిఁ జత్తు రెఱుఁగవె దీనిన్.

మ. అని యిట్లన్నివిశోపమంబు లగునుష్టాలాపముల్ వీనులం
దినఁ జిత్తం బెరియంగఁ గ్రోధము సముద్దీప్తంబుగా సైఁప లే
క నిరోధోద్ధత బుద్ధి నాతఁడు మె సేనాధ్యక్షులన్ సర్వవా
హినులన్ సన్నహనంబు సేయుఁ డని యుద్ధైకాగ్రహవ్యగ్రతన్.

వ. విచిత్రపర్యసమేతంబుగా వెలువడునెడ మంత్రకోవిదు లగుమంత్రులు త్రయీవేదు లగుఋత్విజులును నిత్యహితకాము లగుసుహృదులుం గూడి సన్నుఁ బరివేష్టించి.

సీ. శాస్త్రవుఁ డత్యుగ్రచక్రహస్తుఁడు నీవు సూతకివై శాయశుద్ధి లేక
యున్నాఁడవకట యాయుధములంటఁగఁగాదు దివ్యాస్త్రములు ప్రవర్తింపరాదు
తొలుతఁ గయ్యమునకుఁ దొడఁగుట యనుచితి బాహ్యంబు ప్రస్ఫుటోపాయవిధుల
సామభేదాదినిశ్చయములఁ బ్రసరించి పోరామి మైనప్పు పోరఁ దొప్పుఁ
గాన నిప్పటి కొకభంగిఁ గాలయాప, నంబు గావింపఁ జతురజనంబుఁ బుచ్చు
మప్పులఁ బిత్రుకార్య మేదిన సతులశుభము, లెల్లఁ గైకొని వెడలి జయింపు పగతు.

క. తగువార లిట్లు చెప్పిన, తగవులు వినకునికి చాలఁ దగదని సన్నున్
మగిడించి చనిరి చెచ్చెరఁ, బగతుకడకు దూతవృత్తిఁ బండితజనముల్.

వ. చని యనేకవిధంబుల ననునయించియు భేదించియు వివిధవస్తునిరూపణంబులం బ్రబోధించియు సద్దురాత్ము సుముఖుం జేయ నేరక చిక్కనడి యెంచి సుక్కమీఱి యక్కటిలుండు చటులసంచారనిర్వక్రం బగుచక్రంబు మాపైఁ బ్రయోగించిన.

మ. పరిణద్ధోగ్రయుగాంతభానుపరిధిప్రస్ఫారమయ్యున్ వెసం
బరిదారైకపరాత్మకుం డయినయప్పాపాత్ముపాపంబునం
బరిహీణాత్మమహత్త్వమై తృణకణప్రాయస్వరూపంబుతోఁ
దిరిగెన్ మాదెసరాక యంతటన తద్దివ్యాయుధం బత్తఱిన్.

వ. దాని కమ్మూఁకుండు విస్మితుం డయ్యును దనయహంకారంబున నిశ్శంకవృత్తి నుండె నేనది యెయ్యదియు నెఱుంగనాలోనన యాశౌచదినంబులు గడచిన

న్సర్వసుహృత్తములచేతం గృతస్వస్త్యయనుండనై ససైన్యంబుగాఁ బురంబు
వెలువడిన నప్పార్థియు నాకెదురై నడిచె నివ్విధంబునం దలపడి.

క. మూఁడుదినంబులు తద్దయు, వాఁడి యగురణంబు సేసి వరబాణాగ్నిం
బాఁడించితి నయ్యగ్రమునిఁ, బోఁడిమి చెడి తద్బలౌఘములు వెస విచ్చెన్.

వ. ఇట్లుగ్రాయుధుండు నిహతుం డయిన నటమున్న వానిచేత రాజ్యభ్రష్టుం
డయి పోయిన పృషతుండు నా పనుపునఁ గాంపిల్యనగరంబు గైకొని యహిచ్ఛ
త్రసహితంబుగా నేలెఁ బిదప ద్రుపదుఁ గెలిచి యర్జునుండు ద్రోణున కప్పురం
బులు రెండును నొసంగినం బరిగ్రహించి గురుండు కాంపిల్యనగరంబు ద్రుపదున
కిచ్చి యహిచ్ఛత్రంబు తాను గొనియెఁ బ్రసంగంబున నేనుగ్రాయుధుని గీట
డంగించినచందంబునుం జెప్పితి నింకఁ బితృసమారాధనఫలానురూపంబగు కౌశికా

క. విష్కలచరితంబు మార్కండేయుండు నాకు నుపన్యసించినయది నీకు నెఱింగిం
చెద విను మవ్విప్రు లేడ్వురు కౌశికులు నసుర వాగ్దుష్టుండును గ్రోధనుండును హిం

సీ. స్రుండును బిశునుండును గవియు ఖసృగుండును బితృవర్తి యనఁగ నిట్లు క్రియాను
రూపంబులై తమకుఁ దగు సిద్ధనామకర్ము లయినవారు.

కాలంబు వచ్చినపిమ్మటఁ దమతమంత, వారలయి గర్గుఁ డనుమునివరునిఁ జేరి,
శిష్యవృత్తిమైఁ బరిచర్య సేయుచును, మంచి దోగ్ధ్రియనంబు గావించి రర్థి.

క. నాఁటఁ గాగత యనుగుణమా, వర్యయతకపిలాంగి యైనయాప్రకటి సమ
చ్ఛాయగలక్రేపుం గదిని, యాగోవు గాఁడి కాతు రాతనియాజ్ఞన్.

సీ. ఒక్కనాఁ డాఁకలియును సీరుసట్టును నధికమై యోర్వ కడవిలోన
నందఱు శాల్యంబునందలి చాపలంబును విమోహంబును నెనయబుద్ధి
నగ్గోవుఁ జంపి యాహారంబు గొనుట కర్జంబుగాఁ గోరి నిశ్చయము సేసి
రందులోఁ గవియును నాఘుసృగుండును దగ దని పెక్కువిధములఁ జెప్పి
కొంతచెప్పిన మానరైరి తగ లప్పు, డాత్మఁ దలపోసి పితృవర్తి యనునతండు
మానుసెబ్బంగులను దీనిమాంసమిష్ట, మేనిఁ బిత్రర్థముగ వధియించు టొప్పు.

వ. అట్లయిన నిమ్మొదవుఁ బుణ్యగతి వడయు మనల సద్ధర్మంబుం బొంద దనిన నట్ల
కాక యని యందఱు నగ్గోవు విశసించి విధివిహితంబుగాఁ బితృతర్పణంబు సేసి
తచ్ఛేషోపయోగంబునం బ్రీతులై నిజనివాసంబులకుం జనుదెంచి.

క. పులి వచ్చి తినియె ధేనువు, నలఘుమతీ క్రేపు దప్పె నది గైకొనుఁ డీ
గలుగకుఁ డని గురుముందరఁ, బలికి రతండును ఋషిస్వభావుం డగుటన్.

తే. అని నిజంబుగాఁ గొనియె నట్లధమకర్ము, లుశలు లగువారు తుదిఁ గాలగోచరత్వ
మొంది యందఱు లుబ్ధకయోనియందు, జాతులైరి దశార్ణదేశమున ననఘ.

తే. న్నాకు నింతట సుచరిత్రపాక మొకటి, గలిగె నేనిట్టిడగుఁగాత మెలమి ననఁగ
మఱియు రెండుభాగంబు లమ్మాటవలని, యాదరం బగ్గలింపంగ నతనిఁ జూచి.

క. భూపతివై యటఁ బుట్టిన, నీప్రెగడల మగుటమాకు నిక్కము వాంఛా
రూపం బనిపలుకఁ దదా, లాపం బాపక్షి సముపలాలనచేసెన్.

వ. తక్కినచక్రవాకంబులు నాలుగు నప్పలుకులతో నీవు యోగధర్మనిష్ఠుండవై కా
మప్రధానం బగుచరితం బపేక్షించితి గావునఁ గోర్కి దప్పకయుండఁ గాంపిల్య
నగరేశ్వరుండ వయ్యెదవు వీరు నీకు సఖులు గాఁగలవా రనిన నది నిజంబగుట
కుం దలంకి యమ్మువ్వురు నమ్మహాత్ములం బ్రార్థించిన వారియందు సుమనుం
డిట్లనియె.

సీ. ఇంకను ఖగజన్మ మీయొవ్వరకుఁ గల దటమీఁద నీస్వతంత్రాహ్వయుండు
సర్వజంతువులభాషలు నెఱిఁగెడునట్టిరాజతనూభవుండై జనించు
నితనికారణమునఁ బితృహితార్థంబుగ నగ్గోవుభక్షియించి యంపఱమును
దాఁగుణంబై నయధర్మంబు ధర్మంబుగా నొంపఁ గంటిమి గాన నితఁడు
మనకు సద్గతి సేతువు వినుఁడు మీఁద, లట్లు జన్మించియుండ నే మన్యముఖము
నంపు వినుతింప నొక్కవాక్యంబు వినిన, యపుడ సిద్ధించుఁ బరమబోధాప్తి మీకు.

వ. ఇది నిక్కం బనియె వారి లక్ష్యములు విడిచి మానససరస్సున హంసయోనిం
బుట్టి పూర్వనామంబులన పరఁగి పవనాంబుభోజనులై శరీరశోషణంబులు సే
యుచుండ నక్కడ విభ్రాజుండును నణుహుం గనియె నతనికిఁ శుకుండు తనకూఁ
తుఁ బత్నిగా నిచ్చె నంత.

మ. తనయుం బట్టముగట్టి పౌరులు నమాత్యశ్రేణియున్ విప్రులున్
దనుఁ బూజించి ముదంబుతో ననుప నాథాత్రీశ్వరుం డర్థిమైఁ
జని యమ్మానసతీరభూమిఁ దప మాశ్చర్యంబుగాఁ జేసెఁ బే
ర్చినకోర్కుల్ గదియంగనీని హృదయస్థేమంబు సంధిల్లఁగన్.

వ. ఆరాజతపస్వి యట్లుండియు నప్పుణ్యపతత్రులయోగనిష్ఠ నాలోకించి జన్మాంత
రంబున వీనిలో నొక్కటికిఁ బుత్రుండనై యోగసిద్ధిఁ బడయుదు నని సంకల్పంబు
సేసెఁ బరమతపోవిభ్రాజుండై నయావిభ్రాజునవలన భ్రాజిల్లుటం జేసి యక్కా
నంబు వైభ్రాజంబునాఁ బరఁగె నక్కొలనికి వైభ్రాజం బనునామాంతరంబు
గలిగె నయ్యేడ్వురు పక్షులయందు మున్ను యోగభ్రష్టుండై నస్వతంత్రుం
డణుహునకు బ్రహ్మదత్తుండై పుట్టెఁ జిత్రదర్శనసునేత్రులు విప్రులై జనియించి
బాభ్రవ్యకండరీకు లన్పేళ్ల నతనికి మిత్రత్వంబు నొంది రమ్మువ్వురుఁ గృతాధ్య
యనులును నఖిలకళాధికులు నయ్యును బూర్వజన్మంబు లెఱుంగనీనియజ్ఞానం
బులు మనంబునం బొదువ వర్తిలుచుండి రంత.

మానసాహ్వయ మగుమహితసరోరుహాకరమున హంసతాగరిమ నెలసి
పరఁగి రెవ్వారు మును వేదపాఠిపృథ్వీ, లాపకుక్షేత్రసంజాతులై సవిప్రు
లట్టివా రదె కడుదూర మైన తెరువు, చనిరి వారలబడి దప్పఁ జనునె వినాకు.



బ్రహ్మదత్తుఁడు దేవీసహితుండుగాఁ బరమసిద్ధిఁ బడయుట

వ. అని పఠియించిన విని బ్రహ్మదత్తుండు విచేతనుండై నయట్లు చేష్టలుదక్కిఁ గండ
రీకుండు కేలనున్నములుకోలయుం బగ్గంబులు విడిచి సంభ్రమంబు బ్రిదిలియుండె బా
భ్రవ్యుండు నిపతితచామరం బగుకరంబుతో నస్వస్థచిత్తుం డయ్యె వారిం జూచి
పరివారంబును పౌరులు నాగంతుకులును భయవిస్మయంబుల మునింగి కలంగిరి
కొంతవడికిం దెలిసి యమ్మువ్వురు.

క. చెఱిచినదది గన్న తెలుఁగున, మఱచినతొలిబాముటెల్ల మదిఁ గని నిష్ఠన్
దఱికొల్పెడుయోగస్థితి, తెలుఁ గంతయు బుద్ధికిం బ్రతీతంబై నన్.

వ. ఆనందరసతన్మయులై రి తదనంతరంబ.

ఉ. నిండుమనంబుతోడ ధరణీపతి యాధరణీసుకోత్తమున్
బండితపూజితున్ మధురభాషల నెంతయుఁ దన్పి కోరికల్
నిండ నఖండవస్తుశతనిర్భరసంపద లిచ్చి తృప్తి యొం
డొండ నిముసర్చి వీడ్కొలిపె నుత్సుకతం దివ్యరమాంగచిత్తుఁడై.

మ. సమదారాతితమిస్రభానుఁ డగువిష్వక్సేను నాత్మీయసూ
ను మహారాజ్యపదంబున న్నిలిపి తానున్ దేవియున్ మంత్రియు
గ్మముతోడన్ జనుదేర నిర్భరవిరాగస్వాంతతన్ గాననాం
తమునన్ దాపసియుంప నేగె విగళత్పాశప్రబోధోన్నతిన్.

వ. అప్పుడు మహాయోగతత్పత్ని యతని కిట్లనియె.

తే. అఖిలజంతుభాషావేది వైననిన్ను, నధిప నేనెఱుఁగినె విషయానుభూతిఁ
దగిలి పూర్వజాతిస్మృతి దక్కియున్నఁ, దెలుపుటకు నిట్లు సేసితిఁ దెలుఁగొకండు.

క. మును చెడిపోయినయోగము, మునికృప నిటు సేరె నింక ముగ మెసఁగ నిరం
జనసిద్ధమార్గసేవం, జనువార మనన్యసులభసంప్రీతిమెయిన్.

వ. అని యి ట్లన్యోన్యధన్యతాకలనం బొనర్చుచు సరిగిరి కండరీకుండును శ్రుతికిం
గ్రమప్రణయంబొనర్చి కృతార్థతం జెందె బాభ్రవ్యుండు శిక్షయుత్పాదించి యో
గాచార్యగతిం బ్రాపించె నివ్విధంబు మార్కండేయుండు సనత్కుమారువలన
భవిష్యద్రూపంబగా విని పిదపం దాను బ్రత్యక్షంబుగాఁ గని నా కెఱింగించి
యిట్లనియె.

క: శంతనుతనూజ యీకథ, యంతయు విని ధన్యతముఁడ వైతి మనసునం
జింతింపుము దీనిన యు, త్యంతశుభావాప్తి యగు ననంతనిరూఢిన్.

శా. ఈయాఖ్యాన మెఱింగి చిత్తమునయం దేప్రొద్దు మోదించువాఁ
డాయుష్మంతుఁడు శ్రీసమేతుఁడును బుత్రానేకపౌత్రోదయ
శ్రేయోనిత్యుఁడు నై సుఖోన్నతి గనుం జెందంఁడు తిర్యగ్గతిన్
గీయోగంబున నెయ్యనెయ్యన విముక్తిం గాంచి సిద్ధుం డగున్.

వ. అని చెప్పి యమ్మునీంద్రుండు నిజేచ్ఛం జనియె నీవు పితృకల్పప్రకారంబు చిత్తా
యత్తంబుగా నెఱుఁగు మనిన భీష్మభాషితంబులకుం బరితోషంబు నొంది ధర్మ
నందనుం డతని నభినందించె నని వైశంపాయనసూక్తం బైనకథావిధానంబు
మధురంబుగా.

ఉ. చందనచంద్రచంద్రధరశారదనీరదనారదామృత
స్యందముకుందశుభ్రాభ్రవహారహాసబహులాట్టహాసహీ
రేందువినిందకస్ఫురదుదగ్రయశోన్నతపూర్ణసర్వది
క్కందర నందనందిర జగజ్జనసుందర ధైర్యమందరా.

క. సర్వధురీణగుణోదయ, సర్వజ్ఞోదాత్తసత్త్వసంస్థితయశో
గర్వితమల్లచమూవర, నిర్వంచకభావనిత్యనిత్యారాధ్యా.

మాలిని. కదనవిశదమిత్రచిత్రగాత్రప్రసూతాసృ
గ్ఘృదసివహరుసుక్షేత్రాయితానేకధాత్రీ
పటపరిణతపృష్యద్భార్గవాభీలశైలా
భ్యుదితపరశుసారస్ఫూర్తిమత్తీవ్రఖడ్గా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్య
ధుర్య శ్రీసూర్యసుకవినందన శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధే
యప్రణీతంబైన హరివంశంబునందు ద్వితీయాశ్వాసము.

---

హరివంశము.

పూర్వభాగము - తృతీయాశ్వాసము.

క. శ్రీమత్పంటకులాంబుధి, సోమ చిరయశోమహత్త్వశోభితలోభ
వ్యామోహరహితకోమటి, వేమ సమిద్ధప్రతాపవిపులస్తోమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు పితృసమారాధనవిశేషం
బులు వివరించి వైశంపాయనుండు జనమేజయునకు మఱియు నిట్లనియె వృష్ణి
వంశప్రసంగంబున నిట్లన్నియుం జెప్పితి నింకఁ దన్మూలం బైనసోమాన్వయ
క్రమంబు వినుము పరమేష్ఠికి మానసపుత్రుండగు నత్రిమహాముని యఖిలలోక
హితార్థంబు మనోవాక్కాయకర్మంబులు ధర్మంబునం దగులం గాష్ఠకుడ్యశిలా

సదృశుండై నిలిచి యూర్ధ్వబాహుతయు నిర్నిమేషానలోకనంబును సర్వలోకా
సాధారణంబులై యమర మూఁడువేలు దివ్యవర్షంబులు మహాతపంబు గావించి.

క. తనశుక్ల మూర్ధ్వగతముగ, నెనరించిన సహస్రశుబింబు లోలికె నతనిలో,
చనములఁ గాంతిమయములై, యనయము నొకట్రోవఁ గట్టి యవి వెలుఁగంగన్.

సీ. అది సోమాహ్వయ మైనగర్భముగఁ బ్రేమాయత్తలై దిక్కులా
పదియుం గైకొని తాల్చి యంతన భరింపంజాల కుక్షిస్థలిన్
బ్రిమలన్ వైచినఁ జూచి యాక్షణము సంప్రీతిన్ విరించుండు వ
చ్చి దయాలీల నెలర్పఁగాఁ ద్రిభువనక్షేమక్రియాకాంక్షియై.

క. సితవాజిసహస్రసమం, చితమగుతేరిపయి నిడినఁ జెలువొందె మహా
ద్యుతి యగుగర్భము సోముం, డితఁ డన బాలుఁడయి వేల్పు లెల్ల నుతింపన్.

వ. ఆసమయంబున భృగ్వంగిరః ప్రముఖు లగుచతుర్ముఖతనయు లతని ననేకంబు లగు
ఋగ్యజుస్సామసూక్తంబులఁ బ్రస్తుతించిరి తత్తేజంబున జగంబులెల్ల • నాప్యా
యనంబు నొందె గర్భపాతంబునప్పుడు సెదరి పుడమిం బడినకాంతిశకలంబులు
మహౌషధులై యొప్పె నట్లు జనియించినకుమారుండు.

ఉ. తొంబదివేలుపద్మములు ఘోరపుసంఖ్యగ నొప్పునట్టియ
బ్దంబులు దారుణం బగుతపం బొనరించిన నిచ్చ మెచ్చి య
య్యంబుజసూతి యోషధుల నప్పుల విప్రుల నేలు వానిఁగాఁ
బంబినవేడ్కతో నతనిఁ బట్టముగట్టిన నత్యుదగ్రతన్.

శా. రాజై యాతఁడు బ్రహ్మయిచ్చినయనర్ఘస్యందనం బెక్కి ని
ర్వ్యాజస్ఫూర్తిఁ ద్రిసప్తవారములు పారావారపర్యంతధా
త్రీజైత్రత్వము నొంది యాత్మమహిమన్ శ్రీ లెల్లెడన్ జేరఁగా
రాజత్తేజము గాంచెఁ బ్రస్ఫురితసామ్రాజ్యైకపూజ్యస్థితిన్.

వ. అట్టిమైశ్వర్యంబునకుఁ బ్రియంబంది ప్రాచేతసుం డగుదక్షుండు తనకూఁతుల
నిరువదియేడ్వురఁ బత్నులంగా నొసంగినం గైకొని యారాజు రాజసమాజపూ
జితం బగురాజసూయం బొనరించునెడ నత్రి హోతయు భృగుం డధ్వర్యుండు
నారదుం డుద్గాతయు బ్రహ్మ బ్రహ్మయు సనత్కుమారప్రముఖపరివృతుం డగు
నారాయణుండు సదస్యుండునునై రప్పరమపుణ్యుం డగణ్యహిరణ్యరత్నరజత
రాశిభాసితం బగుత్రైలోక్యంబును యజ్ఞదక్షిణగా నిచ్చె నని చెప్ప విందుము.

తే. ద్యుతియుఁ దుష్టియుఁ బుష్టియు ధృతియుఁ బ్రభయు
వసువు కీర్తియు ననుపేరివనిత లతనిఁ
బొంది రట్టిమైశ్వర్యవిస్ఫూర్తి నెందుఁ
బరఁగునాతఁడు మదిమది భ్రాంతిగదిరి.

**చంద్రుఁడు బృహస్పతిభార్యయగు తారంగొనినప్రకారము.**

చ. సురగురుభార్యఁ దార యనుసుందరిఁ బుణ్యచరిత్రఁ దత్పతిన్
బరిభవ మొందఁజేసి కడుబల్మి హరించి మహామునీంద్రని
ర్జరవరు లెంతచెప్పినను సక్తిమెయిన్ విడువంగ నెల్ల క
ద్ధురతయు చూపుచున్ సతతదోహలతన్ విహరించుచున్నెడన్.

వ. వాచస్పతిజనకుం డగునంగిరసునకు శిష్యుండు గావున శుక్రుం డాబృహస్పతిపక్షం బంగీకరించె భార్గవస్నేహంబున భర్గుండజగవం బనుచాపంబుగైకొని యాటోపంబునగురునివాఁడై నిలిచె నప్పుడు చంద్రాపరాధంబులోనివారినకాసిరూపించి

క. పురహరుఁడు బ్రహ్మశిరమను, పరమాస్త్రం బమరవరులపైఁ దొడిగినఁ ద
చ్చిరకీర్తి యెల్లనాశముఁ, బొరసెను బలహీను లైరి పోలుపఱి వారల్.

వ. ఇట్లు నిస్తేజులైనయహితులతెఱం గెఱింగి దైతేయులు గడంగిన.

తే. దారుణం బగుసమరంబు తారకామ, యంబు నాఁగ దేవతలకు నసురులకును
గరము నిష్ఠిగా లోకసంక్షయవిధాయి, యగుచు వర్తిల్లెఁ గౌరవాన్వయవరేణ్య.

వ. అందు దైత్యులచేత నాటత్యులు పెక్కండ్రు మడిసిరి శేషించినవారు వారి రుహాసను శరణుసొచ్చిన సద్దేవుండు మహాదేవుం బ్రార్థించి యుడిపి భార్గవు వారించి తారం దెప్పించి బృహస్పతి కిప్పించె నప్పు డంతఃప్రసవయై యున్నయన్నాతిం గనుంగొని యాంగిరసుం డిది మదీయతేజంబు గాదనవుడు.

క. తనరునిషీకాస్తంబం, బునమఱువునఁ బుచ్చఁబోఁడి పుత్రుని గర్భో
జ్జనితునిఁ బావకసమతే, జుని నల్లన యుజ్జగించె స్రుక్కుచు భీతిన్.

తే. జాతమాత్రుఁడై బాలుఁడు సర్వసురుల, యొప్పులనుగెల్చెఁదనమేనియొప్పుపేర్మి
నతనిఁ జూచి వేల్పులు విస్మితాత్ములగుచు, సంభ్రమావేశ మొందఁదజ్జననిఁ బిలిచి.

చ. సోమునిపట్టియో గురునిసూనుఁడో యితఁడు దీని నున్నరూ
పేమియుఁ గొంక కీవు ధవళేక్షణ చెప్పు మనంగ సిగ్గునన్
భామిని గీడుమేలొకఁడు పల్కద దానికి నల్గి తత్సుతుం
డామగువన్ శపించుటకునై కడఁగన్ బరమేష్ఠి గ్రక్కునన్.

ఉ. ఆతని మాన్చి తారఁ గడుఁబ్రార్థన యొప్పఁగ బుజ్జగించి భా
మా తెలియంగఁ జెప్పు మనమానవిభానిధి యైనయీతనూ
జాతునిహేతు వైనతఁడు సత్య మొకానొకఁ డెవ్వఁ డన్న నా
శీతమయూఖుఁడంచు సరసీరుహలోచన యొయ్యఁ బల్కినన్.

క. చనుదెంచి సోముఁ డప్పుడు, తనయుఁ దిగిచి కౌఁగిలించి తన్మస్తము మూ
ర్కొనిబుధుఁ డనునామ మతని, కొనర్చె మునిదేవతాసముత్కర మలరన్.

వ. బృహస్పతియుఁ దారం గైకొని చనియె సురలు సురజ్యేష్ఠుని వీడ్కొని నిజ నివాసంబుల కరిగి రట్టిదారుణంబగు గురుదారహరణచరితంబున.

తే. రాజయక్ష్మరోగార్తుఁడై రాజు ప్రతిది, నంబుఁ బ్రక్షీణమండలత్వంబు నొంది తండ్రి శరణంబుసొచ్చిన దయదలిర్ప, నత్రి తత్పాపపరిహార మాచరించె.

క. ఆవేళవుసఁ బ్రగమ్మ్యలఁగఁ ద, నూవృద్ధి వహించి విధుఁడు నూతనకాంతి శ్రీవిలసిల్ల జగత్త్రయ, జీవనహేతు వనువినుతి సేకొని వెలసెన్.

క. ఈయాఖ్యానము భక్తిం, బాయక చదివినను వినినఁ బాపరహితుఁడై యాయుర్వర్ధనపుత్ర, శ్రీయుక్తిఁ దనర్చి నరుఁడు చెన్నొందు నిలన్.

ఉ. సోమతనూజనందనుఁడు సుందరమూర్తి పురూరవుండు ల క్ష్మీమహిమన్ వెలింగెఁ బరిపాలితయజ్ఞుఁ డుదాత్తుఁ డార్తరగ ణామణి యుద్ధశౌండుఁడు విచక్షణుఁ డక్షతసత్త్వుఁ డత్యుదా త్తామలచిత్తుఁ డాత్మపరిమార్గవివేకుఁ డనంగ నున్నతిన్.

చ. సురలకు లేనియాతనివిశుద్ధగుణంబుల కాత్మ నెంతయుం గరఁగి వధూజనైకతిలకం బగునూర్వశి దాన వచ్చి ని ర్భరవిభవప్రోత్సవస్ఫురితభంగి వరించిన నాదరించి యా నరవరుఁ డిష్టభోగకలనం జరితార్థగఁ జేసె నుగ్మలిన్.

సీ. మందాకినీసరిన్మహితతీరంబుల నందనంబున మేరునగతటంబు లన్నింట హేమకూటాద్రిశృంగంబుల గంధమాదనశైలకందరములఁ జైత్రరథాంతరస్థలములనలకాపురంబున మఱియునిర్జరవిహార లలితదేశము లెన్ని గలిగె నందెల్ల నయ్యింతియుఁ దాను నశ్రాంతకేళి నెలమిఁ బదియును బదియేను నిరువదియును, నేడునెనిమిదియునుబదియేడునైదు నేఁడు లొక్కొక్కచోటుగా నెంతయేనిఁ, గాలము చ్వేలసౌఖ్యాబ్ధి నోలలాడె.

వ. అమ్మహారాజునకు రాజధానియై భాగీరథియుత్తరకూలంబునఁ బ్రతిష్ఠానం బను పురంబు సుప్రతిష్ఠంబు లగుగరిష్ఠసంపదల నొప్పారె నంత.

రజియనురాజు చరిత్రంబు సంక్షేపంబుగా నెఱిఁగించుట.

క. ఆయువు నసమాయువును ద్ర, ఢాయువుఁ బరమాయువును శతాయువు ననఁగా నాయూర్వశియం దతనికి, ధీయుతు లుదయించి రధికతేజులు పుత్రుల్.

వ. అందగ్రజుం డైనయాయువునకు నహుషుండును వృద్ధశర్మయు రంభుండును రజియు ననేనుండు నను నేవురుకొడుకులు పుట్టిరి వారిలో రజికిఁ బంచకశతతనూ జులు జనియించి రాజేయులనం బ్రఖ్యాతులయి రాసమయంబున.

అమరులు నసురలు నీసున, సమరమునకుఁ దొడఁగుచుండి సన్మత్తులయి యు క్కమలజు నడిగిరి తమలో, నమరఁగ నెవ్వరికి విజయ మగునని యధిపా.

వ. అడిగిన సద్దేవుండు వారి కిట్లనియె.

క. ఘోరాయుధకరుండై యె, వ్వారికినై కడఁగి యాహవం బొనరించున్
వీరవరుండు రజిభూపతి, వారలఁ ద్రైలోక్యవిజయవైభవ మొందున్.

క. ధృతి యుండును రజి యున్నెడ, ధృతిఁబాయక శ్రీ వెలుంగు ధృతియు సిరియు సం
గత లయినచోట విజయో, న్నతి ధర్మము దాన తనకు నావుడుఁ బ్రీతిన్.

వ. ఆరాజు రాహుదౌహిత్రుండు గావున మాతృవంశంబువా రగుటం జేసి దైతేయు
లాతని నాత్మీయసాహాయ్యకంబునకు నభ్యర్థించిన నతండు.

క. దివిజుల జయించి మిమ్ముఁ ద, దివిజుల నేనేలునాఁడఁ దెల్ల మిది ప్రియం
బవునే యనవుడు నొడఁబడ, కవనీవల్లభునితోడ ననిమిషవైరుల్.

వ. మాకు నధీశ్వరుండు ప్రహ్లాదుం డస్మదీయం బగునుత్సాహం బఖిలంబును దద
ర్థంబ యీసమయంబున కమరు లియ్యకొనినం గొనిరి కాక యే మొల్ల మనిన
ననిమిషు లవ్విధంబున కిచ్చగించి యతనికి నింద్రత్వం బిచ్చువారై రంత.

మ. వినమత్కార్ముకమేఘముక్తవిశిఖోద్వేలాంబుధారావళిన్
దనుజాంభోజవనీసహస్రముల విధ్వంసంబు నొందించి య
య్యనపాయుండు తదాశ్రయస్థ యగునుద్యద్రాజ్యలక్ష్మిన్ సుధా
శనగేహంబున శాశ్వతంబుగఁ బ్రతిష్ఠాపించెఁ బెంపేర్పడన్.

వ. అప్పుడు పురుహూతుండు.

క. నీవింద్రుండవై తొడఁబా, టీవిధ మగుటను నరేంద్ర యేఁ బుత్రుఁడనై
నీవిభవమునకు యుక్తుఁడఁ, గావలవదె యనిన నట్లకాకని రజియున్.

వ. దివంబున నుండి దేవేంద్రలక్ష్మి ననుభవించెఁ దత్పుత్రు లందఱు భూలోకంబు
విడిచి నాకలోకంబునకుఁ బోయి శక్రుండు తోడంబుట్టు వగుట నతనిఁ దమ
లోన నొకనితోడిపాలివానిం గాఁ జేసి యఖిలరాజ్యంబును దారయాక్రమించి
సర్వలోకంబును భుజియించి రట్టిప్రవర్తనంబున బహుదీర్ఘం బగుకాలంబు గడచె
నివ్విధంబున.

క. సిరిఁ బాసి వాసవుండు దన, గురుఁ గానఁగ నరిగి యతనిగురుతరచరణాం
బుజయుగముల కెరఁగి యపరి, స్ఫురితము లగుగద్గదోక్తముల నిట్లనియెన్.

మ. రజిచే గద్దియ గోలుపోయి విభుతాభ్రష్టుండనై క్రమ్మఱన్
రజిపుత్రావళి యాక్రమంబున ననర్థంబుల్ పొరిం బైకొనన్
నిజమై యొందను నిల్వనేరక విపన్నిర్మగ్నతం దూలెదన్
సుజనశ్రేష్ఠ యొకింత నాదెస కృపం జూడందగుం జూడవే.

క. మదిలో నన్నుఁ దలంచుచు, బదరీఫలమాత్రహవ్యభాగ మనలునం
దొదవించి తేనియును న, భ్యుదయము నేనొంది మూఁరిఁబోవనె చెపుమా.

ఉ. అనిన నతండు నీవు నను నక్కట యింతననేల మున్న యీ
పని యెఱిఁగించితేని నశుభంబులు నీదెసఁ జేరనిత్తునే
విను మటుచూడు సర్వమును వేగమె మేలుగ నుత్సహించెదన్
మనమునఁ గింకఁ దక్కు మనుమానము మానుము దీనభావమున్.

వ. అని యతని నాశ్వాసించి విశ్వక్రియాధుర్యుం డగు నాచార్యుండు తదీయతేజోవృద్ధి
విధాయియుఁ బరప్రభావపరిభావియు నగు ననుష్ఠానంబు నిర్వహించిన.

క. రజిసుతులు కామరోష, ప్రజనితదర్పమున మోహపరులై ధర్మ
త్యజనంబు సేసి సాధు, ద్విజవిద్వేషాదిదురితవృత్తిఁ జరిలిరన్.

మ. బలముం దేజముఁ దప్పి పోవుటయుఁ గోపం బార జంభారి యు
జ్జ్వలదంభోళిఁ బరాక్రమించి పటుగర్వస్ఫూర్తి నయ్యందఱం
బొలియింపంగఁ దొలంగి పోయె రజి యుద్యోతప్రభావ్యాప్తుఁడై
బలవిద్వేషి పునఃప్రతిష్ఠ గనియెం బ్రాజ్యస్వరాజ్యంబునన్.

క. శతమఖరాజ్యప్రాప్తి, ప్రతిపాదక మైనయీయుపాఖ్యానము వి
శ్రుతమై దీర్ఘాయురరో, గతలును దురితాపగమముఁ గావించు భువిన్.




వ. అనిచెప్పి వైశంపాయనుం డిట్లనియె నహుషునకు యయాతియు సంయాతియుఁ
బ్రయాతియు ననువారు పుట్టి రందు యయాతి శుక్రపుత్త్రియైన దేవయాని
యందు యదుతుర్వసు లనువారి నిద్దఱను వృషపర్వపుత్త్రియైన శర్మిష్ఠయందు
ద్రుహ్యానుపూరులనంగా మువ్వురం బుట్టించి యైశ్వర్యంబున ననిమిషేశ్వరసదృ
శుండై వెలింగె.

చ. అనుపమ దివ్యవాహయుత మైనరథంబు సురేంద్రుఁ డాదరం
బున నొసఁగంగఁ గాంచి యిరుమూఁడుదినంబుల సర్వభూతల
మ్మును నతఁ డేలెఁ దత్సుతుఁడు పూరుఁడు లోనగువంశ్యులెల్ల న
జ్జనపతియట్ల యమ్మహితసాధన నేలిరి పేర్మి యొప్పఁగన్.

వ. పెక్కబ్దంబు లట్లరిగినం బారిక్షితుం డగు జనమేజయుండు గర్గతనయుం డగు
బాలుం బ్రమాదంబున వధియించి బ్రహ్మహత్యఁ దగిలి లోహగంధియగు దేహం
బుతోఁ బౌరజానపదులచేతం బరిత్యక్తుండయి తిరుగుచు శౌనకుండను మహా
ముని నాశ్రయించి యతండు తురగమేధంబు చేయింపం గిల్బిషంబువలనం బాసె
మున్ను పాతకి యైనప్పుడ యాదివ్యస్యందనం బంతర్ధానంబై నిలువక నాకం
బునకుం బోయిన.

క. ఉపరిచరవసువునకు నె, య్యపువెరవున నింద్రుఁ డిచ్చె నత్తే రాచే
దిపతివలన మగధనరా, ధిపుఁడు బృహద్రథుఁడు వడసెఁ దివ్యం బెసఁగన్.

వ. తత్పుత్రుండగు జరాసంధువధియించి భీముండు వాసుదేవునకిచ్చె నట్లు యయాతి సప్తద్వీపంబులుం దనబాహుబలంబున సాధించి.

సీ. పూర్వోత్తరం బగు పుడమికి నొడయని గను జేసి యదు నగ్రతనయు నిలిపె
దక్షిణపూర్వమై తనరు దేశమునకుఁ బ్రభువుఁ గాఁ జేసి తుర్వసుని నిలిపెఁ
బశ్చిమోదగ్భూమిభాగముల్ రెంటికి నధిపతులుగ ద్రుహ్యు ననుని నిలిపె
మధ్యమంబై యొప్పు మండలంబునఁ బరిస్ఫుటఘనాతిగంభీరుఁ బూరు నిలిపె
సకలరాజ్యంబు సుతులకు సత్కరించి, తాను సన్యస్తశస్త్రుఁడై తనరువిషయ
భోగములమీఁదితృష్ణ యుప్పొంగ సుతులఁ, బెంపుతో భిల్లఁ బిలిచి సంప్రీతితోడ.

క. తనముదిమిఁ బుచ్చికొని తా, వన మిమ్మని వేఁడువేఁడి పూరుల నర్థిం
చిన నెవ్వరు నీకైరా, జనపతి నలువురకు నిచ్చె శాపము లోలిన్.

క. కడపటివాఁ డగుపూరుం, డడుగకమును తండ్రి కాత్మ యౌవన మిచ్చెన్
గడుసంతసమునఁ గైకొని, యడరెడురాగంబుతోడ నతివలఁ దానున్.

తే. దేవయానీసమేతుఁడై దేవచరిత, భూములందుఁ బ్రభూతసంభోగరుచులఁ
బెద్దగాలంబు విహరించి పెంపుచున్న, కామమున కేమిటను గడ గానలేక.

వ. క్రమ్మఱం బూరుపాలికి వచ్చి యతని యౌవనం బతని కిచ్చి యాత్మీయం బగుజరాభారంబు వహించి కామోద్వేగంబు లుడుగ వానిం బేరుకొని సుభాషితంబు లిట్లని యుదాహరించె.


యయాతిమహారాజు పఠించిన సుభాషితంబులు

తే. అంగములు కూర్మ మొట్లు ప్రత్యాహరించు, నట్లు కామములెవ్వఁ డెడయఁ జాలు
ధన్యచిత్తుఁ డానందతత్త్వంబు నొందు, నితరు లెల్లఁ గాలగ్రస్తు లింత నిజము.

క. పసిఁడియుఁ బశువులు భామలు, వసుమతి మీఁదఁ గలయంతవట్టు నొకఁడ యిం
పెసఁగఁగ నెవ్వఁడు గనియెడు, వినువఁ డగదె తృష్ణవలన విరతిప్రాప్తిన్.

క. సమధికభోగంబులచే, సమయుం గామ మనుటది మృషావాదం బా
జ్యమునం దోఁచ్చో ననలం, బమితంబై యొదవుఁగాక యాఱునె యెందున్.

క. అనిపలికి వనంబునకుం, జని దేవీసహితుఁడై యసామాన్యతపం
బొనరించి ప్రసిద్ధం బగు, వినుతపదంబున విభుండు వెలుఁగొందె నృపా.

వ. అని యిట్లు పరమపావనం బగు యయాతిచరితం బెఱింగించిన.

క. విని జనమేజయవిభుఁ డి, ట్లను నస్మద్వంశమునకు నాద్యుఁ డయినపూ
రునివంశశాఖ లన్నియు, వినవలతుం జెప్పవే పవిత్రచరిత్రా.

క. నావుడు నమ్ముని యిట్లని, యావిభునకుఁ జెప్పెఁ బూరునాత్మజుఁడు గుణ
శ్రీవిలసితుఁడు ప్రవీరుఁడు, నావెలసెను మాన్యుఁ డతనినందనుఁడు నృపా.

వ. అమ్మాన్యునకు నభయుండును వానికి సుధన్వుండును సుధన్వునకు సుబాహుండును సుబాహునకు రౌద్రాశ్వుండును బుట్టిరి. రౌద్రాశ్వునకు ఋచేయువు దశార్ణేయువు కృకణేయువు కక్షేయువు స్థండిలేయువు సన్నతేయువు జలేయువు స్థలేయువు వనేయువు వననిత్యుండు నను బదుండ్రు కొడుకులును రుద్రయు శూద్రయు భద్రయు మలహయు మలదయు సులభయు నలదయు సురసయుఁ జపలయు రత్నకూటయు ననుకూఁతులు పదుండ్రునుం బుట్టిరి. ఆకన్యకలకు నత్రివంశోద్భవుండై న ప్రభాకరుం డనుమహాముని భర్త యయ్యె నతండు.

తే. రాహునిహతుండై యినుండు ధరాతలమునఁ, బడఁగ వచ్చినఁ బడనీక పరమయశుఁడు
స్వస్తి యగుఁగాక యని పునస్స్వస్థుఁ జేసి, భువనవాసుల చే నెల్లఁ బొగడువడసె.

వ. అతనికయ్యింతులయందు స్వస్త్యాత్రేయు లనుకొడుకు లనేకు లుద్భవించి విప్రవంశంబులకుం గర్తలైరి మఱి కక్షేయునకు సభానరపరమంథుచాక్షుషులు పుట్టి రాసభానరునకుం గాలానలుండు నతనికి సంజయుండు నాతనికిం బురంజయుండునుం బుట్టి రమ్మహీపతికి జనమేజయుండు పుట్టె.

క. జనమేజయునకుఁ బుట్టెను, ఘనుఁడు మహాసారుఁ డన జగద్విదితుఁడు త
త్తనయుండు మహాఘనుఁ డా, యనకు నుశీనరతితిక్షు లాత్మజు లిరువుర్.

వ. ఆయుశీనరునకు నృగయుఁ గ్రిమియు నవయు దర్వియు దృషద్వతియు ననుపత్నులేవురయందును వేర్వేఱ క్రమంబున నృగుండును గ్రిమియు నవుండును సువ్రతుండును శిబియునుం బుట్టిరి. నవునకు నవరాష్ట్రంబులును గ్రిమికిఁ గ్రిమిలాపురంబును సువ్రతునకు నంబష్ఠవిషయంబును నుపభోగ్యంబు లయ్యె నింకఁ దితిక్షు వంశంబు వినుము.

క. ధీరుఁడు తితిక్షు సుతుఁడు మ, హారథుఁడు వృషద్రథుఁ డనఁగఁ బ్రాగ్దేశంబుల్
గోరి భుజియించె సుతుఁడ, వ్వీరవరున కుద్భవించె ఫేనుఁ డనంగన్.

క. ఫేనుఁడు సుతపుఁ గనియె న, మ్మానవపతికిని జనించె మానసజనిమై
దానవబలి బలియనఁ జతు, రాననుపనికాత్మయోగహరివిభూతిన్.

వ. అతండు బ్రహ్మవలన మహాయోగీశ్వరత్వంబుఁ గల్పపరిమాణం బైనయాయువు ననేకవంశకర్తృత్వంబును వరంబులుగాఁ బడసి యంగవంగసుహ్మపుండ్రకళింగులను పుత్రులం గాంచె నయ్యేవురుం దమపేళ్ళ నే నుజనపదంబులు గావించిరి వారిలోన నంగుండు.

క: సుతు దధివాహనుఁ గనియెను, జితశత్రుని దివిరథాఖ్యు సృజియించె నతం
డతనికిఁ జిత్రరథుం డన, నతిరథుఁ డుదయించెఁ బుత్రుఁ డవనీనాథా

వ. ఆచిత్రరథునకు ధర్మరథుండు పుట్టి విష్ణుపదం బను శైలంబున నధ్వరంబు సేసి సోముని మెప్పించె నాతనికి దశరథుం డనుతనయుండు పుట్టి రోమపాదుం డను నామాంతరంబునం బరఁగె.

క. అజనందనుఁ డగుదశరథుఁ, డజితుఁడు దనకూఁతు శాంత యనుకన్యఁ బ్రియా
త్మజఁ గా నొసఁగఁగఁ గైకొని, సుజనప్రియుఁ డాత్రిలోకసుందరమూర్తిన్.

వ. ఋశ్యశృంగునకుం బత్నిగా నిచ్చి యమ్మహాత్మునందు పుత్రకామేష్టి సేయింపం జతురంగుం డనుకొడుకుం గనియె నాచతురంగునకుఁ బృథులాక్షుండు పుట్టి చంపుం డనుపుత్రుం గాంచె వానిపేర నంగరాజధాని యగుచంపానగరంబు గలిగె నట్టి చంపునకు హర్యంగుండు ప్రభవించె.

చ. మునిపతిఋశ్యశృంగుఁడు ప్రమోద మెలర్పఁగ శత్రువారణం
బనుసురవారణంబు దనకై నిజమంత్రబలంబుపేర్మి మే
దినికి డిగింపఁగాఁ గొని యుదీర్ణవిభూతిఁ బురందరాదులం
గొనక వెలింగె శాత్రవవిఘూర్ణకఠోరభుజాబలంబునన్.

వ. అట్టి హర్యంగునకు భద్రరథుండు పుట్టె నతనికి బృహత్కర్ముండు పుట్టె నాతనికి బృహద్భానుండును నవ్విభునకు జయద్రథుండు నమ్మహీపతికి బృహత్కర్ముండు నారాజునకు విజయుండు నన్నరేంద్రునకు దృఢవ్రతుండు నాజననాథునకు సత్యకర్ముండును బుట్టి రిది యంగవంశం బింక ఋచేయువు నన్వయంబు సెప్పెద.

క. వినుము ఋచేయువుతనయం, డనఘా మతినారసంజ్ఞుఁ డతనికి మువురుం
దనయులు సుమతియుఁ బృథుఁడును, ఘనుఁ డప్రతిరథుఁడు ననఁ బ్రకాశితతేజుల్.

వ. వారు వేర్వేఱ వంశకరులై రమ్మువ్వుర వెనుక నందనుం డనుకొడుకు ధర్మనేత్రుం డనునామాంతరంబు గలిగి దుష్యంతుండు దిష్యంతుండు ప్రవీరుండు ఖగుండు ననువారి నలువురఁ బుత్రులం గాంచె నందు దుష్యంతుఁడు.

క. స్వీకృతనాగాయుతబలు, శాకుంతలుఁ బడసె భరతు సర్వదమను లో
కైకప్రకాశకీర్తి న, నేకాధ్వరధుర్యు నార్యహితచరితు సుతున్.

వ. అతనికి మువ్వురు భార్యలయందుఁ దొమ్మండ్రు కొడుకులు గలిగి మాతృశాపకలితం బగునాశంబు నొందినం బిదప భరద్వాజుండు యజనంబు సేయింప వితథుం డనుతనయుండు జనియించె.

సీ. సుతుల సుహోత్రుఁడు సూహోతగయుఁడుగర్గుఁడుకపిలుండనఁగోరి కనియె
నేవురనందులో నిద్దఱు దాశ్యుండు గృత్స్నమదుండు నాఁ గీర్తనీయు
లాసుహోతకు నెగినాత్మజులుదయించిరాకృత్స్నమదునకు ననఘకార్త్స్న
మములనఁ బరఁగుబ్రాహ్మణులును క్షత్రియవైశ్యులు గలిగి యివ్వసుధఁ బరఁగి

రగ్రజుండై నకాశ్యునకధికబలుఁడు, రాష్ట్రుఁడుదితుఁడై సూనుదీర్ఘతముఁగాంచె
దీర్ఘతమునకుఁ బుత్రుఁడు దివ్యమూర్తి, యైనధన్వంతరి సమాఖ్యుఁడవతరించె.

వ. ఆధన్వంతరికిఁ గేతుమంతుండును నతనికి భీమరథుండునుం బుట్టిరి భీమరథునకు దివోదాసుం డుద్భవించి నికుంభుం డనుమహాత్ముశాపంబున మనుష్యశూన్యమై రాక్షసనిలయం బైననిజరాజధాని యగువారణాశి వసియింప ననువుగాక గోమతీతీరంబున నగరంబు గావించి యుండె.

సీ. హైహయుదాయాదుఁడై నభద్రశ్రేణ్యు తనయులు నూర్వురు తమకులంబు
వారలఁ జంపి దుర్వారులై తనుఁ బిన్ననాఁడు గైకొనక యున్మాదలీల
మందలవిడిచిన మహనీయతపమున సుతునిఁ బ్రతర్దను శూరుఁ బడసి
శత్రులఁ జంపించి శత్రుజిత్తనునామ మాత్మజునకు నిచ్చె నతనిపుత్రు
లలఘుభుజులువత్సుఁడుభార్గవాహ్వయుండు, నందువత్సుఁడుపితృభక్తినతిశయిల్లి
తండ్రిడిదయనొసఁగఁగఋతుధ్వజుఁడనంగఁ, బేరువడసె నెంతయుఁసుసంప్రీతియలర.

వ. మఱియునుం గువలయం బనునశ్వంబు గలుగుటం గువలయాశ్వుం డనియుం బ్రసిద్ధుం డయ్యె నతనికి నలర్కుం డనురా జుద్భవించి యనేకశత్రుసంక్షయం బాపాదించి కాశీపురంబు క్రమ్మఱ నెక్కొంచి యఱువదియాఱువేలేండ్లు వసుధ పాలించె నతనికొడుకు క్షేమకుండును నాతనితనయుండు సునీథుండు. నతని సుతుండు క్షేమ్యుండుఁ దత్పుత్రుండు కేతుమంతుండును దత్ప్రభవుండు వర్ష కేతుండును దదీయసుతుండు విభుండు నన వెలసిరి విభునకు నానర్తుండును నానర్తునకు సుకుమారుండును సుకుమారునకు సత్యకేతుండును జన్మించి రిట్లు కాశీశ్వరు లైశ్వర్యంబున నెల్లచోట్లం బేరుగనిరి భార్గవుం డనువానివలనం గలిగినవా రనేకులు నిజకర్మభేదంబుల వేర్వేఱ వివిధబ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రవంశంబులకుఁ గర్తలై రింక సుహోత్రుసంతానంబువినుము సుహోత్రుండు హస్తిం గనియె నాతండు హస్తిపురంబు నిర్మించె నారాజునకు నజమీఢద్విమీఢపురుమీఢు లనువారు మువ్వురు పుట్టి రంత నజమీఢునకుఁ గేశినియు నలినియు ధూమినియు ననుభార్యాత్రయంబు గలిగిన వారిలోనఁ గేశినికి జహ్నుండు జనియించి.

### జహ్నునకు గంగాదేవి కూఁతురైన వృత్తాంతము.

సీ. అఖిలరాజన్యుల నాత్మవశ్యులఁ జేసి యైశ్వర్యసామగ్రి యతిశయిల్ల
సర్వమేధం బనుసత్రంబు గావించుచుండంగ నభ్రసంయుక్తి కరుగు
గంగ యాతనిమఖాగారంబుపై వెల్లివిడిచిన నల్గి యద్భుతతపస్వి
యగునమ్మహాత్ముఁ డయ్యమరతరంగిణిఁ గనుఁగొని తగునె యీగర్వ మెల్లు

మూఁడులోకంబులందును ముమ్మొగములఁ, బాఱునిను నెందు లేకుండఁ బట్టికుదియఁ
దిగిచి నీరెల్లఁ గ్రోలెద దేవతలకు, నైన నసహ్యంగ వశమె నాదయినపేర్మి.

వ. అనుచుఁ దత్పయఃపానంబునకుం దొడంగిన నతని సకలమునివరేణ్యసముదయం బులు ప్రార్థించి యమ్మహానదిం దదీయదుహితంగాఁ గల్పించి యనల్పం బగు నయ్యుత్సాహంబు వారించి రట్టి జహ్నుండు శరీరార్ధంబునం దటినీరూపధారిణి యైనయువనాశ్వపుత్రి కావేరియందుఁ బుత్రు నజితుం డనువానిం గనియె నజి తునకు బలాకాశ్వుండు పుట్టె నతనికొడుకై నకుశికుండు.

చ. తనయు మహేంద్రతుల్యవిభుఁ డా మహనీయునిఁ గాంతునంచుఁ జే
ర్చిననియమంబునం దపము సేయఁగ నద్దయు భీతిఁ బొంది యా
తనికిఁ బ్రదీప్తతేజమునఁ దాన తనూభవుఁడై జనించె న
య్యనిమిషభర్త గాధియన సంచితకౌశికతానమున్నతిన్.

వ. గాధికి విశ్వామిత్రుం డగ్రజుండుగా విశ్వరథుండును విశ్వకృత్తు విశ్వజిత్తు నను కొడుకులును సత్యవతి యనుకూఁతురుం బుట్టె నాసత్యవతి ఋచికువలన జమ దగ్నిం గాంచె విశ్వామిత్రునకు దేవరాతప్రముఖు లనేకులు జన్మించి బ్రహ్మ క్షత్రగోత్రకర్తలై రిది జహ్నునంశంబు.

క. విను నలినియనెడురెండవ, వనితకు నజమీఢుఁ డధికవైభవుఁ బుత్రుం
గనియెఁ సుశాంతి నతఁడు నం, దనుఁ బురుహోతి యనువానిఁ దగఁ బుట్టించెన్.

వ. పురుహోతికి బహ్వాశ్వుండు పుట్టె బహ్వాశ్వునకుం దనయులు ముద్గలుండు సృంజ యుండు బృహదిషుండు యవీనరుండు క్రిమిలాశ్వుండు నను వారు గలిగిరి.

క. జనకుఁడు వీరేవురు బహు, జనపదరక్షణమునందు శక్తు లనుచుఁ జే
ర్కొనఁ బాంచాలపదమ్ముల, ననఘా పాంచాలురైరి యుదగ్రవిభూతిన్.

వ. తదీయదేశంబులు పాంచాలంబు లనం బరఁగె వారిలోన ముద్గలునకు మౌద్గ ల్యుండు, పుట్టె నలపుత్రి యైనయింద్రసేనయందు వారస్యుం గనియె సృంజయు నకుఁ బంచజనుండును బంచజనునకు సోమదత్తుండును సోమదత్తునకు సహదేవుం డును సహదేవునకు సోమకుండునుం బుట్టిరి.

క. సోమకునకు నూర్వురుసుతు, లాముష్యాయణులు జంతుఁ డాదిగఁ గీర్తి
శ్రీమహితులైరి పృషతుం, డా మొత్తంబునకు నెల్ల నవరజుఁ డధిపా.

వ. పృషతునకుం బుత్రపౌత్రులై ద్రుపదధృష్టద్యుమ్ను లన వెలసిరి మఱియు నయ్యజమీఢుమూఁడవభార్యయైన ధూమిని భవదీయపూర్వవంశజులజనని యధికతేజుం డగుతనూజుం బడయుదు ననీ.

క. అనలపరిచర్యయును భో, జననియతి యుపాశ్రయంబు సంధిల్లఁగ హా
యనములు పదివేలు తపం, బొనర్చె నిట్లు చేయ వశమె యువిదల కనఁగన్.

వ. ఆపుణ్యచరిత్ర పవిత్రకుశసరిత్తరణంబునం దగ్నిహోత్రసమీపంబున శయ్య నించి యుండఁ దదీయభర్త తత్సాంగత్యంబు ననుభవించె దానంజేసి ధూమ వర్ణుం డయ్యు నత్యంతగర్హణీయుండగు ఋక్షుండనుతనయుండు జనియించి జన లోకపూజ్యంబగు సామ్రాజ్యంబున రాజల్లె నట్టి ఋక్షునకు సంవరణుండు పుట్టె.

ఉ. తాఁ తపసమగ్రుఁ డై నకురుఁ గాంచెఁ గులైకధురంధరుణ్ జగ
జ్జైత్రవిచిత్రకర్మగుణసమ్మతు నాతఁడు గాఁడె యీకురు
క్షేత్రము సేసె జహ్నుసుత సీమగఁ బూనిప్రయాగదాఁక లో
కత్రయపావనంబుగ నఖండిత కీర్తి ధనంబు చేకుఱన్.

వ. అమ్మహీపతికి మహాధర్మపరిరక్షకుం డగుపరీక్షిత్తు జన్మించె నాజనపతికి జనమే జయుండు శ్రుతసేనోగ్రసేనపూర్వులం డై జననంబు నొందె నాజనమేజయునకు సురథుండును సురథునకు విదూరథుండును విదూరథునకు ఋక్షుండును ఋక్షునకు భీమసేనుండును సుతులై రివ్వంశంబునందు ఋక్షపరీక్షిజ్జనమేజయు లిద్దఱిద్దఱును భీమసేనులు మువ్వురు నని యెఱుంగుము.

తే. అనఘ భీమసేనునకు భవ్యప్రతాపుఁ, డగుప్రదీపుఁ డుద్భవ మొందె నతనిసుతులు ప్రభులు దేవాపిశంతనుబాహ్లికులు త్రి, లోకవిఖ్యాతు లపగతశోకమతులు.

వ. అందు దేవాపి కొండొకప్రాయంబునన తపంబునకుం బోయి భార్గవచ్యవనునకుఁ గృతకపుత్రుండై దేవతలకు నాచార్యుం డయ్యె శంతనుండు రాజై జాహ్నవి యందు భీష్ముని వాసవి యైనసత్యవతియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యుల నుత్పా దించె వైచిత్రవీర్యుం డగుపాండునిపుత్రుండు భవత్ప్రపితామహుం డర్జునుండు వంశకరుం డై నయభిమన్యుం గనియె బాహ్లికునకు సోమదత్తుండు పుట్టె సోమ దత్తసంభవులు భూరిశ్రవశ్శలశల్యులు మువ్వురు పుట్టిరి బహుశాఖ యైనపూరు సంతతి యంతయు నెఱింగించితి నింక దుర్వసువంశంబును ద్రుహ్యునిగోత్రం బును ననువునన్వయంబును గ్రమంబున వేఱువేఱ చెప్పెద నాకర్ణింపుము.

దుర్వసు వంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పుట.

సీ. వహ్నిసమాఖ్యు దుర్వసుఁ డాత్మజునిఁ గాంచె గోభానుఁ డవ్వహ్నికొడు కతనికి
నీశానుఁ డనఁ బుట్టె నీశానునకుఁ గరంధముఁ డుద్భవించె నద్ధరణిపతికి
ధుర్యచిత్తుఁడు మరుత్తుఁడు నాఁగ జనియించె సంవర్తయజ్వుఁ డై చనుమరుత్తుఁ
డధిప యీతఁడు గాక యన్యుఁడు సుమ్మి మ్మరుత్తుఁ డపుత్రుఁడై రూఢతేజు
భరతజనకుని దుష్యంతు భ్రాతయైన, ఘనునిదిష్యంతుఁదగఁ బెంచుకొనియెఁజూవె
యిటుల దుర్వసువంశంబు నేగుదెంచె, బూరువంశకమిశ్రమై పౌరవేంద్ర.

వ. అధిష్యంతునకు గురుధాముండు ప్రభవించె వానికి నాక్రీతుండు పుట్టె నాక్రీతునకుఁ బాండ్యచోళకేరళు లన ముప్వురు గలిగి ప్రత్యేకవంశకర్తలై నిజనామంబుల జనపదంబులు గావించిరి.

తే. దుహ్యునకుఁ దనూభవుఁడు సేతుఁడు నాఁగఁ
బుట్టె నంగారుఁ డనఁగఁ దత్పుత్రుఁ డేచి
ధూతరిపుని మ్మాంధాతృనిఁ దొడరి పదియు
నాలుగగు నెలల్ ఘోరరణం బొనర్చె.

వ. పిదపఁ దదీయసఖ్యంబు వొడసి మరుభూములకుం బతియయ్యె నతనికి గాంధారుం డనువాఁడు పుట్టి తనపేర గాంధారదేశంబు సేసెఁ దత్కులప్రభవులు తురగారోహణకుశలులై విక్రమాదిగుణంబులం బరఁగిరి మఱియు ననువునకు ఘర్మ్యుం డనుకొడుకు పుట్టె ఘర్మ్యనకు ఘృతుండును ఘృతునకు దుదుహుండును దుదుహునకుఁ బ్రచేతసుండును బ్రచేతసునకు సుచేతసుండును సుచేతసునకుఁ బుత్రశతంబు గలిగెఁ దద్వంశ్యు లెల్లను ధర్మవిరహితంబు లగుమ్లేచ్ఛవిషయంబులకుం బతులైరింక యదువంశ విస్తరంబు వివరించెద.

తే. యదువునకునందనులు సహస్రదపయోదు, లనఁగఁ గ్రోష్టునీలాంజనులనఁగ నేవ్రుర్జితులు దేవసన్నిభు లుద్భవించి, రందుఁ బెద్దవాఁడై నసహస్రదునకు.

వ. హేహయుండు హైహయుండు వేణుహయుండు నన ముప్వురుకొడుకులు పుట్టిరా హేహయుం దొరంగి ధర్ముండు కుంతి సహస్రజిత్తుండు మహిష్మంతుండు భద్రశ్రేణ్యుండు దుర్దముండు ధేనుకుండు ననువారు క్రమంబునఁ గలిగిరి ధేనుకునకుఁ గృతవీర్యకృతాగ్నికృతధన్వకృతౌంజను లన నలువురు సంజాతులైరి కృతవీర్యునకుం గార్తవీర్యార్జునుం డుదయించి.

సీ. పదివేలువర్షముల్ పరమదుష్కర మగుతప మాచరించి యుదాత్తతేజు
నత్రితనూజు దత్తాఖ్యు నారాధించి యాతనికరుణఁ గయ్యంబులందుఁ
జేతులు వేయును జెంద నెప్పుడు దుష్టు దండించుమహిమయు ధర్మసరణి
తప్పక పృథివియంతయు నేలుశక్తియు సకలప్రజానురంజనము వెరవు
నిష్టవరములుగాఁ గొని యేకరథము, నన సమస్తధాత్రీపతులను జయించి
యేడుదీవుల జన్నంబు లేడునూఱు, ప్రగుణవై భవశ్లాఘ్యంబులుగ నొనర్చె.

చ. అతనిమఖంబులందుఁ బ్రియమంది మహాముని యైననారదుం
డతులమహత్త్వఁ డర్జునున కన్యులు తుల్యులె యెవ్వరు న్మహా
శ్రుతమున నీగి ధర్మమున శూరత ధీరత సంయమంబునన్
వ్రతమున నంచుఁ బాడె సురవర్యమునీంద్రసభాంతరంబులన్.

క. వినుపంచాశీతిసహ, స్రనిరూపితహాయనములు సకలోర్వియుఁ బా
లన నేసి పిదప భార్గవ, ఘనపరశుధ్వవలన నతఁడు గనియె విముక్తిన్.

వ. అట్టి కార్తవీర్యునకు శూరుండును శూరసేనుండును ధృష్టుండును గృష్ణుండును జయధ్వజుండును నన నుఁబుత్రపంచకంబు వెలసె నందు జయధ్వజుం డవంతీశ్వ రుండై తాలజంఘుం గనియె నతనికి నూర్వురుపుట్టి తాలజంఘాఖ్యులైరి వారి లోన వంశకరుం డైనవృషునకు మధువుపుట్టె మధువునకు వృష్ణి యుద్భవించె నివ్విధంబున యదువువలన యాదవులును మధువువలన మాధవులును వృష్ణి వలన వృష్ణులు నను పేళ్ల హైహయులు ప్రసిద్ధిబొందిరి యయాతిసంభవు లేవురు వంశంబు లివి యని వైశంపాయనుండు.

క. ఈయేనువంశములు విను. ధీయుతునకుఁ గలుగుసంతతియుఁ బ్రాభవముం
శ్రీయును నధికవిభూతియు, నాయువు ననఁ బరఁగుశుభము లైదును ననఘా.

తే. పంచభూతాత్మ మైనప్రపంచ మెల్లఁ, దారయై యొప్పుచున్నయుదారపుణ్యు
లలఘులై పంచవంశ్యులనభినుతింపఁ, గలుగుఁబంచేంద్రియార్థమారోగ్యయుక్తి.

యదువంశక్రమంబు సంక్షేపరూపంబునం జెప్పుట.

వ. ఇంక నఖిలజగత్ప్రభుం డగుపురుషోత్తమునకుం బ్రభవస్థానంబైనయదు నితృతీయ పుత్రుం డగుక్రోష్టుని యన్వయంబు విను క్రోష్టుపుత్రుండు వృజినీవంతుం డు స్వాహి యనుతనయుం బుట్టించె స్వాహికి రుశంకుండును రుశంకునకుఁ జిత్ర రథుండును బుట్టిరి.

క. అతనికి శశిబిందుఁడువి, శ్రుతవిభవుఁడు శతసహస్రసుదతీయుతుఁడ
య్యతులితసుతదశకోటి, స్థితికారి జనించె నప్రతిమపుణ్యుఁ డిలన్.

తే. అన్నరేంద్రునినందను లందఱకును, నాద్యుఁ డైనపృథుశ్రవుఁ డంతరుఁ డను
తనయుఁ బడసెనుయజ్ఞుఁడాతనినూజుఁ, డుశ్వుఁడామహీవిభునియాత్మోద్భవుండు.

క. ఘనుఁడు శితేపుం డతనికిఁ, దనుజుండు మరుత్తుఁ డనఁగఁ దత్ప్రభవుండ
జ్జనపతి కంబళబర్హిషుఁ, గనియె నతఁడు పుత్రశతము గాంక్షించి తగన్.

వ. మహనీయుంబు లగుదానధర్మంబు లనేకంబు లనుష్ఠించుచుండం బుత్రశతతుల్యుం డయి రుక్మకవచుం డనువాఁడు పుట్టి పరాక్రమంబునఁ బ్రసిద్ధి నొంది కవచ ధనుర్బాణధారు లగువైరుల నూర్వురరాజుల వధియించి రాజ్యపదంబు సుస్థి రంబుగా నొందె నతనికిఁ బరజిత్తనునిక్కంపుఁబేరివాఁడు పుట్టె నాపరజిత్తునకు రుక్మరిడు పృథురుక్ముండు జ్యామఘుండు పలితుండు హరి యన నేవురు కొడు కులు గలిగి రందుఁ బలితహరితు లనువారిద్దఱను దండ్రి యధ్వరంబున మహా ద్విజులకు దక్షిణగా నిచ్చె రుక్ముండు రాజై పృథురుక్ముం డాప్తుండుగా నుండె.

క. జ్యామఘుఁడు రాజ్య మొల్లక, సామజనిభగమన యైనశైబ్య దనపురం
ద్రీమఃశీతోఁ జనుదేరఁగ, శ్రీమహితుఁడు గానఁ దపము సేయఁగ నరిగెన్.

సీ. అట్లు ప్రశాంతుఁడై యారణ్యకద్విజవినుతమై యొప్పువర్తనముతోడ
నుండంగ నొకవిప్రుఁ డుత్తమకృపనీతికోవిదుం డాతని వేవిధముల
బోధించి దండంబు పోలను తపము భూపతులకునను బుద్ధి పట్టుకొనఁగఁ
జెప్పిన నారాజు చింతించి యన్నలు వ్రొందినసిరి దిక్కు వ్రావ నెల్ల
కరిగి ఋక్షవద్గిరితటమునను శుక్తి, మతి యనంగఁ బేర్చినపురి నతులశక్తి
నాక్రమించి యచ్చటుగుటుంబాధివాస, ముగ నొనర్చిమహాభుజస్ఫూర్తి యెసఁగ.

వ. ఒక్కరుండును రథంబెక్కి యడియాలంబుతోడిపడఁగ యుల్లసిల్ల నుద్దీప్తచాప
ధరుండై నర్మదయు మృత్తికావతియు ననుమహానదులయుపాంతదేశంబులు
జయింపుటకై వెడలిన.

ఉ. ఆతని దాడికిం దలఁకి యచ్చటివీడులరాజు లెల్ల న
త్యాతురులై కళత్రతనయార్థసుహృద్రథవాజివారణ
వ్రాతము నుజ్జగించి పఱవంగఁ దొడంగి రతండు హాసవి
ద్యోతముఖాంబుజుం డగుచుఁ దోలె విరోధిచయంబుఁ గన్గొనిన్.

తే. అయ్య యమ్మ దమ్ముఁ డన యని పిలుచుచుఁ, దల్లి బిడ్డ పట్టుఁగక తల్లడమున
బాలవృద్ధదుర్బలులు గీడ్వడఁగఁ గాంది, శీర్ణులై రి దేశములయశేషజనులు.

జ్యామఘుం డను రాజు వనంబున నున్న కన్నియం గొనివచ్చుట.

వ. ఆసమయంబున.

సీ. కాటుకకన్నీరు కస్తూరికాపత్రకాంతకపోలంపుఁగాంతిఁ బెనుప
వీడినపెన్నెఱివేణి విచిత్రనవీనాభ్రమై కమ్మవిరులు గురియఁ
దూఁగాడ్పుపయ్యెద దోదూయమానమై మలవై జయంతికామహిమఁ బడయఁ
గరుపాఁకునెమ్మేను కమనీయచైత్రకోరకితలతాసధర్మతఁ దలిర్ప
వెఱపుసేయుచేఁతలు తన్ను వితతభద్ర, లక్షణంబులై యిట్టు లలంకరింప
నొంటివడి చిక్కి పోలేక యున్న కన్యఁ, గనియె నొక్కత నెదుర నాజనవిభుండు.

క. కని యోషకు మని చేరం, జని రాజతనూజఁగా నిజం బరసి యెఱిం
గినవాఁడై మదిలోఁ దన, యనపత్యత సూచి రాగ మతిశయ మొందన్.

క. సంతతి లేకున్నను మ, త్కాంతపయి న్వేఱయొకతెఁ గామింపక యే
నెంతయు ధృతినుండితి నిది, యింతయు విధిఘటన దీని నేను వరింతున్.

వ. అని యబ్బాలనరదంబుపై నిడికొని మగిడి తనపురంబునకుం జనుదెంచి యంతి
పురంబు సొచ్చునప్పు డవ్విజయోత్సవంబున.

క. శైసేని తాను సుదతులు, నేసలు వెట్టుటకు శైబ్యచిత్తంబున ను
ల్లాస మెలర్ప నెఱగోని, యాసరసిజనయనఁ గనియె నరపతిముఖ్యా.

చ. కని మది నీసుతో నలుక గ్రమ్మన నుప్పతిలంగ దండపో
యినపని నాథ నీకు నిటు లెంతయు బాగయి వచ్చె నెక్కతె
న్ననుపునఁ దేరిపై నిడుకొనం బదిలంబుగ నుంచి యిమ్మెయిం
గొని చనుదెంచి తౌఁ దగుఁ దగు న్నవరక్తులు గారె భూపతుల్.

తే. అనిన నాతఁడు భయమున నబల నీకు, దీనిఁ గోడలిఁగాఁ గోరి తెచ్చినాఁడఁ
బార్థివాత్మజ యుత్తమభద్రమూర్తి, యెలమిఁ గైకొనుమనినసయ్యగురుఁ బోఁడి.

చ. తనయులు నాకు లేరు మఱి తన్వి తనూజనమేత నీను లే
దనయము దీనిఁ గోడ లనునట్టివిధం బొకఁ డెద్ది సెప్ప మా
యన విని నీవు గానఁగల వాత్మజు నెక్కని వాని కెంతయుం
బెనుపుగ నిప్పయోజముఖిఁ బెండిలిసేయుదుఁ గాక వేడుకన్.

వ. అట్టిభవిష్యద్భావంబు నిరూపించి యిక్కన్యం దోడ్కొని వచ్చితి నని యతం డప్పటికి నొండుత్తరంబు సెప్ప వెరవు గానక యిట్లు పలికిన నల్లిన నవ్వుచు నవ్వామనయన యవ్వరాంగి నంగీకరించె నివ్విధంబునం బరిణయవయస్కయై యుండ నాశైబ్య కతిపయదివసంబులకు గర్భంబు దాల్చి కొడుకుం గనియె వానికిఁ దండ్రి విదర్భుం డనుపేరు వెట్టి గారవంబునం బెనిచి కౌమారంబునం బూర్వజన్మతపోగౌరవంబుకలిమిం గుమారీభావంబు వొలిపోవక యున్నయ న్నాతి నతనికి నుద్వాహంబొనర్చె నదియును స్నుషాభిధానంబున నొందును వెలసె.

క. క్రథకైశికు లన నిద్దఱఁ, బ్రథితయశులఁ గాంచె రోమపాదుఁ డనఁగఁ బ్ర
త్యర్థితరిపుని మూఁడవసుతుఁ, బృథివీసమగుణసమగ్రుఁ బిదపం గనియెన్.

వ. ఆరోమపాదునకుం బ్రభుండును బ్రభునకు ధృతియునుం బుట్టిరి తత్పుత్రపౌత్ర పరంపరబహుముఖంబుల నెగడెఁ గైశికునకుం జేది యుద్భవించె వానివలనఁ జైద్యాన్వయంబు గలిగె స్నుషాప్రథమపుత్రుం డగుక్రథునకుఁ గుంతియుఁ గుంతికి ధృష్టుండును ధృష్టునకు దాశార్హుండును దాశార్హునకు వరార్హుండును బుట్టిరి మఱియుఁ గ్రమంబున జీమూతవికృతులు భీమరథనవరథదశరథులును శకునికరంభదేవరాతదేవక్షత్రు లనఁ దొమ్మిదితరంబు లరిగిన.

క. మధురవచనుఁ డుదయించెను, మధువనువసుధావిభుండు మాధవు లనఁగా
నధరీకృతాన్యనృపతులు, సధర్ములాత్మీయు లాత్మసంజ్ఞఁ దలిర్పన్.

క. పురుఁ డన మధునకుఁ బుట్టెం, బురుషాగ్రణి యైనసుతుఁడు పురునకుఁ బుట్టెం
బురుహోత్రుఁ డతని కంగుఁడు, పురుహూతపరాక్రముండు పుట్టె నరేంద్రా.

వ. అంగునకు సత్వతుండు పుట్టెఁ దద్వంశ్యు లెల్లను సాత్వతు లనం బరఁగిరి సత్వ
తునకు భజమానుండు దేవావృధుం డంధకుండు మహాభోజుండు వృష్ణి యను
పుత్రులు జన్మించి రందు భజమానునకుం గ్రిమియును గ్రమణుండును గృష్ణుం
డును దశజిత్తును శతజిత్తును సహస్రజిత్తు నయుతజిత్తు నను బెక్కండ్రు గలిగి
పెక్కువంశంబులు గలిగించిరి దేవావృధుండు బహుయజ్ఞకర్తయై సర్వగుణ
పవిత్రుం డగుపుత్రుం బడయుటకు నని.

క. పర్ణాశనదీతటమునఁ, నిర్ణయముగఁ దప మొనర్ప నెయ్యమునయి య
య్యర్ణవగంభీరునిగుణ, పూర్ణత గనుఁగొని ప్రియంబుపుట్టిన మదితోఁ.

వ. అమ్మహాతరంగిణి పరమమంగళం బగుసంగనారూపంబున నాభూపాలు వరియించె
వారికి బభ్రుండు పుట్టె నట్టితండ్రికి నక్కొడుకునకు జగంబులయందు.

తే. దేవసన్నిభుండు దేవావృధుండు దూ, రమున వినిన యజ్ఞరమ్యపదము
లరయఁ జేరి చూచినప్పుడు బభ్రుని, గుణము లనఁగఁ గీర్తిఘోష మెసఁగె.

తే. అఱువదియునాఱువేలు నానమరుసంఖ్య, గలుగుపురుషులమునుముక్తిఁ గన్నవారు
వారు పొందినగతియ దేవావృధుండు, బభ్రుఁడునుబొందిరందుసద్వృత్తిమహిమలు.

వ. మహాభోజుండు మహాధర్మశీలుండై మహాయజ్ఞంబులు బహుదక్షిణంబు
లుగా నొనర్చి యపరిమితసువర్ణగోదానంబు లనుష్ఠించి బ్రాహ్మణభక్తి నిర్వ
హించి గర్వితారాతిదళనంబునం బరమక్షాత్రంబు పైత్రంబు గావించి వెలసె
నతనివంశంబు రాజులు మృత్తికావతీపురిభూమి నేలి మార్తికావంతు లనం
బెంపొందిరి వారిలోన శ్వఫల్కుం డత్యంతసమాఖ్య నడరె నతనికి నక్రూరచిత్ర
కులు పుట్టి రక్రూరునకు దేవ్రాపదేవులు చిత్రునకుఁ బృథువిపృథు లాదిగాఁ
బెక్కండ్రు కొడుకులును శ్రవణశ్రవిష్ఠ లనుకూఁతులుం గలిగిరి మఱి యంధ
కునియన్వయంబు వినుము కుకురుండు భజమానుండు శుచి యనువార లంధక
ప్రసూతులు వారియందుఁ గుకురునకు ధృష్టుండు పుట్టె ధృష్టునకుఁ బుత్రపౌత్రు
లయి కపోతరోముండును దైత్తిరుండునుం గడచిరి తైత్తిరునకుం గొడుకును
మనుమండును నై పునర్వసుండును నభిజిత్తుండునుం బరఁగిరి.

క. అభిజిత్తునకు మహాయశుఁ, డభిమానసమున్నతాత్ముఁ డాహుకుఁ డనఁగాఁ
బ్రభవించె ననుజయై జగ, దభినుత యాహుకి జనించె నవనీనాథా.

### అంధకవంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పుట.

వ. ఆహుకి యవంతీశ్వరునకుం బత్ని యయ్యె నాహుకుండు సర్వవంశప్రదీపకుండై
బంధుజనంబు నాత్మసదృశవిభవోజ్జ్వలంబుగాఁ బెనిచి యనంతగజతురంగపరి
వార యగురాజ్యలక్ష్మి యేకభోగ్యగా నుల్లసిల్లె.

అతనికిఁ గాశిరాజాత్మజయందు దేవప్రభునిభులు దేవకుఁడు నుగ్ర
సేనుఁ డనంగఁ బ్రసిద్ధులు పుట్టి రా దేవకునకు నోలి దేవవంతుఁ
డన సుదేవుఁ డనంగను నుపదేవుం డన దేవరక్షితుఁ డన దీప్తభుజులు
కొడుకులు నలువురు కూఁతులు దేవకియును శాంతియును దేవయును సుదేవ
యును ననఁగ దేవరక్షితయును మఱి వృక, దేవయును నుపదేవయు శ్రీవిశాల
లైన శ్రీదేవులే యన ననుపమాన, సరసమూర్తులు జనన మొందిరి క్రమమున.

ఉగ్రసేనునకుఁ గంసుండు జ్యేష్ఠుండుగాఁ గ్రమంబున న్యగ్రోధుండును సునాభుం
డును సుహ్యుండును శంకుండును సుభూమి రాష్ట్రపాలుండు సారసుండు పుష్టిమం
తుం డనఁ దొమ్మండ్రుకొడుకులును గంసయుఁ గంసవతియు సుతనువు రాష్ట్రపాలి
కయు సుహ్యయు నన నేవురుకూఁతులుం బుట్టిరి.

కుకురువంశకీర్తన, మాకర్ణించినను మనమునందు నిలిపినం
జేకుఱుఁ బ్రజాసమున్నతి, ప్రకలితంబై నసుచిరజీవన మొందున్.

అంధకద్వితీయపుత్రుండై న భజమానునకు విదూరథుండును విదూరథునకు
శూరుండును శూరునకు శమియు శమికిఁ బ్రతిక్షేత్రుండును బ్రతిక్షేత్రునకు హృది
కుండును బుట్టిరి హృదికునకుఁ గృతవర్మపూర్వజుండుగా శతధన్వ దేవార్హులు
జనియించి రివ్విధంబున సత్వతతనూజులైన భజమానదేవావృధమహాభోజాంధ
కులయన్వయంబులు చెప్పం బడియెఁ గడపటివాఁ డైన వృష్ణివంశంబు ప్రశం
సించెద.

విను గాంధారియు మాద్రియు, ననఁగా వృష్ణికిఁ బురంధ్రు లందు మొదటియా
లనఘుఁ గనియె మిత్రవివర్ధనుని సుమిత్రుని నమిత్రదళనధురీణున్.

మాద్రికి యుధాజిత్తును దేవమీఢుండును ననమిత్రుండును ననువారు పుట్టి
రందు దేవమీఢునకు శూరుండు పుట్టె.

శూరోత్తముఁ డగు నాతఁడు, మారిష యనుపత్నియందు మహనీయగుణో
దారు వసుదేవుదేవా, కారుఁ గనియె నిర్వికారగౌరవరమ్యున్.

ధీనిధి యుత్తముండు వసుదేవుఁడు పుట్టినయప్పు డంబరం
బానకదుందుభిధ్వనితమై కురిసెం గుసుమప్రవర్షముల్
దాన నచేసి యాగుణనిధానుఁడు మానవనాథభూషణుం
డానకదుందుభిస్ఫుటసమాఖ్య వహించె జగత్ప్రసిద్ధిగన్.

పిదప వసుదేవుఁ డనుపేరఁ బేర్చుకాంతి, నమృతకరుఁ బోలి యొప్పుట నతిశయిల్లె
నతనిజననంబునకుఁ బ్రీతి నందె నెంధు, జంగమస్థావరాత్మకసకలజగము.

ఆవసుదేవునకు ననుజులయి దేవభాగుండు దేవశ్రవుండు ననాధృష్టి యనువారు
మొదలుగాఁ దొమ్మండ్రు బహుసంతతులఁ బడసిరి తత్సంతానంబులలోన దేవ.

భాగునకుం బుత్రుం డగునుద్ధవాచార్యుండు బుద్ధితత్త్వంబుననింద్రాచార్యుతో డం బుపడించె మఱియుం గౌశికుండు సుమిత్రుండు మొదలుగా నెందఱేనిఁ బ్రఖ్యాతు లయిరి శ్రుతదేవయు శ్రుతశ్రవయుఁ బృథయు రాజాధిదేవియు నన నేవురు చెలియలు గలిగిరి వారిలోన.

సీ. శూరుఁడు పోరానిచుట్టమై కుంతిభోజునకుఁ దాఁ గుంతియన్ తనయఁ గాఁగఁ
బృథ నిచ్చె నాయమ ప్రఖ్యాతతేజుం డగుపాండుని భర్తగాఁ బడసి ధర్మ
మారుతశక్రాఖ్యమహితాంశజన్ములఁ గనియెఁ బాండవుల నఖండయశుల
శ్రుతకీర్తి వృద్ధశర్ముఁడు కరూశాధిపునల్లభయై దంతవక్త్రుఁ గాంచె
వినుశ్రుతశ్రవచైద్యుఁడువిగతదోషుఁ, డైనదమఘోషుఁడుద్వాహమైయుదగ్రు
నరిభయశీలు శిశుపాలు నాహిరణ్య, కశిపుతేజోంశసంభవుఁ గలుగఁజేసె.

వ. శ్రుతదేవకుం గేకయనృపువలన నేకలవ్యుండు పుట్టి నిషాదులలోనం బెరిగె రాజాధిదేవి యవంత్యు లగువిందానువిందులం బ్రసవించె వసుదేవునకు బాహ్లికపుత్రి యైనరోహిణి ప్రథమపత్నియై బలభద్రుండాద్యుండుగాఁ గ్రమంబున సారణుండును శఠుండును దుర్దముండు దమనుండు శ్వభ్రుండు పిండారకుండు కుశికుండు గదుండును ననుకొడుకులం జిత్ర యనుకూఁతుంగాంచె నాచిత్రయు సుభద్ర యను పేర నెగడి కురువంశవర్ధనుండయినయర్జునుం జెందె.

ఉ. దేవకి మున్నుగాఁగ వసుదేవుఁడు దేవకుకూఁతు లందఱన్
దా వరుసన్ వివాహమయి తామరసేక్షణు నాద్యు నచ్యుతున్
దేవకియందుఁ గాంచె జగతీవర తక్కినవారియందుఁ దే
జోవితతాత్ములం గనియె సూనులఁ బల్వుర నాగదాదులన్.

క. బలదేవుఁడు రేవతియం, దలఘుబలుని సుతుని నుల్ముకాహ్వయుఁ గనియెన్
లలనలు మఱియు నతనికిం, బలువురు మదిరాదు లర్థిఁ బడసిరి సుతులన్.

వ. కృష్ణునకు రుక్మిణీప్రముఖు లయినదేవు లెనమండ్రును మఱియుం బదియాఱువేలునూర్వురుం గలిగిరి వారియందు లక్షయునెనుబదివేవురుకొడుకులుపుట్టి రంద ఱకుఁ బ్రద్యుమ్నుండు పెద్దవాఁ డయ్యె మఱియుఁ జారుదేష్ణసాంబాదు లనేకులు ప్రసిద్ధులయి తనర్చిరి.

తే. అనఘ వృష్ణికనిష్ఠనందనుఁడు పుణ్య, శీలుఁ డనమిత్రుఁ డాత్మజు శినిసమాఖ్యుఁ
గాంచె సత్యకుఁ డుదయించెఘనుఁడుశినికి, సత్యకునకు సాత్యకిపుట్టెసత్యయశుఁడు.

వ. అతనికి యుయుధానుం డనునామంబు ముఖ్యంబై యుండెఁ దద్వంశ్యులు శైనేయు లనం బరఁగిరి మఱి యుధాజిత్తువంశంబు మెఱయ ననమిత్రుం డుదయించె ననమిత్రునకు నిఘ్నుం డనువాఁడు పుట్టె నిఘ్ననకుఁ బ్రసేనసత్రాజిత్తులు పుట్టిరి.

సత్రాజిత్తు సూర్యు నారాధించి శమంతకమణి సంపాదించుట.

క. సత్రాజిత్తు విమలచా, రిత్రమునకు నాత్మలోనఁ బ్రియ మంది తగ
న్మిత్రుం డయ్యెం ద్రిభువన, మిత్రుఁడు మిత్రుండు కృప నమిత్రధ్వంసీ.

వ. అట్టిసత్రాజిత్తు సముద్రతీరంబునఁ బహునెకండుదినంబులు నియతుండై సూర్యు
నారాధించిన బ్రసన్నుండై యద్దేవుం డతనికి మేలు సేయుతలంపునం బెంపా
రుమూర్త్యంతరంబు ధరియించి తదగ్రభాగంబున నిలిచిన నతండు ప్రణతుండై
వివిధవాక్యంబుల స్తుతియించి.

తే. దేవ నీవు నభంబున నేవిధమున, వెలుఁగు దట్ల సురాలోకవిపులమూర్తి
నిచ్చటికిని విచ్చేసితి వెట్లు నిన్నుఁ, గన్నులారంగఁ గని మేలు గాంచువాఁడ.

వ. అనుటయు సూర్యుండు నగుచు నిది యొక్కరత్నంబు శమంతకనామధేయంబు
కంఠావలంబి యైనఁ దత్తేజంబున నతిసౌమ్యం బయ్యెను మదీయరూపంబు నీకుం
దేటిచూడ రాకున్నది యట్లు చూడు మనుచు నది పుచ్చి యతనియుఱుతం బెట్టి
వరంబు వేఁడు మని పలికిన.

క. అతఁ డమ్మణి యీఁగియ యభి, మతవరముగ నడుగుటయును మార్తాండుఁడు న
ట్లు తగంగ నిచ్చి యంత, ర్హితుఁ డయినఁ బ్రమోద మాత్మ నెసకంబెసఁగన్.

వ. మగిడి సత్రాజిత్తు ద్వారకానగరంబున కరుగుదేరం గని యెల్లవారును విస్మయ
సమ్మోహసంభ్రమంబులం గమలనాభుపాలికిం బోయి.

క. దేవరదర్శించుటకై, తావచ్చుచు నున్నవాఁడు తపనుం డిదె తే
జోవిసర మెసఁగ నన విని, యావిభుఁ డల్లనగి వార లందఱతోడన్.

వ. అతని నర్కప్రసాదలబ్ధరత్నుం డైన సత్రాజిత్తుం గా నెఱింగించె నట్లు సనుదెంచి
సహోదనీబాంధవసఖుండు సుఖంబున నుండునంత.

ఉ. నిచ్చలు నమ్మహామణి వినిర్మలకాంచనరత్నభారముల్
వొచ్చెము లేక యెన్మిది ప్రభూతముగాఁ గురియున్ ధరిత్రిఁ దా
నెచ్చట నుండె నచ్చటికి నేయుపసర్గము నేభయంబు నే
యచ్చికయున్ జనింపక సమంచితసుస్థితి నిచ్చు నిచ్చమై.

మ. అది దామోదరుఁ డుగ్రసేనునకు నొయ్యం జేర్పఁగాఁ గర్జమున్
మది నూహించుచు నుండుఁ గృష్ణుఁ డపుడున్ మానోచితుం డివ్విభుం
డిది యీకుండను రాదు వేఱొరుల కే నెట్లిత్తు నంచుం బొరిన్
దదనుధ్యానము సేయుచుం దలఁకు సత్రాజిత్తుఁ డెల్లప్పుడున్.

వ. కృష్ణుండును గులంబులోనం గలహంబు పుట్టునని తలంచి తాను శక్తుం డయ్యును
గొనన్నొల్లక యయ్యైప్రసంగంబులం గోర్కి సన్నవారం బలుకుచుండఁ జుట్టంబు
లందఱు నెఱింగి యుండుదు రిట్లుండ సత్రాజిత్తు జనార్దనునివలన శంకించి యు

మ్మాణిక్యంబు ప్రసేనున కిచ్చె నదియును నశుచి యైనవాఁడు దాల్చినం దనగు
ణంబులు సూపక ప్రాణాపద మొనర్చు నత్తెఱం గయ్యిరువురు నెఱుంగ రంత.

సీ. ఆప్రసేనుఁడు తురగారూఢుఁడై లీల విపినమార్గంబుల వేఁటలాడ
నొకసింహ ముగ్రమై యుఱికి గఱ్ఱమ్ము నాతనిఁ జంపి బలుకండ యనుతలంపు
గ్రమ్మ రత్నము నోరఁ గబళించునంతలోఁ జేతెంచి మృగపతి నెలుఁగుఱేఁడు
జాంబవంతుఁడు మహాసత్త్వుండు వధియించి యమ్మణి గైకొని సమ్మదమునఁ
జని బిలంబు ప్రవేశించి తనతనయుఁడు, శిశువు సుకుమారుఁ డనువానిచేత నాట
మానికంబును నిచ్చె నమ్మాణిక్య మవనిఁ, జనఁగ నారాజసుతుబంధుసమునయంబు.

క. మృగయాతత్పరుఁడై చని, మగుడండు ప్రసేనుఁ డేమియాయెనొ రమ్యం
బగుమణికై, యేపాపులు, తెగిరో ప్రాణమున కేది తెఱఁ గింక యనుచున్.

వ. ఇవ్విధంబు కృష్ణకృత్యంబ కా నోపు నని కొందఱు పలుతెఱంగుల నొయ్యనొయ్యన
పలుకుచుండం గర్ణపరంపరం బరివాదంబు ప్రకటం బగుటయు లోకవేది యగు
నయ్యాదిపురుషుం డాదీను మాన్పికొనుటకై యెవ్విధంబున నైనం బ్రసేనుని
చొప్పు చేటరసెద నని చుట్టంబులు విసం బలికి యాప్తులు వెరవరులు నగుసరి
చరులం గొనిచని వింధ్యంబు ఋక్షవంతంబు నను పర్వతంబులు గుఱిమ్మరి యొక్క
ప్రదేశంబున.

మ. బలవత్సింహనఖాగ్రపాటితతనుప్రభ్రష్టభూషాంబరా
కులకేశప్రకరుం గరస్ఖలితఖడ్గు న్ముక్తపల్యాణసం
వలితగ్రీవవికీర్ణకేసరమృతాశ్వప్రాంతసంస్థున్ రజః
కలుషశ్మశ్రుముఖుం బ్రసేనుఁ గనియెం గ్రవ్యాదసంశ్లిష్టితున్.

వ. కని తదీయశరీరంబున నమ్మహారత్నంబు కానక యనతిదూరంబునఁ బడియున్న
సింహశవంబు నాలోకించి యచ్చోట ఋక్షపదంబు లుపలక్షించి సర్వాపేక్ష
ణీయం బగుమణికిం గలగొరనంబు నూహించి యయ్యెలుఁగునడుగులజాడ బిల
ద్వారపర్యంతంబు ననుసరించి వచ్చిన సహచరవర్గంబు నిలిపి బిలంబు సొచ్చి కొం
తదవ్వు వోయి జాంబవత్పుత్రునకు ధాత్రి యొనరించు బుజ్జవంబునయందు.

క. వీఁడు ప్రసేను వధించె న్మృ, గారి యదియు జాంబవన్నిహత మయ్యె నహా
ద్వార మగురత్న మిదె సుకు, మారక నినుఁ జేరె నేడ్వ మానుమ యింకన్.

వ. అను నెలుం గాకర్ణించి రయంబున.

క. అంతర్బిలమున కేగి య, నంతద్యుతినూత్నమైన యారత్నము నం
తంతఁ గని కదియుటయు మదిఁ, నెంతయు భయమంది దాదిహ్వాపయుం బరరన్.

వ. కావరే యని పలుక నయ్యార్తరవంబునకు జాంబవంతుండు పఱతెంచి.

మ. అతనిం గాంచి యుదగ్రకోపమున బాహాబంధురస్ఫూర్త్యహనో
ద్ధతిమైఁ దాఁకినఁ గృష్ణుఁడుం బటుభుజవ్యాఘాతనిర్ఘాతసం
పతనాభీలబలంబునం దొడరె నిబ్భంగిన్ రణం బేకవిం
శతిసంఖ్యాకలితాహముల్ హరికి ఋక్షస్వామికిం జెల్లఁగన్.

వ. యాదవేశ్వరుని యనుచరు లచ్చట నెనిమిదిదివసంబులు గాచికొని యుండి బలదే
వానుజుండు బిలాంతరంబు వెలువడకయున్నఁ బ్రాణంబులతో నున్న నిన్నాళ్లేల
తడయు ననుచుం జేటు చొచ్చి మగిడిపోయి కృష్ణుండు నిహతుం డయ్యె నని చెప్పిన.

క. శోకించి చుట్టములు పర, లోకవిధులు నడుప నిర్వర్తిత విహితా
నేకతిలపిండదానము, లాకృష్ణున కట నొనర్చె నాప్తాన్వయముల్.

వ. దానం జేసి యతండు సత్త్వహానిం బొందక యెప్పటియట్ల యుండె జాంబవంతుండు
నిరాహారత్వంబు కతనను బ్రబలసంప్రహారభేదంబులవలనను బలహీనుండై
యోటుపడి యద్దేవునకు సవినయప్రణామం బొనర్చి.

మ. సురగంధర్వభుజంగమర్త్యచరరక్షోముఖ్యులు న్నీదెసం
బరిభావం బొనరింప నోప రని మద్భావంబునం దోఁచె నె
వ్వరు తిర్యగ్భవులై సమాశ్రితులు దేవా నిన్ను మత్స్వామి దా
శరథిం బ్రాప్తపునస్సముద్భవునిఁగా శంకించెదం జెప్పవే.

క. అనిన నగుచు నవ్విభుఁ డా, యన కాత్మావతరణంబు నఖిలము నెఱిఁగిం
చిన నాతఁడు భక్తినమ, ర్చనలు దగ నొనర్చి యధికసమ్మోదమునన్.

వ. తదీయకరతలస్పర్శనంబున నాయతసమరశ్రమంబు నుజ్జగించి ఋక్షేశ్వరుండు.

క. తనకూఁతు జాంబవతి నాఁ, జనుకన్నియఁ దెచ్చి యిచ్చె సన్నిహిత స
ద్వనజేక్షణునకు నతఁడును, వనజాక్షిఁ బరిగ్రహించె వాంఛ యెలర్పన్.

—— శ్రీకృష్ణుఁడు జాంబవతిం బరిగ్రహించి నిజపురంబునకు వచ్చుట. ——

వ. అట్లు కన్యారత్నంబు నివేదించిన యనంతరంబ శ్యమంతకరత్నంబును సమర్పించినం
బ్రణతుని చేతిది గొనఁ దగ దైనను బరివాదపరిహారార్థం బయ్యర్థవిభుండు గై
కొని చరితార్థుండై జాంబవతిం దోడ్కొని పురంబున కరుగుదెంచిన.

ఉ. పౌరులు బంధుమిత్రులును భాగ్యఫలంబులు నేఁడు మాకు నిం
డారఁగఁ బండె నచ్యుతుఁ డపాయ మొకింతయు లేక యిమ్మెయిం
జేరె జగంబు లన్నియును జేకుఱ నేలితి మంచు సమ్మద
స్ఫారతఁ ద్రుల్లియాడి రెలప్రాయము వచ్చినయట్లు వృద్ధులున్.

క. సకలయదువృష్ణిభోజాం, ధకసభయును వినఁగ శౌరి తనవృత్తాంతం
బొకటియుఁ దప్పక యుండఁగ, నకుటిలమతిఁ దెలియఁ జెప్పె నాశ్చర్యముగన్.

వ. శ్యమంతకమణియు సత్రాజిత్తున కిచ్చి నివ్విధంబున మిథ్యాభిశంసనశమనంబు
గావించికొని గోవిందుం డందఱు నభినందింప జాంబవతి నంతఃపురభూషణంబుగా
నునిచెఁ బ్రాప్తరత్నుండై సయాప్రసేనానుజన్ముండు.

క. లేనిది పైఁబెట్టితి హరి, పై నక్కట దీని కిదియ ప్రాయశ్చిత్తం
బైనది యని తనసందన, నానతుఁడై సత్యభామ నతనికి నిచ్చెన్.

వ. అక్కుమారిక నక్రూరకృతవర్మశతధన్వప్రముఖు లగుయాదవు లెందఱేని నె
ప్పుడు నడుగుచునికిం జేసి వాసుదేవుని కిచ్చుట దమకు నత్యంతంబు నవజ్ఞతగా
నెక్కొంచుకొని సత్రాజిత్తు శత్రుంగాఁ దలంచుచుండుదు రయ్యందఱు నెక్క
నాఁడు తద్విషయం బగుమంతనంబున నుండి శతధన్వున కిట్లనిరి.

మ. మనమెల్లం దనతోంటిమంచితన మాత్మం గోరి కోరంగఁ గై
కొన కాకృష్ణునిసొమ్ముఁ జేసె ఖలుఁడై కూఁతుర్ సహింపంగ వ
చ్చునె యీపాడ విచార మేమిటికిఁ దుచ్ఛున్ వీనిఁ ద్రుంగించి యొం
డు నలభ్యం బగుమానికంబు గొని సంతోషింత మంతర్గతిన్.

చ. ఎఱుఁగనివాఁడ పోలె హరి యివ్విధి యూరక చూచె నేని లే
కుఱిక మనంబులోనఁ బగ యూఱడుచందమ యైనఁ బేర్చి యం
దఱమును నెక్కడై కలసి దవ్వుగఁ బాయుద మెవ్వ రెక్కడే
నెఱిగినవారి కల్లఁ దగ నోర్తుము నిశ్చయ మిట్లు దీనికిన్.

వ. అనిన నతండు నవ్విధంబున కియ్యకొనియె జనార్దనుండు జతుగృహదాహంబునఁ
గుంతీనందనులు ద్రుంది రనువార్త విని తాను బరమార్థవేది యయ్యును సుయో
ధనుబుద్ధికి నిజంబు గావించుటకై వారణావతంబునకుఁ బోవుటయు రంధ్రా
న్వేషి యగుటం జేసి.

### శతధన్వుఁడు సత్రాజిత్తుం జంపి శ్యమంతకమణి నపహరించుట.

తే. అలఘుచరితు నత్రాజిత్తు నర్ధరాత్ర, సుప్తుఁడై యున్న వధియించి లుప్తధర్ముఁ
డై నశతధన్వుఁ డతని యనర్ఘ్యదివ్య, వినుతమాణిక్యరాజంబు గొనుచుఁ బోయె.

సీ. తండ్రిఁ జంపినఁ గడుఁ దలఁకి యత్యంతవేగముగ లగుఱ్ఱము ల్గట్టినట్టి
తే రెక్కి చెచ్చెర వారణావతమున కరిగి యాతెఱఁగు నారాయణునకు
సర్వంబు నెఱిఁగించె సత్యభామాదేవి వాసుదేవుండు నవ్వామనయన
మనసులో నున్నయుమ్మలికమ్ము మానెడుపంతంబుమాట లొక్కింత గొఱఁత
పడక యుండంగఁ బలికి యప్పడఁతిఁ గొనుచుఁ
బురికిఁ జనుదెంచి యేకాంతమున హలాంకు
తోడఁ దలపోసి శతధన్వుఁ దునిమి యతని
చేతిరత్నంబు గొనుపని సేయఁ దలఁచె.

వ. ఇట్లయ్యిరువురుం గూడి కీడొనర్ప నుద్యోగించు తెగువ యెఱింగి శతధన్వుండు వారితోడిపోరునకుఁ బెనుఁప్రాపై నిలుచునట్లు గృతవర్మ నడుగం బోయిన నతం డియ్యకొనక బలదేవవాసుదేవుల దెస విరోధంబునకుఁ దానోర్వమి దెలియం బలికె నక్రూరుం గలసికొనువాఁడై న నతండు.

మ. అసురీహారమృణాళహంసము మహేంద్రాంతఃపురీకర్ణప
త్రసమున్మీలనమూలశిల్పి కుమతధ్వాంతార్కబింబంబు మ
ష్పరిసహం బెవ్వనిచక్ర మట్టిహరికిం బ్రత్యర్థియైనిల్వఁగా
వసమే యెంతటివానికిన్ వెఱతు నవ్వైరస్యముం బూనఁగన్.

వ. ఏనతనిశరణాభిలాషకుండ దోషాచరణంబునకు నెట్లు గడంగుదు వెడంగనయి మున్న మీతలంపునం గలసితి నవి యన్నియు నప్రయోజనంబు లనిన శత ధన్వుం డట్లేని నాకు నిక్కడ నన్యుండు రక్షకుండు లేఁడు తొలఁగిపోయెద నీ వీయలభ్యరత్నంబు డాఁప వలయుఁ బ్రాణంబుపయివచ్చునంతటి పోర్మియం దును నెవ్వరికి నెఱింగింపకుండునది యని యొడంబఱిచి యతనిచేతి కిచ్చి యా ప్రొద్ద పురంబు వెడలి పూర్వోత్తర దిశాభిముఖుండై.

శతధన్వుఁడు కృష్ణునకు వెఱచి తురగారూఢుండై పాఱిపోవుట.

క. తనకు నొకనాట శతయో, జనములు చనుహృదయగతిలసత్తురగనితం
బిని కలిమి దాని నెక్కి ప, వనసమగతిఁ జనియె మనసువడఁకఁగ భీతిన్.

ఉ. అంత నెఱింగి శౌరియు సహాగ్రజుఁడై రథమెక్కి యయ్యప
క్రాంతుని వెన్నడిం దగులఁగాఁ దనపోయెడుదవ్వుపోయి తా
నంతటఁ బోవలేక మృతిఁబొందె హయాంగన భోజవర్యుఁడు
ద్భ్రాంతతఁ బాదచారి యయి పాఱె విదేహపురంబుచేరువన్.

క. కనుఁగొని కృష్ణుఁడు బలదే, వున కిట్లను హయములకుఁ దెవులు గడువెనన్మెఁ
జననిచ్చుట గావున నీ, వనఘా కొనిరమ్ము రథము నల్లన వెనుకన్.

తే. విగతవాహనుఁడై నయివ్విమతుఁ డోపు, కొలఁది మెల్లనఁ బాఱెడుఁ గూడమట్టి
పట్టికొనియెద ననిన నబ్బలుఁడు నట్ల, కాక యన డిగ్గ నుఱికి యాకంసరిపుఁడు.

క. క్రొంతదడ వరిగి వెనుకొని, యంతటఁ గడునలిగి యాతఁ డాశతధను న
త్యంతక్రోధంబున మది, శాంతింపక తునియవైచెఁ జక్రముచేతన్.

వ. ఇట్లు తలద్రుంచి శతధన్వుం జేరఁబోయి.

క. తలయును జీరయు నోరు మొ, దలుగా శోధించి చూచి తత్తనువున న
వ్వలసితరత్నము గానఁడ, హలధరుఁడును గూడవచ్చె నంతటిలోనన్.

వ. ఆతం డవ్విధం బతనికిం జెప్పి శతధన్వవధంబు వితథం బయ్యె ననుపలుకుపలికిన నది బొంకను తలంపునఁ గటకటంబడి బలుండు.

య్యకుటిలకర్మ మూర్విగలయంతటికిన్ హితమేను నాత్మ దీ
నికిఁ గడుసంతసిల్లితిని నిక్క మెఱుంగుదు; నింత యెప్పుడున్.

క. నీయొద్దనుండుటయు విను, మాయర్థం బగుటఁ జేసి మది నెఱిఁగియు నెం
దేయదియును బలుకము భవ, దీయగురుత్వంబు బహుమతిక్షమ మగుటన్.

వ. ఈరౌహిణేయుండు రత్నవిషయం బైనయవిశ్వాసంబువలన మాదెస్సం బ్రస
న్నుండు గాకుండు నట్టిదుశ్శంకఁ బరిహరింపంజేయం జిత్తంబునకు సమాధానం
బెప్పుడు లేక యున్నారము మాకుం బ్రియంబుగా నమ్మణిశ్రేష్ఠం బివ్వరిష్ఠవిచా
రుండు చూడం జూపవలయు ననుటయు నక్రూరుం డానారాయణునకు సవిన
యంబుగా నిట్లనియె.

క. శతధన్వుఁడు నాచేతికి, నతులితమణి దాఁపనిచ్చి యరుగుట గల దే
నతిదుర్భర మగువస్తువు, సతతక్లేశమున మోచి జరపితి దినముల్.

తే. ఊరకిచ్చుట గాదది యునికి యెఱిఁగి, యడుగుటయు భక్తి నిచ్చెద నిపుడ యేను
నేఁ డడుగు నెల్లి యడుగు నన్నీరజాక్షుఁ, డనుచు గోరుదు భవదీప్సితార్థకృతియ.

క. ఇదె గైకొను మమ్మణి నీ, మది వలసినవారి కిమ్ము మమ్మధికసుఖా
స్పదహృదయులఁ జేయుము నగ, సదభినుతచరిత్ర యనుచు సంప్రీతి మెయిన్.

వ. తనకట్టినచీరకొంగున నున్నముడి యూడ్చి కాంచనసంపుటంబు దెఱచి సభామ
ధ్యంబు మధ్యందినార్కతేజోవిరాజితం బగునట్లు గావించువిరాజితప్రభావిసరం
బున ననమానం బగునమ్మాననీయరత్నంబు నయ్యదురత్నంబుముందర నివేదిం
చిన నత్యంతలోభనీయం బగుతదీయవైభవంబున.

సీ. బలదేవుఁ డిది నాకుఁ బద్మనాభునకును బొత్తులసొమ్మనుబుద్ధి సేసె
సత్యభామ మదీయజనకునిపడసినయర్థంబు నను జేరు నని తలంచె
నగ్రజుఁ బ్రియురాలి నాత్మఁ జూడక కృష్ణుఁ డొక్కింతవడికోర్కి నుదిలకొనియె
సకలయాదవులును సస్పృహాలోకనస్మేరవిస్మితరసస్తిమితులైరి
వృష్ణివరుఁ డంత నాభోజవీరవరున, కనియె ననఘ యీరత్నంబు నాత్మశుద్ధి
కెల్లచుట్టాలకును నిది యింతసూప, వలసె నింతియ నాదైనవాంఛితంబు.

వ. దీనికిం దాలధ్వజుండును నేనును సత్యభామయు నర్హుల మన్యులకుం బనిగాదు
సకలకాలశుచులును సంభృతబ్రహ్మచర్యులును నగుసుజనులచేత ధార్యమా
ణంబై యిమ్మాణిక్యంబు నిజప్రభావంబుఁ జూపుం గావున నే మెవ్వరము నింత
నియమంబున కోర్వము సర్వగుణసంశుద్ధభావుండవు నీవే తదీయధారణయోగ్యుఁ
డవు నీక యిచ్చితి ననిన నట్లకాక యని సంతసిల్లి.

క. ఆరత్నము గైకొని య, క్రూరుం డదిమొదలుగాఁగఁ గొంకక సమలం
కారముగ బయలు మెఱసి యు, దారతఁ దేజంబుమిగిలెఁ దపనుఁడ పోలెన్.

తే. జలజనాభుమిథ్యాభిశంసనవి ముక్తి, యైనయికథ చదివిన ననుదినంబు
వినినఁ దలఁచిన సడిలేక జనులు సర్వ, దోషరహితులై పొందుచుందురు శుభంబు.

క. అని వైశంపాయనుఁ డ, త్యనుపమయశుఁ డగుపరిక్షిదాత్మజునకుఁ జె
ప్పినపుణ్యకథన మఖిలము, ననతారివిదారి దారుణాసివిభాసీ.

శా. కాంతాఖేలనపుష్పబాణ కరుణాకల్యాణ విజ్ఞానవ
చ్చింతాస్వీకృతశౌరిసత్కృపమఖశ్రీప్రీతగీర్వాణ దు
ర్దాంతోదగ్రశరాసనప్రథితవిద్యాద్రోణ వాణీఘృణీ
ణాంతర్వాణిజనార్చితోజ్జ్వలగుణా యానప్రమవిద్విడ్ఘృణా.

క. రామాయణహరివంశ, శ్రీమన్మధురప్రసంగ సిద్ధ చిరయశ
స్సామర్థ్యకరణనిపుణ, శ్రీమల్లచమూపరేణ్యసేవితహృదయా.

మాలిని. సుజనభజనదుష్టస్తోమనిర్ఘ్నష్టకామా
త్యజనచతురవృత్తిస్థాపనోద్దీపితార్థి
యజనముఖసుకర్మప్రౌఢవాధంగికీర్తి
ధ్వజ కలియుగికృష్ణా దానకేళిసతృష్ణా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్య
ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతం బైన శ్రీహరివంశంబునం బూర్వభాగంబునందుఁ దృతీయాశ్వాసము.

పూర్వభాగము - చతుర్థాశ్వాసము.

క. శ్రీసంభావితవక్షో, భాసురమణిహారకిరణపరిచయచతురో
ల్లాసమృదుహాస యవిరత, భూసురగృహరచితహేమ పోలయవేమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పి నట్లు విచిత్రోపన్యాసవిశారదుం
డైన వైశంపాయనువాఙ్మయుం బభినందించి జనమేజయుం డతని కిట్లనియె.

సీ. యదువంశసంజాతు లగుభూపతుల నెల్లఁ బరిపాటితో వింటిఁ బరమపురుషుఁ
డగుశౌరి సేసినయట్టియాశ్చర్యంపుఁబనులు సవిస్తరఘణితిఁ జెప్ప
నన్నియు విన వేడ్కయయ్యెడు నద్దేవుప్రకృతి యెయ్యది యేమిభంగి వచ్చి
మర్త్యుఁడై పుట్టె నమర్త్యులు గొల్చువంగ సురలోక మేలుచు సురవిరోధు
లాత్మశౌర్యనిరాకృతులై యెదుంగఁ, బరఁగుపరమేశ్వరుఁడు విశ్వభర్తయ కట
కష్టతర మైనమనుజసర్గంబుఁ జొరఁగ, నెవ్విధంబునఁ దనమది నిచ్చగించె.

చ. దితితొలుపట్టి దైత్యకులదేవత దైవతలోకదుస్సహా
ద్భుతభుజుఁ డాహిరణ్యకశిపుస్ఫుటనాముఁ డనామయాకృతిం
గృతయుగవేళఁ జేసె గతకల్బిషుఁడై తప మూర్జితక్షమా
స్మృతిధృతిశాంతిదాంతిముఖసిద్ధగుణంబుల మేటి వీఁ డనన్.

తే. పదునొకండువేలేఁడులు బ్రహ్మచర్య, నియతి దప్ప కమ్మెయి ఘోరనిష్ఠ నడుప
నబ్జభవుఁ డాతనికి మెచ్చి హంసయుక్త, వరవిమానంబుతోసుకోత్కరముగొలువ.

క. జనుదెంచి వేఁడుము వరం, బనిపలికిన మిన్నుదాఁకి సాష్టాంగముగా
వినతి యొనరించి యంజలి, జనితోత్తంసుండు నగుచు సన్నిధి యొప్పన్.

వ. అసురేశ్వరుం డఖిలసురాసురయక్షరక్షోగంధర్వభూతపిశాచోరగమనుష్యతిర్య
క్కులవలనను శైలపాదపశస్త్రంబులచేతను నార్ద్రశుష్కాదులచేతను దనకుం
జావు లేకుండను ఋషిశాపంబులు దన్నుం బొరయకయుండను సూర్యసుధాకర
దహనసలిలగ్రహనక్షత్రదిగ్వ్యాప్యధికారంబులు దాను గైకొని నడుపను శక్ర
వైవస్వతవరుణధనాధ్యక్షపదంబులు తనసొమ్మలై యుండను గామక్రోధమద
ప్రముఖంబులు తనపంపు సేసి వర్తింపను నభ్యర్థించిన నట్ల యొసఁగి బిసరుహాస
నుండు నిజలోకంబున కరిగిన.

చ. తలఁకి నిలింపు లందఱు పితామహుఁ గానఁగఁబోయి దేవ నీ
వలన వరంబు లిట్లు గని వాలినదైత్యుఁడు మమ్ము నింక నే
కొలఁదుల నైఁచునే కరము కొందలపెట్టక యెట్లు కావునం
దలఁపు మొకింత శాత్రవవధంబు విధంబు త్రిలోకనాయకా.

వ. అనినం బరమేష్ఠి వారి నుపలక్షించి.

చ. అసుర తపంబుపేర్మి యిటు లారయవచ్చిన నెమ్మెయి న్వరం
బొసఁగక పోవరాదు వినుఁ డున్నతిమై నిటమీఁద వాఁడు న
య్యసదృశనిష్ఠకున్ ఫల మహార్యముగా భుజియించు పుణ్యమె
ల్ల సమసిపోవఁగాఁ జెడు బలం బఱి విష్ణుపరాక్రమంబునన్.

క. అందాఁక నోర్వుఁ డెట్లయి, నం దత్కాలప్రవృత్తి నావుడుఁ జని రా
బృందారకు లసురయుఁ బెం, పొందినవర మర్థిఁబడసి యుప్పొంగుమదిన్.

సీ. అమరేంద్రు భంగించి హవ్యాశనుని గాసిచేసి యంతకుని నిర్జించి నిరృతి
దండించి వరుణుని గండడఁగించి సమీరు మర్దించి కుబేరుఁ గేరి
యీశాను నొత్తి ఫణీశులఁ ద్రొక్కి సాధ్యుల నొంచి సిద్ధుల నుక్కడఁచి
వసువుల స్రుక్కించి వారిజాప్తుల యేపు మాపి యశ్వినులయాటోప ముడిపి
గరుడగంధర్వఖేచరపరులఁ బెక్కు, గతులఁ గారించి యప్సరోగణము నేలి
యధికు లగుతాపసుల నెల్ల నతకరించి, తాన యఖిలలోకాధిపత్యంబు నొందె.

వ. అంత.

ఉ. భ్రష్టత నొంది దేవతలు బామరిదుగ్ధపయోధిమధ్యవి
స్పష్టభుజంగశయ్యఁ ననుభావసమాహితసుప్తి నొప్పు శి
ష్టేష్టవిధాయి విష్ణు జగదీశ్వరు నార్తశరణ్యు సత్కృపా
దృష్టిసమగ్రుఁ జేరిరి ప్రదీప్తపరాక్రమచక్రశోభితుల్.

తే. చేరి దైన్యంబుతోఁ దమచెడ్డచేటు, లన్నియును విన్నవించి లోకాధినాథ
యజుఁడు మొద లగుసర్వభూతావలికిని, నిక్క మెవ్వరు శరణంబు నీవు దక్క.

క. దైతేయుపటుచుబాముల, కేతెఱఁగున నోర్వఁజాల మిట నీయడుగుల్
ప్రీతిం గొలుచుచు నుండెద, మాతల నీవెట్టు లుంచె దటుసూడు దయన్.

క. దితిసూనుఁ దునిమి మఱియును, దితిజకులము పీఁచమడఁచు తేఁకువ మదిఁ బూ
నితి వేని మమ్ము నేలుట, సత మగు నమ్మెయికిఁ గరుణ సమకొలుపఁ గదే.

వ. అని యభ్యర్థించినఁ బాంచజన్యధరుండు సురవరులదెసం బ్రసాదసుముఖుండై.

శా. మీమీసంపదలుం బదంబులును నెమ్మిన్ గ్రమ్మనం గ్రమ్మఱం
గామీ సొమ్మగు నెమ్మనమ్మునఁ గలంకల్ మాను డింకన్ సమ
స్తామర్త్యోత్తములార భవద్రిపుని నేఁ డస్మద్భుజాభోగిపీ
తాముఁడాలాసుసమీరుఁడై పడఁగ బూర్ణానందతం జూడుఁడా.

క. ఇదె పోయెదఁ జిత్రజయా, భ్యుదయము నొందెదఁ ద్రిలోకములకును భద్రం
బొదవించెద నని యప్పుడ, కదలి కరరుహాకరణాదికాకర్షతుఁడై.

విష్ణుదేవుఁడు నృసింహావతారంబున హిరణ్యకశిపుం జంపుట.

సీ. స్కంధవిధూనవస్ఖలితసటాసమీరమున ఖేచరవిమానములు దూల
దంష్ట్రాసముద్గతదహనచ్ఛటానిపాతంబున దిగ్వివరంబు లెరియఁ
గ్రోధతరంగితఘోరనిశ్వాసవేగమునఁ బాథోధి పూరములు గలఁగ
దర్పసంభృతమహానాదగ్రహుంకార ఘోషమున బ్రహ్మాండోదరములు వగులఁ
గలుషనేత్రకనీనికాకపిలరోచు, లరుణశశభృన్మరీచుల నాక్రమింప
నమరు నరసింహమూర్తియేపారఁ దాల్చి, విభుఁడు దైతేయునెదుర నావిర్భవించె.

వ. అట్టిదారుణరూపంబు నాలోకించి యాలోకకంటకుండు కంటకితాంగుం డగుచు
భయవిస్మయంబుల మునింగియుఁ గలంగక యనేకదనుజభటసహాయుండై యె
దిర్చినం గార్చిచ్చు మృగంబులం బొదువుభంగిఁ బ్రిదిలిపోనీక పట్టి యిట్టలం
బగుబలంబున.

మ. గరుడత్రోటికఠోరఘోరనఖనిర్ఘాతంబులన్ వైరిపే
రురమున్ గ్రోద్ధతిఁ జీరి నెత్తురులు సర్వోర్వీనభోది క్కటీ

పటిమాహంబులనెల్ల వెల్లిగొనఁ బైపైఁ జల్లి ప్రేవుంబొదల్
గర మాటోపముతో నతండు పొరి నాకర్షించె హర్షించుచున్.

వ. ఇట్లు శత్రువధం బాపాదించిన.

క. శితనారసింహనఖరా, హతదైత్యమహాపహారంబునఁ ద
ద్వితయయ్యె ననఁగఁ బరిశాం, తత నొందెం ద్రిలోకపీడ తత్క్షణమాత్రన్.

క. సురలును మునులును ముదమున, సరసింహు ననహ్యారంహు నానావిధవా
క్పరిణతిఁ బ్రణుతించుచు ని, ర్భరభక్తిప్రణతికరణపరులై రర్థిన్.

వ. అయ్యాదిదేవుం డట్లు దేవపదంబులు ప్రతిష్ఠించి యుండం గాలాంతరంబున హిరణ్యకశిపుసుతుమనుమం డగువిరోచనుతనయుండు బలి యనువాఁడు బలియుండై బలసూదనుసంపద యాక్రమించిన.

వామనావతారంబు సంక్షేపరూపంబుగాఁ జెప్పుట.

తే. అదితి నిజపుత్రహితముగా నాదిదేవు, వరసు విష్ణువుగుఱించి దుష్కరతపంబు
సేయుటయు మెచ్చియాపుణ్యశీలకుదయ, మయ్యె వామనాకారుఁడై యవ్విభుండు.

వ. ఇట్లుదయించి యింద్రానుజుం డితం డుపేంద్రుం డనఁ బరంగి బ్రహ్మచారివేషంబున నధ్యయనంబు సేయుచుండె నక్కాలంబున బలిదైత్యుండు నిత్యం బగు విష్ణుభజనతాత్పర్యంబును నార్యస్తవనీయం బగుదానశీలత్వంబును ననాకులం బగుధర్మాచరణంబునుం దనకు నైజంబులై వెలయ నశ్వమేధం బొనరింప నుపక్రమించిన.

క. ఆతనిపాలికి నర్థి, త్వాతిశయము దోఁప నంబుజాక్షుఁడు దైత్య
వ్రాతభయదవిక్రముఁడు స, నాతనవైభవుఁడు వంచనం జనుదెంచెన్.

వ. అవ్విధంబు ప్రాజ్ఞులు సూచింపకమున్న యెఱింగి.

చ. హరి యఖిలైకదాత పరమాద్భుతలక్ష్మికి ధామ మస్మద
ధ్వరమున నర్థియై యడుగ ధన్యుఁడఁ బుణ్యుఁడ గణ్యవస్తుసం
భరణుఁడ నేన యంచుఁ దనభావమునం బ్రియమందు దానవే
శ్వరు నడిగెం బదత్రితయసమ్మితధాత్రి యతండు వేడుకన్.

వ. విరోచనతనయుండును బహుమానప్రదానకలనంబునం దనమనోరథపూరణంబు నాపాదించిన నవ్వటుకుమారుండు.

తే. ఇనునిఁ దనమౌళిరత్నంబు నిద్ధహార, తరళరత్నంబు గటిసూత్రపరిధిమధ్య
రత్నమును నూపురాగ్రవిరాజమాన, రత్నమును జేయుచును బ్రవర్ధనము నొందె.

వ. ఇట్లు విక్రమమాణుం డైనయాత్రివిక్రమువిక్రమంబు సైరింపక విప్రజిత్తి యుత్వశిరుం డశ్వపతి యదృశ్యకుండు వేగవంతుండుం బాష్కరుండుఁ గుంభకుండు గగ

నప్రియుండు సమ్మతుండు శరభుండు బృహత్కీర్తి మహాజిహ్వుండు శంబరుండు విక్షురుండు వృత్రుండు ప్రతాపనుండు వాతాపి యసిలోముండు గేశి కాలదమనుండు కరాళుండు రాహువు మొదలుగాఁగలయసురముఖ్యులు కూర్మకుక్కుటబకమకరసృగాలబిడాలాద్యనేకవికృతవక్త్రంబులు బహుబాహుచరణమస్తకంబులుం గలవికటకాయు లగురాక్షసులతోడం గూడి పరిఘపట్టిసప్రాసకృపాణప్రముఖప్రహరణంబులు తాల్చి యతనిఁ జిక్కుపఱచుటకై కడంగి పొదివినఁ బదజానుకూర్పరకరతలాహతుల నందఱం దూలించి యవ్విశ్వరూపధరుండు విశ్వంబు నాక్రమించి.

క. అవలీల నసురనాయకు, నవమానితుఁ జేసి త్రిభువనాధీశ్వరవై
భవ మొసఁగె నింద్రునకు ముని, నివహంబులు ప్రస్తుతింప నిఖిలము నలరన్.

వ. వామనావతారం బాకర్ణించితి వింక జామదగ్న్యనవతారంబుఁ జెప్పెద వినుము.


పరశురామావతారంబు సంక్షేపరూపంబుగాఁ జెప్పుట.

మ. అత్రిప్రోద్భవుఁ డప్పుతాత్ముఁడు త్రిలోకారాధనీయుండు ద
త్తాత్రేయుం డనుసంయమీంద్రుఁడు సరోజాక్షావతారంబ యి
ద్ధాత్రిం దొల్లి సమస్తధర్మములు విధ్వస్తంబులై పోయినం
జిత్రైశ్వర్యముపేర్మిఁ గ్రమ్మఱఁ బ్రతిష్ఠించెన్ మునిశ్లాఘ్యుఁడై.

మ. అతనిం బుణ్యయశోవిజృంభితుఁ గృపైకాయత్తచిత్తాబ్జునిం
గృతవీర్యాత్మజుఁ డైనయర్జునుఁడు భక్తిం గొల్చి తేజస్సము
న్నతదోస్తంభసహస్రముం సకలగోత్రామండలైకాధిక
ర్తృతయున్ యోగ్యవిభూతియుం బడసి యుద్దీపించె దీప్తస్థితిన్.

సీ. జమదగ్నిసుతుఁ డగ్నిసదృశతేజుఁడు రాముఁడై జనియించి విశ్వాత్ముఁ డాద్యుఁ
డాకార్తవీర్యు నహార్యధైర్యుని ననేకాత్మజబంధుసహాయు ఘనుని
నాజిలోఁ దొడరి యుత్తేజితపరశుధారాముఖంబున నతిరౌద్రభంగిఁ
దునుమాడి యాతనిఁ దొడఁగి పారావారపరివేష్టితాఖిలధరణిఁ గలుగు
నరపతుల నెల్ల వరుసతో నిరువదొక్క, మాఱు మ్రక్కించినెత్తురుమడువులయిదు
నిలిపి కోపంబు మాని యస్ఖలితనియతి, నశ్వమేధయాగంబు రమ్యముగఁ జేసె.

వ. అమ్మహాధ్వరంబునందు.

మ. అమితస్వర్ణమణిప్రతానము లసంఖ్యస్యందనాశ్వేభగో
సముదాయంబు లగణ్యధాన్యగృహవాసస్తల్పదాసీసమూ
హము లత్యుత్తమయోగ్యభూసురుల కుద్యద్భక్తితో నిచ్చె దా
నముగా నాదివదాన్యుఁ డీతఁ డని తన్ వర్ణింపఁ ద్రైలోక్యమున్.

వ. మఱియుఁ గశ్యపమునీంద్రునకు నఖిలక్షోణియు మఖదక్షిణగా నొసంగి కృష్ణా జినోత్తరీయుండును జటామకుటమండలియు నై మహేంద్రపర్వతంబునందు సర్వ లోకహితార్థంబు నేఁడును దపంబు సేయుచున్నవాఁ డట్టిజామదగ్న్యజనన వ్యాపారంబులు నివృత్తంబు లైనయనంతరంబ.

శ్రీరామావతార క్రమంబు సంక్షేపరూపంబునం జెప్పుట.

క. ఇరువదినాలవత్రేతను, హరిదశరథభూమిపతికి నాత్మవిభూతి స్ఫురణలు చతురంశములుగ, విరచించి జనించె భువనవిప్లవహృతికిన్.

వ. అన్నాలుగుమూర్తులందు నగ్రజుండు.

మ. అమలాంభోజదళాక్షుఁ డక్షతఘనశ్యామాంగుఁ డాజానుదీ ర్ఘమహాబాహుఁడు సంహతోరుకఠినోరస్కుండు సింహోరువి క్రమణుం డుద్ధతశౌర్యధైర్యకలనాకల్పుండు కళ్యాణధీ రమణీయుండు వెలింగె రాముఁడు గుణారాముండు భూమండలిన్.

ఉ. శైశవకేళియంద తనసత్త్వము లోకము ప్రస్తుతింపఁగాఁ గౌశికుఁ డస్త్రకోటి యొసఁగంగఁ బ్రదీప్తతనొంది తన్మనః క్లేశకరున్ సుబాహుఁ డనుకిల్బిషరాత్రిచరున్ ససైన్యుఁ గీ న్నాశునిఁ జేర్చి పేర్చె జననాథతనూజుఁ డజేయుఁడై యనిన్.

క. వైదేహకన్య పురరిపు, కోదండధ్వంసశుల్క గోరి యతనిచే తోదయిత యయ్యె సాక్షా, చ్ఛ్రీదేవి యయోనిజాత సీత యనంగన్.

చ. అనుపమనూత్నయౌవనమునంద పితృప్రియకారియై విభుం డనుజుఁడు ధర్మపత్నియు నిజానుగమం బొనరింపఁ గాననం బునఁ బదునాలుగేఁడులు తపోనియతిన్ వసియించి దేవతా మునిజనరక్షణక్రియ లమోఘముగా నొనరించె నన్నియున్.

క. ఖరు మారీచునిఁ గూల్చుట, విరాధునిఁ గబంధు శాపవిచ్యుతిలాభ స్ఫురితులఁ జేయుట యాదిగఁ, బరఁగినయవి తద్వనాంతపర్యటనవిధుల్.

తే. భూరిబలసత్త్వముల నెందుఁ బొగడుగనిన, వాలి వధియించి సుగ్రీవువానరేంద్ర పదవియం దుంచె నద్దేవుఁ డుదధిలోన, నిలిపె సేతువు నాశ్చర్య మొలయఁ బేర్మి.

వ. మఱియు నాత్మదారహరణదురితాపరాధి యైనవాని నహీనతపోవిభవలబ్ధవిచిత్ర ప్రభావు దేవాసురయక్షరక్షోభుజగగంధర్వాదిసకలదుర్జయు నపరిమితదనుజ కోటిసహస్రపరివారు దారుణబాహువీర్యసమగ్రు దశగ్రీవు నుగ్రసమరంబున సమయించె నివి యమ్మహాత్మునివిక్రమంబులు తదీయానుజు లగులక్ష్మణాదు లిం ద్రజిల్లవణాదిసురవిరోధుల వధియించి రిట్టిమహిమచే నత్యంతమహితుండై

యతం డయోధ్యాపురంబున నభిషేకంబు నొంది యశ్వమేధావభృథస్నాతశిర స్కుండై మహాతపస్వు లగుభూసురులకు గోసువర్ణగజరథతురగగ్రామకన్యా దాసదాసీగృహాదిదానంబులవలన నతిసమృద్ధి గావించి సమ్యక్ప్రజాకల్పనంబునం బరమధర్మంబు వడసె నాతనిరాజ్యంబున.

సీ. విషశస్త్రజలవహ్నివిమతతస్కరబాధ లొంద వెన్నఁడు భర్త లువిదలందు నతివలు పతులందు నవిలంఘితాచారు లమరువర్ణంబులు నాశ్రమములు నాత్మీయధర్మంబులం దనాలస్యతఁ దనరుదారుఁ బ్రాణిజాతముల కెల్ల నెలయ దకాలమృత్యుభయంబు దెవుళులు కలఁకలు కఱవులు గలుగ వెపుడు నఖిలజనులు ననేకవర్షాయుషులుస, హస్రసంతానయుతులు సహస్రవిధులు నగుచు మోదింతు రెచట లే వకృతదంభ, దర్పకార్పణ్యలోభాద్యధర్మగతులు.

క. మునులును సురలును వేడుక, మనుజులలోఁ గలసి మెలసి మనుచుండుదు రెం దును గుడువుఁడు గట్టుఁడు గొనుఁ, డనుమాటలు వినఁగవచ్చు నఖిలదిశలన్.

క. పదివేలును బదినూఱులు, నెదవినలెక్క యగునేఁడు లుర్వీస్థలిపైఁ ద్రిదశహితార్థముగ నిలిచి, పదపడి రఘువిభుఁడు నిత్యపదవిం బొందెన్.

వ. రామావతారానంతరం బయ్యనంతవిభవుం డగులక్ష్మీవిభుండు యాదవరామత్వం బును గృష్ణత్వంబు నొందె నందుఁ బ్రలంబముష్టికమైందద్వివిదవధంబును నరిష్ట కేశికువలయాపీడచాణూరకంసధ్వంసనంబును మురనరకశిశుపాలయవనసాల్వ పౌండ్రహననంబును బాణపరాభవంబును మఱియు ననేక దుష్టపార్థివప్రమాపణ కరణోద్యమంబును మొదలయినవి యద్దేవుదివ్యకర్మంబు లింకం గలియుగాంతం బునఁ గల్కృత్మకుండై విష్ణుయశుం డనుపేర నవతరింపంగలవాఁడు.

చ. హరియవతారసంకథన మాగమసమ్మిత మాద్యసంయమీ శ్వరహృదయానుమోదనముసన్మతిఁ బ్రాంజలియై పఠించినం దిరముగ విన్న నాపదుదధిం దరియించి సమస్తమంగళ స్ఫురణము లెల్లఁ గాంచి తగఁ బొందుఁ దుదిన్ హరిలోకవాసమున్.

వ. అని యుపన్యసించి వైశంపాయనుండు జనమేజయునితోఁ ద్రివిక్రమావతార శోభితుం డైనవిష్ణుపరాక్రమంబు లింకనుం గీర్తించెద విను మని యిట్లనియె.

దేవదానవులకుజరిగిన తారకామయంబను యుద్ధప్రకారము.

తే. అనఘ కృతయుగంబునందు వృత్రధ్వంస, మయినపిదపఁ దారకామయంబు నాఁగఁ జెల్లె నొకరణమ్ము దేవతలకు, దానవులకు నధిక దారుణముగ

క.. అందు సురారులచేతం, గ్రందుగ సురసిద్ధయక్షగంధర్వాదుల్ సందళితదేహులై భీ, తిం దూలి తలంచి రాదిదేవుముకుందున్.

క. ఫేనేతులనిడు పగుబా, ణాసనము గుణస్వనోగ్రమగునట్లుగ ను
ల్లాసమునఁ ద్రిప్పుచును ఘో, రాసురుఁడు వరాహుఁ డొప్పె నఖిలధ్వజినిన్.

క. విక్షరుఁడు క్రోధదహన, ప్రక్షురణోగ్రాక్షుఁ డగుచుఁ బటురథవేగ
ప్రక్షుభితక్షితి యగుగతి, వీక్షింపఁగ విస్మయముగ వెస నని కమరెన్.

క. అష్టాదశగజరభసా, క్లిష్టం బగురథముమీఁదఁ గేలఁ గడిఁదివి
ల్లిష్టమునఁ బట్టి మెఱసెన్, దష్ట యనిష్టభటమథనతత్పరశక్తిన్.

తే. శ్వేతుఁ డనఁగ విశృంఖలశ్వేతహరుల, యరదమున విప్రజిత్తికి నాత్మజుండు
శ్వేతరత్నవిభూషణశ్వేతవసన, లసితుఁడై శ్వేతగిరిమాడ్కి నెసఁగెఁ జూడ.

క. బలిసూనుఁ డరిష్టుం డను, బలియుఁడు బలవద్గజేంద్రపరికల్పన యు
జ్జ్వలమై యొప్పఁగ నార్చుచుఁ, బొలుపారె సతోయజలదపోతంబుక్రియన్.

తే. కడిఁదియసుర బాణుండును గడఁగి మేఘు, వాహ మభినవగమననిర్వాహలీల
మొఱయునట్లుగఁ జూపుచు మెఱసె సైన్య, మధ్యమునఁదుల్యుఁడై వియన్మధ్యరవికి.

క. లంబాభరణంబులతో, లంబుఁడు దానాతిభరవిలంబితగమన
స్తంబేరమంబు నెక్కెఁ బ, లంబులకుం దిలకమయ్యె లలితవిభూతిన్.

తే. సైంహికేయుండు దీప్తోరుసింహవక్త్రుఁ, డహితబలముల మ్రింగుదు ననువిధమునఁ
జెలఁగి సెలవులనాకుచుజిహ్వఁ దార, నేత్రముల రౌద్రరసరేఖ నిర్వహించె.

వ. మఱియు ననేకు లనేకవాహనంబులతోడ ననేకాయుధహస్తులై నడచి రిట్లు గూడినదానవానీకంబు సురపతాకిని కభిముఖంబుగా మోహరించెం బ్రవర్తితరణతూర్యరఘోషభీషణసంకులంబు లగునబ్బలంబులు రెండును బ్రళయమారుతోద్ధూతతరంగనికరంబు లగులత్నాకరంబు లొండొంటిం దాఁకినతెఱంగునఁ గదియ నడచె నాసమయంబునఁ బూర్వాధిష్ఠితం బగురథంబు డిగ్గి.

త్రివిక్రమదేవుండు గరుడవాహనరూఢుండై దేవతలకు సహాయంబగుట.

సీ. పసిఁడికెంధగడు పైఁబఱపినయట్లు దిక్కులఁ బక్షకాంతి పైకొలుపువాని
ముందట నెఱసంజమొలపించుచంచుదష్టోరగమణిదీప్తి నొప్పువానిఁ
బ్రళయాగ్నిశిఖలు పైఁబ్రసరించుక్రోధసంరక్తవిలోచనప్రభలవాని
నిఖిలాండములు నొక్కనెగవున దాఁటంగఁ గలయద్భుతోగ్రవేగంబువాని
వైనతేయు నింద్రవజ్రావమానన, చండకాయు నెక్కి చక్రశార్ఙ్గ
గదలు దాల్చి కడిమిఁ గడఁగె సర్వాభయ, ప్రదుఁడు శ్రీవిభుండు బవరమునకు.

వ. అద్దేవునకుం దలకడచి పాకశాసనుండు లోనగులోకపాలురు సకలసురగణంబులం గొని దనుజనివహంబులం దలపడిన నసురలు నసహ్యారంహస్సంపాతంబున నిలింపులం గైకొనక తఱిమిన.

తే. కరులుకరులును హరులునుహరులు నరద
ములునునరదములును గాలుబలము కాలు
బలముఁ దాఁకంగఁ గయ్య మగ్గలికఁ జేర్చె
రెండుమొనలకు నతిరౌద్రరేఖ వెలయ.

మ. పరిఘప్రాసశరాసిశక్తిముసలప్రవ్యగ్రశస్త్రౌఘని
ర్భరనిర్భిన్నశరీరులై దితిసుతవ్రాతంబుచే దివ్యులున్
సురసంఘాతముచేత దానవులు నస్తోకంబులై నెత్తురుల్
దొరఁగం బుష్పితకింశుకోజ్జ్వలత విద్యోతించి రేకాకృతిన్.

వ. తదనంతరంబ.

ఉ. ఏపున దానవు ల్మిగిలి యొందును వేలుపుమూఁకఁ గ్రూరమా
యాపరికీర్ణపాశనిచయంబులఁ గట్టినఁ జేతులాయుధ
వ్యాపృతి దక్కఁ నంఘ్రులు ప్రవర్తనశూన్యత నొంద వాహముల్
ప్రోపఱి నెల్లవారును బ్రభూతభయార్తిఁ గలంగి రయ్యెడన్.

ఉ. అంతయుఁ జూచి గోత్రభిదుఁ డాత్మవిభూతిఁ దదీయమాయ పెం
పంతయు మాన్చి యంధతమసాంబకపఙ్క్తుల నంబరక్షితి
ప్రాంతము లెల్లఁ గప్పుటయుఁ గన్నులఁ దమ్మును గానలేక వి
భ్రాంతతఁ బొంది తూలెడివిపక్షులఁ గూల్చిరి పేర్చి నిర్జరుల్.

చ. అసురులు సావఁగాఁ గని తదగ్రణి యైనమయుండు రోషసం
ప్రసరకఠోరనేత్రశిఖి పర్వఁగ నౌర్వనిచేతిసృష్టియై
యెసఁగెడుమాయ యప్పు డెలయించినఁ బుట్టె యుగాంతసంభృత
ప్రసభకృశానుతుల్య మగుపావకసంచయ మద్భుతోన్నతిన్.

ఉ. ఆతీవ్రానలుపేర్మి వాసవతమిస్రాస్త్రప్రభావంబు ని
ర్ఘాతంబై చెడ నంతఁ బోక యది యొందుం దానయై పర్వి స
ర్వాతంకంబుగఁ బ్రేల్చఁగాఁ దొడఁగె దేవానీకమున్ దానవ
వ్రాతంబుల్ సెలఁగెం గలంగి విబుధు ల్వార్ధీశ్వరుం జేరినన్.

వ. దివస్పతి యయ్యాపదకుం బ్రతీకారం బవ్వరుణు నడుగుటయు నతం డిట్లనియె.

సీ. విను మౌర్వుఁ డనుమహాముని తొల్లి బ్రహ్మచర్యవ్రతనిష్ఠుఁడై యధికతపము
కడుదీర్ఘకాలంబు నడుపంగ జగములకెంతయు భయ మైన ఋషులు సురలు
నాతనిపాలికి నరుగుదెంచిరి హిరణ్యకశిపుఁ డాదిగా నసురతతియుఁ
జనుదెంచె నిట్లు గూడినవారలందఱు నమ్మహాత్మునితోడ ననఘ యిట్లు
నీవు పిన్నప్రాయంబున నెఱియ బ్రహ్మచారివై నిష్ఠ సలుపంగ సకలకులముఁ
జెడదె విచ్ఛిన్నమూలమై సిద్ధమునులు, వినవె పత్నీసమేతులై కనిరి సుతుల.

క. అలజడియె కాక నీకీ, నిలుకడ నెకమేలు గలదె నిజము వినుము మా
పలుకులు సంతతిఁ బడయం, దలఁకొను మనుటయు నతండు దరహాసముతోన్.

వ. వారల నందఱం గనుంగొని యిట్లనియె.

తే. బ్రహ్మయోనిసంజాతుఁడై బ్రహ్మవిద్య, యలవరించుచు బ్రహ్మంబు నాత్మఁ జూచి
బ్రాహ్మణుఁడు బ్రహ్మచారియై పరఁగవలదె, బ్రహ్మమైనఁ జాలు నెయట్టిభవ్యుఁ గలఁప.

వ. వేదాధ్యయనయజనప్రజాసముత్పాదనంబు లనుమూఁడు తెఱంగులు ఋణత్రయమోక్షణోపాయంబులై గృహస్థులకుం బొల్పడినవి యేము వనస్థులమై యున్నారము నిరాహారులు పవనజలాదిభోజనులు నశ్మకుట్టాశులును దంతోలూఖలులుం బంచతపులు నగుట వానప్రస్థధర్మంబు పరమధర్మంబు మాకు బ్రహ్మచర్యంబు మున్నిడుకొని పరమగతిం బ్రాపింపవలసి యుండు.

క. వినుఁడు తపంబును ధర్మం, బును వ్రతమును యోగచరము ను నిష్ఫలమై
చను బ్రహ్మచర్యనిష్ఠకు, ననుకూలుఁడు గానిఖలున కని రాదిమునుల్.

క. తరుణీసంగమ మెక్కడ, యిర వగుయోగదశ యెక్కడెయ్యారికి నే
తెఱు గజితేంద్రియుఁ డగుదు, శ్చరితునియోగంబు దంభసంజ్ఞము కాదే.

వ. పరమేష్ఠి తనబ్రహ్మచర్యంబు పొలివోవక యుండ మానసు లగునాత్మజుల సృజియించె మీరు బ్రహ్మచర్యంబు గాదని నిందించితిరి సాధువు లయ్యు నసాధువులుం బోలె నిట్లు పలుకం దగునె నన్ను సంతతి వడయు మనియెదరేని భవద్వచనంబు సేసెద నట సూడుం డని పలికి యతండు.

క. తనతపముపేర్మి ననపా, యనిరూఢం బైనకాయ మమరంగ హుతా
శనునందుం దొడయొక్కటి, గొనకొని మథియించె విశదకుశకాండమునన్.

ఔర్వుండను మునివలన నౌర్వానలంబు సంభవించిన ప్రకారము.

వ. అబ్బంగి నరణికరణి మథియింపఁబడు నయ్యూరువువలన నౌర్వుం డనుపేర నిరింధనుం డగునసలుండు తనయుండై జనియించి యాకసంబు దాఁకినయెఱమంటలు దెసలం బొదువ నెండొండఁ బెరుగుచుం దనతండ్రి యగునౌర్వమహాముని యెదుర నిలిచి.

క. కడుఁ బెల్లగునాఁకలి నా, యొడ లెరియింపంగఁ దొడఁగె నొక్కట జగముల్
పొడిపొడిగా దరికొనియెద, నెడపక యించుక యనుజ్ఞ యిమ్ము మహాత్మా.

వ. అనునవసరంబున లోకపితామహుండు సనుదెంచి యౌర్వునిచేత నభివాదితుండై నీపుత్రున కాహారంబును నివాసంబును నొసంగెద జగద్దాహంబునకుఁ దొడంగక యుండ వారింపు మనిన నతండు దేవా యేను గృతార్థుండ నైతి నిబ్బాలునిదెసఁ ద్రైలోక్యనాథుండ వగునీవు భావంబు సదయంబుగా నిలుపుట గడవ మే లెయ్యది యట్ల చేయుము ననుటయు నవ్విశ్వగురుండు.

ఉ. అంబుధిలోన బాడబముఖాకృతి నీతఁడు దాల్చి త్రేల్పుఁ దో
యంబులు గ్రోలుచుండుఁ బ్రళయావధియందు మదీయగాత్రతే
జంబును దన్నుఁ బొందఁగ ససహ్యసముద్ధతితో సమస్తలో
కంబులు నీఱుసేయు నిదికార్యము నావుడు నమ్మునీంద్రుఁడున్.

వ: అవ్విధంబ యొనర్పం గోడుకు నాజ్ఞాపించె నతండును దనతేజంబు లోకబాధ
కంబు గాకుండ నుపసంహరించి సాగరంబునకుం జనియెఁ జతుర్ముఖాదులు తమ
తమనెలవుల కరిగిరి హిరణ్యకశిపుఁ డౌర్వునిం బూజించి సర్వాంగప్రణతుండై.

తే. అజుఁడు సనుదెంచి ప్రార్థించునట్టితపము, లోకమున నెవ్వరికిఁ జెల్లు నీక కాక
యేను భవదీయశిష్యుఁడ నెఱరునొందు, నప్పటికి రక్ష యగువిద్య యానతిమ్ము.

వ. అనిన నమ్మహాతపోధనుండు నీవుసర్వభువనజైత్రుండవు మిత్రుండవై నన్నాశ్ర
యించితి గావున మత్పుత్రుచేత నిర్మితమైనయనింధనాగ్నిరూప యగుమాయ
నీకిచ్చితి సోమస్పర్శనంబు దక్క దక్కినయెయ్యవియు దీనికిం బ్రతికారంబులు
గావు నీ యన్వయంబున జనించినవారి కెల్ల రిపునిగ్రహం బొందినయప్పుడికి నిది
వశగతంబై యుండు ననియె నట్లు దైత్యపతివడసినయవ్విశేషం బిప్పుడయ ప్ర
యోగంబున నస్మద్బాధకం బైనయది.

క. సితకరునిఁ బనుపు మేనును, నతఁడు నయిన నిపుడ దీని నడఁతు మఖిన నా
శతమన్యుఁ డబ్ధిపతిభా, షితములకుం బ్రీతుఁడై శశిం జూచి తగన్.

వ. అవ్విధం బతని కెఱింగించి.

సీ. అంభోధిసుతుఁడ వసంతరసోదయంబులకుఁ గర్తవు సర్వభూతములకుఁ
బోషకుండవు సమస్తౌషధీవిభుఁడవు యజ్ఞంబులకుఁ బ్రాణమై తలిర్తు
సురలకు నాధారమై శోభిల్లు దాత్మవై యోగీశ్వరులకు మృత్యువు హరింతు
భూచ్ఛాయ మచ్చగాఁ బొలుపారుతను కాంతి ప్రసరించి తిమిరంబు పరిభవింతు
నీమహత్త్వంబు మునివర్ణనీయ మట్లు, గాన దివిజులకైనయక్కటి దొలంగఁ
జేయు మిప్పాశపాణియు శీతకిరణ, నీకుఁదోడ్పడు ననవుడు నెమ్మి నతఁడు.

వ. పాకశాసనుశాసనంబు గయికొని దనుజానీకంబుపైఁ గడంగి.

మ. స్ఫురదాత్మీయమయూఖముల్గలయ నంభోభృత్పథం బంతయుం
బరఁగంజేసిన మాసె నౌర్వదహనస్ఫారాకృతిం గ్రాలుదు
ర్భరమాయావిసరంబు దానవులదర్పస్ఫూర్తియున్ డించె న
ట్లరుదై యొప్పెడుసేతఁ జేసి విధుఁ డుద్యద్ధాముఁడై వెండియున్.

మ. క్షితి యాకాశము దిక్కుల న్దొలివి సూడ్కిం జెందనీకెందు ను
ద్ధతసాంద్రోద్ధతిఁ బర్వుదుర్విషహనీహారంబు పూరించి భూ

రితరారాతిబలంబులం బొదివి మూర్ఛిల్లన్ విభేదిల్లఁ గం
పితచేష్టన్ దురపిల్ల విహ్వలదశన్ భీతిల్లఁ జేసెన్ వెసన్.

క. హిమకరుఁడు గురియుమంచున, బ్రమసి ముడుఁగుదైత్యకోటిఁ బాశాభిహతిన్
సమయించె వరుణుఁ డవ్విధ, మమితాద్భుతకారి యయ్యె నాలోకింపన్.

వ. ఇత్తెఱంగునం బ్రాలేయపాశప్రహరణులై నయయ్యిందుప్రాచేతసులచేత నచేత నంబై తూలు దైతేయసైన్యవ్రాతంబులఁ జూచి మయుండు క్రమ్మఱ నాత్మీయ సుతుండు క్రౌంచుండు నిర్మించినపార్వతి యనుమాయ గీర్వాణులదెసఁ బ్రయోగించిన నది ప్రచండగండశైలకరాళంబును బ్రబలపవనోద్ధూతపాదపోత్కట కూటంబును బ్రకుపితపంచాస్యవ్యాఘ్రఘోరకుహరంబు నగుపర్వతచయంబు సర్వదిశలం బుట్టించిన.

తే. కోటిరాలు వచ్చి కూలె మ్రాఁకులు వచ్చి, పొదివె సింగములును పులులు వచ్చి
కలఁచె నట్టిభంగి గాసియై రమసలు, మాసెఁ జంద్రవరుణమహిమపేర్మి.

క. తలలు వగిలియునుజేతులు, సలిసియుఁ గాళులును దొడలునడుములుఁ బార్శ్వం
బులు నొగిలియువాహనములు, నలుఁగులుమురయ్యెనులిసెననిమిషబలముల్.

క. సరసిజనాభుఁడు దక్కఁగ, సురనివహముసంపు రూపుసొం పెడలనివాఁ
డరిదిగ వెదకినలేఁడ, ప్పరుసునసెంతయునునెడగు పాటిలినతఱిన్.

వ. అగ్నిమారుతులం బిలిచి విష్ణుండు మీరిమ్మాయమాయునట్లుగా నాత్మీయతీవ్రత సూపి యేపారుం డని పనిచిన.

శా. దీప్తజ్వాలము లొక్కపెట్ట దిశలం దీవ్రాను బంధోద్ధుర
వ్యాప్తిం బర్వఁగ సర్వదానవబలవ్యాలగ్నుఁడై పేర్చునా
సప్తార్చిన్ బలవంతుఁ జేయుచు నభస్వంతుండు దుర్దాంతుఁడై
సప్తస్కంధములం గదల్చి పొదివెన్ సంపాతచండాకృతిన్.

ఉ. ఘోరయుగాంతవహ్నిఁ బటునోత్రనగావలియెల్ల భస్మసా
త్కారము నొందునట్లు చెడి భారుణిఁ జూర్ణపుఁబ్రోవు లయ్యె న
మ్మారుతమిత్రుచే రిపులమాయపుఁగొండలు దేవశత్రులున్
భూరిరథాశ్వనాగచయపూర్వముగాఁ బొడిమైరి పోరిలోన్.

వ. ఇట్లు సకలసైన్యంబును సమసిన మయుండు సవిస్మయుండై తిరిగి దొరలును సైరింపలేక తొలంగిరి చెలంగి రథాంగధరుఁ గీర్తించుచు నమర్త్యులు సమరజయ విభాసితులైరి లోకంబులు ప్రమోదమేదురంబులై పొదలె నెందునుం దొంటి యట్ల మహాధ్వరంబులు ప్రవర్తిల్లెఁ దపోధనులతపంబులు నిర్విఘ్నంబులై తల కొనియె ధర్మంబును బ్రబలంబై నలుకాళ్లును మోపి నడచె సమ్యక్పరిపాల

నంబు గాంచి భూదేవి భూరిస్థైర్యంబు వడసె వర్ణంబులు నాశ్రమంబులు నిజా
చారంబు లంగీకరించెనంత.

ఇంద్రాదిదేవతలతోఁ గాలనేమియనురాక్షసుఁడు యుద్ధముచేయుట.

సీ. రౌద్రరసస్వభావోద్రేక మంతయు సాకారమై తనరారె ననఁగ
వీరగుణోల్లాసవిభవంబు సర్వంబు నవయవప్రౌఢిఁ గ్రొవ్వలరె ననఁగ
గర్వసర్వస్వరేఖాతత్వ మఖిలంబు విగ్రహవ్యాప్తి గావించె ననఁగ
దర్పసంభారదుర్ధమవిశేషం బెల్లఁ దనువికాసంబుగై కొనియె ననఁగఁ
బ్రళయకాలదహనుప్రతిబింబ మనఁగఁ గ్రూ, రాంతరోషవికృతి కార్త్యయనఁగ
నెగడువాఁడు కాలనేమినా నొకదైత్యుఁ, డపరిభావ్యబలనిరస్తరిపుఁడు.

క. శతభుజుఁడు శతశిరస్కుఁడు, శతశిఖరోదగ్రశైలసదృశుఁడు దీప్తా
యతపింగశ్మశ్రుకచా, న్వితనీలశరీరుఁ డుగ్రవీక్షణుఁ డెందున్.

వ. వనరుహాసనువలన లబ్ధవరుండు గావున నసురులపరాభవంబునకు నమరులవిజ
యోత్సవంబునకుఁ గరంబు గలుషించి దనుజనాయకుల నందఱ నాశ్వాసించి
పురికొల్పుకొని క్రమ్మఱ సర్వసైన్యంబుల సమకట్టించి యగ్రణియై సురలమీఁఁద
నెత్తి నడతెంచిన నాదిత్యు లందఱు నత్యంతసంరంభంబున జంభారిపురస్సరుం
డుగాఁ గడంగి రప్పుడు.

క. బలియుఁ డగుప్రభువు తమకుం, గలిమిం దల కేది రిపులఁ గన్నంతన దై
త్యులుమదినరవాయిగొనక, యలఘుప్రహరణమహోగ్రులై తాఁకుటయున్.

క. ఇరువాఁగునకుం గయ్యము, కర మద్భుతభంగి నమరెఁ గరిహయసుభట
స్ఫురితాంగశకలచయబం, ధురమై సంగరధరిత్రి దుస్సంచరగన్.

ఉ. తార విరోచన ప్రభృతిదానవముఖ్యులు దర్పరోషదు
ర్వారసముద్ధతిన్ బటుపరాక్రమకేళి యొనర్పఁ దన్మహా
దారత కోహటింపక శతక్రతుముందట నగ్నిదండభృ
ద్వారిపు లాదిమైనసురవర్యులు కోల్తలచేసి రుక్కునన్.

చ. పరిఘువిభిన్నులై ముసలపాతితులై కరవాలకృత్తులై
శరపరికీర్ణులై పరశుసంప్రవిదారితులై గదాతిభం
గురులయి తోమరప్రకరకుంఠితులై సమరావనిన్ సురా
సురులు పరస్పరాభిహతి శోణితపూరము నించి రయ్యెడన్.

వ. అయ్యవసరంబున.

ఉ. కోఱలు దీటుచు న్నయనకోణములన్ దహనస్ఫులింగముల్
గాఱఁగ నూర్పులం జదలు గాలిని నొక్కఁట దూల బాహువుల్

నూఱును జాచి మై వెనిచి నూఱుశిరంబులు నూర్ధ్వదిక్తటుల్
దూఱఁగఁ గాలనేమి రణదోహలియై కడుఁగెన్ సముద్ధతిన్.

వ. ఇట్లు గడంగి చరణజానూరుకటినిపాతంబులం గూర్పరముష్టితలాఘాతంబుల ని
శాతహేతిప్రకరప్రసారంబులం గ్రూరసాయకవిదారణంబులం దరతరంబ బృం
దారకసైన్యబృందంబుల న్బరిపుచ్చుచుఁ దఱిమి యతం డైరావణారూఢుండై
యున్నశతమన్యు నంతంతం గని యట్టహాసంబుతో నాహ్వానంబు సేసి.

మ. యిదె కంటే సురనాథ నాభుజమునం దేపారెడున్ ఘోరమై
గద నీయూదల ద్రవ్వఁ దాఁకి మెదడుం గ్రమ్మించు నేఁడాదిగాఁ
ద్రిదశేంద్రుం డనుపే రడంచి విజయోద్దీప్తుండనై యేన యే
లుదు సందేహ మొకింతయున్ వలవ దీలోకత్రయీరాజ్యమున్.

క. అనుచుఁ గదియుటయు నింద్రుఁడు, దనుజునిపై వైచె ఘోరతరభిదురము త
ద్ఘనవక్షస్స్థలపాతం, బున గుంఠితధారమయ్యెఁ బొలుపఱి యదియున్.

తే. కులనగము లైనవ్రయ్యలై కూలునట్లు, గా నొనర్చెడి కైదు వాకరణిఁ గష్ట
భావ మొంది క్రమ్మఱ వచ్చి పాకశాస, నునికరము సేరె నంతయు దనుకు సొచ్చి.

సీ. ఆలోన గద పూన్చి యభ్రమాతంగంబు కుంభపీఠంబుఁ బగుల్చి యసుర
మఱియొక్క వ్రేటున మఘవునివక్షంబు నొగిలించుటయును నేనుంగుఁ దాను
బీనుంగు లైనట్లు పృథివీస్థలంబునఁ గూలి గోత్రధ్వంసి కొంతవడికిఁ
దనుఁదానె సవరించుకొని గజేంద్రుని దిగవిడిచి నెమ్మనమున వెగడుఁ గదురఁ

బాఱెఁగరియును నొకభంగి బ్రతికివిగత, తోయమగుతోయదమునకుఁదోయనంగ
మదవిహీనమై యచ్చోటన కదలకుండె, నస్త్రనిర్ఝరభృతి యగునద్రివ్రాలె.

వ. ఇట్లు మహేంద్రుని మర్దించి యమ్ముఖంబున నమ్మహాదైత్యుండు.

క. ఫణిపాశము డించి ధను, ర్గుణనిస్స్వన మడర వాఁడికోలలఁ దనువున్
బ్రణతగ నొనర్చి వరుణుని, రణకర్మోద్యమమునకుఁ బరాఙ్ముఖుఁ జేసెన్.

వ. మఱియును.

క. పరిఘమున నురము శిరమును, బరియ నడిచి ధనదు మూర్ఛపాలుపఱిచి కిం
కరకోటిఁ బఱపి యాతని, సిరితోడన నిధిచయంబుఁ జేకొనియె ననిన్.

వ. తదనంతరంబ.

సీ. మెచ్చక యెదురైన మృత్యువుమెడ ద్రొక్కి క్రొవ్వాఁడికోలలు ద్రెవ్వఁ దాఁచి
కింకతో జంకించి కింకరగణముల పొంకంబు సెడఁ గొంకువ్రావ నడిచి
మదరువుగొనిమూఁకుమలయుకాఱెనుఁబోతునొడిసి కొమ్ములుపట్టిముడఁగఁద్రోచి
మండెడుపటుకాలదండంబు చేతులఁ బిసికి వేఁడిమి యార్చి బెండుచేసి

పిఱికి ప్రాణులఁ బోరిగొనుబిరుదుమగఁడ, వగుదు నీవనియందందమొగము మీఁదఁ
జప్పటలు వెట్టి యాతఁడు జమునిఠావు, చేవయును బొల్లుగాఁ గాకుచేసి విడిచె.

వ. ఇత్తెఱంగున లోకపాలురు దూలినఁ దక్కినవేల్పులు కన్నవారు కన్నతెరువులం బఱచిరి కాలనేమియుఁ దత్తత్పదంబు లాక్రమింపఁ దగినయధికారులం బంపి.

శా. స్వర్గద్వారము గాచుతీవ్రకరు నుత్సారించి తారాగణాం
తర్గామిం దుహినాంశుఁ ద్రోచి త్రిజగత్సంసేవ్యు హవ్యాశనున్
దౌర్గత్యాన్వితుఁ జేసి వారినెలవుల్ దానై తదీయక్రియా
సర్గంబుల్ దనసొమ్ముగాఁ గొనియె నాశ్చర్యోగ్రవీర్యంబునన్.

వ. మఱియునుం బ్రభావబంధురుం డగుట ననిలస్కంధంబులు నూర్ధ్వభువనబంధంబులుఁ బాతాళంబులు నతనియధీనంబు లయ్యె సకలసాగరశిలోచ్చయసమేతయగుభూతధాత్రియు నతనిచేతికి వచ్చి తచ్చండశాసనంబునందు నిలిచె నప్సరోగంధర్వాదులుం దదీయసేనావృత్తంబ యూఁదిరి దేవతలు చెడిపోయి పలుచోట్లం బడియుండి రివ్విధంబు గనియును విష్ణుండు హానికిం గాలపరిపాకం బగుట యపేక్షించి యూరకుండె నట్లుసర్వపదేశ్వరుండై యసురేశ్వరుం డయ్యసురవంశంబు ప్రశంసిప దర్పవిభవంబున శోభిల్లి.

కాలనేమి విష్ణుదేవుని మీఁద యుద్ధసన్నద్ధుఁడై పోవుట.

చ. క్షమయును ధర్మముల్ శ్రుతము సత్యము లక్ష్మియు నాఁగ నెందుఁ బెం
పమరెడువిష్ణుసంశ్రితము లైనతెఱంగులు తన్నుఁ జేరమిన్
సమధికరోషతన్ సకలసైన్యసమేతముగాఁ బరాక్రమో
ద్యమ మెసఁగం గడంగెఁ గమలాక్షునిమీఁద జయాభిలాషియై.

వ. అప్పుడు.

తే. దైత్యవంశనాశము మదిఁ దలఁచుచున్న, యాదిదేవునివిష్ణుని నంతనంతఁ
గాంచి డెందంబు గలఁగంగఁ గాలనేమి, యిట్లనియె నతఁడాదిగా నెల్ల వినఁగ.

సీ. ఏకార్ణవంబునం దెవ్వఁడుమామధుకైటభు లనువారి గీటడంచె
దితిజవంశమునకుఁ దేపయైన హిరణ్యకశిపు నెవ్వఁడు నఖాగ్రములఁ జీరె
ననిమిషారణి యైనయదితిగర్భంబున ననలాభుఁడై యెవ్వఁ డవతరించె
బలియుఁడై యెవ్వఁడు బలిఁ గట్టి తనమూఁడువిక్రమంబుల లోకమాక్రమించె
నసురకామినీనేత్రతోయములు గురిసి, యంబుదద్యుతిఁ ద్రిదశసస్యంబుఁ బ్రోచు
నెవ్వఁ డవ్విష్ణుఁ డతఁడునాకిచటనబ్బెఁ, బగయడంగింపఁగనుకొట్టిభాగ్యఫలము.

మ. ఘనకల్పాంతపతంగబింబసమచక్రం బాజిఁ బ్రేరేఁచుచుం
దునిమెం బల్వుర నస్మదన్వయుల నీదోర్దర్పధుర్యుండు నేఁ

దును దైత్యాబ్ధులు గ్రోల నొర్వశిఖియాటోపంబునం బేర్చునీ
తనియయ్యస్త్రము యింతకంటెను నిమిత్తం బెద్ది వైరాప్తికిన్.

క. జాత్యంతరములఁ బొందుచుఁ, గృత్యం బొకఁ డెఱుఁగ కితఁడు గీర్వాణగణ
ప్రీత్యర్థము దైత్యాన్వయ, మృత్యువయై యెసఁగు నొప్పమికి మితిగలదె.

వ. వైకుంఠుం డనంతుండు విష్ణుం డనుపేళ్లు గలిగించుకొను టెల్ల నవియ కావున
నియ్యపరాధంబు లన్నిటికి ఫలం బనుభవింపఁ గలవాఁడై నాబారిం బడియె ని
న్నారాయణు వధియించి పూర్వులఋణంబు నీఁగెదఁ గాదేని మత్సాయకదళిత
దేహుండై యుత్సాహంబు విడిచి యితండు నన్ను శరణుసొచ్చి ప్రణమిల్లెడునది
యును మహనీయంబ యని పలికి కలహార్థియై కదియునెడఁ దద్భాషితంబు లాక
ర్ణించి గోకర్ణశయనుండు నయనారవిందంబులు మందస్మితవికాసంబున నుద్వృ
త్తంబులుగా నాసద్వృత్తవిహీనుం జూచి యిట్లనియె.

తే. క్రొవ్వి యివ్విధమున నీవు కొన్ని కాఱు, లఱచినంతన నీచేత నగునె యొకటి
యాడినట్ల చేయనివాని నకట పురుషుఁ, డంద్రె రజ్జులాడునేరూరుఁ డైనవాఁడు.

ఉ. దానవకీట నీవటు పితామహుఁ డిచ్చినయోగి నమ్మి దు
ర్మానఘనుండవై సదవమాన మొనర్చితి దాని కంతకుం
బో నినుఁ బోంటిదానవులపోకనె పుచ్చి నిలింపులన్ యథా
స్థానములందు నిల్పెద ముదంబునఁ దాపసకోటి మెచ్చఁగన్.

వ. అనినం గినిసి విబుధవిరోధి క్రోధదిగ్గుణారుణారోచు లగులోచనంబులం బుండరీ
కలోచనుం దప్పక చూచి బాహాశతంబునం బృథగ్విధంబు లైనయాయుధంబు
లన్నియుం బూన్చి మయతారవిప్రజిత్తిప్రభృతిదైత్యు లాత్మీయప్రహరణపా
ణులై తోడం దఱుమం దఱికిం జొచ్చి పాదివినం గులక్షోణీధరంబుపోలిక నక్షో
భ్యుండై యాసమరవిచక్షణుండు నిలుచుటయుం గని సైరింపక.

తే. కాలనేమి యేచి కాలదండముపోని, ఘోరగద యమర్చి దారుణంపు
హాస మెసఁగ నుఱక యదరి గరుత్మంతు, గుఱిచి పూని వైచెఁ గ్రూరభంగి.

క. హరి చూచి వెఱఁగువడ న, ప్పరుషప్రహరణము వచ్చి పక్షీంద్రుని ని
ర్భరముగఁ దాకిన వడఁకెం, బొరి నాతఁడు వజ్రనిహతభూధరముక్రియన్.

చ. కరుణఁ దదీయదుర్బలత గ్రక్కున మాన్చి జవంబు సత్త్వవి
స్ఫురణము తొంటికంటెను ప్రభూతముగా నొనరించి దేవుఁడు
ద్ధురుఁ డగుశత్రుఁ జంపుటకు దోహలియై రభసోగ్రభంగి నా
గరుడునితోడఁ గూడ నిజకాయము వర్ధనమొందఁ జేసినన్.

శా. బాహువ్యాప్తియ శేషదిగ్భరితయై భాసిల్లె వక్షస్థ్సల
వ్యూహప్రక్రాంతి నిరుద్ధమయ్యె గగనం బూర్ధ్వంబు మూర్ధాగ్రస

న్మాహవ్యాహతిఁ దూలె నంత్రఘియుగమ్ముల్ సర్వోర్వియుం బొందె సం
గ్రాహంబుల్ సురశత్రు లుద్ధతభయక్షోభార్తులై రెల్లెడన్.

ఉ. క్రమ్మఱ విశ్వవిక్రమణకర్మ మితండు దొడంగె నెక్కొ చో
ద్యమ్మిది యంచు వేల్పులును దాపసులుం బరమేశ సత్కృపా
ర్ద్రిమ్మగుచూడ్కిఁ జూడు మము దైత్యవిఘాతనమాచరింపు లో
కమ్మఖిలమ్ము గావు మని గాఢమతిం బ్రణుతించి రవ్విభున్.

విష్ణుదేవుండు చక్రాయుధముచేతఁ గాలనేమిం జంపుట.

వ. అమ్మహాప్రభావుండు భవ్యం బగునిజతేజంబునం బ్రత్యర్థి తేజంబు తిరోహితంబు చేయుచుఁ గల్పాంతసహస్రకరమండలప్రచండంబును దుస్సహసహస్రారోపేతం బును విమతసహస్రమేదోరుధిరదిగ్ధావయవంబును సకలచరాచరభూతభయావ హాత్సేకంబును సమస్తవినతజనాభయప్రదానలలితంబును సర్వభువనపూజి తంబును సాక్షాత్పరమేష్ఠిసృష్టంబును నపరిభావ్యప్రభాపటలదుర్దర్శనంబును నగు సుదర్శనచక్రంబు కరంబున సమర్చి.

మ. సురవిద్వేషిపయిన్ సకోపపరుషస్ఫూర్తిం బ్రయోగింప న
ప్పురమాస్త్రంబు ప్రశస్తమై చని వెసన్ బాహావనం బంతయు
న్నురియం జేసి శిరంబులెల్లఁ దునిమెన్ బ్రోడై తదీయాంగమ
చ్చెరువారం దనతోంటినిల్కడన నిల్చెం గొంతసే పద్దివిన్.

చ. వినతాసూనుఁడు దాని సైంపకమహావిస్తీర్ణముల్ గాఁగ గ్ర
క్కున రెక్కల్ ప్రసరించి వాయుసముసంక్షోభంబునం బాటి తాఁ
కినఁ దద్వక్షము తాఁకునన్ విఱిగి సంక్షీణాసువై కూలె దై
త్యుని దేహంబు ధరిత్రి గ్రక్కదల వాతోద్ధూతమేఘాకృతిన్.

వ. ఇట్లు కాలనేమి కాలగోచరుం డగుటయుఁ దక్కనప్రధానదైత్యు లవ్విశ్వరూపు విశ్వవ్యాప్తివలన నెందునుం బోనేరక క్రొల్పులికోల్తలం జిక్కినజింకల తెఱంగున బ్రమసియున్నవారున్నచోటన యడంగి యొదుఁగ నమ్మహాబాహుండు బాహు బలం బమర నమితవిక్రమంబు లగుచక్రగదాఖడ్గంబులం దదీయదేహంబులు వ్రయ్యను జదియను దునియనుం జేసి ధరణిం దొరంగించె వెరయసురులు నవ్వి ధంబునఁ బొడవడంగి రిబ్బంగిం దారకామయుం బనుపేరిటియద్దారుణసంగ్రామం బు సునివృత్తం బగుటయు విజయవిభాసి యగునవ్వాసవానుజు నభినందింప నర విందాసనుండు సిద్ధసంయమిసమేతుండై చనుదెంచి సబహుమానంబుగా నిట్లనియె.

తే. సురలభంగించి సమ్మునీశ్వరుల కెగ్గు, చేసి త్రైలోక్యమును గాసిసేయుచుండు
నాత్మ నన్నును జీరికనైనఁ గొనఁడు, దనుజుఁ డంతటివార తత్సహచరులును.

ఉ. ఈయసురేంద్రు గెల్చుటకు నీవుకరుండును దక్క లేఁడు నా
రాయణ మూఁడులోకముల నస్యుఁడు వేల్పులయొత్తుకొట్టు నే
డాఁడుతశక్తిమైఁ జేతికి తప్రతిఘాతవిభూతి యెన్నఁడుం
బాయకయుండ నిచ్చి కడుభవ్యునిఁ జేసితి దేవతావిభున్.
ఉ. ఈవిధ మేను నచ్చి నిను నిష్టవరంబులచేఁ బ్రకామసం
భావితుఁ జేయఁగా నిటకుఁ బన్నుగ వచ్చితి నిచ్చమైఁ ద్రిలో
కీవరదుండ వీవు పరికింపఁగ నీకొకవాంఛితంబు ల
క్ష్మీవర యెందు లేమి గని సిగ్గును బొందె మదాత్మ యిచ్చటన్.
క. నినుఁ జూడఁ గోరి యున్నా, రనఘా మల్లోకవాసు లగుమునివరుల
వ్వినుతాచారులు ధన్యతఁ, దనరు తెఱఁగొనర్ప వలయుఁ దద్దయుఁ గరుణన్.
వ. కావున నస్మదీయస్థానంబునకు నాతోడన యరుగుదె మ్మనినఁ బరమేష్ఠివాక్యం
బున కియ్యకొని విష్ణుండు జిష్ణుప్రముఖు లగుదివిజులం జూచి యిట్లనియె.
మ. అమరారాతు లనేకు లీరణమునం దస్మన్మహాచక్రవి
క్రమగర్వంబునఁ గాలనేమిమునుగాఁ గాలాంతముం బొందిరే
క్రమమో తప్పిరి రాహువున్ బలియు లోకం బింక నిశ్శంకతా
సముదీర్ణం బగుఁగాత యెల్లవిధులన్ సంప్రాప్తనైజస్థితిన్.
తే. లోకపాలురు తమతమలోకములన, తొంటి యైశ్వర్యములు నిత్యధుర్యమహిమ
లుల్లసిల్లఁగఁ గైకొని యుండువారు, గాత యాత్మీయు లానందఘనతఁ బొంద.
క. క్రమమున హవ్యము గవ్యము, నమర పితృప్రీతిసేయ ననఘములై య
జ్ఞములు ప్రవర్తింపఁగ ధ, ర్మము పొదలి చరించుగాత మహి నలుకాలన్.
మ. కుటిలాచారులు దైత్యు లెప్పుడును మీకుం గీడుగావింప ను
త్కటరంధ్రంబులు వేచి యుండుదురు నిక్కం బెమ్మెయిన్ వారి న
మ్ముట కర్తవ్యము గాదు సాత్త్వికమతు ల్మద్గాత్మకుల్ మీర లొ
క్కటియు న్నేరరు మాయ నేమఱకుఁ డేకర్జంబులందుం దగన్.
వ. ఏను బోయివచ్చెద నని యానతిచ్చి యప్పరమేశ్వరుండు పరమేష్ఠి పురస్సరుండై
తోడ్కొనిపోవం దదావాసంబునకుం జనియెందు.
క. ప్రాతస్సవనాహుతులను, వైతానికవహ్ను లిద్ధవైభవమునఁ బ్ర
స్ఫీతంబులుగా నొప్పుమ, హాతాపసవరుల సంయతాత్ములఁ గనియెన్.
వ. కని యమ్మహితాధ్వరంబులఁ దనకు హితంబులుగాఁ గల్పితంబు లగుభాగంబు
లభినందించుచు నయ్యింద్రానుజుం డమ్మునీంద్రులకుఁ బ్రత్యేకంబ యభివాద
నంబు సేసి త్రేతాగ్నులకుం బ్రదక్షిణించి సద్యోహుతాజ్యసౌరభోద్దామంబు
లగుతదగ్రధూమంబు లాఘ్రాణించుచు ఖచితమాణిక్యజాలంబు లగుకనకచషా

లంబుల నుజ్జ్వలరూపంబు లగుసమున్నతయూపంబు లాలోకించుచు విస్తారితమనోమోదంబు లగువేదనినాదంబు లాకర్ణించుచు బ్రహ్మలోకంబు గలయం గ్రుమ్మరుసమయంబున.

క. యజమానులు ఋత్విజులును, యజనసమేతు లయియున్న యనిమిషులుం బ్రమోదజడాత్ముల గుచు నవ్వి, శ్వజగద్విభు నభిగమించి సముదితభక్తిన్.

తే. అర్ఘ్యమర్పించి ప్రాంజలులై మహాత్మ, క్రతువులకు నెల్ల నగ్రపూజితుండ వీవు
నీవు లేనిసంయమములు నిష్ఫలములు, వేదవిహితంబు లగుసర్వవిధులు నీవ.

చ. దనుజవిభంజనార్థముగ దారుణయుద్ధ మొనర్ప నీవు వ్రా
యున నిఖిలక్రియాతతియు నే పటుపాయఁగఁ బెట్టి నిన్నె చిం
తన మొనరించుచుండితిమి ధన్యుల మైతిమి నేఁడు నీజయం
బునఁ బరమేశ మాకొలువు మోదమెలర్పఁగఁ గైకొనం దగున్.

వ. అనిన వారియాలాపంబు లాలించి యభ్యర్చనంబు లాదరించి యందఱం బ్రత్యేకపరిగ్రహంబుల ననుగ్రహించి యద్దేవుం డాదిదేవుం డగుపితామహునకుం బ్రణమిల్లి వీడ్కొని తదీయలోకంబు వెలువడి తనకుం బురాణసంశ్రయం బగుదుగ్ధసాగరంబున కరిగి.

మ. ఇనచంద్రద్యుతికోటికిం జొరఁగ రా కెల్లప్పు డాత్మావధా
వనసామగ్రిన తేజరిల్లుచు నజస్వారాజులం దొట్టి యె
వ్వనికిన్ దుర్గమమైనపుణ్యపదమున్ వైకుంఠనామంబు న
ర్థి నధిష్ఠించి యనంతరంబ పగమోద్దీప్తస్వరూపంబునన్.

### నారాయణుండు యోగనిద్రా పరాయణుండైయుండుట.

ఉ. వేయిశిరంబు లొప్పఁ బదివేలుకరంబు లెలర్ప నొప్పి నా
రాయణుఁ డాద్యమైన తనయంచితతల్పముఁ జెంది పెక్కువేల్
హాయనముల్ పరిభ్రమణ మందుల నొందినడప్పిమాన్ప భ
ద్రాయితసుప్తిఁ గోరి కనుఁదమ్ములదోయి యొకింతమోడ్చినన్.

మ. మునుకల్పాంతమునందు విచ్చలవిడిన్ మోహంబు వర్ధిల్లఁగాఁ
దనుఁ బాటించి విలోపభోగమహిమన్ ధన్యాత్మయై విశ్వమో
హిని నాఁ బ్రాజ్ఞులచేతఁ గీర్తనలు నిండారంగఁ గన్నట్టి ని
ద్ర నెఱిం జెందెఁ దదీయభావము స ముద్యద్దివ్యయోగాకృతిన్.

వ. ఇవ్విధంబున నిద్రితుండై యద్దేవుండు.

ఉ. ఈతఁడు నిత్యసుప్తుఁ డని యిచ్చఁ దలంపఁగఁ గొంద ఱీతఁ డు
ద్యోతితసత్త్వబోధుఁ డని యూహయొనర్పఁగఁ గొంద ఱీతఁ డు

ద్ధూతవికారుఁ డిట్టిఁ డనఁ దోఁచెడువాఁ డనఁ గొందఱచ్యుతుం
డాతతలీల చూపి దనుజారులకున్ భరమయ్యె నాత్మలన్.

సీ. ఘర్మాంతమున సుప్తి గైకొని యతఁడు ప్రమోదింపఁ బర్జన్యుఁ డాదరమునఁ
బుష్కలావర్తకంబులు లోనుగాఁగ సర్వవలాహకంబులఁ బనిచి జగము
నాప్లావితము సేయునప్పుడు వర్తిల్ల కుడుగు యజ్ఞాదిమహోత్సవములు
మేఘాపగమమున మేల్కనఁగా సర్వకల్యాణములు సముగ్రతఁ దలిర్పఁ
బతిఁ బతివ్రత యనిశంబుఁ బరిచరించు, నట్లువిభు నిచ్చ యెఱిఁగియిట్లనుసరించు
చుండు నయ్యోగనిద్ర యన్యుల కశక్య, నిష్ఠ కల్పంబు లిటు లోలి నిద్రసలుప.

వ. ఒక్కొక్కకారణంబున నాభీలదర్పు లగుదానవులవలన భువనంబులకు నుపద్రవం
బులు దనికిసం దలకొనుదివిజులదుస్స్థితి యెఱింగి యయ్యాదిమపురుషుండు కర
ణీయానురూపంబు లగురూపంబుల నవతారంబు లంగీకరించి జగన్మంగళంబు
నిర్వహించు నని యిట్లు వైశంపాయనుండు విష్ణుమూలప్రకృతియుఁ దదీయా
వతారకారణంబులు జనమేజయునకు సవిస్తరంబుగాఁ దెలిపినవిధంబు

శా. లోకస్తుత్యచరిత్ర నిత్యకరుణాలోలస్మనస్సూత్ర య
స్తోకశ్రీతులితామరేంద్ర జనచక్షుఃపూర్ణిమాచంద్ర దా
నాకల్పోజ్జ్వలహస్త పద్మశశిచూడాధీన ధీసర్మస
ర్వాకారస్ఫుటబాహువిక్రమనికామాస్తోదయప్రక్రమా.

క. ధీరసకలార్థిలోకా, ధార జితవికార సుకృతధారలసితస
ద్ధారాదుర్ధిసనిర్మషి, తారిద్యుతిభార నిత్యహర్షస్మేరా.

మాలిని. వితతవినయవిద్యా విప్రధర్మాత్తచిత్తా
జితసకలసపత్నశ్రీక సమ్యగ్వివేకా
మతివిభవమహేంద్రామాత్యసౌజన్యనిత్యా
చతురచతురుపాయా సక్తసత్త్వైకయుక్తా.

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానందసౌందర్య
ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ సంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతం బైనహరివంశంబునం బూర్వభాగంబునందుఁ జతుర్థాశ్వాసము.

## పూర్వభాగము - పంచమాశ్వాసము.

క. శ్రీధరణీసంభృతగృహా, మేధివ్రత విభ్రమోపమితవిష్ణుకథా
మాధుర్యబహువిధశ్రుతి, సాధితచాతుర్య వేమజనపతివర్యా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు విశ్వంబునకుం బరాయణుం డగునారాయణుండు దుగ్ధసాగరంబున విముగ్ధయోగనిద్రావశుండై వసియింపం గ్రమంబునఁగృతత్రేతాహ్వయంబు లగుయుగంబులు రెండునుగడచనఁ దృతీయయుగావసానం బగుకాలంబునఁ బ్రజాభారపీడితయై పృథివి యాక్రోశింప నయ్యాక్రోశవశంబునం బొంది బృందారకులు శతానందునఁ గేతెంగించి యతని మున్నిడికొని చని.

తే. నాగశయనీయశయు మహానందు నాది, దేవు భువనపావను సుధీభావనీయుఁ
బ్రకటమధురవాక్యంబులఁ బ్రస్తుతింప, నల్ల నాలించి మేల్కాని యచ్యుతుండు.

ఉ. తెల్ల నితమ్మితేకులకుఁ దియ్యపునెచ్చెలు లైనకన్నులం
జల్లనిచూపు చూచి యిటు సంగతులై చనుదెంచినారు మీ
రెల్లను లోకముల్ శుభసమేతములే యసురాధముల్ ప్రవ
ర్తిల్లరుగా సమస్తజగతీపరిపీడ యొనర్పఁ గ్రమ్మఱన్.

వ. అని యానతిచ్చినఁ గమలసంభవుం డవ్విభునియగ్రభాగంబున ఫాలభాగవిరచితాంజలియై యిట్లనియె.

సీ. అవధరింపుము ధాత్రియం దెప్పుడును రాజు లన్యోన్యవైరములు దక్కి-
పాటియుసత్యంబు పాటించి యాఱవపా లప్పనముగొని ప్రజలమనిచి
యర్థంబు తగఁగ నుపార్జించి బంధుమిత్రామాత్యభృత్యజనాభివృద్ధి
గావించి సతతయాగంబుల దేవభూదేవపితృప్రీతి యావహించి
యధికధార్మికు లగుట వర్ణాశ్రమంబు, లాత్మధర్మముల్ దప్పక యాచరింప
నెల్లవారును గడు నాయువెక్కి తెవులుఁ, జావు లేకుండ నున్నారు దేవదేవ.

ఉ. ఏనగరంబు చూచిన నరేంద్రులకున్ బహులక్షకోటిసం
ఖ్యానము లయ్యెఁ గుంజరహయాదులు మర్త్యులకెల్లఁ బేర్చు సం
తానపరంపరల్ జనపదంబు లొకంట నొకంట వేనవే
లైనవి యాల్లు లిట్లమరె నాదియుగంబును బోలె సర్వమున్.

వ. దానంజేసి భూదేవి మహాభారంబు సైరింపలేక సైరణ దొఱంగి యచల యయ్యును జలనంబు నొంది యార్తయై యాక్రందించె నివ్విధం బరసి ధర్మలోపంబు గాకుండఁ బార్థివకులంబుల నుపసంహృతంబులు సేయవలయు నీవు విజయంబు సేసి మేరుశిఖరంబునం గొలువుండి మమ్ము నందఱందగిన తెఱంగులకు నియోగించుట లెస్స యనిన వనజాసనువిజ్ఞాపనంబువినిదివ్యశయనంబువలనసముత్థితుండై.

సీ. ఇందిరతొడలపై నింపారఁ జాఁచినయడుగులు ఫణిపీఠియం దమర్చి
యొక్కింత సడలినయుత్తంసదామకం బభినవంబుగ మౌళి నలవరించి
కౌస్తుభోజ్జ్వలపదకంబునఁ బెనఁగొన్నచారుహారమునులి చక్కఁజేసి

కటిమీఁద జాతినకనకసూత్రంబుతోఁ బీతాంబరముద్రిందు బిగియఁదిగిచి శంఖచక్రగదాభయస్ఫారచిహ్నం, ములుక్రమంబున శ్రీహస్తముల వహించి యోగనిద్రాంతలీల నిట్లొప్ప నిలిచె, దేవదేవుఁడు దివిజులదృష్టి యలర.

వ. నిలిచి తత్సమయసేవానురూపంబుగాఁ బొడసూపి యాయితంబై యున్నవినతాతనయు వినమితస్కంధంబునందు బంధురోత్సాహంబున నారోహణంబు సేసి విష్వక్సేనాదిగణముఖ్యులకోలాహలశబ్దంబులును మునులజయజయాశీర్వాదనినంబులును దిగ్వివరపూరకంబులై చెలంగ ననేకశతసహస్రంబు లగుసురవిమానంబులచేత సేవ్యమానుండగుచు గ్రహతారకాసంచారపూరితం బగుసనాతనమార్గంబు నిజగమనానుగ్రహంబున నతిమాత్రపవిత్రంబుగా ముహూర్తమాత్రంబున నరిగి యవ్విభుండు.

ఉ. మేరువు గాంచె సంతతసమీహితఖేలనమోదితాప్సరో
భీరువు కందరాంతరనిపీతమదూద్ధతసిద్ధగీతికా
చారువు నిత్యసేవనరసవ్యసనభ్రమదబ్జబంధుమం
దారువు దివ్యధామరుచిదారువు సౌరభవర్ణమేరువుఁ.

వ. కని యందఱు నాత్మీయంబు లగుయానంబులు డిగ్గినం దానును వైనతేయుని వలన నవతరణం బొనర్చి.

సీ. అమ్మహాశైలంబునందు మీఁదటినెత్తమున విశ్వకర్మచే మును విచిత్ర
రచనానిరూఢనిర్మాణమై కామగామిని యనఁ గామదాయిని యనంగఁ
గామరూపిణియనఁ గాఁ బెక్కువినుతుల వెలసినసభయందు వేఱువేఱ
యుచితంబుగాఁ బెట్టియున్నపీఠములలో నున్నతాసనము దా నొంది విష్ణుఁ
డబ్జజాదుల నందఱ నానుపూర్వి, నుండ నియమింప నొప్పెఁ బేరోలగంబు
యక్షగంధర్వసిద్ధవిద్యాధరోర, గాదులును వచ్చి కొలిచి రయ్యాదిదేవు.

తే. అపుడు భూదేవి యాత్మీయ మైనదివ్య, మూర్తి ధరియించి యెంతయునార్తిదోఁప
నచటి కేతెంచె నిఖిలసురాళిచూడ్కి, గములునంతంతఁదనమీఁదఁగడలుకొనఁగ.

క. అక్కాంత డప్పి గని కడు, వెక్కసపడి పలుకుసభ్యవితతులపలుకుల్
దిక్కూలంకషనినదం, బక్కజమై యెసఁగె వెన్నుఁ డాకర్ణింపన్.

వ. అంత వాయుదేవుం డక్కలకలం బంతయుఁ గేలెత్తి వారించి వసుంధరం జూచి నీయాగమనకార్యం బంతయు విన్నపంబు సేయుమనినం గృతాంజలియై యాజగద్ధారిణి యుదారధీరస్వనంబున నిట్లనియె.

ప్రజాభారపీడితయైన భూదేవితనమనఃక్లేశంబు విష్ణున కెఱింగించుట.

క. ఈపురుషోత్తమదేవుఁడు, నీపరమేష్ఠియును వేల్పు లిందఱు వినఁగా
నాపాటెల్లం దగ వి, జ్ఞాపన మొనరింతు వినుఁడు సభ్యులు కరుణన్.

వ. ఏను జగత్కర్తచేతం జరాచరభూతధారణం బధికారంబుగాఁ బ్రతిష్ఠితనై యుం
డుదు నిట్లుండ నేకార్ణవకాలంబున విష్ణుకర్ణస్రోతస్సుల నుద్భవించి యిద్దఱు దై
త్యులు తపంబునకుం దొడంగి కాష్ఠకుడ్యసదృశులై నిశ్చలం బగునిలుకడం బెద్ద
కాలం బున్నంత.

క. వారల దేహములం నవ, ద్వారములం జొచ్చి భూరివాయువు నాడీ
పూరణము సేయ నాశ్చ, ర్యారంభతఁ బొదలి పెరిగె నఖిలాంగములున్.

వ. ఇట్లు పెరిగి దెసలు నాకసంబునుం దారమైయున్న యయ్యసురులకడకు బిసరు
హాసనుండు వచ్చి కరంబున నిరువుర నంటి చూచి యొక్కనియొడలు మృదువును
వేఱొక్కనిమేను కఠినంబును నై నందదనురూపంబుగా వారికి మధువునుం గైట
భుండును ననునామంబు లొనరించె ననంతరంబ వారును.

క. తనువుల వ్రేఁగున మదముం, గొని నీళులనడుమ నిద్రగూరి యొఱఁగి యే
న్న నగోచర మగుకాలము, ననుటయుఁ దెలివొంది పటుభుజాదర్పమునన్.

మ. తమతోడం బెనఁగంగ నోపెడు సముద్యత్సత్త్వవంతుండు వి
క్రమదుర్దాంతుఁడు గల్గునెక్కొ యని యాకాంక్షన్ సమస్తార్ణవౌ
ఘమునన్ బ్రమోయుచు నేగుదేరఁ గని యాకంపించి యాశౌరినా
భిమహాపద్మముసొచ్చి బ్రహ్మ యడఁగెన్ భీతిప్రకర్షంబునన్.

క. ఆయవసరమున నెంతయు, నాయితమై యెదురు నడచె నసురరిపుఁడు దై
తేయులు ప్రమోదవితత, వ్యాయతబాహులయి తాఁకి రవ్వీరవరున్.

వ. వారలతోడ నద్దేవుఁడు ననేకదివ్యాబ్దసహస్రసమం బగుకాలం బద్భుతం బైనబా
హుసమరంబు ప్రవర్తిల్లె నమ్మధుకైటభు లొక్కించుకయు డప్పిం బొందక ఖేదర
హితుండై యున్న వెన్నునివిధంబుం జూచి యచ్చెరువు నొంది తద్భుజావిజృంభ
ణంబునకుం దప్పిపోవం దమకు శక్యంబుగామియు నెఱింగి యతనితోడ.

తే. మెచ్చితిమి నిన్ను నీచేతఁ జచ్చుటయును, మాకులెస్సయితోఁచె నెమ్మనములందు
కమలనాభ చంపుము సలిలములు లేని, చోట నావుడు నాదైత్యసూదనుండు.

చ. ఇరువురఁ జంకలం దిఱికి యేపెసలారఁగ బాహుపీడన
స్ఫురణ నెగిల్చి పెల్చఁ దెగఁజూచి జలంబులలోనవైచినం
దరళతరంగజాలములతాఁకునఁ దత్తనుయుగ్మకంబునం
దొరఁగుచుఁ బేర్చి క్రొమ్మెదడు తోరపుతెట్టువగట్టె నయ్యెడన్.

క. మేదస్సు పయిఁ బొదువుటయు, మేదినియన నాఁటగోలె మెచ్చగుపేరు
త్పాదించె నాకు నచ్యుతుఁ, డాదరమున నర్థవేదు లభినందింపన్.

చ. పిదప వరాహదేహమునఁ బేర్చినకోఱ నెకంట నన్ను నీ
యుదధిజలంబులో మునిఁగియుండఁగ నెత్తెఁ ద్రివిక్రమాత్ముఁడై

పద్దమున నాకలంతయును బ్రాభవమొప్పఁగ విక్రమించె న
భ్యుదయవిధాయి నాయెడఁ బ్రభుండు ముకుందుఁడు సర్వకాలముఁ॥.

తే. శంఖకౌమోదకీచక్రచారుహస్తు, నతవిధేయు మన్నాథు ననాథనాథు
విష్ణుఁ బ్రభవిష్ణు జగదేకవిభునిఁ జెంది, యున్నదాననదిక్కఱరయనాకొకఁడు లేఁడు.

క. గురుఁ డగ్ని సువర్ణమునకు, గురుఁ డర్కుఁడు తేజమునకు గురుఁడెందు, నిశా
కరుఁ డఖిలతారకములకు, గురుఁ డెల్లవిధంబులను ముకుందుఁడు నాకుఁ॥.

క. సకలచరాచరభేద, ప్రకటిత యగుసృష్టి యేనుభరియించుప్రతి
ష్ఠకుఁ గతము వాసుదేవుం, డొకరుఁడ యాధారశక్తి యొసఁగుటఁ గాదె

వ. జామదగ్న్యుఁడు సర్వక్షత్రంబును నిశ్శేషంబుగా వధియించి రుధిరమాంసదు
ర్గంధదూషితయుఁ బరుషవికీర్ణకేశయునై రజస్వలయుంబోలె నున్న నన్నుం గశ్య
పునకు నధ్వరదక్షిణగా నొసఁగిన నమ్మహాత్ముని నాశ్రయించి.

తే. పతులు వ్రలియుట విధవనై పాడువాటి, యున్నదాననేనేమిటి నోర్వ నింక
నోపు దీవు నన్నరయంగ నోపు భర్త, నిమ్ము కరుణింపవే సన్మునీంద్ర యనిన.

క. మునిసాధుఁ డట్ల కాకని, మనువునకిచ్చె నను నధికమహిమాన్వితుఁ డా
జనపతియు నాత్మవంశ్యులఁ, బనిచెం బరిపాటితోడఁ బరిపాలింపఁ॥.

వ మహాకులీనులు ధీరులు మునిజనసమ్మతాచారులు శూరులునై నయాజగజ్జేతలచేత
ననుభూతనైతి వారు నాకుఁగా బ్రదికి నాయంద కాలవశత నొందిరి మీ రెఱుం
గనిపనిలే దిప్పుడు రాజకులంబులు కొలందికి మిగిలి నాకు భరియింపం గొలంది
గాకున్నయవి భారవహనక్లేశంబునం గృశియించి యున్నదాన నొక్కింత నా
మోపు వెలితిచేసిన బ్రదుకుదు నివ్విధం బివ్విష్ణుదేవుండు దలకొనియె నేని
నిర్వహించు నితం డూరకయున్న నది మదీయభాగ్యం బేమిసేయవచ్చు నిచ్చటి
పెద్దలీమహోపకారంపుఁగార్యం బనివార్యంబుగా సంఘటింపం బ్రయత్నంబు సేయ
వలయు ననిన భూదేవివాక్యంబులకుఁ దత్సభాసదులందఱుఁ దమలో విచారించి
నిశ్చయించి విరించి కిట్లనిరి.

క. ఈదేవి యిట్లు దుఃఖిత, యై తూలఁగ నూరకుండ నగునే మన కీ
వాదిభవుండవు భువన, ప్రాదుర్భావంబు నీకుఁ బని యట్లగుటఁ॥.

సీ. వాసుదేవుఁడు మహేశ్వరుఁడు విశాఖుఁడు వాసవుం డంబుధీశ్వరుఁడు యముఁడు
ధనముండుచంద్రుండుఁ తపనుండుపవమానుఁ డనలుండుసురమంత్రియసురఁగురుఁడు
విశ్వులు రుద్రు లశ్వినులు సాధ్యులు యక్షగంధర్వరాక్షసగరుడభుజగ
కిన్నరప్రముఖులు గిరిసరిజ్జలనిధు లనఁ బేరుగన్న వీరంతవట్టు
వారు దమతమయంశముల్ వసుధమీఁద, నఖిలభూమిసురక్షత్రియాన్వయముల
యోనిజు లయోనిజులును గా నుద్భవింపఁ, జేసి భారావతరణంబు సేయవలయుఁ

క. నావుడు నిది మేలగు నిటు, గావించుట లెస్స యని తగఁ బలికి జగ
న్నాథనుఁడు పద్మభవుఁడు సు, రావలితో మఱియు నిట్లు లనియెం బ్రీతిన్.

ౘ బ్రహ్మని దేశంబున సముద్రుండు శంతనుండై పుట్టిన ప్రకారము. ౘ

క. వినుఁ డేను దొల్లి సాయం, తనసమయమునందు వనధితటమునఁ బ్రజ్ఞా
ఘనుఁ డగుకశ్యపమునితో, ననుపమతత్త్వార్థగోష్ఠి నాసీనుఁడనై.

సీ. ఉన్నంతఁ జంద్రోదయోద్దామదర్పుఁడై యాసరిద్విభుఁడు గంగాసమాగ
మంబునఁ బొంగారి యంబరచుంబదంచద్వీచితతితోడ సరభసముగ
నేతెంచి మాయున్నయెడ నిండఁ దొట్టియంతటఁ బోక మమ్మును దడుపుటయును
నేను నవ్వుచుఁ దగునే యిట్లు శాంతుఁడ వగుమని పలికిన నాక్షణంబ
శాంతుఁడై తనుత్వము నొందిచారుఫేన, వస్త్రుఁడునునూత్నకంకణోజ్జ్వలతరంగ
భుజుఁడు ముక్తామణి స్తోమభూషితుండు, నగుచు రాజన్యవలెను సొంపారనిలిచె.

వ. అవ్విధం బాలోకించియేనుభావియగుదేవకార్యంబపేక్షించుటం జేసి యతనితోడ.

క. రాజోదయజృంభణమున, రాజాకృతితోడ సింధురాజ కడఁగి యీ,
రాజసము నీవు సేసితి, రాజై యటుగానఁ బృథ్విఁ బ్రభవింపఁ దగున్.

వ. శాంతుండ వగుమని యేను పలికినం దనుత్వంబు నొందితి గావున శంతనుండ
నం బరఁగెద వీగంగయు నిప్పు డెట్లట్ల నీకు భార్య యయ్యెడు ననినం దలంకి
సముద్రుండు గంగాసమేతంబుగా సాకారుండై నాకుం బ్రణామంబు సేసి.

ఉ. పర్వపుఁగాలముల్ జలదపఙ్క్తులతోఁ బవనంబు రేఁగి యం
తర్వలనంబు సేఁతయు సుధాకరదర్శనము న్మదూర్ములం
బర్వఁగ జేసె నాకు నిది ప్రస్ఫుటనైజము గాని యేమియున్
గర్వము గాదు శాప మొసఁగం దగునే జగదీశ దీనికిన్.

వ. ప్రసన్నుండవు గమ్మనిన నే నతనిం జూచి లోకహితార్థంబుగా నూహించి చే
సినకార్యంబు లపోహంబు నొంద నేరవు నీవు పరమపవిత్రం బగుభరతవంశం
బున జనియించి యీజాహ్నవియందు వసిష్ఠశాపదగ్ధులై వచ్చినవసువుల నుత్పా
దించి మఱియు సత్యవతి యనుపుణ్యవతియందు వంశకరు లగుకొడుకుల నిరు
వురం గని క్రమ్మఱ నిజప్రకృతిం బొందఁగలవాఁడ వని విషాదంబు మాన్చితి
నట్టిశంతనునకుం బుత్రుండైనవిచిత్రవీర్యునకు ధృతరాష్ట్రపాండుభూపతు లుద్భ
వించెదరు వారిలోన.

తే పెద్దవానికి నూర్వురు పిన్నవాని, కేవురును బుట్టుదురు సుతు లిద్ధతేజు
లట్టి యిరుదెఱఁగులకు రాజ్యాభిలాష, కలితమై పేర్చు నొకమహాకలహ మపుడు.

క. ఘోరయుగాంతాకృతి యగు, నారణమున నుర్విఁ గలజనాధిపు లెల్లన్
వారికిఁ దోడై వచ్చి మ, హాకోపత బ్రమ్మగ్గి పోదు ర్[illegible]సైన్యహతిన్.

ఉ. ఏనుఁగుపెంటలై యొకటి పేరును నెందును లేక యుండున
ట్లేనుఁగులుం హయంబులు సమృద్ధజనావళియుం బడంగ ని
ర్మానుషరాష్ట్రదుర్గనగరవ్రజమై తనభారమంతయుం
మాని సుఖించు నివ్వసుధ మానుఁ దృతీయయుగంబు నంతటం.

వ. కావునంగలహశీలుం డగుకలియంశంబు ధృతరాష్ట్రక్షేత్రంబునందును సర్వప్రేర
కుండై నకృతాంతునంశంబు పాండురాజపత్నియందును జనించుఁదక్కినవారియం
శంబులు నుచితస్థానంబులం బ్రభవించు నని పనిచినం బరమేష్ఠిపనుపునకు సర్వ
దివిజసమాజంబు నభినందించె నట్లున్నసమయంబున.

నారదుండు విష్ణునితోఁ గాలనేమికంసుండై పుట్టినతెఱం గెఱింగించుట.

శా. త్రైలోక్యాతిథియై విశృంఖలవిచిత్రప్రౌఢి నెల్లప్పుడుం
గేళిం గ్రుమ్మరుయోగసిద్ధుఁ డఖిలక్షేమంకరప్రజ్ఞుఁడుం
మీలన్మార్తి వికాసనిర్జితశరన్మేఘుం డమోఘార్థవా
గ్జాలుం డబ్జజసూతి యైనముని వేడ్కం వచ్చె నచ్చోటికిం.

క. వచ్చి సభయెల్లఁ దనదెస, మెచ్చి కనుంగొనఁగ హరిసమీపంబునఁ బెం
పచ్చుగ నాసీనుండై, యిచ్చ యెఱిఁగి వినయసముపహితవై దగ్గిం.

సీ. మందారతరుపుష్పమంజరీమండితమస్తకమై యొప్పుమహతివీణ
పచరించి త్రిస్థానబంధురశ్రుతిభేదములతోడ షడ్జంబు మొదలుగాఁగ
సప్తస్వరంబులు సారణావధి నభివ్యక్తమై మూర్ఛనలతిశయిల్ల
వాయించి మధురదివ్యధ్వని మెఱయఁ జిత్రప్రబంధోజ్జ్వలతానరచనఁ
బూర్వభువనరక్షణము లాభోగములుగ, నద్భుతావతారంబు లింపారఁ బాడి
యఖిలలోకశరణ్యు దేవాదిదేవు, విష్ణునలరించె సభ్యులు వేడ్కఁ బొగడ.

వ. తదనంతరంబ భక్తిప్రియపూర్వకంబుగా నద్దేవముని యద్దేవునకుం బ్రాంజలియై
యిట్లనియె.

క. మతిమంతులకాద్యుఁడ వూ, ర్జితశక్తిసమన్వితులకు శ్రేష్ఠుఁడవు మహా
ధృతియుతులకుఁ బ్రవరుఁడ వ, చ్యుత నీయవి గావె సృష్టియును యోగంబుం.

వ. కావున నిప్పుడు సకలక్షత్రియోపసంహరణార్థంబు దివిజు లిందఱుం గావింపం
బూనినయంశావతారవ్యవసాయంబు భవత్పరిగ్రహంబు లేకున్న నింతయు
నిష్ఫలం బది యెట్లనిన.

మ. ధరపై నీవు నిజాంశ మొక్కటిసముత్పాదించి దేవాంశజో
త్కరముం బాలనసేయుపేర్మి నెసఁగంగా వార లేపారి నీ
పరమోత్సాహముచే సనాథులయి తీర్పంజాలి యుండుం గ్రియా
భర మెల్లం బెఱనాఁడు గల్గునె తలంపం బ్రౌఢి యెవ్వారికిం.

వ. అది యట్లుండె నీపార్థివకక్షయకరణం బొక్కటియ కాదు దేవాంశజులకు, నసాధ్యం బైనకార్యంబు మఱియు నొక్కటి గల దదియ తలంచి కాదే యేను సత్వరుండనై దేవరం దలఁపింప వచ్చితి నవ్విధంబు విన్నవించెద నవధరింపుము.

తే. తారకామయం బనుపేరిదారుణంపుఁ, బోర నీపరాక్రమమునఁ బొలిసినట్టి యసురలిప్పుడు మర్త్యంబునందుఁ బుట్టి, వాలి క్రతుహంతలై యున్నవారు దేవ.

సీ. రఘురాముకడిమిచే రావణుం డనిలోన మడిసినపిమ్మటఁ గడిఁదివీరుఁ
డమ్మహాసురుమేనయల్లుఁడు లవణుండు మధుదైత్యతనయుఁ డున్మాదబలుఁడు
యమునాతటమ్ము ఘోరారణ్యముననుండి బాధసేయంగఁ దపస్వులెఱిఁగి
యెఱిఁగించుటయు దివసేంద్రవంశ్యుఁడు తనయనుజన్ము శత్రుఘ్నుఁ బనిచెనతఁడు
నరిదిశత్రునిఁ దెగటార్చి యడవియెల్ల, బయలుగాఁజేసి యధికసంపన్నఁ డగుట
నొక్కనగరు నిర్మించె ననూనవిభవ, సారసంపన్నబహుజనోచ్ఛ్రయము లలర.

వ. అదియును మధువనంబునందు నిర్మిత యగుటం జేసి మధురయనుపేరం బ్రసిద్ధయై సమృద్ధజనపదసమన్వితయుఁ బ్రకటోద్యానతటాకగోపురవిలసితయుఁ బ్రశస్తబహుభోగభూమియునై నాటంగోలె నెన్నండును శూన్యంబుగాక నృపపరంపరాపరిపాలనంబునం బెంపుమిగిలె నిప్పు డప్పురంబున.

తే. కంసుఁ డనుపేరితో నాఁటికాలనేమి, భోజవంశోద్భవాహుం డగుభూవరునకు నుగ్రసేనునకు జనించి యున్నవాఁడు, పూర్వదుర్వాసనాపరిస్ఫూర్తితోడ.

శా. రాజయ్యుం దనయందు రాజగుణముల్ రాజిల్లు టొల్లండు స
త్పూజాయోగ్యత గల్గుబంధుతతికిం బొందీఁడు ఘోరాజులన్
రాజశ్రేణికి నెందు నోర్వభరమై భాజిష్ణుతం గ్రాలుఁ ద
త్తేజం బాసురమై తనర్చుటకు నుద్వేగించెఁ ద్రైలోక్యమున్.

క. అతఁడు తనతండ్రిఁ జెఱనిడి, యతులితసామ్రాజ్యలక్ష్మి యంతయుఁ గొని యుద్ధతవివిధాసురభటసే, వితుఁడై యున్నాఁడు నీచవృత్తియ పనిగన్.

వ. మఱియు హయగ్రీవుండు హయరూపధరుం డైనకేశియై జనియించె బలిపుత్రుం డగునరిష్టుండు వృషభాకృతి యగునరిష్టుండై ప్రభవించె ఖరుండు ఖరకాయుం డగుధేనుకుండై పుట్టె లంబుండు ప్రలంబుండై పొడమె నిశుంభుండు కువలయాపీడం బనుకుంభియై కలిగె వరాహకిశోరులు చాణూరముష్టికు లనుమల్లులై యుద్భవిల్లిరి వీరెల్లను గాలనేమిసహచరులు కంసభృత్యులై కాళిందీపరిసరంబున బృందావనంబున భాండీరకవటప్రాంతంబునఁ దాలగహనంబున మధురాపురంబునం జరింతురు మయుఁడును మందారుండు నను దానవులు ప్రాగ్జ్యోతిషంబున మురాసురునినందనులై నరకాసురునకు సహాయంబు నొనర్చెద రిట్లు గూడినయాదురాత్ములకు భవదీయగుణకథనంబులందు విద్వేషితయు భవత్ప్రి

భావంబుల దెస ససూయయు నీవార్తైన వారికిం బీడనం బొనర్పుటయు నైసర్గికం
బులై యుండు.

క. కావున నీ వవతార, శ్రీవెలయఁగ మర్త్యమున వసించి యఖిలదై
త్యావలిఁ ద్రుంపుము ధాత్రీ, దేవీభర ముడుపఁ బనుపు దేవాంశజులన్.

సీ. అన్నటయు దేవుఁ డిట్లను నీవు చెప్పినయీదుష్టతతి జన్మహేతువులును
వీరలు చేయు దుర్విగ్రహంబులు లెస్సగా నెఱుంగుదు వీరుగాక మఱియు
నధికరౌద్రులు కాలయవనజరాసంధశిశుపాలకౌశికచిత్రసేను
లాదిగాఁ జెఱుతురు మేదిని నిందఱుఁ బోరిగొనువాఁడ నబ్భరతకులము
పోరితంబును ఘటియించి భూమిదేవిఁ, బ్రీతఁ గావించుపనియు నాచేఁతలింక
నొకటిగలదు నా కెయ్యెడ నుద్భవింపఁ, దగినయెడ గల్గునోయది దడవవలయు.

వ. అనిపలికి లోకపితామహుం జూచి.

క. భూతములభవాభవముల, కీతఁ డధిష్ఠాత గాన నితఁ డిమ్మెయి సం
భూతికి ననుఁ బనిచెఁ బరము, హేతువు దా నెఱిఁగి యదియ యేఁగైకొందున్.

వ. అనినం బద్మగర్భుం డాభువనగర్భున కిట్లనియె.

బ్రహ్మదేవుఁడు విష్ణునితోఁ గశ్యపుండు వసుదేవుండై జనియించిన తెఱంగు సెప్పుట.

సీ. విను తొల్లి కశ్యపమునివరుఁ డబ్ధీంద్రుయజ్ఞధేనువులఁ బెక్కడఁచి కొనిన
నతఁ డేగుదెంచి సన్నానద్రముఁడై కని యవ్విధం బెఱిఁగించి యార్తితోడ
జగదీశ నాసొమ్ము మగుడ నిచ్చెద నన్న ననుమతింపర యమ్మహాత్ముభార్య
లదితియు సురభియు నధ్వరంబులఁ గామదోహినులవి నాకుఁ దోయనిధుల
నన్నిటను దమ తేజంబ యాత్మరక్ష, సేయ జరియించు నాతపస్సిద్ధుఁ డొకఁడు
దక్క నెరుచేతఁ జిక్కవు దానవలచి, నట్ల యామొదవులపాఁడి యనుభవించె.

వ. ఇంక నైనను విడువం దగదె యది యట్లుండె.

ఉ. ఎంతటివారినైన నొకయించుక ధర్మువు దప్పి రేని శా
సింతురు గాదె సత్ప్రభులు చిత్తమునం దిడిచూడు మంతవా
రింతకుఁ జొచ్చి రేనిఁ దెఱఁ గెయ్యది యొక్కడిలోకసేతు వ
త్యంతము పుణ్యమింతయును నారసి చేయుట నీకు నీశ్వరా.

క. నావిని కశ్యపముని దెస, నావిర్భూతమయి పేర్చె నస్మన్మతిఁ గో
పావేశము భావియయిన, దేవహితార్థము దలంచితిం దెల్లముగన్.

వ. అవి రెండునుం గారణంబులుగా నప్పుడు వరుణుం జూచి.

క. ఏయాత్మతోడ గోవుల, నాయనహరియించె నట్టియాత్మయ కొనిసు
శ్రీయుతుఁ డుర్వీస్థలి న, త్యాయతమతి గోపవర్యుఁడై జనియించున్.

తే. అతనిభార్య లిద్దఱు దోనయగువారు, తప్ప దీతప్పనకుఁ దగుదండ మేను
నిశ్చయించితి ననిన నప్పుష్పిమాథి, పతియుఁ గ్రమ్మఱఁ జనియె గోవితతిఁ బాసి.

వ. ఇట్లు నాచేత శప్తుండైన కశ్యపమునీంద్రుండు వసుదేవుండయి యుద్భవించి కంసుగోవులకు నధికారి యయ్యెఁ దత్పత్నులు రోహిణియు దేవకియునై పుట్టి రయ్యిద్దఱువనితలయందును నీవు నీతేజంబు రెండంశంబులుగా విభాగించి యవతారం బొనర్చి యదువంశంబు ప్రశంస నొందింపు మవ్వరుణుగోవులు దారై పొడమిన గోవ్రజంబు లనేకంబులు పరిపాలించుచు నాత్మీయబాల్యంబు ప్రకటకేళీలౌల్యంబు నొందింపంగలవాఁడవు.

శా. నీలస్నిగ్ధవిలోలకుంతలము లు న్నిద్రోరుబర్హస్ఫుర
చ్చూళింబుల్ వనమాలికాలలితవక్షోభాగముం గాంతిమ
చ్చేలాందోళనచారుకక్షమునునై శ్రీనాథ నీబాలగో
పాలాకార మచింత్య మయ్యెడు భువిన్ భవ్యాత్మకశ్రేణికిన్.

వ. అని యిట్లు నీరజాసనుండు నిరూపించినకార్యంబునం బ్రమోదంబు నొంది గోవిందుం డందఱ వీడ్కొలిపి నిజస్థానం బగుదుగ్ధాబ్ధియుత్తరంబునకుం జనియెం దదనంతరంబ.

## నారదుఁడు కంసునితో విష్ణుమూర్తికృష్ణుండయి పుట్టఁగలవిధం బెఱిఁగించుట.

క. నారదుఁడు మధురకేగి యు, దారుం డగునుగ్రసేనతనయునిసదన
ద్వారమున నిలిచి తత్ప్రతి, హారులు దోడుకొనిపోవ నటఁబోవుటయున్.

తే. ఎదురువచ్చి కంసుఁ డెంతయు నమ్రుఁడై, యుజ్జ్వలాసనమున నునిచి వరుస
నర్ఘ్యపాద్యపూర్వ మగుపూజమొనరించి, ముదితుఁజేయుటయునుమునివిభుండు.

వ. అతనివదనంబునం జూడ్కి నిలిపి తదీయులు విన నిట్లనియె.

మ. విను భాగీరథి లోనుగా ననఘ యుర్విం గల్గుతీర్థంబు లె
ల్లను నేనాడుచు దేవభూములకు నుల్లాసంబుతో నేగి సౌం
పొనరన్ సూర్యసఖం బనంబరఁగుమేరూత్తుంగశృంగంబుపైఁ
గనుఁగొంటిం బరమేష్ఠిఁదొట్టి సురసంఘం బేకతం బుండఁగన్.

క. ఇట్టిపరస్పరమంత్రం, బెట్టిదో యని యచట నిలువ నేమని చెప్పం
బెట్టిదుఁ డగునినుఁ జంపుట, కిట్టల మగువెరవు వెదకు టేర్పడ వింటిన్.

వ. మీ పెద్దతండ్రికూఁతు రైనదేవకీదేవి కయ్యెడునెనిమిదవచూలు నీకు మృత్యువు గాఁగలయది నిశ్చయం బిట్లు జనియించుపురుషుండు.

తే. దేవతల కెల్ల శరణంబు దేవపూజ్యుఁ, డఖిలమునకు నాధార మనంతకీర్తి
యాత్మభవుఁడు సమస్తలోకాత్ముఁ డాతఁ, డెవ్వఁడో చెప్ప నేనేయ్య నెఱిఁగెదీవు.

క. ఓయోపినగతిఁ బ్రాణా, పాయప్రతివిధు లొనర్పుమర్థ మఖిలముఁ గా
జేయుము పాత్రత్యాగం, బాయతభోగములు సలుపు మకలంకుఁడవై.

వ. ఇది యనంతరకర్తవ్యంబు నీవారిదినేయ్యంబున నింతయు నెఱింగింప వచ్చితిం
బోయెద నని వీడ్కొని యమ్మహాముని నిజేచ్ఛం జనియెఁ గంసుండు నిజభృత్య
జనంబులదిక్కు చూచి పెలుచ నవ్వి.

మ. చతురుం డంచు నిలింపసంయమిదెసన్ సస్నేహమై యుండు మా
మతి మున్నెప్పుడుఁ గూళుఁడయ్యె నకటా మాబోఁటిసత్త్వాఢ్యులం
దతిహాస్యంబుగ నిట్లు పల్కఁదగునే యజ్ఞాసనుం దొట్టి యే
గతి నేవేల్పుల నేను గైకొనమి నిక్కం బాత్మఁ గానం డొకో.

తే. మేలుకంటి నిద్రించితి మెలఁగుచుంటి, నెడ లెఱుంగకుండితి నెట్టు లున్ననైనఁ
గదిసి నాకుఁ గీడొనరింపఁ గలుగువాని, నెఱుఁగ నిమ్ముజ్జగములనింతనిజము

చ. కినిసితినేని నిద్ధరణిఁ గీడ్పడఁ ద్రొక్కుదు నంఘ్రులన్ దివం
బును దిశలుం బగుల్తు దృఢముష్టిహతింబటుహుంకృతిన్ హుతా
శనపవనార్కశీతకరసంచరణంబులు నివ్వరింతు నా
పెనుపు గలంగునే గిరులు భేదిలినన్ జలరాసు లింకినన్.

వ. అదియట్లుండె మఱియు నొకటి సెప్పెద.

చ. కలపనగంప యీతపసి కాలునునోరును బొటుగాన కె
వ్వలనఁ బరిభ్రమించుచు నుపాయపుబ్రేలరిమాట లాడి ధీ
రుల మదికైన నూరక విరోధ మొనర్చుచునుండు రాజులం
బెలుచన రేఁచి తెచ్చి తల పెట్టు వినోదపుఁదీఁట వ్రావఁగన్.

వ. అదియట్టిద యైన నే మిప్పుడు మనయరిష్టకేశిప్రలంబధేనుకపూతనాకాళియా
హిప్రభృతులకుం జెప్పనది నారదుండు యదుకులంబువలన మనకునపాయంబు
గలదని చెప్పెం గావున నెల్లయెడల నస్మత్ప్రతికూలుల వెదకి ప్రహరింపవలయు
గర్భస్థులగతియు నరసి కొని యుండుట లెస్స మీరును విగతఖేదులరై యభి
మతభోగంబుల ననురాగంబు నొందుండు నన్నుం జెందినవారికి వెఱవులు నెక్క
డివి యని పలికి యభ్యంతరభవనంబున కరిగి యాప్తజనంబులం బిలిచి యే
కాంతంబున.

సీ. వినుఁడు నేఁడాదిగా మనదేవకీదేవి కుచితంపుఁగాపుగా నువిదపిండు
నునిచి యవ్వసుదేవుఁ డుండెడువిధమును సరయుచు నయ్యింతి యంటకుండ
నాడెడువరుసలు నాధానసమయంబు మొదలుగా గర్భంబుమోచునెలలు
నెఱిఁగి ప్రసూతియయ్యెడుకాలమును నాకు నెఱిఁగించునది భర్తృహితము గోరు

వారు రేయును బగలును వంచనయును, నలసతయు లేక యిప్పని యాచరింపుఁ డిట్టు సేతకు గారణం బిట్టిదగుట, దెలియకుండంగ వలయు నెవ్వలన నెఱుఁడు.

తే. మంత్రముల నౌషధముల సమానుషంపుఁ
జందముల నోపియుద్యోగ మెందుఁ జేయు
నట్టివారికి ననుకూలమై ఫలంబు
నెఱపుఁ జూవె దైవంబును నిక్కమింత.

వ. అని యిట్లు కంసుండు దేవకీగర్భధ్వంసంబునందు నిశ్చితుండై విషాదవిహ్వలం బగుహృదయంబుతో నుండె నట బ్రహ్మసూనుండు విష్ణుకడకుం జని.

క. తానుగ్రసేనుసూనుని, మానసము గలంచినట్టిమతమును నతఁడున్
బూని యొనరింపఁ దలఁచిన, యానీచక్రియయుఁ జెప్పె నవ్విభుతోడన్.

క. చెప్పి తనయిచ్చ నరిగిన, నప్పరమేశ్వరుఁడు గర్భహాననవిధంబుల్
దప్పించి తనకు జననం, బొప్పఁగ సిద్ధించుచంద మూహించె నెదన్.

విష్ణుఁడు యోగమాయను యశోదకుఁ గూఁతుగ బుట్ట నియమించుట.

వ. స్వర్గలోకంబునందును మర్త్యభువనంబునందును గలవెరవు లన్నియుఁ వెదకి యద్దేవుచిత్తం బాపాతాళంబును నన్వేషించె నచ్చటం దొల్లి కాలనేమిపుత్రులు షడ్గర్భు లనువారు వారిజాసను నుద్దేశించి దేవాదిచతుర్విధభూతంబులవలనం జావు లేకుండం బడయుటకుం దపంబు సేయం దొడంగిన నలిగి హిరణ్యకశిపుండు కులశ్రేష్ఠుండనై నన్నుఁ బరిత్యజించి యొకనియోగి యాసపడితిరి గావున మీకుం బేరుపెట్టి పెంచినతండ్రిచేతన చావంగలవారని యధోగతులం జేయుటయు సలిలమగ్నులై యుండ నవ్విధం బెఱింగి విహంగమగమనుండు.

చ. చనుతనయోగనిద్ర సురశత్రులయాత్మల నొందఁ బంచి య
త్యనుపమకాలరూప యగునాయమ కిట్లను నీవు వేగ నా
పనుపొసరించితేని నవపద్మనిభానన మెచ్చి యిచ్చెదన్
మునివిబుధేంద్రవిస్మయసముద్భవకారిణి వైనయున్నతిన్.

సీ. అతివ యీషడ్గర్భు లనుదానవులఁ గ్రమంబునఁ గొనిపోయి సంపూర్ణపుణ్య
యగుదేవకీదేవియందు గర్భములుగా నావహింపఁగఁ గంసుఁ డదయహృదయుఁ
డందఱం బుట్టినయప్పుడ చంప నేడవచూలు నాయంశ మవ్వారాంగి
యుదరంబు నెలకొన్న నెయ్యెన నేడవనెల రోహిణీగర్భమొలయఁ జేయు
మదియు నాశ్రగజుండయి యవతరించు, గర్భసంకర్షణమున సంకర్షణుఁడనఁ
గంసభయమున నింతికి గర్భపాత, మయ్యె ననుజనవాదంబునపుడు గలుగు.

వ. తదనంతరంబ యష్టమగర్భంబై వసుదేవునిదేవియుదరంబున నేను నిలిచెద నంద నామధేయుం డగుకంసగోపతిభామిని యైనయశోదకడుపున నీదగుతేజంబు నెలవు

కొలుపు మిద్దఱమును సమకాలంబునన యష్టమ్యవసానంబున నసమీముఖంబున నర్ధరాత్రసమయంబునందు జనియింతము, మనకుం బరస్పరవ్యత్యాసంబు సంభవించినం గంసుం డెఱుంగమింజేసి నిన్ను శిలాతలంబున వ్రేయం బూన్చిన నీవు వంచించి గగనంబునకు నెగసి మత్ప్రసాదంబున మహానుభావ యయ్యెద వవ్విశేషంబునంజేసి.

సీ. నామేనితోఁ దుల్యమై మేను నవమేఘకాంతి నొప్పార సంకర్షణునకు
నెన యైనవదనపూర్ణేందుఁడు శోభిల్ల నెనిమిది బాహువు లెసఁగ శార్ఙ్గ
చక్రగదాఖడ్గజలరుహమధుపాత్రముసలశూలముల నుల్లసితములుగ
నుజ్జ్వలహారకేయూరాదిదివ్యభూషణగంధమాల్యవిస్ఫారలీల
నీలకౌశేయవసనవై నిఖిలసిద్ధ, గణము పూజింప దివికేఁగఁ గలవు నిన్ను
నెమరువచ్చి తోడ్కొనిపోయి యింద్రుఁ డెలమి,నాదిశక్తిగనభిషేకమాచరించు.

వ. నీవు నాకు నక్కౌశికునకుం జెలియలవై కౌశికి యనుపేరం బ్రసిద్ధివహించి వింధ్యాచలంబు నివాసంబుగా నుండి శుంభనిశుంభులను దైత్యుల వధియించి లోకహితం బొనర్చెదవు సన్నతియు మతియుఁ బ్రభయుఁ గాంతియు నిద్రయుఁ గాలరాత్రియు ననునామంబులు నీకు వాచకంబులుగా మహామునులుం గీర్తింతు రార్యులై కొలుచువారికి దారిద్ర్యబంధవధ ప్రముఖంబు లగుదుఃఖంబు లపనయించి యాయురారోగ్యధనధాన్యపశుపుత్రభృత్యాదికంబు లగుకల్యాణంబులు కరుణింపు మేమును గంసధ్వంసంబు గోరి యతనిగోపులం గాచుట వినోదంబుగాఁ గొంతకాలంబు నడపెద ననిన నద్దేవి యక్కార్యంబున కియ్యకొనియె నచ్యుతుండు నచ్చోటన యంతర్హితుం డయ్యె నంత నిక్కడ.

తే. యోగనిద్రాప్రభావసంయోజనమున, నెలయుషడ్గర్భలను గర్భములుగఁ దాల్చె
ధీరతమ యగువసుదేవుదేవి దనకుఁ, దవులుదేహదుఃఖం బెల్ల నవధిపొావ.

చ. అరసి ప్రసూతకాలములయప్పుడు రక్షులెఱింగి చెప్పఁగాఁ
గరుణ యొకింతలేక యెఱగంపుల దేవకిగన్నయార్వురం
బరుషవిశాలఘోరశిలపైఁ గడకాళులు వట్టి వ్రేసి యా
సురముగఁ జంపెఁ గంసుఁ డురుశోణితము ల్చెదరంగఁ జెచ్చెరన్.

వ. సప్తమగర్భంబు సప్తమం బగుమాసంబున విష్ణునియోగనిద్రచేత సంకర్షించుకొని పోవంబడి గోకులస్థిత యైనరోహిణియుదరంబు నొందె నివ్విధంబున గర్భశోభనంబు సంప్రాప్తంబై.

రోహిణీదేవిగర్భంబునుండి బలరాముండవతారంబునొందుట.

క. నెలలన్నియు నిండఁగ న, న్నెలఁతకు జనియించె నిండునెలపున్నమనన్
నెలకొని యుదయించుపగిది, నెలమి కొడుకు సకలకువలయేచ్ఛాకరుఁడై.

వ. ఇట్లు పూర్వవిహితనామధేయుం డగుసంకర్షణుజన్మానంతరంబ.

క. దేవకియష్టమగర్భము, దేవోత్తముఁ డైనవిష్ణుదేవునియంశం
బావిష్కృత మయ్యె నిఖల, దేవహితార్థంబు దీప్తదివ్యవిభూతిన్.

క. పదునాలుగుజగములు దన, యుదరంబున నునిచికొన్న యుదితమహిమునిం
బొదవం దాల్చెను గృశమగు, నుదరంబున నువిద భాగ్యయోగము పేర్మిన్.

సీ. పొక్కిట నెత్తమ్మి పొలుచునియ్యామపట్టి కనువిధంబునఁ దనర్చారె నాభి
హరినీలవర్ణుఁ డీహరిణాక్షిసుతుఁ డనుచాడ్పున నలుపెక్కెఁ జన్నుమొనలు
ధనశౌబ్జనిభము లీతరుణిపుత్త్రునికన్ను లనులీలఁ గడుఁ దెలుపారెఁ జూడ్కు-
లధికనిద్రాళుఁ డీయబలతనూజుఁ డన్భాతిఁ జెయ్వులు జడభావ మొందెఁ
దనువు వెలుకఁబారెఁ దగిలెఁ గోర్కులు కొను,పొదలె వళులు విరిసె నుదవె ఖేద
మనుపమానగర్భజనితమై శ్రమపరి, ణాహ మలరె వికచనలినముఖికి.

క. ఏదివసం బాదిగ న, ట్లాదేవకి దాల్చె గర్భ మదియ మొదలుగా
మోదమున నందపత్ని య, శోదాదేవియును లీలఁ జూలు ధరించెన్.

వ. అంత నిక్కడ దశమమాసంబునందు.

దేవకీదేవిగర్భంబుననుండి శ్రీకృష్ణుం డవతరించుట.

మ. మహితశ్రావణమేచకాష్టమి నిశామధ్యంబునం బ్రస్ఫుట
గ్రహముల్ స్వోచ్చగృహంబులం దయిదు విభ్రాజిల్లఁ బుత్త్రున్ యదూ
ద్వహుఁ బుణ్యాంగన గాంచె విశ్వజగదాధారోదయున్ ధర్మని
ర్వహణారంభధురీణు నిత్యవిభుతావర్ధిష్ణునిం గృష్ణునిన్.

వ. ఆదేవుదివ్యావతారంబున సకలచరాచరంబులుం బ్రమోదభరంబు నొందె మంద
సమీరుండు సమీరితసౌరభసుఖస్పర్శుండై చరించెఁ దాపసాగ్నిహోత్రంబులు
ప్రదక్షిణజ్వాలాజాలంబులై వర్తిల్లె సాగరంబులు సమ్మదసంభ్రమంబులం బొదలె
దెసలు ప్రకాశంబు లయ్యె నంబరచరంబు లగుతేజంబులు తేజోతిశయంబున
నలరె నంతర్ధానగతులై యాదిత్యులామోదితకుసుమవర్షంబులు గురియించుచు
ననేకవాక్యంబుల నమ్మహాప్రభావుం బ్రస్తుతించిరి దివ్యంబు లగువాదిత్రంబులు
ప్రదీప్తవిచిత్రధ్వనులం జెలంగె గంధర్వగానంబులు నప్సరోనర్తనంబులుం బ్రవ
ర్తిల్లెఁ బాతాళవాసు లగువాసుకిప్రముఖు లుల్లాసభాసితు లై రిట్టివై జజనసం
ప్రమోదసంకులంబునందు.

ఉ. కావలివారిఁ దొట్టి పురిఁ గల్గుజనంబులలోన గాఢని
ద్రావివశత్వ మొందనివిధంబున వా డొకరుండు లేఁడు ల
క్ష్మీవరుమాయఁ జేసి గతచేతనులై నటు లుండి రయ్యెడన్
దేవకియుం బ్రభుండు వసుదేవుఁడుఁ దక్కఁగ నెల్లవారలున్.

క. ఆవృష్ణివరుం డాత్మజు, నావిర్భావం బెఱింగి యంతర్గృహమున్
వేవేగఁ జొచ్చి నడురే, యావనజాప్తుండు పొడిచినట్లై యుండన్.

మ. నెఱులై యొప్పువినీలకేశములు నున్నిద్రానవాబ్జంబునే
ర్తెఱ నూత్నాంబుదతుల్యకాంతియును నై దివ్యప్రభావంబునం
గఱయున్ మాఁగును లేక పుట్టినశుభాంగం బద్భుతాపాదియై
నెఱయం గన్నులు విచ్చిచూచుతనయున్ వీక్షించి మోదంబునన్.

తే. పాపకర్ముఁడు కంసుఁ డీపట్టిఁ బట్టి, యెగ్గుసేయఁగ నకట నేనెట్లు సూతు
నెవ్వరును గానకుండంగ నిపుడ కొనుచు, నరిగి యొండుచోఁ దాఁచెద నని తలంచి.

సీ. ఏవేదనయు నొంద కింపారఁ బుత్రునిఁ గని యింక నెట్లొకో కర్జ మనుచు
నివ్వెఱపడి యున్ననిజపత్ని కవ్విధం బల్లన నెఱిఁగించి యవ్వరాంగి
తొడలపైఁ గల్పాంతతోయధివటపత్రతలమునం దున్నచందమున నున్న
శిశువు నెయ్యాన నెత్తి చేతుల నల్లనఁ బొదివి వెచ్చెర నంతిపురము వెడలి
నందగోపునింటికిఁ జని నవ్యసూతి
యయ్యశోదయు విష్ణుమాయావిమూఢ
యగుట నొండెఱుఁగక యున్కి నాతఁడచటఁ
గొడుకుఁ బెట్టి యాయమకన్నకూఁతుఁ గొనుచు.

వ. మగిడి చనుదెంచి దేవకీదేవితల్పంబున నిడి తాన పోయి తత్ప్రసవంబు కంసు నకుం జెప్పిన.

మ. తలయుం జీరయు వీడ సంభ్రమముతో దై వ్యాపఘాతంబున
గ్గలికం గ్రుళ్ళుచుఁ బాఱుతెంచి వెస నాకష్టుండు తత్సూతికా
నిలయద్వారమునందు నిల్చి శిశువుం దే తెమ్ము తెమ్మంచు నా
కులుఁడై పల్కఁగఁ గృష్ణమాతయును సంక్షోభార్తయై యత్తఱిన్.

కంసుండు యశోదకుఁ గూఁతురై పుట్టినయోగమాయం జంపంబూనుట.

క. అన్నా యలుగకుమీ నా, కన్నది యిదె యాఁడుబిడ్డ గావుము దీని
న్నిన్నొకటిసేయఁ గలదే, కన్నియ యతిలోక పురుషకాగసమగ్రున్.

ఆ. మొదలఁ బెక్కుగర్భములు నీబ్రదుకుకుగోరి, వరుస నొప్పింపనే మగవారలైన
నడుగవయ్య యాగ్రహము నాయెడఁ బ్రసాద, దృష్టిపరఁగింపవే జగద్వినుతవిభవ.

వ. అని ప్రార్థించిన నచ్చటివనిత లొక్కపెట్ట హాహాకారంబు లొనర్ప నభ్యంతరంబు సొచ్చి యచ్చేడుగం దప్పాప నెప్పటిరాతితో నడుచుటకై పూనియెత్తినమెత్తనఁ బ్రిదిలి చదలున కెగసి యయ్యగ్గలియద్భుతాకారిణియై యుండుండి.

క. తనచేతిపానపాత్రం, బున నొలికెడిదివ్యమధువు ముదమున నాస్వా
దన మొనరించి మదోద్ధత, నినదంబునఁ బెలుచ నవ్వి నిష్ఠురభంగిన్.

వ. భయవిస్మయంబులు మనంబునం బెనంగొనం గనుంగొను భోజపతి నుద్దేశించి.

ఉ. ఓరిదురాత్మ నన్ను నిటు లుగ్రతఁ బట్టి శిలాతలంబుపై
బోరనవ్రేసి చంప నిటఁ బూనినతప్పున కేను నిన్ను నీ
దారుణశత్రుఁ డాహవవిదారితుఁ జేయఁగ మృత్యుమూర్తినై
క్రూరతఁ బ్రాణముల్ రుధిరకుల్యయుఁ గ్రోలుదు నెక్కుపూఁవునన్.

క. ఇంకేమి త్రుళ్లఁగల విదె, యింకె నహంకారపంక మెల్లనునుచు ని
శ్శంకత నద్దేవి సనియె, సంకులమై తన్ను సిద్ధసంఘము గొలువన్.

వ. ఇక్కడఁ గంసుండును దేవకీదేవికిం గృతాంజలియై యిట్లనియె.

ఉ. ఏనిటుప్రాణరక్షకయి యెంతయుఁ బాపముసేసి గర్భసం
తానవిఘాతినై నిను నుదంచితశోకపయోధి ముంచితిం
బూనినమత్కృతం బఖిలమున్ వృథ యయ్యె విధాతచెయ్వు లె
వ్వానికి మాన్పఁగా నకట వచ్చునె మానుషతుచ్ఛయత్నతన్.

క. విను చంపఁ జెఱుప మనుపను, ఘనతర మగుకాల మొకఁడ కర్తమనుష్యుం
డునిమిత్తమాత్ర మింతియు, యనయమ్మును గాలపాక మైనక్రియలకున్.

తే. కాన నింతయుఁ దలపోసి మాను మింక, నఖిలదుఃఖచింతామయం బైనకలఁక
యేను గాలుగేలును బట్టి యిదె వినీతి, వేఁడికొనియెదఁ బరమపవిత్రచరిత.

వ. అనిన నద్దేవి యశ్రుపూర్ణనయనయై యిట్టిశోకంబు నా కనుభవింపను మద్గర్భం
బులకు నిట్టిపోకలం బోవను మున్న కడగట్టినతెఱంగు నీ వేమిసేయు దని యుచి
తంబుగాఁ బలికెఁ గంసుండునునిజగృహంబునకరిగె నంత నాప్రొద్ద వసుదేవుండు.

క. ముదమెసఁగ నందగోపుని, సదనంబున కేగి పుత్రజననంబున స
మ్మదభరితుఁడై నయుతనిన్, హృదయప్రియసుహృదుఁగాంచి యిట్లనియెదగన్.

మ. సుతు సత్యద్భుతలక్షణాన్వితునిఁ దేజోభాసితుం గంటి వీ
వతిధన్యుండవు భామినీసహిత మీయాత్మోద్భవుం గొంచు ధీ
యుత మీచోటగుగోకులంబునకుఁ బొ మ్మారేల వ్రేపల్లె నా
సుతుఁ డారోహిణి గన్నవాఁడును భవత్సూనుండకాఁ జూడుమీ.

తే. వాఁడు పెద్దవాఁడు వీఁడు రెండవపట్టి, యనుతలంపుతోడ ననఘ నీవ
పెనుపు మడవిలోనఁ బెక్కుపాయంబులు గలుగు నేమఱమియు వలయుఁజుమ్ము.

ఉ. పుట్టఁగఁ బుట్టఁగాఁ దునిమెఁ బుత్రులఁ దేవకి గన్నయందఱం
గట్టిఁడిపాపజాతి యగుకంసుఁడు తద్విధి చిత్తమున్ వగం
బెట్టెడు రోహిణీకలితపిండ మొకండును దప్పె వీని నీ
వెట్టయినన్ మహాత్మ భరియింపుము దీవనఁ బొందు మెంతయున్.

వ. ఇట్లు శిశుఘాతిని యగుపూతనకుఁ గంసుపనుపున శిశుహింసాన్వేషణంబ పనియై యుండు నీవీప్రొద్ద యిచ్చోటు వాసి చని వేగకమున్న మంద సారవలయుం గులాయలీనంబు లగుపక్షు లెలుంగులు సూపెడుఁ బ్రాగ్దిశాభాగంబును బ్రారబ్ధప్రభాకరవికాసం బగుచుఁ జనుదెంచె నీకు నిప్పురంబునం గరప్రదానం బొనరింప వచ్చినపనియును సంపన్నం బయ్యెఁ దడయవలవ దనిన నట్లకాక యని యగ్గోపముఖ్యుండు.

తే. పురిటిపాపనిఁ దొట్లలోఁ బొందుగాఁగఁ, బెట్టి మోపించుకొని తాను బ్రియసతియును
మేటిగుజ్జులఁ గట్టినపాటబండ్లి, నెక్కి శీఘ్రంబ మందకు నేగె నెలమి.

### నందుఁడు మధురాపురంబుననుండి వసుదేవునాజ్ఞచే వ్రేపల్లెకు వచ్చుట.

వ. ఇట్లు చని పుష్పితఫలితానేకతరుషండమండితం బగుకాళిందీతటంబున నలుదెసలం బొడవుగా నమర్చిన బలితంపుముళ్లు వెలుంగులం గరంబు జతనంబులై యొప్పు పెన్నుదొడ్లం గ్రమంబునం బ్రమోదంబున వేకువం బోకుమేసి వచ్చి గోమంథనవదనంబుల విహితశయనలై సుఖయించుకదుపులలోన వేఱైనఁ బేరుపేరం బిలువం బంచ తిల్లుచు నుల్లసితహుంకారంబు లగువదనంబులతో నున్ముఖలగుతల్లులకు నభిముఖంబులై హర్షప్రతినినదంబులు వొదలం బొమలనుండి యొండొంటి దాఁటుకొని కలియు బాలవత్సంబులయుత్సవసంచారంబులవలనను వెదయావుల వెనుకం దగిలి యొండొంటిం జేరనీక బలియుఱంకెలం బొదివి కాలుద్రవ్వి క్రోడాడుచుఁ బొగరు మిగిలి కెఱలెక్కిన మెడలునువలుద మూఁపురంబులును వెడఁదపిఱుఁదులును దోరంపు గంగడోళ్లును నైకాఱిలువృషభంబులదర్పవికారంబువలనను మొదవులనోరిమరువులుం బెయ్యలరేణంబులుం బాలకుండలమసలునుందమయొడళులకు నెడపడనితొడవులుగాఁ బిదికి యరుద్రాళ్లుం దలుగులు తలమొలలం జుట్టి యిట్టునట్టునుం గలయఱ బాఱి క్రేపుల నేర్పఱించువారును వల్లియలు వైచి కోడెలం బట్టి పెనఁచి కాఁడాళ్ల జట్టికారులకు వశంబు సేయుబరవసం బెసంగఁ గ్రుమ్మరువారును జూఁడుఁ గొడుపులును వాదోళ్లు ముకుబంతులు మొదలుగాఁ గలసాధనంబులు గొని వచ్చి తెవులుగొంటులఁ జికిత్సించువారును గ్రేపులం గొననియావులం దోలఁగం గట్టి పిల్లువెట్టియు మందులు సల్లియుం జాలదుఃఖపఱిచి చేఁ బెఱింగించువారును మఱియుఁ బెక్కువిధంబులఁ దమతమకై యెడపడని కావటిమోపులకతనం గందికాయలుగాచి వంగినవలుదమూఁపులును ముదుకవన్నె లంటికొనుట మెదుకగొని మొదుకనయి పిడిచినం బాలవలచుచుంచుతలలును బసులకొమ్ములతాఁకుల నడవిక్రంపయేట్ల మన్నియముచ్చులపోట్ల బెరసినగంట్లుం గఱకెక్కినయవయవంబులు నెట్టసెరలతోడికెపిలకన్నులవెడంగుచూపులును బెడిదంబు లగు గొంతుపెలుంగులుం గలిగి యొల్లయొడలనుం బ్రుల్లు గొల్లలపెల్లువలనను జను

కట్టులుగట్టి భుజమూలంబులజిగిసొంపు లంకిలిమెఱసి సెలయుం జిలుమూరు నిత్తడికడియంబులుం గంచుటుంగరమ్ములు నమరం గోమరారు నాఁచుదీఁగలు గలయం బ్రాఁకినం బోలుచు కెందామరలం దెగడుచేతులం గడవలవ్రాతులు పదిలంబులుగా నూఁది చెదరినచికిచికివెంట్రుకలు పొదువుటం జిఱుమొగులు మొలకలు బలసినకొలనెలలకుం బోటియగునెన్నుదురుల నున్న చెమరులుఱ దురం గలింప గగువంపుడప్పి నొప్పు నిదురయూర్పులుం దమలో బెరసి యాడుమాటల తమకంబున నినుమడియై నిగుడ వడవడవడంకుచున్న చన్నుగవలును బ్రేఁగుపడు పిఱుందులుం బోలయుచూక్కులునై యొక్కొక్కతో యంబులం గూడి సరి త్రోయంబులం దెచ్చుజలవాహికలును గాంచనకంకణఝుణఝుణత్కారంబులం గంఠసూత్రవలనంబుల బాహులతాందోళనంబులం బయోధరసంఘర్షణంబుల శ్రోణిసన్నహనంబుల మృదుగీతమాధుర్యంబుల మనోహరంబు లగుదధిమథన వ్యాపారంబులం జాలఁ బారిఁ లగుబాలికలును ఘృతతక్రవిక్రయంబు గృహ సమ్మార్జనంబు శిశుసమాశ్వాసనంబు బాలకభృతకభుక్తిప్రదానంబు మొదలయినపనులం జిడిముడిపాటు పొలయమెలంగుగరిష్ఠకుటుంబినులును నైనగోపికలయుదాత్తచేష్టితంబులవలనను సర్వప్రకారసుభగంబయి వసతృణచ్ఛన్నకుటీరకవాటంబులును నవర్గళాలంకృతవాస్తుసీమంబులును విశంకటశకటనికటార్పిత మంచకంబులును నాజ్యపచనసుగంధియుఁ దవ్యమానదుగ్ధచూత్కారముఖరంబును నర్భకకబళవిగళితమస్తుసిక్తకరీషస్థలంబును దధిబిందుసుందరవేదికంబును నైన యమ్మహాఘోషంబు ప్రవేశించి.

తే. వృద్ధు లగుగోపముఖ్యులు వేడ్కఁ దన్ను, నెదురుకొనియభినందింపనింపుమిగులఁ
దాను నందఱ నధికహృద్యముగఁ బలికి, యాదరించుచు వారుఁ దో నరుగుదేర.

వ. నిజసదనంబునకుం జని వృద్ధగోపికలు పుత్రసమన్విత యగుయశోదకు నొనర్చునవ సూతికామంగళం బంతరంగంబు హర్షోత్తరంగంబు గావింప బాలార్కసన్నిభుం డగుకుమారు రోహిణి యెదురొకొనిన నద్దేవికి సభక్తికంబుగా సంభావనంబుగా వించి భావం బలరం బూర్వప్రకారంబున నుండె నిట్లు కృష్ణుండు గోకులంబున గోపికాపర్వంబై యత్యద్భుతం బగుప్రభావం బపరిభావ్యంబుగా నుండునంతం గొన్నిదినంబు లరిగిన.

క. మునుకంసునిపనుపున గ, ర్భనిపాతము శిశువధంబుఁ బనిగా నెచ్చో
టను దిరుగుదనుజనివహం, బున కగ్రణి దురితచరిత పూతన యనఁగన్.

వ. ఘోరాకార యగునిశాచరి నిశాసమయంబున నర్భకుల వెదకుచుం జనుదెంచి నందగోపశకటంబుక్రిందం దగుతల్పంబున నుత్తానశాయి యైనవెన్నునియంతికం బున నంతంత నిలిచి.

క. ఆమూర్తి యట్టితేజం, బామహిమ నిజాంతరంగ మద్భుతభీతి
వ్యామోహితంబు సేయం, గా మెత్తనఁ గొంతసేపు కనుఁగొని యలుకన్.

క. వీఁ డెల్లబోఁటిబాలుఁడు, గాఁ డాకంసునకుఁ గీడుగావించుటకై
పోఁడిమి యెసఁగ జనించిన, వాఁడ యగును వీనిఁ దునిమివై చెద ననుచున్.

సీ. పండులు గొఱుకుచుఁ బదరి హుమ్మని మిడిగ్రుడ్డులనిప్పులుగ్రుమ్మరిలఁగ
నడరెడుకటములు నాకుంచితము లగుబొమలును నుదుటిపైఁ బొడముచెమరు
మెఱుఁగుకోఱలుఁ బేర్చి యెఱ్ఱమంట లందందఁ జల్లెడుబహుళనిశ్వాసములును
నాగ్రహంబునఁ బొరి న్యాకంపితము లగుకరములునై భయంకరముగాఁగ
జననిపొదిఁగిట నున్నబాలునిఁ గడంక, నెత్తికొని యొమ్ముపై నిడి యొత్తి విషపుఁ
జన్నుమొనలు తదాననాబ్జమున నదిమె, నమముటయుఁ బాపఁడార్తుఁడై నట్లపోలె.

శ్రీకృష్ణుఁడు పూతనప్రాణంబులు స్తనదుగ్ధంబులతోఁడంగొనిచంపుట.

ఉ. ఎత్తిలి కావుకావు రని యేడ్చి తదీయపయోధరాగ్రముల్
కుత్తుకదాకఁ బీల్చికొని క్రోలెఁ గ్రమంబునఁ జన్నుఁబాలతో
నెత్తురు మున్నుగాఁగ గణనీయములై చనుసప్తధాతువుల్
పొత్తుగఁ బ్రాణము ల్చనఁటిబొందియ త్రికక్కఁగ నెక్కవ్రేల్మిడిన్.

క. రక్కసికిఁ దాను నెక్కుడు, రక్కసయై కృష్ణుఁ డిట్లు క్రౌర్యావేశం
బక్కజముగఁ బచరింపఁగ, నక్కుటిలాసురియు గెడసె హాయనుచు భువిన్.

తే. అధికవిస్వరం బైనయయ్యార్తనాద, మునకు మందలోపలఁ గలజనము లెల్ల
మేలుకని రటమున్న యబ్బాలునేడ్పు, విని యశోదయు మేల్కని విహ్వలించి.

వ. తన ముందర మును ప్రసుప్తుం డైననందనుం గానక నందగోపునిం బిలిచిన
నతండు నాలోనన యుదరిపడి తెలిసి పఱతెంచె నిల్లిల్లవారునుం జనుదెంచి శక
టాంగమాత్రంబు లగునేత్రంబుల గ్రుడ్లుదిరుగంబడి వికృతంబులై మెఱవ నతి
మాత్రదైర్ఘ్యంబు లగుపాణిపాదంబులు విరియం బడి యొడలు పగిలి యెమ్ములు
నలిసి చర్మంబు ప్రోవై యున్నయన్నిశాచరిచందంబునకు నాశ్చర్యంబునుభయం
బునుం బొంది తమత్సంగంబునఁ బతంగుభంగి నెసంగు కృష్ణునిం గాంచి రప్పుడు.

తే. అకట నేఁజెల్ల నేఁజెల్ల హాకుమార, హాతనూభవ హావత్స యనుచు నార్తిఁ
దల్లియునుదండ్రియునువచ్చితనుజుఁబొదివి,రమ్మొగేతుణబాష్పాకులాక్షియగుచు

వ. బాలుని గ్రుచ్చియెత్తి యురంబున నదిమికొనియె నందుండు నయ్యిందువదన నిది
యేమి యీరక్కసి యెక్కడ నుండి వచ్చె నిచ్చిఱుతవాని నీచందంబు సేయ
నీ వేల యేమఱితివని నయ్యబల యతనితోడ.

తే. కడుపునిండఁగఁ జన్నిచ్చి కొడుకు నిద్ర, వోవ దీవియ మండఁగఁ బ్రొద్దువోవు
నంతదాఁక మేల్కనియురిడీ యలసి కన్నె, కింతమూసితి నాలస్య మేది యుందు.

క. ఈపాపజాతి రక్కసి, యేపగిదిఁ గడంగి యిచటి కేతెంచెనొ యీ
పాపం డిమ్మెయి నెట్లో, ప్రోపఱియెనొ దేమిమాయ పుట్టెనొ యెఱుఁగన్.

ఉ. కానకకన్న పట్టి యిటు కట్టిఁడి రక్కసవాతఁ జిక్కియుం
దానొకకీడు నొందక ముదంబున నాకిదె చేరె నిక్కువం
బేనలినాక్షుకింగలదె యిట్టితపంబునపేర్మి చంద్రబిం
బాననుఁ డింక వీఁడు పరమాయురుపేతుఁడ యెల్లభంగులన్.

వ. అనియె నంత నఖిలగోపాలకులు నయ్యపాయంబు దప్పినయొప్పిదంబు వేనవేలు భంగులం గొనియాడి యాడాకినీకళేబరంబు దొలఁగం దిగిచిరి నందుం డానంద వికసితాననుండై సూనుం దా నెత్తికొని గోకరీషమిశ్రితం బగుభూరజంబున రక్షాతిలకంబుఁ బెట్టి.

సీ. శ్రీనాయకుండు రక్షించు నీముందర వేధ రక్షించు నీవెనుకదిక్కు
వరుస నీదక్షిణవామభాగంబులు రక్షింతు రవ్విరూపాక్షగుహులు
నీమీఁదు దిగువయు నీరజాహితుఁడు వాసుకియు రక్షింతురు ప్రకటకరుణ
దిక్కులు గాచ్చు నీతక్కినచోటులు రక్షింతు రెప్పుడు నక్షతముగ
స్వస్తి గావించు నీకు వృషధ్వజుం డ, నాకులైశ్వర్యశాలి పినాకపాణి
నిత్యశివ లగుగోవులు నియతపుణ్య, యైనభూమియు నిను నెల్లయందుఁ బ్రోచు.

వ. అని యిట్లు బాలరక్షణార్థంబు పూర్వమునికల్పితంబు లగుమంత్రంబులు జపియించి ప్రయత్నంబునఁ గుమారు నరసికొని యుండ నమ్మహోసత్త్వుండును మహాత్త్వదీప్తుండై వర్ధిల్లుచున్నంత.

సీ. వసుదేవుపనుపున వసుమతీదేవుండు గురువృత్తియుతుఁడు గర్గుండు నాఁగఁ
జనుదెంచి రోహిణీతనయునకును యశోదాతనూభవునకుఁ దగఁ గ్రమమున
జాతకర్మోత్తమసంస్కార మనురూపవిధ్యుపేతముగఁ గావించి వారి
కభిధానములు రాముఁ డనియుఁ గృష్ణుం డనియును మహనీయగుణోచితంబు
లై ప్రసిద్ధత నొందెడునట్లుగా నొ, నర్చి తనరాకపోకలు నరుల కొరుల
కెఱుఁగ రాకుండునట్లుగా నేగ నవ్వ, ధంబునకు నందగోపుఁ డెంతయును బొంగి.

క. భూసురులం బిలిపించి మ, హోసరసము లైనయంచితాన్నముల సము
ల్లాసమున నొసఁగి గోవుల, వాసస్సుల నిచ్చి యుత్సవము సేసి తగన్.

వ. గోకులంబునం గలచుట్టంబుల కెల్లం గట్టనిచ్చి గోవులఁ బూజించి గోవాటం బలంకరించె నిట్టికల్యాణంబున సంతసిల్లి.

తే. దొడ్డవీఁగి కనియెఁ గొడుకు నెంతయుమూర్తి, మంతుఁ నెలఁతలందుమహితభాగ్య
యొక్కతియ యశోద యుర్విపై ననుచు వ్రే, పల్లెఁ బొగడి రెల్లపడఁతుకలును.

శా. సిద్ధంబై తనరారుమూర్తిగరిమన్ శ్రీమంతుఁడై దీప్తియం
దిద్ధార్కప్రతిమానుఁడై నతనయుం డిట్లబ్బె వీఁ డెంతయున్
వృద్ధశ్రీనభివృద్ధిఁ బొందు మనుచున్ వేవేలచందంబులన్
సిద్ధాత్ముం డగునందగోపు వినుతించెన్ గోపకవ్రాతముల్.

వ. అంత నక్కడఁ గంసుండు పూతనపోయినపోక నిజాప్తులగు దనుజులచేత విని నందగోపతనయుదెస శంకించి మున్ను కౌశికాదేవిచేతిపరిభూతివలన మొక్కపోయి లజ్జించి యున్నవాఁడు గావున సాహసోత్సాహంబు దక్కి శకటాసురుం డాదిగా రక్కసులఁ బెక్కండ్ర నక్కుమారుదిక్కునఁ గీడుగావింపఁ బనిచె నట్లు పనుపువడినవారిలో శకటుం డనువాఁడు నందగోపునిప్రియశకటంబు నావేశించి తనమాయ నెదిరికి భావింపరాక యుండె నంత నొక్కనాఁడు.

ఉ. పాపని నిద్రవుచ్చి తగుపాన్పునఁ దచ్ఛకటంబుక్రిందఁ దాఁ
దీపెసలార నుంచి సుదతీతిలకంబు యశోద వేడుకన్
గోపసతీసమేతముగఁ గోరి సమీపగయై తనర్చున
య్యాపగ నీళులాడుటకునై చనియెం ద్వరమాణచిత్తయై.

క. ఒక్కింతవడికి నర్భకుఁ, డెక్కడ మేలుకని యొద్ద నెవ్వారును లే
కెక్కు డగుశిశుత్వము మెయి, నెక్కొన చాపలము లెల్ల నెఱసి తలిర్పన్.

శా. నూరం జేతులు రెండు గ్రుక్కికొనుచు న్మోమెల్లబాష్పాంజన
స్మేరంబై తిలకింప నేడ్చుచుఁ బోరిన్ మీఁజేతులం గన్నులిం
పారం దోముచు చేవఁబూని పెఱుఁ దొయ్యన్మీఁది కల్లార్చుచున్
శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజికొనుచుం జెల్వంబు రెట్టింపఁగన్.

క. తనమాయాజాలంబుల, మునిఁగి సకలలోకములును ముగ్ధంబులుగాఁ
దనరెడుప్రౌఢుఁడు లోకము, తనమార్గ్యంబునకుఁ బ్రముదితం బగుచుండన్.

శ్రీకృష్ణుఁడు శకటాసురుని సంహరించుట.

వ. అట్లుండి యచ్చట.

సీ. ఒకదిక్కు దొరగల్లొఱగి పైఁబడుదునో తొలఁగి కమ్ములు వ్రేయ నిలచలింపఁ
దొడరి వే పఱతెంచి త్రొక్కుదునో పలుగాఁడి లోనై నయంగముల నొకట
నెడలించి మీఁదట నిసఁగెడుపరపెల్లఁ బడద్రోచి యడఁతునో పడుచు నేమి
పేరవున వధియింప దొరకొను నాకిది యవసరం బని తనయాత్మఁ దలఁచు
శకటుతలఁ పెఱింగి చయ్యన నాలోనఁ, జరణ మొకటి లీలఁ జాఁచితాఁచెఁ
దక్షిణంబ బండి తలకెడవై, పాసి, యవ్వల సంధు లెడలి యవనిఁ జెదర.

తే. వేగ స్నాతయై తగ వెలఁది యయ్య, శోద తోడిగోపికల నచ్చోన డించి
సరసహార్ద్రితఁ జేఁపెడుచన్ను లదిమి, కొనుచు వత్సంబుఁ దలఁచినగోవుఁబోలె.

వ. అతిత్వరితగతి నేతెంచి విపర్యస్తంబైనశకటంబు నంతంతం గని హాయనుచుం
బఱతెంచి పుత్రునెత్తి యుదరంబున నదిమికొని.

ఉ. నిన్నిటు పాఱవైచి తగ నిద్దురవ్రోయెదుఁ బాపఁడంచు నే
మిన్నక నీళ్లనాట యనుమిత్తికి నేటికిఁ బోయితి న్నిజం
బన్న కుమార యింకిపుడ యర్థిభవజ్జనకుండు వచ్చి న
న్నెన్నిదెఱంగులం బఱుపఁ డింతయుఁ జూచి తనర్చునల్కతోన్.

క. ఈమెయి శకటం బెడలుట, కేమిగతము దీని నెవ్వ రెఱుఁగుదురు విభుం
డేమె యిది యనిన నుత్తర, మేమిగలదు వచ్చె బెడఁద యిప్పుడు నాకున్.

వ. అని తలంకుచు సంకతలంబునఁ గొడుకు నిడి చన్నిచ్చుసమయంబున.

సీ. పరిమితపలితైకభాసురం బగుకేశసంచయం బారణ్యసంచరమునఁ
బురుపులరాలు కేసరముల నత్యంతధూసరంబై కడుమూసరముగ
గోఖురోద్ధతరేణుకుంఠితం బగుమోము చెమరుబొట్టులఁ జాల జెన్నుమిగులఁ
గట్టినచెంగావికాసె లేఁజిగురులజిగి నూనె నన నతిస్నిగ్ధకాంతి
నలరఁ గర్కశగ్రంథిలయష్టిచేతఁ, బట్టి గోపాలపరివారబహువిధోక్తు
లెలసి చెలఁగంగఁ గదుపులవలననుండి, వచ్చె నందగోపుఁడు నిజావాసమునకు.

వ. వచ్చి విస్రస్తచక్రంబును విభగ్నాక్షంబును విభిన్నభాండంబును నైనశకటంబు
గనుంగొని తదీయాంకతలంబునంద తనయు నెప్పుడు నునిచి యుండుటంగావున.

తే. తలఁకి యుల్లంబుజల్లనఁ దనువు వడఁక, శకటబాలకుఁ డిప్పు డేమయ్యెనొక్కొ
బండి యుఱవఱలై యిట్లు పడ్డదేమి, మూఁడెనో యంచు నరిగి సమ్ముఖమునందు.

మ. స్తనదుగ్ధామృత మారగించుచుఁ బొరిం జారుస్మితోల్లాస మా
ననబింబమ్ము నలంకరింప వికసన్నాళీకపత్రాభలో
చనదీప్తుల్ జననీముఖేందువుపయిన్ సంప్రీతిఁ బర్వంగ నె
ప్పునిజాభీప్సితకల్పశాఖఁ గనియెం బుత్రుం బవిత్రోదయున్.

క. కని గుండె నిమిరికొనుచును, ననురాగముతోడ నంతనంతఁ దనకుటుం
బిని నిదియేమి శకట మి, ట్లనయంబును విషమవృత్త మయినది యిచటన్.

తే. బల్లిదంపుటాఁబోతులు పెల్లురేఁగి
తొడరి త్రోచి త్రొక్కెనొ మహోద్ధురసమీర
హతియు నిచ్చోటఁ గలిగెనొ యదియు నింత
సేయఁగాదు నిజం బేమి చెపుము దీని.

వ. అని వెండియు.

క. అది యెట్లైనను గాని, మ్మిదె నాపుత్రునకు సేమ మింక నఖిలమ
భ్యుదయము యనఁగాఁ గడుఁగ, ద్గదిక నెలుఁగు దగుల్లువడఁగఁ దద్భామినియున్.

వ. అతని నాలోకించి నావలనం దప్పు సాలఁ గలదు మీరు సహింపవలయు నే
నిప్పాపని నెప్పటియట్ల యీబండిక్రింద మంచంబున నిదురవుచ్చి యేఁగు కుఱం
గలిఁగావునం గ్రమ్మఱం జనుదెంతు నని జలావగాహనంబున కరిగి మగుడునప్పటి
కిది యిట్లై యున్నయది మనభాగ్యంబునం గుమారుని కీబారి గడచె ననునెడం
గోపికలు బాలు రచటికి వచ్చి యిట్లనిరి.

క. ఏమిచట నొడ్డుచుండం, గా మీకృష్ణుండు తనదుకాలు కడఁకతో
నేమీఁది కెత్తి తాఁచిన, నీమెయిఁ దలకెడవువడియె నిబ్బండి వెసన్.

క. ఇది యేమిదైవికమొ మీ, మదిలోఁ దెలిసికొనుఁడనిన మగువయుఁ బతియున్
బొదలెడువిస్మయము మనో, ముదముం దళుకొత్తఁ గొడుకు ముద్దాడి తగన్.

వ. అచ్చటిభూరజంబు వుచ్చి పిడిచి వైచి తూపొడిచిరి విశేషించి నందుండు బ్రం
ధ్వారకుల కెల్ల వందనంబు సేసి నందనునకు నభయప్రదములుగా నభ్యర్థించె నాలో
నన యెల్లవారును వచ్చి యచ్చెరువునొందుచు నర్భాలు నభినందించి రాగోపము
ఖ్యుండవి శకటంబు గ్రమ్మఱ సంఘటితంబు గావించి సుఖంబున నుండె నంతఁ
గ్రమంబున.

శ్రీకృష్ణమూర్తి బాలక్రీడాభివర్ణనము.

సీ. పొలుపారఁగా బోరగిలి పాన్పు నాల్గుమూలలకును వచ్చును మొలఁగి మొలఁగి
లలిఁ గపోలంబులు గిలిగిలింతలు వుచ్చి నవ్వింపఁ గలకల నవ్వి నవ్వి
ముద్దులు దొలఁకాడ మ్రోఁకాలఁ గేలను దడవుచు నెందును దారి తారి
నిలుచుండఁ బెట్టి యంగుళి యూఁత నూపఁగాఁ బ్రీతిఁ దప్పడుగులు వెట్టి పెట్టి
యన్నఁగంటిఁ దండ్రినిఁగంటి నయ్యఁగంటి, నిందు రావయ్య విందులు విందులనుచు
నర్థిఁ దనుఁ బిలువఁగ నడయాడియాడి, యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల.

ఉ. ఎవ్వరు గన్న నెత్తికొని యెంతయు వేడుక ముద్దులాడఁగా
నెవ్వలఁ బాఱిపాఱి తరళేక్షణదీధితు లొప్ప నొప్పమై
మువ్వలు గంటలున్మొరయ ముందటికూఁకటి రావిరేకతో
నవ్వనజాక్షుఁ డాడుఁ జెలువర్మిలిఁ బెంచు జనంబు చూడ్కికిన్.

తే. మన్నురొంపియుఁ బెండయు మసలుపట్టి, పాంసుసంక్రీడఁ దనమేను భాసురముగ
హరి యనేకధాతుచ్ఛటాభ్యక్తమైన, శైలకుంజరకలభంబుఁ బోలె నొప్పె.

క. చాలఁగ నిచ్చలు వెన్నయుఁ, బాలుం గుడకగొని తల్లి పట్టికి సెలవిన్
వ్రేలిడి యింతింతియకాఁ, గ్రోలించును వెరవుతోడ రుచిగోలుపుక్రియన్.

తే. ముదమునను గడ్పునకుఁ బెట్టి మూతిజిడ్డు
మోమునను మేనఁ జమరి యమ్ముదిత యక్క-

గలయు నిమిరి యేనుఁగుదిన్న వెలగపండు
నాఁగ నొప్పెఁ గృష్ణుఁడు సాశ్రునయనుఁ డగుచు.

మ. తను నాప్యాయితుఁ జేసి రేపు గృహకృత్యంబు ల్ప్రొసర్పం దొడం
గినతల్లిం గనుమాడి తప్పడుగులం గ్రీడారతిం బోయి యం
గనలన్ వెన్నలు వేడుఁ బెర్వ్వదరువంగా నెంతయేఁ బెట్టినం
దనియం డింపుగ గ్రింగు మానఁ డొకటం దావారిఁ గారించుచున్.

క. తరిఁ ద్రాడు చేతికవ్వము, దిరుగకయుండంగ బిట్టు తెమ్మని తినెచున్
బొరిఁబొరి గనయంబునముడి, విరియ వలువచెరఁగు వట్టి వ్రేతల నీడ్చున్.

తే. వెన్నవెట్టెదమాడుమాయన్నయన్న, మువ్వలునుమొలగంటలు మొరయనాడు
నచ్యుతుఁడు గోపికలు దమయాత్మఁ బ్రమసి, పెరుగుదరువనుమఱచిసంప్రీతిఁజూడ.

క. ఏనికకొదమకరంబున, మానుగ వెలిదమ్మిమొగడమాడ్కిఁ బొలుచు న
ద్దానవరిపుచేతం బాలు, పై నవనీతంపుఁగబళ మనుపమకేళిన్.

క. సురలు దరువఁగ సుధాశీ, కరములు మెయిఁ జిలికినట్టికల్యాణం బా
పురుషోత్తమునకు నొదవెన్, దగునీనిర్మథనలగ్నదధిబిందువులన్.

ఉ. పాపనిఁ బట్టరమ్మ యని బాధల కోర్వక తెచ్చి తెచ్చి తన్
గోపిక లయ్యశోదకును గుప్పన నప్పనసేయఁ జేయ నా
గోపియు నాగనాగఁ జని గోకుల మిల్లిలు దప్పకుండ ల
క్ష్మీపతి గ్రుమ్మరుం గడియసేపున రేపున నిచ్చనిచ్చలున్.

వ. ఇవ్విధంబునం గ్రమక్రమప్రవర్ధమానుండయి తానును బలదేవుండును పెక్కం
డ్రు బాలురు గేళీలాలసులై తన్నుం బొదివికొని తిరుగ బల్లిదుండై వ్రేపల్లె
నెల్లెడలం గ్రీడించునప్పుడు.

చ. పసఁటులవాతమూఁతలిడి పాలును నేతులుఁ బుక్కిలించి మొం
దు నుమియు దోయిలించి కరతోయసుహంబులఁ జల్లి మంటితో
నెనయఁగఁ ద్రొక్కిత్రొక్కి ధవళేక్షణకోచు లెలర్ప నాడు నె
వ్వనికిని మాన్పరాక యదువంశకుమారుఁ డుదారచేష్టతన్.

క. తరువం బెట్టినబానల, పెరుగులు మును గిలుకరించి పేర్చినవెన్నల్
నురుపు లెసఁగఁ గ్రోలి పిదప, నురలం ద్రోచుచును బోవు నుక్కివపుగతిన్.

శా. క్షీరాంభోధిమథించి తాను గృపతో గీర్వాణకోటిన్ సుధా
పూరప్రీతగఁ జేసినట్టి చెలువంబుల జూపున ట్టింపుగా
నారం గాఁగినపాలమీఁగడలు హస్తాబ్జంబులం దేవి లీ
లాగమ్యంబుగఁ దోడిబాలురకు నెల్లం బెట్టి తానుం గొనున్.

తే. ఓలిఁ గట్టినయుట్లకు నుఱికి పెద్ద, బానలం దున్న వెన్నలు బావికొనుచు
నుట్టులను వ్రచ్చిబానలనురలఁద్రోచి, పురుఁగుఁ జెలికాండ్ర కెల్లనుఁ జాలవిడిచి.

సీ. కడవలపాలు సగము గలయంద్రావి నీళులు దెచ్చి యన్నిటను నినుచుఁ
బెరుగంతయును ద్రోలి పిదపబానలయందు సంపూర్ణముగఁ ద్రాచిచల్ల లునుచు
నేతులు గొనిపోయి నెఱయ నిప్పులఁబోసి పెనుమంటలొండొండఁదనరఁజేయుఁ
బెరువులోఁ బాలును బెరుగు వెన్నను వెన్న చల్లను జల్ల యాజ్యమునఁ గలపుఁ
దలుగులూడ్చి పెయ్యలనెల్లఁదల్లి చన్ను, గుడువవిడుచుఁగొన్నిటినలుగడలఁదోలు
నుఱక దామెనకొయ్యలు పెఱికి పాఱ, వైచుఁ గావళ్ల యుట్లను వ్రచ్చి త్రెంచు.

ఉ. ఆడఁగఁ దెచ్చి బాలకుల సందఱ నయ్యయియాట నెక్కుమై
నోడఁగఁ జేసి వీఁపడిచి యొక్కని నెక్కని నెక్కుఁ బల్విరం
గూడఁగఁ గూఁకటు ల్విడిచి కోయని యార్చుచు గాసిసేయు సం
క్రీడల నెంతలావరియు గీడ్పడి చిక్కఁగఁ గృష్ణుఁ డుద్ధతిన్.

గోపికలు యశోదతోడ శ్రీకృష్ణుని దుష్టచేష్టితంబుల చెప్పికొనుట.

వ. ఈభంగి వ్రేపల్లెయెల్ల నేలకుంగోలకుం దెచ్చుచున్నయక్కుమారు వారింప నలవి
గాక గోపాలురెల్ల నుల్లంబుల వెక్కసపడి చూఁచుచుండ గోపికలు గూడఁబడి
యశోదపాలికిం జనుదెంచి.

తే. గోతి నీవకా గారాబుకొడుకుఁ గంటి, వేము పడుపాటు లరయవ యెట్టిబలియు
రైనఁ దగవు పాటింపరే యకట కృష్ణుఁ, జిన్నవాఁ డని నమ్మియు మిన్న కునికి.

క. కుటిలవు నీవు తనూభవు, నిటుసేయఁగ విడిచి తాత్మ నించుకయును న
క్కటికంబు లేదు వినుమా, యటు పెవ్వులారంగ నిట్టు లాత్మజకృతముల్.

వ. అనునెడ నొక్కవ్రేత యన్నాతిముందరికి వచ్చి.

క. నాయింటం బదిగడవల, నేయిపెరుగుఁ బాలుఁ ద్రావె నీప్రియతనయుం
డోయమ్మ కడవ లన్నియుఁ, గే యని బోరగిలఁ ద్రోచి కేరుచు వచ్చెన్.

తే. పేదవార మింతటితోన పీడవడితి, మిట్ల యైన మాకింక నెందెద్ది బ్రదుకు
మున్ను వ్రాయినసేగికి వెన్నఁగొలఁది, లేదు నాఁగ వేటొకగొల్ల లేమ రేఁగి.

చ. అసురయొ కాక నీతనయుఁ డంగన యేఁబదిబానలందుఁ బొ
ల్పెసఁగెడువెన్న యుట్లపయి నేఁ బదిలంబుగ డించి యుండ వె
క్కసముగ మింగె బానలును గ్రమ్మనఁ గూలఁగఁద్రోచె నుట్టులు
న్వెస నుఱుమాడె నేమిగతి వేఁగుదు నెక్కడఁజొత్తుఁ జెప్పుమా.

వ. అనిపలుక నలుకతోడ గోపిక యొూర్తు నర్తించువిధంబునఁ జేతులు సాఁచుచుఁ
గృష్ణజననిం గదిసి యిట్లనియె.

ఉ. ఓవరిలోనఁగొందిదెసనున్నవి యెన్నియొ యెన్నఁ బెద్దభాం
డావలి తాళముం దలుపు నావలఁబోఁ బడమీటి చొచ్చెమా
యావి భవత్సుతుండు వెసనంతన యేనును బాఱుదెంచితిం
ద్రావెను యేమిసేసెను ఘృతం బొకబొట్టును లేదు లోపలన్.

క. ఏపొళ్ళములుఁ బాడయ్యెనె, యీపల్లెను జిచ్చువెట్టి యేగెద మేమున్
మాపసులును గలిగిన నట, నేపగిదిని బ్రదుకరాదె యిటు చెడుకంటెన్.

సీ. అనుచుండ మఱియొక్క యతివయాగ్రహమునఁనందఱుఁ బ్రోచికొం చరుగుదెంచి
యేమని వినియెద విన్నియు నాయింటి సేగి సెప్పఁగఁ జెట్ట లాగడీఁడు
నీకొడు కేతెంచి నెలఁత యెన్నం బదిపనఁటులనేయును బాలుఁ బెరుగు
నెండొంటిఁ గలయంగ నుర్విపై వఱదలుగాఁ జల్లి పనఁటులు కాలఁ గేలఁ
దన్నియునుఁ ద్రేసియునువెసఁబిన్న పెంచి, కలుగఁ జేసిపాయసము గూరలును గూడు
పడుచులకుఁ బెట్టిదొంతులు పగుల నడిచె, నడరి పెయ్యల నన్నింటిగుడువవిడిచె.

తే. పూసద్రాడు దుయ్యను లేదు పొలఁతి మెడకుఁ, బెరువు పాలింట నేడ్చినబిడ్డకైన
మిడువ లే దెల్ల దానను జెడితి మొల్లఁ, బోయితిమి ప్రాలుగలఁపట్టి పుట్టఁబట్టి.

వ. అనియె నట్టియెడ నొర్తు పెలుచనియెలుంగున.

చ. కలయఁగఁ బాలుపిండి పులకండము వెన్నయుఁ బెట్టి యట్టులే
నలవడవండితిం బతియు నాత్మజులుం బ్రియపడ్డ నాలుగే
నలకులదొంతి డించి యవి యన్నియు నుగ్మలి నీతనూజుఁ డొ
ప్పులువడ బ్రింగెఁ జోద్య మిది భూతము లున్నవిగాక కడ్పునన్.

క. మగఁడింక నన్ను సైచునె, దిగవిడుచుం జంపుఁ గాక తెల్లము మది న
మ్మిగ పుట్టునె యిది చెప్పిన, మొగమోటన మనుపుచుండిమూసితి వబలా.

తే. అనఁగ వేఱొక్కగొల్లత యమ్మ వినుము, బానలోపల యవపిండి పంచదార
యొదవఁగలపిమూలనుడాఁచియుండవచ్చి, తినియెనంతయుఁ గృష్ణుండు దేవరాన.

క. అంతటఁ బోవఁడు గూనెఁడు, సంతసమునఁ బావికొనియె జయ్యనఁ గలకూ
డంతయును విష్ణుమాయ ప, డంతీ యివి శిశువునం దడంగెడుపనులే.

ఉ. నావుడు నొర్తు నెమ్మొగమునం గడుదైన్యము దోప వచ్చి నా
యావులఁ గ్రేపులం గలపి యార్చి వెలార్చినఁ బోయి ఘోరదు
గ్గావలి సొచ్చె నింట మగఁ డాత్మజు లెవ్వరు లేరు ప్రల్లదుం
డీవిధి చుమ్ము మన్నిగొనియెన్ భవదీయసుతుండు గోపికా.

ఆ. పుట్టినయంత వెన్న ప్రోపుగఁ బెట్టితిఁ, గడఁగి కడఁగి యొక్కగనపచేర
నంతపట్టు బ్రింగె నటుసూచి చూడక, యుండ నిట్టిమనుజు లుర్విఁ గలరె.

వ. అనియె నివ్విధంబున నందఱుఁ గూడి యొక్కట నచ్చేడియమీఁద నధిక్షేపించి.

క. ఎక్కడికేనియుఁ బోయెద, మిక్కష్టపుఁబాటుపడఁగ నేమోర్వము నీ
చొక్కపుఁగొడుకును నీవును, నొక్కతలై సుఖ్కమాని యుండుఁడు నెమ్మిన్.

వ. అనిన విని యశోదాదేవి వేర్వేఱ వారి ననూనయించి.

క. మీసేగు లెల్ల నచ్చెద, వేసరకుఁడు మీరు లేక వేగునె మాకున్
జేసెం జేయఁడు బాలకుఁ, డాసురపుంబనులు నిజము లనియెదరు బలే.

క. బొంకాడెడుగతితలె మీ, రింకిటఁ జూచుకొనుఁ డితని నె ట్లడిచెదనో
కింకయును గలఁకయును మది, శంకయుఁ బోవిడిచి చనుఁడు సదనంబులకున్.

వ. అనిన నట్లకాక యని గోపికలు నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ.

మ. భువనక్లేశము లెల్ల మాన్ప శిశుతాస్ఫూర్తిం బ్రవర్తిల్లుచున్
వివిధక్రీడలఁ బ్రోడ యైనప్రభువున్ విష్ణుం బ్రవర్ధిష్ణు నా
నవనీతామృతచోరుఁ జూచి యెలమిన్ రాజాస్య యాత్మీయసం
భవతాబుద్ధిఁ బ్రవృద్ధ మైనమమతాబంధంబు సంధిల్లఁగన్.

శా. ఏలా యిందును నందుఁ బాఱెదవు నీకే ప్రాఁతియే వెన్నలుం
బాలుం బాలక చాలఁ జేఁపె నిదె నాపాలిండ్లు పెన్ సోనలై
సా లొక్కుమ్మడిఁ గ్రమ్ముచున్నయవి నీభావంబునం దృప్తిగాఁ
గ్రోలం జాలవె యింతవట్టకట యీగోసేల చుట్టాలలోన్.

తే. తల్లి చనుఁబాలు గ్రుక్కెడుతక్కినయవి, పుట్టెఁడును నొక్కరూపనుభూమిఁబరఁగు
నెడువు బొంకయ్యెఁ జన్నిత్తుఁదొడలమీఁద, గుండెవట్టియించుకదడ వుండవన్న.

క. అని యెత్తుకొని యురంబునఁ, దనియఁగ నదిమికొని చన్నుతన్ముఖమునకున్
ఘనదుగ్ధపిచ్ఛిలమ్ముగ, మనమలరఁగ నిచ్చుటయుఁ గుమారుఁడు ప్రీతిన్.

చ. మును జననీస్తనంబులకు మోపఁగ వేఁగయి యున్నయట్టియ
వ్వినుతపయస్సు లన్నియును వేడుకతోఁ గడుపార నారగిం
చినఁ బ్రియ మంది నందసతి చెక్కులు నక్కును మస్తకంబు మూ
ర్కొనుచును ముద్దులాడి మఱి కొండొకసేపునకుం బ్రియంబునన్.

వ. అయ్యర్భకు నుద్దేశించి.

క. వఱువాత లేచి నీదగు, కొఱగాములు చక్కద్రోచికొనఁ బోయె దినం
బఱుగువడి చనియె నీపను, లఱజాతివి నిన్ను నేమియన నేర్తు సుతా.

క. విడిచిన నెప్పటి చని యా, గడములు చేసెదవు నిన్నుఁ గాచుట మాకుం
గడుఁబ్రేఁగు దుర్జనుని నిలఁ, దడయక రొటుకమెయి ద్రోపు తగుమందెందున్.



### యశోదాదేవి శ్రీకృష్ణునులూఖల బద్ధునిఁ జేయుట.

వ. ఇందు రమ్మనుచు మెత్తనిజంకెతోడిబింకంబునం గొడుకుం గేలుపట్టి యొయ్యన
తివిచికొనుచుం బోయి పెయ్యదామెనత్రాటం గొని శకటసమీపంబున బలితం
బగురోల నుదరంబు బంధించి నున్నని సెలగోల చేతం గొని.

క. కదలిన మొత్తుదు నెక్కడఁ, గదలెద వటుగఱుదులాఁడ గదలుమ యేఁ జూ
చెద ననుచుఁ బోయి యిమ్ముల, ముదిత నిజకుటుంబకార్యములఁ దత్పరయై.

సీ. ఉన్నంత నచ్యుతుం డుద్దామముగుతన సత్వంబు గోపాలజాలమునకు
నెఱిఁగింపఁ దలఁచి యొక్కింత సేపునకు నిజోదరంబున దామయుతనిబద్ధ
మగునులూఖలమురయుం బెనఁగంగ నాకర్షించి చనిమందగవని కెలని
జమిలిమద్దులతోడ సంరంభమునఁ దలించి తాఁగగులక లీల రెంటి
నడుము గడచి నీల్గుటయుచుబుడమి వగులఁ, బెల్లగిలి కూలెఁదరువులు గొల్లలెల్ల
గూడఁబడి రప్డు కొందఱు గోపసతులు, చూచి క్రమ్మనఁ బాఱి యశోదతోడ.

ఉ. ఎక్కడిబిడ్డ నీకు నిటు లెంతయుఁ గట్టెఁడి వేయుగంబులం
బొక్కెడుఁగోటితో బలియుఁ బుత్రునిఁ ద్రాళులఁ గట్టునాఁడువా
రక్కట గల్గిరే వినఁగ నాఁడిన్నాయెఁ గుమారుఁ డేపునన్
మిక్కుట మైనమ్రాఁకు లవె మీఁదఁబడ న్వడిఁ దాఁటెనం గడున్.

క. నేరుపుగలననుచు నహం, కారంబున మిడిసిపడితి క్రమ్మనఁ జని బం
గారము బోలెడుకొడుకున, కేమాపునన్నైనఁ బాపు మీసంకటమున్.

మ. అనినం దల్లడ మంది మేను విరియన్ హాయంచు గోపాలభా
మిని విస్రస్తములై పటాంచలము ధమ్మిల్లంబుఁ దూలంగ లో
చనపద్మంబుల బాష్పధార లెసఁగన్ సంభ్రాంతిఁ బాదద్వయం
బును దొట్రిల్లఁగఁ బాఱె గోపికలు నుద్భూతార్తలై తోఁజనన్.

వ. నందగోపాదులు నటమున్న కదిసి రిట్లరిగి యందఱు నున్మూలితయమళార్జునమ
ధ్యంబున మేఘద్వయమధ్యవిద్యోతి యగుశీతాంశుండునుంబోలె నాలోలలోచ
నంబున సుధాసేచనరోచు లడర మందస్మితసుందరవదనమండలంబున నగ్రచూ
డామండనంబు వ్రేలయం బాలుపారుకుమారునిం గని రంత నాగోపగ్రామణి
కొడుకుకడుపునం బెనఁచినకట్టొయ్యననూడ్చి యెత్తుకొని యిదియేమిచందం
బీబాలునుదరంబుఁగోల నేల కట్టితి వింతద వ్వెట్లీడ్చె నిమ్మహీరుహంబు లెప్పగిదిం
గూలె నని తద్బంధననిమిత్తంబు నిజకళత్రంబువలన విని పుత్రుసత్త్వంబునకు
హర్షవిస్మయంబు లతిశయిల్ల నుండె గోపవృద్ధు లచ్చెరువునొంది తమలోన.

మ. అతివాతంబును వజ్రపాతమును హస్త్యాఘాతమున్ వాహినీ
వితతస్రోతము హేతువుల్ తరుతతి న్విభ్రంశ మొందింప న

ట్టితెఱం గేమియు లేక యర్భకునికృష్టిం గూలె నీయున్నత
క్షితిజాతంబులు దీనికంటెఁ గలవే చింతింప నుత్పాతముల్.

వ. మున్ను శిశుఘాతిని యైనపూతన నిపాతంబు నొందె మహాశకటం బద్భుతవిఘ
టనంబునం బొలిసె నిక్కడ నునికి మన కింక నెంతలెస్సయయ్యెడు నని యా
శంకితచిత్తు లయ్యును మఱుకవవలన నచ్చోటు విడువఁ గొనకొనినియమనంబుల
తోడ నందగోపసహితులై తమతమనివాసంబులకుం జని రివ్విధంబున.

క. గోము మిగుల వ్రేపల్లెను, ధీమంతులు రామవాసుదేవులు బాల్య
శ్రీమెఱసి యష్టసప్తస, మామహితవయస్కులై సమంచితలీలన్

వ. తమయీడుగోపాలబాలకులు గూడి యాడ వత్ససముదాయ పరిపాలనంబు వి
నోదంబుగాఁ బ్రమోదింపం దొడంగి రమ్మహోత్సవసమయంబున.

తే. చిఱుతకూఁకట్లు దూఁగాడఁ జేతిచల్ది, చిక్కములు సెలగోలలు చెలువుమిగులఁ
గిట్టుచెప్పులు దొడి నున్నగట్టుతడుపు, లెలమితోఁ గట్టి చేరువ పొలములందు.

చ. వృకములఁ దోలి యార్చుచును వేడుకఁ బాడుచుఁ గూఁతవైచుచుం
బ్రకటమహీరుహాగ్రములు ప్రాఁకుచు జున్నులు రేఁచి తేనె గో
పకులకుఁ బోయుచున్ మధురభక్ష్యము నే కళులారగించుచున్
సకలమనోజ్ఞఖేలనరసంబునఁ దేలిరి బాలయాదవుల్.

వ. అని వైశంపాయనుండు జనమేజయునకుఁ గృష్ణశైశవచరితంబు సరసవర్ణనాభరి
తంబుగా వివరించె నవ్విధంబఖిలంబును సుఖశ్రవణం బగువచోవిభవంబున.

మ. కమలానిత్యనివాసవక్ష కమలాక్షా సంతతోత్ఫుల్లహృ
త్కమలామోద కళావివేక జితలోకా సర్వధౌరేయ దోః
కమలాంగీకృతదానకల్ప శుభసంకల్పా విపక్షావళీ
కమలాపాయద ఖడ్గనీరద సమీకప్రీతిమన్నారదా.

క. గుజ్జరిధట్టవిభాళను, హృజ్జీవనదాయి హార్దహేలాభుజసం
పజ్జితధనసంపూజిత, సజ్జనసందోహధర్మ సాధక దేహా.

మాలిని. యవనసృపబలాబ్ధివ్యాపిఖడ్గౌర్వవేగా
జవనహయఖురాగ్రచ్ఛాదిభూత్యంతభాగా
భువనయుగహితైకస్ఫూర్తిమత్త్యాగభోగా
భవనభరితలక్ష్మీబద్ధనిత్యానురాగా.

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహాభ్యానానంద సౌందర్యధుర్య
శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీ
తం బైనహరివంశంబునం బూర్వభాగంబునందుఁ బంచమాశ్వాసము.

## పూర్వభాగము–షష్ఠాశ్వాసము.

క. శ్రీకరకవిప్రబంధా, నేకముఖవినిర్గతాత్మహితకీర్తిసుధా
సేకధవళాయమానమ, హాకమలభవాండధామ యన్నమవేమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్టివర్తనంబులం గొంతకాలం
బు నడపియమ్మహాప్రభావుం డగువాసుదేవుండు విదితనిజసద్భావుం డగుబలదే
వున కిట్లనియె.

క. అనఘ విను మొకటి చెప్పెద, నెనయంగ మనపుట్టిబుద్ధియెఱుంగుట మొద లి
వ్వనము నివాసం బైనది, మనవారికి నింక నిచోటు మంచిది యగునే.

వ. పెద్దకాలం బొక్కచోట నునికి ప్రవరులకుం బ్రశస్తంబుకాదు దీననచేసియిప్పుడు.

సీ. ఎరువు లిప్పలుగాని యెల్లమందలు గొనుజెక్కె మేపులచోటు ద్రొక్కబడియెం
దరు లోలి నఱక మొదళులు చిక్కంగ జొంపము లేది జాడలువడియెం బొదలు
మడువులు పసులకాల్మడిం బ్రుచ్చె దొరుగండిప్రంతలు పెనురొంపిప్రంతలయ్యెం
బూరిపంటలు చెడిపోయె రాయిడిం గ్రంపలోనుగా దవ్వులం గాని లేవు
పులుంగుపూ రెడుప్రియపడిపాలములందు, మొలంగి వెదకినంబుట్టవు మొకములడంగెం
గూరగాయకట్టియ విల్చికొనంగ వలసి, యునికి ప్రేపల్లె వీటపట్టునకు దొరసె.

వ. కావున మన మింక నిచ్చోట వసియించుట దుఃఖావహంబు బృందావనంబు బృం
దారకవనసుందరం బైనకాననంబు గల దందు గోవర్ధననామధేయంబునం బరంగి
యథార్థనామధేయం బగుభూధరంబున భాండిరాఖ్యం బ్రఖ్యాతినొంది నిఖిలవన
మండనం బయి యఖండశాఖామండలంబున నుత్కటం బగువటం బనవిందు
మయ్యరణ్యంబునడుమ నమరభువనంబున నమరునమరనదియునుంబోలెం గాళింది
యొప్పారు నవభూతసారం బైనయిక్కాంతారంబు విడిచి పోయి యన్నెలవున
సుఖయింతము మనపల్లెలోనిముసల్లు మచ్చిగ పేర్మి నిచ్చోటు విడనం జాల
కున్నవా రొక్కకారణంబు గలిగించెద నట్లు సూడు మని పలికి యొక్కింతసే
పూరకున్నయెడ.

మ. జలజాక్షుతను సర్వగాత్రముల సంజాతంబులై పెల్లుగాం
బులులో సింగములో పిశాచములొ నాం బొంగారి యొక్కుమ్మడిన్
బలవత్తీవ్రవృకంబు లెల్లపాలమున్ వ్యాపించె గోపాలగో
కులగోవత్సభయంకరంబు లగుచుం గోపప్రదీప్తాకృతిన్.

వ. ఇట్లు పుట్టినయాక్రూరసత్వంబు లధిమొదలుగాం దొడంగి.

క. పదియును బదియేనును నిసు, వదియును ముప్పదియు దాటువడి నిత్యంబున్
గొదగొని తిరిగి వధింపంగం, గదలంగరాదయ్యె గొల్లగమి కెచ్చోటన్.

సీ. నీళ్లుల కేటిలోనికి డిగ్గఁగాఁ బెద్దతఱిపి పెయ్యలఁ బట్టి నుఱిచె నేఁడు
వడిఁగూడి పాలకావళ్లు దేరఁగ మందవ్రాండ్రను బొరిగొని వ్రచ్చె నేఁడు
వేఁపువకడఁ బోయి పోఁకుమేయఁగఁ బాఁడియావులఁ బొదివి చెండాడె నేఁడు
పులికైసఁ జెలఁగివార్కలయఁ జాలెడుమేటియాఁబోతుఁ గిట్టియుక్కడఁచె నేఁడు
గొల్లలేమఱినప్పుడు గొఱియకొదమ, సత్తుకొనిపోవు తోఁడేళ్ల కిట్టిసేఁత
లెంపు వింటిమె యని జనులెల్లఁ దల్ల, డిల్ల వ్రేపల్లె తద్దయు డిల్లపడియె.

వ. ఘూకియును రాత్రిసమయంబున బెబ్బులులహుంకారంబులును సింహగర్జితంబులు నుగ్రంబులై వీతెంచె మహాదేహంబు లగువరాహంబులు సొచ్చి ఘోషంబున నెల్లచోట్లుం గ్రోడాడఁ దొడంగె నంత గోపప్రవరు లందఱుం గూడఁబడి నందగోపసమేతంబు దమలోన మంతనంబుండి.

క. ముందటియుత్పాతములకు, డెందంబుల నోర్చి యిప్పటికిఁ బాయఁగలే
కిందుండఁగ మన కిప్పా, ట్కిం దనుకఁగ రానికడిఁదిచెప్పర మొందెన్.

వ. బృందావనంబు కడులెస్సచోటని వ్రేపల్లెలోనివా రెల్లప్పుడుం జెప్పికొనుచుం దురు గంపును దుర్గమంబు లగునెలవుల రక్కసులు గలరనియును విందు మేమి సేయుద మెక్కడికిం బోద మీప్రొద్దు కదలవలయు నింక నిక్కడ నొక్కదివసం బొకముహూర్తం బొక్కగడియ యున్నను నంతకంతకు నెంతంత సేగు లగునని విచారించుసమయంబున నారదుం డేతెంచి నందగోపు నేకాంతంబునకుం దోడ్కొనిపోయి.

నారదుఁడు నందగోపుని బృందావనంబునకుఁ బోఁబనుచుట.

క. అతనిమొనరించువినయం, బతులకరుణ నాదరించి యానందరస
ప్లుతికారిణి యగువాక్య, శ్రుతి నాతని కింపొనర్చుచును నిట్లనియెన్.

ఉ. ఈవనభూమియందు వసతి కెంతయుఁ దప్పె వసింపఁబట్టు బృం
దావన మొక్కఁ డక్కడయు దైత్యమయం బట యేమిసేయుదున్
భూవలయైకగణ్యు నతిపుణ్యుఁ దనూభవు నెట్లుగాతు నం
చీవు దలంకి యున్కి మది నేఁ గని వచ్చితి నిన్నుఁ దేర్పఁగన్.

మ. విను నారాయణుఁ డాదిదేవుఁడు జగద్విఖ్యాతసత్త్వుం డుమే
దినికిన్ భారము డింప దైత్యులవిఘాతింపంగఁ గ్రీడార్థమై
జనియించెన్ భవదీయసూనుఁ డనఁగా సంఛన్నుఁడై కాన మ
ర్త్యునిఁగాఁ జూడకు కృష్ణు రాముఁడును దత్తుల్యుండ యత్యున్నతిన్.

వ. వీరిద్దఱు నుద్దామం బగుధామంబున నపరిభావ్యు లగుభవ్యులు పూతన యను యాతుధాని యామినీసమయంబున విషదిగ్ధనిజస్తనదుగ్ధంబులు గ్రోల్చి కూల్చె దనుచు వచ్చి యచ్చిఱుతవానిచేత నిపాతిత యయ్యె శకటరూపధారి యగు

దారుణదైత్యుం డత్యుగ్రకర్మంబు సేయం దలంచి తలంపులోనన వికలుండై
కెడసె నిద్దఱసురలు మద్దులై యిమ్ముద్దులపాపనిఁ బాపండని కొలంది యెఱుం
గక పడుటుంబడి నలువుర మని పూని యున్మూలనంబు నొంది రింక నిమ్మహా
తేజుం డనేకదనుజధ్వంసంబు సేయంగలవాఁ డిది దేవరహస్యంబు నీమీఁదిపక్షం
బునఁ బ్రత్యక్షంబుగాఁ దెలిపితిఁ గలంక నొందక బృందావనంబునకుం జనుము
శోభనం బయ్యెడు నని చెప్పి బ్రహ్మసూనుండు దామోదరునొద్ద కరిగి సవినయ
సందర్శనం బొనరించి.

మ. త్రైలోక్యంబు సృజింపఁ బెంప నడఁపన్ దక్షుండవై యింతకున్
మూలంబై యిట నందసూనుఁ డనఁగా ముగ్ధాకృతిన్ లీలమై
బాలత్వంబు నటించునిన్ను మదిలో భావింతు రుద్యన్మతుల్
హేలానిర్దళితారి సర్వమును నీయిచ్ఛావశం బచ్యుతా.

క. బృందావనకేళికినై, బృందారకవరద చాలఁ బ్రియపడియెదు నీ
డెందము తడ వింకేటికి, మందగఁ దెల్చికొని చను మమందప్రీతిన్.

క. అని మునివరుఁ డాతని వీ, డ్కొనిచనియెఁ దగంగ నందగోపుఁడు దమగో
పనికాయమునకు బృందా, వనగమనవినిశ్చితైకవాక్యతఁ జెప్పెన్.

వ. ఇట్లు నారదోపదేశంబున నిర్విశంకమానసుం డగుపల్లవముఖ్యుపనుపున సర్వజనం
బులు పయనంబు సమకట్టుటయును బ్రేపల్లె నెల్లకడల.

సీ. బండ్లమెట్టింపుపై బసువులెక్కింపుమీఁ దళ్లను బూన్పు కావళ్లు నునుపు
పదిలంబుగా నేతిపనఁటులు క్రొత్తగోనియల బియ్యము పట్టు నెమిలివడ్లు
నొదివిరిప్రాలును నొసరంగఁ బోసి చాపలు మంచములు మీఁద బలియఁ గట్టు
దామెనలును వల్లెత్రాళ్ళును బలుపులు గవ్వము గ్గొడవలి కత్తిసూఁడుఁ
గొడుపుహాదోళ్లు మొదలుగాఁ జెపకయుండ, వలయుచుపిల్లఁ బెమ్ముగంటలపుటెడ్ల
నాయితము సేయుముదుసళ్లనాఁడువారి, గంపమోపులు ముందరఁ గదిలుఁడనుము.

వ. అని మఱియుఁ బెక్కుభంగులయెలుంగుల నొక్కకోలాహలం బెసంగ మంది
యంతయు నెక్కుపెట్ట కదలి లావుమానుసులు కదుపులం గొని ముంబటం
బోవఁ బిఱుంద బండ్లును బండ్లజాడం దక్కినప్రజయును నడువం దరుణతరుణీ
జనంబు లొండొరులతోడిమేలంపుటాలాపంబులం బ్రమోదకరంబు లగువినో
దంబుల నడచుమీఱి కడచి చనం బంగ్వంధజరఠప్రముఖులు క్రుస్సి యోలాకు
పడ నెడనెడం గావలియై తగువారు నడిపింప నవ్విధంబునం జని బృందావనంబు
ప్రవేశించి యుచితప్రదేశంబు నివేశంబుగా నిరూపించి గోపాలముఖ్యులు నిలువ
నాక్షణంబ.

క. శకటము మడ పఱి పిడి యని, సకలజనము చూడ నర్ధచంద్రాకృతిగాఁ
శకటావలి విడియఁ గదున, వికలస్థితి నెల్లవారు విడిసిరి కలయన్.

వ. అంత.

చ. గుడిసెలు వన్నియున్ ఘననికుంజము లిండులుగాఁగఁ జొచ్చియున్
బెడఁగగు జొంపము ల్గలిగి పేర్చిన ద్రాఁకులక్రింద నుండియుం
గడఁక మెలర్ప దొడ్లకును గ్రంపలు వైచియు నెక్కనాఁటిలో
నడరఁగఁ బ్రాతకాఁపులయి రక్కడ గోపకుటుంబు లందఱున్.

శా. శృంగారంబులు సేసి గోపికలు భాసిల్లంగ గోపాలు రు
త్తుంగాంగంబులతోడ నెల్లకడలం ద్రుళ్ళంగ గోబృందముల్
మాంగల్యాకృతిఁ గ్రాల నెంతయును సామగ్ర్యంబునం బండు లు
ప్పొంగం బల్లె సముజ్జ్వలోత్సవములం బొంగారె నానాఁటికిన్.

క. క్షేమంకరుఁడై హరి దమ, నేమఱక ప్రయోజనంబు లెల్ల నడుపఁగా
శ్రీమంతు లైరి మిగులఁగ, నామందం గలుగుగోపు లందఱు దోడ్తోన్.

క. వేసవియందును సులభము, ఘాసము గోవులకు నీరు కడుఁ జెల్లొదవున్
వాసవుఁడు గురియుఁ దఱితో, వాసవుతోఁ బుట్టు వున్న వాసక్షోణిన్.

క. క్రేపులు వర్ధిల్లఁగఁ గడు, నేపెసఁగఁగ మొదవు లీను నేఁటేట వృష
వ్యాపారం బవ్యాహత, మై పరఁగుం గృష్ణదేవు నాదరమహిమన్.

వ. ఇట్లు బలదేవసహితుండై మహితప్రీతిం బ్రవర్తిల్లు నయ్యాదుకుమారుండు క్ర
మంబునం ద్రయోదశవర్షవయస్కుం డయ్యె నంత నొక్కతఱి వసంతసమయా
వసానం బగుటయు.

## గ్రీష్మకాలాభివర్ణనము.

శా. వాసంతీకుసుమావతంసకము లుద్భాసించి గోపాంగనల్
శ్రీసంపన్నము లైన పాటలములన్ సీమంతసీమన్ లలిం
గై సేయం దగి ఫుల్లమల్లికలికాగర్వాంధమై పర్వె సర్వా
సహావ్యాప్తి యయ్యె ఘర్మసమయం బారంభసంభావ్యతన్.

క. మధువులనీ రింకించుచు, నెడపడఁ జేయుచుఁ బ్రవాహ మెట్టిది యైనన్
పడ యొయ్యనఁ బెనుచుచును, గ్గడువయ్యె నిదాఘబలము క్రమయోగమునన్.

మ. హరి యంభోనిధిసొచ్చె శంభుఁడు తుషారాద్రిప్రభుం బ్రాఁకె వా
గ్వరుఁ డుద్యన్మకరందదుర్దినసమగ్రం బైన యుత్ఫుల్లపం
కరుహంబున్ భజియించె దీనిమును గల్గం గాంచియే కాక యె
వ్వరి నింకేల సహించు గ్రీష్మమనఁగా వర్ధిల్లెఁ దాపోద్ధతుల్.

సీ. వసధు లెల్లను గ్రోలి తనియక పెనుపొంది బడబాగ్ని యంతటఁ బ్రబ్బె నొక్కొ
యాగంగఁ గొలఁదిగా కభవుండు గ్రక్కినఁ గ్రమ్మఱ గగనాగ్ని గడఁగె నొక్కొ
నీరజాసనునూరు నిండకమున్న కల్పాంతాగ్ని తమకించి యడరె నొక్కొ
సకలసత్వంబుల సమయించి ఘోరాగ్ని తత్వమొక్కటియకాఁ దలఁచె నొక్కొ
యగ్నియును మారుతంబు ననాదియైన, మైత్రి నేఁడ కాఁ జూపంగ మసఁగె నొక్కొ
కాక యిట్టి వేసవి యొంపఁగల దెయనుచు, జనులు బెగడొందగాడ్పుతోఁ జఱచె నెండ.

మ. తమలో రాయిడిఁ గొన్న యున్నతులసద్వంశంబులున్ రూపఱున్
సమయించుం దమయాశ్రితావలిని నెన్నంగా నిజం బట్టిభా
వము చూడుం డనునట్లు వేసవి మహావంశాటవుల్ రాసి ద
గ్ధము లయ్యె న్నికటద్రుమావలులతోఁ గ్రందింగ దావాగ్నులన్.

క. తరులెల్ల గ్రల్లవడఁగా, విరళములై వీధులున్నవిధ మొప్పె నహ
స్కరరుచులతోడఁ దలపడి, యటుమగఁ బోరాడి తుమురులై పడినక్రియన్.

మ. జ్వలితారణ్యకధూమముల్ శిఖిశిఖాసక్తిం దటిల్లీలమై
గలయం గ్రమ్ముఘనాళిభంగి నెసఁగంగా నెండమావుల్ దిశా
వలయాపూరజలంబులన్ దొరయఁగా వర్షాగమస్పర్ధియై
వెలసెన్ గ్రీష్మము తీవ్రతాపము గడున్ భిన్నప్రకారంబుగన్.

తే. పక్వఫలములఁ గ్రాలుకింపాకలతల, బెరసి వేసవి చే పడి తరువులెల్ల
దావదహనసంయుక్తికిఁ దప్పె నపియు, నలఁగి దావాగ్ని పొదివినయట్ల యుండె.

శా. గోపూర్ణస్తనదుగ్ధపానవిధులున్ గోవర్ధనాంతర్ఘస
వ్యాపారంబులు గోపతిప్రియసుతావాః కేళిలీలాస్ఫుర
ద్గోపీముగ్ధకుచోపగూహనములున్ గోవిందసాంగత్యమున్
గోపశ్రేణికిఁ బాపెఁ దాపభయమున్ ఘోరంపుఘర్మంబునన్

వ. ఇట్టి నిదాఘకాలం బతిక్రాంతం బగుకొలంది నొక్కకారణంబున.

క. హరి పరిపాలన సేయఁగఁ, బరమోత్సుకవృత్తి నున్న పశుకోటికి ని
ర్భరవిస్మయావహంబై, యుగుతరముగ నుద్భవించె నుపసర్గంబుల్.

వ. అమ్మహాదోషంబువలన.

చ. వడఁకుచు రోమకోటినిలువంబడి మేనులు దూలఁ గన్నులం
దుడుగక బాష్పముల్ వడియుచుండఁ దలల్ డిగవైచి నోరవేఁ
గుడు దొరఁగంగ నెంతయును గ్రుస్సిఖురంబులు వ్రస్సి పుర్వులు
గ్గడువుగఁ గాఱఁ దద్దయును గాఱియఁ బొందె వ్రజంబునం బసుల్.

క. కడలను నెత్తురుఁ బాఱఁగఁ, దొడఁగెం గొన్ని యతిసారదుస్తరబాధన్.
బడి ప్రేవులు నింకెఁ దునిసి, పడకుండునె యనఁగ నెత్తువడె నెల్లెడలన్.

తే. నెరిడి పుప్పి కప్పనావును గడుప్రూఁద, యదయుద్రిక్క యనఁగ నడరి మఱియుఁ
దెవుళు లెన్నియోనిఁడవిరి యెంతయుమహోగ్రా, గ్రంబులయ్యెఁ బశుగణంబునందు.

వ. అంతయు నుపలక్షించి వయోవృద్ధు లగుగోపాలురు మంత్రంబుల నౌషధంబుల నగ్నికర్మాదుల దత్ప్రతీకారం బుపక్రమించి యవియన్నియు నిష్ఫలంబులయినం జేష్టలు దక్కి నిలిచిరి యమునాతీరకాననంబులం జరియించుప్రాణులు మృగపక్షిసర్పాదులు సూక్ష్మజంతువులులోనుగా వివిధవ్యాధిపీడితంబులై మృతకల్పంబులు నగుచువచ్చె నట్లు దొడఁగినయుపద్రవంబు లంత నిలువక గోపప్రకరంబులయందునుం బ్రవేశించిన.

సీ. జ్వరవేగమునఁ దూలి పొరలిరి కొందఱు సంధుసందులు సొచ్చి సమసి పడిరి
కొందఱు వెస రోమకూపంబు లన్నియు నవసి నెత్తురుగాఱ నవయవములు
చీములు గట్టంగ శీర్ణంబులై దంతములు గదలంగ నెమ్ములు నొగులఁగఁ
గంఠజిహ్వాధరఘ్రాణకర్ణంబులు పొక్కులై యేర్పగ నుక్కఁడైన
ద్రావఁ దడియు లేక తలచీర లెఱుఁగక, యార్తులైరి కొంద ఱంతవట్టు
గోపమందిరములు తాపదుర్గంధమ, యంబు లయ్యె వికృతి యగ్గలింప.

క. నరగోమృగనివహంబులఁ, గరుణము లగురోగవేగకలితాక్రోశ
స్వరములు పెక్కయ్యె దిగం, తరముల నచ్చోట యమునదరివిపినములన్.

వ. యశోదానందగోపులుం గ్రమంబున రోగార్తి నొందిరి రోహిణియును దదవస్థఁ బొందె నట్లు జననీజనకులు లోనుగా సకలబంధువు లధికక్లేశంబునం దూలుట యాలోకించి బాలుండయ్యును మహాబుద్ధిశీలుండు గావున దామోదరుండు రామునితో విచారించి యయ్యుపసర్గంబునకుఁ బ్రతికారం బన్నెలవువిడిచి పోవుట దక్క నొండుపాయంబు లేదని క్రోశమాత్రంబునం బర్వతం బంతరంబుగాఁ గతిపయగోగణంబులం గొని చని యిమ్ముల నిలిచె నతనిమతం బెఱింగి మఱియునుం గొందఱు గోపాలకు లచ్చోటి కరిగి యరోగులై రట్టియడరునందు.

తే. ఏను జుట్టలుఁ బసులును నెందుఁబోదు, మిచ్చటన యుండఁగా నేమి వచ్చెనేని
ననుభవింతుము గాకని చనక నిలిచె, నందగోపుఁడు తానును సుందరియును.

క. తల్లియుఁ దండ్రియు నిమ్మెయి, నిల్లువెడల కధికరోగహృతచేతనులై
తల్లడిలుట విని కృష్ణుఁడు, పుల్లవడి తలంకుచుండె బుద్ధిని నచటన్.

వ. ఇట్లు బలకేశవులు బలిష్ఠు లయ్యు నయ్యుపద్రవప్రతికారంబునం దసమర్థులై యుండ నా వ్రేపల్లెయందు విదేహదేశాగతుండై యున్నగోవృద్ధుం డొక్కరుండు గోపముఖ్యుల నెల్లం గూడం బిలిచి వారితోడ.

సీ. పశుసమాశ్రయమున బ్రతుకుచున్నారము మనము తత్పశుసంఘమునకుఁ బ్రభుఁడు
వృషకేతనుం డగువిషకంఠుఁ డీశ్వరుఁ డట్లు గావున భక్తి నమ్మహాత్ము

నర్చింపఁగా శాంతి యగు నెల్లవిధముల వేదపారగు లైనవిప్రవరులఁ
బిలిపించి శాస్త్రసంభృతయుక్తి కల్పితమార్గంబుతో దేవమందిరమునఁ
దొడఁగుఁ డీయనుష్ఠానంబు జడత యుడిగి,యనినఁ గులవృద్ధుమాటకునాత్మలందుఁ
దద్ద విశ్వాస మొలయంగఁ దత్క్షణంబ, గోపు లెల్లను దగువస్తుకోటి గూర్చి.

గోపాలకులు రోగశాంతికై శివపూజావ్రతంబు సలుపుట.

వ. శివభక్తియుఁ దదీయతంత్రజ్ఞానంబును దదాచారధుర్యతయుం గలయార్యద్విజో
త్తములఁ బ్రార్థించి తెచ్చి తత్క్రియానిర్వాహకంబునకు నియోగించిన నమ్మ
హాత్ములు విహితోపవాసనియమసమాహితులై తత్సమీపస్థితం బగుసిద్ధస్థా
నంబునందు.

తే. ఋత్విగాచార్యతతి వరియించి కుండ, మండలోదారపూర్వకమహితతంత్ర
మతిశయిల్లఁగ ద్రవ్యంబులందు శుద్ధి వెలయ నధివాసనాదులు దొలుతఁ జేసి.

సీ. పంచామృతంబులఁ బంచగవ్యంబుల విమలోదకంబులఁ గ్రమముతోడ
నభిషేక మొనరించి యఖిలేశ్వరుని సమంచితగంధసమితి నర్చితునిఁ జేసి
భూరిసౌరభచారుపుష్పదామంబులఁ బూజించి బహువిధస్ఫురితదీప
తతి యిచ్చి కపిలాఘృతప్లుతవర్తికారమ్యదీపముల నారతు లమర్చి
భక్ష్యభోజ్యలేహ్యపానీయబహుళమై, నైవేద్యములు ఘటించి హృద్యలీలఁ
బగలు రేయు నిట్లు పరిచర్య నడుపంగఁ, గొలిచి రేడుదివసములు క్రమమున.

క. తగ నిప్పగిదిని దప్పక, నగజాస్కందులను వృషభనందీశుల స
ర్వగణాధ్యక్షువినాయకుఁ, బ్రగుణార్చనములభజించి భావించి రెదన్.

తే. ఉత్తమం బగుశివమూర్తియుత్తమాంగ, మునసతిస్థూలఘృతధార లనవరతము
దొరఁగుచుండెఁజూడనమ్మహాధ్వరదినంబు, లన్నిటను విప్రవిహితప్రయత్ననిష్ఠ.

వ. అగ్నిప్రతిష్ఠగావించిఋత్విజులు వాగీశ్వరసంభూతం బగుశివానలంబునందు శివ
సంహితామంత్రంబుల నాజ్యపాయసాపూపప్రముఖంబుల హోమంబుఁ జేసి
రివ్విధంబున నెల్లవారును మృత్యుపరిహారకంబు లగుమంత్రజపంబులు నుపద్ర
వశమనకారు లగుమహాదేవమంత్రస్తోత్రపఠనంబులు శాంతిప్రదంబు లగుకల్యా
ణాధ్యానంబులు ననుష్ఠించుచుండిరి పరమేశ్వరుముందరఁ గొందఱు భ్రూవిక్షేపం
బుల నక్షివివర్తనంబులఁ జరణతాళంబుల హస్తవిన్యాసంబుల నతిమనోహారం
బును గుతూహలావహంబును నగుభక్త్యావేశనర్తనంబు ప్రవర్తించి ప్రదక్షిణ
ప్రణామాదు లొనరించి రిట్లుండ నేడవనాఁటిమధ్యాహ్నసమయంబునందు.

శా. ఆవిప్రావళిలోన వేదములవేదాంగంబులం గోవిదుం
డైవర్తిల్లుమహాద్విజుం డొకఁడు భూతావేశముం బొంది తీ

ప్రావష్టంభముతోడ నెత్తిలి మహాహాసంబు గావించుచున్
దేవ్రాప్తిలి యెలర్పఁ బాడుచును నర్తించెం గఠోరంబుగన్.

తే. అతనింజూచి యచ్చటివిప్రు లంతవట్టు, వారు నిదియేమియో యని భూరివిస్మ
యంబుఁ బొందంగ నృత్తగీతావసాన, మున నతం డిట్టులను సభ్యజనముతోడ.

శంఖకర్ణుండను భూతంబు గోపాలకులకుఁ గలిగినరోగంబునకుఁ గారణంబు దెలిగించుట.

వ. ఏను సర్వజగద్గురుం డగుచంద్రశేఖరుం డానతిచ్చి పుత్తేరం దదీయశాసనంబు
శిరంబున ధరియించి కైలాసశైలంబుననుండి మీపాలి కిప్పు డిట్లు సనుదెంచితి
గోకులంబునందు గోవులకు గోపాలురకుం దక్కినప్రాణులకు వర్తిల్లుచున్నయార్తి
తెఱం గనుసంధించి మీరు పరమభక్తియుక్తిం బ్రయోగించునీయనుష్ఠానంబు
నందలిసౌష్ఠవంబునకుం బ్రసన్నుండై యమ్మహాదేవుండు నన్ను నాలోకించి.

తే. శంఖకర్ణ నీవు చయ్యనఁ గాళింది, తటమునందు రోగతాపభరముఁ
జెంది పొరలుచున్నజీవుల కెల్లను, హితమొనర్చుపొంటె నేగు మేగి.

వ. అస్మత్పూజాతత్పరు లయినబ్రాహ్మణోత్తములలోన నెక్కనియందు దావేశించి
యిట్లని చెప్పుము.

సీ. ఘనుఁడు విరోచనతనయుఁడు బలికంటెఁ బూర్వజుం డాహవగర్వయుతుఁడు
గలఁడు దైత్యుఁడు కాలకలియన ద్వాపరాంతమున దానవు లెల్ల ధరణిబాధ
కుద్భవింపఁగఁ దాను నెకకపిత్థద్రుమమై విషోత్కటవిటపాళి యెసఁగ
యమునదక్షిణపుఁదీరమున జనించెను నద్దురాత్మునిబంటు లైనయసురు
లందఱును విషకంటకవ్యాప్తవృక్ష, కోటియై దానిచుట్టును గొలఁదిమిగులఁ
బెరిగినారు తద్భార్యలేడ్వురు సహస్ర, పుత్రవతు లైనగోవులై పొడమినారు.

వ. ఆగోవులు గాచువారు లేక తమయిచ్చం గారుపసులై తిరుగుచుఁ బ్రాణుల వధి
యించు నవ్వేలఁగద్రుమాను పుట్టినపండ్రెండేండ్లకుఁ బూచి పువ్వులుపొడమినయ
ప్పుడ ఫలి యించుఁ దత్ఫలంబు లయ్యాసురంబగుపశుగణంబు భక్షించుచుండు
నని కల దిప్పు డవ్విధం బంతయు సంపన్నం బైనయది.

ఉ. ఆవిషవృక్షగంధము రయంబ్బెసఁగం బయిఁ బొఱుతేర నా
నావిధరోగబాధలు జనంబులకున్ జనియించె నిత్తఱిన్
గోవులు గోపులుం దెవులుగొం ట్లగుకారణ మవ్విధంబు త
ద్భావితమై సరిజ్జలము ప్రస్ఫుటదోషము నొందె నెంతయున్.

వ. దీనిం బరిహరించి దూరం బరిగినవారి కారోగ్యం బగు వ్రేపల్లె తత్సమీపం
బున నున్నకతంబున నింత వృట్టె నందగోపసూనుం డగుకృష్ణుండును బలదేవుం

డునుం దాను నవ్విషభూజంబు భంజింప నోపు నతం డప్పని కియ్యకొనిన న్మదంబు
బ్రతుకుదు రని పరమేశ్వరుం డనుగ్రహించె నేను బోయెద నని పలికి భూతంబు
విడిచి పోయిన.

క. ధరణీదేవుఁడు తెలివిం బొరసె, నఖిలభూమిసురులు బోరన భూతే
శ్వరు వినుతించి సమాప్తిం, చిరి తత్క్రియ గోపవరులు చెన్నెసలారన్.

వ. రామకృష్ణుల రావించి యవ్విధం బెఱింగించిన సద్గుణగరిష్ఠులు బలిష్ఠులుగావున
నిశ్చితంబు లగునంతఃకరణంబులతో నందఱం గలయం గనుంగొని.

తే. దేవదేవుశాసన మంఱె యీవిధంబు, తల్లిదండ్రులు గులమును నెల్లవారు
బ్రతుకుతెరువంఱె సద్యశఃప్రదమునట్టె, యింతకంటెనుమేలు మా కెన్నఁడోదవు.

వ. అని రపుడు కృష్ణుండు వారితోడ.

శా. అంభోధిం బ్రభవించి విశ్వమును సంహారంబు నొందింప సం
రంభోజ్జృంభిత మైనయాద్యవిషముం రౌద్రప్రభావంబుతో
శంభుం డెట్లుపసంహరించె విషవృక్షస్ఫూర్తియుం గీర్తితా
రంభప్రౌఢత నట్ల యే నుడిపెదం రాగిల్లుఁ డీరందఱున్.

వ. అని పలికి యమ్మహాబ్రాహ్మణవర్గంబునకు నమస్కరించి శంకరునకు సాష్టాంగ
దండప్రణామం బాచరించి శివాలయంబు ప్రదక్షిణించి దేవకీసూనుండు శ్లాఘి
ణేయుదిక్కు చూచిన నతండును నట్లచేసి యతనితో నేకకార్యుండై కడంగె
నయ్యిరువురు కట్టాయితంబై చేతులం గత్తులు గుదియలు గొడ్డండ్లుం గొని యా
మునం బగునవ్విషవనంబు దెసకు నడిచిన.

మ. హరపూజాసుకృతంబుపేర్మి వెసఁ బ్రాప్తారోగ్యులై గోపకుల్
పరమోత్సాహముతోడ బాహుబల మొప్పన్ సింహనాదంబు లం
బరభూమ్యంతరపూరితంబులుగఁ దత్పార్శ్వంబులన్ ముందరం
దవ్వరితాక్రాంతి మెలర్పఁగా నడచి రుద్యత్సాధనోపేతులై.

వ. బ్రాహ్మణపుంగవులును గోపాలసహితులై కుతూహలంబున వారివెఱుంద నరిగి
రిట్లు సని కృష్ణుం డక్కడవి మునుకొని కొంతదవ్వు గడచి.

క. జనులకు నతిదుస్సహ మగు, పెనుగంపుఁ గఠోరకటుకభీషణరూపం
బున నెదురుగాలిఁ బైకొని, చనుదేరఁగ దానిబడిన చని యయ్యవులన్.

సీ. పాతాళమున నున్నఫణిరాజుకోఱలపసయెల్ల రూపమై యెసఁగె ననఁగ
గాలకూటానలగర్వంబు సర్వంబు ప్రచ్ఛన్నతనులీలఁ బ్రబలె ననఁగ
నరకాగ్నిశతముల పరుసఁదనం బంతయును నెక్కచోఁ గూడి తనరె ననఁగ
నాభిచారకవిధియాభిజాత్యము సకలము మూర్తిమంతమై యమరె ననఁగ

నధికవికృతమై యౌన్నత్య మంబరంబు, దాఁకి బ్రమాఁకులం దంతటఁ దానకాన
రాఁ బ్రభూతవిస్తారమై బ్రాలుకపట, కట్టుకపిత్థభూజాతంబు గాంచె నతఁడు.

—— శ్రీకృష్ణుఁడు విషమయంబగు కపిత్థవృక్షమునున్మూలించుట. ——

వ. ఇట్లు దూరంబునం గని దానిచేరువకుం బోవ నతిసంకటంబై యున్నమాయా
మయుం బగువనంబు గనపగొడ్డండ్ల నెఱగత్తుల నఱకి పడవైచుచుం దెరువు
గావించుకొని కదియునంత.

మ. తరుమూర్తిం గలభర్తఁ జేరి తమవత్సశ్రేణియుం దారుఁ ద
త్పరిపక్వార్ధ్రఫలోపజీవనమునన్ దర్పించి యున్నట్టియు
ద్ధురగోరూపనిశాచరీసమితి తద్గోపావలిం గాంచి చె
చ్చెర నెక్కుమ్మడి గోసి పాసి ఖరదృష్టిం జూచుచుండెం బోరికిన్.

వ. యదుకుమారుండును ముప్పదిబారలపఱపైనబంధురస్కంధంబునఁ దదర్ధపరి
ణాహం బగుదేహంబున నపరిమేయం బగుసముచ్ఛ్రాయంబున నతిభయంకరంబై
యున్నయన్నగంబు తప్పక చూచి మహాకుంభిప్రమాణంబు లగుతత్ఫలంబులు
గనుంగొని యివియకావే నిజదుర్గంధి యగుగంధవహువలన నస్మద్బంధువుల
రోగాంధులం గావించినయవి వీనిం దొలుత రూపడంచి మఱి చేయంగలపని
యంతయుం జేసెద నని బలదేవుండునుం దానునుం గూడి కడంగి.

చ. క్రమమునఁ బిందెలుం బసరుఁగాయలుఁ గాయలు దోరపండులుం
గమిసీనపండులుం గెలలు గట్టి తదున్నతశాఖ లన్నియుం
దమమయమై తలిర్పఁగ నతండును బాహులు సాఁచి హస్తగ
మ్యము లగువాని నెల్ల నలియన్ భువివైచుచు వచ్చెఁ దోడుతోన్.

సీ. అర్చుచు గోపాలు రందఱు నందంద బడియలరాలను బడఁగవైచి
కొన్ని దవ్వులవానిఁ గోమరార వానిన కొని ధాత్రిఁ దొరఁగించి కొన్ని లీల
నిక్కి పెళ్లని కొమ్మ లుక్కునవిఱుగంగఁ దిగిచి ధారుణిఁ ద్రోచి పగులఁ ద్రొక్కి
కొన్ని యివ్విధమున నన్నింటి రాల్పంగ నిష్ఫలం బయ్యె నన్నిచతరువు
ఫలనిపాతజాతం బగుబహుళరవము, చటులశాఖావిభంజనజనితరవము
సమదగోపాలనివహగర్జారవంబుఁ, గలసి గగనంబు శబ్దాత్మకంబుఁ జేసె.

వ. అయ్యపూర్వధ్వని విని యయ్యసురకొడుకులు గోరూపు లగుతల్లులకడ నున్న
పొగరుకోడెలు వేలసంఖ్యలు చెలంగి నలిరేఁగి ఖురశృంగదంతప్రహారణంబులై
పొదివినం జెదరి నిలువ నోర్వక గోపాలురు పలాయనంబు నొందిరి నందగోప
నందనుండు నగుచు వాని నొండొండ యొడిసి కడకాళ్లు వట్టి విసరి యాప్రమాని
కొమ్మలనె తగిలిచి వానిన విఱిచికొని పడునట్లుగా వైచియు నొండొంటితో
నడిచియు నేలతో వ్రేసియు బహుప్రకారంబు లగువధంబుల నిరవశేషంబు

గావించె నమ్మాయారూపంబు, లాత్మరూపంబులఁ గూలియు దానవాకారంబులం బడియు నన్నేల యంతయు శవసంకీర్ణంబునురుధిపూర్ణంబునుగావించెనివ్విధంబున.

క. పిశితాశను లని మునుగడు, విశదంబుగ నాత్మఫణితి వినియునికిఁ గ్రియా కుశలుఁడు హరి తత్పశుగణ, విశసన మవిశంకవీగవృత్తి నొనర్చెన్.

వ. అంత..

చ. కొడుకులపాటు సూచి కడుఁగోప మెలర్పఁగఁ దల్లు లొక్కయు మ్మడి వనజాయతేక్షణుని మట్టఁ దలంచి మహోగ్రహుంకృతుల్ వడిగొనఁ గొమ్ము లొడ్డికొని వాతులు విచ్చి ఖురాగ్రపాతనం బుడమిఁ బగుల్చుచు న్నిగిడి బోరన ఘోరవృషీకఁ దాఁకినన్.

చ. ఉఱికి తొలంగ దాఁటియును నూరక తోఁకలు పట్టి దవ్వుగాఁ బఱపియుఁ గొమ్ము లూడ్చి పెడవాయఁగఁ ద్రోచియుఁ గేల లీలమై బఱచి కలంగఁ జేసియును జంపఁగ నెల్లక గోస్వరూపతన్ దొఱసినరాక్షసాంగనలఁ దోలె నతండు నిమేషమాత్రలోన్.

వ. అవియును గ్రీడాన ర్తనప్రవర్తియుంబోలెఁ జెలంగియాడు కృష్ణునిపరాక్రమం బునకు భయంబు నొంది మేనులు గరుపారం గడలకుంబాఱుచుఁ దోఁక లెత్తి మెడలు మలంచి మలంచి చూచుచు నంభారవంబుల నెఱలుచుఁ బఱచి దూరం బగుకాంతారంబు దూఱి కాడుపడి పోయె నంత.

శా. పాదంబుల్ నుఱుమాడి యుద్ధతవిరూపస్కంధముల్ వ్రచ్చి రూ పేదం బండులు డుల్చి బాహువులయు ట్లెపారుశాఖాలి సం ఛేదక్రీడ నడంచి మస్తకతతుల్ శీఘ్రుంబ ఖండించి యి ట్లాదేవేశుఁడు రూపుమాపెఁ దరురూపాభీలదైత్యౌఘమున్.

వ. తదనంతరంబ నిర్భయులై కూడినగోపబాలురుం దానును రామసహాయం బతి భీమంబుగా నమ్మహాద్రుమంబు నుపాంతంబున నున్నవిషకంటకవృక్షంబులు తద్వ ల్లీగుల్మజాలంబులుం బిలుకుమారం దునుమాడి యవియును గోవత్సశవంబులుం గూడఁ బ్రోవులు సేయించి కపిత్థతరుశకలంబులు దత్తలంబునం గూడవైచి యంతటం గలయం గనలునగ్నులు దగిల్చిన.

చ. గొనకొని పేర్చి నాలుకలుగ్రోయుచు ఘర్మవిశేషతీవ్రతం బొనరుసమీరుసఖ్యమును భూరితరంబుగ సంభవించుటం గనలుచుఁ బావకుం డడరి కాల్చె ముహూర్తములోన నమ్మహా దనుజకళేబరద్రుమవితానములన్ వెస నుగ్గునుగ్గుగన్.

వ. అంత.

క. కురిసె సురపుష్పవర్షము, హరిపై నప్సరస లాడి రాతోద్యంబుల్
మొరసె సుఖస్పర్శంబై, పెరసెం బవనంబు దెసలు వెలసెం గలయన్.

వ. ఇట్లు విజయోల్లాసభాసి యైనవాసుదేవు నవ్వసుమతీదేవులును వల్లవప్రభువులు నుం బ్రభూతభాషలం గీర్తించిరి రోగార్తి ముక్తంబై తత్క్షణంబ బృందావనంబును భువనభావనంబునం బరఁగుటకు నర్హం బయ్యె నాసమయంబున

శ్రీకృష్ణుఁడు గోపాలురతో యమునయందు జలక్రీడసలుపుట.

మ. చెమటం దోప్పఁగఁదోఁగి భస్మకణికాస్మేరోత్తమాంగంబులన్
సుమహన్నిశ్వసితాకులాననములన్ శోభిల్ల మేను ల్మహా
శ్రమవేగంబునఁ దూల నందఱు విహారాపేక్షులై డిగ్గి ర
య్యమునాభూమికి వెండి వెల్లిసుక పెల్లై యున్నమార్గంబునన్

తే. పౌరుషము మెచ్చిముదమునిండారనగుచుఁ, గౌఁగిలింపంగ నేతెంచుకరణినొప్పెఁ
బ్రకటఫేనయై కడలుచే బారసాఁచి, హరికి నభిముఖంబుగఁ బొంగుతరణికన్య.

మ. గురుగోత్రాధరవప్రభూములు వడిం గోరాడి యందంద చం
డరదద్వంద్వ మెలర్ప యూథముల వేడ్కం గొంచుఁ గ్రీడార్థియై
యరుదార స్మదఖేదభారమున నెయ్యం జొచ్చువన్యద్విపేం
ద్రురుచిం బొల్చె జలౌఘమున్ దఱియునాదోశ్శాలి గోపాలితోన్.

వ. ఇట్లు సొచ్చి యమ్మహావాహినియందు.

సీ. ఒండొండ యిద్దరినుండి యద్దరిదాఁక నేపారుపురుడున నీఁదియీఁది
మునిఁగి లోలోనన చని దవ్వుదవ్వుల ననువుగ నెగసి పెల్లార్చి యార్చి
కడగానరానిపెన్మడువులఁ బఱతెంచి యుఱికి వే కదుఁ దేలి మెఱసిమెఱసి
యొండొరుఁ బేర్కొని యోలయోలని దాచి యదటున జల్లుపోరాడియాడి
వాద్యభంగి జలము వాయించివాయించి, పాడిపాడి కెరలియాడియాడి
తనిసి మూఁడుజాలతఱి ప్రొద్దోకించుక, చల్లవడిన నల్లనల్ల వెడలి.

వ. గోపాలురు కృష్ణపాలనంబు గనినవారు గావున భావంబు లలరఁ బరిధానాదుల నలంకృతులై మనోజ్ఞవేషంబులతో నిలిచి రయ్యెదుకుమారు లిద్దఱు నటమున్న తల్లులు పుత్తేరఁ బరిచారకులచేత నుపనీతంబులైన ధౌతాంబరప్రముఖపరిష్కారంబులు గైకొని రప్పుడు పుత్రునివిచిత్రవిక్రమోత్సవంబునకు నానందించి నందుం డాయితంబు సేయించినచతుర్విధాన్నంబులు గొని గోపకుటుంబినులును దారకదారికాసహితంబుగాఁ జనుదెంచినం దత్ప్రియత్నంబున.

తే. సముచితప్రదేశంబున జలజనాభుఁ, డగ్రజుం డగ్రపాత్రంబునందు నిలువఁ
దాను పెద్దలుఁ జెలికాండ్రుఁదగఁగ నార, గించి తాంబూలములుగొని మించియెలమి.

వ. కొండొకసేపు విశ్రమంబు నొంది తదనంతరంబ సముత్థితుండై కదలి లోకక్షే మకరంబు లగుశకునంబులు గనుంగొనుచుఁ దజ్జ్ఞు లవ్విధం బభినందింపఁ జను దెంచె నప్పు డొండొరులం గౌఁగిలించుచుఁ బరువులు వెట్టుచుఁ దారుచు నెలుంగెత్తి నవ్వుచుం బాడుచు వేణువీణాధ్వనిమిశ్రంబుగాఁ బటుపటహావాద్య నాదంబు లొనర్చుచు గోపాలు రాలోకనీయంబు లగుప్రమోదసంభ్రమంబుల నొప్పి యప్పురుషోత్తముముందరం బిఱుంద నుభయపార్శ్వంబులను దత్పౌరు షంబు ప్రశంసించుచు బెరసి రిట్లు వచ్చి యందఱు సాయాహ్నసమయంబున వ్రేపల్లె సొచ్చి తమయిచ్చ నుండిరి విప్రవరులు గోపవృద్ధులవలన నర్చనంబు నొంది నిజస్థానంబులకుం జనిరి వాసుదేవుండు జననీజనకవాత్సల్యంబునఁ బర మోత్సవంబు గని వత్ససంచరణతత్పరం బగుతనపూర్వక్రీడనంబున విలసిల్లు చుండె నంత.

మ. విషవృక్షంబు జయించి తాపభరముల్ వేపాపి వ్రేపల్లెక
ల్మషము న్మాన్చినకృష్ణుతోఁ దనకు సామ్యం బొసఁగెట్లు దు
ర్విషహగ్రీష్మ మడంచి విశ్వము నిరుద్వేగంబు గావించుచున్
సుషమం బయ్యె నభస్యమాసము పరిస్ఫూర్జద్ఘనశ్యామమై.

ఉ. చాతకవందిబృందములు సంస్తుతి సేయ విశాలబర్హిబ
ర్హాతపవారణంబు లెలరారఁగఁ బర్వతభద్రపీఠముల్
బ్రీతి నుపాశ్రయించి జలభృద్ధరణీవిభు లాక్రమించి రు
ద్యోతిసురేంద్రచాపనవతోరణశోభితభూమిభాగముల్.

క. రాయంచలగుండెబెదరు, మాయామంత్రము వియుక్తమానచ్యుతి క
త్యాయతమయూరకర్ణ్ణర, సాయన మనఁ బ్రథమజలధరారవ మెసఁగెన్.

క. దినపతియు నిశావిభుఁడును, దనతననామము నిరర్థతం బొందిన సి
గ్గునఁ బొడసూపరొ యనఁగా, దిననిశ లొక్కటిగ మేఘతిమిరము లయ్యెన్.

క. లలితగగనరంగంబున, నలయక క్రొమ్మెఱుఁగు గొండ్లియై యాడెడుచో
నలవడియె మొగులుతెరలును, బొలు పగువడగండ్లగములపుష్పాంజలులున్.

క. జలధారలు మదధారలు, జలదంబులు మొగవడములు చండానిలవి
హ్వలగహ్వరరవములు గ, ర్జలుగా గిరుల మఱె సమదసామజసమితుల్.

తే. ఘనరసోపయోగంబునఁ గ్రమ్మఱంగఁ
బడసెఁ బ్రాయంబు దగదె యిబ్బంగి యనఁగ
హరితతృణలతారుణకోమలాంగి యగుచుఁ
బృథ్వి యెంతయుఁ గ్రొత్తయొప్పిదము నొందె.

శా. ధారాపూరకఘోరవృష్టిఁ గమలధ్వంసంబు పాటిల్లినం
జేరం జోటొక టెందుఁ గానక భ్రమం జెయ్వేదు భృంగావళిన్
గ్రారా మారఁగ నుద్ధరించెఁ బొగడంగా నొప్పదే నాఁగ నిం
పారెం బ్రస్ఫుటకందళీకుటజనీపాంభ్రమాదికాంతారముల్.

క. ధరణీరజ మడఁచియు జల, ధర కాలము దెసలు గగనతలము దలమ్ముగా
సరజమ్ములు గావించెం, బరిణత కేతకవనోత్థపవనోద్ధతులన్.

క. రేయుం బవలును మెఱయుచు, మ్రోయుఘనావళులకలిమి ముదియలు దమ్ముం
బా యక యుండఁగఁ బరిరం, భాయతభోగరుచు లొదవె నాత్మేశులకున్.

క. కుటజకుసుమవాసితలై, యటవులు నవమాలతీలతాంతపరిమళో
త్కటలై నగరీవనికలు, పటుతాప మొనర్చెఁ బాంథపఙ్క్తుల కెల్లన్.

శా. చండాపాతములం దటద్రుమము లుత్పాటించి శుండాలికా
గండూషానభిరమ్యతోయ లగుచున్ గాఢాంతరావర్తముల్
డిండీరోత్కరవీచులం బెనుప నుద్రేకించెఁ గూలంకషల్
మందాకినీపరిగీయమానవిలసన్మాహాత్మ్యలై యెల్లెడన్.

వ. ఇట్టివర్షాగమంబునఁ గృష్ణుండు బలభద్రసహితుండై గోపాలనకేళీవినోదంబులం దగిలి.

ఉ. క్రాలెడుపచ్చపట్టు నునుఁగచ్చులఁ గ్రొమ్మెఱుఁగై చలింప ను
న్మీలితబర్హదామము సమిద్ధమహేంద్రశరాసనంబుగా
మేలగువేణువాద్యరవమిశ్రితగీతము గర్జచందమై
నేలకు డిగ్గెనొక్కొ సువినీలఘనం బననొప్పెఁ గానలన్.

క. వనకుసుమవిభూషిత మగు, వనజాక్షునితనువు మెఱసె వనవిటపివిమ
ర్దనలగ్నలతాతం బగు, వనవారణవిభునుదగ్రవపువుం బోలెన్.

సీ. ఆసమయంబున నట విదేహక్షితిమండలంబునయందు మహితచరితుఁ
డమితగోధనము ధనాభివృద్ధియుఁ గలవాఁడు గుంభకుఁ డనువల్లవుండు
ఘనుఁడు యశోదకు ననుజుండు ధార్మికుఁ డర్థుల కనిశంబు నాజ్యదుగ్ధ
దధితక్రదానంబు తాత్పర్యమునఁ జేయు నతనిభామిని ధర్మదాహ్వయమునఁ
బరఁగు నన్వర్థనామయై భవ్యశీలు, రట్టిదంపతులకుఁ బుత్రుఁ డధికుఁ డొకఁడు
గలిగె శ్రీధాముఁ డన నొకకన్య నీళ, యనఁగ జనియించి గారాము దనరఁ బెరిగె.

వ. ఇట్లు పెరిగి త్రైలోక్యరత్నం బిది యనువర్ణనలకుం దగి వరవర్ణినీతిలకంబై యున్నయన్నాతి ననేకగోపాలకుమారు లడిగి యడిగి కానక నిలిచి రట్టియెడ.

తే. తారకామయరణమున వారిజాక్షు, కడిమి నిహతులై యేడ్వురు కాలనేమి
కొడుకు లాపగ మనసున నిడి పొడమిరి, కడిఁదియాఁబోతులై కుంభకవ్రజమున.

## కాలనేమిపుత్రుకేద్వరుగుంభకునింటవృషభంబులై పుట్టుట.

వ. ఇట్లుజనియించి.

క. పోరానిచుట్ట మితనికి, శౌరి యిచటి కెల్లభంగిఁ జనుదెంచు బలం
బారఁగ నతని వధింపఁగ, నేరూపున నైన మాకు నిచ్చట నెదవుర్.

వ. అని తదాగమనకారణంబు లగునుపాయంబులు చింతించి నిఖిలజనబాధకంబు
నకుం దొడంగి.

సీ. ఎదిరినపోతుల నెవ్వానినైన నవారణ నోడించి వలియుఁదోలు
నిలిచినఁ జంపు మందల నెందుఁ దిరిగి క్రేపుల మొదవులను జాఁబొడుచుఁ బట్ట
నడపంగ వచ్చిన నదటునఁ జిందఱగొని మెట్టిబలియురఁ గొనక కవియు
నీటిలోఁ దఱిసిన పాఠీనములగతి వెలుఁగులు సొచ్చి యావలికిఁ బోపు
గోడ లలవలు వెనదాఁటుఁ గ్రీడవ్రాలె, రేలుఁ బగళులుఁ దిరుగుచుఁ జేలఁబంట
లొకఁడులేకుండ మేయుఁగాపున్న వారి,నుఱికిపొరిగొనుఁగడిఁదిమృత్యువులుఁబోలె.

వ. అంత నవ్విదేహదేశంబునఁ గలకృషికవరు లెల్లం గూడి రాజుపాలికిఁ జనుదెంచి
చక్కసాగిమొ్రక్కి లేచి నిలుచుండి చేతులు మొగిడ్చి.

తే. కుంభకునిమందఁ బుట్టినగోవృషంబు, లేడు నీభూమిసస్యంబు లెల్లఁ జెఱిచె
గావ నలవిగా దేరికి దేవ యెఱుకు, జెడితి మఱయఁగ వలయు మాచేటు నీవు;

క. జముఁడైన వచ్చి వానిని, దమియింపఁగలేమి నిశ్చితం బేమియుపా
యము గలదొ కనుఁడు మీధా, వమునం దిటఁ బ్రజలు మీకు వలసిర యేనిన్.

వ. అనిన విని మిథిలేశ్వరుండు కుంభకు రావించి నీసప్తవృషభంబులు భూమియుం
తయుం బాడుగా మేసెఁ బ్రజలు నిలువలేమని మొఱపెట్టెదరు నీవు దొరవు
గాని తుచ్ఛుండవు గా వట్లగుట దీనికి నెం డననేరము వానిం బట్టి కట్టింపు
మొండె నెద్దుపట్టింపుము గాకున్న నరణ్యంబులు సొర వెలువరింపుము లావరు
లగుచుట్టలు గలవాఁడవు నీకు సాధ్యంబు గానిది లే దివ్విధం బనాలస్యంబుగఁ
గైకొనక యున్నఁ దప్పక యొప్పమి వచ్చుం జుమ్ము పొమ్మనిన నట్లకాక యని
యతండు బలవంతులఁ బెక్కండ్ర నక్కార్యంబునకు నియోగించుటయు.

తే. వల్లియలు వైచి యోదము ల్పెల్లు ద్రవ్వి, తార్చివేసఁజెయుగులొగ్గి తఱికిసిడయ్యఁ
దోలి యోటరి పోనీకదొడ్డి నాఁగి, పొడుప నడువను నలుదెసఁ బొంచి యోడి.

వ. మఱియును వివిధోపాయంబులం దదీయదమనంబునందు శక్తులు గాక యప్పటి.
కప్పటి కప్పశువులచేతం బోటువడియును వ్రేటువడియును ద్రొక్కువడియును
జిక్కువడియును నలిగులిమై లావు సెడి చేవదఱిగి కడంకలు గుదునువడి కడిమి
పెంపు వ్రానాడి చేతులాడక యుండఱుం దలంకి నిలిచిన.

ఉ. కుంభకుఁ డింక నెయ్యది యొకో వెర వంచుఁ దలంకి యెవ్వఁడు
జృంభితవిక్రమోద్ధురతఁ జేరి వృషంబులఁ బట్టి కట్టు సం
రంభ మడంచు నంచు ననురాగ మెలర్ప నతండ మత్తనూ
సంభవకు న్విభుం డగు నిజం బిదియంచుఁ బ్రతిజ్ఞ చేసినన్.

క. ఆతఁడు సాటింపఁగ విని, యేతెంచిరి భూమి గొల్ల లెల్లను వెస నాఁ
బోతులఁ బఱుచుట యొకపని, యే తరుణిం గొంద మనుచు నేపు దలిర్పన్.

వ. ఇట్లు మిథిలాపురం బంతయు గోపాలమయంబై యుండె నట్లు గూడినయందఱుం
దమలోన.

సీ. కొమ్ములు వడి నూఁది కుదియింతుఁ బ్రోఁపఱ ననువాఁడు పడవైచి యనువుదప్పఁ
బట్టి పెల్కుఱ ముక్కుఁగట్టుదు ననువాఁడు గుదియల గుండ్లను జగియ గుప్పి
యదరంట గడియలో నాఁగి పట్టుదు ననువాఁడును బొదివి యెవ్వలను దిరిగి
మొగదప్ప నందంద మోరలు నులుపుదు ననువాఁడునై గొల్ల లచట నచట
మల్లసఱచుచు నార్చుచు మలసి బ్రమరి, పాఱుచును బెక్కుబిరుదులు పలికిపలికి
మెలఁగి యాఁబోతు లుండెడిపొలము లరసి,అంకె పట్టుగనుంగొని బింక మెసఁగ.

### శ్రీకృష్ణుఁడు నందాదులతోడ మిథిలాపురంబుననున్న కుంభకునింటికిఁ బోవుట

వ. సమగ్రసన్నాహం బగునుత్సాహం బెసంగ నున్నంత గుంభకుండు మున్ను పని
చినమానిసులు పని నందగోపునకు సప్తవృషభవృత్తాంతం బెఱింగింప నతండు
బాహుసత్త్వోదారు లగుకుమారులం బెక్కండ్రం దోడ్కొని యశోద మున్ను
గాఁ జనుదేరఁ దండ్రితోడన కృష్ణుండును బలదేవసహితుండై వచ్చె నప్పుడు
తద్వ్రజనివాసు లగుజనంబులు.

తే. రామలక్ష్మణతుల్యు లీరామకృష్ణు, లలఘుభాగ్యలక్షణమూర్తు లరసిచూడ
నాఁటివారల యిప్పుడు నేఁటివీర, లైరి గాకని వెఱఁగంది రాత్మలందు.

వ. కుంభకుండు నందగోపునకు నెదురువచ్చి తోడ్కొని పోయి సముచితాసన
విన్యాసప్రభృతు లగుసంభావనలం బ్రీతునిం జేసె యశోదయు ధర్మదచేత
సత్కృత యయ్యె శ్రీధాముండు కృష్ణుం గౌఁగిలించుకొని యతనికిం దదగ్రజు
నకుఁ దాన తెచ్చి యాసనంబు లమర్చె నయ్యందఱుం దన్మందిరంబున సరస
పాయసఘృతబహుళం బగునాహారంబునం దృప్తి నొంది యిష్టగోష్ఠి నుండ
నారాత్రియందు.

మ. హరి యేతెంచు టెఱింగి కట్టలుకతో నమ్మాయపోతు ల్వడిన్
గురుశృంగంబులఁ గుంభకవ్రజములో గోగర్భిణీవత్సశా
క్వరసంఘంబులఁ బెక్కిటిం బొడిచి రక్తంబుల్ భువి న్నింపఁగాఁ
దెరలంబాఱఁ గలంగి గోవులు గడున్ దీనంబులై రోలుచున్.

సీ. అంతఁ బోవక యవి యాగోపముఖ్యులోగిటిలోని కుటికి యక్లేశలీల
అంకెలు వైచుచుఁ గింకఁ గాల్ద్రవ్వుచుఁ జిమ్ముచు నొండొండ జెలఁగి చెలఁగి
భాండసంభారంబు పగిలించి గోడలు గోరాడి గరిసెలు కూలఁ దాఁకి
బండులు విఱుగంగఁ బైదాఁటి పందిళ్లు పడఁద్రోచి తలుపులు సడల నెత్తి
యాఁడువారును శిశువులు నార్తిఁ గూయ, నెక్కడెక్కడ యని వాడలెల్లఁ గలఁగఁ
గూడి త్రుళ్లెడుపరదేశిగొల్లకొమరు, లిందు నందును నెదుఁగంగ నేపు సూపె.

వ. అంతఁ బ్రభాతం బగుటయుఁ గుంభకుండు సకలగోపాలురం గూడఁ బిలిపించి కూఁతునకు శృంగారంబు సేయించి తెచ్చి తత్సమీపంబున నునిచి నందగోపసహితుం డయియుండి కృష్ణపురస్సరు లగుతదీయులు నన్యులు విన నిట్లనియె.

ఉ. గోపకుమారులార కనుఁగొంటిరె గోవృషముల్ దిశాగజేం
ద్రోపమము ల్మహాగిరిగుహాస్థితసింహసమానము ల్కృశ
త్కోపకృతాంతతుల్యములు దుర్దమముల్ దమియింప వీని మే
మోపక యిట్లు చిక్కితిమి యోగ్యపుయత్నము లెన్ని సేసియున్.

క. కేవలగోవృషభంబులు, గా వివి రాక్షసులొ యొండె గంధర్వులొ యు
త్పాతావలిలోనివొ హింసయ, కావింపం బుట్టినవి జగంబున నెందున్.

తే. వీని దండింపకున్నను మానవేంద్రుఁ, డలుకతో మమ్ము దండించు ననియెఁ గాన
దలఁకి కూర్చితి మిమ్ము నిందఱను మీరు, సత్త్వవంతులు విక్రాంతితత్త్వవిదులు.

వ. కావున వీని మర్దింప నోపినవాఁ డొక్కరుం డిక్కన్నియకరపంకజం బాక్షణంబ కైకొనువాఁ డని జనకుండు జానకీశుల్కం బగుశంకరశరాసనదమనం బుదాహరించినవిధంబున నిరూపించినకుంభకువాక్యంబు నాఁటిభూపాలురపగిది గోపాలు రందఱు నాకర్ణించి.

శా. నీలం జూచుచు మన్మథాస్త్రముల కున్మేషంబులై డెందముల్
సాలం గౌతుక మొంద గోవృషములం జర్చించి యాభీలకా
లాలంఘ్యోద్ధతచండదండహతి కత్యాతంకముల్ పైకొనన్
డోలాందోళితచిత్తులై రి మఱి దోడ్తోఁ దెంపు సొంపారగన్.

వ. ఇట్లు చిత్రవిన్యస్తదేహులుం బోలె నిరుత్సాహులై నిశ్చేష్టభావంబునఁ జూచుచున్నవారలం జూచి నందగోపజ్ఞాతి యగు ఘోషవంతుం డగు గోపకుండు.

శా. ఈయాఁబోతుల నిట్లు బెట్టుగొన కింకేనాటి కీవిక్రమ
వ్యాయామంబులకల్మి చూడుఁ డిదె, కన్నారంగ నన్నొక్కనిన్
వేయుం బల్కఁగ నేల నుక్షముల నుర్విం గూల్తు నన్నింటి వీం
డ్రాయస్మద్భుజవజ్రపాతనకు గోత్రాద్రీంద్రులై చేకుఱన్.

మ. అని యాస్ఫోటితబాహుఁడై బహులసింహధ్వానదీప్తాననుం
డును దర్పోద్ధతవిగ్రహుండు నయి యాటోపంబుతోడం గడం
గిన నయ్యుక్షము లీక్షణచ్ఛటల నగ్నిజ్వాల లొక్కుమ్మడిం
గనలం గన్గొని వానిపైఁ గవిసెఁ దీక్ష్ణవ్యాఘ్రశృంగంబులై.

తే. పొదలుఁ బుట్టలుఁ గట్టులు భూరుహములు, నెక్కి కనుఁగొనుజనకోటి యెల్లఁ బొగడ
నట్లు గడఁగి యార్వేఁడులావమరఁ బొడిచెఁ, జిక్కఁ బిడికిట నొకపోతు శిరము నడుము.

శా. ఈతం డేమిటి కిమ్మెయిం గడఁగె నిం కెట్లొక్కొ యీదుష్టుఁడుం
బోతు లొవ్వఁగ నిచ్చునే యనుచు నంభోజాక్షుచిత్తంబు చిం
తాతిక్రాంతత నొందఁగాఁ దొడరి తానాథంగి దోర్విక్రమ
ఖ్యాతిం జూపినఘోషవంతుఁ బొదివెన్ గ్రందంగ నయ్యన్నియున్.

తే. పొదివి నిడువాలుఁ గొమ్ములఁ బొడిచి యెత్తి, ధరణిపై వైచి వెస మట్టిఖురపుటములఁ
జిమ్ముటయు దవ్వుగాఁ దూలి సొమ్మవోయి, పడియె నాతఁడు చూపఱు భయము నొంద.

వ. ఇట్లు ఘోషవంతు బెట్టుపఱిచి బెట్టిదంపుటురవడి నయ్యుగ్రపశువులు దక్కును
గలపశుపాలకప్రకరంబుపై నడరి.

క. కొందఱఁ గొమ్ముల గ్రుచ్చెం, గొందఱ నేలపయిఁ బెట్టి గొరిజల మట్టెన్
గొందఱ దాడల నమలెం, గ్రందుగఁ బెఱజనము లెల్లఁ గనుకనిఁ బఱవన్.

వ. అరితేయుం జూచి మందహాసవిభాసితాస్యుం డగుచు వాసుదేవుండు బలదేవుతో
నిట్లనియె.

మ. ఇవి యాఁబోతులు గావు గోవృషములం దీరోష మీదోష వి
ప్లవ మీసర్వజిఘాంస యారయ నసంభావ్యంబు వమ్మయ్యె నీ
భువిలో నేచినగోపవిక్రమకళాస్ఫూర్తుల్ల సత్కీర్తి నా
కవుఁగా కిప్పుడ కాచెదన్ వృషభయవ్యావిద్ధు నిక్కుంభకున్.

వ. తొల్లి తారకామయసంగ్రామంబున నాచేత నిహతులైన కాలనేమి పుత్రు
లేడ్వురు నీరూపంబునం బుట్టి నాకుఁ గీడుచేయం గోరి తిరిగెదరు రిపువధం బవ
శ్యకర్తవ్యంబు బంధురక్షణసుకృతం బొక్కటియుఁ గన్యాకరగ్రహణలాభంబును
శోభనంబులు గావె శ్రీధాముతోడిసఖ్యంబును నాకు నపేక్షణీయం బిది నాత
లంపు నిశ్చితుండవై యుండు మని యతం డనుమతింప నాక్షణంబ సన్నద్ధుండై.

శ్రీకృష్ణుఁడు రాక్షసాంశ సంభూతంబులగు సప్త వృషభంబులఁ జంపుట.

తే. అన్న యిట్లేలసాహసంబనుచు నంద, గోపుఁడును యశోదయును సంక్షోభ మొందఁ
గుంభకుఁడు మెచ్చఁ దక్కినగోపకోటి, సంశయింప నసంభ్రమోత్సాహలీల.

వ. ఆయుగ్రపశువుల కభిముఖుం డయ్యె నప్పుడు దేవతలు మునులు నంబరంబున నుండి యతనివిజయంబు గోరుచుఁ గనుఁగొనుచుండి ర ట్లడరి యవ్వీరుండు ఘోరంబుగా నదల్చి.

క. ఖలులార యింతకాలము, గలఁచితిరి ధరిత్రిఁ బ్రాణిఘస్మరులు పశు
చ్ఛలనచ్ఛన్నవిహారులు, పొలిసితి రిఁక మీకు నెందుఁ బోవఁగవచ్చున్.

క. నాపిడికిటికడిఁదిపిడుగు, నాపగిదియ దీనఁ దగిలి యంతకుఁడైనన్
రూపు సెడకుండఁ బోవునె,యీపాపాత్మకుల మిమ్ము నేల సహింతున్.

మ. అని యావిష్కృతతీవ్రముష్టి యగుచున్ హాసోజ్జ్వలాస్యంబునం
గన లుప్పొంగఁ గడంగునవ్విభుఁ ద్రిలోకక్షేమనిర్వాహకుం
గని పూర్వం బగువైరబంధమున నుగ్రక్రోధులై ఘూర్ణగో
దనుజుల్ మార్కొని రొక్కయుమ్మడిన యుద్యద్గర్జతో నేద్వురున్.

వ. అట్టికోల్తలయందు.

సీ. ఘాదివిన నందంద మొకఁకనియఁఅచేత వీఁకతో నూరలు వ్రేసివ్రేసి
బిట్టుగ్రోవ నందంద తటిమి కొమ్ములు వట్టి తోడర నొండొంటిపైఁద్రోచిత్రోచి
చెదరిన నవలీలఁ జెనసి యొక్కొక్కటి తెరలఁ దోఁకలు వట్టి త్రిప్పిత్రిప్పి
తిరిగినఁ బోనీక పరిగొని యన్నింటి నదరంటఁ బొరిగొని యాఁగియాఁగి
ముట్టి కందము ల్వడి గ్రుత్తిపెట్టి పెట్టి
వీఁపు లడిచియుఁ దోఁకలు వీఁకఁ దాఁచి
వెన్నముక లన్ని చెఱకులవ్రేఁగు గాఁగఁ
గడిఁది యాఁబోతుగమి బెట్టుగలఁచి యాడె.

వ. ఇట్లు సూపఱచూడ్కి వేడ్కగాఁ గొంతసేపు వినోదించి.

శా. నీశాలోచనరోచు లాదరసమున్నిద్రంబులై సిగ్గునం
జాలన్ స్రుక్కుచు నెయ్యనెయ్యఁ దను నాసం జెంది యానందక
ల్లోలవ్యాహతిఁ దూలఁ దత్కుతుకము ల్పొరింప నుద్యుక్తుఁడై
యాలోకప్రియుఁ డవ్విరోధులఁ బ్రచండాలోకుఁడై చూచుచున్.

ఉ. దిక్కరిహస్తదండసముదీర్ణభుజుండు ప్రగాఢముష్టి నొ
క్కొక్కనిమస్తకం బవియ నొక్కొకపోటు గొనంగఁ గన్నులన్
ముక్కున వాత నెత్తురు సముద్గతమై చెదరంగ నోలి తో
నొక్కొకరుండ కూలి రసు ఁరొక్కటపోవఁగఁ గాలనేమిజుల్.

వ. ఇట్లు మాయావృషభంబు లక్కమోఘశార్దూలుచేత నాలంబునం గూలిన నఖ లగోపాలురు విస్మయంబుఁ బొందిరి నందగోపయశోద లానందంబునం బఱతెంచి నందనుం గౌఁగిలించి దీవించి రప్పుడు కుంభకుండు.

ఉ. కన్నియ చేయి చేతఁ గొని కౌతుకవేషమనోజ్ఞుఁడై నయా
వెన్నునిఁ జేరఁ దెచ్చి యిది వీర భవద్భుజవీర్యశుల్క-మై
యున్నది కాదు నీదయినమేనమఱందలు నీక చేరె నీ
యన్నుఁ బరిగ్రహింపు మని యర్థిఁ గరంబుఁ గరంబు సేర్చినన్.

వ. అమ్మహాత్ముం డమ్మహిళారత్నంబు గైకొనియె నప్పు డవ్విదేహుండు వైదేహీ
వరణవిభాసి యగుదాశరథింబోలె నీళాస్వీకరణమహితుం డయినమాధవు ననే
కాభరణాంబరాదుల నర్చించి యశోదానందగోపులకుఁ గట్టనిచ్చి తక్కినగోప
కుమారులసంభావించి యనంతరంబ నెయ్యం బెసంగ వియ్యంబున కిట్లనియె.

ఉ. నీకొడుకు ప్రతర్క్యమహనీయభుజావిభవుండు వీని
శౌర్యాకలనంబుపేర్మి మము నస్మదశేషకులాన్వితంబుగా
శోకముఁ బాచి మన్చె నతిసుస్థిరజీవన మేను గంటి న
స్తోకవిభూతి నీతనియశోగరిమంబును బేర్చు నెల్లెడన్.

క. వేలు పదివేలు లక్షలు, నీలకు నరణంబుగాఁగ నీయింటికి నే
మేలుగ నిచ్చెద గోవుల, నేలా యివి యనకు మిది యభీష్టము నాకున్.

వ. అనిన నతం డతనిం జూచి నాకుం గొలందియిడరానిపసియును నపరిమితమహి
ష్యజావికంబులుం గలవు కృష్ణుండు జన్మించినదియాదిగా గోవులు ప్రతిసంవత్స
రంబును బ్రసూతలై క్రేపులు పురణించి వచ్చుఁ బా లెంత పితికితి మంతయు
ఘృతంబయి పేర్చు నరణ్యంబున గుల్మద్రుమావలయం దెల్లను బహులం బగు
మధువులు సులభంబులు యాదవు లెల్లవారికి నాయురారోగ్యంబులును భోగ్య
వస్తుసిద్ధియును నవ్యాహతంబులు గొఱంత యెందును లేదు నీయిచ్చినయర
ణంబు మాకు వచ్చినయది యని పలికి యాదివసంబు పరమకల్యాణంబుగా
నక్కడ నుండి మఱునాఁ డతని వీడ్కొని కదలెఁ గృష్ణుండును నీళాసమన్వి
తుండై శ్రీధాముండు తనకుఁ బ్రియసఖుండుగా నడిగి తోడ్కొని యశోదా
నందగోపు లభినందింప మగిడి యాత్మీయదేశంబున కరుగుదెంచి తొల్లింటియట్ల
సుఖంబుండె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

శా. గోపాలత్వముఁ బొంది యవ్విధమునన్ గోవిందుఁ డున్నట్టి స
ద్వ్యాపారంబులు సెప్పఁగా శ్రుతికి నింపై యింత యొప్పారునే
యాపుణ్యాకృతి నాఁటివారలకు నెట్లైయొప్పెనో చూడ్కికిన్
రూపింప న్మదిలోని కిప్పుడు కడున్ రోచిష్ణువై చెందెడున్.

మ. భుజయూపంబున గోవృషాఖ్యపశువుం బ్రోక్షించి విక్రాంతియన్
యజనంబున్ విబుధప్రమోదనముగా నమ్మెఁ బ్రవర్తించి స

ర్వజగత్పూజ్యత నుల్లసిల్లుచు మనోరాగంబునం గ్రమ్మఱ
నిజదేశంబున కేగి యెట్లు నడచెఁ. విష్ణుండు విప్రోత్తమా.

వ అని యడిగిన నమ్మహాముని యమ్మహీపతి కిట్లను నట్లరిగి కృష్ణుండు వత్సపరి పాలనంబునఁ గ్రీడాలోలం బైనబాలచరితంబు పరిణతిం బొందిన యనంతరంబ.

తే: కొదమఘతనమున నొప్పారి పిదపగండు, మెఱసిపొదలెడుమృగనాథు తెఱఁగుదోఁప నభినవస్ఫురదుద్దామయౌవనంబు, నొందె గోపికాదృక్చకోరేందుఁ డగుచు.

వ. అట్టి వయోవికాసంబున

సీ. నెఱుల నున్ననికప్పు దుఱఁగలిగొనఁగూడి పొదలువెంట్రుకలు కొప్పునకునెయిద నూఁగారుమీసలతోఁ గాంతి దళుకొత్తుమొగము గన్నులు క్రొత్తజిగిఁ దలిర్ప నడుము వర్తులవగాఁగ వెడఁదయై కఱకెక్కి యొప్పార వెలసి పేరురము దనర మూఁపులు పొడవులై చాపుఁజక్కఁదనంబు గలిగి చేదోయి యగ్గలిక నూప వెన్ను పఱపయి కంఠంబువిప్పుచఱచి, పిఱుఁదు బెడఁగొందినడపునొప్పిదమువింత తెఱఁగు గైకొన గోపాలదేవమూర్తి, యఖిలశోభాకలాపకల్యాణి యయ్యె.

వ. రోహిణీనందనుండును దాదృశసౌందర్యంబునం దిలకించె నయ్యసమానతేజులిద్దఱు సవయస్కు లగువల్లవకుమారులతోడం గూడి గోరక్షణక్రీడాతత్పరులై విహరించి రవ్విహారంబులయందు.

చ. నునుపగుపచ్చపట్టునఁ గనుంగొన నొప్పుగ దిండుగట్టి నూ
తన మగుబర్హిబర్హకృతదామము నెట్టము సుట్టి క్రమకా
ననతరుపుష్పమాలిక దనర్చునురస్థలి నుద్వహించి యిం
పొనరఁగ వేణునాదసరసోత్సుకుఁడై హరి యొప్పె నెల్లెడన్.

శ్రీకృష్ణుండు వామదేవ భరద్వాజులను మునులఁగని సంభావించుట.

వ. ఒక్కనాఁడు యమునాపర్యంతకాంతారంబునం జరియించువాఁ డెదుర నతిమాత్ర విస్తారోదారంబును నతిశయోన్నతివిస్ఫారంబును నసంక్లిష్టదర్పోదయాభిరామంబు నపరిభావ్యస్థేమంబునై వేదంబునుంబోలె ననేకశాఖావలంబిద్విజగణసేవ్యంబును జలధరంబునుంబోలె గగనచ్ఛాదనాభోగంబును శైలంబునుంబోలె బహుపాదపపరివేష్టితంబును గృహస్థధర్మంబునుంబోలె నిరంతరశ్రాంతజనసమాశ్రయణీయంబును యోగనియమంబునుంబోలెఁ బవనపరిచయజనితకుండల్యుల్లాసనంబును మహాయుగ్యంబునుంబోలె సుస్థిరస్కంధానుభూతవివిధయుగావర్తనంబును గ్రహాలోకంబునుంబోలె శీతకరచ్ఛాయాప్రభవభామజీవాభినందనంబును రసాతలంబునుంబోలె ననర్కాంధకారధరితాభ్యంతరంబును సేనావ్యూహంబునుంబోలె బహుళపత్రఫలమండలాగ్రశోభితంబును విష్ణువక్షస్థలంబునుంబోలె వనమాలాపరివృతంబును బరబ్రహ్మంబునుంబోలె నారణ్యకోద్గీతమాహాత్మ్యంబు

భును నగుచు వన్యదంతిదంతాఘాతవ్రణితంబును దావదహనజ్వాలావలేహాతీలకితంబును మునిదత్తార్ఘ్యతోయపులకితంబును సిద్ధతరుణీవిలాసచిత్రితంబును శబరకపరశుక్రీడాకుట్టితంబును మృగపతికంఠకేసరకండూమసృణితంబును నగు రూపంబుతో సర్వాశ్చర్యనిధానంబైన భాండీరాభిధానవటనాయకంబుఁ గని తదీయతలంబున నగ్రజుండునుం దానును నాసీనుండై తక్కినగోపాలురు నయ్యైవిధంబుల విహరింప నపరిమితగోనివహంబు లిచ్ఛానురూపచరణంబున నామోదింప నాలోకించుచున్నయెడ.

సీ. వామదేవుఁడు భరద్వాజుండు ననుమహామునులు తీర్థార్థులై ముదముతోడఁ
జరియించువారు శశ్వన్మహాయశునివాసమై యొప్పు నవ్వటము సేరి
తగఁ బ్రణామంబుఁ బ్రదక్షిణంబును జేసి యచ్చట నున్నగోపాలిఁ జూచి
యోపాపలార యీయుత్తమతీర్థంబునకు డిగ్గుతెరు వెద్ది నాగనక్ర
వర్జితం బగురేవు గావలయు మాకుఁ, దీర్థమాడుట కింతయుఁ దెలుపుఁ డనిన
నేనెఱుఁగ వీని నడుగుఁ డంచెల్లవారు, నొండొరులఁ జూపి చూపియొండొండ నవ్వఁగ.

వ. ఇట్లు గోపాలురు నైజం బగుచాపలంబున నవ్విప్రుల నుల్లసంబాడి వార లడిగినమాటకు సముత్తరం బీకున్న సమయంబునఁ గమలనాభుఁ డయ్యున్నయ్యుత్తమాచార్యులం జేరం జనుదెంచి సవినయంబుగా నిట్లనియె.

క. మీ రేమి యెఱుఁగుదురు మీ, కోరినతెరు వేనుజూపి కుశలం బగురే
వీరుచిరాపగలోపల, నేరూపించెదఁ దపస్విభులార తగన్.

వ. కర్తవ్యానుష్ఠానంబు సెల్లినపిదప నిట విజయంచేయుం డిదె మేలిమీగడతోడి పెరుగునంగలపినచల్దివంటకంబు చిక్కంబున నున్నది మఱియును శర్కరామిశ్రం బగుపాయసంబు వలసినంతయుం దెచ్చినారము మీకుఁ బ్రియంబయిన విధంబున నారగింప నర్హుల రట్లుకాక ధారోష్ణంబు లగుగోక్షీరంబుల వలచితిరేని నుపయోగించునది యేను నందనందనుండఁ గృష్ణుఁడనువాఁడ నితండు మాయన్న బలదేవుం డనంబరఁగినబలియుం డిప్పుసులకదుపు లన్నియు మాసొమ్ము మత్ప్రార్థనంబు సేయుం డనిన నమ్మునులు తదాకారతేజోవిభవంబుల కద్భుతంబు నొంది యిగ్గోపకులంబునం దిట్టిమూర్తులు గలుగు టెట్లొకో యని సమాధినిమీలితేక్షణులై క్షణం బుండి.

క. తమతపముపేర్మి వారల, సముద్భవముఁ గ్రియయుఁ గని యసంశయభావ
ప్రముదితమతులై యిట్లని, రమలార్థవచోనిరూఢి నవ్విభుతోడన్.

——— వామదేవభరద్వాజులు శ్రీకృష్ణు నెఱింగి స్తుతించుట. ———

మ. జలజాతోద్భవుఁ డాదిగాఁ బటుమతు ల్సర్వప్రయత్నంబులన్
బలవంతం బగుచూపుసూటియును గానం జాలకున్నట్టిని

ష్కలు సూక్ష్మోదయు నాద్యు నచ్యుతు నినుం గన్గొంటి మిచ్చోట ను
జ్జ్వలగోపాకృతి నుండ నెట్టివిరియో యస్మద్భాగ్యసంతానముల్.

తే. ఏము చదివినచదువులు నేము విన్న
వినుకులును నేము నడిపెడు వివిధవిధులు
నేఁడు ఫలియించెఁ బరమేశ నీవు కరుణ
యలర నిచ్చోటఁ బ్రత్యక్షమైతి గాన.

క. తొలుతఁ గలిగింతు జగములు, నిలుపుదు తదనంతరంబ నిర్భరలీలా
కలనమెయి నడఁతు పిమ్మట, నెలకొని నీమాయ యేమి నేరదు వరదా.

సీ. కన్నులు చంద్రభాస్కరులు సరస్వతి రసన పర్వతములు రదనపఙ్క్తి
సత్యలోకంబు మస్తకము వక్షంబు లక్ష్మీదేవి వామదక్షిణభుజములు
గణపతి స్కందులు గరశాఖ లబ్ధులు కుక్షి యంబరము దిక్కులు వివరము
లఖిలదేవతలు కేశావళి పాతాళలోక మంఘ్రితలము లోకవంద్య
విశ్వమూర్తివై యిబ్బంగి వెలుఁగుచుండు, దాగి మమ్ములు రచియించితధ్వరములు
చేసి చూపి చేయించితి శిష్టజనులఁ, దత్క్రియలకు విధాతవు దాత నీవ.

క. పుట్టువుఁ బెల్లుం గ్రియలును, నెట్టన నేతెఱవులందు నిన్నుఁ గదియ వె
ప్పట్టున లోకహితార్థం, బిట్టిఁడవయ్యుఁ గృపఁ బూను దీవఖిలంబుల్.

శా. క్రూరుం డైనహిరణ్యనేత్రుఁ డనురక్షోవీరుఁ డక్షోభ్యుఁడై
వేరూపేడఁగఁ గ్రుంగఁ ద్రొక్కనమహావిశ్వంభరాచక్రముల్
వారాహాకృతి నుద్ధరించి సుచిరావాప్తిం బ్రతిష్ఠింపఁగాఁ
గారుణ్యం బొనరించి తెవ్వనికి శక్యం బిట్లు క్రీడింపఁగన్.

క. మెచ్చి ప్రియభక్తునకునై, వ్రచ్చితి ఖరనఖరముల హిరణ్యకశిపు న
య్యచ్చెరువునృసింహాకృతి, యిచ్చఁ దలఁచి తలఁచి కొలుతు మేము నినుహరీ

క. వామనరూపంబున నీ, వామెయి బలివేడఁ జనుట యటమీఁద మహో
ద్దామమహిమ యటఁజూపుట, దామోదర మాదృశులకుఁ దరమే నుతింపన్.

తే. వేయిచేతులక్రొవ్వినవీరుఁ ద్రుంప, నుర్విఁ బ్రేగుప్రా నిర్వదియొక్కమాటు
రాచప్రోవుల నుఱుపను రామమూర్తి, వైననినుఁ జెప్పుదురు మును లాదిదేవ.

ఉ. నిలిపితి సేతు వబ్ధి నవనీతు దశాస్యు సబాంధవంబుగాఁ
గలహమునం బ్రదీప్తపటుకాండములం గడతేర్చి తెల్లవా
రలకు వినంగఁ జెప్ప నభిరామము నీరఘురామజన్మమం
గళగుణవై భవంబు బహుకల్మషపంకపయోధిమాధవా.

క. ఇప్పుడును రెండురూపము, లిప్పగిదిం దాల్చి లోకహితకృత్యములం
దెప్పటిక్రియ నవధానము, తప్పక నీయున్నయొప్పు ధన్యము కృష్ణా.

శా. నీపార్శ్వంబుల నెప్పుడుం దగిలి సస్నేహాత్ములై యుండునీ
గోపాలు ర్గడుపుణ్యకృత్తులు భవద్గోపాలనైకాస్పదం
బై పాటింపఁగ నొప్పునివ్వనము భవ్యం బవ్యయానంద యీ
గోపజ్యుల్ భవదీయఖేలనకళాగుప్తుల్ కృతాధ్యాత్మికల్.

సీ. నినుఁ దనూభవునిఁగాఁ గనినయాదవుఁడును భోజకన్యయుఁ గులభూషణములు
మాతాపితృత్వాభిమానులై నీదెసఁ గరఁగుగోపుఁడు గోపికయు సుకృతులు
నీకు నుత్తంసమై నెఱపినయాబర్హిబర్హదామము లోకపావనంబు
నీకేలఁ దగిలి శ్రీనిత్యమై తనరునివ్వేణువు త్రైలోక్యవినుతిపదము
నీయురంబునఁ గ్రాలునిన్నిబిడవిపిన
పుష్పమాలిక కృతకృత్య భువనవంద్య
నేయునేటికి మము నీవు విశ్వరూప
నేటనుండి నీవారిఁగా నెమ్మిఁ జూడు.

క. అని పలికి తాపసోత్తము, లనుకంపాస్తిమితచిత్తులై నవ్వుచు న
వ్వనజాక్షుఁడు తమునర్థిం, గనుఁగొన వీడుకొని చనిరి కామితసరణిన్.

వ. అని వైశంపాయనసంకీర్తితంబు లైనకృష్ణసంక్రీడనంబు లసంక్లిష్టవిస్పష్టంబు
లగువాక్యంబులం గ్రమంబున.

ఉ. త్యాజితశత్రుగర్వ వసుయాజితభూమిసుపర్వ నిత్యసం
యోజితసత్యధర్మ వినయోర్జితకర్మ సమిద్ధవైభవ
భ్రాజితభవ్యదేహ యపరాజితబాహుయశశ్శశాంక నీ
రాజితలోకమండల విరాజితక్షీసితనాగమండలా.

క. అమితభరణనారాయణ, యమలచరిత్రైకనుతిపరాయణ పటువి
క్రమశీలితనారాయణ, సమరమహోద్దామసైన్య సంతతధన్యా.

మాలిని. దమితవిమతవర్గా దారితారాతిమార్గా
భ్రమితవిమలకీర్తీ ప్రాజ్ఞచేతోనువర్తీ
రమితయువతిచిత్తా రక్షితానాదివృత్తా
శమితసకలదోషా సౌమ్యసంప్రార్థ్యవేషా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్య
ధుర్య శ్రీసూర్యనారాయణసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ వెట్టి
యనామధేయ ప్రణీతంబయినహరివంశంబునం బూర్వభాగంబునందు
షష్ఠాశ్వాసము.

## సప్తమాశ్వాసము.

క. శ్రీకారికటాక్షధరా, లోకకృతార్థీకృతార్థిలోకసకలర
త్నాకరవేలావల్లభ, నేకగుణారామ వాహినీవరవేమా
వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నిక్కడఁ బరమపురుషుండు
భాండీరవటోపాంతంబునఁ గొంతదడవు నిజేచ్ఛానురూపంబు లగువినోదంబులం
బ్రమోదించి తదనంతరంబ.
తే. మేఁతకై పోవుకదుపుల మెయివడినక, ళిందకన్యాతటంబుల నిండునంను
నాడుచును బాడుచును వల్లవాన్వితముగ, నరిగె బలదేవుఁడును దోన యరుగు దేర.
వ. ఇవ్విధంబునఁ గ్రమక్షేలనకుశలుండై.
సీ. మునివరదత్తార్ఘ్యములకు శాకృతములు తెట్టువల్గల్లిసతీగములును
గుండలికన్యకాకుచకుంభకుంకుమశోభనఁ గెంపారుసలిలములును
సిద్ధసంయమిసమర్చితసికతాలింగభూషితాగ్రము లగుపులినములును
శబరకుటుంబినీకబరికావనమాల్యనలితంబులైనశైవాలములును
నచ్చటనచట నొప్పారఁ బ్రౌఢ హాబ్జముఖియుఁ గ్రమమిూనేక్షణయు రథాంగ స్తనియును
హంసరుచిరానులాపయు నగుచుఁ గాలు, యమునఁ జూచుచు దవ్వుగా నరిగి విభుఁడు.

శ్రీకృష్ణుఁడు యమునానదియందుఁ గాళియుఁడుండెడు మడుపుచూచుట.

వ. అమ్మహానది నొక్కయోజనదీర్ఘంబును నధికవిస్తీర్ణంబు నతిమాత్రగంభీరంబును
నయి దేవదానవాదులకు నభిగమింప నలవిగాక నిరంతరాంతర్గతభుజంగమగరళ
జ్వాలాజ్వాలంబుల జటాలంబు లగుకల్లోలంబులం బొదలి బడబాగ్నికీలాకులం
బగునంబురాశిం బోల్పం బట్టగుటకుఁ దగి యవిరళోద్భూతఫణిఫూత్కారంబుల
నుద్ధూతంబు లగుధూమజలధరంబులచేత నావృతంబై యుపాంతతృణలతాదహన
విజృంభితుం డగువిషానలునివలన సార్వకాలికంబు దావభయంబు సకలకాననం
బులకుం గలిగించుచు లోభాతురుం డగువానివిభవంబుభంగిఁ బ్రాణిజాతంబు
లెవ్వరికి నుపభోగయోగ్యంబు గాక యొండొండ దరులు దాఁకి ప్రమోయుకరళ్ళ
నఖలభూతంబులం దర్శించుచు గర్జాఘోరం బగువిలయపర్జన్యాకారంబు కరణిం
గాఱుకొనుచున్నయొక్క మహాహ్రదం బాలోకించి యాత్మగతంబున.
శా. కాలాకారుఁడు కాళియుం డనుమహాగర్వుండు దర్వీకరుం
డాలోలాగ్నికరాళవక్త్రుఁడు విహంగాధీశసంత్రస్తుఁడై
కాళిందిన్ వసియించు నట పలుకు నిక్కం బెప్పుడు న్విందు నా
భీలం బిమ్మడు వద్దురాత్ము నెల వుత్పీడింప నేభంగులన్.

ఉ. రాహుగృహీత మైనయుడురాజుశరీరముఁబోలెఁ దద్విష
వ్యాహతి నిమ్మహాజలము వైభవమేదిన దిప్పు వీతసం
దేహతఁ జొచ్చి యయ్యురగుతీవ్రమనంబు మెయిన్ వెలార్చి గో
గాహనయోగ్యమై వెలయఁగా నొనరించెద నీప్రదేశమున్.

వ. అమ్మహాపన్నగుపరిజనంబు లగుభుజంగంబు లనేకంబు లెందునుం గ్రందుకొనం దిరుగుట నీబృందావనంబునందు నెలవు లెడనెడ నతిదుస్సంచరంబులయి యుండుం గుటిలాచారు లగుసరీసృపాధములు కొండెఱు గోరూపంబుల నస్మదీయుల లోనం గలసి నాకుం గీడొనర్ప వేచియుండుదురు తదీశ్వరుండు నిగ్రహీతుం డగుటయు యందఱ నిరస్తులం గావించుట గావున నింకేల యాలస్యం బెట్లునుం జేయుదు నిదె కదంబవిటపి యెక్కి యుత్కటోరగవిషంబున విషాదంబు నొంది యియ్యుత్తమతటినీతటంబున నున్నది.

తే. ఇదిమదీయపదస్పర్శపదవి గాంచి, యఖిలలోకసమస్తకర్యహారిమహిమ
నూర్జితం బగుగాత సొంపారనదిని, నెక్కి యిచ్చట నుఱికెద నక్కజముగ.

వ. అనుచుం గుతూహలంబున.

ఉ. ఎవ్వరితోడఁ జెప్ప కొకయింతయు మంతనమాడ కేమియో
యివ్విపులప్రయత్న మితఁ డిప్పు డొనర్చుటకున్ నిమిత్త మం
చవ్వల నాబలప్రభృతులాత్మఁ దలంప నకంపలీలమై
నవ్వనజాక్షుఁ డాఁకటము యల్లన నప్పుని మోమెలప్పఁగన్.

సీ. ఒడిసిక్కగొన బెక్కు మడిసంది నునిచినతలుగులు ద్రాళ్లను దొలఁగవైచి
డాకేలఁ బట్టినఘక్కయుఁ జంకఁ దాల్చిన నేఁతుపును నన్యుచేతి కిచ్చి
పొలుచుపింఛపుదండ వుచ్చి వెంద్రుకల నొప్పుడుజడగా నల్లిముడి యమర్చి
మొల గచ్చగట్టుపై మలఁగినపచ్చనినునుకొంగుదిండుగా నులిచి చుట్టి
చెప్పు లూడ్చి కదంబకస్థితతరువుఁ, బ్రాఁకె పెడబొబ్బయిడియార్చియాఁకగొనక
మడుపులోనికి నుఱికె నున్మత్తలీల, నెగసి తత్తోయకణములు నింగిఁ బొదువ.

తే. మందరాద్రిపాతమున నమందచలన, మొందుజలరాశిమాడ్కిఁ బయోజనాభు
ఘోరలంఘనమునను సంక్షుభిత మయ్యె, నారసాతలాంతంబుగ నాహ్రదంబు.

క. విషదూషితులముహరిఁగ, ల్మషరహితుని నంట నశమె మాకు ననుచు ని
ర్విషయుతిఁ దొలంగుగతిఁ ద, ద్విషమోర్ములు తీరములకు వెసఁ దోఁతెంచెన్.

క. కాళియమర్దనమునకుం, గాలాకృతిఁ గృష్ణుఁ డుఱుకఁ గన్నెఱఁగి మహా
వ్యాళములు వెడలఁబాఱెడు, పోలిక పోలయ్యె దరులఁ బొంగుతరఁగలన్.

వ. ఇత్తెఱంగున నాక్రాంతసలిలుండై యయ్యుదకుమారుండు.

చ. ఆదివరాహమై తనయుదంచితపోత్ర మమర్చి కల్పవి
చ్ఛేదవివృద్ధతోయ మగుసింధువుఁ జొచ్చి కలంచినట్టియు
న్మాదము పొందె నాఁగ భుజమండలముల్ సవరించి క్రొంత సే
పాదట నమ్మహాతటినియంబులతింగలగుండుఁ వెట్టఁగన్.

తే. అతఁడుకరములఁ దోయమందందచఱచు, ఘోరనినదంబునతనిహుంకారరవముఁ
దత్పదాగ్రహతోత్థితధ్వనియునొక్క-, మ్రోఁతయై పేర్చి దిగ్భాగరోధి యయ్యె.

## కాళియుండు శ్రీకృష్ణునింగఱచిచుట్టుకొనుట

వ. అట్లు నిజనివాసం బగునజ్జలాశయంబు సంచలితం బగుటకుం గలుషించి.

సీ. తనఫణావలి గలంతయు విచ్చి యెత్తిన గగనంబు సర్వంబు గబళితముగఁ
దనమిక్కుటపుఁగోఱ కోడలు దెఱచిన విసపుచిచ్చొండొండ దెసలువేల్వఁ
దనచూడ్కులుగ్రంపుఁగినుకతోఁ బర్విన సంబరిచరకోటి యార్తి నొదుఁగఁ
దనమేను మలఁకలై తనరారి నిగిడినయమునయంతయుఁ దస్మయత్వమొందఁ
బొదలుతనఫూత్కృతులనెల్లఁ బొగలుగవిసి, యబ్జజాండమూఁదరవెట్టినట్లుగాఁగఁ
గాల్లకర్కశకాయుండు కాళియుండు, గవిసె గోపాలబాలుపైఁ గసిమసంగి.

వ. కవిసి పొదివి యుఱక నెఱఁకు లందంద కఱచి యలసి కొయ్యదియుం జేయఁ
దెఱపి యీక యుద్రేకంబునం గిట్టి.

క. ఆపాదమస్తకంబుగ, నాపురుషోత్తముని దేహ మాభుజగేంద్రుం
డాపూర్ణభోగబంధన, తాపాయత్తముగఁ జేసెఁ దత్క్షణమాత్రన్.

ఉ. పూర్వభవంబునం బ్రబలభోగిమయాస్త్రనిబద్ధుఁడై మహా
గర్వుఁడు వైరిచే రణముఖంబునఁ గొండొకసేపు వడ్డయా
దుర్విధి నేఁడు నెమ్మెయిఁ గుతూహల మెత్తియొ తాల్చె నిట్లనన్
సర్వవిభుండు కాళియభుజంగనిబంధన నొప్పె నయ్యెడన్.

తే. సింధుపతిలోనఁ బెనుబాపసెజ్జఁ బెనఁగి, సుప్తిఁ గడునొప్పుతీ పాత్మసోఁకి యిట్టి
డయ్యెఁగాకయెక్కడిపీడ హరికనంగఁ, బన్నగాంగసంగమమూర్ఛప్రభునకొప్పె.

ఉ. కాళియుచుట్టలుం జెలులుఁ గాంతలుఁ బుత్రులు నై సమర్ధను
వ్యాళము లెన్ని యన్నియును నద్దా వసంబఱి యున్న శౌరినా
భీలతఁ జుట్టుముట్టి పటుభీషణదంష్ట్రలఁ బ్రస్ఫురద్విష
జ్వాలలు పిక్కటిల్లఁ గఱవంగఁ దొడంగె నశంకఁ గింకతోన్.

వ. అట్టిబెట్టిదంపుఁజందంబు సర్వంబునుం గనుంగొని గోపకుమారు లందఱుం ద
లంకి యక్కడికిదక్షిణంపుదెసం గ్రోశమాత్రంబున నున్న వ్రేపల్లెకు నతిరయం
బునం బఱచి.

సీ. నందగోపునికూర్మినందనుం డగుకృష్ణుఁ డడవిలో మముఁ గూడి యాడియాడి
యెవ్వనితోఁ జెప్పఁ డేపున మనయేటిపెనుబాము లుండెడు పెద్దమడువు
లోపలి కుఱికి పెల్లుగఁ గలంపఁగ నందుఁ గలుగునాగము లెల్లఁ గవిసిపొదివి
కఱచుచున్నవి చాలఁ గాలుసేయార్పరాకుండంగఁ బాపఁజేఁ డొడలుసుట్టి
నకట యెచ్చోట నున్నవాఁ డతనితండ్రి, వేగ యెఱిఁగింపరే లావు వెరవుగలుగు
వ్రేలు విడిపింపఁగలయట్టివిధములెల్లఁ, జేయఁదగవురారేయనికూయుటయును.

వ. వజ్రపాతతుల్యం బగునవ్వాక్యంబు హృదయంబు వగులింప నార్తియు విస్మ
యంబును శోకంబును ముప్పిరిగొన నప్పశుపాల పుంగవుం డెక్కడెక్కడ యని
యక్కూయివచ్చినవారు తెరువు వెట్ట నతిత్వరితంబుగ నరిగె లావరు లగుగొల్ల
లెల్లం గైదువలు గొని యతనిం దలకడచి నడచిరి యశోద తల్లడిల్లి యుల్లంబు
మూర్ఛలు పైకొన నాక్రందనపరవశ యగుచు వికీర్ణకేశయు విగళితాశ్రుశుభా
రాసిక్తమార్గయునై చుట్టపువెలందులు దగిలి పొదివికొని పోవం బోయె నా
బాలవృద్ధంబుగా వ్రేపల్లెయెల్లం గదలి యుదియేమిపుట్టె ననువారును నిట్లవునే
యనువారును గృష్ణుం జెప్పడుం గొఱతప్పులకు పిన్ననాఁడునుం బిన్నకొలంది
లం బోయెడువాఁడుగాఁ డనువారును దొంటి [గాడ కమియో] ండఁ గాళియూహి
యుఁ దద్బాహులకు లోనగువాఁడు కాని య [సమి త న] మానంబు గలుగనేరదు
సూఁగుం డనువారునునై పెక్కండ్రు పెక్కువిధంబులం బలుకుచుం జని రిట్లు
సని యందఱుం గాళిందీతటంబున నంతంత నిలిచి.

చ. అసితఘనావృతుం డయినయర్కునిమాడ్కి మహావిధుంతుదో
ల్లసనవిషణ్ణుఁ డైనమృగలాంఛనుపోల్కి నుదగ్రధూమసం
ప్రసరతిరోహితుం డయినపావకుభంగి భుజంగబంధన
వ్యసనముఁ బొంది యున్నకమలాక్షునిఁ గాంచి విషణ్ణచిత్తతన్.

వ. ఎయ్యదియుం జేయరామిని నివ్వెఱపడి చూచుచుండిరి యశోదయుం దత్పతి
యును హాయని పుడమిం బడి సొమ్మవోయి బంధుప్రయత్నంబునం దెలిసి యు
ల్లంబుల నుడుకుచుండి రప్పు డాగోపవర్యుండు తక్కినవారిం జూచి.

క. ఈపసిపాపని నిచ్చట, నీపెనుఁబామునకు నిట్టు లెరసేసినయీ
యాపదకుఁ గొలువుగాఁగల, యీపాటున కేమి పాప మేఁ జేసితినో.

శా. రూపంబున్ బలవిక్రమంబులు మహారూఢంబులై యెంతయున్
దీపింపం గలయట్టిపుత్త్రుఁ గనుటన్ దివ్యత్తపశ్శీలుఁ డీ
గోపాలుం డనఁ గీర్తితుండ నగునాకో మిమ్మెయిన్ వమ్ముగాఁ
జూపాల్ సన్ గణుతింప దైవము గడుం జూపోపదయ్యెం జుమీ.

ఉ. పూతన కట్లు సేపడియుఁ బోఁడిమి దప్పక పేర్చు టాదిగా
నాతత మైనవీనిబల మద్భుత మీయురగంబువాత ని
ట్లాతురపడ్డ యిట్టివిధ మారసి యిట్లనరాదు గాని వీఁ
డేతెరు పూఁది యైనఁ దరియింపఁ గలండనుబుద్ధి పుట్టెడుఁ.
తే. ఏను జట్టపుఁబెద్దలు నింత తెలివి, గలుగుకతన నెట్లైన నీయలంత వెల్లి
గొంత యూఁదెదమక్కట కొడుకుఁజూచి, పనవుతల్లితల్లడము॰ మాన్పంగవశమె.

కాళియునిచేతఁజుట్టఁబడిన శ్రీకృష్ణునిఁజూచి యశోదశోకించుట.

వ. అనుచుండ నయ్యశోదాదేవి కృష్ణుం జూచి.
ఉ. వెన్నలు దిన్నతప్పనరు ప్రేతలమెచ్చుగ నాఁడు రోటితో
నిన్నటుగట్టి త్రోచినయనీతి దలంచియొ నేఁడు నన్ను నో
వెన్నుఁడ యిట్లు సేసెదవు విశ్రుతసత్త్వుఁడ వీవు నీకు నీ
చెన్నఁటిపాఁపపు ర్వొకటి సేయఁగ నోపెనె యేపుసూపవే.
శా. నామీఁదం గృప యెప్డుఁ జాలఁ గలవన్నా యేను శోకాగ్నియం
దీమాడ్కిం బడఁగా నుపేక్ష దగునే యీదిక్కు చిర్నవ్వుతో
నీమో మచ్చుగఁ జూపవే తెఱవవే నేత్రాబ్జము ల్వల్కవే
యామోదంబుగఁ బుత్ర తల్లులకు నిట్లత్యార్తి గావింతురే.
తే. అరయ దెసలేక నీధనం బడవిలోనఁ, జెల్లచెద రయ్యె నీవింతసేపు కట్టి
యిట్టు లేమఱఁ బాడియె యీక్షణంబ, వెడలి చనుదెంచిననుఁ బ్రోవవే కుమార.
క. కడిఁదివిషకంటకాటవి, కడికంఢలు చేసి నీఱు గావించితి వీ
పొడపాము నీకు నేటిది, కొడుకా నీకులము వంతగూరు టుడుపవే॰
చ. అని పలవింప బంధుసతు లందఱు నిట్టినుపుత్రుఁ డింక నే
జననమునందుఁ గల్గు నిటు సగ్గుట కోర్వరు లాఁతు లైన నె
ట్లనయము నోర్చుఁ గన్నకడు పగ్గలమై వెలవెట్ట రానిపెం
పునఁ గలమానికం బొదవి బొగ్గయి పోయెనె యక్కటక్కటా.
తే. ముప్పునకు నోమదయ్యనె ముగ్ధ యీయ, శోద నందగోపున కుగ్రశోకజలధి
యీఁదఁ గొలఁదిగా దయ్యనె యిట్టిదైన, యుడరు వెట్టెనె పెన్నిధియనుఁగుబిడ్డ.
వ. ఇట్లందఱు నన్నివిధంబుల దుఃఖింప గోపాలురు దమలోనన వగచి యింక శోకిం
పం బని లేదు మన మిమ్మడుఁగులోనం గృష్ణుఁ డుఱికినయట్ల యుఱికి యిక్కఱకుఁ
బాముతోడ నెఱలావునం బెనంగి కుమారు విడిపింతము గాకున్న నతనితోడిద
లోకంబుగాఁ గాళియకాలాహి యనుకాలునిపాలవడి చిక్కుదము. చంద్రవిర
హిత మైనవిభావరివిధంబున భానువిహీన మైనగగనవీథిచాడ్పున వృషభంబు.

కెలిమైనగోవితతి తెఱంగునఁ గృష్ణుండు లేనివ్రేపల్లె కేపగిది మరలి పోదమిదియే
తెం పిట్లు చేయుద మని యుత్సహింప. వారలయార్తియు వనజనాభుదుస్థి
తియుం జూచి విష్ణుతేజం బపరమూర్తియై యభేదజ్ఞానంబు నిజబుద్ధి నిరూఢం
బుగా నెఱుంగుబలభద్రదేవుండు వాసుదేవుం దలఁపింపఁ దలంచి యొక్కరుం
డునుం దొలంగి నిలిచి గంభీరమధురస్వరంబున నల్లన నిట్లనియె.

ఉ. మానుషభావ మిట్లొకఁడు పాటిడి లోకహితం బొనర్పఁగాఁ
బూనిననీమహామహిమ బుద్ధిఁదలంపక యిప్పు డిచ్చటన్
దీనికి నింత స్రుక్కఁబడి దీనత నొందుట మెచ్చుగాదు నీ
దైనయనుంగులందఱును నార్తిఁ గలంగుట కృష్ణ చూచితే.

వ. వీరు నీసత్త్వం బెఱుంగరు గావున శోకించెదరు జన్మసముచితంబు లగుకర్మంబు
లప్రతిహతంబులుగాఁ జెల్లించెదవు గావున బంధుప్రమోదం బవశ్యకర్తవ్యం
బివ్విషాహిమర్దించియీదుర్దశనపనయింపుమనినరౌహిణేయువాక్యంబాకర్ణించి.

శా. ద్వైతభ్రాంతినివృత్తిఁ బొందఁగ నభేదబ్రహ్మబోధంబు సం
భూతం బైన నశేషబంధనములం బోఁద్రోచుసిద్ధాత్మున
ట్లాతం డమ్మెయి నాత్మతత్త్వవిదుఁడై యప్పాఁపచుట్ట ల్విని
ర్ధూతిం బొందఁగ నీల్గి బిట్టు నెగసెం దోయౌఘమధ్యంబునన్.

వ. అట్టియుత్సాహంబు నిర్వ్యపోహంబుగాఁ బేర్చి.

ఉ. కాళియభోగిపుంగవు నఖర్వసుదుర్వహగర్వధుర్యతం
గ్రాలెడుమిక్కుటంపుఁబడగ ల్వెస నైదిటి మీఁదికి స్మహా
భీలవిచేష్టమై నుఱికి పెల్చఁ దదీయవిలోలపుచ్ఛముం
గేల నమర్చి నొంపఁ దొడఁగెం బటుపాదనిపాతనంబులన్.

మ. యమునావీచి మృదంగవాద్యములు ప్రమోయం దీరగోపౌఘహా
ర్ష మనోజ్ఞధ్వనితంబు గేయముగఁ జంచత్కాళియవ్యాళభో
గమహారంగతలంబునం బటుగతిం గంజాక్షునిర్మర్దనా
ట్యము హృద్యాద్భుతభీమమై పరఁగ దివ్యశ్రేణి చూచెన్ దివిన్.

మ. వెస దామోదరుపాదఘాతనగతుల్ వేవేలచందంబులం
బ్రసభాటోపముఁ జూపఁ బాపఫణభృత్ఫాలస్ఫటామండలం
బసహంబై నొగిలెన్ మణుల్ సెదరఁగా నాస్యంబులన్ శోణితం
బెసఁగెన్ దంష్ట్రలు నుగ్గుగా గరళవహ్నిజ్వాలిక ల్వెల్వడెన్.

తే. కఱకుటెండదాఁకినతొగకామభంగి, బాపఁడేనిమే నెంతయు బలము దఱఁగి
స్రుక్కె నింద్రియంబుల యేపుడక్కె నూర్పు, లొయ్యనొయ్యనడిందగుట్టునుఱుదక్కె.

వ. ఆసమయంబున.

క. లయకాలకేళితాండవ, భయంకరుండై సభర్గుభంగిఁ దనరుకా
ళియుభోగరంగనటునకు, జయపెట్టిరి సకలలోకచారులుఁ బ్రీతిన్.

వ. ఇబ్భంగి నత్యంతదురవస్థం బొందినయద్దందశూకప్రవరుండు వివశం బగుమాన
సంబు నెట్టకేలకు నూలుకొల్పి గోవిందచరణారవిందంబులక్రింద నట్లున్నయట్లుండి
భీతివిహ్వలంబు లగుజిహ్వలు దొట్రిల్ల నల్లన దీనస్వరంబున నప్పురుషోత్తము
నుద్దేశించి యిట్లనియె.

మ. నిను సర్వాధికుఁగా నెఱుంగక కడుస్నీచుండనై నీచపుం
గినుక న్నీమహనీయదేహమునకుం గీడిట్లు గావించితిం
జనునాక్రొవ్వునకింతవట్టు త్రిజగజ్జన్మస్థితిధ్వంసముల్
పొనరింపంగఁ బ్రభుండ వీకొలఁదితప్పుల్ సైఁచుటొప్పుం గృపన్.

క. నీవిమ్మెయి దండించుట, దేవా నిర్విషుఁడ నైతిఁ దెలివియు శమముల్
భావమున నెలసె నీపను, లేవి యయినఁ జేయువాఁడ నేవత్యుఁడనై.

తే. అజసురేంద్రాదులకుఁ జేర నలవిగాని, యుష్మదీయపదాంబుజయుగళి నాదు
తలలుసోఁకుటఁజరితార్థితముఁడనైతిఁ, గడఁగనీయాంగ్రహమునను గ్రహమయయ్యె.

తరువోజ. జయ సర్వభూతేశ జయసర్వవరద జయ సర్వరక్షక జయ సరోజాక్ష
జయ జగద్వందిత జయ జగన్నాథ జయ జగద్ధారక జయవిశ్వరూప
జయ కృష్ణగోపాల జయమహాసత్వ జయపురాతనాఘూత జయదైత్యదమన
దయనిమ్ము జీవితదానంబు నాకు భయశరణాగతిఁ బ్రార్థింతు నిన్ను.

చ. అని శరణంబు వేఁడినమహాహివరేణ్యుని సత్యకీర్తనం
బునకుఁ గృపార్ద్రచిత్తుఁడయి పుష్కరలోచనుఁడాక్షణంబ యా
తని కభయం బొనర్చిన నతండును దత్కరుణార్ద్రదృష్టిపా
తనము సుధామయం బగుచుఁ దన్ను సచేతనుఁగా నొనర్చినన్.

వ. తనఫణాపంచకంబు దచ్చరణాగ్రంబు మోపి ప్రణామంబులు చేసి పురంబర నిలు
చున్న నద్దేవుం డతని కిట్లనియె.

—— శ్రీకృష్ణుఁడు కాళియుని యమునాప్రవాహంబు వెడలనడుచుట. ——

సీ. ఇదియాదిగా నిన్ను నీయమునానది వసియింపనీ నేను వార్ధిగుఱిచి
సకుటుంబకంబుగాఁ జనుము జలస్థలచారులై యున్ననీవార లెల్ల
నీతోన చనుదెంతు రీతోయములు భవద్విషయోగమునఁ దొల్లి విషములగుట
నిజముగా నట్లుండె నేఁడు నిర్విషములై యమృతనామకము తథ్యముగఁ దాల్చి
యఖిలజనులకు నధికసేవ్య మగుగాత, మత్పదాంకము లయిననీమస్తకములు
సూచి గరుడుండు నీకు నెచ్చోటనున్న, ననఘ యెప్పుడుఁ గీడు చేయంగ వెఱచు.

వ. ఇదియ వరంబుగా నిచ్చితిం బొమ్మనినఁ గాళియుండు గోపాలు రందఱుంజూడ
గళత్రపుత్రభృత్యసమేతంబుగా వెలువడి సముద్రంబున కరిగెఁ గృష్ణుండును
యమునాహ్రదంబులోన నుండక నిజేచ్ఛావిహారతృప్తుండై వెడలునుద్దీప్తదం
తానళంబుపగిది వెలువడి వచ్చిన నెమరువ్రాయి.

క. తల్లియుఁ దండ్రియుఁ బ్రమదము, వెల్లిగొనఁగఁ గౌఁగిలించి వేదీవన లీ
నుల్ల మలర నతఁడును బ్రణ, మిల్లి సమాశ్వాసవాక్యమితి బ్రసరించెన్.

వ. అంత నఖిలగోపాలురు నద్భుతప్రమోదమేదురహృదయు లగుచు నతనిచుట్టును
ముసరికొని బహువిధంబులం గీర్తించుచు నభినందింప నందగోపాదివిశిష్ట జ
నంబు లిట్లనిరి.

ఉ. ఎన్నఁడు నిట్టిసాహసము లిట్టిబలోద్ధతు లిట్టిధైర్యముల్
విన్నవి కన్న వెయ్యెడల వీరకులోత్తమ గల్గెనే జగ
త్సన్నుత మయ్యె నీమహిమ సర్వధనంబులు గోపకోటియున్
నిన్ను శరణ్యుఁగాఁ బడసె నేఁడుమొద ల్పతి వీవ యంతకున్.

క. ఎచ్చోటనైనఁ దమతమ, యిచ్చఁ జొరంగనియె గోవు లియ్యేట మునుల్
విచ్చలవిడి దఱియుదు రీ, యచ్చపుఁబుణ్యా మిటు నీకు నబ్బెనె యనఘా.

తే. అడవిఁ బుట్టినమ్లేచ్ఛుల మగుటమాకు, నిక్క మయ్యె నిమ్మెయి నిప్పనీఱుపోదివి
నట్టులున్నమహాభూత మైననిన్ను, నెఱుఁగ మింతకాలము నిట్టికొఱఁత గలదె.

వ. అనిపలికి యతనికిం బ్రదక్షిణంబు లాచరింప నతండు వారి నయ్యైవిధంబుల
నుపలాలించె నిట్లు సంభావితుండై నయాపీనుండు పురస్సరుండుగా నందఱు
వచ్చి వ్రేపల్లె సొచ్చి సుఖంబుండి రివ్విధంబునం గాళియభుజంగభంజనంబు నివృ
త్తంబైనయనంతరంబ యొక్కసమయంబున.

క. పసులకు మే పెద్దడియై, పసచెడి పొలమెల్లఁ బొనుఁగుపడి యుండఁగ గో
పసమేతంబుగ వసుదే, వసుతుఁడు చింతింపఁ బ్రౌఢవల్లవులు దగన్.

వ. గోవర్ధనపర్వతంబునకు నుత్తరభాగంబునఁ గాళిందీపరిసరంబున సమతలంబును
గృష్ణమృద్భూమికంబును సంపన్నబహుళతృణోపజాతంబు నగుతాలవనం బతి
విశాలంబై గర్దభరూపధారి యగుధేనుకుం డనుదానవుచేత నాక్రాంతం బ
గుటం బ్రాణు లెవ్వారికిం జరింపరాక పాడఱి యుండు నని ప్రసంగింప రామ
కేశవు లక్లేశం బగుదర్పావేశంబున నుత్సహించి.

తే. పసికి మేపు గల్గినఁజాలు నసుర లేమి, సేసెదరు పోవనిం డని చేయఁగలుగు
గొల్లలకు నెల్లఁ జెప్పఁగ గోగణముల, వెలిచి రార్చుచు నద్దెసఁ జెలఁగివారు.

వ. అమ్మహాగహననిరంతరదురంతకాంతారంబునందు.

ఉ. ఏదెస చూచినం బొదలి యింపెసలారెడునాతృణోత్కరం
బాదటఁబ్రావఁగాఁ గడుపు లన్నియుఁ జెన్నుగ నుండి మేయ దా
మోదరముఖ్యగోపతతి యొక్కట నాతృణరాజమండమా
మోదమెలర్పఁ జొచ్చి మనముల్ దనియన్ విహరించి రెల్లెడన్.

వ. అంత..

శా. కాలాహుల్ బుజుతాపిచిత్ర యగుభోగశ్రేణి శోభిల్లఁ బా
తాళం బొక్కట నిర్గమించి విలసద్దర్వీవికాసంబుతోఁ
గేళిం గ్రాలెడినో యనంగఁ దనువుల్ గృష్ణంబులై యొప్పఁగా
ఖేలన్నూర్ధము లైనతాళ తరువుల్ కృష్ణుండువీక్షించుచున్.

వ. రోహిణీనందనువదనంబు గనుంగొని యిట్లనియె.

మ. క్రమపాకంబునఁ గెంపుతోడినలుపెక్కన్ మిక్కుటం బైనగం
ధము దిక్కుల్ సురభీకరింప రస మంతర్గామి యయ్యున్ వెలిం
గమియం గాఱుచునున్న చాడ్పున విలోకప్రీతిగావింప హృ
ద్యములై యున్నవి చూచితే ఫలము లీతాళద్రుమశ్రేణులన్.

తే. వీని నీవేళ గోవులు నేను గూడి, చేలమి యొలయ నాస్వాదింతు మెంతయేని
నేడ్క యయ్యెడు రాల్పుము వేగవేగఁ, బ్రాఁకి నీలావువెరవు సంభావితముగ.

వ. అనిన నవ్వీరుం డవ్విధంబున కియ్యకొని గోపకుల నందఱం గలయ నాలోకించి.

క. ఎక్కడఁ దడవు తాళుల మొదల, లక్కజముగఁ బట్టియూఁతునవి యేటికొనుం
డెక్కుడుగాఁ బండులు మీా, రొక్కొక నిం గడవ ననుచు నుద్ధతలీలన్.

తే. ఒక్కతరవాయి దొరఁకొనియొకటియొకటిఁ
బృథుభుజాదండమునఁ బట్టి పెలుచ నూఁచెఁ
బెఱుక విఱువఁగ నెల్లక యుఱక వన్య
హస్తి నిజహస్తమునఁ జెరలాడునట్లు.

క. పరుసనిగాడ్పున రాలెడు, వరుసన ధరఁదొఱఁగుతాటిపండుల ప్రోఁతల్
నొరిఁబొరి గోపకుమారుల, యురుహర్ష ధ్వనులుఁ గూడి యొక్కటనొదవెన్.

బలరాముండు గర్దభ వేషధారియగు ధేనుకుండను రాక్షసుం జంపుట.

వ. అమ్మహాఘోషంబునకుం గలుషించి ఘోరభుజశక్తిఘోషణుండును ఘోషజన
నిత్యభీషణుండును సంత్రాసితధేనుకుండు నగుధేనుకుండు గర్దభరూపంబు దాల్చి.
దుర్దములగు దైత్యులు తాదృశాకారులై సహస్రసంఖ్యలు తోడ నడువ రామ
కృష్ణులకుం గీడు సేయుతలంపునఁ దెంపు మిగుల నడతెంచినం గని సకలగోపా
లురు నేపు దక్కి యక్కడ నక్కడ స్రుక్కి రంత.

సీ. ఖురతాడనంబునఁ బెరిగినధూళి యర్యముఁ గ్రమ్మింగిఁ యంధంపుఁదమముఁ బెంచె
హేషితధ్వనులఁ బిట్టిసఁగుదిక్కంప మాశాగజంబులమదస్రవము మాన్చెఁ
దెఱచునోళులపెద్ద తెరువులుపాతాళములఁగేలిగొని మృత్యుమొగము నడిచెఁ
గనలుకన్నుల నిప్పు లెనసి పురోమార్గములు వ్రేల్చి సకలాటవులను బొదివెఁ
దోఁకలార్పఁ బృథుస్కంధధూననము లొ, నర్పఁజెదరురోమంబులు నభమునెల్లఁ
బక్ష్మలంబుగఁ జేసెఁ దద్బహుళగర్ద, భాసురానీక మబ్బంగి నడరునపుడు.

వ. అట్టిమాయాసైన్యంబున కగ్రేసరుండై కవియుదెంచు ధేనుకుం గని, సంకర్షణుం డమర్షోత్కర్షంబునం దదీయబలప్రకర్షంబు రిత్తయకాఁ గొని రిత్తచేతుల నెదురై నిలిచిన.

తే. కదియఁ బాఱుతెంచి గర్దభదైత్యుండు, వీఁకతోడఁ దిరిగి వెనుకకాళ్లు
చండరభస మెసఁగ రెండును జోడించి, యుగ్రభంగి బలునియురము దాఁచె.

ఉ. తాఁచినఁ దోన బిట్టొడిసి తత్పదయుగ్మముఁ బట్టి బెట్టుగా
వీచి యతండు వానిఁ గడువేగము లాగము నొప్ప మీఁదికిన్
వైచెఁ దదంగకంబులు జవం బఱి తాళులు దాఁకి నుగ్గును
గ్గయి చెడి యుర్విఁ దత్ఫలచయంబులతోడన కూడిరాలఁగన్.

వ. అట్లు ఖరదైత్యుం బరిమార్చి పేర్చినరాముండునుం బోలె ధేనుకదైత్యుం బరిమార్చి పేర్చి బలరాముండు రాసభాకారు లగుతక్కినరాక్షసులఁ గడకాళ్లు వట్టి తాళ్లతో వ్రేసి వ్రేసి చంపెం గృష్ణుండు నుద్రిక్తశౌర్యతృష్ణుం డయి యవ్విధంబున నవ్విబుధారుల మోఁదిమోఁది పీనుంగుపెంటలుగా వైచెఁ దత్ప్రదేశం బంతయు నసురులకళేబరంబులం దాళఫలోత్కరంబుల దంతురం బయ్యె నయ్యద్దఱపౌరుషంబునుగోపాలురువిస్మయప్రమోదంబులతోడంబొగడిచెలంగియార్చి.

ఉ. ఎవ్వరికైనఁ జేరఁజొర నెన్నఁడు రానినిశాచరాస్పదం
బివ్వనభూమి నేఁడు సుసమిద్ధబలాఢ్యులు వీరిచెయ్దినిం
కెవ్వరికైనఁ జేరఁ జొర నిచ్చఁ జరింపను వచ్చె మెచ్చుగా
నెవ్వరి కిట్టిలావుగల దేమని వర్ణనసేయఁగాఁ దగున్.

వ. ఈరామకృష్ణులు ప్రకృతిమానవులు గా రేమేనియు నిమిత్తంబున నిట్లున్న వేల్పులు గానోపుదు రటమీఁద దైవంబెఱుంగు మన మేమి నేర్తు మనుచు నావులకదుపులవెనుక నిజేచ్ఛం జరియించి రంత గొంతకాలంబునకు.

ఉ. ఆమని మేసీ యాముకొని యాదటఁ బేర్చి చెలంగుగోధన
స్తోమము గొంచు నగ్రజునితోడ యశోదతనూభవుండు శ్రీ
ధాముని మేనమామసుతుఁ దత్పరతం దనకూర్మి నెచ్చెలిం
బ్రేమయెలర్పఁ గూడి పెఱవ్రేలు ననేకులు గూడి యాడఁగన్.

వ. అనేకక్రీడాసక్తుండై భాండీరవటప్రాంతంబునం దొల్లిటియట్ల కదుపులం మేయ
వెలిచి తమయిచ్చల వినోదించుసమయంబునఁ బ్రలంబుం డనుదానవుం డ
య్యదుకుమారుల కపకారం బొనర్ప నెడకువేచి గోపరూపంబున గోపకుమారుల
లోనం గలసి యుండ నందఱు హరిణక్రీడనం బనునాటకుం దొడంగి రెండు
సంగడంబులై కృష్ణుండును శ్రీధాముండును బెన్నుద్దులుగాఁ దక్కినవారునుం
దమలోనదొరయుభంగి దోయిగట్టిరి ప్రలంబుండును బలభద్రుతోడి జోడయ్యె
నివ్విధంబున.

క. భాండీరవటము కరిగా, నుండొరులం గడవఁ బేర్చి యొక్కట హరిణో
చ్చండగతి దాఁటుచుం గడుఁ, జండరభసమునఁ గడంగి సరిసేయంగన్.

వ. అయ్యుదారఖేలనంబునం గృష్ణపక్షంబువార లెల్లను జయంబునొందిరి శ్రీభా
మునిదిక్కువారుపరాజితులై రిట్లు గెలిచినవారి నోటుపడినవారు తమతమయఱ
కట నెక్కించుకొని కరిదాఁకం బోవలయుట నవ్విధంబొనర్చునప్పుడు.

క. బలభద్రుం దనయఱకటఁ, బ్రలంబుఁ డిడికొని బలంబు భాసిల్లఁగ న
వ్వలకుఁ గొనిపోవువాఁడై, యలఘుస్ఫురణమున నరిగియరిగి మదమునన్.

తే. పగతుఁ డిట్టులు లెస్స లోఁబడియె వీనిఁ
బ్రిదిలిపోనీక యింకఁ జంపెదరయమున
ననుచుఁ దనరాక్షసాకార మమరఁ జూపి
రాహు వమృతాంశుఁ గొనుప్రకారమునఁ గొనుచు.

వ. అంబరపథంబునం జనం దొడంగినం గని విస్మితుండై యక్కుమారుం డెయ్యది
యుం జేయనేరక వెరవుసాలక మరలి చూచి దామోదరుం బిలిచి.

ఆ. కృష్ణకృష్ణ వీఁడె క్రించురక్కసుఁ డొక్క, డెసఁగి గోపమూర్తి నేగుదెంచి
వంచనమున నన్ను వదలక యిటుపట్టి, యుఱక చదలఁ బఱచుచున్నవాఁడు.

క. ఏమియుపాయంబున నే, నీమాయపుఁబుర్వు వెస జయించి తొలఁగుదున్
నీమత మొనరించెద నే, వే మతిమంతుఁడవు సెపుమ వెరవు తెలియఁగన్.

వ. అనిన నమ్మహాభాగుం డమ్మహాత్మున కిట్లనియె.

సీ. నిన్ను నీవెఱుఁగవు మిన్నక మానుషాకృతి నిట్లు సెందినకతన నొండు
తలఁపక యిబ్బంగిఁ బలికెదు గగనంబు శిరము పాతాళంబు చరణతలము
వాయువు శ్వాసంబు వహ్ని యాననము విశ్వాకారుఁడవు నీకు నంత మొందు
లేకున్కిఁ బరఁగితి లోకంబులం దనంతాభిధానంబున నఖిలవంద్య
వేనవేలు మస్తకములు వేనవేలు, కన్నులును వేనవే ల్వాలుకలును గలుగు
మూర్తి నఖిలాండకోటియు మోచియుండు, నధికసత్త్వుండవీవువిశ్వాత్మకుఁడవు.

క. హసనఁగా నీవనఁగా, భూనుత భేదంబు లేదు పుట్టితి మిటు లో
కానుగ్రహార్థమై మన, మానుషభావంబు లిందు మమతం జెందన్.

వ. కావున నీవిద్దురాత్ము సంరంభంబు సరకుసేయక నీభుజబలంబు మెఱయు మని
తెలిపినం దెలిసి బలదేవుండు.

### బలరామదేవుండు ప్రలంబుండను రాక్షసుం బరిమార్చుట.

శా. శైలోత్తుంగశరీరుఁ డై నరిపు మస్తం బుగ్రదంభోళికిన్
మేలై పేర్చుకఠోరముష్టినిహతి న్నిర్భిన్నముం జేయఁగా
నోలిం బెల్లుగ సర్వరంధ్రముల వాతోద్యజ్ఝురాఘంబులై
కీలాలంబులు పర్వఁ దూలె నధికక్లిష్టాత్ముఁడై వాఁ డిలన్.

క. చఱినుండి తొలఁగ నుఱికెడు, నెఱిసింగపుఁగొదమఁబోలె నిబ్బరముగఁ గ్రే
ళ్లుఁశికెం దొలఁగం బగతుని, యఱకటనుండి భువిమీఁది కబ్బలియుండున్.

వ. ఇవ్విధంబునం బ్రలంబహననధౌరేయుం డగురౌహిణేయు విజయం బభినందించి
బృందారకులు బృందారకమార్గంబున నుండి.

క. బలమున నీదేవుం డిటు, ప్రలంబుని వధించె గాన బలదేవుఁ డనన్
వెలయుం ద్రిలోకముల నని, పలికిరి గోపకులు వినఁగఁ బ్రవ్యక్తముగన్.

చ. అరిఁ బరిమార్చి సమ్మదభరాతిశయత్వరితాంఘ్రివాతని
ర్భరగతి నేగుదెంచి పృథుబాహుయుగంబునఁ గూర్మితమ్ము నా
సరసిజనేత్రు సుందరవిశాలభుజాంతరుఁ గౌఁగిలించె భా
సురయశుఁ డాప్రలంబవినిషూదనుఁ డాదరబంధురోద్ధతిన్.

వ. తక్కినగోపకుమారులు నతని ధీరత్వంబును వీరగుణంబును గారవించి కొనియాడి
రయ్యందఱు నందునందను బశుపాలనఖేలనకౌతూహలంబునం బ్రీతు లగుచు
నట్లున్నరీతి.

చ. వరుసనిదాఘకాలము ప్రవర్తితమై చనఁగాఁ బయోధర
స్ఫురితవిభూతిమాసయుగశోభితమై భువనప్రమోదని
ర్భరత యొనర్పఁ బిమ్మట శరన్నవసంపద యేగుదెంచె ను
ర్వరకు సమగ్రసస్యవిభవంబులఁ గూర్చుచు నర్చనీయమై.

మ. మును వర్షోదకధారలన్ ముదముతో మూర్ధాభిషేకంబు గై
కొని శుభ్రాభ్రకిరీటశోభి యయి సంక్షుభ్యన్మరాళావళుల్
ఘనవాలవ్యజనంబులై మెఱయఁగాఁ గాంతేందుబింబాతప
త్రనిరూఢిన్ శరదంబరం బమరె నుద్యద్రాజచిహ్నాంబులన్.

మ. తెలినవ్వు ల్వొలిదమ్మినెమ్మొగములుం దీపార నేపారుచూ
పులు దార్లై మదలోలభృంగరచనల్పొల్పార వీచీభుజా
వళి యాలింగనకేళి కుత్తలపడన్ వార్ధిం దగం గూడుచోఁ
గలఁక ల్దేటి తనర్చె నేఱులు శరత్కల్యాణకల్యాకృతిన్.

తే. పిదుకఁ గొలఁదిగాక పెయ్యలు దనియ బ్రేవ, పల్లెపసులు సేఁపి పాలు గురియ
నడరి పాలవెల్లి యయ్యె నా నెందు వి, కాసికాశవనవిలాస మెసఁగె.

క. బంధూకతిలకములు సౌ, గంధికకర్ణావతంసకంబులు నుద్య
ద్గంధినవ్యోత్పలకుచతటి, బంధురభూషలును గోపభామల కమరెన్.

క. తారకితగగనచక్రము, తోరౌసె ననంగ రేలు తొగపువ్వులనొ
ప్పారె విపులనిర్మలకా, సారంబులు సారసంప్రసరసేవ్యములై.

తే. అలరువారిపూఁదీగల నలమికొనిన
చలువచోటులఁ గ్రుమ్మరుజడనుగాడ్పు
మొగులువిరియొండఁ దళుకొత్తు మొగముచెమట
లార్చి పొలముగొల్లలకుమెచ్చు తలిర్చె.

క. పడ్డాకుపొన్నకొమ్మలు, గ్రోడాడెడునడవిగొరుగోదమలు మోద
క్రీడఁ దనరుచాడ్పునఁ బై, నోడికలయి పుప్పొఁదేనెలురులఁగ నొప్పెన్.

క. అసనంబులు మదనునియి, ష్వసనంబులుఁ బోలె విరహు లగువారి క్రతి.
వ్యసనం బొనర్చె వికస, త్ప్రిసవశిలీముఖనితాంతపటుపాతనముల్

ఉ. శారదచంద్రిక ల్వితతచారుమహోత్సవ లయ్యె గోపక
న్యారమణీయగీతుల నుదంచితధేనుకదోహనధ్వని
స్ఫారతలన్ సదర్పవృషభవ్యతిగర్జితలీలల న్మహా
దారరతీశ్వరప్రియకథారుచులన్ వ్రజభూమి నెల్లెడన్.

వ. ఇట్టి శరత్సమయంబునం బ్రమదతరంగితంబు లగునంగంబులు నంతరంగంబులుం గలిగి గంగాతరంగంబులతెఱంగున ననంగదమనహాసవికాసంబుల చాడ్పున న మృతపయోధిఫేనపటలంబులపగిదిఁ గర్పూరక్షోదపుంజంబులపోలువునం జందన పంకకూటంబులకైవడిం జంద్రప్రభాపూరంబులపరుసునం గుముదచ్ఛదవిసరం బులవిధంబున ముక్తామణిసముత్కరంబులకరణి నతిధవళంబులై శైలంబులుం బోలె నుద్ధతశృంగంబులు మహాతరువులుంబోలె బంధురస్కంధంబులును జంద్ర కిరణంబులుంబోలె సర్వదిగ్వ్యాపకంబులుఁ గృతయుగధర్మంబులుబోలె నఖండిత సంచారంబులు శంకరవిహారంబులుంబోలె ననపేతవృషంబులు శ్రుతివిభవంబు లుంబోలె లోకోద్ధారకంబులు విష్ణుకీర్తనంబులుంబోలె మహామంగళంబులు స ద్వరోత్సవంబులుంబోలె దర్శనపావనంబులుఁ బుణ్యతీర్థంబులుంబోలె నిత్యనిర్మ

లంబులు మంత్రంబులుంబోలె రక్షణీయంబులు దైవంబులుంబోలె నర్చనార్హం
బులు గురువులుంబోలె నిరంతరానువర్తనపరితోష్యంబులు శ్రీవిశేషంబులుం
బోలె నఖిలలోకజీవ్యంబులు భావంబులుంబోలె రసజనకంబులు సమయంబులుం
బోలె బహుమార్గప్రవృత్తంబులు నీతిపథంబులుంబోలె నర్థావహంబులు నిధు
లుంబోలె నక్షీణసంతానంబులునై యొప్పుగోగణంబులం గనుంగొని యానం
దంబున నందగోపాదిగోపాలురు తమలోవిచారించి.

నందగోపాపాదులింద్రోత్సవంబుసేయ నుపక్రమించుట.

సీ. కురిసె వానలు సస్యకోటియుఁ దృణగుల్మతరులతాతతులు వర్ధనము నొందెఁ
బసుల కారోగ్యసంపదతోడఁ గూడంగఁ బుష్టియుఁ దుష్టియుఁ బొలుపుమిగిలెఁ
బ్రజలు సప్రజలయి పాఁడియుఁ బంటయు నెదవంగఁ గని తృప్తినొందినారు
రాజులు నియతసంరక్షణ గావింప నహితతస్కరబాధ లంద వెందుఁ
గాన నిది యుజ్జ్వలోత్సవకరణమునకు, సమయ మేఁటేఁట మనచేయుశక్రపూజ
సేయఁవలవదె యిం కెడసేయ నేల, యనివినిశ్చితకార్యులై యాక్షణంబ.

తే. పల్లె నెల్లచోఁ జాటఁగఁ బనిచి వలయు, వస్తువులు సమకూర్చుప్రవర్తనమున
సక్తులై యుండఁగాఁ గని సరసిజాక్షుఁ, డెల్లగోపాలకులఁ జూచి యల్ల నగుచు.

క. కడుసంభ్రమమునఁ దిరుగం, బడియెద రిది యేమి తెలుఁగు పండువు మీకొ
ల్చెడుదైవ మెద్ది యెయ్యది, పడయంగా వచ్చుఁ దత్సపర్యానియతిన్.

వ. ఇంతయు నున్నరూపెఱింగింప వలయు ననిన వారిలో నత్యంతవృద్ధుం డగు
గోపాలుం డొక్కరుం డక్కుమారున కిట్లనియె.

సీ. విను నందగోపనందన యింద్రుఁ డొడయండు లోకపాలురకును లోకములకు
నతనియేలెడుభూతు వంబుదాగమము తత్సమయంబునందుఁ బ్రచండమేఘ
కులము లాతనియాజ్ఞ దలమోచియతనియాయుధముచిహ్నంబగునెడలిలొప్ప
భానుకరస్పర్శపాకంబునం దొందుమెఱుఁగులతోన సమీరణుండు
చలిచి మ్రోయింపమ్రోయుటయుఱుముగాఁగ,వచ్చిదివినుండిధారాళవారిగురిసి
సస్యములఁ బ్రోచి పసికిఁబోషణమొనర్చి,యఖిలజంతువులకుఁదుష్టియావహించు.

క. గోవులకు మేలు చేసిన, యావేల్పు గొల్లవారి యర్చనలకు నె
చ్చో వలయువాఁడు గావున, దేవేంద్రునిఁ గొలుతు మేము దృఢభక్తిరతిన్.

క. క్రేపులు వర్ధిల్లుటయును, నోపి పసులు పాలుగురియు చున్కియు నన్నం
బేపార మనకుఁ గలిమియు, నాపరమేశ్వరునియోగి యని యెఱుఁగుమనా.

తే. అతనిచ్చినపుణ్యంబ యతనిపూజ, గా సమర్పించి మనము సుఖంబుగాంతు
మనఘమనలఁ జెప్పఁగ నేలయతఁ డఖిల,మునకుమూలంబుకూడునీరును సృజింప.

వ. ఇది యింద్రోత్సవం బనుపేరిపరమకల్యాణంబు మాకుం బ్రతివత్సరంబును గర్తవ్యంబై యుండు ననిన విని దామోదరుండు గోపాలు రెల్ల విన నిట్లనియె.
క. కరిసనమును బేహారము, నరసి పసులఁ గూర్చుటయును ననఁగా వృత్తుల్
నరులకు నిం దెవ్వనికే, వెర వుచితం బదియు వానివేల్పై యుండున్
ఉ. కానలలోఁ జరించి గిరికందరలన్ వసియించి గోవులన్
మానుగఁ బెంచి వీనివలనన్ బ్రదు కొంది మనన్ సుఖంబుమై
భూనుత యున్న వార మటు బుద్ధి నెఱింగిన నెల్లభంగులం
గానలు గొండలుం బసులు గాదిలివేల్పులు గొల్లవారికిన్.
క. ఎలమిఁ దమజాతివేల్పులఁ, గొలిచి యుభయలోకసుఖము గోరుట దగుఁగా
కిలువేల్పులుండఁ గొలుతురె, పలువేల్పుల నెవ్విధంబు పాలసులైనన్.
ఆ. కర్షకులకు నెలవు గ్రామసీమావళి, యవ్వల నడవు లిందు లాటవికుల
కడవులందుఁ గొండదడియలు మనబోంట్ల, కింతవట్టు దెలియ నెఱుఁగవలయు.
వ. అదియునుంగాక పర్వతంబులు కామరూపంబు లగువేల్పులు గావున సింహశార్దూలాదులయం దావేశించి యాత్మీయంబు లగునరణ్యంబులకు బాధకు లగుదుర్నీతుల వధియించి నిజస్థానరక్షణం బొనర్చుచుఁ దమ్ముం గొనియాడుగహనోపజీవులకు ననుగ్రహంబు సేసి తదీయధనంబుల కెల్లదెసల సేమంబు గావించు నని విందుము.
తే. మంత్రయజ్ఞులు విప్రులు మహితసీర, యజ్ఞులరయఁ గృషీవలు లద్రియజ్ఞులనఘ గోపాలు రటుగాన నచలపూజ, యుత్సవంబుగఁ జేయుట యొప్పు మనకు.
క. వెడబుద్దు లుడిగి నాచె, ప్పెడుమతమున మీరు గోత్రభిత్పూజతెఱం
గెడలించి గోత్రపూజకుఁ, గడఁగుఁడు పసుపుఁ డిది పల్లెఁ గ్రమ్మఱఁ జాటన్.
క. మన మేమి యెఱుఁగుదుము శ, క్రుని నమరులు మునులు నతనిఁ గొలుతురుగాకి
వ్వనములు గిరులును మనచూ, చినమేరలు వీని మానఁ జెప్పిరె పెద్దల్.
ఆ. చేయరైతిరేనిఁ జేయింతు మిము నిది, బలిమి నైన నన్ను వలతు రేనిఁ
బ్రియము దప్పకుండఁ బెద్దఱికంబుతోఁ, గొండపండు వియ్యకొండు సేయ.
క. అని పెక్కుతెఱంగులఁ జే, ప్పినకృష్ణునివాక్యములకుఁ బ్రీతిమొనఁగ నా
తనినెమ్మోము ప్రియంబునఁ, గనుఁగొని యిట్లనియె గోపకరనికరంబుల్.

గోపాలకులుకృష్ణోపదేశంబుననింద్రోత్సవంబుమాని పర్వతోత్సవంబుచేయుట.

మ. కర మిష్టంబు సమస్తగోపకులయోగక్షేమనిర్వాహకం
బరయం దథ్యము పథ్య మివ్విధము నీయాజ్ఞం బ్రవర్తిల్లఁగా
దొరఁకో లల్పమె యెల్లకార్యముల సంతోషంబ మాబుద్ధులన్
శరణం బాపదలందు నీవ యనువిశ్వాసంబు భాసిల్లఁగన్.

తే. నీవ గతియును మతియును నీవపతియు, నీవ ధాతవు నేతవు నిజము మాకు
నీకతంబున బ్రేపల్లె నిర్భయత్వ, మమర నున్నది త్రిదివంబు ననుకరించి.

మ. జననం బాదిగ నీవొనర్చపను లాశ్చర్యంబు లుర్వీతలం
బున నెవ్వారికిఁ జూడఁ జేయను దలంపుల్‌సొన్పఁగా రామి నే
మనిశంబున్ భయవిస్మయాకులత నూహాపోహముగ్ధస్థితిన్
గనుచు న్నిన్ను నెఱుంగలేము దురహంకారగ్రహాలీఢతన్.

మ. బలవిక్రాంతియశంబులన్ బలరిపుం బ్రస్ఫారలక్ష్మీవిభా
కలనం బూర్ణశశాంకు శక్తిగరిమన్ గాంగేయు నేభంగి వే
ల్పులలోన న్గణుతింతు రాతరముగాఁ బోల్పం దగుం గాక ని
న్నిలలో మర్త్యునిమాత్రగాఁ దగునె యూహింపంగ మోహాంధతన్.

వ. కావున నీవుపదేశించినమార్గంబునం బర్వతయజ్ఞంబు ప్రవర్తించువారము శక్ర
యజనంబుమానితిమి భవదీయవాక్యంబు వారాశికి వేలయుంబోలె లోకంబులకు
ననతిక్రమణీయంబు దీని నిరాకరింప నెవ్వాఁడు శక్తుండు మమ్ము నింతయున నేల
యనిపలికి నందగోపప్రముఖులు భూదేవతల రావించి పుణ్యాహవాచనపురస్సరం
బుగా గిరియజ్ఞమహోత్సవంబునకు నుపక్రమించి రంత.

సీ. కైసేసి గోపాలకామిను లొండొండ యాబాలవృద్ధులై యరుగుదేరఁ
దగదళత్కుసుమావతంసులై గోపకుమారు లంతటికిని దార కడఁగఁ
బాయసంబులు సపూపంబులు మోదకంబులును లోనగునన్నములును బెక్కు
మాంసంబులును హృద్యమధువులు బహువిధవ్యంజనంబులును దధ్యాజ్యదుగ్ధ
ములును గావళ్ల బండ్లను వలయుభంగిఁ, గొని యథోచితజనము లింపొనరనడున
వివిధవాదిత్రములు మ్రోయ వృద్ధగోపు, లోలినచరింప జాతర యొప్పుమిగిలె.

వ. ఇవ్విధంబునం జని గోవర్ధనంబునకు నత్యంతసమీపంబున గోమయవిలిప్తంబును
రంగవల్లీవిచిత్రంబును నగుమనోహరస్థలంబున నందఋ గృష్ణుం బరివేష్టించి
నిలువ నతండు తాన యధ్యక్షుండై యజనోపకరణంబు లన్నియుం గైకొని
మహనీయస్థండిలంబున నమ్మహాశైలంబు నుద్దేశించి మహితాభ్యర్చనంబు చేసి
బహ్వపూపసూపపశూపహారసహితం బగునైవేద్యంబు సమర్పించి యఖిలగోపా
లుర నక్కొండకుఁ బుష్పాంజలు లొసంగను నమస్కారంబులు గావింపనుం బనిచి.

ఉ. స్థావరమూర్తి యైనతనుఁదా నచలాకృతితోడ నిట్లు సం
భావితుఁ జేసి యమ్మెయిన పర్వతశృంగమునందుఁ దోఁచి గో
పావళు లెల్ల నద్భుతమయాత్మతఁ జూడఁగఁ గేలుసాఁచి యా
దేవుఁడ యారగించెఁ గడుఁదెల్లముగా నుపహార మంతయున్.

తే. ఆరగించి పానీయంబు లర్థిఁ గ్రోలి, యేను మెచ్చితి మీపూజ కెంతయేని,
దృప్తి నొందితి ననియె నద్దేవపూజ్యుఁ, డప్పలుకు విని యద్భుతం బతిశయిల్ల.

వ. గోపాలు రెల్లను గృతాంజలులై దేవా యేము నీదాసులము నీయాజ్ఞయం దు
న్నవార మింక నెయ్యది యానతిచ్చి పనిచెదవు పనుపుము బ్రదికెద మనిసం బ
ర్వతాత్మకుం డయినయాసర్వేశ్వరుండు.

సీ. ఇది యాదిగా మీకు నెల్లకాలంబును నారాధనీయుఁడ నద్రిమూర్తి
నగునన్ను వేల్పుగా నర్చించి కామ్యంబు లెల్లఁ గాంతురు గోవు లెచట నున్న
నభివృద్ధిఁ బొంది నిత్యామృతస్యందినులై మిమ్ముఁ బోషించు నాదరమున
నేనును మీలోన నిచ్ఛాశరీరినై యింకను విహరింతు నింత యెఱిఁగి
యస్మదాశ్రితులై యుండుఁ డనినఁ గొండ
మీఁదికృష్ణుని మేదినిమీఁదనున్న
కృష్ణు నెక్కుటఁ జూచుచుఁ గేలు మోడ్చి
మ్రొక్కుచును బొంగి గోపాలముఖ్యు లపుడు.

వ. వివిధవాక్యంబుల నగ్గించి రగ్గిరిశృంగస్థితం బగురూపం బసంతరంబ యంతర్ధా
నతబు నొందె నంత నమ్మహాపురుషుపనుపునం బశుపాలు రందఱుం బసులకొమ్ము
లర్చించియుఁ జఱుగజ్జెలపేరు లఱుతం గట్టియు వనలతాపలయుంబులు తలలం
జుట్టియుఁ బలుదెఱంగుల నలంకరించి యార్చుచుఁ గొండచుట్టు నెక్క వెల్లిగొన
వెలిచి యచట నచట నివాళించి బడిసివైచి మ్రొక్కి యెక్కుట త్రుళ్ళుచు ను
ల్లాసంబు నొంది.

మత్తకోకిల. పాయసంబులరొంపులుఁ బహుభంగిబూరెలు నట్టులు
న్నేయుఁ బాలును దేనెయుం గడు నిండిపాఱెడునేఱులుఁ
వేయివేలు దలిర్ప నొప్పెడువిప్రభోజనము న్యథా
న్యాయదక్షిణ లుల్లసిల్ల నొనర్చి యెంతయు ధన్యతన్.

వ. సమస్తదీనానాథసముదయంబులం దనియం జేసి తామునుం దమతమవర్గంబుల
తోడం గూడి యజ్ఞశేషాశనం బమృతంబుగా నుపయోగించి పండువు నిం
డించి క్రమ్మఱ.

క. హరిఁ బరమేశ్వరు నాశ్రిత, శరణ్యు సకలార్థకరణచతురకృపాసం
భరితాత్మకు మున్నిడికొని, యిరవుగ వ్రేపల్లె కరిగి రెంతయుఁ బ్రీతిన్.

వ. అంత నక్కడఁ ద్రిదివంబునందు.

క. తనపూజ త్రోపువడుటకు, మనమునఁ గోపమును సిగ్గు మల్లడిగొనఁగా
ననిమిషపతి సంవర్తా, ద్యనుపమమేఘములఁ బిలిచి యాగ్రహ మెసఁగన్.

### ఇంద్రుఁడు మేఘములరావించి వ్రేపల్లెమీఁద వర్షింపనియోగించుట.

సీ. వినుఁడు బృందావనంబున నందగోపుఁడు మొదలుగాఁగలగొల్లముదుక లెల్లఁ
గడుఁగ్రొవ్వి తొల్లి యెప్పుడు నాకు నేఁటేఁటఁ జేయుపూజలు నేఁడు సేయనొల్ల
కుక్కివుఁ డైనదామోదరుకలఁపులు విని యొక్కచిడిపిగట్టునకుఁ జేసి
రైన నింతన యేమి యయ్యె వారికి నెల్లబ్రతుకునునై యున్నపసికిఁ బెలుచ
నెడరు పుట్టెడునట్లుగా నేఁడునాళ్లు, లోలసి రేయును బగలును వెలుతు రీక
వాతహతితోడ బెడిదంపువాన గురిసి, గాసి చేసి రండ లైనఁ గరము మెత్తు.

క. ఇదె యేనును మీవెనుకన, మదవన్మేఘద్విపేంద్రమస్తకరచితా
స్పదుఁడ నయి వచ్చి దివిఁ జూ, చెద మీయాటోప మెల్లఁ జెన్నెసలారన్.

వ. అని పనిచినం బనిపూని వలాహకంబులు సమగ్రసన్నాహంబున నవ్యాహతో
త్సాహదోహలంబు లయ్యె నట గోకులంబునందు.

సీ. శివుదిక్కునందు వేరువఁ గోలమెఱుఁగులు మెఱసె నచ్చోన సమీరణుండు
పుట్టి తీవ్రత నేల బెట్టుగాఁ జఱచుచు విసరె బీతెండతో నెసఁగె నుమ్మ
యూఁగ మిక్కుట మయ్యె నెఱనింగిఁ గడుమించె నిడుదలై తిలకించె సీరుకాళ్లు
పడమఱ నిరుదెసఁ బ్రతిసూర్యములు దోఁచె నంబరంబునఁ బర్వె నాగడపలు
షిన్నబిడ్డ లెయ్యెడలఁ బింపిళులుగూసి, రంఘ్రితలములు సిమసిమయనిమొజనుల
కఖిలతృణలతాతరునిచయంబుఁ జీడ, వట్టె నిట్టలంబుగ జడిపట్టుపొంచె.

క. సురపతిదిక్కుఱిమెడు భూ, ధరములవెలిమొగులు గప్పెఁ దప్పదు వర్షం
బరు దిది యకాలమున నని, దొరఁకొని చింతిలిరి గొల్లదొర లెల్లమదిన్.

వ. తదనంతరంబ.

సీ. దిక్కరిణీబృంద మొక్కట యీనినపిల్లలు దివిఁ బ్రసరిల్లె ననఁగ
గోత్రాచలంబులు చిత్రవాతాహతి వెసఁ బెల్లగిలి మీఁది కెగసె ననఁగఁ
బాతాళమున నున్న బంధురధ్వాంతముల్ వెడలి భానుని మ్రింగ నడరె ననఁగఁ
నిల నాల్గుచెఱఁగుల జలధులు నలిరేఁగి కడళుల నభ మెక్కఁ గడఁగె ననఁగఁ
నొప్పియుద్ధురస్థూలపయోధరములు, దెసలకడపటఁ బొడమి యాకసముమూసి
మెఱుఁగుజోతులుచూడ్కికిమిక్కుటముగ, నొదవెఁబిడుగులు రాలునునుప్పతిల్లె.

మ. వడి నమ్మేఘచయంబులం దొరఁగుదుర్వారాద్భుతాసారముల్
వడగండ్లన్ బెరయంగఁ దీవ్రవిసరద్వాతూలతోఁ గూడి దం
దడిఁ దోడ్తోడఁ బ్రవృద్ధిఁ బొంది బలువై ద్యావాపృథివ్యంతరం
బెడయొక్కింతయు లేక యుండఁగఁ గరం బేపారె నాపూర్ణతన్.

మ. ఇది కల్పాంతమొ యిమ్మహోగ్రసలిలం బేకార్ణవాకారమై
పొదలం జూచెను యింతతోన జగముల్ పోఁజేసెనో ధాత యే
య్యది దిక్కెక్కడఁ జొత్తు మెవ్విధమునం బ్రాణంబు రక్షించుకో
లోదవున్ దైవమ యంచు గోపనివహం బుద్వేగ మొందె న్మదిన్.

మ. భువనైకప్రభుఁ డైనయింద్రునకె సంపూజ్యంబుగాఁ జేయును
త్సవమే నర్భుఁడనే హరింప నన కుత్సాహంబుతోఁ బూజ గో
న్నవిహీనాత్మకు నేము సైప మనుచున్ శక్రాజ్ఞ గోవర్ధనా
ద్రి వెసం ద్రొక్కెడు నాఁగఁ జుట్టుకొని యుద్రేకించె జీమూతముల్.

క. పసులకు నొడ్డినవదియై, మసఁగినయవ్వాన పశుసమాజము నెల్లన్
బసగరగొని యంతటఁబో, క సమస్తప్రాణిబాధకంబై పేర్చెన్.

చ. కులిశనిపాతదాహమునఁ గొన్ని నశింపఁ బ్రచండవాయువుల్
బలువిడి వ్రేయఁ బెల్లగిలి భగ్నములై చెడఁగొన్ని వెల్లువల్
బలియుటఁ బీడితంబులయి పాడఱఁ గొన్ని యశేషభూరుహా
వళులకుఁ దీవ్రదుఃఖదశ వచ్చె నెఱిం దదరణ్యభూములన్.

చ. నిడుజడిదాఁకి యొందుఁ జననేరక యాఁకటఁ గ్రుస్సి చెట్టుపల్
సడలఁ గులాయమధ్యముల శాఖలసందుల నిల్వలేక యు
గ్గడువుగఁ బల్మఱుం జఱచుగాడ్పునఁ దూలి వనంబుపక్షు లె
య్యెడఁ బడి చచ్చి తేలెఁ గడు నేపెసలారుపొలంపువెల్లులన్.

చ. గిరికుహరస్థితంబు లగు కేసరులున్ వడిఁ బేర్చునప్పయో
ధరపటుగర్జలం దలఁకి దందడి నున్నవి యున్నచోన య
చ్చెరువుగ గుండియ ల్వగిలి చేష్టిత మేమియు లేక యుండె న
ప్పురుసనివాన నన్యమృగపక్షులు మ్రగ్గుట చెప్ప నేటికిన్.

వ. అట్టిసమయంబున నిరంతరధారాపాతంబునం దడిసి నలుదెసలం బఱచి వ్రేయు వాయువునఁ గొందలపోయి యొండొంటిచాటున కొదిఁగి కడగానక నిలువఁ బడియుఁ గొమ్ములొడ్డి కన్నులు వ్రాల్చి కడతెప్పల నీళ్లుగాఱం దలలు దిగవైచి నెమరు లుడిగి మూర్ఛలువోయినట్లుండియు వడఁకు సొచ్చి యఱచుక్రేపుల ముందటఁ బెట్టుకొని గంగడోళ్లం బొదివి యంభారవంబుల నాక్రందించి వెల్లువ కతన డెంకిలేక నిలువుజా లుండియుండి యోటఁకి కాళ్లు వడంక సైరణ దప్పి నెఱిదప్పం బెనురొంపిలోనం ద్రెళ్లియుఁ బెలుచ మెఱుముమెఱుఁగుల బెదరి యదరంట నుఱుము పేరుఱుముల బమ్మెరపోయి మందపట్టుడిగి యిట్టునట్టునుం దెరలి తిరిగియు నాహారంబు లేక యీఁదచాటు వడయం జాలక యొత్తువడి

తెవ్రులుగొంట్లు ముదుసళ్లును మడియ బలవంతంబు లై నవియుఁ జేవదక్కియుఁ బసులు పెక్కుబాధలం దల్లడిల్లఁ బశుపాలురును గుడిసెలు గాలి బండ్లు దడఁ బడం దూలి సొమ్ము లేది పాకాదిక్రియలు మాని దోహనంబులు నిల్పి మహా క్లేశంబునఁ గొందలంబునొంద నందఱుఁ గృష్ణకృష్ణ కావుము గోవులకు మా కును దిక్కు నీవ యని యాక్రోశింప గోవు లున్ముఖంబులై యఱచుచు శర ణంబు వేఁడెడువిధంబునఁ దనవలనికి పఱతేర నవ్విధం బంతయు నాలోకించి వాసుదేవుం డాత్మగతంబున.

మ. తనకై చేయుమహోత్సవంబు నటు లేఁ దప్పించుటం గోప మె
క్కినచిత్తంబున గోవ్రజంబున కతిక్లేశంబుఁ బుట్టింప నె
ట్టన నయ్యింద్రుఁ డొనర్చినట్టిసురవష్టంభంబు గాకేమి యి
వ్వినిరోధం బతఁ డింతఁ దాఁగనునొకో విద్వేషసాఫల్యముల్.

క. దీన నను్ఁ జిక్కువడియెడు, వానింగాఁ దలఁచె నిపుడు వాసవునట్ల
జ్ఞాని యొరుఁ డెవ్వఁ డింతయు, మానింపఁగ నేరనేని మఱి నగనిమ్మా.

శా. ఈగోవర్ధనశైలముం బెఱికి నేనింపొందఁ గేల్ వియ
ద్భాగం బందఁగ నెత్తి మందిరముచందం బొందఁగాఁ జేసి యిం
దే గోసంతతినెల్లఁ గాచెద మదీయైకత్వసత్వోదయ
ప్రాగల్భ్యంబులు సర్వలోకవినుతిప్రాప్తిం గనుంగావుతన్.

——— శ్రీకృష్ణుఁడు గోరక్షణార్థంబు గోవర్ధనపర్వతంబు నెత్తుట. ———

వ. అని తలపోసి యాక్షణంబ.

మ. వనమాతంగము విస్ఫురన్మదకళావష్టంభశుంభద్దశన్
సునిరూఢం బగుక్రీడఁ బంకజము నున్మూలించుదండంబునన్
వనజాక్షుం డవలీలమైఁ బెఱికి సన్నద్ధాగ్రహస్తంబునం
గొని యెత్తెన్ విపులాతపత్రసమతన్ గోవర్ధనాద్రీంద్రమున్.

సీ. కదలి డొల్లెడుమహాగండశైలములతో నిలద్రుమాఁకులును బెల్లగిలిపడంగ
వడిఁ దూలి చెదరెడువారివాహములతో ఘనమృగవ్రజములుఁ గలఁగిపాఱ
నుదరి క్రేళ్లుఱికెడుసుగ్రకేసరులతో బిలగతాహులుఁ గింక వెలికి నెగయ
వెసఁ బాసి పోయెడువిద్యాధరులతోడ నియమస్థమునిజనాళియుఁ దొలంగ
నెత్తువడి కాంచనాదిధాతూచ్చయముల, రసము జొబ్బిల ఖనిరత్నరాసులొలుక
నడరిసానుసంధులువ్రయ్య నమ్మహాద్రి, గలయ నాభీలమయ్యెఁ దచ్చలనవేళ.

చ. గొడుగుగఁ జేసె గోవులకు గోపకుమారులకు న్నగంబు ని
ట్లొడఁబడవచ్చుఁబో మ్మనఁగ నొప్పెడుప్రవేళులు వంజమాడ్కినై

యుపరినమీ(దిమేఘతతి యావృత్తిమై శిఖరంబు గుబ్బమై
కడుబెడఁగొందె హస్తమనుకామ తిరంబుగఁ దాల్చి పొల్చుటన్.

క. కొండ ధరించుట నాకొక, కొండా మున్ను నలవాఁడు కూర్మమనై పె
న్గొండ ధరింపనె యనున, ట్లుండె యమతనూజుఁ డద్భుతోగ్రస్థిరతన్.

వ. ఇట్లుగోవర్ధనుండుగోవర్ధనోద్ధరణంబొనర్చి సకలగోపాలసముదయంబునాలోకించి.

శా. ఈవానం బరిపీడ నొందుపసుల న్వీక్షించి రక్షార్థినై
వేవే యుద్ధరణీధ్రముం బెకిలితిన్ విస్తీర్ణ మీక్రిందు మీ
రేవా రెచ్చట నుండఁ గోరితిరి వారెల్లం బశుశ్రేణితో
భావంబుల్ భయ ముజ్జగించి చొరుఁ డీధవ్యాద్రిచాటుం దడున్.

తే. బహుసహస్రసంఖ్యలు గలపసుల కెల్ల,నిడువు దగినయి మ్మెయ్యది యిచట ననకుఁ
డెనసి త్రైలోక్యమునువచ్చెనేని నిమ్ము, గలదువెండియు వెలితియ కాఁగ నుండు.

వ. అనిన సప్రభుత్ప్రమోదరసంబులు మానసంబున వెల్లిగొన నాగొల్లలెల్లం జెలంగి
చూర్చుచుఁ దమతమకదుపుల నమ్మహాశైలమండపంబుక్రిందికి నొండొండ వెలిచి
సర్వభాండావలులును సకలశకటప్రకరంబులును సమస్తవస్తువిస్తారంబులుం దెచ్చి.
యునిచి బాలస్త్రీవృద్ధపూర్వకంబుగా నందఱుం దగినయెడములు గైకొని ని
వాతంబున సుఖంబుండి దామోదరమహిమాభికీర్తనంబునందుఁ దత్పరులైరి
సప్తరాత్రంబుసమవసానంబు నొందినం బురందరుం డమందమందాక్షవిలక్షుండై
వలాహకవ్యూహంబుల నుపసంహరించి మగిడి నిజలోకంబునకుం జనిన.

క. నిర్మేఘత నాకాశము, నిర్మలమై ధౌతఖడ్గనిభమిదియనఁగా
నిర్ముక్తాసితభుజగస, ధర్మంబై యొప్పె నిజనితాంతచ్ఛాయన్.

క. హరి గోవులు క్రమ్మఱసం, చరించుటిట్ల యన నబ్దసంవృతివాయన్
హరిగోవులు విశదములై, చరాచరమనోజ్ఞసంప్రచారత నొప్పెన్.

సీ. వాఁకలబడి నీరువలియఁ బొలఁగ మిట్టు లొండొండ వెలసి తృణోత్కరముల
తుదలు పచ్చఁదనంబుతోఁదలసూపంగఁ దీఁగ లొయ్యనఁ గొంకుదేఱి కొనలు
మొగ మెత్త మెత్తనియిగురాకు దోఁపంగఁ దరువులు దనిగాడ్పు తపనరుచులు
గాంచి సప్రాణించి క్రమ్మఱఁ గొమ్మలఁగదలించి నర్తనక్రమ మొనర్ప
నెలవు లేర్పడిక్రుమ్మరునెరవు లెఱిఁగి, మృగకులంబులుభ్రమవాసిమెలఁగఁజొరఁగ
నాటవికకోటి తమజాడ లరసి తిరుగ, నడవు లొప్పారెఁ జండవర్షాత్యయమున.

వ. తదనంతరంబ గోపాలదేవుండు గోపాలనోత్సవంబునం జరితార్థుండై గోవర్ధనధ
రణీధరంబు తదీయస్థానంబున నత్యంతసుస్థిరం బగునట్లుగాఁ బ్రతిష్ఠించి గోవుల
నభిమతమార్గంబునఁ బ్రవర్తింప గోపకుమారులం బనిచి.

క. అక్కొండయందుఁ బ్రియమగు, చక్కటి నొకయున్నతంపుసమసానువుపై
నెక్కఁడ యాసీనుండై, స్రుక్కక కపుపులుచరింపఁ జూచుచునుండెన్.

తే. తన్నుఁ గానంగరానీక తనువు దాఁచి, యాకసంబుననుండి విహంగరాజు
భక్తినెఱకలనీడ నప్పద్మనాభు, మీఁదఁ బచరించె బీతెండ మెఱయకుండ.

ఇంద్రుఁడు శ్రీకృష్ణుని సన్నిధికివచ్చి బహువిధంబుల స్తుతించుట.

సీ. ఆసమయంబున నతిమానుషంబును నతిదైవతంబు నత్యద్భుతంబు
నగుకృష్ణుదుష్కరవ్యాపార మాత్మకు బ్రేఁకనై వెలసిన విబుధనాథుఁ
డాత్రిదివమున నుదాసీనుఁడై యుండ వెఱచి యల్పం బగువేల్పుమూఁక
గొలిచిరా వెల్లేనుఁగును వేయిగన్నులు గులిశంబు నని చెప్పవలయుతనదు
లక్షణము లుల్లసిల్ల నిలాతలమున, కేగుదెంచి గోవర్ధనాద్రీంద్రతటము
నందుఁగూర్చున్న దేవుమాఁయామనుష్యు, నాద్యుఁబుండరీకాక్షుననంతుఁ గాంచి.

క. లోచనము లెల్ల విచ్చి వి, గోచనునెమకుకొనుపంకరుహములభంగిన్.
రోచిష్ణువులుగ నేడ్కం, జూచె ననిమిషత్వమపుడు సుకృతార్థముగన్.

క. తనతేజ మతసిముందట, నినుముందటిపెఱవెలుంగు నెన యగుచు వెసన్
బొనుఁగుపడ నొదిఁగె శక్రుం, డనుపమవిభవాభిమాన మంతయు నడఁగన్.

మ. ఇత్థం డక్షోభ్యుఁ డనాద్యనంతవిభవుం డీశానుఁ డానమ్రదై
వతుఁ డాక్షిప్తసురారిచక్రుఁ డజితవ్యాపారవిఖ్యాతుఁ డ
చ్యుతుఁ డాద్యుం డనుబుద్ధి చిత్తమున కచ్చో సంతతం బొందఁగా
శతమన్యుండు వినీతివిభ్రమవికాసస్ఫీతసర్వాంగుఁడై.

క. కన్నంతన తనయేనిక, యున్న దిగంద్రావి రభసదోలాయితహా
రోన్నతవక్షస్థలుఁడై, యన్నలినాక్షునకు వంచె నాత్మశిరంబున్.

వ. ఇట్లు ప్రణామంబొనర్చిన.

తే. కనియుఁ గాననివిధమున ననఘతేజుఁ, డెఱిఁగియును నెఱుంగనిభంగి నింద్రుదిక్కు
గ్రేకటించియుఁ జూడక కృష్ణుఁ డంచి, తాసనుండయి యుండె ననాదరమున.

వ. అప్పరమేశ్వరుండు తనయందు సుముఖుండు గామికిం దలంకి దేవముఖ్యుండు
కృతాంజలియై కదిసి సామవచనంబుల నమ్మహాభాగు నిట్లని వినుతించె.

సీ. సకలవేదంబులు సకలయజ్ఞంబులు నీవని కనుఁగొని నీకుమిగుల
నొండు లేదని కాంచి యోగంబునకు నీవ భావ్యుఁడ వనియును బ్రణవమునకు
వాచ్యుఁడ వనియును వాస్తవం బగుబోధమున కాత్మయని మునుముట్ట నెఱిఁగి
విశ్వజన్మస్థితివిలయంబులును నిర్గుణావభాసంబు నీయందచూచి

భవదనుధ్యానపూజనప్రణతివిధులఁ, దగిలి యుండువాఁ డొక్కఁడు ధన్యతముఁడు
వివిధదివ్యావతారప్రవీణభువన, భరధురీణ యాశ్రితమిత్ర పద్మనేత్రా.

మ. గోపాలత్వవిరూపుఁ డై నకతనం గ్రొవ్వగ్గలంబై మదిన్
రూపింపం జొర కేను నిన్ను నిట సంరోధించి బాధించితిన్
నీపాలం బొలుపారుగోధనముల న్నిక్కంబు దుస్మత్సర
వ్యాపత్తిం బ్రభవించి రోషమది యుల్లై నెంచె నీచిత్తమున్.

క. నీవఖిలనియామకుఁడవు, దేవా నియమించునట్టిదేవం డెవ్వఁ
డీవిభవ మిచ్చినాఁడవు, గావే నా కింత యేను గాననె మొదలన్.

తే. ఏలయొప్పుట్టె నాదెస నిట్టికొఱఁత, దీని సైరింపఁ దగు నీకు దివిజవంద్య
దాసులందు లెక్కింపంగఁ దప్పు లెన్ని, లేవు ప్రభులకు సైరింప లెస్సగాక.

మ. విలయైకార్ణవకారు లైనఘనముల్ వేవేలు వాతూలసం
కులవృష్టిం బ్రసరింప నేను వెనుకన్ ఘోరాకృతి న్నిల్వఁగా
బలిమిన్ దైవతదానవాహులకు మాన్పన్ రానిగోసంప్లవం
బలఘుస్థైర్యుఁడవై జయించుటకు నే నాత్మం బ్రమోదించితిన్.

తే. కేలికందుక మెత్తినలీలఁ గొండ, యెత్తి గోపులయడరు నీ విట్టుడుపుట
వలన మందరధర నీవు వైష్ణవంపుఁ, దేజ మఖిలలోకములకుఁ దేటపడియె.

మ. త్రిదశప్రీతి యొనర్పఁ గోరి ధరణిం దేజోంశము ల్లీలమై
నుదయం బొందఁగఁజేసి నీవు క్రియ కుద్యోగించు టెల్లన్ శుభ
ప్రదమై పూర్ణతఁ బొందినట్టిదయకా భావించితిం జూవె నేఁ
డు దయావర్ధన యిట్టివిక్రమకళాటోపంబు రూపించుటన్

ఉ. నీవొకరుండ విభువననిర్వహణంబునకున్ ధురంధరుం
డై వెలుఁగొందువాఁడవు సురావలిలో మఱి యోగ్యు నీదృశున్
శ్రీవర చెప్పుమా కలఁడొ సృష్టికిఁ గర్త పయోజగర్భుఁ డా
దేవుఁడు నిన్ను నెన్ని గణుతింపఁగఁ బాత్రమె నీకు నుద్దిగన్.

తే. అంబురాశి నదంబుల కచలములకు, నాహిమాద్రి పతులకుఁ గశ్యపసుతుండు
మేటియై యొప్పుక్రియ సురకోటికెల్లఁ, బ్రభుఁడ వీవొక్కరుఁడ కావె పద్మనాభ.

సీ. జలములపై భూమి యిలమీఁద మనుజులు మనుజులపై మేఘమండలంబు
మేఘమండలముపై మిహిరుండు దేవలోకం బన నొప్పు నాకంబు నాక
మేలుటకై దివిజేంద్రత్వ మిచ్చి నన్నీవు ప్రతిష్ఠించి తీశ్వరుఁడవు
నాకలోకముమీఁద నలినజులోక మాలోకంబుమీఁద గోలోకమమరు

నట్టిగోలోక మేలువారై నగోవు, లనఘ గోవర్ధనాద్రీంద్ర మద్రశమమున
నెత్తి యాత్మీయసంతతి నీవుగాచు, టాత్మఁగనియెంతయునుమోద మతిశయిల్ల.

వ. అగ్గోవులు పితామహసహితలై యుండి భవద్గౌరవం బభినందించుటకై నన్ను
నిటఁ బుత్తెంచి రేనును నామీఁదితప్పు వాయ నిన్నుఁ దెలఁచుట ముఖ్యకార్యం
బుగాఁ జనుదెంచితి.

క. దితికిం గశ్యపువరమున, నుదయించినవాఁడ నీనహోదరుఁడ ముదం
బొదవ నను నాదరింపుము, మది నెండొకకింక యింక మానుము వరదా.

వ. గోవులు నిన్నుగూర్చి తారాడినయదిగాఁ జెప్ప మనినమాటలు కొన్ని గల
వాకర్ణింపుము.

సీ. పితుకుట దున్నుట పెరుగుట లోనుగాఁ గలుగునానావిధకర్మములకు
నాత్మీయ లగువారి నఖిలంబునం బనిపనిచి లోకైకసంభరణ మేము
గావించుకతమునఁ గమలాసనాదులు మమ్ముఁ బొటింతురు మాకు నెడరు
పుట్టినచోఁ జక్కఁబెట్టితి గ్రమ్మనఁ గోరి ప్రాణముఁ దైనగురుఁడ వీవు
రిత్తయుపచారముల యాచరించి నిలువ, కస్మదీయకులస్వామి యగుట కర్థిఁ
జేసి యజునాజ్ఞ నిను నభిషిక్తుఁగా నె, నర్పఁ బుత్తెంచితిమి జగన్మాన్యచరిత.

వ. నీవు మమ్ము వలసినవాఁడ వగుదేని నివ్విధంబున కియ్యకొనుమని రట్లుగావున.

క. ఇవె కాంచనకలశంబుల, దివిజకరంబుల నభోనదీజలముల్ మా
ధవ సముపానీతములై, నవి యేఁ జేయునభిషేచనము గైకొనుమా.

తే. అమరకోటికి నింద్రుఁడ నైనయట్టి, నీవు గోవుల కింద్రుఁడ విది మొదలుగ
గోకులంబుల నిట్టేలు కొంటి గాన, నలఘుగోవిందనామవిఖ్యాతి గనుము

ఇంద్రుఁడు శ్రీకృష్ణుని గోపతిత్వమున కభిషిక్తునిఁ జేయుట.

వ. ఆషాఢమాసంబు మొదలయినచతుర్మాసంబులయందు నర్ధంబు నీకిచ్చితిఁ దొలుత
రెండునెలలు లోకంబు నాకుం బూజగావించు నవ్వల నెలలు రెంటను జనంబులు
నిన్నుఁ బూజించువారు గావుత ముపేంద్రుండనం దొల్లియు వెలసి తివ్విశేషం
బునలన నయ్యుపేంద్రశబ్దంబు సమర్థించి యమర్త్యులు కీర్తింతురు వర్షాగమసమ
యంబున సుప్తిం బొంది కార్తికంబున వినిద్రుండ వగుటయు భద్రంబులు భువ
నంబులం బ్రవర్తిల్లు నని యి ట్లొనర్చినవాక్యోపన్యాసంబునకు నుల్లాసం బొందు
వాసుదేవునకు నాతఁడుం బ.

క. తాన యిరుగేలఁ గలశము, లానందముతోడఁ దాల్చి యభిషేకసుఖ
శ్రీనెఱయఁ జేసె సురపతి, యానిఖిలంబునకుఁ బరమహిత మగుపొంకెట.

వ. అంతయు ననుసంధించి గోవులు గోపాలు రనుగమింప నరుగుదెంచి నిజపయో
ధరంబులం దొరఁగుపయఃపూరంబుల నతనిశిరం బభిషేకించి ధారాధరంబులు

దిక్ప్రాదకధారలం దోఁచెదరువులు మకరందబిందుసందోహంబులం దడిపె దివంబునుండి దివ్యతరుసురభికుసుమవర్షంబులు గురిసె దేవదుందుభినాదంబులు గంధర్వగానంబులు నప్సరోనర్తనంబులు నుల్లసిల్లె వసిష్ఠవామదేవాత్రిభరద్వాజకౌశికకణ్వాదిమునులు శ్రుతిసిద్ధంబు లగుసిద్ధమంత్రములఁ గీర్తించిరి సూర్యుండును సుప్రసన్నతేజుండై వెలింగె దిక్కులు వెలసె గంధవహుండు సుఖస్పర్శతానుభగుండై చరించెఁ దాపసాగ్నిహోత్రంబులు ప్రదక్షిణజ్వాలాజాలంబులయి యొప్పె సాగరంబులు గిరులుఁ దరంగిణులుం దరుగుల్మలతాదులుఁ బశుపక్షిమృగప్రకరంబులు లోనుగాఁ దత్తదనురూపంబు లగుసంప్రమోదచేష్టితంబుల శోభిల్లె నిట్లు కృష్ణాభిషేకంబు సకలలోకశుభావహం బయి పరఁగిన యనంతరంబ.

క. దివ్యాంబరభూషాదుల, నన్యంబుగ నపుడు కమలనాభున కింద్రుం
డవ్యాహితముగఁ జేసెను, భవ్యపరిష్కార మధికభద్రం బమరన్.

వ. ఇట్లలంకృతుండై యున్నయతని కింద్రుండు మఱియు నిట్లనియె.

క. ఇచ్చటికి నేను బ్రియమున, వచ్చినపనులందుఁ బ్రణతవత్సల యొకఁ డిం
పచ్చుగ సిద్ధం బయ్యె, న్వెచ్చొలయఁగ నింక నొకటి నినుఁ బ్రార్థింతున్

వ. అది యెయ్యది యనిన నవధరింపుము.

సీ. కంసునిపంపునఁ గలరు నీకెగ్గొనరింప నింకను దుశ్చరిత్రు లసుర
లందఱుఁ గ్రమమున నపగతాసులఁ జేసి తడయక కూల్చె దాతనినిఁ బీదప
నటమీఁద రాజవై యావర్జితాశేషరాజన్యు యగుధరారమణిమిగుల
శాసిత యయ్యెడు సర్వజ్ఞ నాఁడు మీమేనత్తకుంతియం దేను నాదు
తేజమావహింపఁగ యుధిష్ఠిరాని, లాత్మజులవెన్కవాఁడై నయతులయశుఁడు
పాండురాజాన్వయాంభోజభాస్కరుండు, నిర్జితారాతి యార్జితుం డర్జునుండు.

మ. నిను సర్వంబునకుం బరాయణముగా నిర్దోషుఁడై యాశ్రయిం
చు నుదారస్థిరమైత్రి నెమ్మనమునన్ శోభిల్ల నీవాతనిన్
జనతారక్షక నన్నుఁ జూచుకరణిన్ సంభావ్యుఁగాఁ జూచి కై
కొనుమీ నిర్మలకీర్తిగాంచు నతఁడున్ గోవింద నీప్రాపునన్.

వ. ఏను మహామునిమధ్యంబునఁ బాండవమధ్యముండు ప్రచండకోదండపాండిత్యంబున సర్వాధికుం డగునని పలికినవాఁడ నప్పలుకు దప్పకుండఁ దద్గౌరవంబు ప్రకాశంబుసేయు మతనికిం దదీయజ్ఞాతు లగుధార్తరాష్ట్రులతోడ సంగరం బయ్యెడు నందు ధాత్రిం గలసకలక్షత్రంబునుం గూడి రెండుదెసలం బన్నినయప్పుడుపడునెనిమిదియక్షౌహిణు లగుచతురంగసైన్యంబులు కల్పాంతకాంతంబుగానన్యోన్యసంక్షయం బాపాదించు నయ్యపాయంబున నమ్మహావీరుండు నీకు నవశ్యరక్ష

ణీయుం డివ్విధంబు మత్ప్రార్థనీయంబు సత్కృప పెంపుగలిగి యుండవలయునని యింద్రుండు సంభాషించినం బరితోషభరితహృదయుండై యదుపుంగవుండు.

శా. మ్మామేన త్తతనూజు లేవురును సన్మాన్యు ల్మహావిక్రమ
శ్రీమంతు ల్దివిజాంశసంభవులు వర్ధిష్ణుల్ కురూత్తంసముల్
సామర్థ్యంబున నీసమస్తధరయుం బాలింతు రం దాభుజ
స్థేమాకల్పుఁడు మధ్యముండు త్రిజగజ్జిష్ణుండు శౌర్యోన్నతిన్.

ఉ. ఏ నిదియంతయుం సురగణేశ్వర మున్న యెఱుంగుదుం మదిన్
పూని రణాంతరంబులఁ బ్రభూతజయావహ మైనబుద్ధి న
మ్మానవసింహుశోభనసమగ్రునిఁగాఁగఁ దలంచినాఁడ ని
చ్చో నిటు నీవుసెప్పి తటుచూడు మవశ్యము నట్ల చేసెదన్.

వ. భవదీయసమాగమనసౌహార్దంబునకు హర్షించితి నింక నిష్కళంకచిత్తుండవై యుత్తమస్థితిం బ్రమోదింపు మని వీడ్కొలిపినం బాకశాసనుం డయ్యసురశాసనుచరణసరసీరుహంబులకుఁ బ్రణమిల్లి ప్రదక్షిణంబు సేసి యెప్పటియట్ల యైరావతంబు నెక్కి సురలు పరివేష్టింప నాత్మీయస్థానంబునకుం జనియె నంతనిక్కడ.

గోపవృద్ధులు శ్రీకృష్ణుని మహాప్రభావం బభివర్ణించి యతనినరయుట.

క. ఆగోవర్ధనగిరితట, భాగంబున నుండి భువనబాంధవుఁడు మహా
భాగుఁడు వ్రేపల్లెకు నను, రాగంబున నరిగె సఖపరంపరతోడన్.

వ. అట్టివాసుదేవప్రభావం బఖిలంబు ననుసంధించి.

ఉ. అందులవృద్ధులుం మతిసమగ్రులుఁ గార్యవిచారవేదులుం
గ్రందుకొనంగ నాతని నపూర్వచరిత్రునిఁ గాంచి చుట్టునా
నందసమగ్రులై బలసి నవ్యవికాసవినీతిసంభ్రమ
స్పందనముల్ నిజంబు లగుభావములం జెలఁగంగ నత్తఱిన్.

వ. అత్యంతగంభీరప్రకారంబున నక్కమలాసన కిట్లనిరి.

శా. గోత్రోద్ధారణకేళి నశ్రమమునన్ గోత్రాపరిత్రాణముం
జిత్రప్రౌఢి నెనర్చి తివ్విధమునం జెప్పంగఁ జూపంగ నీ
గోత్రామండలి నెందుఁ గల్గెనె వెఱన్ గోవింద నీకమ్మెయిన్
గోత్రారాతియు నమ్రుఁడై యొసగఁడే గోపాలురే యీదృశుల్.

తే. ఇట్టినీవు సుట్టమవయి యింతవట్టు, వారిలో నున్నవాఁడవు వారిజాక్ష
యేము ధన్యాత్ములమమమ్మునెవ్వ రెనయు, వారుమాకోర్కు లెల్ల నిండారఁబండె.

క. వెఱచి వెఱచి యడిగెద మే, మెఱిఁగింపఁగ వలయు నొకటి యీవెవ్వఁడ వీ
కొఱమాలినగొల్లతనము, మఱువు విహరించె దిట్లు మహిమాత్మేచ్ఛన్.

క. వసువులలో రుద్రులలో, శ్వసనులలో నొక్కఁడవు నిజం బెయ్యది రా
క్షసయక్షఖచరగంధ, ర్వసిద్ధవిద్యాధరప్రవరజన్ముఁడవో.

క. ఆలం గాచెద వక్కట, త్రైలోక్యముఁ బేర్మిఁ గావఁ దగువాఁడవు నీ
మూలం బెఱుఁగమి వెఱఁ గడుఁ, దూలెగ మిట్లేమితప్పు దొడరును యనుచున్.

తే. నందగోపునియన్వయానందకరుఁడు, సుదతియాయశోదకు ముద్దుసూపుపట్టి
క్రీడసలిపెడు నదె చిన్నికృష్ణుఁడనుచు, మనుజుఁగానిన్నుఁగనుతప్పమాకునైపు.

క. నీ వెవ్వఁడ వైన నగుము, భావంబున నీకు మ్రొక్కి ప్రణికేదము మముని
గావుము ప్రోవుము గొల్లల, మేవిధిఁ బేసుకొనువార మెఱుఁగ మొకటియున్.

తే. అనిన నవ్వుచు వారితో నవ్విభుండు, మీకు నిన్ని ద్రవ్వఁగనేల మిన్నకున్నఁ
బోదె మీబాంధవుఁడ ననుబుద్ధి సాలు, నవల నేమి సేసెదరు మీ రనఘులార.

శా. కీడొక్కింతయుఁ జెందనీక ప్రియము ల్గీల్కొల్పుచున్ వచ్చెనం
గ్రీడాలోలత నాకు నేయది యపేక్షింపంగఁ బట్టైననుం
జూడుం డారక యొయ్యఁ గాలగతి నాచొప్పెల్లఁ దెల్లం బగున్.
మీడెందంబుల కవ్విధం బతిశుభోన్మేషావహం బయ్యెడున్.

వ. అనిన సంతసిల్లి వల్లవు లంతఱుఁ దమతమమందిరంబుల కరిగి సుఖసంచారం
బులం బ్రవర్తిల్లిరనిజనమేజయునకు వైశంపాయనకథితం బైనకథాప్రపంచంబు
సముచితవ్యాఖ్యానవిఖ్యాతంబుగ.

ఉ. సంగడిరక్షపాలబహుసంగరజిత్కరపాల బాలికా
మంగళమూర్తిహేల యసమానసమంజసకీర్తివర్తకీ
రంగదిగంతరాళ గుణరాజిహృతాఖిలచిత్తజాల స
ప్తాంగరమావిశాల సకలార్థవిచక్షణపుణ్యలక్షణా.

క. చెంజిమలచూరకార ధ, నంజయసమసత్త్వజైత్ర నమదరిచూడా
సంజనమనోజ్ఞనఖరుచి, కింజల్కసరోజసదృశఖేలనచరణా.

మాలిని. అసకృదసమధాటీ వ్యాప్తిదృప్తాగ్రయాయీ
ప్రసభజనితవిద్విట్పట్టణోద్దాహవేగో
ల్లసితవిచలదుల్కాలంఘితోద్ధ్వాంతవాసీ
వ్యసనవిశదలీలావర్ధమానప్రతాపా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానందసౌందర్య
ధుర్య శ్రీసూర్యనారాయణసుకవిసంభవశంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ
నామధేయ ప్రణీతం బైనహరివంశంబునం బూర్వభాగంబునందు సప్త
మాశ్వాసము.

పూర్వభాగము - అష్టమాశ్వాసము.

క. శ్రీమత్కుసుమశరోపమ, సామగ్రీజనితహృదయసంజ్వరవిలుఠ
ద్భామాసఖీసమర్చిత, కోమలచరణాభిరామకోమటివేమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెఁ దదనంతరంబ యనంతశయనుం డనంతసత్త్వోచితవ్యాపారంబులఁ బ్రతిదినంబును విశృంఖలుండై మిగిలి.

సీ. మలసిదర్పంబున మార్కొనువృషముల నార్చుచురేఁచి పోరాటఁ బెనుచు
లావరు లయినగొల్లలసంగడములు గొందలపెట్టి బాహుయుద్ధము లొనర్చు
నడవుల బెబ్బులు లాదిగా నుగ్రసత్త్వంబులఁ దొడరి యుద్ధతి వహించుఁ
బఱచుట దాఁటుట పట్టుట దిగుచుట మొదలుగా నాశ్చర్యములుగఁ జూపు.
నొడలుఁ బ్రాయంబులావును నొప్పిదంబు, నుక్కివంబువిక్రమమును నొక్కటొకటి
కనుగుణంబులై యేరికి ననుగమింప, రాక మెఱయంగఁ బలువిహారముల నలరె.

వ. ఆసమయంబున.

చ. తననవయౌవనంబును నుదగ్రపుదర్పము శారదాగమం
బున దినరాత్రులంగలప్రభూతసుఖోచితరమ్యభంగులన్
గనుఁగొని కామభోగములఁ గ్రాలుటకై మది నిచ్చగించి య
వ్వనరుహలోచనుండు గరువం బగుచోద్యపునిశ్చయంబునన్.

క. ఆపల్లెలోన నెప్పుడు, గోపతరుణు లెల్లఁ దనదుకోర్కి నలువులీ
లాపాత్రములుగఁ జేయుట, కేపారఁగ నుత్సహించి యెసకపువేడ్కన్.

సీ. అభినవబర్హిబర్హాపీడలక్ష్మి నుల్లాసించుకేశకలాప మమరఁ
గమనీయకేయూరకంకణోర్మికలకుఁ దొడవైననిడుగేలుదోయి మెఱయ
నమ్లానకుసుమసమంచితమాలిక గైసేయువిపులవక్షంబు దనర
హారిద్రకౌశేయహారిబంధముఁ గృతార్థముఁ జేయుపృథుకటీతటి యెలర్పఁ
జెఱుతనవ్వున నిండారుజిగి యుదార, లలితనేత్రాంచలంబుల నలువు లేడల
వెన్నుఁ డక్షులై కమూర్తిదావేణునాద, ఘనసుధాంభోధియొండొండగడలుకొలిపె.

క. ఆదివ్యధ్వనియింపున, కాదట చెవు లొగ్గి గోవులాదిగఁ గలలో
కోదితజంతువు లుల్లము, లేది యొడలు మఱచి సొగసె నెంతయు భ్రాంతిన్.

క. గోపాలురు తద్వేణుర, వాపూరములోన మునిఁగి యానందగస
శ్రీపరిణతి నాత్మీయ, వ్యాపారము లెల్ల వదలి రవిచేష్టితులై.

ఉ. అత్తఱిఁ బల్లెలోఁ గలుగునంగన లెల్ల సముత్సుకంబులై
చిత్తము లెత్తి తేర యనుసింహునిపాలికి నేగుదెంచి య

య్యుత్తమసౌకుమార్యనిధియుజ్జ్వలలీలలు మెచ్చి రాగముల్
కుత్తుకబంటిగై యెసఁగఁ గ్రోలిరి చూడ్కులఁ దన్ముఖేందువుల్.

క. తగిలినచూడ్కులు మగుడన్, దిగువ వెరవు లేక మదనుత్రిప్పలఁబడున
మ్మగువలతగు లాత్మీయం, బగుకోర్కికిఁ దగిన నాతఁ డామోదమునన్.

క. అనురూపాలోకనముల, ననురూపాలాపములను ననురూపవిచే
ష్టనములఁ దనమనసుతెఱం, గును వారికిఁ దెలియఁజేసి కుతుకముఁ బెనిచెన్.

వ. ఇట్లు వశీకరించి యందఱం గళిందకన్యాతీరకాంతారంబుల కేలియించిన.

తే. తల్లిదండ్రులు మాన్ప భర్తలు మగుడ్పఁ, జెలులు వలదనఁ జుట్టలు సిగ్గుపఱుప
వ్రేత లొకటియు నెఱుఁగక వెన్నువెనుకఁ, దగిలిపోయిరి తమకంబు దవులుకొనఁగ.

సీ. ఎలదేఁటిపదువులయులివుల నెప్పారుచారుపుష్పితలతాగారములను
హంసరథాంగావతంసంబు లగుతరఁగలఁ గ్రాలుకోలఁకులచలువయెడల
సెలయేఱుగడలెడచినుకులనునుగాలిఁ జను పెక్కుశైలనితంబములను
నభినవమరకతశ్యామంబులై వేడ్కఁ బ్రభవించుమృదులంపుఁబచ్చికలను
బరమపురుషుఁ డయ్యంతులఁ బ్రకటరాగ, కుశలపేశలలీలలఁ గొఱలికొఱలి
న్నాఁడునాఁటికి రతులవిన్ననువుపఱిచి, తాను జొక్కెఁ దద్భావవైదగ్ధ్యవలన.

క. హరిచేష్టితములు క్రమమున, మరగి నిజముగాఁగఁ దమమగలఁ దొరఁగియా
హరియంద భర్తృబుద్ధిం, బరిణతలై యావ్రజంబుబాలిక లెల్లన్.

తే. పఱఁగి పులిలోటలుడుగుట పగలురేయు, బల్లెయందును నడవిలోపల నిజేచ్ఛఁ
దిరిగినట్లు కృష్ణునిఁ గూడితిరుగఁదొడఁగి, రంగనలుమదభరవిఘూర్ణాత్మలగుచు.

వ. అవ్విధంబున నత్యంతసంసక్తి భజియించి.

మ. లలితాలోకములన్ మనోజ్ఞమధురాలాపంబులన్ విస్ఫుర
త్కలహాసంబుల బంధురస్తనభరోత్థానంగసంగంబులన్
విలసద్వక్త్రసరోరుహార్పణములన్ స్నిగ్ధోరుసంవేష్టనం
బులఁ బూజించిరి గోపభామలు జగత్పూజార్హు దాశార్హునిన్.

తే. కలవరించియుఁ గృష్ణాఖ్య దెలిసి యున్న, యపుడుఁ గృష్ణాఖ్య యేమఱినట్టివేళ
యందుఁ గృష్ణాఖ్య దక్కంగ నంగనలకు, రాదు వేఱొకవాక్యంబు రసనతుదికి.

క. హరిచరితంబులు రసని, ర్భరములుగా జతలుగట్టి పాడుదు రాతం
డరుదుగఁ బాడఁగ నాడుదు, రురుతరకరతాళసంభృతోన్మదగతులన్.

క. ఏవేషము దాల్చెఁ బ్రియుం, డావేషము తారు దాల్తు రతఁ డేయింపుల్
భావించి మెచ్చె వానిన్, భావంబులయందు భ్రాంతివడుదురు పడఁతుల్.

తే. పిల్లఁగ్రోవి పట్టుచుఁ బసిపిఱుఁదఁ బ్రోవఁ, దారుఁ బోదురు రాగాన్యతంత్రలగుచు
నెఱపుధూళులు మేనులఁ బొరసియువియ, తొడవుగా గోపికలు కృష్ణుతోడఁ దగిలి.

క. పిడియేనికపదువుపొదువఁ, గడువేడుకఁ గ్రాలుగంధగజపతిమాడ్కిన్
బడఁతులనడుమ యదూద్వహుఁ, డడవుల నొప్పారెఁ బటుమదాంధస్ఫూర్తిన్,

వ. అమ్మహాప్రభావుండు నిజప్రభావిభవంబు సవరించి.

శ్రీకృష్ణుఁడు గోపకాంతల రతిక్రీడల నత్యంతానురాగవతులఁ జేయుట.

క. అందఱకు నన్నిరూపులఁ, గందర్పక్రీడ యేకకాలనియతి నా
నందమయసామరస్యం, బొందఁ సలుపు నోలి నొకత నొక్కతెనూఁడన్.

క. అదియు నదియు నేటిదియో, మది నెఱుఁగనికననిసోగపు మఱవనివలపున్
బొదలఁగఁ గేవలదర్పో, న్మదలై క్రీడింతు రాసమస్తాంగనలున్.

తే. ఒకత నొక్కతనెడపెట్టియొక్కఁ డొకఁడు, దానునై మండలాకృతిగా నమర్చి
నడుమ నొకమూర్తితో వేణునాదలీల, నందఱను దేల్చె నందగోపాత్మజుండు.

క. ఒక్కత నొక్కత దవ్వుగ, నెక్కడికేనిఁ గొనిపోయి యేలమి రమించున్
దక్కినవనితలు తనబడి, నక్కడ నక్కడను నరసి యరసి భ్రమింపన్.

క. ఎన్నఁడుఁ దక్కక కొందఱ, నన్నున నెక్కించుఁ జెంద కతిదీర్ఘముగా
నన్నులఁ గొందఱను విరహ, ఖిన్నత నొందించు సమదకేళీవాంఛన్.

సీ. ఒక్కతదూతిగా నొకతపాలికిఁ బుచ్చి యంగజసంధికార్యంబు నడపు
నొక్కతయలుకకు నులికి సాంత్వనములఁ దలకొని యోర్తు మధ్యస్థఁ జేయు
నొక్కతెఁ బ్రియమున నొకచోటఁ గెలయించి వంచన మఱియోర్తు వలని కేగు
నొక్కతెఁ జిక్కఁ బేరురమున నిఱికించి ముదమున నోర్తు కెమ్మోవి యాను
నొకతవలువకీ లెడలించి యోర్తుకడకుఁ
గొనుచుఁ బోయి యుల్లాస మింపొనరఁ గొఱలుఁ
దనదుసౌభాగ్యగరిమ నందఱును నీసు
లేక చిక్కఁగఁ గృష్ణుఁ డుల్లోకలీల.

మ. కరజక్షుణ్ణకుచద్వయీతటములన్ గాఢాగ్రదంతక్షతా
ధరబింబంబుల నూతనాంగుళిదళధ్వస్తాలకాభోగబ
ర్బరసీమంతములన్ ముకుందరతిధుర్యశ్రీలు గోపాలసుం
దరులం దొప్పెఁ దదీయమర్దమవయోదర్పానురూపోద్ధతిన్.

తే. ఒకతసంభోగచిహ్నంబు లోర్తు సూచి, వేడ్కపడ నప్పుడంతికి వేఱభంగి
సేయనదియు నొక్కతకు వాంఛితముఁ బెనుపఁ, బెనుచుఁ గుతుకపరంపర ప్రియులకెల్ల.

సీ. ధమ్మిల్లభరముల దండడిఁ దొరఁగినకుసుమంబులును జూర్ణకుంతలములు
రాలినకింజల్కరంజితకర్ణచ్యుతము లైనబర్హావతంసములును
హాస్తవిస్రస్తంబు లైనమృణాళకంకణములు గుచబంధగళితలైన
యులఘుమౌక్తికవల్లరులు నితంబభ్రష్ట లైనయుజ్జ్వలమేఖలావళులును

మృదితపల్లవశయ్యలుఁ బదసరోజ, యావకాంకంబులును లేనియట్టి యెడలు,
లేవ యెల్లెడలందు బృందావనమునఁ, గృష్ణసంసక్తవల్లవీక్రీడనముల.

చ. అలరులు గోసి కోసినవయస్యలఁ బల్మఱుఁగౌఁగిలించి కో
యిలలయెలుంగు లోలిఁ గొని యింపుగఁ జిల్కలతోడ నెమ్మిమై
నలవడి మాటలాడి యళు లాలతిసేయఁగఁ బాడి డాఁగురిం
తలు హరితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపికల్.

క. తరుణీపరివృతుఁడై హరి, సారసనికుంజములఁ బ్రాఁకిచూడనిచేటుల్
దిరుగనినెత్తములును లే, వరయఁగ గోవర్ధనాద్రియంతటియందున్.

క. వడకట్ట లిసుకతిప్పలు, మడలు దరులు వాఁకలును గ్రమంబున నొకఁడున్
గడవఁబడకుండఁ గృష్ణుఁడు, పడఁతులకును యమున యాటపట్టుగఁ జేసెన్.

సీ. తోరంపుటూరులఁ దొడరియుద్ధతసితంబముల పై నాడటఁ బ్రాఁకి నాభు
లప్పళించి సముద్ధతాంచితస్తనభరంబులు గౌఁగిలించి దోర్మూలములకు
దొడికి భుజంబులతోఁ బెనఁగాడుచు లీల మోములు కబళించి చెక్కు
లంటి కుంతలము లల్లల్ల దెమల్చి నేత్రముల క్రేవలు విముగ్ధములు సేసి
క్రేతలకు నోలి నింపులు విస్తరింపఁ, దన్నపోలెడి కాళిందితరఁగలందుఁ
గ్రాలె ననుదినంబును జలకేళి దగిలి, సజలఘనమూర్తి గోపాలచక్రవర్తి.

చ. ఎనసిననిండువెన్నలల నింపగురాత్రుల రత్నరమ్యకాం
చనచషకంబులందు నరచందురునీడలు దోఁచుసీధువుల్
గొని యమునానుచుట్టులను గూడి మదోద్ధతి నాడుగోపికా
జనములు దార కైకొనిరి శారదవైభవలక్ష్మి యంతయున్.

చ. తనుతరనిత్యపుష్పితలతాతతిలోనన యుండి నిద్రమై
దనుబడి రేప మేల్కనునుదారమధువ్రతనాథుభంగి న
వ్వనరుహనాభుఁడుం దగిలి వల్లవకాంతలలోన రాత్రులున్
దినములు నట్లపోవఁగ నుదీర్ణసుఖాంబుధిఁ దేలె లోలుఁడై.

శ్రీకృష్ణుఁడు వృషభరూపధరుండగు నరిష్టుండను రాక్షసునింజంపుట.

వ. ఇంత నొక్కనాఁడు మధ్యరాత్రసమయంబున గోపికామండలమధ్యగతుండై తారామధ్యంబునం బొలుపారుసుధాకిరణుతోడం బురుడించుచు నభినవక్రీడా కౌతుకంబున నలరుకృష్ణునకు నరిష్టంబు చింతించి యరిష్టుం డనుదుష్టదానవుండు వృషభరూపంబున నాటోపంబు దీపింపం గోపంబునుం బాపంబునుం దన్ను మృత్యువై యెలయించుటకు ననుకూలుండై యాభీలోత్సాహంబున.

సీ. కాలకూటమునకుఁ గరచరణాద్యవయవములు ప్రభవించియుల రె ననఁగఁ
బ్రళయోద్ధతధ్వాంతపటలంబునకు శరీరిత్వవిస్ఫూర్తి వర్తిల్లె ననఁగ

రావాసంత్యక్తఘోరకళేబరమునకుఁ బశుభావపరిణతి పరఁగెననఁగ
గలికాలసమ్ముఖకలుషరాశికిఁ జతురంఘ్రితావైదగ్ధి యలరె ననఁగ
నతిభయంకరం బగుకఠోరాశితాంగ, మెసఁగ నీలాద్రి వృషభమై యేగుదెంచు
కరణి నుత్తుంగతీక్ష్ణశృంగములతోడఁ, జటులఖురపాతపాటితక్ష్మాకుఁ డగుచు.

వ. గోష్ఠంబులలోని కుఱికి సుఖశయనంబుల నలరుపసులం గలంచి గోగర్భిణులకడు పులు సిదుగ్గం గొమ్ముల గ్రుచ్చుచుఁ బొగరుకోడెలం దోడరి పొరిగొనుచు వత్సంబులఁ గాల్ద్రొట్టున బారిసమరుచు మారిమసంగినమాడ్కిం గర్కశబంధు రస్కంధంబును నతిస్థూలవిపులకకుద్మంబును దీర్ఘతరలాంగూలంబును సమవి శాలకటిభాగంబునునిజశకృన్మూత్రస్నిగ్ధపార్శ్వయుగ్మంబునునుల్లసిల్లం బెల్లురేఁగి.

ఉ. అంకెలు గర్జలై యపర అపుఁదనంబున నెందుఁ బర్వని
శ్శంకవిలోకవైద్యుతకృశానుశిఖల్ దెసలెల్లఁ గప్పఁగా
భోంకముతోడ విస్ఫురదపూర్వవలాహకభంగిఁ బొంగి యే
వంకలఁ జీఁకటు ల్గవియ వచ్చె యదూద్వహుపై రయంబునన్.

తే. మలసి క్రోడాడి యిరుదెసల్రమాఁకు లోలి
గూలఁ ద్రోచుచుఁ గాల్దువ్వి ధూళి రేఁచి
చెలఁగి పొడువఁ గొమ్ము లమర్చి పెలుచఁ బాఱు
తెంపునాఁబోతుటసుర సృష్టించి విభుఁడు.

మ. వెఱచి నిమీలితాక్షులయి వెన్కఁ గోదింగెడుపువ్వుఁబోఁడులన్
వెఱవకుఁ డోడకుం డనుచు వేగమ తా నెదురై కడంగి యే
త్తైఱఁ దలశబ్దమిచ్చినఁ గడింది వృషాధముఁ డగ్గలంపుఁదెం
పుఱవుగఁ దాఁకెఁ గృష్ణుఁ డతఁ డొడ్డినకొమ్ములువట్టి బిట్టుగన్.

క. పట్టినఁ గదలఁగనేరక, యిట్టట్టును బలిమిచెడక యెగయుచు లావై
మెట్టి నిలిచె హరియును నా, కట్టుపకాసికిని బలముఁ గడఁకయుఁ జూపెన్.

మ. వృషభస్కంధుఁడు వారిజాక్షుఁడు మహావిస్తీర్ణవక్షుండు దు
ర్విషహుం డాతఁడు గోవృషాసురుని నుద్విగ్నాత్ముగా నమ్మెయిన్.
రుషతోఁ బ్రౌఢభుజాబలం బెసఁగ సంరోధించె వేఱొక్కగో
వృషభేంద్రుండును బోలె గర్జితకళావిస్ఫారుఁడై యుండఁగన్.

క. హరిచేతిఁ గగ్గమై చె, చ్చెరఁ గూలక యసుర యింతసే పోర్చెఁ గరం
బరు దితనిలావు తెఱఁ గని, యరిష్టుఁ గొనియాడి రంబరాంతరచారుల్.

ఉ. తానును దైత్యులావునకుఁ దద్దయు మెచ్చుచుఁ బేర్చి దేవకీ
సూనుఁడు కొమ్ము లూఁది మెడ స్రుక్కఁగ నెత్తి నులించి త్రిప్పి వే

వే నెఱిదప్పఁ ద్రోచుటయు విహ్వలుఁడై రుధిరంబు కర్ణనా
సానయనంబులం దొరఁగ స్రగ్గె విరోధి యపాస్తజీవుఁడై.

వ. అవ్విధంబున గోవిందబాహుయంత్రనిష్పిష్టుండై పడినయరిష్టుం జూచి, యట యున్న విత్రస్తలై చెదరి యున్నగోపాంగన లందఱు విస్మయానందంబులు డెందం బులఁ దడవికొన నయ్యరవిందనాభుపాలికిం జనుదెంచి చుట్టును బలసి పలుదెఱం గులం బ్రస్తుతించి రట్లు వెన్నుండు వ్రేపల్లె బల్లిదుండై వర్తిల్లుచున్నవిధంబు తె ల్లంబుగా వినుచు నక్కడఁ గంసుండు.

తే. తోడుతోడుతఁగడఁకలుతునిసిపడఁగ, వెఱఁగుపాటులు వెఱపులుఁ మఱఁగలింపఁ
జేష్టితంబులుఁ దలఁపులుఁ జేవసెడఁగ, నుసుఱుతోడిపీనుంగయి యుసురుచుండె.

వ. అట్లుండి యొక్కనాఁడు సుప్తసర్వప్రాణిజాతంబును నిశ్శబ్దసకలదిక్తటంబు నగు నిశీథినీ సమయంబున నభ్యంతరసభామండపంబున నొక్కరుండు నాసీనుండై యుగ్రసేనుండు వసుదేవుండు సత్యకుం డంధకుండు గర్గుండు దారుకుండు విపృ థుండు బభ్రుండు మొదలుగాఁగలయదుభోజముఖ్యుల నందఱ రావించి వారి తో నిట్లనియె.

సీ. సర్వకార్యజ్ఞులు సర్వాగమములఁ బారగులు త్రివర్గవర్తననిపుణులు
లోకవిక్రాంతివివేకనిష్ఠులు సమగ్రోపాయు లవిరతోద్యోగధన్యు
లభిగుప్తమంత్రు లనర్థంబులందుఁ బరాఙ్ముఖు లార్యభావానుగతులు
దర్పితారాతిమర్దనశౌండు లార్తజనత్రాణతత్పరుల్ నయసమగ్రు
లందఱును మీరు వహ్నిసూర్యేందుపవన, రుద్రసమగుణోదయములరూఢిగనిన
దొరలునరులఁజెప్పఁగనేలసురలనైన, నోపుదురుబుద్ధిమగఁటిమి నుక్కుమడఁప.

క. గిరులు మహీమండలమును, భరియించినభంగిఁ బరమభద్రం బగుమీ
చరితమున నఖిలయదుకుల, భరణం బొనరించి పేర్మిఁ బరఁగితి రెందుల్.

తే. ఇట్టిమీరు నా కెప్పుడు హితవు దలఁచి, యస్మదీయమనోవృత్తి ననుసరింతు
రిప్పుడొకయనర్థముజనియించియుండ, మదినుపేక్షించినారేమిమతమొయెఱుఁగ.

కంసుఁడు వసుదేవాదులతో శ్రీకృష్ణుని చరితంబు చెప్పి యాక్షేపించుట.

వ. అది యెయ్యది యనిన నందగోపనందనుండై యున్నకృష్ణుం డనుపేరికుమా రుండు నాకపకారంబు సేయం బుట్టినవాఁ డద్దురాత్ముం డుపేక్షింతం బైనరోగం బు పగిది ననుకూలవాతప్రేరితం బైనపయోధరంబుచాడ్పున నంకురితం బైనవి షవృక్షంబువిధంబున వర్ధిల్లుచున్నవాఁడు నిపుణంబుగాఁ జింతించియు వానిపు ట్టువుం బొడవు నున్నరూపు నిశ్చయింపరాకున్నది యాశ్చర్యం బగుకారణంబున జాతం బైన దేవతాపత్యంబ కావలయు నతిదైవతంబులును నమానుషంబులు ను దదీయచరితంబులు తత్ప్రకారంబులం దెలిపెదం దెలియ వినుండు.

సీ. ఘనరిముప్వంటలదినములయందు పూతనచనుఁబాలతోఁ ద్రావె నుసుఱు
నెఱిబోరగిలియాడ నేరనినాఁడ పాదమునఁ దుత్తుమురుగాఁ దాఁచె బండి
ధరణిఁ దప్పటడుగిడుతఱియందు జమిలిమద్దులు పెల్లగిల రోలితోన యీడ్చె
నించుకించుక యెదయెఱిఁగెడికాలఁదిన కాళియనాగంబు గండడంచెఁ
బ్రకటబలులఁ బ్రలంబధేనుకుల నుగ్ర, రేఖఁ జంపించె నధికు నరిష్టుఁ దునిమె
బాల్యమున నేల యిట్టిట్టి పనులు ప్రౌఢు, లెవ్వరీలోకమునఁ జేసి రితఁడు దక్క.

క. ఏడుదివసములవృష్టిం, గీడొందెడుపసులఁ గావ గిరిగొడుగుగ సం
క్రీడాగతిఁ బట్టుట గొని,యాడఁ దగదె చెప్ప నేల యన్యము లోకఁదున్.

తే. ఇంకఁ గలవాఁడు కేశియ యితఁడు పోయి, వానిచేఁగూలుదరువాతివాఁడ నేను
జంప మరగినవాఁ డేల సైచు నన్ను, నుఱక యెల్లినవచ్చి పైనుఱుకుఁ గాక.

క. భ్రూమలు ముసిపడఁగఁ బిడికిలి, యమరిచి కోపంబుతోడ నవ్వుడుగఁ బొడుచున్
జముచాడ్పున హరికడును, గ్రమముగాఁ బైఁబడుట నామొగంబున వ్రేలున్.

వ. అదియునుంగాక విష్ణుండు తొల్లి హిరణ్యకశిపువధియింప నరసింహుండై యా
విర్భవించె ననియుఁ గూర్మావతారంబున మందరపర్వతంబు దాల్చి వనితారూపం
బున సమరాసురులకుఁ గలహంబుత్పాదించి యసురకులం బడఁగించెననియును
వారాహం బగుదేహంబు గైకొని మహీసముద్ధరణం బొనర్చియనేకదైత్యులఁ
బరిమార్చెననియును వామనుండై వైరోచను వంచించి త్రివిజరాజ్యంబు జంభారికి
చ్చె ననియును జామదగ్న్యుండై యిరువదియొక్కమాఱు నరపతులనెల్ల నుఱు
మాడి కశ్యపునకు నధ్వరదక్షిణగా నఖిలక్షోణియుం బ్రతిపాదించె ననియును
నాలుగుమూర్తులై దశరథుం డనుధరణిపతికిఁ బ్రభవించి పౌలస్త్యుం దునిమె
ననియును విందుము.

మ. ఇవియెల్లం గలమాయలాఁడు హరి యాత్మేచ్ఛన్ సురప్రార్థనన్
భువనప్రీతి యొనర్చినట్టిగతు లిప్పుం బూని యీసీచగో
పవిధిం గ్రీడ నెపంబు వెట్టుకొని దృప్యద్దానవాపాయదు
ర్వ్యవసాయంబునఁ బుట్టెఁ గావలయు మీరాత్మన్ విచారింపుఁడా.

క. ఆకృష్ణునియగ్రజుఁడును, ధాకర్ధధవళతనుఁ డయ్యుదాగునటుల యు
ల్లోకబలుఁడు బలభద్రుఁ డ, నేకులవధియింపఁ జాలు నింద్రద్విషులన్.

వ. వీరిద్దఱు దేవాంశసంభవు లగుట సిద్ధంబు సిద్ధముని యగునారదుండు నాకెఱిం
గించె దేవకి యర్ధరాత్రంబునప్పుడు కొడుకుంగనినం దదీయభర్త యక్కుమారుం
గొనిచని సమకాలప్రసూత యైనయశోదయుందటం బెట్టి తజ్జాత యగుబాలికం
దెచ్చిన నదియును నాచేయి వదల్చికొని పోయి వింధ్యవాసిని యగుదేవతయై

దేవతలచేతం బూజ నొందె నాకృష్ణుండును వసుదేవసుతుం డగుటం జేసి వాసు
దేవుం డనం బ్రఖ్యాతి నొందెడు నిట్లు మిత్రవ్యపదేశంబునం బరఁగుశత్రుండు
దానైన వసుదేవుండ దీని కింతకు మూలభూతంబు.

చ. వడిఁ దలఁద్రొక్కి ముక్కున నవారణఁ గన్నులు దొల్చఁ బొల్పుబ
ల్విడిఁ దమకించువాయసముభంగి మదీయసమీపవర్తియై
యుడుగక కీడు నాకుఁ గడు నుగ్రముగా నొనరించె దాయపుం
జెడు గితఁ డేమిసేయనగుఁ జెన్నఁటిచుట్టపుసంజ్ఞ యుండఁగన్.

చ. మనిచితిఁ దన్ను నీగియును మన్ననయుం బొదలంగ నేను దా
ననయము నింతయుం దలఁప కింతకతుల్యవిచారుఁ డయ్యె ని
య్యన నిటు నాదెస న్వినక యాత్మ నకల్మషునందుఁ గల్మషం
బెనయ నొనర్చు కంటెఁ గలదే భువి పాతక మెవ్విధంబునన్.

తే. భ్రూణహత్యాదు లగుపాపములకు నవధి, గలదు గాని కృతఘ్నునికలుషమునకు
లేదు నిష్కృతి యంతంబు లేనితీవ్ర, నరకపీడసంప్రాప్య మన్నరున కండ్రు.

వ. అనిపలికి వసుదేవుదెసం గనుంగొని కంసుండు.

సీ. కుల మింతయును నేనుగొఱత నొక్కట నొందకుండంగ రక్షించుచున్నవాఁడ
నిట్టినాయెడఁ బాప మిమ్మెయిఁ బుట్టించి తులువ నీవెంతయు ద్రోహివైతి
వెట్లుగా ముదిసితి వేమిగాఁ బెద్దవైతో కాని యెఱుఁగ నీయున్నయూర
నైన లే దీవు మిథ్యాశీలుఁడవు మృషాశ్రయుఁడ వనర్థసంయముఁడవు
నీవిచార మే నెఱిఁగితి గారవమునఁ, దొడరి నన్నుఁ జంపించి నీకొడుకు రాజుఁ
జేసి మధుర యేలింపఁ జూచెదవు జాల్మ, మెట్టునకు జన్నె తరములు వెట్టిచూడ.

శా. నాకేశుం డయినం బినాకధరుఁ డైన న్నాకు మాత్రైరణో
త్సేకంబుం బ్రసరింప నోపమి మదిం జింతింప వి ట్లేటికిన్
నీకున్ దుర్వ్యవసాయ మొక్కపడుచున్ వే తెచ్చి పోరించియే
శ్రీకింబాత్రమవై తనర్చెదవు నీచే నౌనె యానప్పనుల్.

వ. నీవుచక్రవర్తివంశంబున జనియించి బాల్యంబుగోలెను మాతండ్రియు పెంపం
బెఱిగి మాతోఁబుట్టువునకుం బెనిమిటివై యాదవులు గురుస్థానంబుగాఁ బా
టింపం బరఁగి సజ్జనులలోన నెన్నిక గని పిదప నిన్నీచకర్మంబునకుం జొచ్చితి నీ
వెట్టివాఁడ వైన నగుదు గాని యేను నిన్ను వధియింప నోప నింతకుమున్ను
బంధువృద్ధద్విజవధంబులు సేయ నింకం జేయంగలవాఁడం గాను నీచేయుదుర్న
యంబులవలన మేలువచ్చినం గీడొందిన నది దైవకృతం బని యుండెదఁ ద్వదీ
యం బగుదౌరాత్మ్యంబు యదుకులంబువారికిం దలవంపు గావించె నింతియు
కృష్ణునకు నాకు నిట్లు పొడమినరాయిడి మాయందొక్కరుండు శాంతిం బొందక

శాంతి గానేరదు నిన్ను వెడలనడువవలసినపని యట్లు సేసితి నేని నేన తుచ్ఛుం డ నగుదు నీచుట్టరికంబు నీయొద్దన యుండు నుండిన నుండు పోయినం బొమ్ము పలుకులంబని లేదని పలికి మధురేశ్వరుండు భోజకులాలంకారుం డగునక్రూరు నాలోకించి.

కంసుఁడు శ్రీకృష్ణునిఁ దోడ్తేర నక్రూరుని నియోగించుట.

క. చని నీవు గోకులంబున, కనఘా యానందగోపు నాతనివారిన్
మనయుత్సవకోటికిఁ గలయరి, గొని గండని తోన తోడుకొని రమ్ము వెసన్.

వ. అదియునుంగాక యేను మదీయం బగుధనువునకు మహోత్సవంబు సేసెద దీనికి ననేకదేశాధీశు లగురాజులును మహనీయు లగుమహీదేవతలు నరుగు దెంచుచున్నవారు పెక్కుదినంబు లామెత లొనర్ప వలసియుండు వ్రజనివాసు లగుగోపాలుర నపరిమితంబు లగుదధిక్షీరంబులు ఘృతంబు నరణ్యసంభవంబు లగుమధువులుఁ దెచ్చునట్లుగా నాజ్ఞాపింపు మఱియును.

శా. నామేనల్లురు బాహుసత్త్వవికసన్మాహాత్మ్యవిఖ్యాతు లం
రాముం గృష్ణునిఁ జూచువేడుక మనోరాగంబునం దాడెడు
న్వే మద్వాంఛ యెఱుంగఁ జెప్పి మదికి న్విశ్వాస మొందించి నీ
వామహాప్యాయణులం గుమారులను దెమ్మాలోకనప్రీతిగన్.

తే. ఇద్దఱున్నారు ఘనులు నాయొద్ద మల్లు, లీసుపుట్టించి తలపెట్టి యెల్లజనుల
కుత్సవంబుగ నే నయ్యుదూద్వహులయు, దగ్రదోర్దర్పపరిణతి యరయువాఁడ.

ఉ. వారికి నాకు సమ్ముఖ మవశ్యము గావలె నట్లుగాక యీ
వైరము మాన దింపెసఁగువాక్యమ యచ్చట విస్తరింపు మ
క్రూర కఠోర మెట్లయిన రోషము దోఁపఁగ నీకు మెచ్చెయిన్
జేరఁ బాలురు న్విపినసీమజనించినవారు గావునన్.

వ. అక్కుమారులం దోడ్కొని వచ్చితేని నాకత్యంతం బగునుపకారం బొనర్చిన వాఁడ వగుదు వసుదేవుకొడుకు లెవ్వియు వినకు మీప్రొద్దు కదలు మిట్ల చేయు మనిన నట్లకాక యని యక్రూరుండు.

క. దనుజదమను దర్శింపఁగఁ, దను బనుచుట హృద్యమధురతరశీతజలం
బెనయఁ దృషాతురుఁ గ్రోలం, బనుచుటగాఁ దలఁచి ప్రమదభరితుండగుచున్.

సీ. సజలవలాహకశ్యామసుందరదేహుఁ డాజానులంబిసమగ్రబాహుఁ
డతులితశ్రీవత్సవితతమంగళవక్షుఁ డమలసరోజపత్రాయతాక్షుఁ
డబ్జచక్రగదాసమన్వితకరపద్ముఁ డమృతాబ్ధినిత్యవిహారసద్ముఁ
డాలగ్నకనకదుకూలకటీచక్రుఁ డానమ్రసతతరక్షార్థిశక్రుఁ

డాదిదేవుఁ డిప్పుడు గొల్లఁడై ముదమునఁ,బిలిదండ నెట్టెముసుట్టి పిల్లఁగ్రోల్లు
కేలఁ బట్టి గోవులబడిఁ గేళిసలుపఁ, జూడఁ గంటి నాకిది యేమి సుకృతఫలమొ.

శా. ఏ నచ్చోటికి నెమ్మిఁబోఁ దడవ సర్వేశుండు సర్వాదరా
నూనంబై నవిలోకనం బొలయ నన్నొక్కింతభావించిన
న్లైన న్నాజననంబు ధన్యము త్రిలోకాచార్యుండ నేనొక్కఁడన్
గానే సంయమికాంత్య మిప్పరమమాంగల్యంబు సామాన్యమే.

క. బలభద్రసహితుఁ డగునా, జలజాక్షుఁడు నేఁడు నాకు సన్నిధియగు వీ
డ్కొలిపెద నింతటితోడం, గలుషజరామరణబహుళశర్మజ్వరముల్.

క. అని తనలో నుప్పొంగుచు, ననఘుఁడు కృతకృత్యుఁ డగుచు నక్రూరుఁడు చ
య్యనఁ గంసుని నామంత్రణ, మొనర్చి పురివెడలె నపుడ యుత్సవలీలన్.

వ. ఇక్కడఁ గంసుం డవ్విధంబున వసుదేవు నధిక్షేపించి యాడినమాటలకు యదు
ప్రవృద్ధు లందఱుఁ జెవులు మూసికొని యిద్దురాత్మునకుం గాలంబు నిండె నని
తలంచి రందులో నంధకుం డనుపేరుగలయాదవప్రవరుం డాయాగ్రసేసి నాలో
కించి యిట్లనియె.

ఉ. అక్కట రాజవంశమునయందు జనింపనివానియట్లు నీ
వెక్కడనేనిఁ గల్గి యిటు లేమిటి కేనియు వచ్చినట్లు శ్రీ
దక్కి వనంబులో జడలు దాల్పఁగఁ బోయెదునట్లు బుద్ధి నెం
డొక్కటి సూపకిమ్మెయి దురుక్తుల నొంచితె వృద్ధబాంధవుల్.

ఆ. నీకు వగవ వలదు నీవు పుత్రుఁడవు గాఁ, దొల్లి నోఁచినట్టితల్లితండ్రు
లధికశోచ్యు లన్వయాంతకారివి నిన్నుఁ, గనినకులము నింత గనుట యరుదె.

క. తనుఁ దాన పొగడికొనినం, గనునే నిజగుణము లధికగౌరవమును స
జ్జనసేవ్యములై యవి పే, ర్చినఁ గలుగుం గాక యెందుఁ జరగురుత యిలన్.

శా. నీకుం జూడఁగ నీదుమాటలు కడు న్నిక్కంబులై సత్యము
న్లోకౌచిత్యముఁ దప్పకున్నకరణి న్బోభిల్లె నీభంగియం
దే కార్యంబు ఫలించె నీవ చెపుమా యేవంబుగా నాత్మమ
ర్మాకారస్థితితోడ బేలుపడి తిన్లైరే నృపుల్ ప్రాక్తనుల్.

క. తగ వెఱిఁగి మానఘనుఁడై, నెగడి యనవలిప్తమార్గనిష్ఠుఁ డగుబుధుల్
మొగము సెదరంగఁ బలుకుట, జగతీసురవధముతోడ సరియనిరార్యుల్.

క. విను వంశవృద్ధు లభిపూ, జనములకును భాజనములు సత్కృతు లగున
య్యనలములయట్లు వారల, కనలుట భస్మీకరించు ఘనునైన వెసన్.

తే. జలములోనమత్స్యంబులు మెలఁగుజాడ, తెలియఁగరానిచందముబుధు లిచ్ఛనడచు
తెరువులన్యుల కెఱుఁగుటయరిదివానిఁ, దానుదాంతుఁడై శాంతుఁడై తడవవలదె.

క. పావకునకు నభిమంత్రిత, మై వేల్వఁగఁబడినహవ్య మధికసముద్వే
గావహ మైనట్లు బుధుల, కేవము లగుజడునిమాట లెద యెరియించుర్.

వ. నీవు వసుదేవునిఁ బుత్రగోపనం బొనర్చె నని నిందించితి బిడ్డలఁ దమయోపిన ట్లాపదలం బొందకుండం గాచికొనక యూరక చావ నిత్తురే మీతల్లిదండ్రులు ప్రయత్నంబునం జెంపక రక్షింపక యింతటివాఁడ వెట్లైతి పుంనామనరకంబునం బడకుండఁ శ్రాద్ధంబు సేయుపుత్రుం బోషింపక యుండవచ్చునే వసుదేవనిం దయు వాసుదేవద్వేషంబును బాటించుట కులంబువారి కెల్లను విషంబు ద్రావ నిచ్చుటగా నెఱుంగుము నీయాడినకీడుమాటలకు మామనంబు లన్నియుం గ లంగె నేము విడిచి తొలంగిన రాజవై యుండుటకుం జాలుదె నీయట్టినీచు ననా చారు నవిచారులమై వాత్సల్యంబువలన విడువంజాలక తన్నుకొనుచున్న నరా ధములము మమ్ము నిందించుకొందుము గాక యెం డేమి యందుము రామదా మోదరులం దొడరి బ్రతుకువాఁడ వై తేని నీచేసినతపం బెవ్వరికిఁ గలదు భవ ద్వినాశపిశునంబు లగుదుస్స్వప్నంబులు మృగపక్షిచేష్టితంబు లనేకంబులు నూ చెదము దేవతాప్రతిమలు చలించుటలు నుల్కానిర్ఘాతంబులు పడుటలును సూ ర్యచంద్రమండలంబులు ప్రచండకబంధగ్రసనాదివైకృతంబులం బొందుటలును బాపగ్రహంబులు క్రూరరాసుల వక్రించుటలు మొదలైన వెయ్యవిదైవజ్ఞులు రాజవ్యపాయంబునకు గణియింతు రట్టినిమిత్తంబు లన్నియుం గలిగి యున్న యవి మీఁద లెస్సయగుట యత్యంతదుర్లభంబు.

మ. నిను భూనాథునిఁగాఁగఁ గొల్చి మనముల్ నిత్యంబు సంతాపమున్ దనుకం గ్రుళ్ళుచునున్నచుట్టములలో ధన్యాత్ముఁ డొక్కండె యెం దును నక్రూరుఁడు వాసుదేవు జగదాద్యు న్విశ్వవంద్యు న్మహా మునిహృద్ధ్యేయునిఁ జేరి చూడఁ గని సమ్మోదాఢ్యుఁ డయ్యెందుదిర్.

మ. హరి నిర్భి కెన్నఁడు చూతు మెట్లతనిసౌహార్దంబు చేకూరునే వెర వద్దేవునినాశ్రయింప నతని న్వీక్షించి యాచూడ్కి యే నెరనుం బొందకయుండ వచ్చి మముఁ దా నెమ్మిన్ మహాభాగ్యసుం దరుఁ డక్రూరుఁడు చూచుఁగాత దురితధ్వాంతచ్ఛిదాశౌండతన్

వ. అది యట్లుండె నింక నొక్కటి గలదు వినిమెదవేనిం జెప్పెద.

శా. గోవిందుం డిట వచ్చినప్డు సకలక్షోభంబుగా నీకుఁ బ్రా ణావచ్ఛేద మొనర్చునట్టిదశ బిట్టై వచ్చుఁ దప్పింపరా దే వీరుల్ నిమఁ గూడికేనియును నీ వీలోననే పోయి యా దేవుం బ్రీతియొలర్పఁ దేర్పుము శుభోత్సేకంబు సంధిల్లఁగన్.

వ. ఇట్లు సేయనొల్లవై తేని నీవ యెఱుంగు దనిన యంధకువచనంబులకుం గ్రో
ధాంధలోచనుండై యాక్షేపశిథిలితోత్తంసుం డగుకంసుండు దిగ్గన లేచి పోయెం
దక్కినయందఱు ధిగ్వచనంబులం దమతమమందిరంబులకుం జనిరి తదనంతరంబ.

కేశియనురాక్షసుఁ డశ్వరూపధరుండై శ్రీకృష్ణునకుఁ గీడుసేయఁబూనుట.

శా. అక్రూరుం డటఁ బోకమున్న మధురేశాజ్ఞప్తుఁడై కేశినా
మక్రూరాసురుఁ డశ్వరూపమున నున్మాదాతిరేకంబుచే
నాక్రాంతం బగునంతరంగమున బృందారణ్యముం జొచ్చి దో
ర్విక్రాంతిం జరియించె గోపకుల ముద్వేగిల్ల వేగోద్ధతిన్.

సీ. వెనుకకాళులు రెండు వీఁకమై జోడించి తాఁచుఁ గొన్నింటి డెందములుపగుల
ఘనకరాళోగ్రవక్త్రంబునఁ గబళించి కఱచుఁ గొన్నింటిఁ బెన్గండ లురుల
నుగ్రపాతమునఁ బై నుఱికి ఖురంబులఁ ద్రొక్కుఁ గొన్నింటిఁ దుత్తుమురుగాఁగఁ
బ్రకటవేగంబు దుర్వారంబుగా బిట్టుదాఁకుఁ గొన్నింటి గాత్రములు వ్రయ్యఁ
గండమున వెంట్రుకలు భయంకరతఁ జెదరఁ
గన్నుఁగొనల నిప్పులు రాలఁ గర్ణయుగము
బిగిసి వెఱపుపుట్టింప నిప్పగిది నసుర
గోగణముఁ జంపెఁ బరిమార్చె గోపతతుల.

తే. పసులనెత్తురు గ్రోలుచుఁ బసిగమునుజ, పలలములుదించుఁ దిరుగునాఖలునిచెద్ది
గతిపయూహంబులంద యక్కానకాటి, కరణిబహుళకపాలాస్థిసంకటము నొందె.

వ. ఇవ్విధంబున నెవ్వాలనను గోవులకుఁ జరియింపరాక యేదెసల మెలంగుత్రోవలు
గట్టువడియె నేవెరవున నీయాపద దరియింతు మేమిసేయుదుము కృష్ణుండు
నూరకయున్నవాఁ డేది శరణం బనుచు వ్రజౌకసు లెల్లం దల్లడిల్లుచుండ
నొక్కనాఁడు.

మ. అడవిం గోల్పడుప్రాణి యెయ్యదియు లేకాటోప మేపార న
చ్చెడుగం డుగ్రతఁ దద్వ్రజంబు దెసకున్ శీఘ్రంబ యేతెంచె ను
గ్గడువై మేను దలిర్ప హేషితము లాకాశంబుఁ బూరింప దం
దడిఁ బాదాహతమై మహీరజము గ్రందం బర్వ సర్వాశలన్.

వ. దాని నంతంతం గని వ్రేపల్లెం గలగోపాలురు గోపికలును సబాంధవంబుగాఁ
గృష్ణకృష్ణ రక్షింపు రక్షింపు మనుచు నాజగన్నాథుదిక్కునకుఁ బఱతెంచినం
గని యోడకుం డనుచు నద్దేవుండు.

క. నీపాలిమిత్తినై యిదె, యేపున నున్నాఁడ నిచట నెదురఁ దురగరూ
పోపహిత దుష్టదానవ, వే పఱతె మ్మనుచుఁ గేలు వ్రేయుచు నార్వన్.

శ్రీకృష్ణుఁడు కేశిమారొ్కనిఁబోరి మృతిఁబొందించుట.

వ. తదీయకరతాడనధ్వానంబు సైరింపక.

మ. ప్రళయార్కుం గబళింపఁగోరి కడుసంరంభంబుతో రాహువుం
డల మార్తాకృతిఁజూపున ట్లధికచండం బైనవక్త్రంబు గ
ట్టలుకం బండులు గానరాఁ దెఱచి దేవారాతి యావీరుపై
బలియుండై కవిసె న్నభశ్చరులు సంభ్రాంతాత్ములై చూడఁగన్.

క. ఆగుఱ్ఱపుటసుర గడఁగు, లాగును హరి రిత్తచేతులన యున్ననిరు
ద్యోగతయుఁ జూచి కడును, ద్వేగంబున నిట్టు లనిరి ప్రేలాతనితోన్.

క. గోవింద యిద్దురాత్ముఁడు, గేవలతురగంబు గాఁడు కేశి యనఁగ దే
వావలి కవధ్యుఁ డగువాఁ, డేవిధిఁ గంసహితుఁ డైనయింద్రారి సుమీ.

క. మొన లేచ్చి నిల్పి పలువురు, జననాథులు వీనితోడిసమరమునకుఁ గా
క నివృత్తు లైరి నీవే, మిని హేగిరపడక కదియుమీ వెర వొప్పన్.

వ. వీఁడు పాపకర్ముండు గావున వీనిచేసినపాపంబు రూపడంచు నించుక తెలివి పా
టించి పెనంగు మని మానుషబుద్ధు లగుటంజేసి హితంబు కోరి చెప్పినవారి
వాక్యంబులకు నెయ్యున నవ్వుచు నటుసూడుం డింక నీరక్కసు నెట్లు సేసెద
నో యిూరు సంతసిల్లుపౌరుషంబులు దొరఁకొనుట నాకుం బండువుగాక యేమి
భయం బేమియు సంశయింపవల దనుచుం గడంగి.

మ. అవతంసం బగుపింఛదామకము వేగాక్షిప్తపద్మంబులన్
సవిశేషస్థితిఁ జూప హేమపటకల్యాసుందరాందోళనం
బు విభాసిల్లుపిఱిందిదిక్కునకు నొప్పం బెంప వక్షస్థలి
న్నవలీలన్ వనమాల యుజ్జ్వలరుచిన్ నర్తిల్ల నద్దేవుఁడున్.

వ. సవ్యదక్షిణమండలపరిభ్రమణంబుల మెఱయుచు నక్లేశంబునం గేశిదిక్కునకుం
దఱిమిన నుఱక యయ్యసుర యిరుదెసలకు మొగంబు మురియించుచు గొరిజ
లతాఁకు ధారుణివలనం బటుపటహతాడనానుకారి యగుదారుణారావంబుఁ
బుట్టింప బెట్టిదంబుగా నడరె నట్టిసమయంబున హయదైత్యుండు నెగసి ముం
దటికాళ్లు రెంటను హరియురంబు ద్రొక్కుటకై నిక్కిన నక్కుమారుం డాచ
క్కటి దప్పించి యొప్పుగాఁ గ్రుంగుటయుఁ బాదపాతం బొక్కపార్శ్వంబునం
జెనఁటియై పోవం దదీయవక్త్రంబునం జెదరుఫేనశీకరంబులు శిశిరచంద్రునిం
బొమువుహిమకణంబులకరణిం గృష్ణునాననంబుపైఁ దొరఁగె నాలోన నాలోల
కుంతలుం డగుచు నొక్కింత తొలఁగి నిలిచిన జలజనయనుం బరుషరోషరూ
క్షేక్షణంబులం జూచి కంఠంబు విదిర్చి విచ్చి నిక్కి ముక్కుపుటంబులు దటతట
నదరఁ గుటిలదానవుం డందందం గాలుద్రవ్వి త్రుళ్లినపెల్లున నెగయుకెంధూళి

నీలవర్ణనీలం బగుమాళి యరవిందధూళి దొరఁగినశై వాలసంచయంబు చందం బున నందం బగునట్లు గావించె గోవిందుమీఁద వాఁడట వెండియుఁ జండగతి నందికొని వచ్చి చొచ్చిన నిచ్చటచ్చటఁ జరించుట మెచ్చు గాదనిన ట్లచ్చతుర విక్రముండు సుస్థిరవిక్రముండై ప్రతిరాజరాజమండలరాహువు వనం దగుతన బాహువు కుపితభోగిభోగంబునుం బోలె నిగిడించి యారక్తసుముఖబిలంబునం జొనిపి నాలుక మొదలంటం బట్టిన నెట్టన నతనికేలు విడిపించికొనం బ్రిదిలిపో వను గఅవను నెగుల్పను శక్తుండు గాక యశక్తుండై నక్తంచరుండు చరణం బుల ధరణిఁ దాటించుచు గ్రుడ్లు వెలికుఱుక సెలవుల నురువులతోడిలాల లు రుల బోలుచుఁ గుత్తుకయదర తోఁక యెత్తి శకృన్మూత్రంబులు విడుచుచు నడిచిపడి యసుఁలు విడుచు కొలందికిఁ జేరి చేష్టదక్కఁ గేశిముఖాంతర్గతం బగు నయ్యమనందనుకరంబు మేఘమండలంబులోనఁ దూఱినఘర్మాంతఘర్మకరునియు ద్దీప్తకరంబుపగిది శోభిల్లె నంతం గ్రమంబున జిహ్వ పెటికి పండ్లు రాల్చి తాలు వులు సెలసి కంఠనాళంబు దెఱపిసేసి యధరంబువ్రచ్చి యుదరంబు గలంచి ప్రేవులు చిదిమి జీవునిం గదల్చి దామోదరుదోర్దండంబు దండధరుదండంబునకు సవతు గల్పించె నట్లు శౌర్యశిల్పంబునం బరఁగి యాచేయి యవ్విరోధికడుపు లోన నంతకంతకు బలిసిబలిసి పిక్కటిల్లినం గ్రకచంబునం బాపినట్లు రెండువ్ర య్యలై దైతేయుకాయంబు మహీతలంబునం బడిన వజ్రధారాదళితం బైన ధాత్రీధరంబుభంగి యయ్యె నిశాచరుదశనాగ్రంబులు సోఁకి జీరలువాఱినవాసు దేవునిభుజంబు వన్యదంతావళదంతకాండక్షతభూషితం బగువృద్ధతాళద్రుమంబు ననుకరించె నివ్విధంబున నరివధం బాపాదించి యపూర్వలక్ష్మీవిభాసితుండై యు న్న వెన్నునిం గనుంగొని.

ఉ. గోకులవాసు లందఱును ఘోరవిపజ్జలరాశి యీఁది యు
త్సేకసమగ్రులై యెలమిఁ జెందిరి గోపిక లేగు రెంచి యా
లోకనపుష్పదామముల లోలత ముంచిరి గోపవృద్ధు ల
వ్యాకులబుద్ధులై నుతిశతార్చనభంగులఁ గొల్చి రాతనిన్.

కేశినాశంబునం బ్రీతుండై నారదుండు శ్రీకృష్ణునినభివర్ణించుట.

వ. అయ్యవసరంబున నారదుం డంతరిక్షంబునం దంతర్హితుండై యుండి పుండరీ కాక్షుం బేర్కొని తనపేరు చెప్పి.

ఉ. ఎయ్యెడఁ గయ్యము ల్గలవొ యెవ్వరు చివ్వల కుత్సహింతురో
క్రయ్యక యంచుఁ గోరి వెసఁ గ్రుమ్మరుచుందును నెందు నేను నేఁ
డియ్యెడఁ జూచితిం గలిగి యేఁకటవ్రావ భవత్పరాక్రమం
బయ్య కుమార యిప్పనికి యర్థిమెయిన్ దివినుండి వచ్చితిన్.

క. ఇంతింతపౌరుషము లొ, క్కింతయు మసిముట్టకుండ నిటు సేయఁగ దై
త్యాంతక త్రిపురాంతకుఁ డొకఁ, డంతియ నీయంతవార లన్యులుగలరే.

మ. హయదేహుం డగునిమ్మహాసురుని వృత్రారాతియుం సంగర
క్రియలం దార్కొన నోపఁ డట్టిబలియుం గ్రీడాయితస్ఫూర్తి వి
స్మయసంపాదనిగా జయించితి మదిం సంప్రీతి నేనొందితిం
జయ మెల్లప్పుడు నిట్ల గైకొనుము సత్సమ్మోదసంపాదనం.

తే. క్లేశ మొక్కింతయును లేక కేశి నిట్లు, గీటడంచి జగత్త్రియ క్లేశముడిపి
తట్లుగావున గోవింద యఖిలమునను, నీవు కేశవుం డనుపేర నెగడు దింక.

ఉ. పూతనఁ గూల్చు టాదియగుభూరివిభూతులు సూచి యెంతయుం
గౌతుక మొప్ప నీదెసన కన్నిడి యుండుదు నింక భారత
క్ష్మాతలనాథులుం బెనఁగుకాలము చేరువ యయ్యెఁ దత్సమా
ఘాతనకేళికై యిటులు గాదె జనించితి నీవు మేదినిం.

వ. కంసవధానంతరంబ చతురంతధరణిం గలధరణీపతులు నిన్నాశ్రయించెదరు రా
జాసనస్థితుండవై రాజుల నొండొరులతోడం దలపెట్టి నీపుట్టినపని తుదముట్టం
జేయుము మరణభాజు లగుభూభుజుల కర్హంబు లగునగర్హితస్వర్గంబులు వర్ణించి
దివిజపతి విభజించుచున్నవాఁ డీదృశంబు లగుభవదీయకర్మంబు లఖిలంబులును
శ్రుతిపురాణపరిగణితంబులై విప్రగణంబులవలన వెలయం గలయవి.

క. నీవవనీదేవతలను, దేవతలుగఁ జూతు వారు తిరముగ నినుఁ జే
తోవృత్తి నూఁది యుండుదు, రేవిధమునఁ బ్రోవుమయ్య యెప్పుడు వారిం.

ఉ. ఆద్యుఁడ వాదిదేవుఁడ వనంతుఁడ వుత్తమబోధరూపతా
హృద్యుఁడ వుద్యతాఖిలసహేతుకసృష్టివిధాయి వుద్భవ
చ్ఛేద్యనవద్యవీర్యుఁడవు సిద్ధుఁడ వీవు భవన్నమస్క్రియా
స్వాద్యసుధారసం బెపుడు చాలఁగఁ గల్గెడు మాకు నచ్యుతా.

వ. అని సంభాషించి నారదుం డరిగె నయ్యుదారఫణితులకుఁ బ్రణయప్రమోద
మేదురమానసుండగుచు మాధవుండు తత్కాలసమాగతు లయినసఖులుం దా
నును ననురూపాలాపంబులఁ గొంతసేపు వినోదించి తదనంతరంబ నిజేచ్ఛనుండె
నంత నిక్కడ.

క. వరతురగంబులఁ బూనిన, యరదముతోఁ బురము వెడలినదియాదిగఁ ద
త్పరమతి నెందును నిలువక, తెరు వక్రూరుండు నడచె దివసం బెల్లం.

వ. ఇట్లు నడచి వ్రేపల్లెఁ గదియునవసరంబున.

మ. తనగోవుల్ నిఖిలాశలం జెదరి మోదంబార వర్తింపఁగా
దినవిచ్ఛేదమునందు వానిఁ జరమాద్రిప్రాంతకాంతస్థలం

బునకుం దెచ్చె నితండు గోపతి యనంబోలు న్నిజం బింకఁ దా
నును విశ్రామముఁ బొందఁ బొమ్మనఁగ భాసుం డేగెనస్తాద్రికిన్.

ఉ. అప్పుడ యశ్వరూపధరుఁడై నమహాసురు వ్రచ్చి నెత్తుటన్
దొప్పఁగఁదోఁగి యున్నవతోయజనాభునిమేనితోఁ గరం
బొప్పఁగ మచ్చరించుక్రియ నుష్ణకరాస్తమయంబుపిమ్మటన్
గప్పెడుక్రొత్తసంజ గడుఁగాంతివహించె నభంబు గన్గొనన్.

తే. కేశి ననిలోనఁ గూల్చినఁ గినిసి బహుని, శాచరశ్రేణి కృష్ణుపై సమదవృత్తి
నెత్తి తోతెంచెనో యననెల్లదెసలఁ, గ్రమముతోఁబర్వె ఘోరాంధకారవితతి.

మ. ఇనుఁ డస్తాద్రికి నేగె నింతటన యిం కేనాత్మతేజంబు చ
య్యన నుద్దీప్తము సేయకున్న భువనం బత్యుద్ధతధ్వాంతసం
జనితోగ్రాపదఁ బొందదే యనుచుఁ దా సంరక్తుఁడై వచ్చుచా
డ్పున నున్మీలితకోచి యయ్యె విధుఁ డాపూర్ణాకృతిం బ్రాగ్దిశన్.

క. తారకములచేఁ గడునొ, ప్పారెడుదివి యొప్పిదంబ యబ్బెఁ దగదె యీ
గారవ మనఁగా భువియుం, గైరవవికసనవిలాసకలనఁ దనర్చెన్.

వ. ఆసమయంబునం జంద్రోదయోల్లాసంబున భాసమానంబు లగుగోసహస్రంబు
లజస్రతరంగంబులుగా నత్యంతసంకులంబు లైనగోవుల వేఱువెఱ పిలుచుగోపా
లకులమెలుంగులను దుహ్యమాన లగుధేనువులదుగ్ధధారానివహంబుల నితాం
తనినదంబుల నొండొంటిం బ్రేముడించి సమ్ముఖంబు లగుదాగ్ధ్రివత్ససముదయం
బులవిపులధ్వానంబుల నెక్కుడ మ్రోతగా మ్రోయుచుం బయఃపయోధిం బురు
డించునందగోపునిఘోషంబునకు నవిరతరథనినాదమధురంబుగాఁ జనుదెంచి
యక్రూరుండు తదీయమధ్యంబున ననంతసహితుం డై యున్నయాదిదేవు నాది
మూర్తిపగిదిఁ దదభిన్నభావుం డగుబలదేవుండునుం దానును విలసిల్లువాసుదేవు
నంతంతం గని హర్షతరంగితం బగునంతరంగంబును బాష్పధారాపరిప్లుతం బగు
నపాంగంబును బులకపరికలితం బగునంగంబునునై యతండు.

మ. ఇతఁడే విశ్వగురుండు సర్వవరదుం డీశుండు నారాయణుం
డతిలోకాద్భుతభూరివిక్రముఁడు దేవార్థంబుగా ధాత్రి కా
గతుఁ డైనాఁ డితనిం బ్రమోద మెసఁగంగా నిట్లు గంటిం గృతా
ర్థత నే నొందితి మత్సమాను లిటఁ దథ్యం బెవ్వ రీయంతటన్.

క. త్రైలోక్యమోహనం బగు, లాలితనవయౌవనంబు లక్ష్మీపతి కు
న్మీలిత మైనది వినమే, బాలక్రీడలు విచిత్రభంగులు గావే.

చ. వెలికిలి సెజ్జమీఁదఁ గడు విప్పగుకన్నులచాయ లొప్పఁ జె
క్కిలి గిలిగించి వ్రేతలు నగింపఁగ నుండుట యాదిగాఁగఁ జె

స్సులరెడునిమ్మహాత్మునిసమంచితశైశవముం గ్రమంబుతో
విలసితదృష్టియం దనుభవించినయాజను లెట్టిధన్యులో.

తే. అయ్య శ్రీకృష్ణ యిందురమ్మనుచుఁబోయి, కౌఁగిలింతునొయటుగాక కమలనాభ
యాదిపురుష సర్వేశ్వర యని ప్రణామ, మాచరింతునొ రెండుగృత్యములు నాకు.

వ. అనుచుఁ దదీయదివ్యరూపంబు నిరూపించి నిర్నిమేషంబులగు వీక్షణంబులతోడ.

సీ. గోపికానయనచకోరపూర్ణేందు వివ్వదనంబు మధురవాగ్వైభవంబు
లక్ష్మీస్తనాభోగలాలితం బిమ్మహావక్షంబు శ్రీవత్సలక్షణంబు
దైత్యనిర్మథనదుర్దాంతదివ్యాయుధాఢ్యంబు లీభుజము లత్యాయతములు
త్రైలోక్యనిత్యశరణ్య మీచరణద్వయంబు నిసర్గరక్తాంగుళీక
మితనికే కాక యమరునె యితరమూర్తి, కీసలన్మేఘసమవర్ణుఁ డీసువర్ణ
వర్ణవాసుఁ డీకౌస్తుభోద్దీర్ణహారుఁ, డచ్యుతుండు సర్వదేవతాభ్యర్చితుండు

క. మునుమున్న కాదె యార్యులు, వినుతనిజజ్ఞానదృష్టి విధిఁ దిరముగఁ గ
న్గొని కడగట్టినవారీ, తనియాదృశభావచేష్టితము లఖిలములున్.

వ. ఈనారాయణదేవుండు దేవాదిచతుర్విధభూతహితంబు గోరి దేవకీ గర్భంబున నుద్భవించి వసుదేవుప్రయత్నంబునం బెరిగి వ్రేపల్లె నుల్లసితబాల్యయౌవనవిజృంభితంబు లగువిహారంబులు క్రమంబున నాదరింపం గలవాఁడు తొల్లి బలి నడంచి బలసూదనునకుం ద్రిలోకాధిపత్యం బొసంగినకరణిఁ గంసు వధియించి యుగ్రసేనునకు రాజ్యం బిచ్చి తాను రాజు గానొల్లక యుండెడు నఖిలరాజన్యులు ననన్యసంశ్రయులై తనశాసనం బొనర్ప దర్పంబున నాత్మీయవంశ్యు లెవ్వరిం గైకొనక పృథ్వియంతయుం దారకైకొనం గులంబు వెలయించు నిదియంతయు నేను మహాత్ములవలన వింటి నిమ్మహాదేవునకు నభివందనపూజాస్తోత్రాదులు పవిత్రనిష్ఠ ననుష్ఠించి గరిష్ఠం బగుభద్రంబు నొందెద.

ఉ. ఈతనియట్లు సత్కృతుల కెల్లను బాత్రము రాజతాద్రితు
ల్యాతతశుభ్రదేహుఁడు మహాభుజుఁ డీబలభద్రుఁ డప్రతీ
ఘాతము లైనవిక్రమవికాసములం దనభూతభావిలీ
లాతతి నుజ్జ్వలంబుగ నలంకృతి సేసినవాఁడు మేదినిన్.

క. శ్రుతవంతు లైనవిప్రులు, శ్రుతివిధులం జొచ్చి యరసి చూచి యెఱుఁగుదుర్
కృతమతులై యివ్విష్ణుని, యతర్కితానేకవిస్మయావహమహిమల్

అక్రూరుండు వ్రేపల్లెకువచ్చి శ్రీకృష్ణుని దర్శించుట.

వ. అని తలంచుచు ససంభ్రమగమనంబునం జని గోపాలదేవు శ్రీపాదపద్మంబులకు నిజగోత్రనామసముచ్చరణపూర్వకంబుగాఁ బ్రణామంబు సేసినం బ్రీతుండై యెత్తి కౌఁగిలించికొని యప్పరమేశ్వరుండు కుశలం బడిగి బలదేవసహి

తుండై యతని నభ్యంతరగృహంబునకుం దోడ్కొని చని యథోచితప్రతిపత్తి యాచరించె నక్రూరుం డతిక్రూరవక్షుం డగుపుండరీకాక్షు సాక్షాత్పరిరంభణంబున నపగతదోషభారసౌష్ఠవంబును దత్కృతపరిపూజనంబునం బ్రాప్తసుకృతసంగ్రహగరిష్ఠంబును దదాలోకనాదరంబున విగళితమోహంబును నగునిజదేహంబు మాహాత్మ్యంబునకు భాజనంబుగాఁ గృతప్రయోజనం బగుజననంబునం బరఁగినవానింగాఁ దన్నుం దలంచుచు నాతఁడంబ నందగోపాలాదిగోపాలుర నందఱ రావించి.

మ. తనసంపూజ్యశరాసనంబునకు నుత్సాహంబుతో నుత్సవం
బొనరింపంగఁ దొడంగెఁ గంసుఁ డురుబాహుం డోలి మీమీయరుల్
గొని రండామెతకుఁ ఘృతప్రముఖముల్ గూడంగఁ దెం డింతప్రా
ద్ద నెటి న్వెల్వడి యేగుఁ డమ్మధురకుద్యత్ప్రీతి సంధిల్లఁగన్.

వ. ఆరాజపుంగవుం డీరామదామోదరుల నుదారవీరవ్రతధౌరేయులఁగా వినియుండుం గావున నమ్మహోత్సవకాలంబున వీరినిం గనుంగొనువేడుక నిటఁ బుత్తెంచె రేపు రథారూఢులం జేసి తోడ్కొని పోయెద మీరు ముందరఁ గదలుం డని చెప్పి నంత నుచితక్రియానంతరంబ.

మ. అతఁడుం దానును నొక్కబంతిన విచిత్రాహారము ల్గోరస
ప్లుతిహృద్యంబులుగాఁగఁ గైకొని దయాలోలాత్ము లారోహిణీ
సుతదామోదరు లొక్కచోటన మహాశోభాఢ్యశయ్యాపరిం
జతురప్రీతి శయించి కార్యకథనాసంసక్తిమై నున్నెడన్.

వ. ఆరహస్యస్థలంబున నక్రూరుండు దనుజారి కిట్లనియె.

మ. జననిం బుట్టినయప్డు పాసి యడవిన్ జాత్యంతరాభారసం
జనితం బైనలఘుత్వ మిట్లొలయఁగా సంవృద్ధిఁ బ్రాపించి నీ
వనఘా క్రీడలు సల్పి తింక వల దీయాసంగ మాత్మీయమై
చనువంశంబును శీలముం గడుఁబ్రకాశం బొందఁజేయం దగున్.

మ. యదుభోజాంధకకోటికెల్ల నొడయుం డాకంసుఁ డారాజుపం
పు దగం జేసినవాఁడవై మధురకున్ భూరిప్రమోదంబుతో
యదువీరోత్తమ రమ్ము కార్ముకమహావ్యాజంబునం బేర్చుత
ద్విదితశ్రీవిభవం బపూర్వగరిమన్ వీక్షింపు పెంపేర్పడన్.

——— అక్రూరుఁడు శ్రీకృష్ణునితో దేవకీవసుదేవుల పరితాపంబు చెప్పుట. ———

వ. అటమీఁద నెయ్యది కర్తవ్యం బది నీవ యెఱుంగుదు వింక నొక్కటి యాకర్ణింపుము.

మీతండ్రి వసుదేవుఁ డాతతయశుఁ డిట్టి సుతుల నిద్దఱఁ గన్న సుకృతశాలి
యనిశంబు గంసభయంబున డెందంబు తటతటనదరంగఁ గుటిలుఁడైన
యవ్విపక్షునిచేత నవమానవాక్యచయంబులం బడిపడి యాసమాలి
కన్నప్డ కొడుకులఁ గానపా ల్పఱిచి తాశోకంబు ప్రాణసంశోషకముగ
నున్నవాఁ డమ్మహాత్ముని నుద్ధరింపఁ, దగదె యిఁక నెన్నఁటికి నీయుదారశక్తి
చూచెదవు గాదె యావృద్ధునీచనృపతి, చేత నేభంగి కాఱియఁ జివికినాఁడొ.

క. కొలువున నెక్కొకమఱి యా, ఖలుఁడు భనజ్జనకుఁ బలుకఁగాఢిపలుకులం
బలుకఁగ విని యేమెల్లం, దలలు వనట వ్రాల్తుమశ్రుధారలు దొరఁగన్.

క. వసుదేవుపాటుకొలఁదియ, యసదృశచారిత్ర మైనయాదేవకి పు
ణ్యసతీతిలకము మీతల్లి సతతముం బొక్కుతెఱఁగు లెక్కింప మదిన్.

సీ. దుఃఖాతిభరమునఁ దొమ్మిదినెల లుదరంబున భరియించి క్రమముతోడఁ
గానంగఁ గానంగ గర్భము ల్దోడ్తోన కంసుఁ డొక్కింతయుఁ గరుణలేక
తునిమెడుదురవస్థ కనయంబు నోర్వంగ నమ్మనస్వినియ కా కన్యసతులు
గలరె యక్కట పుత్రు లెలమితోఁ గుడిచినచన్నులె యాతల్లిచన్ను లనఘ
యొఱఁగునే పూర్ణచంద్రుని నెనయునట్టి, నీదునెమ్మోము ముద్దియ ఖేదమునకు
గుఱుతుగలదెయాయమ్మకుఁ గొడుక వీవు, నెఱపవలవదె పుత్రత్వనియతఫలము.

క. విలయార్ణవమగ్న యయిన, యిల నాదివరాహమూర్తివై యెత్తవె యాప
జ్జలనిధి మునిఁగినజననిం, దొలఁగఁగ వెడలించు వెరవు దొరకొల్పుమదిన్.

చ. ఉడుగక కన్నునీరఁ గడు నొప్పఱి చాయలుచెడ్డకన్నులున్
వెడగఱవడ్డమోముఁ బటువేదనఁ గందినయంతరంగమున్
బడుగయి యున్నమేనునయి భామిని వత్సవిహీనధేనువుం
దడపఱుపంగవచ్చుఁ దనదైన్యము శూన్యతయుం గనుంగొనన్.

క. నీయట్టికొడుకుఁ బడసియు, నాయమ్మ దురంతదుఃఖ యగునేని సుత
శ్రీ యింతులకు నిరర్థక, మాయతవంధ్యతయ లెస్స యనఁగాఁ దగదే.

తే. అకట సర్వలోకంబుల కభయమిచ్చి, కావఁ జాలినవాఁడవు కన్నతల్లి
దండ్రు లిట్లార్తిఁ దలరంగఁ దలఁప కునికి, మెచ్చుగాదునావాక్యంబులిచ్చగింపు.

సీ. కాలాభుఁ గాళియుఁ గడఁకతోఁ బట్టి యేవెరవున వ్రేసితి విషముగ్రక్క
దుర్ధరతమము గోవర్ధనం బెత్తి యేకడిమిమైఁ దాల్చితి గొడుగుగాఁగ
దుష్టచరిత్రు నరిష్టుని ముట్టి యేయనువునఁ ద్రొక్కితి వసువు లెడల
దారుణబలుఁ గేశిదానవుఁ గిట్టి యేయేపున వ్రచ్చితి రూపడంగ
నాడిఁ బూతనాశకటఘాతాదులందుఁ, దెలివి దలకొంటి వట్టి యుగ్గలిక నేఁడు
నాత్మఁ బాటింపు మహితశోకాభితప్తు, లైనగురులు నిశ్శోకత నందుపనికి.

వ. అని యక్రూరుం డనేకక్రమంబులం జెప్పినవాక్యంబులయభిప్రాయం బంతయు
నెఱింగి కృష్ణుండు కంసధ్వంసనంబునకు సముత్సుకుం డయ్యె నందగోపాలాదు
లారాజునకు నయ్యేఁటం బెట్టవలయునప్పనంబులు పాఁడియావులు నెనుములుఁ
బొగరుకోడెలు నజావిప్రముఖంబులుఁ గొని గోరసంబులు చాలం గూర్చుకొని
వేగజాముగలుగం బయనంబయి కదలిరి తదనంతరంబ.

తే. తీపు మిగులునక్రూరునాలాపములకు, నుల్ల మపగతనిద్రమై యుల్లసిల్లె
నట్లుప్రియమందుచున్నదై త్యాంతకునకు, నరిగెనవ్విభావరిముహూర్తాభయగుచు.

క. రజని తనుఁబాసి పోకకుఁ, బ్రజనితభయతాపభరవిభావితవైవ
ర్ణ్యజితాత్మఁ డయ్యె నితఁ డన, రజనికరుఁడు దొలఁగె రుచిపరంపర యెల్లన్.

క. కలయఁ గడివ్రాయి యెందుం, జలితములై రాలె నాకసం బనుమ్రానం
గలపుష్పము లనఁ దారక, ములు గానఁగరాక యడఁగిపోయెం దోఁప్తోన్.

తే. వెరవుతోడ వేకువయనువెజ్జు తూర్పు, దిక్కుకెం పనుమందునఁ దీర్చి నెక్కొ
తిమిరకాలాహివిషమూర్ఛనము ననంగఁ, దెలిసె నెత్తమ్ములొప్పులుదలకొనంగ.

క గోవర్ధననిర్ఝరముల, పై వేమఱుసుడిసి గోపబర్హామయవతం
సావలి గదల్చుచును బృం, దావనపవనంబు మెలఁగెఁ దద్వ్రజ మలరన్.

చ. ప్రమదము లుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలువ్రాయి పల్మఱుం
గమియ నెమర్చి మే పఱుగఁగాఁ బొరిఁ బెండలు వెట్టి లేచి వ
త్సములఁ దలంచి పంచితిలి చన్నులు చేఁ పొదవంగఁ బెంపుతోఁ
గొమరుగఁ జారుహుంకృతుల గోవులు చెన్నువహించె మందలన్.

తే. పసులలోనన యెరువుతిప్పలఁ బరుండి, మేలుకని యాలఁ బిసుకఁగ మెలఁగుగోష్ఠ
పతులమొత్తనికడఁకప్రభాతమునకుఁ, దానతోడవయివ్రజమహోత్సవమొనర్చె.

సీ. కరమూలములజిగి గడలొత్తి వల్గత్కుచోపాంతకాంతుల నొత్తరింపఁ
దూఁగాడుహారపఙ్క్తులదీప్తి వెలవెల్లనగుదీపరుచుల నధఃకరింపఁ
జెదరుకుంతలముల నుదురుల నంటించి చెమట నేమ్మోములఁ జెలువుఁ బెంప
మంథనధ్వనులకు మార్మొని కమనీయకంకణచలననిక్వణము లెసఁగ
గౌను లులియంగఁ బిఱుఁదులఁగదలిమేఘు, లావళులు గదలింపనేత్రాంశులలరఁ
బెరువు ద్రచ్చుచు వేకువఁ బ్రేమమిగులఁ, బాడిరబ్జాక్షుగోపాలభామలెలమి.

క. కాళిందీసారసఘన, కోలాహల మద్రిధరునకును శుభయాత్రా
కాల మెఱిఁగించె సమ్మిళి, తాలోలరథాంగమిథునహర్ష ధ్వనులన్.

వ. అంత.

క. కంసాదిసురవిరోధి, ధ్వంసమునకుఁ బోవుకృష్ణు దర్శించుట కా
శంసఁ జనుదెంచె ననఁగా, హంసుఁడు ప్రాక్పర్వతంబునం దుదయించెన్.

వ. అయ్యవసరంబునఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి యక్రూరుం డటమున్న కృతకర్తవ్యుండై యున్నగోపాలమధ్యశోభితుం డగునప్పద్మనాభుం గాన నరుగు దెంచి.

సీ. శ్రుతిసీమంతపదంబులం బ్రకటమై సుస్నిగ్ధసిందూరసాం
ద్రత రంజిల్లెడువాసుదేవుచరణద్వంద్వంబు గోష్ఠస్థలీ
గతుల న్మాతెనగోమయంబుల ననర్ఘశ్రీఁ దలిర్చె న్మహా
ద్భుత మీయొప్పిద మంచు భక్తివినయస్ఫూర్జత్సమస్తాంగుఁడై.

అక్రూరుండు శ్రీకృష్ణబలరాముల మధురకుఁ దోడ్కొని పోవుట.

వ. ఇదె రథంబాయితంబై యున్నయది యగ్రజపూర్వకంబుగా నారోహణంబు బొనర్పుమనిన నతం డట్లచేయం దాను సారథ్యంబు వహించి వ్రజంబు నిర్గమించి మధురామార్గంబు గైకొనియె నంత.

క. రేయిటనుండియుఁ గృష్ణునిఁ, బాయుటకుం దలరుగోపభామినులు నిజం
బై యప్పుడు హరివిరహ, వ్యాయతదుఃఖంబు దమ్ము నటు పొదువుటయుఁన్.

వ. కళవళించుడెందమ్ములతో నందఱు దరతరంబులై కూడి గోవిందుపిఱుందం దగిలి తమలోన.

శా. అక్రూరుం డనుపేరు వెట్టుకొని క్రూరాత్ముం డొకం డద్భుత
ప్రక్రాంతిం జనుదెంచి పద్మనయనుం బాపెం గటా యెంతయున్
వక్రంబై కడుఁగీడు సేయుటకు దైవం బిచ్చమైఁ బూనినన్
శక్రుం డైనను శక్తుఁడే యుడుపఁ దత్సంరంభ మేభంగులన్.

మ. కులమున్ శీలము మానమున్ మొదలుగాఁ గొన్నాఁడు మున్నన్నియు
గ్గలికం బ్రాణములుం గొనంగఁ గడఁగెం గాకేమి యీకృష్ణుఁ డే
వల నీతం డిటుపోవఁగా నిజధనుర్వ్యాపారముల్ సూప కా
వలరా జింతట నైపఁజాలునె మమున్ వామప్రతాపోగ్రతన్.

తే. ఏటిసంసార మని మన మితనివెనుకఁ, దెగువసేసి పోయితి మేనిఁ దిట్ల కాక
యుడువిపులిమానుసుల నేల యాదరించు, నగరకాంతలనలలంమఁదగిలియతఁడు.

క. కొన్నిటినాళులు గోమై, వెన్నుం డిల్లల మనకు వేడుక చెయ్యోల్
గొన్ని గఱపె దైవము యిం, కెన్నం డీపెన్నిధాన మిటసిద్ధించున్.

సీ. అదె యిదె లోలనేత్రాంశులు పర్వంగ నధికాదరస్నిగ్ధుఁ డగుచుఁ జూచె
నదె యిదె నెమ్మొగం బలరుమించుచు ముంప నాకూతకౌతుకి యగుచు నవ్వె
నదెయిదె చారుదంతావళి జిగి యొప్ప నాపూర్ణశృంగారుఁ డగుచుఁ బలికె
నదెయిదె భావంబు లనుభావముల నూన నభిమతార్థప్రీతుఁ డగుచు పొచ్చె

రండు కూడంగ వేగ పోదండు మనము, నీరథచ్ఛేది గాకుండఁ గోరి యాఁగి
యితనిఁ బోకుండ నాఁగుద మింతదలఁప, వారిఁ గొనిపోవ కిట్లు పోవచ్చుఁ దనకు.

తే. ఏల వ్రేపల్లెపెద్దవారిట్లు వెట్టి, గొనిరి కృష్ణుఁ బోనిచ్చినఁ గ్రూరులైన
రక్కసులులోనుగాఁ జేయుక్రందులెల్ల, నుడుపఁదమకుదిక్కెవ్వాఁడొరుఁడుగలఁడె.

చ. అని పల్కుమాట లాడుచును నప్పుడ చెందినదప్పి సంగముల్
దనుత వహించి భూషణవితానకము ల్సడలంగఁ గ్రొమ్ముడుల్
గనుకని వీడి యుజ్జ్వలశిఖామణు లొల్కఁగ నుత్తరీయముల్
చనుఁగవలం దొలంగి వివశస్థితి నెంచును దూలియాడఁగన్.

సీ. వెఱపులు పైకొని వెఱఁగుపాటులఁ బొంది చెమటలు పెల్లయి చేష్ట లుడిగి
వైవర్ణ్యములు పెంది వడఁకులు దొడరి యశ్రులు జాఱి గద్గదికలు గడంగి
రోమాంచములు పేర్చి వైమనస్యము లూని ప్రేమంబు నెలకొని కామ మలరి
తాపంబు లెసఁగి చింతలు విజృంభించి వంతలు మీఱుకొని విముగ్ధతలు బలసి
తనుకరాక గోవిందునిఁ దగిలి చిక్కి, వడిసచూపులు దిగువ నుపాయ మేది
కొఱలి మిన్నక నిలిచిరి గోపకాంత, లండఱును చిత్రరూపులయట్టికరణి.

వ. అక్రూరుండును నిజరథం బతిత్వరితగతిం జననిచ్చిన నయ్యంతు లాతేరిభూర
జంబు లోచనగోచరం బగునంతదాఁకఁ జూచుచుండి యనంతరంబ యాశాచ్ఛేద
నంబున ఖేదం బొదవఁ గ్రమ్మఱి రట భోజపతియు మధ్యందినకాలంబునం గా
ళిందిసేరి తత్తీరంబునం గదంబచ్ఛాయాశీతలం బగుసికతాతలంబున నిలిచి.

శా. ఏనెక్కించుకసేపు పుణ్యనదిలో నివ్వాళ కర్మంబుగా
స్నానాద్యుక్తవిధానము ల్నడపెద న్నావచ్చునందాఁక మీ
రీనిర్దోషమహీస్థలిన్ రథముపై నింపారఁగా నుండుఁ డ
మ్లానం బైనతృణోత్కరంబు హయముల్ సంప్రీతితో మేయఁగన్.

వ. అని పలికి సవినయంబుగా సంకర్షణదామోదరుల నిలిపి చని యతండు.

క. సరిబాహ్యాంతరశుచితా, పరుఁడై మును వార్చి తీర్థపరికీర్తనవా
గ్వరచనతోడఁ బ్రవాహం, తరము ప్రవేశించె నాభిదఘ్నజలములన్.

వ. చిరస్నానం బొనర్చుచుఁ గృష్ణనామోచ్చారణం బొనరించుచుం గ్రుంకి రసాతల
లోకంబు గని యందు వాసుకికర్కోటకప్రముఖనాగకులసంకీర్ణంబై సౌవర్ణరచ
నాసురుచిరం బగువినూత్ననవరత్నమండపాభ్యంతరంబున.

శ్రీ కృష్ణుం డక్రూరునకు యమునాజలంబులలోఁ దనమహానుభావంబు చూపుట.

సీ. ఫణసహస్రంబునఁ బ్రజ్వరిల్లెడురత్నదీప్తులు సందీప్తదీపములుగ
సర్వాంగనిర్మలచ్ఛాయావిజృంభణం బాలోకచంద్రికయై తలిర్ప
భరితదుర్విషనేత్రభారపరంపర లమృతాయతస్ఫూర్తి నలమికొనఁగ

నాలోలజిహ్వాలతావళి యుద్దామవిద్యుచ్ఛటాలీల విస్తరింపఁ
బొలుచుతనమేనిమీఁదఁ దలలు ప్రిదలశిరము, లెత్తినిలిచిపార్శ్వంబుల నెసక మెసఁగు
ముసలసీరతాళధ్వజంబులు దనర్ప, వెలుఁగుప్రభు ననంతుని భోగివిభునిఁ గనియె.

క. ఆతనియంకతలంబునఁ, బ్రీతిం గూర్చున్న దేవుఁ బృథుమేచకజీ
మూతనిభుఁ గమలలోచనుఁ, బీతాంబరుఁ గృష్ణుఁ జక్రభృత్కరుఁ గాంచెన్.

వ. కని భాగవతంబు లగుమంత్రంబులు జపియించుచు సహస్రనామవిఖ్యాతుం డైన యాసహస్రావతారు నుదారసహస్రకరసహస్రసదృశవిభావిభాసమాను వాసుదేవు దేవతారాధ్యు నాత్మమనస్సంకల్పితంబు లయినవివిధార్చనాద్రవ్యంబుల నవ్యాహతార్చనాతోషితుం గావించి తన్నుఁ గృతార్థుంగాఁ దలంచుచు జలంబులు వెలునడి వచ్చి.

ఆ. రథముమీఁద నున్న రామకేశవులదే, హంబులందుఁ దత్సమర్పితంబు
లైనయర్చనంబు లట్ల యుండఁగఁ జూచి యద్భుతంబు రెట్టియై జనింప.

వ. క్రమ్మఱ నుదకంబులోనుసొచ్చి యఘమర్షణజపంబుతోడంగూడ నిమగ్నుండై.

మ. మును భోగీంద్రునియున్నతాంగమున సమ్మోదంబుతోఁ గల్పితా
సనుఁడై శాంతిఁదలిర్చునిత్యవిభుతాసంపన్ను నారోహిణీ
తనయుం దన్మహితాంకపీఠగతుఁడై తానొప్పు శ్రీమంతు న
వ్వనజాక్షుం గనియెన్ సురాసురమునివ్రాతార్చ్యమానాత్ములన్.

క. కని వెలుపల నరదముపైఁ, దనరెడువీ రేల యీయుదకగర్భం బిం
తనయిట్లు చెంది రిది యె, ట్లని వెండియుఁ గ్రొత్తచోద్య మాత్మకు నెలయన్.

వ. యమునాహ్రదం బుత్తరించి యనుష్ఠానశేషం బనుష్ఠించి చనుదెంచి యెప్పటియట్ల సుందరస్యందనంబునుపరితలంబున నన్యోన్యవదనావలోకనలాలసులై విలసిల్లు బలదేవవాసుదేవుల నాలోకించి కదియ వచ్చినం గని కృష్ణుండు.

మ. తడవయ్యెం జని యాప్లవంబుతఱిఁ బాతాళంబులో నీరు నే
ర్పడ నేమేనియుఁ జోద్యమైనయది దృగ్భావ్యంబుగాఁ బోలు నె
క్కుడుసంభ్రాంతి ముఖంబున న్వెలసె నక్రూరాత్మ యక్రూర నా
వుడు నాతండు వినమ్రుఁడై స్ఫుమధురవ్యుత్పన్నవాక్యంబులన్.

వ. దేవాదేవర సన్నిధిచేయుటకంటె మిగులం జోద్యంబు లొండేయ్యవి యిక్కడ నగ్రజసహితంబుగా నీ విట్లుండి ప్రసన్నుండవై యక్కడ జలనిమజ్జనకాలంబునందును భవదీయసాన్నిధ్యంబు ప్రసాదించితి కృతార్థుండ నైతిఁ గమలాసనాదులకును నీయున్నరూపెఱింగి వినుతింప దుర్లభంబు నే నెంతవాఁడం గేవలవాత్సల్యనిమగ్నుండవై యనుగ్రహింపుము.

మ. జయసర్వాత్మక సర్వభూతవినుతా సంభావ్య సర్వజ్ఞ స
ర్వయుగోత్పత్తిసమాప్తికర్మకలనావర్ధిష్ణువిద్యావిని
శ్చయధౌరేయ సమస్తవిస్మయవిధాసంధాయకప్రక్రియా
నయనిష్ఠావనతార్తినోదనధురీణవ్యాప్తిరంజత్కృపా.

వ. అని వినుతించి యిక్కడం దడయవలవదు కంసుండు మీకు నెదురుసూచుచుం
డుఁ బ్రొద్దుపోకమున్న యతనిం గానవలయు విజయంబు సేయుము.

క. నావిని యల్లనగుచున, ద్దేవుం డదియట్ల నీవు దెలిపినత్రోవం
బోవఁగలవార మే మనఁ, గా వేఱొకఁ డెద్దియేనిఁ గలదే యనినన్.

వ. రథ్యంబులం దెచ్చి యుగంబునందు సంయోజించి భోజపుంగవుండు ప్రతోద
పాణియై రథంబు నడప నదియునుం జని యాలోహితార్కం బగుకాలం
బునఁ గంసనగరంబు ప్రవేశించె నప్పుడు కృష్ణుండు.

క. పుట్టినగోలెఁ బురశ్రీ, లెట్టివొ యెన్నఁడును జూచి యెఱుఁగనిమాకీ
పట్టున నించుకవడి యీ, పట్టణమున మెలఁగి చూడఁ బట్టదె యనఘా.

వ. కంససందర్శనం బైనపిమ్మటం జూచునంతటివిలంబనం బోర్వము దీని కొఱం
బడు మనిన నక్రూరుం డట్లకాక మీరట్ల చేయుం డిప్పటికి వసుదేవుసదనంబున
కరుగుకోర్కి యుడుగవలయు నట్టిదయైన నెందుచందంబై వచ్చుఁ గంసుండు
మీనిమిత్తంబున మీతండ్రిదెసం బరుసనై యున్నవాఁడు తన్ను మొగపడక
ముందర నతనిం గనిన నెంతయుం గలుషించునని చెప్పి వారినరదంబుడిగించి
తదాగమనంబు నృపతికి నివేదించుటకై ప్రమోదం బెసంగఁ జనియె నని య
క్రూరుచరితంబుసమధికరసభరితంబుగా వైశంపాయనుండు వివరించిన తెఱంగు.

శా. ధాత్రీధన్యపరిగ్రహా గురువచోదత్తస్థిరానుగ్రహా
మైత్రీతోషిత సజ్జనా పరిహృతోన్మార్గప్రమాదవ్యజనా
చిత్రోగ్రాజిధనంజయా నియమవచ్ఛేతస్థమృత్యుంజయా
జైత్రోద్యోగసదోత్థితా బుధకథాసామర్థ్యసంప్రార్థితా.

క. శక్తిత్రయధౌరేయా, యుక్తచతుర్భద్రసంప్రయుక్తోపాయా
భుక్తనిఖిలపురుషార్థా, రక్తసమస్తప్రజాభరణచరితార్థా.

మాలిని. శ్రుతసకలపురాణా సూక్ష్మబుద్ధిప్రవీణా, జితసకలసపత్నా స్వీకృతానేకరత్నా
కృతసకలసుకర్మా కీర్తనీయస్వధర్మా, గతసకలకళంకా కాంతిరాకాశశాంకా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానందసౌందర్య
ధుర్య శ్రీసూర్యనారాయణసుకవిసంభవశంభుదాసలక్షణాభిధేయయెఱ్ఱయ
నామధేయ ప్రణీతం బైనహరివంశంబునం బూర్వభాగంబునం దష్టమా
శ్వాసము.

## పూర్వభాగము – నవమాశ్వాసము.

క. శ్రీసాధకసుచరిత్రా, నైసర్గికసుజనతాభినందితగోత్రా
శాసనసమగుణజైత్రా, దేసటివేమాసమస్తధీరలలామా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నవ్విధంబున నక్రూరుం డరిగిన యనంతరంబ.

క. ఆలానవిముక్తములై, కేళిం గాంక్షించి కడఁగుఖేలన్మదశుం
డాలములుఁబోలె యదుశా, ర్దూలు రిరువురుం బురప్రతోళిగతులై.

వ. సర్వపదార్థజ్ఞానంబున నత్యంతప్రగల్భు లయ్యును మనుష్యభావంబుకతన నప్రగల్భులకరణిం దత్పురసౌందర్యంబు లాశ్చర్యసాయత్తంబు లగుచిత్తంబులతోడం జూచుచుం జనుదెంచుసమయంబునం బౌరు లాబాలవృద్ధనరనారీకంబుగా వారి నాలోకించుకౌతూహలంబునం గ్రిందుకొని యచ్చెరువు నొందుచుం దమలోన.

సీ. గోపవేషోజ్జ్వలు లీపురుషశ్రేష్ఠు లెందుండి వచ్చిరో యిందులోన
నీనవాంబుదవర్ణుఁ డింతయొప్పున రాజసుతుల ననేకులఁ జూచితిమెట్లు
గలదె యీచందంబు చెలువెవ్వరికి నృపోద్భవులకా నోపుదు రవయవముల
తీరున్నై ప్రేకని తేజంబు గడిఁదియై పొలుపారుదర్పంబుఁ బోల్చెఁజూడ
వీరి నిద్దఱఁ గాంచినభూరిపుణ్యు, లయ్యె లేవంశమునవారొ యమ్మ లెట్టి
నోమునోచినకులవర్ధనులొ యిచటికి, వీరువచ్చినపని యేమివిధమొ తలఁప.

క. మనకంసమహీపతి యీ, యనఘులఁ గనుఁగొనియె నేని నపుడనిజశ్రీ
కనురూపాధికృతులఁగా, నుసరింపక యున్నె కడుసముత్సుకత మెయిన్.

వ. అనుచుండం గాంతాజనంబులు దైత్యాంతకుం జూచి మన్మథమదోద్రేకంబునం బొదలునుత్సేకంబు వెలయ నంతర్గతంబున.

చ. మనసిజరూపతుల్యుఁడు కుమారజనోత్తముఁ డిప్పు డీపురీ
వనితలమానముల్ గొనఁగవచ్చినవాఁ డనుమాన మేటికిన్
గనుఁగొనినంతమాత్రన విఖండితశీలత నొంది రెల్లభా
మినులును సోయగంబు లుపమింపఁగ నిట్టివి యెందుఁగల్గునే.

క. తగిలినచూపులు మగుడం, దిగువఁగ లేమెత్తి యేమి తెలియఁగొ యింకి
సుగుణత తనుపుచు నెనసిన, పగిది మనోభావమోహపఙ్క్తులు గొనియెన్.

మ. అని యెవ్వా రచటం గనుంగొనిరి వా రచ్చోన కందర్పమో
హనబాణంబుల కగ్గమై వికచనేత్రాంశుచ్ఛటాలోలనీ
లనవేందీవరపత్రతోరణలతాలంకారత వ్వీథినెం
దును బర్వం బరతంత్రలైరి వెసఁ దద్రూపాతిసంగంబునన్.

వ. సమానవయస్కు లగుపౌరకుమారు లక్కుమారులం గని యుత్సుకభావంబులు
దిగువం దగిలి తోడన వేడుకం జని రిట్లుమధురాపురంబునకు నాతఁడాంబ నిజవీక్ష
ణక్షోభం బొనరించుచు నయ్యదుకుంజరు లొయ్యనఁ బరిభ్రమించి ముందట.

తే. పలుదెఱంగులమడుఁగుఁజీరలుపోలుపుగ,మడిచిమూటగఁగట్టియింపడరఁగొనుచు
నరుగురజకుని రంజకారాఖ్యుఁ గాంచి, రపుడు వాని నుద్దేశించి యచ్యుతుండు.

క. ఏమి మెడవాల యేమిరా, భూమీశ్వరు నర్థిఁ గానఁ బోయెదము సభా
భూమికిఁ జనియెడువారికి, శ్రీమేటిల్లంగ మంచిచీరలు వలయున్.

వ. కావున నీచేతిమంచిమడుఁగులు మాకిచ్చి లెస్సవ్వాఁడ వగు మనిన వాఁడు
కోపించి.

తే. అడవిలో గొల్లమందలయందుఁ బెరిగి, నారు లోకకం బేమియు నేర రెఱుఁగఁ
గంసనరనాయకుఁడు వేఁడ్కఁగట్టుచీర, లడుగుసంతతటివారె మీరు రకట యిట్లు.

క. నానాదేశంబులధర, ణీనాథులు గిట్టనిచ్చి నెఱిఁ బుత్తేరం
గా నెందును బహుమూల్యము, లై నెఱసినయట్టి వివి జనాధిపుమెచ్చుల్.

క. ప్రేలరులై వెడయఱపుల, నాలిగొనక పొండు తొలఁగి యనవుడు నాదు
ర్శీలు మెడమీఁదఁ గృష్ణుఁడు, వేలీలం గత్తిపెట్టి వ్రేసెం గినుకన్.

వ. ఇట్లు వ్రేసిన.

తే. ఉసులు సిరియును నెల్ల కిట్లొఱటుచాకి, యాదిదేవుని చెస వినయంబు దక్కి
యిహపరమ్ములు లేక యిట్లొగె భగ్న, కంఠుఁడై నేలపైఁ గూలి కాలుఁ గూడ.

వ. వానియాం డ్రెందఱేనిం దలలు వీఁడం బఱతెంచి యఱచుచు రాచనగరికిం
జెప్పఁబోయిరి పరమపురుషుం డాచీరల కట్టవిడిచి కనకభంగిపింగంబు లైనపరి
ధానంబులు దాను గట్టుకొని కువలయశ్యామంబు లైనవి రామున కిచ్చి తక్కిన
చీర లక్కడం జూడవచ్చినవేడుకకాండ్రకు వెఱవక కట్టుకొం డని కొన్నియిచ్చి
కొన్నిచించి నలుదెసలం బాఱవైచి యన్నిచుకొంపయంతయుఁ జిచ్చువైచి
నీఱుచేసి యట గడచి మాలకరివాడ చొచ్చి యందు.

క. గుణకుఁ డనుమాల్యకారుని, గుణవంతుని నెదురఁగాంచి గోవిందుఁ డతి
ప్రణయమున నడిగె నమ్మ్య, గ్గుణబంధము లయినసురభికుసుమచయంబుల్.

వ. వాఁడును వినయసంభ్రమప్రమోదంబులు ముప్పిరిగొన నిప్పురుషులు ధరణికిం
గ్రీడార్థం బరుగుదెంచినసిద్ధులొండె విద్యాధరులొండెం గావలయు నతులితప్ర
భావు లన్య్య లెవ్వరనుచు నెదుర్కొని మ్రొక్కి యక్కజంబు లగుప్రసూనదా
మంబులు సమర్పించి దేవరసొమ్ము దేవర కిచ్చుట యేమి చోద్యం బని వినయం
బులు పలికినం గైకొని యప్పువ్వు లన్నకు వలయునన్ని యొసంగి వనజనయ
నుండు దానును.

క. కొప్పునఁ జెరివియు నెంతయు, నొప్పమిగుల నఱుత వైచియును బాహువులన్
ముప్పిరిగొనఁగఁ జుట్టియు, నప్పు డపూర్వంపులీల యలవడఁ దాల్చెన్.

వ. ఇట్లు మాలాకారునిమాల్యంబులు మాంగళ్యంబులుగా ననుగ్రహించి వానికి మెచ్చి యవ్విభుండు.

మ. నినుమత్సంశ్రయ మైనలక్ష్మి కరుణాన్వీక్షించి యుష్మద్గృహం
బు ననంతోజ్జ్వలహేమరత్నతతి నాపూర్ణంబుఁ గావించు నీ
తనయుల్మన్మలు లోనుగా వరుస సంతానం బవిచ్ఛిన్నమై
ధనవంతం బగుమత్ప్రసాదమునఁ దథ్యం బింత పుణ్యాత్మకా.

వ. మదీయపూజావిధాయి వగుటం జేసి యక్షయం బగుమోక్షంబును భవదధీనంబ యనియె నప్పువ్వులావుండును దేవుం డిచ్చినవరంబు మహాప్రసాదం బని విన యావనతశాలి యగుమాలిం బరిగ్రహించె నవ్వసుదేవసూను లిద్దఱు నట రాజమార్గంబునం జనిచని.

శ్రీకృష్ణుండు కుబ్జయనుకంసదాసి ననుగ్రహించి సురూపం జేయుట.

క. అనుపమసుగంధివిస్ఫుర, దనులేపనభాజనంబు హస్తంబునఁ గై
కొనిచనుదానిఁ జపలలో, చనాబ్జ నొకకుబ్జఁ గనిరి సమదవయస్కుల్.

వ. కృష్ణుం డాకామినిమునుంగువచ్చి మొగంబునం జూడ్కి నిలిపి యియ్యనులేపనం బెవ్వరికిం గొనిపోయెదవనిన నది సవినయంబుగ నతని కిట్లనియె.

మ. కలపం బెవ్వరు గూర్చి తెచ్చినను నిక్కం బొల్లఁ డెల్లప్పుడున్
జలకం బాడి మదాగమంబ మదిలో నన్వార్చుఁ గంసుండు రా
జెలమి న్మెచ్చినగట్టువా లిదియనన్ హృద్యక్రియావిద్యఁ బే
శలనై యుండుదు నేను బోయెదఁ దదిచ్ఛాపూర్తి గావింపఁగన్.

వ. నిన్నుం బొడగని నామనంబు ప్రియం బందిన నింతయుం జెప్పితి దడయరా దిది జగన్నాథుమజ్జనసమయం బనినం బురుషోత్తముండు.

తే. ఏము పరదేశిమల్లుల మీనృపాలు, రాష్ట్రమును రాజ్యమును జూచి రమ్యమైన
వింటిపండువు గొనియాడువేడ్క నిచటి, కరుగుదెంచినారము సరోజాయతాక్షి.

వ. నిన్ను నీవ పొగడుకొంటి మాకు నూరక మెచ్చవచ్చునె నీచేతిగందం బిచ్చినం బూసికొని మఱి మెచ్చెదము మెచ్చి పోయి రాజురంగంబున మెఱసి నీవారమై యుండుట యొప్పదె యనిన నవ్వచనం గుబ్జ యబ్జనాభుం జూచి మేలుగాదె యట్లేని యిదె కైకొను మని యయ్యంగరాగంబు ననురాగంబుతో నిచ్చినం గొని యతం డగ్రజునకుం దొలుత సమర్పించి తానును నలందుకొని యనులిప్తశేషంబు తోడిదారకుల కిచ్చె నంత.

శా. స్థూలస్థానకము ల్బుజాగ్రముల సంశోభిల్ల వక్షస్థ్సల
వ్యాలేపం బతిసాంద్రమై మెఱయ ఫాలాంతర్లలామంబులన్
మేలీలన్ వదనంబు లిద్దఱును సమ్మిశ్రేంద్రచాపద్యుతి
శ్రీలం గ్రాలుసితాసితాభ్రములపేర్మిం బొంది రుత్సేకమున్.

వ. అప్పు డక్కుబ్జప్రభావుం డగునప్పురాణకుబ్జుం డాకుబ్జకురూపత్వం బపనయింపం దలంచి.

క. తనచరణాగ్రంబున న, వ్వనితపదాగ్రములు ద్రొక్కి వలనొప్పఁగ నె
య్యాన జట్టద్రేలదానివ, దన మింపుగ నెత్తె నంచితస్మిత మలరన్.

వ. ఇట్లెత్తుటయు.

తే. వంకయొత్తినమన్మథువాలురమ్ముఁ, బోలె నెమ్మేను చక్కనై పొలుపు మిగిలెఁ
గుబ్జ కన్నువనడుమును గురుకుచద్వ, యంబుఁ జదరపువెన్నును నభిమతముగ.

క. తనుఁ దాన చూచి యయ్యం, గన యద్భుతకౌతుకములుగడలుకొనంగా
వనరుహలోచనువదనము, గనుఁగొని చిఱునవ్వుతోడిగరువపుఁజూడ్కిన్.

వ. తనమనంబున నక్కుమారుమీఁదఁ దళుకొత్తుచి త్తజోన్మేషంబులు బయలుపఱిచి నాకునుపకారంబు చేసినయిట్టిమహిమగలవాఁడవు నాయింటికడకు విజయంచేసి నన్నుం గృతార్థం జేయవలవదె యూరక త్రోచిపోవం జూచిన నేను బోనిచ్చు దానఁ గానని మెల్లన నిజపాణిపల్లవంబున నతనికరంబు దెమల్చిన.

క. పనిచాలఁ గలదు కమలా, నన క్రమ్మఱవత్తు నీవు నాసొమ్మని య
వ్వనిత విడిపించుకొని తా, నును బలుఁడును నగుచు నతిమనోహరలీలన్.

వ. మనంబులం బొంగారుకడంకయు బింకంబును జేష్టితంబుల నలంకరింపనీక యె ల్లవిధంబుల గొల్లతనంబ తెల్లంబై తోఁపఁ దెంపుతోడికినుక నకంపితగతులై యనేకనరనాయకోపాయనసహస్రంబు లజస్రంబులై క్రందుకొనుకరితురగస్యం దనసుందరవస్తువిస్తారంబుల నత్యుదారం బగుకంసమందిరద్వారంబుఁ బ్రవేశించి.

ఉ. చేరి నరేంద్రులర్చనలు సేయఁగఁ గింకరలక్షలక్షితం
బై రమణీయకాంచనమహామణినిర్మిత మైన యాయుధా
గారము గాంచి భోజవిభుకార్ముక మెయ్యది చూచువేడుకన్
దూరము వచ్చినార మని దోహద మేర్పడఁ బల్కి యచ్చటన్.

వ. రక్షకులు చూపఁ దక్షకాహిదేహదండంబుచాడ్పునఁ బ్రచండం బగుకోదం డంబు చూచి రంతఁ గృష్ణుండు.

తే. దీని నెక్కిడ దివిజులు దానవులును, జాల రని చెప్ప విందు మాశ్చర్యభూత
మెవ్విధమొ చూత మని లీల నేకకరము, నందక్కొని యపుడు సజ్యముగఁ జేసి.

## శ్రీకృష్ణుండు కంసునాయుధాగారంబు చేరి కంసశరాసనధ్వంసంబు చేయుట.

మ. జనులెల్లన్ వెఱఁగంది చూడఁగఁ బటుజ్యానాదపూర్వంబుగా
నొనరించెం బరిపూర్ణముష్టిఁ బిడిపట్టొక్కింత నిశ్చింతుఁడై
యనయంబుం సడలించి విల్లు విఱిచెన్ హర్యశ్వహస్తాయుధా
హననధ్వస్తమహీధ్రమస్తకకఠోరాఘోషఘోరంబుగన్.

వ. ఇట్లు ధూర్జటిధనుర్దండదళనోద్దాముం డైనరాముండునుంబోలె రామావరజుండు భోజశరాసనంబు శకలంబులు గావించి తాను గానివాడునుంబోలె సందడిలోన సురిఁగి యన్నయున్నుగా నల్లన సముల్లసితగమనంబున శస్త్రాగారంబు వెలువడియె నంతఁ దదీయరక్షకు లొండొరులం గడవ నంతఃపురంబునకుం జని జనపతిం గని యంగంబులు వడంక నెలుంగులు కుత్తుకలం దగుల నిట్లనిరి.

సీ. అవధరింపుము దేవ యాశ్చర్య మొక్కటి మనవిల్లు పూజించు మందిరంబు
లోనికి నిద్దఱు లోకాధికం బగుతేజంబుగలవారు దేవనిభులు
నవయౌవనులు మనోజ్ఞవిచిత్రగంధమాల్యాలంకృతాంగులు నీలపీత
వాసులు దివినుండివసుధపై కుఱికిపడ్డ ట్లేపరుసువీర లని యెఱుంగ
నేరకుండ నేతెంచిరి వారిలోనఁ, దెల్లదామరఱేకుల ట్లుల్లసిల్లు
కన్నుదోయి నొప్పారెడుకట్టియాతఁ, డొకఁడు వెసఁబుచ్చుకొనియెవిల్లొక్కకేల.

చ. కొని యితఁ డెవ్వఁ డిచ్చటికిఁ గొంకక యేటికి వచ్చె నేల యీ
యనుపమకార్ముకం బిటు రయంబునఁ గేల ధరించె నంచు నే
మనయము విస్మయంబుపడునంతటిలోఁ దిగిచె నృరేంద్ర భ
ల్లనవిఱుఁగంగఁ జెప్పఁ దడ వమ్మెయి సెప్పెడుమాత్రయింతయున్.

క. ఆబెడిదపుమ్రోఁతకుఁ గా, దే బమ్మెరపోయి దేవ దేవరనగరన్
వేబెండుపడిరి మొగముల, పై బెగ్గలికంబు దేఱఁ బరిజను లెల్లన్.

తే. కట్టుఁగంబంబు విఱుచునుగ్రంపుగజము, నట్ట యవ్విల్లువిఱిచి యయ్యక్కజుండు
పవనుచందంబుగతిఁ బట్టుపడకతూఱి, పోయెఁదోడియాతఁడుఁదాను భూపసింహ

క. అని విలువిఱుచుట సెప్పఁగఁ, దనవీఁపటువిఱిగినట్లు తల్లడ మెసఁగన్
జనపతి వారలఁ బోవం, బనిచి విషాదోరుచింతఁబడి యాకులుఁడై.

వ. అంతకుమున్న రామకేశవులం గానిపించుకొనునప్పటికి నాయితంబులు సేయించి నక్షత్రాగారంబులు వీక్షించువాఁడయి వెలువడియె నవియును రాజునకు నమాత్యులకు బాంధవులకు భృత్యులకుఁ బౌరశ్రేణులకు విలాసినులకు మఱియుం దగినవారి కెల్లను వేర్వేఱ కావించినతమగంబుల దృఢరమ్యరచనంబు లగుమహాస్తంభంబులం నున్నతంబు లగునుపరిగృహంబులను సుఖారోహణంబు లగునుసంఘటితసోపానమార్గంబుల నతివిశాలంబు లగువలభిముఖంబులఁ బ్రత్యగ్రకల్పి

తంబు లగువిచిత్రశిల్పంబుల నాలోకనీయంబు లగువితానయవనికాతోరణప్ర ముఖంబుల నలంకృతంబులై యుల్లసిల్ల ననేకపురుషరక్షితంబై యుపారవస్తుభ రితంబై యామోదికుసుమపరికీర్ణస్థలంబై యభిరూపధూపవాసితంబై భాసిల్లు నట్టిరంగంబు గనుంగొని.

క. అతఁ డఖిలకర్మకరులకు, వితతంబుగ వలయుభంగి వినియోగింబుల్
ప్రతిభ యొసఁగఁ బనిచి సము, ద్ధతమతియై మగుడఁ జొచ్చె నంతఃపురముళ్.

వ. ఆచ్చటనుండి చాణూరముష్టికు లనుమల్లవరులఁ బ్రసిద్ధసత్త్వులం బిలిపించి యిట్లనియె.

ఉ. మల్లుతనంబునఁ భువనమండలివీరపతాకమీరలై
చెల్లుఁ బ్రియంబుతోడ ననుఁజేరినకోలెను నే నొనర్చుమే
లెల్లను మీరెఱుంగుదుర యింతటఁ బ్రత్యుపకారకాంక్ష సం
ధిల్లెనయేని నాపలుకు తెల్లముగా వినుఁ డేకచిత్తతన్,

మ. బలుఁడుం గృష్ణుడు నాఁగఁ జెప్పఁబడుగోపాలార్భకు ల్గానన
స్థలిలోఁ గారెఱుకుందనంబునన యిందాఁకం బ్రవర్తిల్లినా
రలఘుస్థైర్యము ధైర్యమున్ మొదలుగా నయ్యైభటౌచిత్యముల్
గలయందైన నెఱుంగ రెంతయును మాహాకార్యంబుశీలించుటన్.

శా. ఈరంగంబున వారు మీకునెదురై యేమేనిఁ జేద్యంబుమైఁ
జేరం జూతురు మీరు గైకొనమితోఁ జేపట్టి పాలార్చుచున్
గారింపన్ నల దొక్కఁపూఁపునన యాఘాతించి నాకున్ మహో
దారం బైనశుభం బొనర్పుఁడు భవత్ప్రఖ్యాతి నిండారఁగన్.

క. అని యిట్లింతయు సన్నా, నన మొప్పారంగఁ దమ్ము నరపతి ప్రార్థిం
చినఁ బ్రార్థనీయబాహో, ఘను లగువా రతనియెదుర ఘటితాంజలులై.

చ. పలుకులు వేయు నేమిటికిఁ బార్థివకుంజర యిట్టినీవు మాఁ
కొలఁదు లెఱింగి పంచెదవు గోపకిశోరులు మాకు నగ్గమై
యొలసినయప్డ పైఁబడుదు మించుక నైచి పెనంగ నోపినన్
నిలువక బీఱువ్రాయినను నీవు కనుంగొనఁ గూల్తు మిద్దఱన్.

క. ఇది యొకపనిగా దేవర, మదిలోఁ జింతింపవలదు మాకెదురుగ నీ
యుదధివృతధాత్రిమల్లుల, వెదకియుఁ గానము భుజింపువిశ్వశ్రీలన్.

వ. అనిన సంప్రీతుండై యతండు వారికి రంగభూమియందుఁ బేర్కొనంగలతమ గంబులు రెండు సూప నాజ్ఞాపించి నేఁటికి నిజగృహంబుల కరుగుం డనినం బెలు చన బాహువు లాస్ఫాలించి సింహానాదంబుచేసి మ్రొక్కి వీడ్కొని వారు య.

ఖేష్టగమనం బొనర్చిరి తదనంతరంబ కంసుండు గజారోహణనిపుణుం డగుమహా మాత్యు రావించి యిట్లనియె.

క. విను నెంతయునాప్తునిఁగా, మనమున నేవిశ్వసింతు మంత్రివర తగం
బని సాలఁ గలిగె నిప్పుడు, విను వినవలసిన తెఱంగు విస్పష్టముగన్.

ఉ. గొల్లలలోపలం బెఱిగి గొల్లతనంబ యెఱింగి యెంతయుం
బ్రల్లదులైనవారు గడుఁ బాతకులావసుదేవపుత్రకుల్
బల్లిదు లిద్ద ఱిచ్చటికిఁ బన్నుగ వచ్చినవారు వారికిన్
మల్లులఁ బంచితిం గఠినమర్దనశౌండతఁ గీడొనర్పఁగన్.

వ. నీవును సన్నద్ధుండవై యారామకృష్ణులు సనుదెంచు సమయంబునకు ముందర.

మ. పెలుచం గుంజరరాజము న్గువలయాపీడంబుఁ గ్రోధానలా
కులఘోరాక్షము గండమండలపరిక్షుభ్యన్మదస్రోతమున్
బలవద్వీరవిదారణప్రకటితాభాసంబు నాసన్నమై
యెలయన్ రాజగృహంబువాకిటికి రానిమ్మీవ యివ్వేళువన్.

తే. ఖలులవిగతాయుధులవారిఁగనినయపుడ, వారణముగొల్పుమీవరవాయిగొనక
జమునిపట్టినచెరగాక పడలిపోవ, వచ్చునే దానియెదుర నెవ్వారికైన.

ఉ. ఏనుఁగుచేతఁ జిక్కి యొకయింతయుఁ జేయఁగలేక ధాత్రిపైఁ
బీనుఁగులై వెసంబడినబిడ్డల నవ్వసుదేవుఁ డెంతయున్
దీనతఁ గాంచి తాను దనదేవియు వెండి నశింతు రాపులై
వానికిఁ బూనివచ్చుయదువర్యులు ద్రుంగుదు రొయ్య నందఱున్.

క. నీనేర్పొండెను మల్లుల, పూనికయొండె నిటుపగఱఁ బొరివుచ్చిన నే
నీనిఖిలజగము యదుగణ, హీనముగాఁజేసి యొకఁడు నేలుదు నెమ్మిన్.

తే. యదుకులోద్వహుఁ డనికాదెయాదియంద
తండ్రిఁ ద్రోఱఁగితిఁ బిదప యాదవుల నెల్లఁ
గృష్ణుదెసఁ బక్షపాతులై కెరలు టెఱిఁగి
నమ్మకెడసేసి తొలఁగి యున్నాఁడ నిపుడు.

## కంసుం డేకాంతంబున మహామాత్యునితోఁ దన జన్మప్రకారంబు చెప్పుట.

క. విను మొక్కరహస్యం బే, ననఁగా యీయుగ్రసేనునాత్మకు జనియిం
చినవాఁడఁ గాను మానుష, జని కిట్టు లమానుషంపుశక్తిగలుగునే.

వ. అదియెట్లనిన నాతోడ నారదమహాముని యేకాంతంబునం జెప్పినది చెప్పెద మాతల్లి రజస్వలయైయుండి యొక్కనాడు యమునాతీరంబునం బ్రసిద్ధం బగును యామునశైలంబున నఖిలయదువృష్ణిభోజాంధకులు కాంతాసమేతులై విహ

రించుచుండం దానును నెచ్చెలులును తోడంగూడ నరిగి యనేకవిధవినోదంబులఁ జరియించెం దత్సమయంబు మేఘారంభదివసంబగుటం జేసి.

సీ. కడపఁ బూఁదేనియ కడుపారఁగొని క్రోసి తిరుగులేదేఁటులతెరలికయును,
నెసకంపుటుఱుములయింపునఁ జెలఁగి యాడెడుపురినెమళులకడఁక సొంపుఁ
బరువంపుఁ జినుకులపసఁ గ్రొవ్వుగొని తేలగిలఁబడువానకోయిలలయొప్పు
నెలపచ్చికలు తమయిచ్చఁ గైకొని యాముకవిసి త్రుళ్లెడిలేటిగములపెల్లుఁ
గోడిసెవిరులకమ్మఁదనంబు గోఱలి కొండ
సెలలజాఱుతుంపురుమోఁచి మెలఁగుచున్న
గాడ్పుమురిపంబు నెందును గలిగి మెల్ల
వారిమనసులు వేడ్కల మూరిఁబోరె.

క. అత్తఱిఁ జిత్తమురాగా, యత్తంబై పతిఁదలంచి యవ్వానిని యు
ద్వృత్తమదనకేళీరుచి, గ్రొత్తగ నెలయుటయు నధికకుతుకము నొందెన్.

వ. అమ్మనస్విని మనోవృత్తం బెఱింగి యొక్కదానవుండు గక్కున నుగ్రసేనరూపంబు ధరియించి చేరం జనుదెంచి.

క. నీవును జెలులును నాటల, కీవసుధాధరముమీఁది కేతెంచుట యే
నావల నెఱింగి వచ్చితి, భావంబున సైపలేక పంకజవదనా.

వ. నన్నుఁ జరితార్థుంజేయు మని తదీయమనోరథానురూపంబు లగుచేష్టితంబులం బ్రవర్తిల్లిన యనంతరంబ పతిభావానుకూల యగునప్పుణ్యశీల నిజభర్తవలని పూర్వానుభవంబుచందంబు వానియందుఁ బొడగానక శంకించి తలంకి యాకశంకితాచారుం గనుంగొని.

మ. అకటా నిక్కము నీవు నాపతివి గా వన్యుండ వీరూపువై
యకలంకం బగుమచ్చరిత్రమున కన్యాయంబు గావించితిం
తకు శంకింపక యెత్తికొన్న వికళద్ధర్ముండ వెవ్వాఁడ వే
టికి నిష్పాపము సేసి తుత్తమవధూటీదూషణం బర్హమే.

తే. ఇంకఁ జుట్టలు నన్నేమి యెన్నువారొ, కులమునకుఁ బాయవడి యేనుగులటనైతి
నీవు నల్పాయుషుండవై నీచ పోదు, నరకమునకుఁ బరస్త్రీవిలాసి వగుట.

చ. అనవుడు నాతఁ డిట్టులను నంగన సౌంభపురీవిభుండనే
ననఘుఁడ ద్రావిళుం డనుమహాదనుజాగ్రణి నిట్టులేల దు
ర్మనుజుని భర్తగాఁ దగిలిమానిని పండితమానితావిధం
బెనయఁగఁ బల్కెదీవు తగ వించుకతప్పినచొప్పు సెప్పుమా.

క. అభిమానవతులు ముగ్ధలు, నభిజాతలు నైనమగనియాండ్రుర కారే
వ్యభిచారమునన తనయుల, ఋభునిభులం గనిరి మున్న నేకుల నతివా.

తే. వారితం బె నీకేమిటివలనఁ దక్కు, వేల చప్పిడిమాటల నిట్లు నన్ను
రేఁచె దేనిచ్చువరముసంప్రీతిఁ గొనుము, పుత్రు జగదేకవీరునిఁ బొలఁతి కనుము.

వ. వాఁడు గంసుం డనుపేరం గృతరిపుధ్వంసుండై భువనావతంస యగువిభవప్ర శంసం బరఁగం గలవాఁ డనినఁ గోపించి యప్పతివ్రత యతని కిట్లనియె.

మ. నను నీవుక్కత నిమ్మెయిం జెఱిచి తెన్నం బెద్దగాఁ గీర్తిగ
న్న నుతాచారలఁ దొంటిపుణ్యసతులన్ గర్హించె దీలోక మె
ల్లను నాత్మీయపతివ్రతాగుణసముల్లాసంబునం దాల్చునం
గనల న్మున్నవె యరుంధతి మొదల్గా నెందఱో యిమ్మహిన్.

వ. నీవిచ్చువరంబు గాల్చుకొనుము వృత్తనాశుండ వైననీమఱ్ఱిజంబున నుద్భవించు సుతుండు నాకునభిమతుండు గాఁడు మదీయభర్తయన్వయంబున నొక్కపుణ్య పురుషుండు పరాక్రమపరుషుం డయి జనియించి వానికి మృత్యు వయ్యెడు న ననిన నయ్యసురపతి నిజేచ్ఛం జనియె మాతల్లి మగుడ నగరంబునకుం జనుదెంచె నివ్విధంబున జాతుండనైన.

చ. జనకునిఁ గన్నఁ గిన్నడుము సభ్యుల బంధులఁ గాంచినం గడున్
గనలుముఁ దల్లిదిక్కనను గౌరవబుద్ధి యొకింతలేదు నా
కనయము నిట్టితండ్రి నిగళాభినియంత్రితుఁ జేసి రాజ్యముం
గొని యనిసిద్ధవీధినధికుం డన నిట్టిఁడనైతి నుద్ధతిన్.

వ. అగ్గొల్లపడుచుల నిద్దఱం దునిమి వైచి తక్కినచుట్టంబులఁ బిలుకుమార్చెద నిది నిశ్చయంబు నీవు తడయక యంకుశప్రాసతోమరంబులు ధరియించి నాచెప్పిన పనియందుఁ దాత్పర్యంబు వాటింపు మని మహామాత్యు వీడుకొలిపె నంత రా త్రియగుటయుం గంసుండు యుద్ధోచితవర్తనంబున నుండె రామకేశవులు నుచి తప్రదేశంబునఁ దజ్జఘూంసావేగజాగరం బొనర్చిరి తదనంతరంబ.

ఉ. కంసునిబాధలం బడుజగంబుల కింతటవేగుగాత ద
ద్వంశము వేగవేగుటయుఁ దా నెడఁగూడదె యన్గతిం దమో
ధ్వంస మొనర్చి శౌరి కనుచాయలు తమ్ములచాయఁ బర్వఁగా
హంసుఁడు ప్రాచ్యపర్వతశిఖాగ్రవతంసత నొంది యొప్పినన్.

కంసుండు సపరివారుండై రంగస్థలంబుననుండి రామకృష్ణుల రావించుట.

వ. పురంబున నెల్లవారును గ్రాసేసి రాజశాసనంబున రామకృష్ణులపరాక్రమం బాలోకించుకౌతుకంబున నుల్లంబులు పల్లవింపం జనుదెంచి నిజోచితంబు లగు మంచప్రకరంబు లెక్కి చూచుచుండిరి, రాజును సమస్తపరిజనంబులతోడ నుత్తుం గకనకాసనసనాథం బైనమంచస్థలంబున నాసీనుండై ధవళాంబరంబులు ముక్తా మయభూషణంబులు వెలిగొడుగులు వింజామరలు విలాసినీవిలసితాపాంగరో

చులు నొక్కటెలుపై పొలుపారం జంద్రోదయోద్దామసౌందర్యంబు నభినయిం చుచుండె విచిత్రంబు లగు తెఱచీర. లిరుదెసల నుల్లసిల్ల నమ్మేటితమగంబులు బలుతెక్కలతోడి పెద్దకొండలకై వడిం గనుపట్టె నంతఃపురజనంబులును. జగతీశ్వరునిరుగెలంకులను వెనుకదిక్కునను మెఱయుమంచికలపై నుండి గవాక్షప్రసారితంబు లగునిరీక్షణంబుల నయ్యుత్సవం బభినందించిరి దివంబున నుండి దేవేంద్రుండు దేవగణసమేతుండై జీమూతమాతంగంబుమీఁద నొప్పారి నారదప్రముఖమునివరులును దిలీపప్రభృతు లైనపూర్వభూపతులును సిద్ధయోగిసముత్కరంబులుం గొల్వఁ గంసధ్వంసనావధి యగురిపువధకల్యాణంబు గనుంగొనువాఁడై యరుగుదెంచి యంబరతలంబు బహువిమానసమ్మర్దసుందరంబు గావించె నంత.

క. కచ్చించి మల్లులిద్దఱు, మచ్చరమును లావు మెఱయ మత్తకరులు రెం డిచ్చఁ జనుదెంచుచాడ్పున, నచ్చటికే తెంచి నిలిచి రధిపతియెదురన్.

క. శూరుఁ డగుమహామాత్యుఁడు, వారక మదతీవ్రదుష్టవారణము నృపద్వారమున నిలిపియాదవ, దారకుల న్వార్చియుండెఁ దద్దయుఁ గడఁకన్.

వ. ఆసమయంబున.

చ. అడవులనుండివచ్చిరఁట యచ్యుతశౌర్యులు రామకృష్ణు లి క్కడికి నరేశ్వరుండు గడుఁగౌతుకియై పిలిపించెఁ దోడి తెం డెడమడువేల యింక నఖలేచ్ఛలుఁ జేకుఱె నంచుఁ గంచుకుల్ బడిబడిఁ బాఱుతెంచి తమభావ మెలర్పఁగఁ బల్కి పిల్వఁగన్.

క. ఒకసంభ్రమమును లేక, య్యకలంకాత్మకులు తొంటియట్టుల మూర్తుల్ వికృతిరహిత లయి జనద్రు, క్చకోరకముల కభినవేందుసదృశతనలరన్.

వ. రంగద్వారంబు సేరి రప్పుడు బోరనం జెలంగువాదిత్రంబులవిచిత్రధ్వానంబులును బ్రేక్షకవ్రాతంబులకౌతూహలాలాపఘోషంబులు దివంబున దివ్యదుందుభినినదంబును దదంతరంగంబులకు సముత్సాహతరంగంబు సమధికోత్తుంగంబు గావించె నట్టిసంకులంబున నక్కడ నున్నమహామాత్యుండు గోత్రగిరిగురుక్రోడం బగుకువలయాపీడంబుఁ గువలయాపీడజన్ము లగుయదువంశజన్ములమీఁదం గొల్పిన.

చ. కని దనుజారి యగ్రజుమొగంబునఁ జూడ్కులు నిల్పి నవ్వుచున్ మనలవధింపఁ గోరి కొఱమాలినయేనికదున్న నొక్కటిం బనిచినవాఁడు తద్దయును బాలిశబుద్ధి గదే కృతాంతదం తనికట సంప్రవర్తి యగుతన్నును గానఁడు కంసుఁ డక్కటా.

వ. నీవు కన్ను నవధరించి చూచుచుండు మని యెదురునడిచె నాల్గోన.

సీ. చటులోగ్రశీకరచ్ఛటలు పెల్లుగఁ గాలదండప్రచండమై తుండమమర
నళికులఝుంకారములు రేఁగ మదజలోత్కటములై యందందకటములడరఁ
గవదగ్నికణసముత్కరములఁ బెంచి యత్యుగ్రారుణేక్షణద్యుతులు నిగుడఁ
జలితచామరశిఖాశాత్కారములతోడఁ దతకర్ణతాడనధ్వనులు పరఁగ
మొగము క్రోధమయంబుగ బిగిసి మేను, వ్రేఁగఁ బదపాతభుగ్నమై భువిచలింప
దీర్ఘదంతకాండంబు లుద్వృత్తిఁ జూపఁ, గవిసె నేనుంగు లోకభీకరముగాఁగ.

వ. కృష్ణుండును దానితోడిసమరంబు నెపంబుగాఁ దనభుజబలంబు సూపఱకుఁ జూపుటకై కొండొకతడవు వినోదింపం దలంచి తలపడి తొలుతఁ దదీయం బగు కరతాడనంబు దృఢకఠినం బైన నిజవక్షస్స్థలంబునఁ గైకొని యెగసి కొమ్ములు ద్రొక్కి నిలుచుండి యంతలోన దక్షిణచరణం బట్లయుండ నపరాంఘ్రిపాతంబునం గుంభస్థలంబు నొప్పించి యుఱికి వీఁపుమెట్టి యమ్మహాగజంబు దన్ను వ్రేయుటకుఁ బెడమరనెత్తిన హస్తంబు గేలఁ గుదియించుచు నొక్కదిక్కున దిగువకు లంఘించి పిడికిళ్లం బ్రక్కలు నొగిల్చిన నది దిరుగుటయుం గాళ్లసందున నురిఁగి వెనుకం దోఁకపట్టి గరుడుండు గిరికందరవిలీనంబగుభుజంగంబు నాకర్షించుకరణిం దిగిచి దిర్దిరం ద్రిప్పిన మొగదప్పి కొమ్ము లూఁతగా నక్కఘటి యుక్కఱి మ్రొగ్గియు దిగ్గన సంబళించికొని లేచి నిలిచి క్రోధంబున మదధారలుగడలుకొనం బుష్కరసీత్కారంబులతో నందంద బృంహితంబులు సౌధగహ్వరంబులం బ్రతిశబ్దజనకంబులుగా నాధోరణప్రయత్నంబునం బ్రగుణితసంరంభంబై యంభోజనాభునిపైఁ గ్రమ్మఱం గవిసి తొండంబున వ్రేసియుఁ గొమ్ములం జీరియు మారిమసంగినట్లు విజృంభించినం జీరికిం గొనక యతండు తద్వధం బొనరించువాఁడై యాక్షణంబ.

శ్రీకృష్ణుఁడు కువలయాపీడం బను నేనుంగును బీనుంగుఁ జేయుట.

తే. ఎగసిచరణపాతంబున మొగము దాఁచి, బిగిసి యొకదంతదండంబు బెట్టువెఱికి
నిలిచి వజ్రవజ్రంబున నలఘునగము, వ్రేయుచాడ్పున దానన వ్రేసె శిరము.

క. హరినఖరక్షతిఁ బోలెడు, హరికరగతదంతబహువిధాఘాతములన్
బొరిఁబొరిఁ బెల్లుగ నొఱలుచుఁ, గరి విణ్మూత్రములు దొరఁగఁగా నిలఁ ద్రొగ్గెన్.

తే. హస్తిఁ గూలిచియాలోనహస్తిపకుని, తలయు నొక్క వ్రేటున నవ్వయ్యలుగ నడిచి
రెండుపీనుంగులును ధరిత్రీతలమున, వికృతతరములై యుండఁ గావించెఁ బ్రభుఁడు.

వ. ఇట్లు కువలయాపీడంబు నిహతం బైనంగని యంబరతలంబున నున్న దివిజసిద్ధగంధర్వాదులు మహామునిపూర్వకంబుగాఁ బూర్వజోపేతుం డగు నయ్యుపేంద్రు ననేకవిధంబులం బ్రస్తుతించుచుఁ బ్రమోదభరితు లయిరి దేవకీసుతుండును

సింహనాదంబు సేసి సింహచంక్రమణంబున ననర్గళగమనుండై రంగస్థలంబు సొచ్చె నట్టియెడ.

సీ. కువలయాపీడంబు కొమ్ములపోటుల రుధిరంబు తన్మదస్రుతుల బెరసి
కస్తూరికామిశ్రకాశ్మీరచర్చికాలలితమై భుజము లలంకరింపఁ
గరములనున్నయాకరినాథురదనదండంబు కాలాభ్రతటస్థమైన
దుర్ధరోత్పాతకేతువుఁబోలె భయదంబుగా నతిరౌద్రప్రకారుఁ డగుచు
వచ్చుగోవిందు విక్రమవ్యాప్తభువనుఁ, బ్రజ్వలజ్వలనార్కవిభాసిమూర్తి
నఖిలదైత్యదానవదుర్జయాత్ము నాత్మ, కాలమృత్యువుఁ గంసుండు గనియెనెదుర.

క. రంగస్థితజనులును వెఱ, నంగంబులు వడఁకఁ జూచి రవ్విభు నితఁ డీ
బ్బంగిఁ గవిసె నిక్కడికే, భంగ మగును యిట్టు లగునె పాకంబనుచున్.

వ. అంత నధికక్రోధంబున నుగ్రలోచనుం డగుచు నుగ్రసేనసూనుండు.

మ. ఘనుఁ జాణూరుఁ డనం ద్రిలోకములవిఖ్యాతు న్మహామల్లు న
వ్వనజాతేక్షణుతోడిబాహుసమరవ్యాసక్తికిం బంచె రా
ముని మార్కొల్పె పెనంగ జెట్టిబిరుదున్ ముష్టిప్రకారైకలో
చనదృష్టోద్యము ముష్టికాఖ్యు వెస నాజ్ఞాపించె సాటోపతన్.

వ. ఇవ్విధంబునం బనుపంబడి యంధ్రకోసలదేశీయు లగునమ్మల్లు లిద్దఱు నమ్మహా వీరుల మార్కొనం గడంగి రందులోనఁ జాణూరుండు.

సీ. అనిమిషేభంబుల నెనిమిదింటిని గూడఁ బెనఁచి మానిసిఁ జేయ వెలసె నెక్కొ
ప్రళయానలార్కులపస యంతయును నావటించి ప్రోవిడఁగ దీపించె నెక్కొ
పవమాను లందఱుపరమార్థవిధము రూపప్రౌఢి గైకొని ప్రబలె నెక్కొ
గోత్రాచలంబునకును బట్టుకదలి సర్వావయవస్ఫూర్తి యడరె నెక్కొ
యనఁగలావువేఁడిమియురయంబుమూర్తి, పెనుపునఖిలాద్భుతంబులైపిక్కటిల్లఁ
దాన జగజెట్టియై వెండి తనకు నెందు, మాఱుమల్లులు లేకుండ మలసినాఁడు.

క. తన కప్పుడు నృపకార్యం, బునఁ గలపోరామియెల్ల మోచుటకతనన్
ఘనసత్త్వశౌర్యములు సూ, ప నవశ్యం బగుటఁ బ్రకటబాహాధికుఁడై.

వ. ఘోరసన్నాహంబునం జనుదెంచి వారిజోదరుం జూచి యాక్షేపరూక్షోత్తరం బుగా నిట్లనియె.

ఆ. పసులఁ గాచి గొల్లపడుచుల వెఱపించి, బిరుదితండనంగఁ బేర్చి తిరిగి
తట్లుగాదు నాకు నగ్గమై తిరిదె నేఁడు, దాయ యెందుఁ దప్పిపోయె దింక.

క. పొరివుచ్చెద నిప్పుడ యి, న్నరపతియును సభయు మెచ్చ నాచే జముకిం
కరవర్గము గైకొనుఁగా, కరుదుగఁ గ్రొత్తచెఱ నలమి యర్భక నిన్నున్.

క. అనుటయు హరి కోపము న, వ్వును బెరసినలోచనాంశువులరక్తత గం
సునిప్రళయసంధ్యయై యెం, దును బర్వఁగఁ జూచి కఠినదుర్భరఫణితిన్.

వ. చాణూరమల్లునితో నల్లన నిట్లనియె.

చ. నిను నిఖిలార్థకారియుగ నెమ్మదినమ్మినవాఁడు కంసుఁ డె
య్యనుపున గ్రుస్సిపోక బలమంతయుఁ జూపుదుగాక రిత్తర
జ్జన పనిదీఱునే వెడఁగ చండితనంబున నీవు గన్ననీ
యనుపమకీర్తి కింతట సమాప్తి యొనర్పఁగఁ జూవె వచ్చితిన్.

సీ. కడుఁబెద్దక్రొవ్వినకాళియుతలలెల్లఁ జదియంగఁ ద్రొక్కినపదతలములు
దుష్టాత్ముఁ డైనయరిష్టునిమెడఁబట్టిపొరిద్రావ విఱిచినభుజయుగంబుఁ
బిరితాశి యగుకేశిఁ బ్రేవులువెడలంగఁ గడిమిమైఁ దిగిచినఖరనఖములు
నవనీతిఁ జెనకినకువలయాపీడంబు మోరఁ బగిల్చినముష్టిబలుపు
నెఱుఁగ వెఱఁగిన నిల్లలయేపు మిగిలి, యెదురు నడతెంతు వీవు నిన్నీక్షణంబ
విఱిచిప్రోవువెట్టెదఁజూచివెఱయునెఱుఁగు, పాటు దిరిమీయేలిక బ్రమసిపడఁగ.

వ. అని పలికి పెలుచన భుజాస్ఫాలనంబు సేసి డంగం జాణూరుండును దారుణాకా
రుండై కవిసె నప్పుడు రంగంబంతయు నిశ్శబ్దంబై చూచుచుండ నయ్యిరువుర
నుపలక్షించి యాదవులు తమలో నిట్లనిరి.

క. శైలనిభుఁడు చాణూరుఁడు, బాలుఁడు కృష్ణుండు వీరిబాహాయుద్ధం
బాలోకింపఁగ నసదృశ, మేలం బిది యెఱుఁగవలదె యిచ్చటిపెద్దల్.

వ. మల్లుపెనంగువారికిం గాలజ్ఞులై కులజు లయినసహాయులు చుట్టనుండి సలిలసేచ
నాద్యుపచారంబులఁ బరిశ్రమాపనయం బొనర్పవలయు బలంబునకుం గ్రియకు
నంతరంబు నిరూపింపవలయు నిలుపం దగుతఱి యెఱిఁగి నిలుపవలయు నిది వేడు
కపెనఁకువగాని వీరికిం దమలోన రోషమాత్సర్యాదు లింతకుమున్ను లేవు
గావున.

తే. ఇంతటన మెచ్చి వీరి నుర్వీశ్వరుండు, పసదనం బిచ్చి మాన్చుట పాడి యింకఁ
బలుకు తెంపును గడఁకయుఁ బంతమునకు, నొదవఁ గైకొనరే యెందు నుచితపరుల.

క. అనుమాటలు విని వారికి, వనజోదరుఁ డిట్టు లనియె వలవదు మీకి
య్యనుమానము ప్రతిభటుతో, నను నిటు పోరించి చూచినం బగ దీఱున్.

క. మనసుపదిలంబు గడిమియు, ఘనసత్త్వము శ్రమము పెంపుకలిమివిజయమున్
బొనరించురంగయోధికిఁ, బనిగలదే యెందుఁ బొడవు ప్రాయము నరయన్.

తే. పగయ పాటించి వీనిఁ జంపంగఁ దలఁచి, యేను గదిసితి మెచ్చింతు నిట్టు లున్న
యిందఱును జూడుఁ డూరక యిట్టునట్టు, ననక లావును విక్రమవ్యాప్తి వెరవు.

వ. చారుకం బనుప్రదేశంబునం బ్రభవించి చాణూరుం డనఁ బ్రసిద్ధుం డై నవీని చేతఁ బెక్కండ్రు మల్లులు సిక్కిరి వీనిం బడవైచి యసాధారణం బగుయశంబు నొందెద ననియె నిట్లు భాషించి యప్పౌరుషభూషణుండు విద్వేషిం దలపడినం బెనఁకువ బెట్టిదంబై చెల్లె నందు.

శ్రీకృష్ణుఁడు చాణూరుండనుమల్లునితోఁబోరి వానింజంపుట.

తే. సకలవిజ్ఞాననిధి యగుశౌరి పేర్చి, యహితుచేతఁ జిరాభ్యస్త మైనవిద్య కగ్గలంబయి తానభ్యస్తవిద్యఁ, దయ్యఁ జూపె విచిత్రమార్గాంతరములు.

క. తిరుచుట త్రోచుట త్రుంగుట, నెగయుట యెత్తుట మెలంగి నిలుచుట సరిగా నగధరుఁడును జాణూరుఁడు, దగిలి తిరుగువిధము లద్భుతములై యొప్పెన్.

తే. మూఁపు లొండొంటిఁ దాఁకించుమ్రోఁతపెల్లు
తలతలయు సంఘటించునయ్యలవు పెంపుఁ
బటుమిథోముష్టిపాతనిర్భరరవంబుఁ
గలసి వజ్రనిర్ఘోషానుకారి యయ్యె.

క. అఱచేతులఁ బెడకేలన్, జఱిచియుఁ గూర్పరకఠోరజానునిహతులన్ బఱిచియు వారు సముద్ధతిఁ,బఱిపొ్రావక పోరి రిలఘుపాటవదృఢతన్.

తే. తఱిమి మెడలంటఁబట్టుట తమక మొప్ప, దంతనఖరవిదారణదారుణముగఁ గడఁకగల్గుట దొడగాళ్లనడిచిత్రోచు, టిరువురందునుగ్రంబులై యెసఁగెఁజూడ.

వ. ఇన్నిచందంబులం జాణూరుకంటె నతిశయంబుఁ జూపుచుఁ గృష్ణుం డప్పటప్పటికి సభాసదుల మెప్పించుచుండ నొండొండ మేలుమే లనునెలుంగులు రంగవలభి ప్రతిశబ్దద్విగుణితంబు లయ్యెఁ దదనంతరంబున మొగంబునఁ గోపంబు చెమట తోడం జేవురింపఁ గంసుండు చేసన్న నాప్రోఁత యుడిపి మృదంగాదివాదిత్ర నాదంబులను వారించె నవ్వారిజేక్షణురణం బంతరిక్షంబున నంతర్ధానగతులై కనుంగొనుననిమిషులసాధువాదనినాదంబులును గంధర్వకరతాడనతరంగితంబు లగుమృదంగనినదంబులుం జాణూరభంజనంబున జగంబులం గావుమనుసిద్ధవిద్యాధరాదుల జయజయశబ్దపూర్వప్రార్థనావచోవిరావంబులు నవార్యంబులై యుల్లసిల్లె నంత.

ఉ. చూపఱకోర్కి నిండ రిపుశూరతకుం జనవిచ్చి కొంతసే పాపగిదిన్ భుజాసమర మచ్చెరువారఁగ నిర్వహించి యా గోపభటుం డొకింత యెద గోపముఁ గైకొని వైరిసత్త్వవిద్యాపటురూఢి యెంతయును దక్కఁగ నొనరించె ద్రేల్మిడిన్.

వ. అప్పుడ రంగస్థలమంచప్రపంచం బెల్ల నల్లలనాడెం బుడమి వడంకె జనంబుచూడ్కులు విన్నఁదనంబు నొందె దెసలు మండెఁ గంసోత్తంసంబునం బ్రధానర

త్నంబు విభ్రష్టంబై పడియె మఱియుఁ బెక్కుదుర్నిమిత్తంబులు దోఁచె నట్లు
పరిక్షీణప్రాణుం డైనచాణూరుం బొదివి. యక్కుమారవీరుండు ఘోరముష్టిం
దన్మస్తకంబునడుకొనం బొడిచి నెగసి మోఁకాల నురంబు దాటించె నట్టిబెట్టి
దంపుఁజేఁతవలన గ్రుడ్లు వెలికుఱికి పండ్లు దెఱచి నోర ముక్కున నెత్తురులు వె
డల వాఁడు కులిశపాతభగ్నం బైనశైలశృంగంబు భంగిం బడి వికృతంబుగా నె
ఱలుచు విగతజీవుం డయ్యె నటమున్న.

క. బలుఁడును ముష్టికుతోడం, దలపడి యమ్మైన పెనఁగి దారుణముష్టిం
దలగ్రుంగఁ బొడిచి వానిం, బొలియించెం గృష్ణసదృశభుజచేష్టితుఁడై.

వ. ఇవ్విధంబునం జాణూరముష్టికుల వధియించి రంగస్థలం బంతయుం దారయై రా
మకృష్ణులిద్దఱుం గ్రోధసంరక్తలోచనంబులఁ గంసు దెసఁ గనుంగొనునప్పుడ
ఘూప్పా పునకుఁ గంసక్రౌర్యంబునకు నందగోపాలాదులగుఘోషజనంబు లందఱుం
గల్లడంబున నందంద మేనులు వడంకి యొక్కదెస నుడిగిముడిఁగి యుండిరి తక్కి
నవారెల్లను బుల్లవడి చూచుచుండి రంత.

సీ. మును గన్నవాఁడె దవ్వునఁ బాయవైచినపట్టిఁ గ్రమ్మఱఁ గన్నభంగిఁ గనియు
నంతకప్రతిరూపుఁ డైనచాణూరుదోర్బలము వితర్కించి బ్రతుకు నమ్మ
కురుబాష్పనేత్రయై యుసుఱు తల్లడిలంగ నున్న దేవకియు నట్లుగ్రభంగిఁ
బగతునిఁ బరిమార్చి బలయుతుఁడై తన మాఱంకు లేక యుదీర్ణతేజ
మమర వెలుఁగునాకృష్ణు లోకాభిరామ
మూర్తిఁ గనుఁగొని వాత్సల్యముగ్ధహృదయ
యగుచుఁ జన్నులు చేఁపంగ హర్షశీత
లాశ్రువులు కన్నుఁగొనల నిండార నలరె.

మ. వసుదేవుండును బుత్రు నూర్జితభుజావష్టంభసంభావనా
రసికుం జాతితశాత్రవుం బ్రముదితభ్రాత్రన్వితుం జూచుచున్
వెస నానందరసానుభూతిపలనన్ సిద్ధుండ పోలెన్ జరా
వ్యసనం బేమియు లేక యత్తఱిఁ గుమారాకారుఁ డయ్యెన్ మదిన్.

ఉ. కంసునికొల్వువా రయినకాముకు లెల్లను గృష్ణమూర్తియా
శంసదలిర్పఁ జెప్పలిడఁ జాలక చూడ్కులు గొల్పుచున్ సభన్
గంసునియున్కియున్ బహుముఖంబులమల్లులపోటుఁ దద్రిపు
ధ్వంసము లోనుగా నొకవిధంబు నెఱుంగర తమ్మెఱుంగమిన్.

వ. అట్టియెడం బ్రతిభటనిపాతనంబున నాతతోత్సాహులై యాహవక్రియాదో
హాలం బెక్కనుక్కుమీఱి మాఱులేక మలయుచు విలయకాలశిఖిశిఖాసంకా

శు లగునాజితకాశులం గని యుగ్రసేనసూనుం డుగ్రం బైనయాగ్రహంబునం
బొమలుముడివడఁ జెమట మొగంబు ముంపఁ గంపంబు సర్వాంగీణం బై యొల
యఁ బొలయునిశ్వాసమారుతంబునం బ్రేరితం బైనట్లు పేర్చి యుల్లం బేర్చుక్రో
ధానలంబు పెనుమంటలపగిది నిగుడునాలోహితలోచనరోచులు రంగప్రదేశం
బెల్లం బ్రదీప్తంబు సేయ నలుదెసలు నాలోకించి నిజకింకరగణంబుఁ బిలిచి
యీగొల్లపడుచుల నిద్దఱం దిగిచికొనిపోయి నగరు వెడలం ద్రోవుఁడు నందగో
పునిం బట్టి బెట్టిదంబుగాఁ బెక్కుసంకెలలం బెట్టుండు తక్కినగోపకులను దలలు
గోసి వైవుండు నారాజ్యంబున గొల్లం డెవ్వండు మెలంగిన ముచ్చులు పడు
పాట్లం బఱచునది గొల్లలకుం గలసొమ్ము లన్నియుం బుచ్చికొనుండు నాకు నెగ్గొ
నర్ప వేచికొనియున్న యన్నీచుం గుటిలస్వభావు వసుదేవు ముసలివారికిం దగని
ఘోరక్రూరదండంబున దండితుంజేయుం డని యాజ్ఞాపించిన.

తే. తలఁకి యున్నవా రున్నచోఁ దలలుగట్టికొనిరి మఱిప్రాణములు గుత్తుగుత్తనంగ
జనని శోకంబు క్రమ్మఱఁ దనుఁ బొదువఁగ, దేవకీదేవి మూర్ఛాపిధేయ యయ్యె.

శ్రీకృష్ణుఁడు కంసునిఁ బుడమిం బడవైచి విగతప్రాణునిఁ జేయుట.

చ. కలఁగెడుబంధువర్గమును గారియఁ బొందెడుతల్లిదండ్రులన్
సొలయుసభాజనావళులఁ జూచి విపక్షపరూపహారిసం
కలనము క్రోధదేవతకుఁ గక్కునఁ జేయఁ దలంచి రూక్షగ
ర్వలసితబాహుఁ డుస్సహుఁడు వైరసమాప్తి యొనర్చుతెంపునన్.

చ. కరిపతి యున్నశైలకటకంబునకుం బఱువేగిచండమై
హరిపతి దాఁటునట్లు హరి యారిపుఁ డున్న యుదగ్రసౌధమం
దిరవలభీతటంబునకుఁ దీవ్రత నుప్పరవీధిదాఁటె ని
ర్భరపవనప్రకంపవిసరన్నవనీలవలాహకాకృతిన్.

తే. రంగమధ్యంబునందుండి రాజుదెసకు, నుఱుకుకృష్ణువేగస్ఫూర్తి యొక్కరుండు
గాన లేకున్కిఁ గనుమాయకరణియయ్యెఁ, గంసుముందర నిలుచుండఁ గనిరి పిదప.

క. భువిమీఁదఁ గృష్ణుఁ డుండఁగ, దివి వేఱొకకృష్ణుఁ డుప్పతిల్లి పడుటగా
దివిజారి తలఁచి తలఁకున, నవయనయములు సడలఁ బ్రచలితాసనుఁ డయ్యెన్.

వ. అలోన నయ్యదువీరుండు.

సీ. మణులు రాలఁగఁ జారుమకుటంబుఁ బడఁదన్ని వడివెండ్రుకలు పట్టి వ్రాలఁదిగిచి
నడుతల యందంద పిడికిట మెదళులు గలగంగఁ బొడిచి మ్రోకాల నురము
దాఁకింప నొక్కచేతయుఁ జేయలేక నిశ్చేష్టుఁడై రోఁజు విద్విషునిఁ జెలుచ
హారముల్ ద్రెవ్వఁ గర్ణావతంసము లూడ నంతరీయోత్తరీయములు వీడ

నోర ముక్కునఁ జెవులను ఘోరరుధిర, మొలుకఁ గ్రుద్దులు వెలుపలికుఱుక మేడ
డిగ్గఁ ద్రోచుచుఁ దోడన డిగ్గి స్రగ్గఁ, గ్రుమ్మె నుసు లూపోవంగ సక్రోధలీల.

వ. ఇట్టిబెట్టిదంపుఁ జెద్దుంబున విగతప్రాణుండై నకంసునిశరీరంబు రంగద్వారంబునఁ బరిఘూకారంబుగా నడ్డంబు దిగిచి కృష్ణుండు కంసుసోదరుం డగుసునాముదెసం జూచునంతకుమున్న ప్రలంబాంతకుం డెంతయు రయంబున నద్దురాత్ముం బొదివి.

క. గొదగొనిసారంగంబుం, బొదివినసింగంబుకరణి భూరిబలము పెం
పొదవంగఁ జేరి చెండాడి దురాలోకక్రియాపటిష్ఠత మెఱసెన్.

వ. అప్పుడప్పుణ్యపురుషులమీఁదం ద్రిదశకరవిముక్తం బగుకుసుమవర్షంబు గురిసె దివంబున దేవదుందుభులు మొరసె మునులయాశీర్వాదనాదంబులు సిద్ధులజయవచోనాదంబులును మేదురంబులై రోదసి నిండెఁ బ్రత్యర్థిభంజనపారీణుం డైన యాపద్మనాభుండు గ్రక్కునం జనుదెంచి కంసదళనకఠోరంబు లగుకరంబులఁ దండ్రిచరణగ్రహణం బొనరించిన నతండు గాఢంబుగాఁ గౌఁగిలించి దీవించెఁ దల్లికి మ్రొక్కిన నుద్గతనవక్షీరమస్తనం బగునురంబునఁ గొడుకుం గడుబిగియంగదియించి శిరంబు మూర్కొనియె నవ్విభుండు మఱియును.

తే. ఉగ్రసేనునిఁ గని మ్రొక్కి యోలినఖిల, వంశవృద్ధులకును మ్రొక్కి వారుదనకు
నిచ్చుదీవన గైకొని యింపుమిగులు, వాక్యముల నందఱను హర్షవనధిఁ దేల్చె.

వ. తదనంతరంబ సకలజనంబులం బోవంబనిచి యగ్రజుండునుం దానును జనకమందిరంబున కరిగె బృందారకమునిసిద్ధగంధర్వాదులు గోవిందువిక్రమవర్ణనాపూర్ణమనోరథు లగుచు సురపథంబున నుండి నిజస్థానంబులకుఁ జని రంత.

తే. దితిసుతాంతకుచేఁ జిక్కి దిక్కులేని, పీనుఁగై రంగవాటంబు పెద్దబయలఁ
బడినయక్కంసుకడకుఁ దద్భార్య లెల్ల, నరుగుదెంచిరి వెస నంతిపురము వెడలి.

వ. అప్పుడు.

సీ. కరతాడనములఁ జన్గవలపై లత్తుక చట్టలుచటిచినచాడ్పు దోపఁ
దెగిరాలుహారమౌక్తికములు నశ్రుబిందువు లేర్పఱుపరాక దొందడింప
నెండెడువాతెఱ నెసఁగుతాంబూలరక్తిమ శోకవహ్నిఁ గ్రక్కెడు తెఱఁగుగఁ
దూలెడుపయ్యెద దుఃఖాంబునిధిలోనఁ గడలుచందంబునఁ గడలుకొనఁగ
వీడి వెన్నుల వ్రేలెడివేణు లోలి, వెలసి కాలాహినిభములై సొలపుఁ జూపఁ
బొదువుమూర్ఛలదెందంబు దిగులుకొలుప, నలఁతకోలఁదికిమిగిలెనయ్యంగనలకు.

క. అందఱుఁ బతిపైఁబడి కడుఁ, గ్రందుగ నఖిలాంగకములు గదియం గౌఁగి
ళ్లం దొడ్డగఁ నిట్టని యాక్రందన మొనరించి రధికకరుణధ్వనులన్.

సీ. నృపగంధహస్తివై నీవన్యనృపగంధ మించుకంతయు సైపకింతదాఁక
సార్వకాలికమదస్ఫారవిశృంఖలలీలవర్తింపంగఁ గాలుఁ డాత్మఁ

జలమెత్తి గోకులసంభూత మగుకృష్ణవీరసింహముఁ దెచ్చి విడిచె నీకుఁ
జేష్టింప లేవైతి చిక్కితి మడిసితి నీపోక లరిది వర్ణింప నధిప
యార్తకరిణీసమానదురంతదశకు, భాజనంబుల మైతిమి రాజ మమ్ము
నరయఁదగదె నీమన్నన యకట యెందుఁ, బోయెఁ జెప్పఁగ లేవైతి పోవునపుడు.

కంసభార్యలుమృతుండయిన పెనిమిటిం జేర్కొని విలాపంబుసేయుట.

క. మామీఁద నీమనంబునఁ, బ్రేమము లేకుండుగాక ప్రియబాంధవమి
త్రామాత్యులు లేరే వా, రేమిగొఱఁతచేసి రెడసి యేగితి దివికిన్.

తే. చిదిమి వైచినవెత్తమ్మినెనసి వాడి, వందినది నీముఖంబు వివర్ణతార
కంబులై యొప్పు సెడినవి కన్ను లిట్టి, శూన్యభావ మెమెమ్మెయిఁ జూతు మనఘ

ఉ. ఆరమణీయకుండలము లక్కట యెక్కడఁబోయె నెంతయున్
గారవ మేది కర్ణములు గండతలంబుల నంటికొన్న వా
చారుకిరీట మెట్లొఱగి స్రగ్గ నరేంద్రత లేద నీకు నా
భూరిభుజాంతరావరణము ల్దగి యిమ్మెయి ధూళిబ్రుంగెనే.

మ. దివిజానీకముతోడఁ గూడ ననిలో దేవాధిపున్ విక్రమ
వ్యవహారంబునకుం దొలంగ నిడి తావార్ధిశుగేహంబునం
దు వెలుంగొందుసమస్తవస్తుమణిసందోహంబు చూఱాడి తిం
తవెసం గూల్చెనె మర్త్యుఁ డొక్కరుఁ డమర్త్యప్రాయు నిన్నుం దుదిన్.

ఉ. వాసవుఁ డల్గినీభువికి వర్షము మాన్పిన నవ్వి నీవు బా
ణాసనముక్తదివ్యవిశిఖావలి నంబుదకోటిఁ బ్రచ్చి ధా
రాసలిలప్లవం బఖిలరంజకమై యొలయంగఁ జేయవే
నీసరి యెవ్వ రిష్టు విధి నిర్దయుఁ డైన వశంబె యెద్దియున్.

తే. నేలనాలుగుచెఱఁగుల నృపులు నీకు, నధికనమ్రులై తమసొమ్ము లంతవట్టు
నిచ్చి బ్రతికిరి నీశౌర్య మేల యిట్లు, గోపబాలునిచేఁ జిక్కె భూపసింహ.

ఉ. చాలెడువాఁడ వెన్నఁడును జావును జేటును బొందకంచు నీ
ప్రాలకుఁ దోయిలొగ్గుటది భాగ్యఫలంబుగ నేము నమ్మి సౌ
ఖ్యాలసలీలనుండ నది యంతయు బొంకుగఁజేసి తాండ్రకున్
వాలినపేర్మియేది విధవాదశఁ బొందఁగఁజేత పాడియే.

క. సురపురిమధురకునెక్కుడె, సురకాంతలుమాకుదొరయె సురభంజన నీ
వరుగుట యొప్పనిపని వే, మరలుము మామాట వినుము మముఁగావఁదగున్.

తే. అకట మాతల్లి ముదుసలి యగ్గలముగఁ, గలదు నీమీఁదియర్మిలి యలఘుచరిత
యింక నీయమయలమట కేది గుఱుతు, గురుజనప్రీతిసేయమి గుణమె నీకు.

క. హా నాథ హా మహారిపు, హానికరణధుర్యశౌర్య హా నిజవంశై
కానందప్రద యనవల, మైనారము ఘోరవిలాప మాలింపఁ గదే.

క. అని యఝ్యుంతులు బహువిధ, మునఁ బలవింపంగ దుఃఖమోహాకులయై
చనుదెంచెఁ గంసమాతవ, దనమెండఁగఁ గన్నులశ్రుతతుల మునుంగన్.

ఉ. నాతనయుండు గంసుఁడు వినమ్రసురాసురమర్త్యలోకుఁ డు
ద్దీతపరాక్రముం డెచటఁ గీడ్వడి వ్రాలినవాఁడు చూపరే
యాతని నంచు వచ్చి కమలానన గాంచె యుగాంతశాంతకం
జాతహితుండ పోలె నవసన్నత నొందినయమ్మహీవిభున్.

క. కని పైఁబడి కోడండ్రును, దనచుట్టుం బొదివి యేడ్వఁ దద్దయు శోకం
బున నంకతలంబునఁ బు, త్రునితలఁ గదియించి యెలుఁగు తొట్రువడంగన్.

వ. ఇట్లని విలాపంబుచేసె.

సీ. సంసారసుఖములు సర్వంబులును సులభంబులై యుండఁ జిత్తంబులోన
నొకటియుఁ గైకొన కూర్ధ్వగతికి నీవు కొడుక యిమ్మెయి వేగపడుట దగవె
తల్లితోఁ జెప్పవు తండ్రిఁ జింతింపవు భామలఁ దలఁపవు బంధుకోటి
నొల్లవు భృత్యుల నూహింపవు పురిక సురిఁగితి విది రాజసుతులవిధమె
యకట వీరవ్రతస్థుండవై జగమునఁ, బేరుకొన్నవాఁడవు యదువీరుచేతఁ
గోలుపోయెనె నీపేర్మి గోముదక్కి, యెందుఁ జేరుదు రింక నీయేలుజనులు.

ఉ. రావణతుల్యశౌర్య నిను రామసమానుఁడు గాక యన్యుఁ డీ
త్రోవలఁ బుచ్చఁగాఁ గలఁడె దుర్దమవృష్ణికులోద్భవుం డొకం
డీవిపులోర్వి నోర్వఁ గలఁ డింకని చెప్పిరి గాదె మున్ను కా
లావధివేదులైనబుధులాతఁడ యీతఁడు పల్కు లేటికిన్.

వ. అనుచు నమ్మగువ యప్పుడ చనుదెంచి దీనాననుండై నిజవల్లభు నుగ్రసేను నుద్దేశించి.

క. నీపుత్రునిఁ జూచితె ధర, ణీపాలక వజ్రపాతనిహతాద్రిక్రియన్
రూపు సెడి వీరశయన, బ్రాపితుఁడై నాఁడు కృష్ణుబాహుస్ఫూర్తిన్.

వ. ఇతనికిం గాలోచితం బయినసంస్కారం బొనరింప వలవదె రాజ్యంబులు వీర భోజ్యంబులు గావున రాజు కృష్ణుండ నీవు పోయి యవ్వీరునిం గని వైరంబులు మరణాంతంబులు మనంబునఁ గంసాపరాధంబుల ననురోధింపక తదుత్తరక్రియలకు ననుమతింప వలయు నని విజ్ఞాపింపు మనియె నంతఁ గంసపతనావసానం బగు హరిపరాక్రమకార్యప్రస్థానం బనుసంధించి కృతకార్యుండ పోలెఁ దీవ్రకరుం డపరగిరియవలి కరిగె నట్టియెడ.

సీ. కంసభామినులయాక్రందనధ్వనివీను లొందినఁ జిత్తంబునందుఁ గరుణ
యంకురింపఁగఁ గృష్ణుఁ డఖిలయాదవులమధ్యమున నశ్రువులు నేత్రముల నించి
యకట యే నధికబాల్యమున సైపక యిట్లు సద్భామినీసహస్రములఁ దీవ్ర
వైధవ్యశోకదుర్వారవారిధిలోన ముంచితిఁ గంసుని మొఱకతనములు
దలఁపవచ్చినఁ జంపక తొలఁగు నెవ్వఁ, డాత్మజనకుని నుగ్రబంధాభితప్తుఁ
జేసి లోకులు నిందింప సిద్ధరాజ్య, విభవ మొక్కఁడు గొన్నాఁడె వీఁడు దక్క.

క. పాపిదెసఁ గరుణసేయుట, పాపం బని చెప్ప విందుఁ బ్రకటితధర్మ
వ్యాపారుఁ దైనపురుషునిఁ, జేపట్టుము రమరులును బ్రసిద్ధప్రీతిన్.

ఉగ్రసేనుఁడు కంసునకు నగ్నిసంస్కారంబుసేయుటకుఁ గృష్ణునననుజ్ఞ నొందుట.

వ. ధర్మహీనుం డగునిద్దురాత్ము వధియించుట సర్వలోకసమ్మతంబుగా మున్న యె
ఱింగి ప్రవర్తించితి నిటమీఁదఁ గర్తవ్యం బెయ్యది గల దది యెల్ల నెఱుంగుదు
నన్నియుఁ గొఱంతపడక యుండ నిర్వహింపుము నని పలుకుచుండ నుగ్రసే
నుండు శినిప్రభృతు లగుయదువృద్ధులు పొదివికొని చనుదేరం జనుదెంచి జనా
ర్దనుముందర నవనతాననుండై యశ్రులు దొఱఁగఁ గొంతసే పూరకయుండి
యనంతరంబ గద్గదకంఠుం డగుచు నతని కిట్లనియె.

సీ. అన్న కుమార నీయద్భుతక్రోధాగ్ని నాహుతిఁ జేసి తుగ్రారివీరు
విక్రమవిఖ్యాతి వెలయించి తెందును దివ్యమాహాత్మ్యంబు దేటపఱిచి
తహితసామంతుల నడలించి తఖిలయాదవవంశమునకు నుత్సవ మొనర్చి
తార్యుల మిత్రుల నాత్మీయపక్షంబు గావించి తెసఁగితి గౌరవమున
రాజ్య మింతయు నీసొమ్ము రాజ వీవు, గుడువఁ గట్టను బెట్టను గొఱఁత లేక
యేనుఁగుల గుజ్జుములనెక్కి యెల్లవారుఁ, గొల్వసాధురక్షకుఁడవై కొఱలుమింక.

క. జితశాత్రవుఁడవు గావున, మతిలోఁ బగదలఁప కనఘ మాబోఁటులకున్
గతివై యార్తశరణ్యుం, డితఁ డనఁగా నునికి నీకు నెంతయు నొప్పున్.

వ. భవదీయక్రోధాగ్నిదగ్ధుం డైనకంసునకుం బ్రేతకార్యం బిప్పుడు కర్తవ్యంబు నీవు
దీనికి ననుజ్ఞ యిచ్చి పనిచిన నాలుగోడంద్రుడు నేను నవ్విధంబు నడపి తోయ
ప్రదానమాత్రంబు సేసి ఋణమోక్షణంబు నొందెద నట మీఁద జటావల్కల
ధారణం బొనర్చి కాఱడవి చొచ్చి మృగంబులకు నెచ్చెలినై చరింపం గలవాఁడ
నిదియు నిశ్చయం బనిన విని గోవిందుండు.

తే. అధిప నీవింత నన్నిప్పు డడుగనేల, కాచికార్యంబు సేప్పెద పూని నీవు
కంసునికిఁ బశ్చిమోర్ధ్వదేహకార్యసరణు, లకట నడపంగ వల దంటినయ్య యేను.

వ. ఇంక నొక్కటి యుగ్గడించెదఁ జిత్తగింపుము.

సీ. రాజ్యంబు పనిలేదు రాజధనంబుపై నాసయుఁ జొరదు నాయాత్మఁ గంసుఁ
దునుముటయును నర్థదోహలంబునఁ గాదు వంశపాంసనుఁడును వసుధ కెల్లఁ,
గంటకుండును గాన గ్రక్కున నీతని నిట్లు సేసితి లోకహితము గోరి
యెవ్వారలకు లేని యెసకంపుఁగీర్తి శాశ్వత మయ్యె నింతియ చాలు నాకు
నింక నెప్పటియట్టుల యేను బోయి, యాలకదుపులనడుమ గోపాలకోటిఁ
గూడి యాడుచు నట వన్యకుంజరంబు, రీతిఁ గోరినగతి విహరించువాఁడ.

క. మది నది వేఱొకతెఱఁగై, యెదిరికిఁ బుచ్చినదిగాఁగ నిట్లాడితిఁ గా
కుదితయశా నీవొక్కటి, మదీయవిజ్ఞాపనక్రమము విను మింకన్.

శా. నీసొమ్మై పెనుపొందు రాజ్యము దగ న్నీకీక నీచాత్ముఁడై
నీసూనుం డెడ నాక్రమించికొనియె న్నిర్వ్యాజభంగిం దుదిన్
దోసం బేమియు లేక యంతయును నిన్నుం జేరెఁ గైకొమ్మనా
యాసప్రక్రియ నిష్టు పొందు మభిషేకానంద కల్యాణమున్.

తే. ఏను గెలిచినసిరినీకు నిచ్చుచున్న, వాఁడ నామీఁదఁ బ్రియమును వత్సలతయుఁ
గలిగె నేనిఁ ద్రోవక చేయవలయు నాదు, ప్రార్థనంబు సర్వాన్వయప్రభుఁడ వీవు.

క. అనుటయు నుత్తర మేమియు, ననక తిలజ్జావినమ్ర మగువదనముతోఁ
బెను ప్రమద మున్నయాతని, ననఘుం డాక్షణమ సర్వయదుమధ్యమునన్.

వ. భద్రాసనంబున నునిచి సముచితంబుగా నభిషేకించె నివ్విధంబున నభిషిక్తుండై
యనంతరంబ యయ్యుగ్రసేనుండు.

చ. హరియును సర్వబాంధవులు నర్హపురోహితభూసురేంద్రులుం
బురజనులున్ సమేతులుగఁ బుత్రుల కిద్దఱకున్ సమస్తసం
స్కరణములున్ యథోక్తములుగా నొనరించి కృతార్థుఁడయ్యె ని
ప్పురుసునఁ గంసుఁడొందెఁ బితృభావితలోకము లాత్తసత్క్రియన్.

వ. వాసుదేవుండును నుగ్రసేను రాజుం జేసి సర్వరాజ్యంబునకుం బ్రవర్తకుండు
దానై యఖిలనియోగంబులు నభియోగంబులుగాఁ బ్రయోగించి మధురాపు
రంబు తొల్లింటికంటెను విభవబంధురంబుఁ గావించి ముదంబున నుండి యొక్క
నాఁ డగ్రజుతో విచారించి.

మ. జననంబాదిగ నాలలోఁ బెరిగి సంస్కారంబు నాచారమున్
ఘనవిద్యాగ్రహణంబు లేక యడవింగారెక్కుచందంబునన్
జనఁగాఁ గాలము వ్రాయె నింక వలదే సమ్యగ్గురూపాసనం
బున నాసర్వము గైకొనంగ నని యభ్యుత్సాహసంపన్నతన్.

వ. అవ్విధంబు బంధుజనంబుల కెఱింగించి యిద్దఱుం గూడి యవంతిపురనివాసుం
డై యున్న కాశ్యపుం డగుసాందీపుండనుమహాద్విజునిపాలికిం జని యాత్మీయంబు

లగుగోత్రనామంబు లెఱింగించి గురుత్వంబునకుం బ్రార్థించిన సంప్రాప్తసమ్మతుండై యతండు వారిం బ్రియశిష్యులంగాఁ బరిగ్రహించి సంస్కారపూర్వకంబగుసకలకళాకలాపంబు నొసంగిన.

—— శ్రీకృష్ణబలరాములు సాందీపునియొద్ద సకల విద్యాభ్యాసంబు సేయుట. ——

సీ. అతిలోకధీగుణోదాత్తులై యన్నయుఁ దమ్ముండు నొలి వేదములు నాల్గు
నంగంబు లాఱును నఱువదినాలుగుదినములఁ జదివిరి దసరుధర్మ
శాస్త్రితర్కన్యాయసరణియు గణితగాంధర్వలేఖ్యములు గంధర్వదంతి
రథశిక్షలును వాసరములు పండ్రెంటను నెఱింగిరి సాంగమై వఱలునస్త్ర
నిగమ మేఁబదినాళ్లనె నెఱయఁ గఱచి, రిట్టినిత్యప్రకాశసమిద్ధమహిమ
చూచి నరరూపధరులైనసూర్యచంద్రు, లని తలఁచెవారినాగురుం డాత్మలోన.

వ. మఱియుఁ దదీయప్రభావం బెఱుంగంగోరి తచ్చరితం బరయునెడఁ బర్వకాలంబునఁ బార్వతీపతి నతిరహస్యాభ్యర్చనంబుల భజయింపనమ్మహాదేవ్యం డమ్మహానుభావులచేయుసపర్యలు సాక్షాద్భావంబునం గైకొనం గనుంగొని యతండు వీరు సామాన్యపురుషులుగా రెయ్యదియే నొక్కదివ్యాంశంబున నవతరించినవారు వీరిచేత నెంతలెంతలు పను లైనను నగునని నిశ్చయించె నంత నభ్యస్తసకలవిద్యుండై కృష్ణుం డగ్రజసహితంబుగా నాచార్యునకు నమస్కరించి.

క. ధన్యుల మైతిమి మీకృప, మాన్యగుణాధార నీవు మము నొకయర్థం
బన్యాయంబుగ నడుగు మ, నన్యసులభ మైన దెద్ది యైనను వేడ్కన్.

చ. అనిన గురుండు నాకనఘ యాత్మజుఁ డొక్కఁడు వానిఁ దీర్థసే
వనసమయంబునన్ లవణవారిధిలోఁ దిమిరొక్కఁడు గ్రమ్మై
కొనిచనియెన్ దదాది యగుఘోరపుశోకము వహ్నియై మదిం
గనలుచు నుండు నక్కొడుకు గ్రమ్మఱఁ గల్గెడునట్లు సేయవే.

వ. అట్లయిన మాకులంబెల్ల నుద్ధరించినవాఁడవై గురుదక్షిణాప్రముఖలలోన నగ్రగణ్యన గనిమెద వనిన నట్లకాక యని కృష్ణుండు రాముచేత ననుజ్ఞాతుండై శాతాసిశరసమేతం బగుప్రభూతబాణాసనంబు గైకొని సముద్రుకడకుంబోయి.

తే. మహితయశుఁడు సాందీపుఁడుమాగురుండు
సుతునిఁ గోల్పోయె నీయందుఁ జూపు మాకుఁ
దద్విఘాతకుఁ డగుద్రోహిఁ దడయ కనిన
జలధి సాకారుఁడై కరంబులు మొగిడ్చి.

క. పంచజనుం డనుదైత్యుఁడు, దంచితతిమిరూపధారి యై గురుపుత్రున్
వంచన హరించి మ్రింగెను, గ్రంచన నొప్పింతువాని ఘనభుజ నీకున్

మ. అని యుత్తుంగతరంగహస్తములఁ గ్రూరారాతిఁ దీరస్థలం
బునకుం దెచ్చిన నవ్విభుండు ప్రసభస్ఫూర్జత్కృపాణాహతిన్
దనుజున్ వ్రచ్చి గతాసు భూసురసుతుం దత్కుక్షిలోఁ గాన కా
ఘనసత్త్వంబు శరీరజం బయినశంఖం బొప్పుతో నుండినన్.

వ. అప్పుణ్యవస్తువుం బ్రియంపడి పుచ్చుకొని తనకుం జిందం బగునని పరిగ్రహించె నద్దేవుం డొనర్చిననామంబునఁ బంచజనజనితం బగుటనదిపాంచజన్యం బననమరాసురమనుష్యలోకంబులఁ బ్రసిద్ధినొందె ననంతరంబ యతండు

క. చచ్చినవిమ్మట నెటువ్రో, వచ్చు జముఁడ కాక యెల్లవారికి గతి యే
నచ్చట నతనిం బట్టఁగ, నచ్చుపడదె కర్జమెల్ల నని కడుఁగడఁకన్.

వ. దక్షిణదిశకుం జని దక్షిణాధీశ్వరుపురంబు సొచ్చి యాసనస్థుం డైనయాసూర్యపుత్త్రుం గని రోషసంరక్తలోచనుండై యస్మదాచార్యుం డైనసాందీపునికొడుకుం దెచ్చిననాఁడవు క్రమ్మఱ గ్రమ్మన నతని నెప్పింపు మొప్పింపక యొప్పనిపనికిం జొచ్చితేని నెవ్వోటు సొచ్చియు బ్రదుక నేర్చిననాఁడవు గావనిన వడంకుచు లేచి నిలిచి విరచితాంజలియై వైవస్వతుండు.

తే. పూని సర్వజంతువులను బుణ్యపాప, గతులఁ బుచ్చుటకొకటికిఁ గర్త నేను
బ్రాణహరణంబుమృత్యువుపనిమహాత్మ, తెచ్చెమృత్యువుగురుసుతుఁ దెల్లమింత.

వ. దీని నవధరించి నన్ను రక్షింపు మనిన నప్పరమేశ్వరుండు.

శా. ఏమీ మద్గురుపుత్త్రుఁ దెచ్చుటయ కా కిబ్భంగినేఁ గ్రమ్మఱం
గా మామద్గఖ మొకింతయుం గొన కహంకారంబు పూరించెనే
వామాచారుఁడు మృత్యు వన్ ఖలుఁడు సావం గోరెఁ గాకేమి యు
ద్దామక్రోధకృశాను నింకఁ బనుతుం దన్మూలసందాహిగన్.

వ. అనిపలికి సజ్యం బగుశరాసనంబు దృఢముష్టి నమర్చి విశిష్టం బగుదివ్యాస్త్రంబు గైకొనిన నమ్మహానుభావుభవ్యవిభూతికి భీతిం బొంది యత్యంతరయంబున మృత్యువు తద్గురుకుమారుం బునరాత్తశరీరుం జేసి తెచ్చి.

క. వినయగభీరతలోపలఁ, దనతప్పంతయును నడఁగఁ దనుజదమనుచే
తనివేదించినఁ దగఁ గై, కొని విభుఁ డనుమోద మాత్మ్యఁగూరఁగమరలన్.

—— శ్రీకృష్ణుఁడు సాందీపునికి మృతపుత్త్రుని గురుదక్షిణగాఁ దెచ్చియిచ్చుట. ——

వ. ఇట్టిమహాప్రభావం బనుసంధించి.

చ. చిరమృతుఁడై యమక్షయముఁ జెందినవిప్రసుతుండు క్రమ్మఱన్
సురుచిరపూర్వదేహపరిశోభితుఁ డయ్యె నశక్య మప్రత
ర్క్యరచన మద్భుతం బసుకరం బొరులెవ్వరి కిట్టిచేత యం
చురుఘణితి న్నుతించె హరి నోలిన సర్వసురాసురాళియున్.

వ. ఇట్లు క్రమంబున సముద్రదనుజదండధరమృత్యువులసాధించిపాంచజన్యపూర్వకం
బుగా గురుపుత్రుం బడసి యరుగుదెంచి యా జగద్గురుండు గురునకుసమర్పించిన.

శా. తానాశ్చర్యరసంబులోఁ మునిఁగి గాత్రం బా త్తరోమాంచమై
యానందాశ్రులతోఁడ భూసురవరుం డాత్మోద్భవుం గేశవుః
శ్రీనిండారఁగ నెక్కు-కౌఁగిటన యర్థిం జేర్చి యాశీర్వచో
దానాభ్యర్చితుఁ జేసె వేవిధుల నాత్రైలోక్యసంపూజితుః.

క. గురుదక్షిణయిమ్మెయిఁ గడు, నరుదారఁగ నొసఁగి కృష్ణుఁ డన్నయుఁ దానుః
గురునెద్ద మఱియును గదా, పరిఘాద్యాయుధకళానుభవతత్పరతః.

వ. కతిపయదివసంబులు వసియించి యమ్మహాత్ము వీడ్కొని మధురాపురంబునకుం
జనుదెంచె నిట్లు సకలవిద్యాభ్యాసపారీణు లైనవారిరాకకుఁ బురంబు సర్వాలం
కారసమేతంబు గావించి.

సీ. వారువంబుల మేటితేరులఁ బొలుపారునేనుంగులను నెక్కి వేనవేలు
భంగులఁ గైసేసి బాంధవు లయ్యుగ్రసేనుండు మున్నుగాఁ జెన్ను మిగుల
మాన్యపురోహితమంత్రిసామంతసీమంతినీపౌరసమస్తభృత్య
సూతమాగధవందివైతాళికానేకజనసంకులస్ఫూర్తి సంఘటించి
శంఖదుందుభినిస్సాణసరసగాన, నర్తనోత్సవసంభృతానందలీల
నెదురుకొని తోడితెచ్చిరయ్యిద్దఱను బ్రబి, యంబులందందనిండారియలవులెడల.

శా. ఉల్లంబుల్ వికసిల్ల మందపవనుం డుద్గంధియై వీచె వ
ర్తిల్లెః భానుఁడు మేఘముక్తవిసరద్దీప్తిప్రతాపంబుతోఁ
నుల్లాసంబు వహించె వహ్నులు విధూమోద్యచ్ఛిఖాశ్రేణి శో
భిల్లం బెల్లుగ వాసుదేవునిపురాభిప్రాప్తివేళం దగః.

ఉ. ఆతతరాగవేగమున నచ్యుతుచేత సనాథమై వికా
సాతిశయం బెలర్ప నెలరారె సమస్తపురంధ్రిపూరుష
వ్రాతము గోగజాశ్వము లవారణఁ బ్రస్ఫుటచేష్టలం బ్రమా
ణాతిగహర్షముం దెలిపె నప్పుర మప్పరమోత్సవంబునః.

క. లలితాయతనంబులలోఁ, నలఘుసమభ్యర్చనముల నంది తనరువే
ల్పులప్రతిమలును బ్రసన్నత, కలిమి యెఱింగించె భద్రకాంతిశ్రీలః.

క. దీనుఁడు వికలుఁడు జడుఁ డవ, మానితుఁ డాతురుఁడు లేఁడు మధురాపురి నే
మానవుఁడును గృతయుగసమ, యానుకృతిం బొల్చెఁ దత్సమయ ముజ్జ్వలమై.

వ. అట్టిసమయంబున.

క. ఇరుగెలఁకుల మణికాంచన, విరచితహర్మ్యముల నుండి వెలఁదులు ప్రీతిం
బురుషోత్తముఁ జూచిరి వి, స్ఫురితకుతూహలము లుల్లములఁ దళుకొత్తః.

తే. కామినీనేత్రరోచులు కడళులొత్తి, వెల్లువై మీఁదఁ గవియంగ విభుఁడు మెఱసె
మఱగి బృందావనంబునఁ దిరుగునాఁడు, యమునలో నీఁది యాడెడునట్లు పోలె.

వ. అప్పు డప్పుణ్యకాంతాజనంబులు దమలోన.

సీ. వ్రేతంబు గరఁగంగ వేడుకఁ బిల్లఁగ్రోలెనయఁ బేర్చినదె యీయిగుఃసమోని
మానంబు వీటిఁబ్రా మసఁగి వ్రేతలఁ జిక్కుపఱచినయదియె యీశఱటిచూపు
నింపార వ్రేతల కేఁతకు మిక్కిలి లోఁతైనయదియె యీ లేఁతనవ్వు
వేలసంఖ్యలు గల వ్రేతలఁ జనుదోయి బిగియనొత్తినదె యీ పేరురంబు
పూని దేవరయని కేనిఁ గాక వీని, పోలి చక్కనివాఁ డని చూచి రేని
గడఁగి తివుట లుల్లంబులఁ గ్రందుకొనఁగ, నెట్టియీలువుటాండ్రును నెగ్గుపడరె.

వ. అనుచుండం బుండరీకాక్షుండు పూర్వజపూర్వకంబుగా వసుదేవునిసదనంబున కరిగి తల్లికిం దండ్రికి నమస్కరించి తదాశీర్వచనంబుల నభినందితుండై విద్యాభ్యాసప్రకారం బంతయు బంధుజనమధ్యంబున నెఱింగించి సుఖంబుండె నని జనమేజయజనపతికి వైశంపాయనమునివరుండు వివరించిన విష్ణుచరితాత్మకం బగు వాఙ్మయం బతిశ్రావ్యంబుగ.

మ. త్వరితానేకసమీకసాగర సమిద్ధక్షాత్రజైత్రోద్యమ
త్వరితానేకరథాశ్వహస్తిసుభటోద్యత్సైన్యధన్యక్రమా
చరితానేకసమర్థపార్థివమహాసౌహార్దనిర్దోషతా
స్ఫురితానేకగుణౌఘనిర్మలయశఃప్రోత్ఫుల్లదిఙ్మండలా.

క. నారీరమణరమాత్మజ, నారాయణసదృశ వీరనారాయణ నా
నారణనర్తితనారద నారాచక్షుభ్యదన్యనరవరసైన్యా.

మాలిని. అహితజనకఠోరా యన్నమాంబాకుమారా
విహితధరణిరక్షా వీరశృంగారదక్షా
మహితసుజనలోకా మాననీయప్రతీకా
రహితదురితసంగా రాయవేశ్యాభుజంగా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్య ధుర్య శ్రీసూర్యనారాయణసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైనహరివంశంబునం బూర్వభాగంబు సర్వంబు నవమాశ్వాసము.

శుభమస్తు.

# హరివంశము

## ఉత్తరభాగము - ప్రథమాశ్వాసము.



క. శ్రీపరిణతభుజవైభవ, గోపాయితభువనజగదగోపాల ధరి
త్రీపాలననుతసద్గుణ, నైపుణధౌరేయ ధీర నాయకక్షేమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు మధుమథనుండు మథురాపురంబున మధురం బగురాజభావంబు గైకొని గోకులనివాసవ్యాసంగం బంతరంగంబునకు వింతయై తోఁప నింపారుబంధుస్నేహాబంధబంధురప్రవర్తనంబు కీర్తనీయంబుగా నుల్లసిల్లె నాసమయంబున.

ఉ. సింధురవైరిశౌర్యుఁడు ప్రసిద్ధయశస్స్ఫుటికావృతాష్టది
క్సింధురవక్త్రుఁ డుద్ధరణకృత్యుఁడు రాజగృహేశుఁ డాజరా
సంధుఁ డరాతిరాజపరిషత్పరిసేవితబంధుఁ డార్యగ
ర్వాంధుఁ డవంధ్యగోపకుసుమాన్వితదర్పమహీరుహుం డిల్లన్.

వ. అస్తిప్రాస్తినామధేయ లయినకంసభార్య లిద్దఱుఁ దన కూఁతులు గావున వారికి నైనవైధవ్యదైన్యంబు తనకు నత్యంతదుస్సహం బగుటయుఁ గృష్ణపరాక్రమంబు సహింపక సర్వసర్వంసహాచక్రంబునం బరఁగురాజుల నందఱం గూర్చి యిరువదియొక్కయక్షౌహిణీసంఖ్యగలసైన్యంబుతోడ మథురపై నెత్తిచనుదెంచి యమునాతీరంబున విడిసి.



### జరాసంధుఁడు మథురపైఁ దండెత్తివచ్చి కృష్ణునొద్దకు దూతలఁ బంచుట.

క. విందానువిందు లనఁగా, నెందును బేర్కొనినవారి నిరువుర భూభృ
న్నందనుల నవంతీశుల, నెందఁగ దూతలుగఁ గృష్ణునొద్దకుఁ బనిచెన్.

వ. పనుచుటయు వారు నరుగుదెంచి యమ్మసభామధ్యంబున మహనీయనృపాసనాసీనుండై యున్నయుగ్రసేనుం గని తత్పార్శ్వంబున బలభద్రసహితంబుగా నుచితపీఠోపరిదేశంబునఁ బొలుపారుపురుషోత్తముం గాంచి యిట్లనిరి.

మ. జననాథాగ్రణి సత్యసంధుఁడు జరాసంధుండు గోవింద ని
న్ననుమానింపక యాడు మన్న తెఱఁగే మారాజువాక్యంబుగా
నొనరం బల్కెద మల్క లేక వినుమా యొక్కింత యీయుగ్రసే
ననరేంద్రుండును సర్వయాదవవితానంబున్ వినం బెంపునన్.

సీ. నీవును నన్నయు లావరులయి పేర్చి కంసుని దెసఁ జేయఁగలుగువారిఁ
జంపి యాతని ననుజసమేతముగ సమయించితి రమ్మనుజేశ్వరుండు
ఘనుఁడు నాయల్లుఁడు గాదిలికూఁతులు విధవలై శోకాగ్ని వేఁగుచుండ
నింతకాలంబును నే నశక్తుఁడనుగా నుండితి బిడ్డలయొప్పు చూడ
వలసి యాయితపడి యిదె వచ్చినాఁడ, మసఁగి నినుఁగూల్ప కకటయిమ్మధురలోనఁ
జొరఁగవచ్చునె నీనిజపరికరంబు, కడఁక యొప్పారఁ గొని వేగ వెడలు మనికి.

క. నీకొండె బ్రతికియుండుట, నాకొండెం గాక గోపనందన విను మీ
లోకంబున నిద్దఱకును, నేకసమయ వృత్తి పొసఁగునే యిటమీఁదన్.

తే. నిక్కమొకయాఁడుదియు నొకనీరుదొత్త,యొక్కగాడిద యొకకోడియొక్కగుఱ్ఱ
మనితలంపకు నను విలుప్తారిగంధుఁ,డగుజరాసంధుఁడుగ నింక సరసికొనుము.

మ. ఎదురై నిల్వఁగ నోపితేని సమరోద్దీర్ణస్ఫురద్బాహుసం
పది సొంపారఁగ నన్నదమ్ముల మిముం బ్రాణంబులం బాపుదుం
బదిలం బేది తొలంగితేని దివియుం బాతాళముల్ లోనుగాఁ
దుది నీచొచ్చినచోటఁ జొచ్చి కృతకృత్యుం జేయుదున్ మృత్యువున్.

క. దామోదర నినుఁ దక్కఁగ, నే మీయాదవులఁ గొందునే చీరికి నీ
వేమియుఁ జెప్పకు వారల, సామర్థ్యంబుం దదీయసాహాయ్యకమున్.

మ. గుధు, నయ్యానకదుందుభిన్ సఖుని సక్రూరున్ భుజారంభసం
భరితుం దమ్ముని సాత్యకిం బ్రియముతోఁ బాటించి నాచందముల్
వరుసం దెల్లముగాఁగ నీ వడుగు మే వత్తున్ ససైన్యుండనై
పురసంరోధ మొనర్ప రేపకడఁకం బూరింపు ముత్సాహతన్.

వ. ఇవి తదీయవచనంబులని విని కృష్ణుండు నవ్వుచు నవ్విందానువిందులతో మీరు
సముచితంబుగా నతనిమాట లుగ్గడించితి రిగ్గరిష్ఠతకు సంతసిల్లితి నే నిమ్మాటల
వాఁడఁగ్గాను నాపలుకొక్కటియ యది యతనితో నిట్లనుఁడు.

మ. తనయల్లుం బొరిగొన్నవాఁడ నిటమీఁదన్ సైతు నే యుక్కునం
దనుమర్దింపఁగ నేన రాఁ గడఁగ వోఁ దానచ్చె మేలయ్యెఁ జ
య్యన రానిమ్ము సగర్వదుర్వహమహాబాహాశక్తిమున్ రాక్షసాం
గనచే నందదుకై నయయ్యెడలు బ్రక్కల్ వాపెదం బ్రగ్మలన్.

తే. కంసుఁ బొరిగొని తద్రాజ్యఘనవిభూతి, యెట్టు లియ్యుగ్రసేనున కిచ్చినాఁడ
నట్ల యిత్తును నితనిక యతనిఁ గూల్చి, యధికమాగధరాజ్యసమగ్రగరిమ.

క. అని యారాజతనూజుల, ఘనతరసత్కారపూర్వకంబుగ వీడ్కో
ల్పినఁ బోయి యవ్విధము క్రమ, మునఁ జెప్పిరి వారు మగధభూపాలునకున్.

వ. ఇక్కడ నఖిలయాదవులు నుగ్రసేనవాసుదేవసహితంబుగ జరాసంధభయార్తు
లయి కార్యచింతనంబునకుఁ దొడంగునెడ నయకళానిర్నిద్రుం డగువికద్రుం
డనుయదువృద్ధుండు వారినందఱ వినుండని కృష్ణున కిట్లనియె.

మ. యదువంశంబను సంబుజోదరమునం దాబ్రహ్మయుంబోలె నీ
వుదయంబొంది సమస్తయాదవభయవ్యుచ్ఛేదదక్షుండ వై
త్రిదశేంద్రాదులమంతనంబులును బుద్ధిం గాంతు నీదృష్టి య
భ్యుదయాపాదిని మాకు నీవసమ యూయుత్సాహసన్నాహముల్.

క. అపరిమితనృపసహాయుఁడు, కపటోపాయుఁడు గఠోరకర్మ నిపుణుఁ డా
రిపుఁడతని నీవ యని మొన, నపజితుఁ గావించుటకు సమర్థుఁడ వనఘా.

వ. కంసుండు బలగర్వితుండై తనకు నెదురు లేదని యెవ్వరిం గైకొనక కోట పాటిం
పమింజేసి వప్రద్వారసంక్రమపరిఘాయంత్రాట్టాలకంబు లయ్యెప్రయత్నంబు
లెడలి యసంస్కారంబులై యాయుధంబులును ధనధాన్యాదులును సంగ్ర
హింపంబడక యిప్పురంబు దుర్గంబని నమ్మరాకయున్న దియదరిపాటునవచ్చి పగ
తుండునుం గదియవిడిసె నడిరిపొదివెనని దిగులుసొచ్చి లోపలివా రెవ్వరుం దల
సూపకున్న నిది గోలుపోయినయదియ రాష్ట్రంబునుం ద్రొక్కుడువడి చెడిపోవు
నింక నొక్కటి సెప్పెద.

క. విను దక్షిణాపథంబున, వనజేక్షణ తనరు ఋక్షవంతము వింధ్యం
బును సహ్యము ననఁగాఁ గల, యనుపమశైలములు బహుగహనసంకటముల్.

వ. తొల్లి ముచికుందుండు పద్మవంతుండు సారసుండు హరితుం డనుపేళ్ళంగల
యదువంశభూపతులు నలువురు వైరిభయనివారణార్థంబుగా నమ్మహాగిరుల
యందుఁ గావించినదుర్గంబు లనేకంబులు గలవు పడమటిసముద్రంబులోనిదీవు
లును బహువిధంబు లానలువురు రాజులకుం బెద్దవాఁడైన మాధవ్యుం డిమ్మధురా
పురంబు పాలించినవాఁడు దీని నలవరించుట యివ్వేళంబునకు లాగుపడ దిప్పటికి
నన్యదుర్గసమాశ్రయంబు వలసినయది యేను గార్యంబుజాడ గొంత యెఱిం
గించితి దీనికిం దగిన తెఱంగు నీవును విచారించి యెయ్యది వెర వవ్విధంబు నిర్వ
హింపు మనినవికద్రువాక్యంబు లాకర్ణించి కృష్ణుం డిట్లనియె.

క. ఇది యట్టిద నీచెప్పిన, సదభిమతోదారఫణితి సర్వము వింటిన్
మదిలోనఁ గంటి దీనికి, నొదవంగ నుపాయ మొకటి యూహించి తగన్.

ఉ. ఏనును నన్నయుం దడయ కిప్పురి వెల్వడి పోయి యాజరా
సూనుఁడు దత్సహాయులును జూడఁగ దక్షిణదిక్కుఁ బోవఁగాఁ

బూనెద మేము లేకునికి పొల్పుగఁ గాంచి యతండు సేనయుం
దానును గోటముట్టడము దక్కి వెసం జనుదెంచు మాబడిన్.

తే. వినుము విజయంబు గోరెడుమనుజవిభులు
తమకుఁ బ్రతివీరుఁ డైనశాత్రవుఁడు దప్పి
చనిన నతనిసకానితజ్జనులఁ దొడర
నెల్ల రఘలంపుఁ బెనఁకువ యొప్పు కునికి.

రామదామోదరులు మధురాపురంబు విడిచి జరాసంధుఁడు వెనుకొనఁ దొలంగిపోవుట.

వ. అట్టియుపాయంబున మేము నీ చెప్పినవింధ్యాదిమహీధరంబులమీఁదటిదుర్గం
బులు గైకొని బలసి మగధపతి వచ్చినను లావు మెఱసి కయ్యంబు సేసెదము
శాత్రవుండును జిత్రగహనాంతరంబులం జేయునది లేక చిక్కువడంగలవాఁడు నా
మతంబునఁ బురజనంబులుఁ గులంబువారును రాష్ట్రనివాసులు నలజడింబడక
బ్రతికెద రనియె నివ్విధంబునకు సకల యాదవులు నియ్యకొన బలరామదామో
దరులు నిరాయుధహస్తులై పురంబు నిర్గమించి యశంకితమతి నజ్జరాసంధు
పాలికిం జని సమ్ముఖంబున నిలిచి.

క. నానాదేశంబుల బలు, మానిసులం గూర్చినీవు మగధేశ్వర యే
పూనిక నిటవచ్చితి చెపు, మా నిక్కము నిర్వహింతు మప్పని యేమున్.

చ. అనుటయు నన్నరేంద్రుఁడు మహాబలనంతులుగాఁగ నిద్దఱన్
విని మిము నాజిలోఁ దొడరి విక్రమశౌండత సూపు టొక్కఁడుం
బనియుఁగ నేను వచ్చితిని బద్ధసముద్యములై కడంగుఁ డిం
కనిహతశత్రుఁడై మరలుఁగాక జరాసుతుఁ డూర కేగునే.

క. అనిపలికి సముద్ధతిఁ బటు, ధనువు రయం బెసఁగఁ గొని శితప్రదరంబుల్
నినిచిన నిషంగయుగ్మం, బనువుగ నరియించి కవచితాంగం బమరన్.

వ. నిలిచిన నయ్యోధపుంగవుం గనుంగొని సంభ్రమం బేమియు లేక తొలంగి యు
య్యదుకుమారులు సమదమాతంగసమగమనంబున దక్షిణాభిముఖులై చనం
దొడంగి రిట్లు చని రాష్ట్రంబులుపురంబులుఁ బెక్కులుగడచి వింధ్యాటవీభాగంబు
దటిసి ఋక్షవత్కాననాంతరంబుల మెలంగి యట సహ్యశైలంబునడవులు
గాచ్చి యందు.

మహాస్రగ్ధర. కనిరాపాతాళమూలకుతశిఖరిశిఖాకల్పితోత్తుంగతీర
ధ్వనితోత్పన్నానుబద్ధోదకబహులహరీదర్శనీయప్రవాహన్
వనహాస్తిధ్వస్తశాఖిప్రజగహనమహావప్రసంప్రాప్తభేద
స్వన నరతర్వాళ్ళకుంతన్ వరతటినిఁ బటువ్యాప్త నిర్వేణ్య వేణ్యన్.

సీ. అడవిమొల్లను దాన యైనది యన నమేయము లగుసంప్రరోహములు గలిగి
యాకు లెల్లను దాన యైనది యన నెంతయుఁ బరఁగినబహువిటపములు గలిగి
యవని యెల్లను దాన యైనది యనఁ దనరునీడ నొప్పారెడునెలవు గలిగి
యభ్రి మెల్లను దాన యైనది యన బహుపక్షిసంశ్రయ మైనపట్టు గలిగి
పక్వఫలసాంద్రవర్ణసంపన్నిరంతరంబు నిర్మలసుగంధమునై వైభవంబుఁ
జూపుచును సప్తలోకయుస్ఫురితమహిమఁ దనరు నుక్కమహావటవిటపిఁ గాంచి.

శ్రీకృష్ణబలరాములు పరశురామునింగని తమరాక యెఱింగించుట.

వ. వివిధసంస్కారశోభితం బగుతపోయస్థలంబున ననేకప్రాస్యంబులం జంద్రార్ధశేఖరు నంబికానాథు నాదిదేవుం ద్రిలోచను నర్చించుచుఁ బదార్తచిత్తుండై బహుపరిజనంబులు మనోజ్ఞవస్తువులం బనిమ బ్రాహ్మణామునియంబుల నభిమతాహారంబు సంఘటింప నుక్కదేసం గట్టినసవత్సయగునుపుష్ట హోమధేనువుం బార్శ్వంబులం బొలుపారుసుస్నిగ్ధసమిత్కుశమండలులును నిత్యసత్కృతుల వెలుం గుహుతహుతాశనుండును సంశితస్థలంబుల మహాధనుస్తూణీరకృపాణ పరశ్వధంబులును సుస్థితంబులై పెరిసి బ్రహ్మక్షత్రమయం బగుతేజంబు వెలుప నుదయార్కబింబమునుం బోని దేహమునం బొగులొను పిశఙ్గకపిలజటావళులు ప్రత్యగ్రమరీచు లయి మించియుంప జపానసనంబునం గణ్ఠాసక్తంబయిన యతిసూత్రంబును లలాటలసితంబు లగుభసితత్రిపుండ్రలిఖితంబులును జంద్రాంశునిర్మలంబు లగుయజ్ఞోపవీతంబులు నున్నతాంఘ్రినిష్ఠితం బగుమృగాజినోత్తరీయంబును ననవరతనియమకృశం బగుశరీరంబు భూషింపఁ గుశబ్రుసీరూపం బగుదీపితాసనంబున నాసీనుండై యున్నజామదగ్న్యమహాముని నంతంత నాలోకించి యయ్యిద్దఱు నాశ్చర్యభరితమానసు లగుచుఁ జేరనరిగి తదీయచరణంబులు దమశిరంబులు సోఁకం బ్రణామంబు లాచరించి కృష్ణుండు ప్రాంజలియై యతని కిట్లనియె.

మ. తగువిద్యాగుణరూపశోభితునిఁగా ధన్యంబులై యెవ్వనిం
బొగడుం లోకము లట్టిసంయమికులాంభోరాశిసంపూర్ణేందుని
న్నిగమైకేశ్వరు నిమ్మె మెఱింగితిమి నిర్ శ్రీజామదగ్న్యంపుగా
నగణీయంబులు నీప్రభావములు భవ్యంబుల్ సుధీసేవ్యముల్.

క. అమ్మైమొన నబ్ధితరంగలు, గ్రమ్మన నెడగలుగఁ ద్రోచి కాదే యిలుపట్టిమ్ములఁ బడసితి వీవ, హ్యామ్మునఁ బశ్చిమధరిత్రి యపరాంతమునన్.

ఉ. పావనవిక్రమోదయ విభాసితలీలఁ గృతార్థబుద్ధివై
నీ వొసఁగంగ సర్వధరణీవర రక్తజలోజ్జ్వలాంజలుల్

ద్రావను డిగ్గఁ ద్రోవను మతం బొకఁ డేర్పఱుపంగ నేరమిం
దావకపూర్వవంశసముదాయ మెలర్పక యున్నె నివ్వెఱన్.

తే. మాతృకంధరాపాతనసమర్థమైన, పరశు వఖిలపార్థివవంశపాటనమునఁ
బఱఁగ నేమనియెద నీప్రభావగరిమ, రైణుకేయ యౌదార్యసంగ్రహవిధేయ.

వ. ఏము యమునానదీతీరగోచరి యగుమథుర యనుపురి నివాసంబుగా నుండుదుము యదువంశజులము వసుదేవపుత్త్రులము బలదేవవాసుదేవనామధేయులము కంసభయంబున మాతండ్రి మమ్ముం బుట్టినయప్పుడ గోకులంబునం బెంపం బెట్టెనంత బెరిగి చిక్కని వారమై కంసునిం దునిమి తదీయరాజ్యంబు తజ్జనకునకు నిచ్చితిమి కంసధ్వంసనంబు కతన జరాసంధుండు మామీఁద ననేకసైన్యంబులం గూర్చుకొని యెత్తివచ్చిన వాఁ డతం డెఱుంగం బురంబు వెలుపల నక్కృతాస్త్రులము గావున నతనికి నోర్చి నలవిగాక చులుకనఁ గాల్నడ నింతదూరంబు వచ్చితిమి మాకెయ్యది కర్తవ్యంబు నాజ్ఞామాత్రంబున నీవుం జేయ నుపకరింబు నిన్నుఁ జేరితి మను గ్రహించి పంపు మనిన నాభృగువంశవర్యుం డయ్యాదవులోత్తముల కిట్లనియె.

ఉ. కారణమానుషత్వమునఁ గంసుఁడు లోనుగ దుష్టదైత్యులం
జే రిపుఁ గించుపొంటె నిటు పృథ్వి జనించినవాని నాదిపం
కేరుహనాభుఁగా నెఱిఁగి కృష్ణ యజస్రము నిన్నుఁ జూడఁగాఁ
గోరుదు నేఁడు నాకు సమకూరె మనోరథసిద్ధి యంతయున్.

క. వినుము జరాసంధుకతంబున నిప్పుడు మీకు నైనపోరామియు మీ
రినఘా యిట రాకయు మదిఁ, గని వచ్చితిఁ జూవె మేలు గావించుటకున్.

వ. భవదీయం బగునక్లేశాపథయానం బెఱుంగుదుం గావునఁ బ్రత్యర్థియు మీవచ్చిన తెఱుంగునన సర్వసహాయసమేతుండై యేతెంచుఁ గయ్యంబు నవశ్యంబునుం గలుగు నృగాలవాసుదేవుం డనియెడువాని యేలెడుభూమి కరవీరపురం బనం దదీయ నివాసంబునకుం దూరంబు మీ రియ్యెడ నుండవలవదు జరాసంధు జయింప నుపాయంబైన సుదుర్గం బొక్కటి గలదు మీకు నదియంతయుం జూపి మిమ్ము నచట నుంచి వచ్చెద నిది తత్ప్రకారంబు వినుఁడు.

సీ. వేణ్యాభిధానయై వెలసిన యిమ్మహాతటిని నీరేవున దాఁటిపోయి
క్రూరకర్ములు మహాచోరు లుండెడుచక్రగిరి చూచి యొకవిభావరి ప్రియమున
నచ్చోట వసియించి యవల ఖడ్గగ యనునేటితీరమున సమిద్ధతపము
గావించుమునుల నిష్కాముల దర్శించి యలక్రౌంచపురి గని యందుఁ జోరక
యానరుహ మనుతీర్థమ్మునందు విడిసి, రేప కొంతదవ్వరిగి యుద్దీపితాగ్ర
మైనగోమంత మనుశైల మనఘకాంతు, మది మహాదుర్గ మేకశృంగాన్వితంబు.

క. అమరుల కైనను రారో, హేమము కాంచనరత్నమయమహాతటముల న
య్యమరమహీధరసమరుచి, నమరు నమేయప్రభావ మది మధుమథనా.

సీ. అక్కజం బైనట్టియమ్మహానగమునుదగ్రశృంగముఁ బ్రాఁకి యచటనుండి
చూచినఁ జంద్రుఁడు సూర్యుండుఁ దారలు నుదయాస్తమయముల నొందునెలవు
లనతిదూరంబులై నట్లుండు బెరసి యంతర్ద్వీపసహితమై తగఁ బయోధి
గానఁగనగు నంతఁ గడు వేడ్క మీరుండఁ జనుదెంచి యాజరాసంధనృపతి
శైలయుద్ధకోవిదులును సారబలులు, నయినసమితోడ వెసఁ జనువయుంపు వెరవు,
సాల కపటతుండై పోవు సర్వభంగి, నధికజయసిద్ధి యగుమీకు ననఘులార.

వ. మఱియు సమ్మహాసమరంబునఁ జక్రశార్ఙ్గంబులు గౌమోదకి యనుగదయు సౌనందసంవర్తకంబు లనుముసలలాంగలంబులును సన్నిహితంబు లయ్యెడు నాత్మీయంబు లగుపురాణదివ్యరూపంబులు ధరియించి మీరు వైరులకు భయంకరు లయ్యెదరు యాదవులకు మాగధపురస్సరు లగుధరణీపతులతోడి రణం బగునని మున్న దేవాదేశంబు గలదు భూభారావతరణంబునకుఁ గారణం బగు భావిరణంబు నీవ ప్రవర్తింపఁ గాలక్రమంబునం గాఁగలయది యనిన భృగుసూనుభాషితంబులకుఁ బరితోషంబు నొంది వా రమ్మహాతేజునకు మున్నుగా మూఁడగ్నులుంబోలెఁ బ్రదీప్తులై కదలి కతిపయ ప్రయాణంబు లరిగి ముందట.

శ్రీకృష్ణబలరాములు పరశురామసహితంబుగా గోమంతంబుం జేరుట.

క. ధీమంతు లంతఁ గాంచిరి, గోమంతము విపినకుసుమకుంచితశిఖరి
సీమంతము నిర్ఝరకణ, హేమంతము గనకమయమహీమంతంబున్.

క. ఆయద్రీంద్రునిశిఖరం, బాయతభుజు లధికరయసమగ్రతఁ బక్షి
ద్వారియితగతి నెక్కి యొకమ, హీయస్థలి నెలవుగాఁగ నింపసలారన్.

వ. ఉన్నంత జమదగ్నినందనుండు గోవిందు ననేకవిధంబులం బ్రశంసించి యనంతరంబ యిట్లనియె.

క. ఇది కొండ యిందు రమ్మని, ముదమున నొకనెపము పెట్టి మునిసుతు లగుమీ
హృదయము వడసితిఁ గేశవ, యిది యించుక తలఁపుమయ్య యెప్పుడుఁ గరుణన్.

మ. భువనక్షేమనియుక్తికై యదుకులాంభోరాశిపూర్ణేందువై
భవ మొప్పార జనించి మానుషకృతిం బ్రచ్ఛన్నమై నైజభూ
తివిశేషం బిల నల్పబుద్ధులకు బోధింపంగ రాకట్టు లు
న్నవిభు న్నిన్ను భజించుధీరులు గదుర్ ధన్యుల్ సరోజేక్షణా.

తే. వైనతేయునిఁ దలఁపుము వాహనంబుఁ, గేతువు నతండునై నీకుఁ బ్రీతి నలుపు
నపరిమిత్తుల రగుఁ డింక నావిపక్షు, రాకఁ దెలిపెడు బహునిమిత్తాకలనము.

వ. ఏను బోయి వచ్చెదనని పరశురాముండు పరమసౌహార్దలాభప్రముదితుండై ప్రమోదమధురహృదయు లగుచు నాసదయశరీరులు సగౌరవంబుగా వీడ్కొలుప నాత్మస్థానంబునకుం జనియె నట్లు జామదగ్న్యుం డరిగినయనంతరంబ.

శా. శ్వేతశ్యామశరీరు లాబలుఁడు రాజీవాక్షుఁడుం దద్దయుం
జేతోమోద మెలర్పఁ దన్నగమహాశృంగంబునన్ రిక్తపూ
ర్ణాతివ్యక్తపయోధరద్వయమున ట్లయ్యుప్రదేశంబులన్
జాతౌత్సుక్యమనస్కులై మెలఁగి రిచ్ఛాకల్పితక్రీడలన్.

సీ. కిన్నరమిథునోపగీతకుంజంబులు పంచాస్యహుంకృతిస్ఫారగుహలు
చారణద్వంద్వసంచారచారుస్థలంబులు మధుపాఘూర్ణితపుష్పలతలు
గంధర్వదంపతీక్రాంతనిర్ఝరసైకతములు మాద్యత్కుంభిపశీలితతటులు
సిద్ధకుటుంబసంసేవ్యసానువులు శారసవధూభుక్తసరస్తటములు
లోనుగాఁగ నపూర్వవిలోకనీయ, భూములు లాలోకనీయవిస్ఫూర్తిఁ జేయ
నెలమినయ్యిద్దఱునుజరియించుచుండ, నరుసతోఁ గొన్ని దివసంబులరుగుటయును.

వ. ఒక్కనాడు బలదేవుం డొక్కరుండు నొక్కయెడ వనవిహారఖేదంబు నొంది ఘర్మాంతసమయసంఫుల్లమంజుమంజరీమకరందకలకోలంబకదంబకం బగుకదంబంబుగని తదీయతలంబున.

మ. సెలయేఱు ల్గడలొత్తఁ జేయుచు లతాసీమంతినీవర్తనం
బులు గల్పించుచు మత్తబర్హిరుతముల్ పొల్పొందఁగాఁ జేయుచున్
వలనై కాననమారుతంబు దనకున్ వాంఛానురూపంబుగా
నలఘుస్వేదవినోదనం బొనఁగఁగా నాసీనుఁడై యుమ్మలన్.

తే. పెల్లుగాఁ దృష యొదవినఁ బెదవు లెండ, నమ్మహీరుహమధురసం బాత్మఁ గోరి
కొమ్మదిగువంగ నపుడుతత్కోటరమున, నధికదీప్తి గంధోత్కటవ్యాప్తియగుచు

వ. కదంబజాత యగుటం గాదంబరి యనుపేర నతిమనోహర యగురసధార దొరఁగినం బ్రియంబు మిగుల నదియాస్వాదించి యమ్మహాప్రభావుండు.

క. మద మొయ్యన యెక్కఁగఁ గెం, పొదవెడునేత్రములు ఘూర్ణితోజ్జ్వలములుగాఁ
బొదలఁగ నంగములు వివశ, హృదయుండై యున్నయెడ సమీహితభంగిన్.

వ. మదిరాదేవి సాకారయై ముందర నిలిచి కేలు మొగిచి యతని కిట్లనియె.

చ. అమృతముతోడఁ దొల్లి వరుణాత్మజనై జనియించి వారుణీ
సముచితనామధేయమున సర్వమునం బెనుపొందునాఁటికా
లమునను నీకుఁ గాంతనయి లాలితవిక్రమ నేఁడు దండ్రిపం
పమరఁగఁ బూని యిచ్చటఁ బ్రియంబున నిన్ను వరింప వచ్చితిన్.

మ. మధుమాసంబునఁ గేసరస్తబకసమ్యగ్జాధవీమంజరీ
మధునిష్యందము లాత్మగాఁ బరఁగి రమ్యంబైనమేఘాగమా
వధి నుత్ఫుల్ల కదంబగుచ్ఛతతు లావాసంబుగాఁ బేర్చి స
న్మధురామోదవికాసినై సరసతామాహాత్మ్యంబునం గ్రాలుదున్.

తే. తొంటిసంగతి దలఁచి నీతోడ నాడు, వేడ్క నుర్వీతలంబున వెదకివెదకి
యిపుడు తృషనొంది యున్న నిన్నెఱిఁగి కాంచి, నాతెఱంగెల్లఁ జెప్పితిఁ బ్రీతి నధిప.

క. ననుఁ గైకొని నే డాదిగ, ననురాగముతోడ సుఖింపు మటుగాకయు నెం
డని త్రోచితేని విరహం, బున కేమియు నోర్వ నేను భూరి వివేకా.

వ. అనియె ననంతరంబ మఱియు నొక్కమానిని యమ్మహామనస్కునకుం బొడ
సూపి వినతాంగియై నిలిచి.

చ. విను మేఁ గాంతి యనంగఁ జంద్రునికడన్ విఖ్యాతనై యుండుదున్
నిను నాశీతమయూఖుకంటె ఘనుఁగా నిక్కంపుఁజూపొప్పఁగాఁ
గని ప్రేమంబునఁ బొంద వచ్చితిఁ దగం గైకొమ్ము లోకాతిశా
యిని నీయుజ్జ్వలమూర్తి నీకు నెనయే యెన్నంగ నేమూర్తులున్.

క. అని పలు కఁగ వేఱొకకా, మిని గ్రక్కునఁ దోఁచి కేల మిక్కిలికాంతిం
దనరువనజదామం బా, యనయుతు సమర్చి విరచితాంజలి యగుచున్.

వ. దేవా యేను రత్నాకరతనూజనై నలక్ష్మి నిప్పుడు సాహోత్పుండరీకాక్షమూర్తి
వై ననీపరిగ్రహం బపేక్షించితిం గారుణ్యంబున నన్ను ననుగ్రహింపుము.

సీ. బాలార్కమండలపరిభావి యైనది యిదె రత్నమయసముదీర్ణమకుట
ముజ్జ్వలవజ్రసమున్నతి నెంతయుఁ గొమరైనయవి మణికుండలములు
కమనీయనీలతాకలితంబులైనవి యివె నూత్నకౌశేయకవసనములు
ధవళమౌక్తికశోణితరళశోభిత యైనయది యిదె విస్ఫారహారయష్టి,
యబ్ధిజాతంబు లిన్నియు నాదియందు, ననఘ నీసొమ్ము లిప్పు డింపారువేడ్క
నొలిఁ గైసేయవలసినవేళ గాన, నాదరించి భజింపు మత్ప్రార్థనమ్ము.

క. అన విని బలదేవుండ, వ్వినుతద్రవ్యంబు లెల్ల వేర్వేఱ బ్రియం
బునఁ గైకొని యమ్మువ్వురు, వనితలు దనమూర్తిఁ జెంది వశమున నిలువన్.

వ. అత్యంతశోభాసమధికుండై యాక్షణంబ కదలి కమలాక్షుపాలికిం జనియె నా
సమయంబున.

సీ. అంభోధిలో సుప్తుఁడైననారాయణుదివ్యకిరీటంబు దితిజుఁ డొకఁడు
వైరోచనుం డనువాఁ డెత్తుకొనిపోవఁజొప్పనఁ జని మహాశూరవరుఁడు

వైనతేయుఁడు వ్రూరి వాని భంగించి యమ్మేలివస్తువు గొని మింటిమీఁదఁ
జనుదెంచుచును మహాశైలశృంగస్థితు నయ్యాదవేంద్రు నింపమరఁ గాంచి
యతనిమాళి యనాసాద మగుట సూచి,యాతఁడేమి యీతఁడేమి యనుచుభక్తి
నెయ్యు నదియుం దమర్పఁగ నొప్పిదంబు, కరముమిగిలె నద్దేవు నాకారమునకు.

వ. దానికి సంతసిల్లి సర్వార్థవేది యగునయ్యాదిమజన్ముం డగ్రజన్మునకుం దత్ప్రి
కారం బెఱింగించి గరుడుని భక్తియుక్తికి నుపలాలించి యిట్లనియె.

శా. నీవు న్నాకు నలంక్రియాకలనముల్ నెమ్మిం బ్రయోగించి యు
త్సేకం బిమ్మెయి నావహించు టరయన్ సిద్ధంబు కార్యార్థులై
నాకావాసులు వేగిరించెదరు నానా వైరిభూనాయకా
నీకధ్వంస మొనర్చి మాన్పవలయున్ వేగంబ భూభారమున్.

వ. ఇవ్విధంబున కనుకూలంబుగా నిప్పుడు.

సీ. అదె పేర్చి వీతెంచె నంబుధరధ్వానశంకావహంబులు నిస్సాణరవము
లదె కానవచ్చెడు నతి సాంద్రసంధ్యాపిశంగసర్వంసహాచలితరేణు
వవె యుల్లసిల్లెడు నాతపత్రదుకూలసంచలితోజ్జ్వలోచ్ఛ్రయపతాక
లవె క్రాలుచున్నవి వివిధసైనికకరాకల్పితాయుధమయూఖవ్రజంబు
లాజరాసంధుఁ డస్మదీయానుపథము
నంటి సకలభూనాథసైన్యప్రతతులఁ
గొనుచు నిట వచ్చెఁ గ్రూరమై ఘోరమృత్యు
వకట పెక్కండ్రఁ బ్రేరేచునయ్య యిట్లు.

క. మనమును సన్నద్ధులమై, పనివడి ప్రత్యర్థి చేఁత వార్చి నిలుత మిం
దనుచుండ నొకముహూర్తం,బున మిన్నును దెసలు నొక్క క్రమ్మెఁ దగఁ బెలుచన్.

జరాసంధుఁడు సైన్యంబులతోడఁ గృష్ణబలరాములెక్కిన పర్వతంబు చుట్టివిడియుట.

మ. కరియూథాచలఘోటకోర్మిరథికౌఘద్వీపయోధాంబుని
ర్భరశస్త్రాస్త్రతిమింగిల ప్రకరఘోరంబై నృపానీకసా
గరముప్పొంగి క[illegible]వచ్చి సముదగ్రంబై యయ్యాశైలముం
బరివేష్టించెను మేరువుం బొసువుకల్పచ్ఛేది తోయంబనన్.

వ. అమ్మోహరంబుల కన్నిటికి ముంగలయై జరాసంధుసేనాపతి యేకలవ్యుం డతి
వ్యగ్రం బగు సమరోత్సాహంబున నుగ్రుండై యే నొక్కరుండన గోపాలబా
లుర నిద్దఱఁ దునిమి తూఁటాడుదు నెవ్వరు నేల యని యేలికముందరఁ బంతం
బులు పలుకుచు నలఘుస్యందనంబున నమందమార్గణ బాణాసనకృపాణాది పరి
కరంబులు నతిశయిల్ల విజృంభించె నంత.

తే. బలములన్నింటి విడియంగఁ బనిచి జతను, బఱిచి విశ్రమించినఁ బదపడి నృపాలుఁ
డఖిలభూపాలవరులఁ బ్రియంబుతోడఁ, బిలిచి యుత్సాహవిభవగాంభీర్య మెసఁగ.

వ. ఇట్లని యాజ్ఞాపనం బొనర్చె.

సీ. ఎక్కుడు వలనైన యెడల దగ్గించినచఱుల నుగ్గడుపుఁడు సక్కఁ బ్రాఁక
రానితిప్పలు చొరఁ ద్రవ్వుఁ డీఱములైన బ్రమాఁకులుఁ బొదలును బ్రమగ్గఁ బొడువుఁ
డెదిరి పైకొని మీఁద నెవ్వఁడుఁ దలసూప కుండంగ దివము భాణోత్కరములఁ
గప్పుఁ డీకెలల సెలకట్టియలను బ్రేయుఁ డొడిసెలకాండ్రను నొద్దుఁ డెందు
నేల మనకింకఁ దడయంగ నిన్నగమున, నున్నవారు యాదవులని విన్నవార
మిచటి మృగపక్షులాదిగా నెల్ల మనకుఁ, బగఱ బోరిగొనుఁ డత్యుగ్రభంగి దోఁప.

వ. మద్రపతియును గాళింగుండును జేకితానుండును బాహ్లికుండును గాశ్మీరవిభుం డగు గోవర్ధనుండును గారూశుం డగు ద్రుముండును బార్వతేయులుం బర్వతపశ్చిమదిగ్భాగం బెక్కువారు, పౌండ్రుండును వేణుధారియు వైదర్భుం డగు సోమకుండును భోజనాథుం డగు రుక్మియు దానవశ్రేష్ఠుం డగు సుపార్శ్వాక్షుండును బాంచాలేశ్వరుం డగు ద్రుపదుండును నవంతినాయకు లగు విందానువిందులును దంతవక్త్రీపురమిత్రులును మాత్స్యుం డగు విరాటుండును గౌశాంబమాళవులును భూరిశ్రవుండును ద్రిగర్తుండును గ్రథకైశికపంచజనులును శైలంబు నుత్తరపార్శ్వంబుఁ బ్రాఁకువారు, కేరళుం డగు నులూకుండును నేకలవ్యుండును బృహత్క్షత్రజయద్రథులు నుత్తమౌజుండును సాళ్వకౌశికులును విదిశాధీశుం డగు వామదేవుండును భూభృత్పూర్వప్రదేశం బాక్రమించువారు, దరదతుండిచేదిరాజసమేతుండనై యేను ధరణీధరంబు దక్షిణకటకంబు తలద్రొక్కెద, వీరు వారనవలదు గదల గుణపంబుల ముసలంబులఁ గొండఁ దుముకుసేసి నేఁడ కృతకార్యులమై మరలుద మనిన జరాసంధువచనంబులు విని శిశుపాలుం డిట్లనియె.

మ. విపులోత్తుంగశిలావిటంకముల నావిర్భూతదుర్భేదపా
దపగుల్మావలులన్ సురాదుల కసాధ్యం బిమ్మహాదుర్గ మీ
నృపసింహుల్ బహువాహనంబులపయిన్ విశ్రాంతి వాటించువా
రపథవ్యాప్తిఁ బదప్రచారములఁ జేయన్ శక్తులే యిగ్గిరిన్.

క. పెక్కండ్రము గలమని యి, ట్లుక్కునఁ జోరఁబడుట నీతియు నుపాయముఁ గా
దక్కజ మగు దైవబలం, బెక్కుడు బోలు రనవచ్చునే యాదవులన్.

తే. దుర్గ మొదవినయప్పుడు దురము చేత, గంటె గోధించి యుండుట కరము లెస్స
తడవుగా నున్నపగతురు తమకుఁ దార, నిక్కముగఁ జెడుదురు కూడు నీరు లేక.

వ. ఇప్పటికి నెక్కు-వెరవు తోఁచినయది యిక్కొండచుట్టు నగ్ని దగిల్చి కాల్చుట మేలు సహాయరహితులై యొందిలిపడి యునికింజేసి వసుదేవసూనులు దీనికిం బ్రతివిధానంబు నేరక యూరక చిక్కు-వడుదు రనినచేదిపతిమతంబు మహీప తుల కందఱకు సమ్మతం బగుటయు మగధపతియు నవ్విధంబున కియ్యకొని యె నంత.

జరాసంధుఁడు రామదామోదరు లెక్కి-నపర్వతంబును గాల్చుట.

ఉ. ఎండినబ్రాఁకులుం బొదలు నీఱపుఁగ్రంపలుఁ దెచ్చి చిచ్చు లోం
డొండ సమీరుపచ్చు దెసనొడ్డినవంకగ వైచి పైపయి
న్నిండఁగఁ గట్టెలుం గసవు నెక్కొ-నఁ ద్రోచుచు సైన్యచారుల
క్కొండ గలంతయుం జిఱుతక్రోవి తెఱంగునఁ గాల్పఁ జొచ్చినన్.

వ. తోడ్తోన పేర్చి యుల్లసితార్చి యగునర్చిష్మంతుండు కార్చిచ్చుజాడలఁ గలయం బర్వుచు సర్జసల్లకీగుగ్గులుతరుకోటరంబుల వెడలి సుగంధిధూమోద్గారంబు లొదవించుచుఁ గాంచనరజతతామ్రాది ఖనుల బెరసి బహువర్ణస్యందంబులఁ బ్రవర్తించుచు నిర్ఝరంబులు సోఁకి జలజజలచరజాతంబుల నెరియించుచు నవప్రక్రియాపరిణతంబు లగువారణంబుల నుదారదారుణస్ఫులింగసముదయంబులఁ బొదువుచు నుజ్జ్వలజ్వాలంబులు సటలు నుద్దీప్తాంగారకంబులు దంష్ట్రలు నుద్భూతధూమంబులు కేసరంబులు నుద్భాసితోల్కలు దృష్టిపాతంబులునై యపూర్వమృగేంద్రుచాడ్పునం జకితకేసరిత్యక్తంబు లగుకంధరంబులు దూఱుచు లేలిహ్యమానంబులగుచు ధరాధరంబున నాభీలవ్యాళంబులపోలిక నాలుకలు గ్రోయునాయత శిఖల నఖలశాఖాశిఖాసంచయంబులం బెనంగొని యెల్లతరువులకు నెక్కొ-ంతసేపు చందనద్రుమసామ్యంబు సంపాదించుచు సానుస్థలంబులం దిరుగుధారాధరంబులఁ గరఁచి తదీయంబు లగుతోయసేకంబుల నెడనెడఁ బొనుంగుపడియుం బడక యం తర్గతంబు లగువిద్యుదశనితేజంబులు దనలోనన కలపికొని ప్రబ్బి నిబ్బరంబుగాఁ బెరుగుచు ధరణీధరమణికటకంబులం జెంది యందుఁ బొదలుపావకులోడిసాహచర్యంబున నతిదుర్వృత్వంబుగని కలయ నశేషశిలాసంఘాతంబులు సితచూర్ణరాసులై తొరఁగ నిగుడుచు శరభపక్షంబులుం జమరవాలంబులు బర్హిబర్హంబులుం గమర శబరీకబరీభరంబులు భస్మకణధూసరంబులు సేయుచు వివిక్తాసీను లగుసంయమిజనంబులకు సమాధిబాధ యొనరించి తనరుచు విశృంఖలవిహారం బుల నొప్పారుసిద్ధవిద్యాధరమిథునంబుల నుద్వేలవిఘటితభ్రాంతవిద్రుతంబులం గావించుచు నెగయుపొగలు గగనక్రోడపీడనంబులై నిగుడ వైమానికమానినీవిలోచనంబులకు నశ్రుకాలుష్యంబు గలిగించుచు నధికభయదసంరంభంబున

విజృంభించె నంత నెల్ల దెసలను దహ్యమానంబు లగువివిధజీవంబులయాక్రోశనాదంబులుం బగిలి కూలుగండశైలంబులచండధ్వనులు నార్ద్రశుష్కదారుగుల్మవల్లీవేణువలయంబులచూత్కారచిమచిమాయితచ్ఛటచ్ఛటారావంబులు నుద్దామదాహదుర్లలితం బగుదహనుపేర్మికిం జెలంగి యాప్సుమహీశ్వరమహోవ్యూహంబులయుత్సాహకోలాహలంబు నూర్ధ్వాండంబులు నిండిరొండొండ సమస్తభువనరాసులకు సంత్రాసంబు పుట్టించె నాసమయంబున.

**తే.** కాననంబు లెల్లఁ గాలిన ననిమిషేంద్రాస్త్రవహ్ని నెఱకు లంతవట్టు
మాఁడి మోడువడినమాడ్కి రూపఱెను గో, మంతపర్వతంబు మనుజనాథ.

**క.** పాతాళమునకు డిగి యు, యాతత్శైలంబు వేళ్లు లన్నియు భస్మీ
భూతములు సేయ కుడుగునె, యాతీవ్రాగ్ని యని తలఁకి రెడఁదల సుగలుఱ.

**వ.** అమ్మహాదహను దరికొల్పి దాహభయంబునం బార్థివబలంబు లన్నియు నర్ధక్రోశమాత్రంబున నపక్రాంతంబులై చూచుచుండె నట్టియుపప్లవం బాలోకించి నీలాంబరుం డంబుజోదరున కిట్లనియె.

**సీ.** మ్మాధవ చూచితే మనకారణంబున నిన్నగేంద్రమున కెంత యెగ్గు వుట్టె
గిరి కైనయాపద పరిహరింపఁగ లేక యివ్విధంబున నీవు నేను నూరకుండితి మేని నిం కొండెద్ది గల దింతకంటెను నపకీర్తి కరము ధరణిఁ
గానఁ బరార్థదుఃఖకుముఁ డున్నతిశాలి యిమ్మహనీయశైలపతికి
ఋణము నీఁగుపొంటె నిప్పుడ యీజరా, సంధుఁ గిట్టి పట్టి సమదబాహు
బల మెలర్పఁ గట్టవఱిచెద నీకు మె, చ్చుగ నొసర్చువాఁడ జూడు నన్ను.

**మ.** అనలం బిట్లు దగిల్చి తారు సమరప్రారంభసన్నాహులై
జననాథుల్ బహుదేశవాసులు మహాసైన్యావళీకల్పనం
బొనరం బేర్చినవారు నేఁడ వీను మీయుర్వీతలం బెల్ల ని
ర్మనుజేంద్రంబుగఁ జేయ కెట్లుడుగు నస్మత్కోపసంరంభముల్.

**శ్రీకృష్ణబలరాములు గోమంతమునుండి సైన్యమధ్యంబునకు లంఘించుట.**

**వ.** అని పలికి యాక్షణంబ యాక్షిప్తమణికుండలుండును నాకంపితకిరీటుండును నాందోళితనీలాంబరుండును నాలోలవనమాలావలయుండును నగుచు వాసుదేవాగ్రజుం డన్నగాగ్రంబుననుండి రాజన్యమధ్యంబునకు లంఘించినం దోడన చూడారత్నరోచులు సెదరం బీతవాసోంచలంబు చలింప శ్రీవత్సలాంఛనశ్యామికలు గడలొత్త నుదాత్తస్మితమరీచు లుల్లసిల్ల నుత్ఫుల్లకమలనయనుండగుచుఁ గమలనయనుండు నుఱికె నయ్యద్దబెట్టిదంపుఁ ద్రొక్కునం గ్రుంగఁబడి గోమం

తమహీధరం బహిర్లోకగతం బగుసలిలంబు వెలిఁ జేర్చి తొప్పఁదోఁగె నివ్విశే
షంబువలన విద్వేషీకృతం బగుదహనోపప్లవంబు ప్రశాంతం బయ్యె నప్పుడు.

తే. మందరాద్రులు రెం డొకమాటు పడిన, గొలఁది కగ్గలముగ బిట్టు గలఁగుజలధి
పోల్కి రామకృష్ణాపాతభూరివేగ, సంక్షుభిత మయ్యెఁ బార్థివసైన్య మెల్ల.

క. బాహుప్రహరణులై యతి, సాహసికులు యదుకిశోరసత్తములు రిపు
వ్యూహశతంబుల నత్యు, త్సాహంబునఁ గూల్చి టచ్ఛితం బయ్యె నృపా.

వ. ఆసమయంబున నమ్మహానుభావులవిక్రమంబుల కనుగుణంబులుగ నమరప్రేరి
తంబులై.

మ. చనుదెంచెన్ దివినుండి యాయుధము లాశ్చర్యప్రభాధుర్యముల్
మును గీర్వాణపరంపరావిహితసమ్మోదంబు లున్మాదిహృ
ద్దనుజేంద్రక్షతజార్ద్రరూపములు మాద్యద్భూతబేతాళకీ
ర్తనకల్యాణవిధిప్రసిద్ధబహుసంగ్రామంబు లుద్దామముల్.

వ. అమ్మహాసాధనంబులకుం దగునట్లుగా వారికిం బూర్వంబు లగునిజదివ్యాకారం
బులు నుదారంబులై పొందె నప్పుడు సుదర్శనశార్ఙ్గకౌమోదకీనందకంబులు
గోవిందుండును సౌనందసంవర్తకంబులు సబాణబాణాసనంబులుగాఁ బ్రలంబవైరి
యుం బరిగ్రహించి రనంతరంబ యనంతాంశసంభవుండు సంరంభవిజృంభితం
బగుబాహుమండలంబు చండశస్త్రోజ్జ్వలంబై దంష్ట్రాకరాళం బగుఫణివక్త్రంబు
కరణిం దేజరిల్లఁ గడంగి.

ఉ. చీఁదఱ రేఁగినట్లు రిపుసేనల నెల్లను ముట్టి సోఁకల
న్వ్రేఁచుచునాఁగటం దిగిచి నొంచుచుఁ గార్ముకముక్తబాణముల్
పైఁ దొరఁగించి కూల్చుచును బాదహతి న్నలియంగ ద్రొక్కుచున్
లోఁ దఘుకొత్తుపీరరసలోలత మోహమలరం జరింపఁగన్.

మ. హరియున్ శార్ఙ్గవినిర్గతాస్త్రహతి నుద్యచ్చక్రపాతంబులం
గరవాలప్రవిదారణంబుల మహాకౌమోదకీఘాతని
ర్భరతం గ్రౌర్యము సూపఁగాఁ గరము విత్రాసంబునం దూలె మో
హరముల్ రాజసమాజముల్ దిరిగె నత్యంతంబు సంభ్రాంతితోన్.

వ. ఇట్లు సమరపరాఙ్ముఖు లయి తనవెనుక కొదిఁగిన వారిం జూచి జరాసంధుం డిట్ల
నియె.

తే. వాహనము నెక్కి కైదువు వలను మిగులఁ, బట్టి మొనతల నెంతయు భయరసంబు
గదిరి వర్తించునృపులకుఁ గలుగుభూరి, హత్యఁబోలు పాపం బనిరాదిమునులు,

క. గోపాలురు వీరిరువురు, భూపాలురు పలువు రుగ్రభూరితరబలా
టోపసమగ్రులు మీరీ, చాపలమున గోర్చి యెదురఁగఁ జనునే యిచటన్.

ఉ. ఇంచుక నెమ్మనమ్ముల సహించి రణమ్మున నిల్చి నన్ను వీ
క్షించుచు నుండుఁ డేమియును గీడును బొందఁగ నీను మిమ్ము నీ
క్రించుల. యాదవాన్వయులఁ గేలియపోలె ధనుర్విముక్తశా
తాంచిత సాయకాగ్ని కసనద్యహావిస్ఫులు గా నొనర్చెదన్.

వ. అనినం గలంక దేఱి యందఱుఁ గ్రమ్మఱ నుత్సాహంబు వాటించి చెదరిన మూఁకలం బ్రయత్నంబునం బురికొల్పి యాత్మీయంబు లగు వాహనశస్త్రంబుల నాయితంబులుగా సమకట్టి కేతుచ్ఛత్ర చామర ప్రముఖలక్షణంబులు మెఱయ భేరీపణవాదివాదిత్రంబుల మ్రోఁతతో బెరసి గజబృంహితంబులు రథనేమి నిర్ఘోషంబులు భటసింహనాదంబులు రోదసీభేదనప్రచండంబులుగా నుద్దండరభసంబున బలదేవవాసుదేవులం బొదివిన.

క. శరచక్రతోమరంబులు, గురిసియుఁ గరవాలపరశుకుంతాదుల స
చ్ఛరువుగ వ్రేసియుఁ బొడిచియు, నరనాథులు ఘోరరణ మొనర్చిరి కడిమిన్.

వ. అట్టికోల్తల సైరించి కులగిరులపోలిక నప్రకంప్యులై నిలిచి యదువీరులు దారుణ సంరంభంబునఁ గోపప్రసాదంబులు సూపి దీపించిన భూపసైన్యంబులయందు ముసల విభిన్నకుంభంబులు సీరదారితవంశంబులునై తూలుశుండాలంబులును, చక్రనికృత్తకంధరంబులుఁ గృపాణదళితదేహంబులునై పొలియుహయంబులును, నిపాతితరథికంబులు నిహతసారథికంబులునై తెరలిపాఱు తేరులును, సాయకస్యూతశరీరులు హుంకారస్ఫారస్ఫుటితమానసులునై సోలయుపదాతులు నగుచుఁ బ్రత్యర్థి బలంబు లగ్గలంపుదీసదశం బొందం గీలాలజలాశయంబులం బలలకూట కృత్రిమాద్రుల మేదోనిచయతల్పంబుల నుజ్జ్వలాంత్రహారంబుల నాయతస్నాయుమేఖలలఁ గీకసవలయకంకణంబులఁ గపాలచషకంబుల గాత్రచ్ఛేదోపదంశంబుల మజ్జామదిరాపూరంబులఁ గంకాళవీణలఁ గబంధనటనంబుల గోమాయువిరుతగానంబుల నాజిరంగంబు జమునివిహారదేశంబును మండనస్థానంబు నాపానభూమియు సంగీతస్థలంబును ననుశంక నుత్పాదించుచుఁ గంకగృధ్రకలకలంబుల భూతబేతాళడాకినీవిహరణంబుల నతిరౌద్రం బయ్యె నిట్లు శాత్రవసహస్రంబులఁ బరిమార్చి నలుదెసల నెదురుగురాజులం గనుంగొని కమలనాభుం డెలుంగెత్తి యిట్లనియె.

ఉ. ఎక్కుడు పేర్మి వాహనము లెక్కినవారు బలంబు పెక్కు వం
బెక్కురణంబులం గడిఁది బీరముఁ జూపఁగఁ జాలువారు మీ

రక్కట చన్నె యిట్లు వసుధాధిపులార పదప్రచారతం
దక్కొని యున్నమ మ్మిచటఁ దార్కొనలేక తొలంగి తూలఁగన్.

మ. అనికిం దారిచి తోడు తెచ్చుకొని మిమ్మడ్డంబుగా నొడ్డుచుం
దనమై సోఁకక యుండఁగాఁ దిరిగెదున్ దవ్వై జరాసంధుఁ డి
ట్లనిమిత్తంబు నశింప నేమిటికి మీ కారాజు నాత్మాపరా
ధునిఁ బుత్తెం డిట నస్మదీయసుమహద్దోశ్శైకలక్ష్యంబుగన్.

• ———— జరాసంధుఁడు బలదేవ వాసుదేవులతోడ యుద్ధంబుచేయుట. ————

క. అని పల్కెడు పల్కులు విని, మనమునఁ గినుకొదవ నుదరి మగధవిభుఁడు జో
డునువిల్లు దేరు ఘనకే, తనమును గొని కడఁగె శార్ఙ్గధరుపై నొకఁడున్.

వ. కడంగి యంతంత నతనిం గని.

శా. ఏనుండంగ నరేంద్రసింహముల నీ విట్లేల సెగ్గించె ది
చ్చో నుగ్రాటవిలోన నాఁ డటు పశుస్తోమంబులం గాచున
ట్లో నే కేశవ లావుఁ జేవయును ధైర్యంబుం గలం డంద్రు ని
న్నా నేర్పిప్పుడు నాకు నెక్కెడుఁ గదా యత్యంతసిద్ధంబగున్.

చ. అనితల నిట్టు లగ్గలము లాడినయట్టులు గాదు సేఁత చో
ష్పనయము ద్రెవ్వేఁ గొంకింతెదడ వాత్మకఁ దిరంబుగ నైచి నిల్వుమా
సునిశితమామకాస్త్రములసోన మునింగి పరేతభర్తతో
నొనరఁగ నేఁడ చేసెద వనుత్తమసఖ్యవిశేషభద్రముల్.

తే. అనినఁ జఱునవ్వుతోడియనాదరావ, లోకనము రక్తనేత్రాంతభీకరముగఁ
గంసమథనుఁడు మగధభూకాంతుతోడ, నిట్టు లను ధరణీశ్వరు లెల్ల వినఁగ.

క. నాలా వెఱిఁగెదునంతటి, చాలిక నీ కొదవె నేని జనవరకడు మే
లేలా తడయఁగ నిదె నీ, యాలోకనగోచరుండ నై యున్నాఁడన్.

తే. రిత్తమాటలు సెల్లవ యుత్తములకు, శూరులకు రజ్జులొప్పునె సారబాహు
లీల నెఱపుట దక్కఁగ లెమ్ము కడిమిఁ, జూపు వివిధాస్త్రశస్త్రవిస్ఫూర్తిమెసఁగ.

వ. అని యాక్షేపించి యాజగదేకవీరుం డారాజకుంజరు నెనిమిదియమ్ముల నొప్పించి
సారథి నైదుబాణంబులను రథ్యంబుల ననేకశస్త్రంబులను నొప్పించె ముసలా
యుధుండు బాణాసనప్రౌఢి మెఱయ నతనివిల్లు నడిమికి నఱకె నిట్లు కృచ్ఛ్రగతుం
డై నయేలికం గని సేనాపతు లగుకౌశిక చిత్రసేనులు రయంబున నడరి.

క. బలదేవు మూఁడుశరముల, నలఘునిశిఖపంచకమున నబ్జాక్షుని న
గ్గలిక మెసఁగ నేసి వియ, త్తల మద్రువఁగ నార్చుటయును దద్దయునలుకన్.

తే. కామపాలుఁ డర్ధేందుముఖప్రదీప్త, సాయకంబునఁ గౌశికుచాపయష్టిఁ
ద్రుంచెఁ గృష్ణుండు నాలుగుతూపు లొకట, నేసి చేసె యుగ్యంబుల నిలఁ బడంగ.

వ. ఇవ్విధంబున విరథుండై కౌశికుండు గదగొని హలాయుధుదెసకుఁ గవియునా
లోన నతండు చిత్రసేనవధార్థంబు బాణవర్షంబు గురియుచుండ జరాసంధుండు.

క. విలు ద్రుంచి పెక్కువిశిఖం, బులఁ బొదవఁగ బలుఁడు భూరిభుజబలుఁ డయ్యున్
బలియుఁ డగుపగతు వేఁడిమి, నొలయుట కత్యద్భుతంబు నొందుచుఁ బెనఁగెన్.

వ. అంతఁ జిత్రసేనుండు గదాదండంబునఁ బ్రబలంబవైరిపక్షంబు ప్రహతంబు చేసి
తోలంగ నుఱికె నప్పుడు.

సీ. ఏను దొంబదియును నెనుబదియును నేసి సాయకంబుల జరాసంధుఁ డేచి
సీరిసోదరు మహానీలాభసుందరసుకుమారదేహంబు శోణితమున
మునిఁగి సంధ్యారుణఘనమనోహారి మగునట్లుగా నొనరింప నవ్విభుండు
భల్ల మొక్కట వానివిల్లు ద్రుంచుటయును గడగొని ధరణిఁ గిక్కనలఁ దేరు
డిగ్గనుఱికి బార్హద్రథి యగ్గలంపు
వేగ మొప్పంగ డగ్గఱి విష్ణునురము
వ్రేయుటయును నిర్భరమోహవివశుఁ డగుచు
వ్రాలె నగ్రజుఁ డళుకొంది వసుధ నతఁడు.

వ. ఇట్లు పడుటయును.

క. గోవిందుని నిహతునిఁగా, భావించి విరోధి ప్రమదభరితోత్కటచే
తోవేగంబున సకలది, శావలయము వడఁక నక్కజంబుగ నార్చెన్.

ఉ. దానికి సైప కుద్ధతగదాముసలంబులు రెండుసేతులం
బూని హలాయుధుం డడరి భూవరువక్షము ఫాలముం బరి
గ్లానముగా నొనర్చుటయు గాఢతరక్షతిఁ దూలి నేలపై
జానులు మోపి మాగధుఁడు సత్త్వ మఱం బడి సొమ్మవోయినన్.

వ. రోహిణీనందనుండు సింహనాదంబు సేసె ననంతరంబ యమ్మనుజేశ్వరుండు.

క. కొండొకసేపునకుఁ దెలిసి, చండగదాదండమున నసహ్యక్రోధో
ద్దండత బలు వ్రేయఁగ నా, తం డాగద విఱుగఁ జేసెఁ దనగద వ్రేఁతన్.

చ. జనవిభుఁ డాక్షణంబ యొకశక్తి సమర్చి జనార్దనాగ్రజ
న్మునిదెస వైచి తోడన యమోఘగదం గొని వ్రేసి యంతఁబో
కనుపమముష్టి నొంచి మద మారఁ దలాహతిఁ ద్రోచి మూర్ఛలో
మునుఁగఁగఁ జేసి యార్చె దివి మూఁగినవేల్పులు భీతి నొందఁగన్.

క. అంతఁ దెలిసి యసురద్విషుఁ, డెంతయు రభసమున శత్రునెదిరి కదిసి ను
ద్భ్రాంతగతి వ్రేయఁగా మిసి, మింతుఁడుగా కాతఁ డోకసమిద్ధపుశక్తిన్.

తే. ఆయదూద్వహు వైవంగ నది వెరవున, నెడిసిపట్టి యాబలియుఁ డత్యుగ్రలీల
మగుడ నతనిపై వైచె సమ్మగధపతియు, సొలసి వేగ యాలోనన తెలిసి నిలిచి.

క. పరిఘము గొని మధురిపుపై, నురవడిఁ గవియంగ బాణ మొక్కటి యేసెన్
హరి శార్ఙ్గము దెగనిండం, దిరముగఁ గొని దాన రిపుఁడు ధృతిచెడి నిలిచెన్.

వ. అయ్యవసరంబున మూర్ఛదేఱి బలభద్రుండు భద్రగజంబు ధరణీరుహంబుదె
సకుఁ గవియువిధంబున జరాసంధు నిప్పుడ నిర్మూలింతు నని పలుకుచు నలుక
మొనఁగం గవిసినం గని పరమం పనుభూవనం డడ్డంబు సొచ్చి.

ఆ. వరముపేర్మి నితఁ డవధ్యుఁ డెవ్వారికి, నధికశౌర్యధుర్యుఁ డధికధీరుఁ
డిట్లు నీవు సంపె దేనుండఁగా నాను, బలిమి రామ మున్ను దెలియ వెట్లు.

వ. అని యపల్కినం గినిసి సంకర్షణుండు రిపుప్రాణాకర్షణం బగుతనలాంగలం బ
మర్చి వాని నెదిర్చినం బరిఘపాణియై నాఁడునుం దాఁకె నయ్యిరువురకు ను
క్కింతసేపు గజయూథపతులకుంబోలె నాభీలం బగుకలహంబు సెల్లె నంత.

తే. స్కంధపీఠంబుమీఁద నాగలి పగిల్చి
కిట్టి పగతుని నిల బోరగిలి పడంగఁ
గడిమిఁ దిగిచి ప్రమోఁకాళులఁ గలయఁ గ్రుమ్మి
చదిపి నెత్తురు మెదడును జెదరఁ జంపె.

క. మనుజేంద్రులు మగధేశుఁడు, గనుఁగొనుచుండంగ నిట్లు కడుఘోరవిధం
బునఁ బేర్చినబలునిబలం, బునకుఁ దలఁకి కలఁగె నఖిలభూపబలంబుల్.

జరాసంధుఁడు సకలరాజన్యసమేతంబుగఁ బరాజితుఁడై పోవుట.

వ. కృష్ణుండును క్రోధరభసోద్దాముండై కౌమోదకి యాయితంబుగాఁ బట్టి యిల
చలింపం ద్రొక్కుచు నక్కజంబుగా నపరి జరాసంధుసంధిబంధంబు బెట్టువ్రేసి
బెడిదంపుఁబిడికిటం బొడిచి యుఱక యఱచేతం జఱిచిన ప్రమోఁకరిల్లంబడి
తూలుచు నతండు సేతిగద ప్రిదిలిపడ సశరం బగుశరాసనంబును సపరికరం
బగునరదంబును డిగ్గవిడిచి యపసరణంబుగా సందడి నడంగిపోయినం గలంగి
రాజన్యు లందఱు సమ్మెటలువెట్టి గుఱ్ఱంబులం దోలియు నంకుశంబు లూని యే
నుంగులం దఱిమియుఁ జేరుకోలల నడిచి రథ్యంబులం బఱపియు నత్యంతభయా
ర్తులై నలుదెసలం జనిరి సర్వసైన్యంబులుం జెల్లాచెదరై కన్నదెసలం బాఱె
నట్లు నరేంద్రసహస్రసంత్యక్తంబై విగతసంగీతం బగురంగస్థలంబును ద్రేణిసేయు
సంగరప్రదేశంబు గనుంగొని.

చ. వరదుఁడు పాంచజన్యము ప్రవర్ధితగర్వనిరూఢి నొత్త స
య్యురునినదంబు మేఘపద మొంపుపయి న్వని సర్వదేవతా
వరులును సిద్ధసాధ్యమునివర్యులు నార్చిరి లోకమంతయున్
భరితవిరావ మయ్యెఁ దదుపాగతశబ్దవిమిశ్రణంబునన్.

వ. సంకర్షణుండును బ్రహర్షోత్కర్షంబున సింహనాదంబున రోదసీకుహరపూరణం బొనర్చె నిట్లు విజయలక్ష్మీవిభాసితుండై లక్ష్మీశ్వరుం డన్నయుం దానును మానుషరూపంబు లెప్పటియట్ల తమ్ము నొంది విశ్రమార్థంబు గోమంతగిరియందు గొన్నిదినంబు లుండునంత.

సీ. ఆభంగి సమరపరాఙ్ముఖు లయి సర్వభూపాలురును బోవఁ బోక మగిడి
చేదిభూనాథుండు శిశుపాలజనకుండు కారూశసై స్వయుక్తముగ నాత్మ
బలముఁ దానును యమప్రేరితదిక్కునఁ గలబాంధవ మెదనచ్చి పద్మనాభుఁ
గానంగఁ జనుదెంచి కడుఁ బ్రీతి నిట్లను ననఘ యే మీకు మేనత్తమగఁడ
వినుము దమఘోషుఁ డనువాఁడ వినయరహితుఁ
డగుజరాసంధుఁ బలుమారు ననుసయించి
వాసుదేవుతో వైరంబు వలవ దనుచు
మయ్యా యని చెప్ప విన కున్న నాత్మఁ దలఁకి.

వ. అద్దురాత్మునిం దొల్లి యెన్నఁడేనిఁ బరిత్యజించి యుండితి నేఁడతండు సంగరంబున భంగపడి చెడిపోయిన సంతసంబునం గని నాకుం గలవారిం దోడ్కొని నీ వాఁడనై వచ్చితిఁ బగవాఁడు బలవంతుం డంతన తెగి పోయెడివాఁడు గాఁ డీ లోనన మగుడంబడి యెద్దియేనియుం గిల్బిషం బాపాదించు నిది నాకుఁ దోఁచిన తెఱంగు.

చ. బహునరవాజివారణశవప్రకరంబుల రక్తమాంసస
స్పృహబహుయాతుధానచయభైరవగృధ్రవృకాదులన్ సుదు
స్సహబహువిస్రగంధములఁ జాలఁగఁ గుత్సిత మైనయీసమి
న్మహి మన కేల యుండెడకు మాధవ పోవుట లెస్స చయ్యనన్.

వ. ఇచటికిం బెద్దదవ్వు లేదు కరవీరం బనుపురం బందు సృగాలవాసుదేవుం డున్నవాఁడు వాఁడు నీతోడ నెప్పుడు మచ్చరించు నాదుర్జను దూషించుట యవశ్యకర్తవ్యంబు.

క. ఇవె రెండు భవ్యరథములు, భవదర్థము కా నొనర్పఁబడినవి చంచ
జ్జవనహయాన్వితములు యో, ధవరా కైకొనుము నీవు దగ నగ్రజుఁడున్.

వ. అనినం బ్రియంబు నొంది యదునందనుం డతని సబహుమానంబుగా నవలో కించి.

చ. చుట్టఱికంబు ప్రేమమును జూపఁగ వచ్చినవారికి న్నిజం
బిట్టిద యర్హ మైనయది యిప్డు భవద్వచనామృతంబున
న్నెట్టన మామనోగతులు నిర్భరహర్ష ము నొందె నింక నె
ప్పట్టున నేము ధన్యులము ప్రాపును దాపును నీవు గల్గుటన్.

క. ఇప్పటికయ్యంబు తెఱం, గొప్పఁగఁ గనుఁగొంటి గాదె యొపుదు మేమీ
చొప్పున నెన్ని రణంబులు, చొప్పడిన జయింప వానిఁ జూచెద వింకన్.

వ. ఈచక్రముసలంబుల ప్రసాదంబునఁ బ్రతిపక్షుల బారిసమరుట మాకు సక్రమంబు సర్వజగంబుల నస్మద్విక్రమంబు లద్భుతంబులుగాఁ జెప్పికొనునట్లు సేసెద మని పలికి యయ్యిరదంబుల నాప్రొద్ద యయ్యిరువురు నెక్కి రథారూఢుం డైనదమఘోషుండు ముందర నడవఁ దత్సైన్యపరివృతులై బలదేవకేశవులు రెండువిడిదలలు తెరువునం బుచ్చి మూఁడవనాఁడు రేపకడ కరవీరపురంబు చేరం జను దెంచి తదీయద్వారంబున నిలిచి.

క. తమపేరు చెప్పి యుద్ధా, ర్థము వచ్చినవార మేము తడయక సంగ్రా
మము మాకు నీవలయు నని, కమలాక్షుఁడు పలుక నచటికావలివారల్.

తే. కడు రయంబున నరిగి యప్పుడమిఱేని
కెఱుఁగఁ జెప్పినఁ గడకన్ను లెఱ్ఱసేసి
యతఁడు విహితసన్నాహుఁడై యాక్షణంబ
యొంటిమెయి సైన్యముల నెల్ల నుడిపి కడిమి.

వ. తొల్లి యాత్మీయనియమంబునకు మెచ్చి యాదిత్యుం డిచ్చినయాదిత్యవర్ణం బై వెలుంగుచుండు మణిరత్నసుందరస్యందనంబు సితంగతురంగంబులయుద్దామగమనంబున గగనగామియుంబోలె నుల్లసిల్లుచు హరివాహనం బగుమేఘవాహనునరదంబుచెలువు దీపింప నింపుమిగుల నెక్కి యక్కజంబు లగుధనుస్తూణకృపాణాదు లమరఁ గమనీయకనకకవచచ్ఛన్నశరీరుండై సాంధ్యజలధరపిహితం బగు మహాశైలంబుపోలిక నాభీలం బగునెప్పిదంబుతోడం బురంబు వెలువడియె నంత.

మ. లయకాలంబునఁ బ్రాణిజాతము ననాలస్యంబుమై బ్రమింగ వేఁ
డి యుదగ్రోద్ధతిఁ దోఁచుదండధరుమాడ్కిన్ వచ్చుదుర్వారని
శ్చయు నాశాత్రవుఁ గాంచి కృష్ణుఁడు నిజస్వాంతం బసంభ్రాంతి నెం
తయుఁ బెంపారఁ దనర్చెఁ దాదృశుఁడమై దర్పించె దద్భాతియున్.

వ. చేదినాథుం డయ్యిరువురయుత్సాహంబునకు ససాహసం బగుహర్షనిర్వాహంబు
వహించె నవ్విష్ణుండు తనరథం బొక్కటియ ప్రతివీరుసరదంబున కెదురుగా నడ
పింప నకంపితరభసంబున సృగాలుండును గడంగి కదిసి యతనిం దాఁకె నట్లిద్దఱు
వాసుదేవులకు దేవతలు మెచ్చుకయ్యం బయ్యె నందు.

తే. శరము లొకలక్షఁ గరవీరపురవిభుండు
యాదవేంద్రునిఁ బొదువంగ నతఁడు డెబ్బ
దెనిమిదింటను నాతని నేసె మగుడ
నేఁబదింటఁ గృష్ణుని నన్నరేశ్వరుండు.

క. వారుణవాయవ్యంబుల, నారాయణుమీఁదఁ దొడిగె నరపతి శరముల్
ఘోరశిఖివజ్రశరవి, స్ఫారితఁ బద్దీప్తి మాపెఁ బద్మేక్షణుఁడున్.

క. జంబుకుఁ డేయఁగ యమరు, ద్రాంబకములు నిగిడి నడఁచె నస్త్రములు విచి
త్రంబుగ మాధవుచే నిమి, షంబున శమితంబు లయ్యె జగములు పొగడన్.

చ. హరి గొనయంబు ద్రుంచుటకు నస్త్రవరంబు సృగాలుఁ డెంతయున్
బరవస మొప్పఁ గైకొనినఁ బ్రాజ్ఞుఁడు శార్ఙ్గధరుండు తద్విధం
బరుదుగ నాత్మలో నెఱిఁగి యాతనివి ల్లొకయర్ధచంద్రని
ష్ఠురవిశిఖంబునం దునిమి సొంపఱ నంగము నువ్వ నేసినన్.

క. వేఱొకవిలుగొని విమతుఁడు, దూఱఁగ హరిమేన నాటఁ దొమ్మిదియమ్ముల్
మా ఱెనుబదింటఁ బొదివెం, గాఱియగా మఱియుఁ బఱపె గమిగొనఁ దూపుల్.

శా. కోపం బుత్కటమై ముకుందుఁడు గుణాఘోషంబు దిక్కుండలా
క్షేపక్షోభకఘోరమై నిగుడఁగా శీఘ్రాస్త్రపాతంబులం
జాపంబుం దునుమాడి సూతహననోత్సాహంబునం బేర్చి ధా
త్రీపాలున్ బహుళోజ్జ్వలప్రదరపఙ్క్తిచ్ఛన్నుఁ గావించినన్.

వ. సారథ్యచతురుండునుం దాన యై కడంగి.

ఆ. అన్యచాపహస్తుఁ డై యతఁ డొకయమ్ము, కేల నమరఁ బట్టి కేళిఁ బోలె
సమరరాగభరము సస్మితవక్త్రంబు, నందు మెఱయ నిట్టులనియె హరికి.

సీ. గోమంతగిరియందుఁ గొండఱురాజుల నొడిచితి నని మదం బడరి యిందు
వచ్చితి కరవీరవల్లభుఁ దొడరంగ నల్పులు మూఢాత్ము లానృపాలు
రిది యొక్కరుండన యేను గయ్యమునకు నమర నిల్చినవాఁడ నట్ల నీవు
నేకాగ్రయోధివై యెసఁగితి ధర్మయుద్ధం బిది కీర్తివిధాయి మనకు

నొక్క-వాసుదేవుఁడు కాక యుర్వి మీఁది
నెందఁ జెప్పుఁడు నిను వధియించి నాఁడు,
షేరు సుస్థిరగతి నెందుఁ బెంపు నొంద
నిలుపఁ గలవాఁడు నొక్కంత నిలువు మిచట.

చ. అనవిని దేవకీసుతుఁడు హాసవినిష్ఠురవక్త్రుఁడై సృగా
లుని దెసఁ జూచి నీమనసులో రణవాంఛ నరేంద్ర యిప్పుడుం
బొనుపడ దేని సాహసము పొంపిరిపోవఁగ నిల్చి కైదువుల్
విను కలయన్నిటం బెనఁగు విక్రమ మేర్పడ నేను జూచెదన్.

క. ఆవల నాచేయంగల, యీవిధమును నున్నయది యది మునుముట్టన్
వావిరి చెప్పఁగ నేలా, నావుడు నవ్విభుఁడు భీషణస్ఫురణమునన్.

క. తఱుచుగఁ బలుకఁ గిడిదియం, బఱపె తోమరచక్రకపరిఘముసలచయము లే
ర్పడఁ బైఁ గురిసెఁ గృపాణము, లుఱక ప్రయోగించె వైచె నొక్కట శక్తుల్.

వ. ఇట్లు వైరిప్రయుక్తం బగువివిధాయుధాంధకారంబు నిరంధ్రంబై కప్పిన నిర్భయస్థితిన్ బొలుపారి దైత్యారి దారుణవిక్రమం బగుచక్రంబు కేలఁ గైకొని వాని నాలోకించి.

ఉ. చేయఁగ నోపనంతయును జేసితి చూచితి నేను నీవిధం
బాయతమస్భుజాకలిత మై యిదె వచ్చె మహోగ్రచక్ర మిం
కేయది చెప్పుమా తెలియ నిప్పటికిం బరికింప యంతక
వ్యాయతదంష్ట్రిలం దగులువాఁడవు గాక సృగాల యిచ్చటన్.

వ. అని పలికి యమ్మహాస్త్రం బతనిపయిం బ్రయోగించినఁ బ్రళయసమయనిర్ఘాత ఘోరంబయి యప్పుడు తదీయశరీరంబు రెండుప్రయ్యలు సేసి క్రమ్మఱ యాసరోజేక్షణుదక్షిణహస్తం బలంకరించె నంత.

సీ. పగతుచే నిమ్మాడ్కిఁ బడి మృతిఁ బొందినఁ గలఁగి వీడొక్కడొక్కడై బడంగ
సంతిపురంబున సతివలు విత్రస్తకురరీవిరావసంకులము గాఁగ
నేడ్చుచు నచ్చటి కేతెంచి రం దగ్రసతి యాత్మసుతుని నాశక్రదేవు
నవ్వాసుదేవునియడుగుఁగెందమ్ములముందట ప్రమొక్కించి సమ్మోహవివశ
యగుచు విలపింపఁ గరుణించి యవ్విభుండు
మగువ నూరార్చి సకలసామంతమంత్రి
పౌరముఖ్యపురోహితప్రతతిఁ బిలువఁ
బనిచి రాజ్యంబు నృపతనూజునకు నిచ్చె.

వ. ఇట్లు కరవీరపతిం బరిమార్చి తత్పదంబునం దదీయసంతతిం బ్రతిష్ఠించి.

గద్య. ఇది శ్రీశంకరస్వామినందయమీశ్వరచరణసరోరుహధ్యానానందసాంద్రధుర్య శ్రీసూర్యనారాయణసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైన హరివంశంబునుత్తరభాగంబు నందుఁ బ్రథమాశ్వాసము.

---

## ఉత్తరభాగము - ద్వితీయాశ్వాసము.

క. శ్రీమాద్యదంధ్రదేశ, క్షేమదకరవాల సుజనకీర్తితగుణాలో
లా మంజులవాగ్జాలా, వేమక్షితిపాల నిత్యవిజయవిశాలా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు జరాసంధుపలాయనం బాకర్ణించి జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

సీ. అఖలసైన్యములు సహాయులు గూడంగఁ గృష్ణుచే నపజయక్లేశ మొంది
యేమని తనవీటి కేగె నమ్మగధేశుఁ డెకట యిమ్మెయి ననయంతమేటి
యవనీపతుల కెల్ల నగ్రణి యనిఁ బాఱిపోక కరంబుగఁ గైకొనంగఁ
జనునె శత్రులవెంట మును దాన తగిలి యప్పేరిలు నెగువంగి వెన్నుసూపి
పఱచు టెంతయు సిగ్గఱి బాముమాటి
యేమిటికిఁ గాక చెడుట దానెఱుఁగఁ డొక్కొ
యిట్లు వ్రాయినపిమ్మట నెట్టు లయ్యె
నివ్విధం బెఱిఁగింపు మునీంద్రవర్య.

వ. అనిన వైశంపాయనుం డిట్లనియె నట్లు పరాజయంబు నొంది చనినజరాసంధుండు లజ్జావనతవదనుం డగుచుఁ బురంబు సొచ్చి నిరుద్ధోరగంబుపోలికం బొరలి నిశ్వసించుచు నశ్రాంతచింతాకులత్వంబునం జిత్తసమాధానంబు వడయ నేరక యొక్కనాఁడు భూపతుల నందఱం బిలిపించి వారి కిట్లనియె.

మ. ప్రతికూలంబయి దైవమెంతయును బాపం బాచరింపంగ ను
ద్యత మైనప్పుడు పౌరుషం బతిసమర్థం బయ్యు నత్యంతను
స్థితిఁ బొం దెం గనుఁగొంటిరే మనమ హెూబ్రదేకం బనేకక్రమా
న్భుతమై పేర్చియు నట్లు గోపశిశువుల్ దూలింపఁ దూలెం దుదిన్.

వ. అయినను మన కిప్పు డైన తేజోహాని భూతసర్గంబు గలయంతకాలంబును శాశ్వతంబై యుండు నిది యపనయింప నుపాయం బొం జేయ్యది యెయ్యనువున నైన నయ్యాదవుల వధియించుట నాకుం గర్తవ్యంబు.

క. దీనికిఁ దగ మీరును మీ, సేనాసముదయముతో విశృంఖలలీలం
బూని నడచి పగతుపురం, బై నమథుర పొదివి వైర మడఁపఁగ వలయున్.

జరాసంధుఁడు రెండవసారి మథురమీఁద దండెత్తివచ్చుట.

తే. మనబలంబు లనంతంబు లనుపమములు, యాదవులు వీతసాధను లర్థహీను
లేను బొదివి నిరోధింప నెల్ల భంగిఁ, జెడుచు రొగి సంగియము లేదు కడఁగుఁడోపి.

వ. అనిన సందఱు నవ్విధంబున కియ్యకొనిరి జరాసంధుం డసతిచింత బగుకాలంబున
తను స్తసైన్యసమన్వితుండై కడలె గోత్రజులును సంబంధులును సుహృదులునైన
రాజులును గోమంతశైలంబునం జాల భంగపడుట సభిమానంబు పూని సభూనా
థులు నతని ననుగమించిరి విశేషించి కృష్ణద్వేషులైన పౌండ్రకళింగ దంతవక్త్ర
శిశుపాల రుక్మియవన వేణుధారి సౌవీరగాంధార త్రిగర్త భగదత్తులును మఱియు
సంగ వంగ సుహ్మ విదేహ కాశకరూశదశార్ణమద్రపాండ్యదేశాధీశులు నుత్సా
హంబునం బేర్చి తత్సహాయులై చని రివ్విధంబున నిరువదియొక్కయక్షౌహిణు
లతో నతండు కతిపయప్రయాణంబుల నేగి మధురాపురోపవనంబులు సన్ని
వేశంబులుగాఁ గైకొనిన.

తే. విష్ణు మున్నిడుకొని యదువృష్ణివరులు, కోటపై నుండి యాసైన్యకోటిఁ జూచి
యుగసమాప్తికాలంబున నుల్లసిల్లు, నుదధియో కాక యని వెఱఁగొందు చుండ.

క. సీరిఁ గనుంగొని నవ్వుచు, శౌరి యనియె భూభరంబు నయ్యెన మాన్పన్
గోరి యొకో విధి యిచ్చుట, నీరాజులనెల్ల నొకట నిటు ప్రేరించెన్.

వ. దుర్జనుం డగునీజరాసంధునిమిత్తంబున నీరాజు లిందఱకుఁ బ్రాణాంతకారి యైన
యాపద సంప్రాప్తంబయ్యె నది యట్లుండె ననేకదేశనివాసు లగువసుధాధిపుల
యడియాలంబులతోడిగొడుగులుం బడగలుం జూడు మీకూడినమూఁకలం
గ్రీడయుంబోలెఁ దునుమాడ వలయు సన్నాహసమేతులమై వెడలుద మని
యె నంత.

తే. యమునవిడుపెల్ల విడిదలయై తలిర్ప, బలము విడియించి మగధభూపాలకుండు
మనుజనాథులఁబిలిపించిమంతనమునఁ, గార్యమంతయునూహించి కడఁకమిగుల.

క. అరుదుగ గాడ్పునకైనను, జొర నెడయును లేక యుండఁ జుట్టును ముట్టం
ద్వరితముగ వలయు నీపురి, వెరపు ప్రయోగింపుఁ డిట్టివిధమునకుఁ దగన్

వ. అనిపలికి తదనురూపంబుగా నవ్విభుండు.

సీ. గుద్దండ్లనుం బెద్ద గునపంబులను గోట యొండొండ త్రవ్వుట యుక్కుటులుల
రాకట్టసపుటెడల్ గైకొని నఱకుట యొనరుదంచనముల నొడిసెలలను

జాలంగ నెందును సవరించు టమ్ములఁ దోమరంబులను శక్తులను గదల
గగనంబు నీరంధ్రకంబుగాఁ బొదివి యం దెవ్వరిఁ దలపూపనీక యుండు
టోలి కర్జంబుగా నెల్లయోధులకును, జెప్పి నేఁడాదిగాఁ బురిఁ జెఱుపనియు
సర్వకృతియుమీ కని సమాజ్ఞాపనంబొ, నర్చి మఱియు నానగరము నాల్గుదెసల.

వ. గోమంతపర్వతంబున నెవ్వరి నేదిక్కున నిలువ నియమించె నట్లు వారి నయ్యై
విధంబులను నిలిపి లగ్గసేయం దొడంగిన.

తే. ఉగ్రసేనాసమేతుఁడై యుగ్రసేను, నగ్రసరుఁగా నొనర్చి వీరాగ్రగణ్యుఁ
డచ్యుతుఁడు బలదేవసమన్వితముగ, నఖిలయదువర్గములఁ గొని యనికి వెడలె.

చ. వెలలిసయాదవేంద్రు నతివిశ్రుతతేజునిఁ గాంచి భూమిభృ
ద్బలములు భీతివిహ్వలవిభావనఁ జేష్ట లడంగి చిత్రితం
బులక్రియఁ జూచుచుండె నరపుంగవకోటియుఁ జిత్తము ల్గదుం
గెలఁగఁగ డొంకె నంత భుజగర్వము సర్వము నిక్కి గ్రక్కునన్.

క. తమమొనలు కరము గొంచెము, లమేయములు పగఱమూఁక లని యేమియు ను
ల్లముల గణింపక యాదవ, సమితియు వెన గడఁగెఁ జక్రిశౌర్యముకలిమిన్.

వ. అయ్యవసరంబున.

చ. గరుడపతాకతోడి రథకల్పన మొప్పఁగఁ జక్రిమాదిగాఁ
బరఁగినకైదువు ల్వితతబాహువులన్ వెలుఁగొందదివ్యతా
స్ఫురితశరీరుఁడై సకలభూతభయంకరవిక్రముండు పం
కరుహదళేక్షణుం డడరెఁ గంపముఁ బొందఁగ సర్వసైన్యముల్.

క. హలముసలచాపధరుఁడై, బలుఁడును నిజదివ్యమూర్తి భాసిల్లఁ గడున్
వెలుఁగొందె రిపులచూడ్కులు, ప్రళయవిభావసునిఁ గనినపరుసున మొఱయన్.

వ. ఇట్లు సన్నద్ధులై వసుదేవసూనులు సర్వసైన్యంబులం దలకడచి మహామకరం
బులు మకరాలయంబు దఱియు తెఱంగున విరోధివ్యూహంబు గలంగఁ దఱిసి
రప్పుడు కృష్ణు నంతంతం గని సేనాగ్రగామి యగుజరాసంధుండు నిజశంఖంబు
పూరించిన వారిజోదరుం డయ్యుత్సాహంబు సరకుసేయక పాంచజన్యనినాదం
బున భూదిగ్గగనమధ్యంబు సంభరితంబు గావించిన.

తే. ఊర్ధ్వలోకనివాసులయుల్లములును, నధికభయమోహవివశంబు లయ్యె ననిన
నల్పధారుణీనాథసైన్యములు గలఁగి, త్రిప్పుకొని తల్లడిల్లుట సెప్పనేల.

జరాసంధుఁ డుగ్రసేను నెదుర్కొని రూక్షాక్షరంబుగ నాక్షేపించుట.

వ. అమ్మహాయోధునిం దాఁకి మగధనాథుం డనేకబాణపరంపరలు నిగిడించుచుం
గదిసి తదీయపార్శ్వంబున నరరథంబునం దున్న యుగ్రసేనునిం గనుంగొని
యిట్లనియె.

సీ. భోజవంశమువారు రాజులై యుండంగ యాదవుల్ కింకరులై చరింప
రట్టియన్వయమునఁ బుట్టియుఁ గడుబాముమాలితి నీకంటెఁ బాలిశుండు
గలఁడె యెవ్వఁడు పుత్త్రుఁ బాలియించె నా కృష్ణుఁ డెక్కటి తదాజ్యమెల్లఁ దాన
కొని రిత్తపట్టంబు నినుఁ బూన్ప నతని పెట్టెడు సన్నపిండంబు గుడిచె దకట
యెట్లుగాఁ బెద్దవాఁడవై తేమి బ్రతుకు, సిగ్గఱినభోగ మెట్లు రుచించె నీకు
వారికి బంటవు గాక నీ వవనిపతివె, యిట్టిరాజధర్మధ్వంసి నేను సైప.

క. నినుఁ దోలుత ససైన్యముగా, ననిలోఁ దెగటార్చి పిదప యాదవుల జనా
ర్దనపూర్వజపూర్వకముగఁ, దునుముదు నీపేఁచమడఁగ దుర్దమశక్తిన్.

వ. అనిన నమ్మాటలకుఁ గలుషించి కమలనాభుండు.

చ. అక్కట యుగ్రసేనుని మహాత్ముని బల్కుట సంగరంబునం
దెక్కుడుపౌరుషంబు వెలయించుటయే పలుకం దలంచినన్
గ్రుక్కక నన్నుఁ బల్కుము విరోధ మొకండె కాన నాకు నీ
యుక్కున మెన్నిచందముల నోర్వక పోవున చేయు నేటికిన్.

తే. నాఁడు గోమంతనగమున నన్ను నాజిఁ, గదిసి చూచినవాఁడవు గావె నీవు
నాఁటివాఁడన నేనును నవ్వుఁ బోటు, గాదె యిట్లింట యీవితర్కంబు గలదె.

ఉ. ఇమ్మెయి నిప్పు డగ్గమయి యెప్పటియట్టుల డాఁగురించి నీ
విమ్ములఁ బాఱిపోవ కొకయించుక నిల్చితివేని నీమకం
ఠమ్మవికుంఠితాస్త్రవికటప్రహతిం దునుమాడువాఁడ ని
క్కమ్మిది చూడు మస్మదవిఖండితగర్వము సర్వము న్నృపా.

క. అని యిరువదేనుతూపుల, జనపతి నైదింట నతనిసారథిఁ బ్రభుఁ డే
పున నొంచి కార్ముకము కే, తనముఁ దునిమె రెండుసునిశితప్రదరములన్.

వ. అట్టియెడఁ గౌశికచిత్రసేను లడ్డంబు సొచ్చి వాసుదేవుం బెల్లేసిరి కౌశికుండు నేటి
మూఁడమ్ములు హలాయుధుమేన గ్రుచ్చె నాతం డతనివిల్లు భల్లంబున నఱికి యు
ఱక మెఱుంగుటమ్ము లెమ్ములం గీలించినం దలంకక కోదండాంతంబు ధరి
యించి మాగధసేనాపతి యమ్మాధవాగ్రజుతోఁ బెనఁగాడుచుండెం జిత్రసేనుండు
దోఃప్పడిమె నంత.

ఉ. ఒరిడొకవిల్లుపుచ్చుకొని యుగ్రగతి న్మగధేశ్వరుండు దో
శ్చండిమ నూఁపెఁ గృష్ణునకు సైన్యపు లిద్దఱు భర్తఁ గూడి యొం
డొండ హరిన్ హలాయుధుని నొక్కట నేసిరి వారిమువ్వురం
దండిమగండు పంకరుహనాభుఁడు నొంచె శరత్రయంబునన్.

తే. యుగ్రసేనునిమెయినాఁటె నుగ్రబాణ, మాజరాసంధుఁ డొకటి యయ్యవనిపతియు
డెబ్బదేను దొమ్మిదియును నిబ్బరంపు, టమ్ము లతనిపైఁ బరఁగించె నలుక మిగుల.

క. మ్మాధవమాతామహుతో, బాధకముగ దశసహస్రబాణంబుల నా
యోధనము సేసె మగధధ, రాధీశుఁడు చూచి ఖచరు లచ్చెరువందన్.

వ. కంసజనకుండు ధనుర్దండఖండనం బొనర్చిన నొండువింట నతని డెందంబు గాఁడ
నేసి రథ్యంబులం దెగటార్చి విల్లునుం బడగయుం బొడిసేసె నట్లు రామకృష్ణులు
చూచుచుండఁ బగతుచేత విరథుండై యయ్యుగ్రసేనుండు దొలంగిపోయిన.

సీ. చెలఁగి కౌశికచిత్రసేనులు దోడుగా నాబృహద్రథసూనుఁ డాహవమున
సీరినిఁ జక్రిని. శితసాయకత్రయమున నొంప హరియు నాభూపవర్యుఁ
దచ్చమూపతులను దారుణశరపంచకంబులఁ బీడించెఁ గామపాలుఁ
డై దేసియమ్ముల నందఱ నేసి యాచిత్రసేనునిధనుశ్ఛేదనంబు
సేసి హయములఁ గూల్చెఁ జెచ్చెర నతండు, పరిఘపాణియై కదియంగ బలుఁడు నతని
యుసులుగొనుటకు శరము లొండొండ పఱపఁ, ద్రుంచె నాతనివిలు మాగధుండు పేర్చి

వ. ఆలోన గదాహస్తుండై యుఱికి తదీయరథ్యంబులం జదియ మోఁదిన నారా
ముండు భీమవేగంబున ముసలం బమర్చికొని యడరె నట్లు జరాసంధ బలదేవు
లెక్కటిం దలపడంగడంగునెడ రెండుసైన్యంబులు భేరీమృదంగ నిస్సాణారవం
బులు సింహనాదంబులు నంబరంబుఁ బగిలింప నయ్యుద్ధఱితలపాటునకు నంకిలి
యగునట్లుగాఁ గ్రందుకొనం దఱిమిన.

క. ఇరువురుఁ దొలంగి గ్రక్కున, నరదము లెక్కిరిబలంబు లన్నియు వీఁకం
బురికొల్పుచుఁ గడఁగిరి దొర, లురవడి నుత్సాహరస సముత్కటసరణిన్.

వ. శినియు ననావృష్టియు బభ్రుండును విపృథుండును లోనుగా బలదేవు మున్నిడి
కొని యొక్కదెస మోహరించిరి దాశాపహుండును గంభహుండును బృథుండును శత
ద్యుమ్నుండును విదూరుండును నాదిగా వాసుదేవునిం బురస్కరించికొని యొక్క
దిక్కు నంబన్నిరి సత్యకుండును సాత్యకియు శ్వఫల్కుండును శ్యాముండును సత్రాజి
తుండు నుగ్రసేనుండును నాదిగా మృగధరు నగ్రేసరుం జేసి యొక్కపలన నిలిచి
రిట్లు మూఁడొడ్డనంబులై యదుసైన్యంబులు భీష్మకరుక్మిప్రముఖమహాయోధ
రక్షితంబును ప్రాచ్యదాక్షిణాత్యబహుళంబును జరాసంధసనాథంబును నగు
మాగధసైన్యంబుం దలపడియె నట్టితఱిఁ దల నశ్వారూఢు లశ్వారూఢులను
గజారోహకులు గజారోహకులను రథికులు రథికులను బదాతులు పదాతులను
దార్కొనిన నపుడు వాఁగునకు శూరజనహర్షజననంబును భీరునివహభయావహం
బును వైవస్వతపురవర్ధనంబు నగుయుద్ధంబు ప్రవర్తిల్లె నందుఁ గృష్ణుండు రుక్మిని

నుగ్రసేనుండు భీష్మకుని వసుదేవుండు గ్రథుని బభ్రుండు కౌశికుని గదుండు చేది
నాథుని రంభుండు దంతవక్త్రుని సాత్యకి విందానువిందులను శతధన్వున్నుం డేక
లవ్యుం దాఁకిరి జరాసంధుండు రాముతో సంగ్రామం బొనర్చునాసమయంబున.

రుక్మి శ్రీకృష్ణునితోఁ దలపడి యుద్ధంబుచేసి పరాజితుండై పోవుట.

తే. ఇరువదేను ముప్పదిరెండు వరుసతోడ, నేసె నమ్ములు రుక్మిపై వాసుదేవుఁ
డస్త్రములు రెంట భోజరాజాత్మజుండు, మాధవుని నేసె వేఁగొక్కమార్గణమున.

క. అతనికార్ముకమౌర్వీ, శాతనమున కుత్సహింప శార్ఙ్గధరుండున్
శాతాంబకమున విశిఖో, పేతంబుగఁ ద్రుంచె నతనిపెనువిల్లు వెసన్.

ఉ. ఛిన్నధనుష్కుఁడై రిపుఁడు శీఘ్రమ శక్తి యమర్చి వైచె నా
వెన్నునిదిక్కు శౌరియును విస్ఫుటభల్ల మొకంట దాని ను
త్సన్నము సేసి యొలిన గదాపరిఘంబులు లోనుగా నతం
డెన్నిటి నెత్తె నన్నియును నేసెసఁగి న్నుఱుమాఱెఁ గైదువుల్.

వ. అంత నిలువక కేతనంబు నఱకి రథ్యంబుల వధియించి సారథిం దెగటార్చి విర
థుండునువికలసాధనుండు నైనయతనిం జూచి త్రికాలవేది యగుట నవ్విష్ణుండు
భావి యగుతత్సోదరీపరిగ్రహంబున నయ్యాదుబాంధవం బూహించి చంపక
పోవిడిచె నుగ్రసేనుండు భీష్మకునిం బంచవింశతివిశిఖంబుల నేసిన నతం డతని
ననేకశతసంఖ్యంబు లగుశరంబులం బొదువుటయు.

ఆ. అలిగి కంసుతండ్రి యతనివిల్లునుబడ, గయును ద్రుంచి సూతు హయచయంబుఁ
గూల్చుటయును భీతిగూరిభీష్మకుఁడు క, య్యంబు సేయు టుడిగి యరిగెఁ దొలఁగ.

మ. గ్రథుఁ డేడమ్ముల నొంచెఁ గృష్ణజనకున్ గర్వంబుతో నాతఁ డా
పృథుబాణాహతి లెక్కసేయక వడిం బెల్లేసి తోడ్తోన సా
రథి నశ్వంబులఁ గేతువున్ ధనువు రౌద్రస్ఫూర్తితోఁ ద్రుంపఁగాఁ
బృథివీనాథులు సూడఁ బాఱె నతఁడున్ భీతిం గడున్ దప్పగన్.

వ. బభ్రుం డనేకబాణంబులం గౌశికునంగంబు నొప్పించిన నయ్యదువీరుని నాతండు
సాంద్రశరవృష్టిం దొప్పఁదోఁచుటయు నమ్మహాబాహుండు తద్బాణాసనంబు
నఱకిన నొండువి ల్లెత్తి యేయుసాయకంబులు మర్మంబులు దాఁకి నొచ్చిన
నొవ్వితోన యలుక నురవణించి.

క. పరుష మగునర్ధశశిముఖ, శరమునఁ బగతునిశిరంబు చారుకిరీట
స్ఫురితమణిరుచులు పర్వఁగ, ధరణికి బలిగా నొనర్చి తడఁబడ నార్చెన్.

తే. గదుఁడు చేదినాథుని నొంప గదిసి నొంచెఁ, జేదినాథుండు బహుళాస్త్రమేదురాంగ
తమసనిర్మగ్న మయ్యె రోదసితలంబు, సకలభూతావళియు భీతిచలిత మయ్యె.

క. క్రొంపొకవడికిం జైద్యుఁడు, కాండపరంపరల విరథుఁ గావింపఁగ భీ
తుండై యాదవుఁ డరిగెన, ఖండితశౌర్యుఁ డగుశౌరి కడకు రయమునన్.

క. శంభుఁడు భూరిభుజాసం, రంభంబున దంతవక్త్రుఁ బ్రకటశరసము
జ్జృంభణగోచరుఁ జేయఁగ, సంభరితాస్త్రములఁ బొదివె శాత్రవు నతఁడున్.

సీ. సాత్యకి యత్యుగ్రశరముల విందానువిందుల వెసఁ బరివితతతనులఁ
జేయంగ నతనిపై నాయవంతీశులు వివిధాస్త్రజాలంబు వెల్లిగొలిపి
విలు ద్రెవ్వ రథహయంబులు నొవ్వ సారథి దలరఁ బ్రస్ఫుటశక్తికలనఁ జూపి
రతఁడు వేఱొకవింట ననువిందు విరథుఁగా నొనరింప నిద్దఱు నొక్కరథము
నందు యుండ నత్తెఱను నపహతముగ, నాచరించి గ్రక్కున నొక్కయక్కజంపు
గద యమర్చి వైచినఁ దొలఁగంగ నుఱికి, పోయి రోటమికోర్చి యబ్బ్యాపసుతులు.

వ. శతమన్యుమ్ముం డేకలవ్యుపై సప్తనారాచంబు లేసిన నమ్మేటిమగండు దానిను
నన్నియ తూపు లతని మేన నాటించెఁ గ్రమంబున నేడింటను ముప్పదియే
నింటను నతండు నాతండును నుండొరుల నుప్పించి యొకళ్లొకళ్లవలన విరథత్వంబు
నొంది గదాహస్తులై యనేకమండలభ్రమణంబులం బరస్పరాంగంబులు పరిక్ష
తంబులుగావించి మెఱయుచుం బెద్దయుం బ్రొద్దు పోరునెడ యాదవుండు గ్రమం
బునఁ బ్రతిభటునిచేతికయిదువు విఱుగునట్లుగా వెరవుతోడ వ్రేటుగొనిన నతండు
గదాశకలంబు నయ్యున నురివి గాఢముష్టిం దద్భుజాంతరపీడనం బొనర్ప నవ్వీరుం
డును నవ్విధంబువాఁడ యై నిలిచె నట్లిరువురు బాహుయుద్ధంబునకుం దొడంగి కిట్టి
యుం బట్టియుం బొడిచియు నడచియుఁ ద్రోచియుఁ దాఁచియు డాసియు వ్రేసియు
జానుకూర్పరతలప్రహతుల బాహూరుపీడనంబులం గేశాకర్షణనఖదంతఘాతం
బులను సరిగాఁ బెనంగిరి కొండొకసేపునకుఁ గృష్ణబాంధవుండు జరాసంధుబం
ధుని నతినిబిడబంధం బగుబంధురముష్టి నూరుసంధి యుఱక పొడిచినం బగ
తుండు గన్నుదిరిగి నెత్తురు గ్రక్కుచు గ్రక్కున నొఱగి యంతలోనన సంబ
ళించుకొని మొగసి బొంకుబొంకని యార్చుచుం గడంగిన నద్దేనయోధు లతని
కడ్డంబువచ్చి రవ్వాలనివార లతనిం గైకొని వారిం దలపడి రయ్యెరవడిఁ
గయ్యంబు సందడి యగ్గలం బయ్యె నిత్తెఱంగున.

క. ఎక్కటిపెనఁకువ లెన్నఁగఁ, బెక్కులు గడునక్కజములు భీషణములు నై
యొక్కటఁ జెల్లఁగ ననిమిష, దృక్కౌతూహలము లధికతృప్తి వహించెన్.

వ. అట్టిసంకులసమరంబునం గులశక్తిసాహసంబులు నిరపోహంబులుగా నిర్వహింపు గర్వంబునం బెంపారుశూరులు గవిసి చిత్రసంప్రహారప్రౌఢిం జూప నేపునం బోవక పెనంగుతురంగమాతంగశతాంగపదాతివ్రాతంబులు వివిధవినిఘాతంబులం దెగినమోరల నొగిలినకంధరంబులం దునిసినతొండంబుల మురిసినకొమ్ముల. నొఱిగినసారథుల విఱిసినకేతువులఁ ద్రెస్సినసుముల వ్రస్సినయురంబులం బ్రచురంబై చెల్లం దోడ్తోన పెరుగు పెన్నెత్తురు మడువులు గాలువలు నై యొదవి యస్థిచూర్ణసైకతంబులం బలలపంకంబులం బరఁగ నొరిలినహారమణులం బడిన తెల్లగొడుగుల సమరభూభాగంబు లుద్భిన్నతారకంబులు నల్లసితశశాంకంబులు నగునాకాశప్రదేశంబుల ననుకరింప నాయతబాహుచ్ఛేదంబులు నారక్తకరచరణంబులుం గలచోట్లు ప్రసుప్తభుజగంబులు ప్రస్ఫురితకోకనదంబులు నగునెలవులఁ బురిడింప నిర్జీవతానిశ్శబ్దంబు లగుశరీరసహస్రంబు లెడనెడం బడినవీరశంఖపణవహుంహుభికాంస్యకాహళాదులును సమానవ్యసనంబు లయి మూకీభవించె నన నపంగి యుండ నొండొండ పేర్చుభూతబేతాళడాకినీశాకినీకలకలంబులవలనం గేవలకుణపమయంబు లగుతావులం బునరుజ్జీవితదేహంబు లై నపగిది నుత్ప్రేక్షణీయంబులై వెలయ వియత్తలరంగంబు గైకొని కుంచియ వీచి యాడునారదుచేత శిక్షితంబు లయ్యె నన నడగి గృహీతప్రహరణంబు లయి నర్తించుకబంధంబులు రౌద్రాద్భుతరసంబులకుఁ బాత్రంబులై మెఱయ నవ్వేళ యాభీల యయ్యె నాసమయంబున.



బలరామజరాసంధుల గదాయుద్ధ విజృంభణము.

మ. తనతేరెండును నుల్లసిల్లఁగ బలోద్దాముండు రాముండు దీ
ప్తనిశాతాస్త్రపరంపరన్ రగధయోధశ్రేణిఁ దూలించుచుం
జనుదేరం గని సైప కేపున జరాసంధుండు సంధుక్షితో
గ్రనిజక్రోధకృశాను నాతనికి వీఁకం జూపఁ గాంక్షించుచున్.

క. తేరభిముఖంబు సేయఁగ, సారథిఁ బనిచి పటుబాణజాలభయదవీ
రారంభుఁ డైనఁ దత్క్రియ, చీరికిఁ గైకొనక తాఁకె సీరియుఁ గడిమిన్.

చ. ఇరువురు నేచి తుల్యముగ నెంతయుఁ బ్రొద్దు పెనంగి రథ్యముల్
ధరఁబడ సూతు లీల్గఁగఁ బతాకలు ప్రమ్మగ్గఁగ వర్మబంధముల్
మఱియఁగఁ జాపము ల్దునియ ముద్గరతోమరశక్తు లాదిగా
వరుస ననేకము ల్మసియ వావిరిఁ బోరి చలంబు పెంపునన్.

తే. గదలుగొనిమహితలముగ్రక్కతలనుఱికి, తుంగశృంగసమన్వితాశ్రులున్ బోలెఁ
గదియ రెండుసైన్యములును గదన ముడిగె, నమ్మహాద్వంద్వయుద్ధ వీక్షాదరమున.

వ. అశ్లిల్లవారునుం జాల నెడగలిగి చూచుచుండ నంబరంబున ననిమిషసిద్ధవిద్యాధరప్రముఖులును నధికతాత్పర్యంబున నాలోకింప సంగరరంగంబు ప్రవేశించి.

సీ. పేర్చి మదోద్రేకబృంహితరౌద్రంబు లగుషష్టిహాయనహస్తు లనఁగ
రోషభీషణరేఖ రొప్పుచు బీరంబు పొలిక్రానికడిఁదిబెబ్బులు లనంగ
వెలయుదర్పంబున మలసి అంకెలు వైచి పటుతఁ గ్రాలెడువృషభంబు లనఁగఁ
గ్రూరచేష్టితములఁ గూరి పుర్వారిహుంకారంబు లగుమృగవైరు లనఁగ
లాగువేగంబు సౌష్ఠవోల్లాసవిధము, గడఁకయునునుబ్బుఁ దుల్యత్వకరణిమెఱయ
ఘోరమూర్తులై సింహనాదారవంబు, లడరఁ దాఁగ్కి-నిరిద్దఱు లాగ్రహమున.

వ. ఇవ్విధంబునం దలపడి యిద్దఱు నుద్దామరభసంబునం బెనంగునెడ జరాసంధుండు సవ్యమండలభ్రమణంబుల నభివేష్టించిన ముష్టికాంతకుం డవ్వైరవు గణియింపక దక్షిణభ్రమణమండలంబులఁ జుట్టికొని తిరుగ నిరువురికయిదువులు నొండొంటిం దాఁకి నిర్ఘాతపాతభీషణం బగుఘోషంబు పుట్టింప బెట్టిదంబుగా బృహద్రథసూనుఁడు సయ్యాదునందనుండు గద వీచివైచిన నతం డప్పాటు దప్పించుకొన నది యుగ్రీతలంబు చలియింపం బడిన నత్తెఱపి నుఱికి ప్రేసిన విపక్షుప్రేటు నరియించి భీముం డగుసీరాయుధుం డమ్మహాయుధంబు నతిరయంబునం బుచ్చికొని చెచ్చెర మాగధు నడిచిన నాతండును దీవ్రఘాతం బొనర్చె నట్లు దొడంగి యొకటి రెండు మూఁడు నాలు గనుచు నెక్కించిన ట్లక్కజంబుగా నొండొరులం బర్యాయప్రహారంబుల నొప్పింప నప్పటిచంక్రమణవేగంబులం బదపాతపీడితయై సర్వసర్వంసహాయుఁ జలింపఁ బెంపేది కులశైలకూర్మవిభులరేరంబులు వీఁపును నొగుల దిగులు పుట్టి నిఖిలభువనవాసులు భువనంబులకు భద్రంబు గావుత మని భయభ్రాంతులై యాక్రోశింప వాసుదేవాగ్రజుం గదిసి యహితుం డురస్థలం బతిగాఢప్రహతిం బగిలించినఁ బెలుచ నెత్తురుగ్రక్కుచు గ్రక్కున నతండు పుడమిం బడి పడుటయు నెఱుంగంబడక యుండ నంతన నెగసి పగతు నశితల బెడిదంపుఁగడంక నడువఁ గర్ణనాసారంధ్రంబుల మెనఘులు వొరఁగఁ దూలి కూలినఁ బ్రతిభటుండు పొలిసె ననుచు యాదవు లార్వ గర్వం బేది మేదినీశ్వరుసైన్యంబులు గలంగ గ్రమ్మనం దెలిసి మగధనాథుండు మాధవపూర్వజు నపూర్వాహం కారంబున నందంద ప్రేయుటయు నమ్మహాబాహుండు సముత్సాహంబునఁ గృతప్రతికృతి గావించె వారలన్యోన్యహననంబులం బ్రకుతోఖలకాయులై రుధిరధారలం దడిసి పుష్పితకింశుకంబులుంబోలెఁ బొలుపారి గగనచరులచూడ్కికిం బరమోత్సవం బాపాదించిరి తదనంతరంబ.

తే. అలుక యంతంత కెక్కఁగ హలధరుండు, విమతుఁబోరిఁ గొంకునింకొక్కఁ ద్రోసి
యనితలంచుచుఁ బెనుగద హస్తతలము, నందమర్చి యుగ్రపుదృష్టి నరినిఁ జూడ.

వ. అంతరిక్షంబున నశరీరి యిట్లను నీమాగధుం డొరులచేతం జావండు వీనికిమృత్యువు వేఱొకం డున్నవాఁ డనతిచిరం బగుకాలంబున నివ్విధంబు సంపన్నం బయ్యెడు నీ విప్పు డాయాసంబుఁ బొంద వలవ దుడుగు మనిన విని జరాసంధుండు విమనస్కుం డయ్యె రాముండును సంగ్రామవిరామంబు నొందె నంత నారెండుదెఱంగులవారును బోరుడిగి తిరిగి పోయిరి యాదవులు మఱియును బ్రతిదినంబును సన్నద్ధులై వెడలు మాగధులును సకలపార్థివసేనలతోడం దొడరి పెనంగుచు రిట్టివిక్రమంబున దీర్ఘకాలం బితరేతరక్షయకారి యగుదారుణసంప్రహారంబు చెల్లుచుండె.

## జరాసంధుండు పరాజయంబునొంది మరలి నిజపురంబునకుం జనుట.

చ. అనుపమదైవమానుషబలాధికు లాయదువంశసంప్రవ
ర్ధనులభుజప్రభావపటుదర్పము లొర్వఁగ రాము తెల్లఁగాఁ
గని పగతుండు గం డెడఁగి కాతరభావము నెమ్మనంబునం
దనికిన సర్వయత్నములు దక్కి నృపాలసమత్కరంబుతోన్.

వ. సేనాసముదయంబుల నెల్లఁ దివియించుకొని నిస్తేజుండై తనవచ్చినత్రోవన మగిడె నప్పుడ మగధపతి బెగడి తొలంగి పోయెను.

మ. విజయభ్రాజితులై యదుప్రవరు లావిఖ్యాతసమ్మోదసం
ప్రజయస్వాంతత నచ్యుతున్ హలధరున్ భవ్యస్తుతిం గీర్తించుచు
న్నిజభాగ్యోదయ మెల్లవారలును వర్ణింపంగ బూర్ణోన్నతిం
ద్రిజగద్రాజ్యము సేరినట్లు కడు నుద్దీపించి రా వెంపురన్.

ఉ. అంతను బుద్ధియుక్తమగుయాదవవృద్ధగణంబు శత్రుస
త్వంపయశోధికప్రకటభంగుల గెల్చియు గెల్పు గెల్పుగా
డెందములందుఁ జూడక కడింది గ్రుక్కియ యుండెఁ బెంపుసొం
పుం దనరార వానిబలముం జలముం గుఱిగా దెలుంగుటన్.

సీ. అట్లు పలాయితుండై చని యాజరాసంధుఁ డేమని చెప్పఁ జలము మిగులఁ
దక్కక మఱియు నుద్దండత నెప్పటియట్లు మధురపయి నరుగుదెంచె
య్యాదవులును దొంటియట్టులసమకట్టి వెడలి ఖేచరదృష్టి వెక్కసమున
మునుఁగంగఁ బోరి రిట్లెనసినపోరాట పదునెనిమిదిమాఱు లెదిరి రిపుఁడు
భగ్నుఁడై పోవు నయ్యదుపతియుఁ దానుశక్తుఁ, డయ్యును బ్రతిపక్షుఁ జంప నెల్లఁ
దొరఁడు వానికి మృత్యువై యునికి బుద్ధి, నెంతయును నిశ్చితమ్ముగ నెఱుఁగుఁ గాన.

వ. ఇత్తెఱంగున నాశ్రితశ్రీవిధాయి యైనయాశ్రీవిభుండు విజయశ్రీసమేతుండై సుఖంబుండె నయ్యుమవీరు లిద్దఱు సమ్మహాసమరంబుల నాత్మీయదేవతారూపంబులుం దక్కినయప్పుడు మానుషాకారంబులుం బచరించి నిజమాయాప్రభావంబు భావింప నెవ్వరికి నలవిగాక యతిశయిల్లు నంత నొక్కసమయంబున బలదేవుండు.

క. తనపిన్ననాఁటియాటల, క్రమమంతయుఁ దలఁచి వేడ్కఁ గడలుకొనఁగఁ జి
త్తమునందు గోకులాలో, కమహోత్సవ మిచ్చగించి కర మిష్టమునన్.

మ. జలజాతేక్షణుతోడఁ జెప్పి తదనుజ్ఞం దా నొకండు న్సము
జ్జ్వలకాంతారవిహారయోగ్య మగువేషం బొప్ప వ్రేపల్లెకున్
లలిమై నేగినఁ దన్నివాసులు మహోల్లాసాత్ములై యమ్మహా
బలు నంతంత నెదుర్కొనంగ నతఁడున్ బంధుత్వ ధౌరేయతన్.

క. కొందఱకు మ్రొక్కి తనకుం, గొందఱు మ్రొక్కంగ వరుసఁ గొందఱఁ గుశలం
బందంద యడిగి కౌఁగిటఁ, గొందఱఁ గదియించి ప్రణయకోవిదుఁ డగుచున్.

క. గోపికలు వొదివికొనఁగాఁ, దీపారెడిచూడ్కితోడి తిన్ననియుచితా
లాపములఁ బ్రియము సలుపుచు, నాపోవని యింపుసొంపు లభినవములుగన్.

వ. ఉన్నంత గోపవృద్ధు లందఱు నతనిఁ బరివేష్టించి యిష్టగోష్ఠిం దగిలి యిట్లనిరి.

క. స్వాగతమే యాదవకుల, రాగవివర్ధన మహాత్మ రామ సుఖశ్రీ
భాగి నిను నిపుడు గని సుఖ, భాగుల మేమైతి మెట్టిభాగ్యోదయమో.

చ. తమతమజన్మదేశములు తద్దయు రమ్యము లెల్లప్రాణిజా
తములకు నంట యిప్పుడు గదా నిజ మయ్యె జగత్ప్రసిద్ధవి
క్రముఁడవు నీవు నీపసులఁగాచినచోటికి వచ్చి యిమ్మెయిన్
మముఁ గొనియాడ నింకఁ గడుమాన్యుల మైతిమి దేవతాలికిన్.

సీ. చెనఁటిచాణూరముష్టికుల భంజించుట కంసునిఁ బరిమార్చి కరి నడంచి
తనరుట శత్రునితండ్రిఁ బ్రతిష్ఠించు టబ్ధిలోఁ దిమితోడియాహవంబు
గోమంతనగమున శ్రీమెఱయంగ నుదాత్తదివ్యాయుధావాప్తిమహిమ
భూమీశ్వరులతోడిభూరిసంగ్రామంబు కరవీరవిభుని సృగాలుఁ గోల్చు
టర్థి మధురకేతెంచుట యచటఁ జిత్ర, జయము గ్రమ్మఱఁగొనుటయాసరణినీవు
దమ్ముఁడును జరించినయద్భుతంపుఁజరిత, మెన్నఁ గొనియాడ నెవ్వర మిప్పుడేము.

క. ఈవసుమతి యంతయునిటు, మీవలనఁ బ్రతిష్ఠవడసె మీవా రగువా
రేవారు వారు కల్యా, ణావాసులు దార యగుట యరిదియె యనఘా.

చ. అన విని రాముఁ డిట్లనియె నక్కట యిం తన నేల మీరు గూ
ర్మి నెఱయఁ బెంపఁగాఁ బెరిగి మీచిరశేషుఁ జరించి మీగృహం
బున పరమాన్నము ల్గుడిచి బుద్ధిఁ దనర్చినమాకు నెందు శో
భన మగు టేమి సందియము బాంధవు లెవ్వరు మిమ్ముఁ బోలఁగన్.

క. రాచసిరి యుండియును మఱి, యాచపలం గొలుచు నాకు హరికి నిచటి బా
ల్యాచరణమ్ములె ముఖ్యము, గోపాంగనలను మఱవ నెన్నఁడు రామన్.

వ. అనిన సంతసిల్లి వారంద ఱాతని సభినందించి మాధుర్యహృద్యంబు లగుమద్యం బులును సమధికామోద్యంబు లగుభక్ష్యంబులును భావానురూపంబు లగునను లేపంబులును జేతోవిలోభనకల్యంబు లగుమాల్యంబులును ననేకంబు లాకల్యాణ మూర్తికి సమర్పించిన సంప్రీతుండై విచిత్రంబును రమణీయంబు నగుప్రదేశంబున.

ఉ. గోపిక లందియుఁ బసిఁడికోరి నుదారసుగంధశీధు వి
చ్ఛాపరిపూర్తిగాఁ గొని వెసం గడు నగ్గడునై ముదంబున
వ్యాపకభంగి సంగము సమస్తము ఘూర్ణన మొందఁ జేయు ను
ద్దీపిత మైనమోహము మదిం బరతంత్రత నావహింపఁగన్.

సీ. కనకపుమోకునఁ దనరెడుసురదంతిమాడ్కి నుత్ఫుల్లదామమున సమరి
నిండువెన్నెల పర్వ నెఱయుకైలాసాద్రిపోలికఁ జందనసాంద్రదీప్తి మెఱసి
చలపల్క మగుశరజ్జలదంబుక్రియ నేకకుండలమణిదీప్తిఁ గొమరుమిగిలి
ఘనభోగియుక్తమై తనరుపటీరంబుగతిఁ జేతిహలమున నతిశయిల్లి
తారకలలోఁ గలంకవిస్ఫూర్తిఁ దగుచు, నలరుపూర్ణేందువిధమున నతివపిండు
నడుమ నీలాంబరద్యుతి బెడఁగు గాఁగ, నధికధవళాంగరుచి నొప్పె నవ్విభుండు.

వ. అచ్చటికి ననతిదూరగామిని యైనకాళిందిదిక్కు మొగంబై.

క. ఓయమునానది నీయుం, దాయతముగ నాకు వలయు నవగాహంబుల్
జేయఁగ రావె తేవె, తోయము లని పిలిచె నెలుఁగు తొట్రిలఁ బెలుచన్.

వ. పిలిచి యమ్మహాతరంగిణి యాత్మస్వభావంబున నునికి దన్నుఁ గైకొనమిగాఁ గొని యమ్మహాబాహుండు.

బలరామదేవుండు కాళిందీ భేదనంబు సేయుట.

మ. అలుకం బేర్చి హలం బధోముఖముగా నచ్చోటికిం జాఁచి త
త్సలిలౌఘం బాక్రాంతమై తనకునై సర్వంబు నొండొండ యి
మ్ముల రావింపఁ దొడంగె భూరిభయసమ్మోహంబునన్ ధాత్రి య
గ్గలపుంగంపము నొందఁ గ్రిందటిభుజంగవ్రాతముల్ భీతిలన్.

వ. ఇవ్విధంబున సంకర్షణలాంగలాకర్షణంబునకు వశగతయై విశీర్ణశైవాలకేశియు విలోలమీనదృష్టిపాతయు విస్రస్తఫేనదుకూలయు విహ్వలవిహంగరుతాక్రందయు వికలకలహంసగమనయు వికంపితకోకస్తనయుగ్మయు విషణ్ణపంకేరుహవదనయు విభిన్నవీచిబాహువిలసనయు వికలితావర్తనాభియునై విభుకరాకృష్యమాణ యగువిముగ్ధయుం బోలె నరుగుదెంచి యాతటిని యాతనిమ్రోల నాత్మీయదివ్యాకారంబు దాల్చి నిలిచి విరచితాంజలియై యిట్లనియె.

క. శరణమ్ము గమ్ము నీవగు, చరణమ్ములె శిరమునోర్చె సంప్రార్థన త
త్పరత మనఃస్ఫుర హలధర, హరిపూర్వజ చక్కఁజూడు మాతురు నన్నున్.

క. స్వాభావికజాడ్యమున మ, హాభాగ భవన్నియుక్తి యాత్మ నెఱుఁగఁ గే
నీభంగి నైతి నలుగుము, నే భామల నిటుల లట్ల యిట్టి మహాత్ముల్.

ఉ. జీవితభర్తయై పరఁగుసింధువుఁ గూడఁగఁ బోలు పుండ బృం
దావనమధ్యభూమికి నుదారుఁడు రాముఁడు గ్రమ్మరించెఁ దా
నేవిధిఁ దప్పునేయ కిటు లేలగు నిన్నది యంచు నింక నే
నావలికోచుల న్నగుచు నార్వరె నన్ను సపత్నులందఱున్.

క. అపచారనిదర్శక మగు, విపరీతగతంబు నాకు విశ్వజగమునం
దపకీర్తికరం బిది నీ, కృపగల్గినఁ జాలు నింకఁ గిల్బిషభేదీ.

వ. క్రమ్మఱ నేను బూర్వమార్గప్రవర్తిని నగునట్లుగా నానతిచ్చి పనుపు మీ మహాసీరవిదారణరభసం బుపసంహరింపు మనిన నవ్విభుం డవ్వేలంది నాలోకించి నీవు చేసికొనుటం జేసి నాఁడియలుక యొకింత సైరణ సేసెదం గాని నీ తప్పున కిప్పగిది దండచండతయుం జాల దది యట్లుండె నీవింతట నిలిచి యెల్లకాలంబును నేనిచటికిం దిగిచినయిప్పాయవలన బృందావనపావనం బొనర్పుము నాకు నిట్లయిన నత్యంతశాశ్వతం బగుయశంబు సిద్ధించు భవన్ముఖ్యప్రవాహంబు వాహినీశ్వరగామి యగుంగావుతమని యనుగ్రహించుటయు నిగ్రహావిముక్తయై యయ్యగ్రిమతటిని యాత్మేచ్ఛం జనియెఁ గాళిందీభేదనప్రభావంబు గనుంగొని గోపాలు రందఱు నచ్చెరువు నొంది యయ్యమానుషసత్త్వశాలి ననేకవిధంబులం బ్రస్తుతించి రవ్విధంబున నాశ్చర్యకర్మకలనాధౌరేయుం డైన రౌహిణేయుండు.

బలరాముఁడు వ్రేపల్లెనువిడి మధురాపురంబునకు వచ్చుట.

క. వెండియుఁ గొన్ని దినంబుల, ఖండితరాగమున గోపకప్రకరములో
నుండి హరిఁ దలఁచి కౌతుక, కండోలం బైన మనసు కడుఁ దమకింపన్.

తే. వ్రజనివాసుల నెల్లను వరుసతోడ, వీడుకొని తన్ను నందఱు వేడ్క ననుప
మధురకేఁగెంచె వ్రజములోమరిగితాల్చి, యున్నవేషంబ యెంతయు నొప్పుమెఱుఁగ.

క. మునుగోవిందునియింటికిఁ, జనుదెంచినఁగాంచి యధికసంప్రీతి నెదు
ర్కొని తత్పదములకుఁ బ్రణతి, యొనర్చి కావించె నాతఁ డుచితార్చనముల్.

వ. అయ్యగ్రజుం డయ్యనుజుండు మున్నుగా నిజజనకుం గని ప్రణతుం డై సంగడిసి కౌఁగిలించి యవ్వసుదేవుండు గోకులంబునకేఁగి బహుగి నా బలభద్రుండు భద్రిం బుగా స్వకులంబు నుపన్యసించె మఱియుం బుత్త్రులిద్దఱు వివిధవిభావిన్యాసం బొనర్చి తండ్రిం బ్రముదితుం జేసి రిట్లు ప్రవర్తనంబులం గొంతకాలం బునిచిరటయు.

క. ఒకనాఁడు సకలయాదవ, నికరసభాంతరమునందు నిజజనాభుం
డకుటిలమనస్కుఁ డిట్లని, ప్రకటార్థం బైనపలుకు పలికెం బ్రీతిన్.

సీ. వినుఁడు యాదవకులవీరు లందఱు నవధానంబుతోడ మద్వాక్యసరణి
మనకు నివాస మిమ్మధుర యిప్పురిఁ బోలఁ బురి లేదు మనభూమిఁ బోల భూమి
యెందును బుట్ట దే మిప్పురంబునఁ బుట్టి పెంపారి ప్రేమల్లెఁ బెరిగి వచ్చి
యిచ్చల నైశ్వర్య మిట్లు ప్రాపించితి మింతతోఁ బగ బలవంత మయ్యె
సర్వపార్థివులనుజరాసంధుఁగూడి, యెంతలెంతలు సేసిరి యెఱుఁగ రొక్కొ
మనము నొకభంగినెడ రెల్ల మఱచియిట్టు, లున్న వారము తుదిముట్టనునిక్రమేఁగు.

మ. చెల్వులుం జట్టలు పేరుమరత్నములు హస్తిస్యందనాశ్వంబులున్
బలవద్యోధసముత్కరంబులును సంపన్నంబుగాఁ గల్గియున్
నెలవేమీ యిటు లంతకంత కహితశ్రేణీసమాఘాతసం
కలనం దూలి నశింప నిట్టి యభిషంగం బోర్వఁగా వచ్చునే.

వ. కావున నింక నిక్కడ నునికి నాకుం జూడఁ గర్తవ్యంబు గాదు వేఱొకచోటు సంపాదించిన నయ్యెడకు నందఱము నరిగి సుఖం బుండుట మిది మీమానసంబులకు రుచియింపవలయు ననిన వారునుం దమలో విచారించి.

ఉ. వైరి యవధ్యుఁ డాతనికి వారక యెన్నఁగ బెద్దసైన్యముల్
సారభుజోద్ధతిం దొడఁగి చంపుదు మేని ననేక పర్వవి
స్తారములందునుం దెగవు సంపుయ మెందును వారియస్మదీ
యోరుచమూసమూహ మిటు లూరక యేటికి నింద చావఁగన్.

వ. ఇట్టిసాపాయస్థలంబు పరిత్యజింప వలయు నిమ్మహాపురుషుం డెట్లు పనిచె నట్ల చేయుద మని తత్ప్రకారం బాకంసవైరితోడం దెలియఁ బలికిన నతండు ప్రీతుండయి యొక్కదుర్గమప్రదేశంబు దనమనంబునందు నిశ్చయించి సకలజనంబులకు నిర్గమనప్రయత్నం బాజ్ఞాపించియుండు నాలోనన.

ఆ. కాలయవనుఁ డనఁగఁ గాలకల్పుఁడు శత్రుఁ, డేచి మధురమీఁద నెత్తుదేరఁ
గదలె ననికి నపుడ యొదవి జరాసంధుఁ, డును గడంగె ననియు వినియె నొకట.

క. విని తనవారల కెల్లను, ఘనభుజుఁ డెఱిఁగించి నేఁడ కనలుప మతిశో
భన మగుదివసం బిదియని, యనుపమకల్యాణవిధిసమాహారముతోన్.

వ. సన్నాహంబు లగువృష్ణ్యంధకవీరులం దోడ్కొని సమస్తవస్తుసంపదలు తోడ నడువ ననంతదంతితురంగరథపదాతినివహంబుల నాయితంబు సేసికొని తానును వసుదేవుండును బలదేవుండును నుగ్రసేనుం బురస్కరించుకొని పురంబు నిర్గమించి పశ్చిమాభిముఖంబుగాఁ బ్రతిదివసప్రయాణంబుల నరిగి పున్నాగనాగకేసరనాగలతాక్రముకనారికేళకేతకీప్రముఖవనషండమండితం బగుసాగరానూపప్రదేశంబు చేరి యందు సికతాత్మానులమృద్వ్యాపితం బగుభూభాగంబు గని.

సీ. ఇది వాహనములకు హిత మిది జనులకు నాయురారోగ్యసమృద్ధ్యావహంబు
మధురమనోజ్ఞనిర్మలతోయసంపన్న మిది సర్వతరులతాభ్యుదయభూమి
యిది యిది మును ద్రోణుఁ డేకలవ్యునిచేత నర్చన గైకొన్నయన్నివాస
మిది మందరమునకు నెన యైనరైవతకాద్రి చేరువను నొప్పమరునట్టి
దనుచుఁ దద్విశేషంబు లత్యాదరమున, నర్హకోటికిఁ జెప్పుచు నంబుజాక్షుఁ
డంతవట్టువారిలఁ దగ నల్ల విడియఁ, బనిచెఁ దగుముహూర్తంబున మన మెలర్ప.

వ. ద్వారవతినామకం బగుపురం బతిమనోహరంబుగా నిర్మించి పురవాస్తవ్యులు బంధుమిత్రులు సేనాపతులు నాయకులుం దగునెలవుల నిలువం దాను నభినవం బగురాజమందిరంబున వసియించె నవ్విధంబున నమ్మహాదుర్గంబు వడసి యాదవులు శాత్రవులవలనిభయంబువిడిచి పురుషోత్తముచేత నభిరక్షితులై పురుహూతసంరక్షణంబున నమరావతిం బ్రమోదించునమరులకుం బాటి యగుచుం బ్రకాశిల్లి రని చెప్పినవిని జనమేజయుం డిట్లనియె.

చ. అతులితమధ్యదేశమున కంతటికిం దిలకం బనంగ నూ
ర్జితధనధాన్యసంపదలఁ జెన్నువహించి ప్రసిద్ధసజ్జనా
న్వితయయి యొప్పునమ్మధుర నెట్లొకొ క్రమ్మన నుజ్జగింపఁగా
మఱి యటుపుట్టె శౌరి కరిమర్దన మేటిది యాత్మశక్తికిన్.

వ. కాలయవనుం డెవ్వనిపుత్రుం డెంతటిలావు గలవాఁ డచ్యుతుని దెస నెవ్విధంబు నొనర్చె నద్దేవుం డెటుఁ జని ద్వారకాపురం బేమితెఱంగునం గావించె మఱి యేమి పను లొనర్చె నింతయు వినవలతు ననిన వైశంపాయనుం డతని కిట్లనియె.

వైశంపాయనుండు జనమేజయునకుఁ గాలయవనునిజననప్రకారం బెఱిఁగించుట.

సీ. వినుము వృష్ణ్యంధకవితతికాచార్యుండు గుణగరిష్ఠుండు గర్గుండు నాఁగఁ
గలఁ డతఁ డాజన్మకలితసముంచితబ్రహ్మచర్యంబునఁ బరఁగుచుండ

నయ్యూర్ధ్వరేతస్కు- నన్ను( డొక్కఁడు వచ్చి యమకోటిసన్నిధి నపహసించి యింతఁ డాఁటదిగాక యెన్నంగఁ బురుషుఁడే యని యెగ్గు పలుకంగ నవ్విధంబు వినియు నూరకుండిరి యదువీరు లతఁడు, ప్రకటకోపవిజృంభితభావుఁ డగుచు నడవి కేగి పండ్రెండేఁడు లధికనిష్ఠ, లోహచూర్ణాశియై నిర్విలోపబుద్ధి.

వ. ఘోరవ్రతంబు నడపినం బ్రీతుండై తోతెంచి పినాకధరుండు వరం బడుగు మనిన నతండు వృష్ణ్యంధకభయావహుం డగుతనయుండు గావలయు ననికోరు టయుం ద్రిలోచనుం డట్ల యొసంగె నట్లు లబ్ధవరుం డగునమ్మహాత్ముతెఱంగెఱింగి యవనేశ్వరుం డపుత్రకుం డగుటం బుత్రార్థి యై యతనిం బ్రార్థించి తోడ్కొనిపోయి.

తే. ఆలమందలో నునిచి నిత్యార్చనంబు, సేయుచుండంగ నప్సరస్త్రీ యొకర్తు గోపకామినీరూపయై కోరి యతని, వలన గర్భంబు దాల్చె నీశ్వరునియాజ్ఞ.

క. ఆగర్భంబునఁ బుట్టెను, హాగురుతేజుండు కాలయవనుఁ డనఁగ బా హాగర్వవిజితవిమతో, ద్యోగుఁడు ధీగణ్యుఁ డధికదుర్దముఁ డెంతయున్.

తే. అతనిఁ బుత్రుఁగాఁ గైకొనియవనవిభుఁడు, పెనిచె సంతిపురంబునఁ బెనుపుమిగులఁ దత్సకోశంబునందు భూతలవిభుత్వ, మొంది యౌవనగర్వమహోగ్రుఁడగుచు.

వ. అతం డెవ్వరిం గైకొనక క్రాలుచుండి యొక్కనాఁడు నారదుం డరుగుదెంచిన వినతుండై వీరు లగువారి నడిగిన నమ్మునీంద్రుండు.

క. యాదవు లుల్లోకభుజ, శ్రీదర్పసమగ్రు లని విశేషోక్తుల నా వేదించినఁ డత్క్షణమా, త్రోదిత మగుమత్సరముస నుల్లము వ్రేదలన్.

వ. శకధరాపాలురును హిమశైలాశ్రితు లగుదస్యులుం దనకు విధేయులు గావున నందఱం గూర్చి యప్రమేయగజవాజిఖరోష్ట్రింబులు గలనిరవధికసేనాసముద యంబులతో మధురపై నడచుసమయంబున.

మ. ధరణీచక్రము క్రుంగి దిక్కరటిసంతానంబుపై డింద దు ర్భరభారాతురభోగిరాట్ఫణతతుల్ భ్రమగ్గంబడం గూర్మక ర్పరభేదంబునఁ దూలి బిట్టు సకలబ్రహ్మాండముం గంపముం బొరయన్ దుస్థితి నొంది భీభరపరాభూతంబులై భూతముల్,

తే. అడవు లడఁచి కొండలమీఁద నడరియఖిల, వారినిధులను బిండలివండు సేసి కమలహితు క్రమింగి దెసలఁజేఁకట్లుగొలిపి,పరఁగెయవనసైన్యోత్థితబహుళరజము.

వ. అయ్యవనేశ్వరువిడిదలల నశ్వఖరోష్ట్రిమూత్రపురీషసావింబులవలన సంభూత యై యశ్వశకృత్తనుసరిత్తు సాగరంబు నధిగమించె న ట్లేతెంచునభియాతిసైన్యం

బులనెల్లను బగతునియద్భుతజన్మంబును నూహించి యూహాపోహవిచక్ష
ణుం డగుపుండరీకాక్షుం డాక్షణంబ బంధువుల నందఱ రావించి యుత్తెఱం
గెఱింగించి.

క. ముక్కంటివరమునను మన, కెక్కుడుభయ మావహింప హేతు నవధ్యుం
డక్కజుఁడు పగతుఁ డద్దెస, నెక్కొని సిద్ధింప వెట్టి నెఱికర్జములున్.

తే. సామగానకర్మముల వశంబు సేయ, రాము డస్త్రాంతదోర్దర్పరభసశాలి
కడిఁది బిరుదు కయ్యమునకుఁ గాలుద్రవ్వు; నాతఁ డిది యేను నారదుచేత వింటి.

వ. వీనికి నెదిర్చి పొడిచితి మేనియు జరాసంధుండు మనమీఁద బద్ధవైరుండు కంస
వధంబున నస్మద్విరోధు లగురాజులు వానివారై వృష్ణివీరులం దొడరి పెక్కు
మాఱులు పెనంగినవారు వీరందఱును వచ్చి వీనిం గూడిరేని భయం బతి
దుస్తరం బగు మునుపటిబవరంబులను మనవారు బలుమానిసులు పలువురు
మడిసినవా రిప్పరంబుననయుం జితి మేని వధింప శక్తులముగాము గావునం దొ
లంగిపోవలయు నని నిశ్చయించి యుండఱం గదల్చి యనంతరంబ.

తే. కాలసర్పంబు నొక్కటిఁ గడవఁ బెట్టి, వాయి గట్టి ముద్రించి యవ్వాసుదేవుఁ
డొక్కదూతచే నిచ్చి యయ్యుగ్రరిపుని, పాలి కెంతయు నెఱుఁగఁ బనుచుటయును.

క. చని వాఁడు యవననాథునిఁ, గని నను బుత్తెంచె నధిప కమలోదరుఁడా
ఘనతేజు వాక్య మొక్కటి, విను మేర్పడ సావధానవృత్తి యెలర్పన్.

చ. మిడుతలపిండు ప్రోలెఁ గడుమిక్కిలిగా బలుమూఁకఁ గూర్చి యె
ట్లడరితి నీవు దావదహనాకృతిఁ గాలెడుమత్ప్రతాప ము
గ్గడు వగుచంద మేమియును గానవు కాలునికోఱయూఁదగాఁ
దొడఁగుట గాదె నాకు భుజధుర్యత సూపఁ గడంగు టెమ్మెయిన్.

ఉ. నిన్నవలీలఁ బోలె నొకనేర్పునఁ జిత్రముగాఁగఁ ద్రుంచి యి
ట్లున్నభవద్బలౌఘమున నుప్పగజాశ్వరథోత్తమంబులం
గ్రన్నన నేన యన్నియును గైకొనియేలెద నీసహాయులై
చెన్నెసలారువీరు గతచేష్టత నట్టెసఁ దూలి పాఱఁగన్.

వ. అనియె నని పలికి దూత యాతనిముందరఁ దనతెచ్చినసర్పకుంభంబుఁ బెట్టి
కృష్ణుం డకృష్ణోరగదారుణుం డతనికోపవిషంబు నిరౌషధం బవ్విధంబు నీ వెఱుం
గుదో యెఱుంగవొ యని దృష్టంబు గావించుటకు యాదవు లిట్లు సంఘటించి
పుత్తెంచి రనుటయుం గాలయవనుం డేమియు ననక నవ్వుచు.

క. పెనుఁ జీమలఁ బెక్కిటిఁ జ, య్యనఁ దేరఁగఁ బనిచి యమ్మహాహిఘటములో
నినిచి మగుడ నిజముద్రా, వినిబద్ధము సేసి పుచ్చె విష్ణునికడకున్.

వ. అత్తెఱం గాలోకించి యాలోకోత్తరవివేకుండు బలియుం డయ్యు నెక్కుడుండ యేని నల్పులైనను జెక్కం(డ్రు ద్రుదివి చిక్కుపఱిచినం జిక్కువడుటకు నిదర్శనంబుగాఁ బ్రతిపక్షుఁ డొనర్చినయుత్తరం బని కైకొని తడయక మధురాపురంబు విడిచి చని

చ. జలనిధితీరకాననవిశాలతలంబులఁ బౌరబాంధవా
వళులఁ దగంగ నున్చి యనవద్యవిచారుఁడు పాదచారియై
వెలయఁగ నెక్కుడుర్ రిపుని ప్రిడవిశంకతఁ జొచ్చి సమ్మహా
బలుని నిరాయుధుం గని విపక్షులు విస్మయమగ్నచిత్తులై.

తే. వీఁడె కృష్ణుఁడు కృష్ణుఁడు వెసఁ బొదువుఁడు
పట్టుఁ డని యెంతుఁ గలఁగంగఁబడుఁగఁ గాల
యవనుఁ డంతలోఁ దానును నపగతాయు
ధుఁడుఁ బదాతియు నై సముద్ధురతఁ గడఁగె.

క. చేయూఁక వాని మొనలకుఁ, బాయఁగ నెలయించి దవ్వు పఱచె నవధ్యో
పాయుఁడు హరి యనుగమనుగుం, జేయందిసయట్ల యాననేయుచు వీఁకన్.

వ. ఇట్లరిగి తొల్లి మాంధాతృనందనుం డగుముచికుందుండు దేవాసురసమరంబున నమరుల కయి పెద్దగాలంబు సమరంబుసేసి జయం బొసంగి ప్రీతు లగునయ్యదితిసంజాతులచేత నాత్మశ్రమాపనోదనార్థంబు సుఖసుప్తిఁ గోరి నిద్రావిఘ్నం బొనర్చినవాఁడు తనచూడ్కిన సమయుట వరంబుగాఁ బడసి యొక్కపుణ్యశైల గుహాంతరంబునం బరార్థ్యతల్పంబునం దునికి యఖిలార్థ పొసఁగ నెఱింగి యద్దేవుండు.

తే. అట్టియాలోను కడురయం బారఁ జొచ్చి
యొయ్యఁ దలయంపిదిక్కున నొదిఁగి యుండెఁ
బగతుఁడును వెనువెంటన పాఱుతెంచి
కనియె నిద్రాయమాణు నమ్మనుజనాథు.

కాలయవనుండు ముచికుందుని కోపానలంబున భస్మీభూతుం డగుట.

చ. కని కమలాక్షుఁగాఁ దలఁచి కైకొన కేపునఁ గాలఁ దన్ని చా
వునకుఁ దొలంగ నిట్టివెరవుం దలపోసి మడింగియున్నఁ బో
వునె వెస లెమ్ము యాదవ యవున్ భవదీయబలంబు గంటి నే
నని ప్రకటాట్టహాసకఠినాకృతితోడ నదల్చి నిల్చినన్.

క. మేలుకని నిద్ర సెడుటకుఁ, జాలఁగ రోషము జనింప జనపాలుం డా
భీలాలోకనమున బెట్టాలోకించె యవనేశు నధికోద్వృత్తిన్.

క. ఎఱిమంట లెగయ నాతని, నెఱచూపటు నిలువునంద నీఱుగఁ దరువుం జుఱపుచ్చుపిడుగుక్రియఁ గను, గిఱిపినయంతటన చేసెఁ గిల్బిషుఁ బగతుర్.

వ. ఇట్లు ముచికుందక్రోధాగ్నికీలంబునఁ గాలయవనుండు గాలినయనంతరంబ.

చ. తనపొడ నూను శౌరి యుచితంబుగ నాతనితోడ నిట్లు నీ యునికి సురేంద్ర మున్న వినియుండుదు నారదుచేత మత్ప్రియో జన మఖిలంబు నీకతన సాధిత మయ్యెఁ బ్రియంబు నొందితిర్ జనిమొద నొందు మీవఖిలశాశ్వతశోభనసిద్ధి నావుడున్.

వ. అమ్ముచికుందుండు మహాత్మా నీవెవ్వ రిచ్చోటికి వచ్చినపని యెయ్యది మదీయని ద్రకు నంతరాయం బొనర్చి యత్లైన నేఁడెమిఁ దెగినవాఁ డెవ్వం డెఱింగింపు మెఱుంగుదేని నానిద్రించినకాలం బెంత యదియునుం జెప్పుమనిన జనార్దనుం డాజననాథున కిట్లనియె.

సీ. అమృతాంశునకునెనయగు నాఁడునహుషుఁడాయనకునందనుఁడుయయాతియతని యాత్మజుఁ డేడ్వ యం దద్గణి యపుడు నా నధికప్రసిద్ధుఁ డయ్యానలతేజ వంశంబునం దుద్భవం బైనపుణ్యుండు వసుదేవుఁ డనఁగ నివ్వసుధఁ బరఁగు నతనికి దేవకియందు జనించితి రోహిణేయుం డగురాముననుజుఁ డనఁగ నేగడుదు వాసుదేవాహ్వయుండ, దేవతాదత్తవరుఁడు మద్రిపుఁ డనధ్యుఁ డబ్దశతములఁ జెఁడు నీయలుకఁగాలెఁ, గాలయవనుఁడునాఁగవిఖ్యాతుఁ డితఁడు.

వ. నీవు త్రేతాయుగసంభవుండ వగుటయు వింటి నిది కలియుగాసన్నం బగుకాలం బనిన నతండు గుహాభ్యంతరంబు వెలువడి యల్పప్రమాణదేహులు నల్పవీర్యులు నల్పోత్సాహులు నగునరులచేత నాకీర్ణ యైనపృథివి నాలోకించి యాత్మీయవశంబునం బెక్కుతరంబులు గడచుట యూహించి రాజ్యభోగాభిలాషం బుడిగి తపం బొనరించుతలంపునఁ బురుషోత్తముం గొనియాడి వీడుకొని హిమశైలకాననంబు ప్రవేశించె నంత నిక్కడ.

క. అహితు ననాయాసంబున, నిహతునిఁ గావించి మరలి నిరుపమసత్త్వం డహిరిపుకేతునుఁ డాతని బహువిధసైన్యములమీఁదఁ బడి యవలీలన్.

వ. ఆత్మేచ్ఛానముపాగతంబు లైనదివ్యాయుధంబులఁ దదీయముఖ్యుల నెల్ల వధియించి యపరిమితగజతురగరథసముదయంబులం గైకొని యవిలంబితగమనంబునం జని.

క. ఆవృత్తాంతము యదుపీ, రావలి కెఱిఁగించి ప్రీతు లగువారల నానావిధమధురస్మితవా, క్యావలిచేఁ బ్రియ మెలర్ప నర్చితుఁ డయ్యెన్.

సీ. కల్యాణదినమునఁ గమలాయతాక్షుండు బలదేవుఁ డాదిగాఁ గలుగుసర్వ
యాదవులను గూర్చి యవ్వసుదేవోగ్రసేనులతోఁ గూడి మాననీయ
భూసురప్రతతిచేఁ బుణ్యాహవాచనం బమరింపఁ బనిచి సంభ్రమ మెలర్ప
నందఱుఁ దోడరా నమ్మహోదధితటదేశ మంతయుఁ గనిఁ దిరిగి చూచి
నిర్ణయించి వారలతోడ నెమ్మి యొసఁగ, నిట్టు లను నేనుసర్వస్వ నిచటఁ బురము
మీఱు దగియెడునెలవులు మెచ్చుగాఁగ, గైకొనుం డిష్టమందిరకరణమునకు.

వ. ఏ నిప్పురంబునకు ద్వారవతి యనునామం బొసర్చితి నిప్పురికిం దగ నాలుగు వాకిళ్లు సోమవహ్నివరుణేంద్రదైవతంబులు సత్త్వంతిపి స్తీర్ణంబులు రాజమార్గసమ్ముఖంబులు గావలయు బ్రహ్మవిష్ణుశంకరప్రముఖదేవతాభవనంబులుం జైత్యంబులుం బ్రబలు రమ్యంబులుగా రచియింపవలయు రాజమందిరం బతిమనోహరంబై యుండవలయు నని పలికి శిల్పాచార్యులం గర్మకరులను రావించి యవ్విధంబు నిఖిలంబు నాజ్ఞాపించిన.

చ. అనుపమసర్వసాధనసమగ్రతతో శుభవేళ నాస్తుప
జనబలిహోమతంత్రములు సద్విధిఁ జెల్లఁగ సూత్రహస్తులై
మునుకొని కోవిదస్థపతిముఖ్యులు శిల్పము లుత్క్రమింప న
ప్పని తనవేగిరంపుఁబ్రియభావనకుం దగి యుండకుండినన్.

క వెలివెడలనిజను లిటు డమ, నలప్ర లుడిగి నచ్చియిచట నిగ్రహపడఁగాఁ
దలఁపునకు మున్న యిండులు, పలకొనఁగా వలదె యనుచుఁ దలపోసి తగన్.

ఫ్రీకృష్ణుఁడు విశ్వకర్మను రావించి ద్వారక యనుపురంబు నిర్మింపం బనుచుట.

క. ఏకాగ్రచిత్తుఁడై హరి, యాకమలోద్భవతనూజు సస్మృతవిజ్ఞా
నాకల్పు విశ్వకర్మ్మఁ ద్రి, లోకీనుతు సుజనభజనలోలుఁ దలంచెన్.

ఆ. తలఁపునకుఁ బ్రియంబు దనబుద్ధి నెలకొన, నాక్షణంబ పంకజాక్షుపాలి
కరుగుదెంచి వినయ మలరార నిట్లని, దివిజశిల్పి పలికెఁ దియ్య మొసఁగ.

మ. నిను నుద్దామకుతూహలోత్తరునిఁగా నిక్కంబు వేసం గాంచి చ
య్యనఁ బుత్తెంచెఁ బురందరుం డధిప నాకద్దేవతాధీశ్వరుం
డును విశ్వేశ్వరుఁ డైనఫాలనయనుండున్ భక్తి నేభంగి న
ర్చనకుం బాత్రము లీవు నట్టుల కదా సంభావనాయుక్తకన్.

వ. ఎయ్యది కర్తవ్యం బానతి యిచ్చి పనుపు మనిన నవ్వాక్యం బభినందించి దేవకీనందనుం డతని నత్యాదరంబున నాలోకించి.

చ. సురలకుఁ గల్పభూరుహము చొప్పునఁ గోరినకోర్కు లన్నియుం
గురియుదు వీవు వీతప మగోచర మిట్టి దనంగ నీకు నె

వ్వారు సరి సర్వశిల్పవిభవంబునయందు సమర్థ మెందు న
చ్చెరువు భవత్ప్రభావము ప్రసిద్ధము గాదె సురేంద్ర పూజితా.

శా. నామాహాత్మ్యనిరూఢి కెంతయుఁ దగ న్నాకంబునం దింద్రుపీ
ఠమై నొప్పగు నట్లు భూతలమునం దెల్లం బ్రకాశిల్లమ
త్సామర్థ్యంబునకుం ద్రిలోకములు నాశ్చర్యంబు నొందంగ ని
చ్చో మాకొక్కపురంబు నొసర్పుము కళాసూత్రంబు చిత్రంబుగన్.

చ. అనవుడు నాతఁ డిట్లను మహాత్మ భవత్ప్రియ మెట్టు లట్ల యే
ననుపమశిల్పకల్పన మనర్ఘ్యముగాఁ బచరింప నోపుదు
న్వీను మిటు లున్నయీజనుల విస్ఫురగనుంగొన నచ్చినం బురం
బున కిచ టిమ్ము చాల దనుబుద్ధి జనించె గణించి చూడుమా.

తే. జలధి యొక్కింత యెడయిచ్చి చనియె నేని, సర్వలోకాతిశాయిగా సంఘటింప
వచ్చుఁ బట్టణ మన విని వాసుదేవుఁ, డట్ల కాకని యాప్రొద్ద యధికనియతి.

వ. ఆసరిన్నాథుఁ బ్రార్థించినఁ దత్ప్రార్థనానురూపంబుగా నతం డతిబహుళ పవనో
ద్ధూతసలిలుండై నలుదెసలం బండ్రెండుయోజనంబులు గలుగ నెడయిచ్చి
చనియె నవ్వారిజేక్షణునకు నవ్వారిరాశి చేసినసత్కారంబునకుం బ్రియంబు
నొందుచు బృందారకవర్ధకి గోవర్ధనధరుచేత ననుజ్ఞాతుండై యాక్షణంబ నిజవిద్యా
ప్రభావంబున.

సీ. కనకంపుపెనుగోట వినువీధి గడవంగ మణిగోపురములు సమగ్రములుగ
బంధురప్రాసాదపఙ్క్తులు నుత్తుంగహర్మ్యరేఖలు మనోహరత నలర
రాజమార్గం బభిరామంబుగాఁ బణ్యపదము లుజ్జ్వలశిల్పభంగి నమర
నమరసద్మములుఁ జైత్యంబులు సభలును బ్రపలు నపూర్వంపురచన మెఱయఁ
దోరణాట్టాలకంబులు తోరములుగఁ, గూపదీర్ఘికాసరసులు కొమరుమిగులఁ
గృతకపర్వతోద్యానంబులతులములుగఁ, బరఁగుపురమునిర్మించె నచ్చెరువుగాఁగ.

వ. ఇట్లు విశ్వకర్మచేత మానససృష్టి నుత్పాదితయై ద్వారవతియన మున్న యన్నా
రాయణుచేత నాకారితయై రమ్యాకార యగునమ్మహాపురి నభినవానేక విచిత్ర
రచనాచతురం బగురాజమందిరంబు నయ్యాదవేంద్రుం డధిష్ఠింప నఖిలయాద
వులు నుచితస్థానంబులు గైకొని నిలువం బ్రభూతహస్త్యశ్వరథ సంకీర్ణయుఁ
బ్రసిద్ధనరనారీసంచరణశోభినియుఁ బ్రకృష్టకల్యాణక్రియాకల్యయుఁ బ్రవృద్ధసం
పత్సంపూర్తికలితయునై శరత్సమయసముదితేందుతారక యగుగగనవీథియు
వసంతవిభవవిస్ఫుటోల్లాస యగునుద్యానభూమియు జలదసమాగమోత్తుంగతరం
గసలిలయగుసలిలాశయశ్రీయును నుపమానపాత్రంబులుగా నుల్లసిల్లెఁ దదనం
తరంబ.

క. హరిచే నభిపూజితుఁడై, సురవర్ధకి దివికి నేగి సురపతి కాత్మా
చరణం బెఱిఁగించి తదా, దరమున నత్యంతధన్యతముఁడై యుండెన్.

వ. ఇక్కడఁ గమలనాభుం డొక్కనిశాసమయంబున నిజజనకుమందిరంబునం నుండి యంతర్గతంబున.

చ. తలఁచినయట్లు యొంతయు నుదాత్తతరం బగునాస్పదంబు పెం
పలరఁగ నిట్లు నాదగుజనావళికిన్ సమకూరె నింక ను
జ్జ్వలవిభవార్థసంపదల సంభరితం బగుజీవనంబు వీ
రల కొడఁగూర్తు నాదయినప్రాభవ మప్రతిమానమై చనన్.

వ. అని యూహించి శంఖనిధి నాహ్వానంబుచేసిన నది యాక్షణంబ నిజరూపంబుతో నేతెంచి యద్దేవుముందరఁ బ్రాంజలియై నిలిచి.

క. పని యేమి కరుణతోఁ ననుఁ, బనుపుము యదునాథ భువనబాంధవ నీ న
మ్మనమునకు మెచ్చు పుట్టఁగ, నొనరించెద నని నుఁ బ్రియరసోత్కటుఁ డగుచున్.

వ. దేవకీనందనుం డన్నిధానదేవతం గనుంగొని.

ఉ. ద్వారకలోనఁ గల్గుజనవర్గము లెల్ల ధనౌఘపూరితా
గారములై యెలర్ప నిజగౌరవముం బచరింపు మేను నా
వారలయందు దీనుఁ గృశవైభవు సౌఖ్యవిహీనుఁ జూడఁగా
నేర దరిద్రుఁడున్ మృతుఁడు నిక్కము తుల్యుల కారె ధారుణిన్.

తే. లేదు పెట్టవే యనియెడులేబరింపు, బలుకు దనప్రజలో వినఁబడియె నేని
నింతకంటె మిక్కిలి ధరణీశ్వరులకు, నెద్ది యవమాన మది మాన్పు మిపుడు నీవు.

చ. అనుడుమహాప్రసాద మని యన్నిధి యప్పుడ యేగి తోడియ
య్యెనిమిది పెన్నిధానముల కింపెసలారఁగ దేవదేవుశా
శన మెఱిఁగించి వైశ్రవణుసమ్మతితోఁ జనుదెంచి విస్ఫుర
త్కనకపురాసులై యొసఁగెఁ గంసవిమర్దనుపట్టణంబునన్.

ఉ. ఎక్కడఁ జూచినన్ సిరికి నిష్టవిహారపథంబుగాఁ గరం
బక్కజ మైనసంపదల నందిరి తత్పురవాసు లెల్ల నే
చక్కటి నిర్ధనత్వ మనుశబ్దము లోనుగ మానె లోకము
లిక్కిలి మెచ్చ నయ్యనుపమేయచరిత్రుని చిత్రకృత్యముల్.

### శ్రీకృష్ణుఁడు వాయుదేవునిచేత సుధర్మయను దేవసభ ద్వారకకుఁ దెప్పించుట.

వ. అమ్మహాత్ముండు మఱియు నొక్కతఱిఁ దండ్రియింటికడన యుండియేకాంతంబునఁ దనతలంపున వాయుదేవు రావించి ప్రణతుం డగునతని నాలోకించి.

మ. బలధౌరేయతలందు నీకుసరి చెప్పన్నీవకా కవ్వరుం
గలరే యన్యులు గంధవాహ భువనఖ్యాతంబు నీవిక్రమం
బలఘుస్ఫూర్తి యుతుండ వట్లగుట నాయాజ్ఞన్మహార్థంబులో
పలయుం జేయఁగ నొక్కకర్జ మతులవ్యాప్తిప్రదీప్తోద్ధతిన్.

వ. అది యెయ్యది యంటేని.

సీ. యాదవు లధికధర్మాచారధీరులు భూరివైభవు లుపభోగరతులు
కొలఁదివెట్టఁగ రానిబలగంబు గలవారు గావున వీర లొక్కట సుఖార్థ
మంచితగోష్ఠీ విహారంబు గావించి యుం డదుసప్పటి కొండు తెఱఁగు
రచనలెవ్వియును సురుచిరములుగా వజ్రిఘాతికి నావిశ్వకర్మచేత
నధికతపమున నిర్మితమైన సుధర్మ, యనఁగఁ బరఁగినసభ నిర్జరాధినాథు
ననుమతంబున నస్మదీయాజ్ఞఁ జేసి, యసభఁ గొనివచ్చి యిమ్ము నెయ్యమున మాకు.

ఉ. నావిని యట్లకాకని మనంబలరం బవమానుఁ డప్డు దే
వావలిపాలికిం జని బలానుజుపంపు బలాహితుండు సం
భావనచేసి చేకొన సుపర్వులు నెమ్మదిసమ్మతింప నే
నే వసుధాతలంబునకు నేడుకఁ దెచ్చె సభానికేతమున్.

వ. ఇట్లు తెచ్చి సుధర్మ ధార్మికపూజితుం డగుపయోజనాభునకు సమర్పించి సమీ
రుండు నిజేచ్ఛం జనియె నమ్మహాసభవలన యాదవు లాదిత్యసదృశులును యాద
వేంద్రుం డధఃకృతేంద్రుండును నగునివాసంబు త్రిదశావాససన్నిభంబు నను
ప్రశంసనంబు సమర్థంబై యుండె మఱియు.

మ. భువిఁ బాతాళమునన్ దివిన్ జలధుల న్క్ష్మాభృత్తుల న్వెండియున్
వివిధస్థానముల న్శుభంబు లయి భావింపంగ నే మేమి వ
స్తువిశేషంబులు దోఁచె నయ్యఖిలమున్ సొంపారఁ దెప్పించి మా
ధవుఁ డర్థిం గయిసేయ నొప్పెఁ బురి కాంతాతుల్యమై యెంతయున్.

వ. ఇట్లు నగరం బనన్యసామాన్యధన్యతావిభవంబు నొందించి బాంధవుల ననాధా
రణకారణగౌరవోదారులం గావించి యవ్విశ్వశివంకరుండు మఱియుం బ్రకృతు
లకును బౌరశ్రేణులకును సముచితంబులుగా మర్యాదలు నిరూపించి బలాంగచతు
ష్టయప్రవర్తనోపాయంబు లుపపాదించి బలాధ్యక్షుల నిర్ణయించి.

సీ. రాజుగ్రసేనుఁడై రాజిల్లఁ దాను దీప్పరితసం బెంతయుఁ బ్రభుతతోడ
నడపు వాఁడయ్యె సన్మాన్యుఁ గాశ్యపుఁ డనువిప్రుఁ బురోధఁ గావించె మంత్రి
వర్యు గవికద్రుఁడ న్వానిఁ బ్రతిష్ఠించె యదువంశవరుల నత్యధికమతుల
నఖిలకార్యంబులయందుఁ బదుండ్రు వృద్ధుల నధికారదీప్తులుగ నునిచె

నతిరథోత్తము దారుకు నాత్మరథము, గడప సారథిగాఁ జేసెఁ గడిఁదివీరు
నస్త్రవిద్య ద్రోణాచార్యునంతవాని, సకలయోధముఖ్యుఁడుగ సాత్యకి నొనర్చె.

వ. ఇవ్విధంబున విధేయంబు లగుసంవిధానంబు లన్నియు నొక్కటఁ గొఱంతపడక యుండ నిర్వర్తించి తనశాసనంబున స్పష్టిస్థితైశ్వర్యం బనపహార్యంబు నఖిలైక ధుర్యంబును నై యుల్లసిల్ల నమ్మహనీయతేజుం డపరాజితస్థైర్యంబున విభ్రాజితుం డై సంతసిల్లె నని వైశంపాయనుం డానర్చినయునకు వ్యాసంబు పరిస్ఫుటోల్లాసంబుగా.

మందాక్రాంతవృత్తము.

కాంతాశేషక్షితితలభుజాకాంతికాంతాజయంతా
చింతారత్నోదయసమగుణఖ్యాతిసమ్యక్ప్రసీతా
దాంతానంతద్విజకులహితౌదార్యగాంభీర్యధుర్యా
కాంతారాంతర్గమితసమితక్ష్మేశపుత్త్రత్రాసా.

క. బహుజలధిద్వీపాంతర, మహీశ్వరప్రహితజాతిమణిమౌక్తికహ
స్తిహయాద్యర్పణసేవా, బహుమతమల్లగిభసిత భక్తిప్రీతా.

మాలిని. అగణితగుణసత్త్వా హరిపదస్మృతియత్నా
జగదభినుతభోగా సత్యనిత్యానురాగా
మృగపతిసమశౌర్యా మిత్రనేత్రాబ్జసూర్యా
విగణితభయలోభా విశ్రుతైశ్వర్యలాభా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌంద
ర్యధుర్య సుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ
నామధేయప్రణీతం బైన హరివంశంబున నుత్తర
భాగంబునందు ద్వితీయాశ్వాసము.

---

## ఉత్తరభాగము - తృతీయాశ్వాసము.

క. శ్రీకంఠచరణసేవక, వైకుంఠగుణావధానవర్ణననిపుణా
శ్రీకంఠబాహువిభవ, వ్యాకుంఠితవైరిధామ యన్నయవేమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు నిజేచ్ఛానశత్రిభువన విభవుం డై నయయ్యాదవవిభుండు ప్రభూతస్థితిం బొంది యుండ ననతిచిరం బగు కాలం బరిగిన.

క. రైవతుకూరిమికన్నియ, రేవతి నసమానరూపరేఖావినయ
శ్రీవినుతఁ బెండ్లియై బల, దేవుఁ డలరె జనకవాసుదేవానుజ్ఞన్.

వ. తదనంతరంబ విష్ణుదేవుండును వివాహవైభవంబు నంగీకరించె నవ్విధంబు వివరించెద.

సీ. విను వింధ్యపర్వతంబునకు దక్షిణపార్శ్వమునఁ గుండినం బనుపురము రాజు
గ్రథకైశికాన్వయ ప్రభవుండు వైదర్భుఁ డకలంకయశుఁడు భీష్మకుఁ డనంగఁ
దనరారునృపతికిఁ దనయుఁడు రుక్మి యహార్యధైర్యుఁడు ద్రుముఁ డనునరేంద్రు
వలనఁ గృతాస్త్రుఁడై వెలసి బ్రహ్మాస్త్రంబు జమదగ్నిసూనుచే నమరఁ బడసి
శౌరితో నెల్లనాఁడు మచ్చరముసేయు, చుండు నాతనిసోదరి యుజ్జ్వలాంగి
రుక్మిణీదేవి యసమానరూపయౌవ, నములఁ ద్రైలోక్యమున నభివంద్యయయ్యె.

చ. హరి కనురాగపాత్ర యగునట్టిది యట్టె ప్రసూనబాణవి
స్ఫురితపునర్భవంబునకు భూమి యనం దగునట్టి సన్మునీ
శ్వరులకు నర్చనీయ యటు వర్ణనసేయ వశంబె పూని యె
వ్వరికి నుదాత్తచిత్త యగువారిజలోచనపుణ్యభావమున్.

క. అవెలఁది నాప్తజనముల, చేవిని కామించె నాత్మసితకమలాక్షుం
డావిభుపై నప్పొలఁతియు భావము గదియించె శ్రవణపరిచయలీలన్.

చ. తలఁపులు సిక్కి బీఱువడి తాల్ములు పెల్లగిలంగఁ జూడ్కు లా
కులపడి చూపు పండువులు గోరఁగఁ గోర్కులక్రందు చేష్టితం
బులఁ దడఁబెట్ట భావములపూఁపు బయల్పడ వారినిద్దఱన్
బలసి మరుండు తుల్యరసపాకముతీపులు గ్రోల్చె విస్కులిన్.

చ. అనిమిషసిద్ధయక్షభుజగాదులు వేఁడినఁ బువ్వుఁబోఁడి నె
వ్వనికిని నెట్లు గైకొనఁగ వచ్చు మదగ్రవిభూతి యల్పమే
యని తమకించి పేర్చెఁ బ్రభుఁ డంగనయుం బురుషోత్తమాత్మయై
యెనయు తలంపుజాడ కొకయింతయుఁ దక్కకయుండె వేడుకన్.

తే. రుక్మి గోవిందుతోడి విరోధి గాన, నాతఁ డడిగినఁ జెలియలి నతని కీఁడ
గొల్లపల్లెలోపల నందగోపునింటి, పసులగాపరి యగునె నాపాటి యనుచు.

వ. ఆసమయంబున నుపరిచరవంశజాతుండును మగధమహీనాథుండును గిరివ్రజపురస్వామియు నగుజయసంధుండు సజ్ఞాతి యగుదమఘోషునకు వసుదేవుతోడం బుట్టువైన శ్రుతశ్రవ యనుభామయందుఁ బుట్టిన దశగ్రీవశైబ్యదస్రసవ్వళు లనునలువురుకొడుకులకుం బెద్దవాఁడై నసునీథుం డనునామాంతరంబు

గలశిశుపాలుం డిజ్జనకుండు వనకుఁ బుత్రుంగా నొసంగినం గైకొనినవాఁడు
గావున నతనికి రుక్మిణి నడుగఁ బుత్తెంచిన.

తే. భీష్మకుఁడు వాసుదేవుపైఁ బ్రియము గలిగి, యుండియును రుక్మిమాటకు నొండు సలుప
నేర కాచేదిపతికి నన్నీరజాక్షి, నిచ్చువాఁ డయ్యె మగధేంద్రు నిచ్చ నొంది.

వ. అజరాసంధుండును సంబంధసంధి యవ్విధంబున సవిశేషంబుగా సంఘటితం
బగుటకు సంతోషించి సకలబాంధవులకు శోభనార్థంబు లేఖలు వ్రాయించి
పుచ్చి రావించి యంగవంగకళింగపౌండ్రపాండ్యకాశకరూశాద్యనేకదేశాధీశులం
గూర్చి శిశుపాలుం డొడ్డ్రాని తదీయస్నిగ్ధు లగుపౌండ్రపుత్రుండును వాసు
దేవుండు నేకలవ్యాత్మజుండు వీర్యవంతుండును దంతవక్త్రుని యనుండును సుపుత్రుం
డును లోనుగాఁ బెక్కండ్రు రాజకుమారులు లక్ష్యవారల బోటవకొనిరా నానే
కాక్షౌహిణీకలితంబు లగు బలంబులతోడ నడువ నప్రతిహతమై భవంబున వైద
ర్భనిపురంబునకుం జనుదెంచిన.

మ. తనచుట్టు స్నేహమర్థి నిధానస్వగిజబృందశ్రీ తెలుగ్వంగిన
మ్మున మాగధుండు నుండి రుక్మి మగధత్మానాధుఁ బ్రబోధ్వస్థహా
స్యసంభావితుఁ జేసి తెచ్చి తగ విశ్వక్షోణిపాస్యతు నా
తనిఁ బ్రీతి న్విడియించెఁ బ్రస్ఫురితసత్కారోపకార్యావళిన్.

వ. అమ్మహీశ్వరుండు మౌహూర్తికుల రావించి లగ్నంబు నిర్ణయించి రౌక్మిణీ కుమా
రికకు వివాహలగ్నదివసం బని నిజస్కంధావారంబున ఘోషణంబు సేయించె
రాజు లెల్లఁ దమతమవిభవంబులు మెఱసి సకలసేన నలంకారంబులతో నమర్చి
ట్టెర శిశుపాలుండు పెండ్లిశృంగారంబు పొలుపార నవయస్కు లగువసుధాధర
కుమారులం గలసి యుల్లాసం బెసంగ నుండె నాసమయంబున నక్కడ.

## నారదుఁడు శ్రీకృష్ణునొద్దకువచ్చి రుక్మిణీపరిణయోద్యమంబు తెలియంగజేయుట

సీ. పసిఁడికెంజాయ నిండెసలారుజడముడిఁ జెరివినమందారసురభికుసుమ
మాలికపైఁ బ్రాలులోలాళిపటలంబు పింఛాతపత్రంబు పేర్మిఁ దనరు
నొసఁగఁ దెల్లనిమేని కుత్తరీయం బగుకడవసం బమృతాంశుమొదలిమీఁది
కందుచాడ్పునఁ దోఁపఁ గనకంపుమొలత్రాట చెఱఁగుదూఁగాడు మసిలపయోద
చలితచంచలాగ్రముతోడ సరియనంగఁ
జేతివీణ నున్ననిగాడ్పుచేత మ్రోయ
తెలుఁగు లొయ్య మెచ్చుచుఁ జనుదెంచె గగన
మార్గమున నారదుఁడు కంసమథనుపురికి.

క. చనుదెంచి సర్వజనములుఁ, దనుఁ గౌతూహలతరంగతరళతరవిలో
చనులై కనుఁగొనఁగ నగరి, యనుంగుమొగసాలగవని కవతీర్ణుండై.

వ. ద్వారికులచేతం దన రాక యెఱింగింప నింపారుసంభ్రమంబున నుగ్రసేనవసు
దేవులు పురస్సరులుగా వాసుదేవుండు బలదేవసహితుండై యాదవముఖ్యులుఁ
దోడరా నెదురువచ్చి నమస్కరించి యమ్మహాపురుషుం దోడ్కొనిపోయి సుధ
ర్మాభ్యంతరంబున ధర్మమయుం బగుభద్రపీఠంబున నునిచి యర్ఘ్యపాద్యాదివైదిక
సత్కారంబు లొనర్చి తదనుజ్ఞ నాసీనుండై తక్కినవారిం గూర్చుండం బంచి
విరచితాంజలియై యిట్లనియె.

శా. సేమంబే తగ నీకు లోకములకుం సేమంబె దేవాళికిం
సేమంబే మునిముఖ్యులెల్లకడల న్నిత్యస్వతంత్రుండవై
యీమాడ్కి న్విహరించునీయెఱుక కన్వీతార్థముల్ గాని వె
ట్లేమై వస్తువు లుగ్గడింపఁ గలవే యీమూఁడులోకంబులన్.

వ. అది యట్లుండెనిప్పుడు.

క. నీకుశలం బేసడిగెద, నాకుశలత యెట్టిదో సనాతనయోగ
శ్రీకుశలి వైనధన్యున, కేకుశలము గొఱఁత యింత యెఱుఁగన కంటే.

క. ఒక్కటిగల దీయనుకుల, మొక్కటిలోకమున లెక్క కెక్కఁగఁ జేయన్
నిక్కముగ వచ్చితి పని, దక్కఁగ నీరాక కొండు దగు నన నేడీ.

ఉ. ధన్యులమైతి మేము నిజధర్మములందు గృహీతనిత్యసా
జన్యుల మైతి మభ్యుదయశాశ్వతపూజిత మైనలోకసా
మాన్యుల మైతి మిట్లఖిలమాన్యమహావ్రతశాలి వీవు ధీ
విన్యసనంబు మావలన విప్పుగఁ జేర్పుటఁ జేసి సంయమీ.

క. అని యిట్లు మొదలుగ మాధవుఁ, డనుపమమధురోక్తివిధము లభినవములుగా
నొనరింపఁగ ముని యాతనిఁ, గనుఁగొని యిట్లనియె వదనకమలం బలరన్.

ఉ. నీవు దలంపఁగాఁ గలుగు నిక్కము సేమముచొప్పు సర్వజీ
వావలికిం జతుర్యుగములందు భవత్పదపద్మనిత్యసం
సేవనతత్పరప్రకృతి సేకొని యుండెడుమాదృశులగ
త్సావన చోద్యమే కుశలభావనలం దసరారు టెప్పుడున్.

తే. నిత్యశుద్ధబుద్ధానందనిర్మలస్వ, భావుఁడ వీవు నారాక ప్రకటబుద్ధి
యొలసె ననుట నాపైఁగృపకలిమిమిగులఁ, జూచుటఁగృతార్థుఁడనైతి సురశరణ్య.

క. నీచేఁ బట్టొకయించుక, గోచరముగఁ గంటిఁ గానఁ గొంకక యింకే
నాచరితశుభవచఃస్ఫూ, ర్జాచతురత మెఱసెదను బ్రసన్నుఁడ వగుమీ.

వ. అని పలికి దేవముని దేవకీనందనుపదనారవిందంబులందుం జూడ్కి వెలయించి.

శా. వీణావల్లిక సక్కఁ బూంచి శ్రుతికిన్ స్వీకారంబుగాఁ దంత్రులన్
ప్రాణంబుల్ నెలకొల్పునట్లు మధురప్రారంభసంభావితో
ద్గానం బోయనఁ దెచ్చి మూర్ఛనమనోరాగంబు గావింప ని
ర్వాణానందముఁ బట్టి చూపెడుగతిన్ వాయించె ధీయుక్తతన్.

వ. అవ్వాద్యవిద్యాప్రయత్నంబులయనంతరంబులయందు.

సీ. వేర్వేఱ గీతసంవితతప్రబంధోదారబంధురోదాహృతిభంగి యలర
మీనకూర్మవరాహమృగరిపువామనరామరాఘవజన్మరచనఁ బోలిఁ
బచరించి పదపడి బలభద్రకృష్ణాఖ్యభావముల్ రెండును బ్రస్తుతించి
పూతనాశకటావఘాతంబు యమళార్జునాకృష్టి గోపాలనాతిసక్తి
యురగదమనంబు గోవర్ధనోద్ధరణము, ధేనుకారిష్టకేశిమర్దనవిభూతి
కువలయాపీడమల్లసంక్షోభణమ్ము, కంసవిధ్వంసనము మెఱగా నుతించె.

క. అన్నిటియాభోగంబుల, నన్నీరజనాభు శ్రుతిసమారాధ్యయశున్
బెన్నిధిఁ బడసినవడువునఁ, జెన్నొందఁగఁ బాడె జనులచిత్తము లలరన్.

తే. పిదపఁ జేతిదండియ యటువెట్టి కేలు, మొగిచి భక్తిరసం బాత్మ ముంచికొనఁగ
సకలవేదాంతవిద్యారహస్యభావుఁ, గోరి కీర్తించెఁ బ్రభువు సన్నారదుండు.

వ. అమ్మహాగోష్ఠియందు గరిష్ఠుం డగుసురజ్యేష్ఠునగ్రతనయు నగ్రిమపదర్థంబున
నుద్గీతార్థసరస యగుసరస్వతివలన సరసీరుహాక్షునామమహిమ లఖిలంబులు విని
యాదవు లద్భుతప్రమోదమేదురమానసులై తమలో నియ్యఖిలేశ్వరునకుఁ
జుట్టంబులము బంటులము ప్రస్థానయోగ్యులము నై మన మింతకృతార్థుల
మగుదుమె యిమ్మునిపుంగవుండు మన కింతకల్యాణం బొసర్చునె యిన్నిపోకలం
బోయినవాఁ డింక నీవెన్ననియుద్ధ నేమిచందంబుకోర్కి పడయం దలంచునో
యీపాటు యుడిగి మఱి యెవ్విధంబు సల్లాపంబునకుఁ దొడంగెడునో యని
కుతూహలచపలచిత్తు లగుచుండఁ గృష్ణుం డయ్యక్లిష్టచరితు నెసభరితాదరుండై.

క. ఒప్పుగఁ బరిపాటియొకఁడు, దప్పక మాచేతలెల్లఁ దగఁ దడవితి నీ
విప్పటికి నింతసాలుం, జెప్పుము నీరాక యొకవిశేషం బనఘా.

వ. అని యడిగిన నయ్యోగీశ్వరుం డఖిలేశ్వరున కిట్లనియె.

సీ. దక్షిణాంభోనిధితటమున గోకర్ణ మనుమహాస్థానంబునందు వినుము
దివ్యలింగాకృతిఁ దేజరిల్లెడు దేవదేవేశు శంకరు దేవపూజ్యు
వృషభవాహనుఁ జారువీణారవాన్విత యగుగీతపూజనత్యంతభక్తి
నారాధనముచేసి యట నివృత్తుండనై యర్థేశ్వరునిదెస కరుగుచుండి
సమ్మదంబునఁ గుండినపురనాథుఁ డైన, భీష్మకునినాతఁడునునన్నుఁ బ్రియమెలర్ప
సత్కృతునిఁ జేసె భువిఁగలయఖిలనృపుల, నాజరాసంధుఁదొట్టి యే నచటఁ గాంచి.

వ. నీ రేమిటికిం గూడి యున్నా రని విదర్భరాజు నడిగిన నతం డాత్మీయకన్య యగు
రుక్మిణీదేవిం జైద్యుఁ డగుశిశుపాలున కిచ్చువాఁడై తాను రావించిన దద్వివా
హంబునకు మగధాదులు వచ్చుటయు నెల్లి రేపకడ లగ్నం బగుటయుం జెప్పిన
నవ్విధం బెఱింగింప నీయున్నకడ కరుదెంచితి.

శా. స్త్రీ వాకన్నియఁ గోరినాఁడవు మది న్నీ కీక వైదర్భుఁ డీ
ద్విద్వేషిమతంబు సేయఁగలవాఁ డైనాఁడు తత్కార్యమిం
కేవిఘ్నంబును లేక సిద్ధ మగు నిర్లోలన్ యశోహాని యెం
దేవిశ్వంబున నింతకంటెఁ గలదే యీభంగి నీపేర్మికిన్.

వ. కావున నుగ్రసేనమహారాజుఁ బురస్కరించికొని బలదేవసహాయుండవై సాత్యకి
ప్రముఖనిఖిలయోధవీరులం దోడ్కొని సైన్యం బంతయుఁ దోడనడవ నీప్రొద్ద
నరిగి పోయి యక్కడం బ్రోవుగొని యున్నరాచపదులం గుదియించి ముదం
బున ముదితం బరిగ్రహించితేని భవదీయబాహుయోగంబున సుదర్శనం బగు
సుదర్శనంబునకుఁ దీర్ప రానిపను లెక్కడఁ గల వది యట్లుండె.

నారదుఁడు శ్రీకృష్ణుని రుక్మిణీదేవిం బరిగ్రహించికొని తేర నియోగించుట.

క. విను మంతరిక్షతలమున, ననఘా యంతర్హితుండనై చూచితి న
వ్వనితారత్నము లీలా, వనమున నెచ్చెలులతోడ నగఁ బొగులంగన్.

చ. నిను విని నీవెనం దలఁపునెక్కొని చిక్కిననెమ్మనంబు నీ
యనుపమసన్నుతస్థితికి సమ్ముఖమైపోయినజిహ్వయుం బ్రియం
బునఁ దమకించి నీలలితమూర్తిఁ గనుంగొనఁ గోరుచూడ్కియుం
దనకమరంగ రాజసుత తక్కినభంగు లెఱుంగ దేమియున్.

సీ. పలుకనెంతయుఁ గ్రుయ్యఁబాటిననునుఁ జెక్కు లందందఁ దడిపెడునశ్రువారి
యుంకినచనుదోయి యేకావళీసూత్ర భూషితం బై నదివొలుపు దక్క
పాటన యొడలుటఁ బాపటరూపేది కదుమాసినది నీలకచభరంబు
వేఁడియూర్పులతోన వెడలునోయనుసుఱును ననఁగఁ దూఁగాడెడు నంగవల్లి

తలిరుసెజ్జలు చందనసలిలవృష్టి, యబ్జదళకృతవీజనం బాదిగాఁగ
సఖులు గావించు శిశిరోపచారవిధులు, గొనక నిగిడెడుఁ దాపంబు వనజముఖికి.

చ. హరి నఖిలేశ్వరేశ్వరు దయానిధి నాశ్రితరక్షణైకత
త్పరుఁ దగఁ బొందఁ గన్నఁ దనుదాహము గ్రక్కునఁ బాయు నెందును
స్ఫురదుపలబ్ధిఁ బేరుకొంచు ముది చూఁడెద రేని లతాంగులార యే
నురువుగ నీక్షణంబ యును జీర్వఁజుఁడీ యను నింతి బోటులన్.

తే. అబల యివ్విధమున నున్నయయ్యవస్థ, గనిన నెవ్వారి మనసైనఁ గనికరమునఁ
గరఁగు నైసర్గికాత్యంతకరుణమతివి, నిక్కలదేది యుపేక్షింప నీకుఁ దగునె.

క. కావున ముద్దియప్రాణము, గావుము నీవిభుత కింత గడవఁ గృతార్థీ
భావంబన నెందేయ్యది, భూవినుతచరిత్ర యేను బోయెద నింకన్.

వ. అని చెప్పి యప్పురాణతపస్వి తపస్సిద్ధ యగుసిద్ధగతిం జనియె ననంతరంబ
యంబుజనాభుం డాత్మీయజనంబుల నందఱఁ గలయం గనుంగొని.

క. వింటిరె నారదువాక్యము, గంటిరె మనకు నిట వలయుకర్జములను ని
వ్వెంట జయకీర్తిసుఖములు, గంటకు ముని పనిచెఁ దడయఁగా నేమిటికిన్.

వ. ఇమ్మహార్థంబుసంద పయనంబై కుండినపురంబునకుం జనవలయు మీమీ
వాహనంబుల నాయితంబులు చేసి యెక్కి నిజసేనాసమన్వితులరై నడువుండు
సకలజనంబులకు ముందర సాత్యకియును నడుమబలభద్రదేవుండును వెనుకది
క్కున జననాథుండును నడుచువారేనును దారుకైక సహాయుండనై సర్వా
యుధంబులు ధరించి ముందర నరిగి జరాసంధపరిపాలితుండై యున్నశిశుపాలుం
దొలుతఁ గాలగోచరుం గావించి రుక్మిప్రముఖక్షుద్రక్షత్రంబు స్థలంబు నిరవ
శేషంబు చేసి భోజరాజతనయం గైకొనియెద ననినం దదీయశాసనంబున.

శా. యాత్రామంధుభి సర్వదిక్కుహరభేదాభీలనిర్ఘోషమై
జైత్రోత్సాహము దెల్పఁ బొల్పుమిగులన్ సన్నద్ధులై యాదవుల్
ధాత్రీకంపనసైన్యసంచరణసిద్ధప్రక్రియ న్వెల్వడన్
శత్రుచ్ఛేదవిధిత్సుఁడై విభుఁడు తత్సామగ్రికి న్మెచ్చుచున్.

సీ. కౌస్తుభమాణిక్యకమ్రాంశువులు మేనఁ గుంకుమచ్ఛోదంబు కొమరు నెసఁగఁ
గనకాంబరాంచలఘనకాంతిదిగ్భిత్తి లేఖలహారిద్రలిప్తి పఱపఁ
బాంచజన్యద్యుతిపటలంబు కెలఁకులఁ బూర్ణచంద్రాతపస్ఫూర్తి నెఱప
వైజయంతీదామవైభవం బురమున గగనస్థసురచాపకలనఁ జూపఁ
బరమకల్యాణవేషవిభ్రాజమాన, మూర్తి యదుచక్రవర్తి యామోదకీర్తి
వెడలె సైన్యసుగ్రీవాదివిశదరథ్య, రథసముదార మగుదివ్యరథముతోడ.

శ్రీకృష్ణుఁడు రుక్మిణీపరిణయార్థంబుగాఁ గుండినపురంబునకు నరుగుట

వ. ఇట్లు వెడలి మహావిభవంబునం జని విదర్భవిషయంబు సొచ్చి నడచి నగరిఁ గది
యుసమయంబున భీష్మకుం డాత్మీయబంధుసహితుండై యతని నెదుర్కొని
తోడ్కొని పోయి పురబాహ్యాభ్యంగణంబున విడియించి యప్రతిమంబు లగుపూ
జాక్రమంబులఁ బ్రమదంబు బొదవునట్లు గావించె నారాజసమూహంబులో నిజనం
బులు కొందఱు లితండు తనమేనత్తకొడుకు పెండ్లికిం జనుదేరఁ దగునకాదె యనం
గొందఱు గోవిందుండు మగధేంద్రచేదిపతులదెస నప్రియుం డిట్లేతెంచుటకుఁ
గతం బేమియో యనుచుండఁ గొంద ఱయ్యంబుజవదనచందం బిమ్ముకుందునందు
సంతుష్టసంకల్పం బని వింటి మిది యెట్లగునో యని యూహింప నఖిలయదు
వీరపరివృతుండై యిత్తెఱంగున వచ్చి యున్నయాకృష్ణు నాకర్ణించి.

ఉ. ఘోరనిదాఘదాహమునఁ గుందుచునున్నధరిత్రి యుల్లస
ద్వారిధరాంబుపూరపరివర్తనభద్రము సంభవించినన్
భూరితరానుమోదభరమున్ భజియించువిధంబునన్ విష
ద్భారము నుజ్జగించి వెసఁ బార్థివకన్యక ప్రీతిచిత్తయై.

వ. నిజాంతర్గతంబున.

మ. నను దుఃఖాంబుధి నుద్ధరించుటకునై నానాథుఁ డేతెంచె నిం
కనుమానం బొకఁ డేల యెప్పుడొకొ యయ్యబ్జాయతాక్షు న్మహా
ఘనవక్షుం దగఁ గాంతు నిట్టిదిభాగ్యం బబ్బునే నాకు నా
జని సాఫల్యము నొందె సర్వజగదర్చ్యుం బయ్యె నాకోర్కియున్.

సీ. చూడ్కులు ననుఁ జెందఁ జొచ్చి గోవిందుడెందములోన నానందధన్య నగుదుఁ
బలుకులఁ జాడఁ దీపులు గ్రోలి సోలి గోవర్ధనునకుఁ జాలవలఁతి నగుదుఁ
గ్రియలకుఁ బూఁచుకోర్కికి నెల్లదెసఁ జిక్కి శ్రీవత్సునకుఁ బ్రియశిష్య నగుదు
నేస్తులు ప్రసరింప నెఱయుపాకమునొంది హరియందభేదభావాత్మ నగుదు
నాప్రియంబును భక్తియు నాతలంపు, వలపుఁ గంసారి యెఱిఁగెడుకొలఁదియెఱిఁగి
యఖిలజగములు నేన యత్యంతసుభగ, తానిరూఢితో నేలెడుదాన నగుదు.

వ. అని యవ్యగ్రమనోరథపరిగ్రహంబుల నధికవ్యగ్ర యగుచు నాప్తసఖీజనంబులం
గలసి కమలనాభుకల్యాణప్రసంగంబు లగుకథనంబులు వినోదంబులయి క్రొ
త్తగా నెలయునమ్మికం జేసి నెమ్మనం బూఱడి యుండి నిండువెన్నెలం బొలుపారు
విభావరియందు వినిద్రం బగుభద్రభావంబునం బ్రవర్తిల్లె నాసమయంబున.

క. మునురాకపోకలం దా, వనజాననవలపుదెలుప వలను గలుగున
త్త్వైనుగత్తజనులు ప్రేమము, వినూతనము సేయఁ గరము వేడ్కం బ్రభుఁడున్.

వ. ఏకాంతంబ యక్కాంత దెసఁ జింతాభరంబునఁ గార్యాంతరంబులయందు నిర పేక్షుండై యుండె.

ఉ. ఏమ్మెయిఁ జూతు నొక్కొ తరళేక్షణ నక్కట చూచి యెమ్మెయిం
గ్రమ్మన నిర్వహింతు నొకొ కైకొను కార్యము వేడి శత్రుసం
ఘమ్ముల నెమ్మెయిం దొడరి గర్వము సొంపడఁగింతు నొక్కొ నే
నెమ్మెయి నిశ్చయింతు నొకొ యింతి దెస న్మనువిన్న చందముల్.

తే. నన్నుఁ బొడగన్నచోట నన్నలిననయన, చూచుచూపునఁ బ్రేమంబు చొప్పుగన్నిన
యపుడతఁడియఁగనుఁగొను నమరులష్ట, పడినఁ ద్రోచిపట్టునుఁ బాణిపంకజంబు.

సీ. కమలాస్య నెమ్మోము కమ్మనితావికి నందడిఁ బడుకెంపుటధరశోభయును
ముద్దియయలఁ బ్రోక్కముద్దుఁబలుకులు వినఁగ నుత్తలపడునెడుకయును
బూఁబోఁడి నెమ్మదిఁ బొందియానందంబు కడగానఁ బూనెడి కౌతుకమును
గామిని కొంగొంగఁ గడలొత్తుఁ గోర్కులు నిండింపఁ గాంక్షించు నలఁగడఁకయు
భామయును నేను నన్యోన్యభావమగ్ను, లగుట యెఱిఁగి నయాప్తజనాళి ప్రియము
నిర్వహింపఁగఁ గలుగుట నిక్కముగను, నరయ నే భంగి భాగధేయంబొ నాకు.

క. అని యివి మొదలుగఁ బెక్కులు, దనమదిఁ దలపోయుచు తనితలఁపులు సిద్ధిం
దనరింపఁగఁ జనుదెంచిన, యనుపమభాగ్యంబునా నిశాంతం బయ్యెన్.

ఉ. పాసెఁ మధువ్రతావళులు పద్మవనీవిధనంబు శోకమున్
వీడె రథాంగకంబులకు వేడుకఁ గూడె తరంగిణీలలం
దాడెఁ మరాళదంపతులు హాసవిలాసము పిక్కఁ బ్రక్కలన్
వాడెఁ గుముద్వతీముఖము వావిరి నూడెఁ దమోనిబంధముల్.

క. అరుణోదయరాగంబునఁ, గర మలరెడు పూర్వదిఙ్ముఖంబున బెరసెన్
సరసిజమిత్రసమాగమ, పరమోత్సవవార్త భువనపఙ్క్తుల కెల్లన్.

మ. తనతేజంబున నన్యతేజముల విధ్వంసంబు నొందించి యెం
దును సన్మార్గము సుప్రకాశవిగళద్దోషంబుగాఁ జూపి య
త్యనురక్తోజ్జ్వలమండలుం డగుచుఁ బూర్వాద్రీంద్రభద్రాసనం
బున నొప్పెన్ గ్రహరాజు విశ్వము కరంబుల్ మోడ్చి సేవింపఁగన్.

వ. ఇట్లు సూర్యోదయంబగుటయు వసుదేవసూనుండు కౌతుకోన్నీయమానుం డయ్యు కృతకాల్యకరణీయుండును సముచితాలంకారకమనీయుండును ననురూప జనపరివేష్టితుండును ననురూపశుభచేష్టితుండును నగుచు రుక్మిణీదర్శనం బపే క్షించి తనరథంబుతోడన శిబిరంబు వెలువడియె నంత వైదర్భపురంబును రాజన్య జనస్కంధావారంబును గుంకుమద్రవసేకంబుల ముక్తావిసరరచితహారంబులం

గవకకదళీక్రముక స్తంభోన్నయనంబుల మరకతమకరతోరణబంధంబుల మహా
నీలప్రాణంబమాలికాకలనంబులఁ బద్మరాగరమ్యధ్వజవైజయంతికా విరచనం
బుల విచిత్రవిభవవిస్తారంబులై శోభిల్లె నాసమయంబున.

సీ. లాలితపర్జన్యలక్ష్మి విభూషించు పర్యాప్తనవమేఘపంక్తు లనఁగ
రమణీయశారదరాత్రిఁ బ్రసాధించు రాకాసుధాకరప్రభ లనంగఁ
బ్రకటితప్రాభాతపద్మినిఁ బాటించు బాలారుణోదయలీల లనఁగ
నుల్లసితాశోకవల్లరి నలరించు నుదితవసంతసంపద లనంగ
లలితమోహనమంత్రదేవతఁ బ్రసన్నఁ, జేయుసాధకసాధనశ్రీ లనంగ
రుక్మిణీదేవి యభిరూపరుక్మకాంతి, కలితతనుయష్టిఁ గైసేసి రెలమిఁ జెలులు.

వ. ఇత్తెఱంగున శృంగారించి యయ్యంగన లవ్వరాంగి నఖిలమంగళాధిదేవత యగు
గౌరీదేవికి మ్రొక్కింపఁ దదీయదివ్యాయతనంబు గుఱించి కాంచనశిబికారూఢం
జేసి పురంబు వెలుపలికిం జనుదెంచి రప్పుడప్పుడు.

తే. అలఘుయానావతీర్ణయై యలసుఁబోఁడి, బోటిపదువులు పాసువంగఁ బోలుపుమిగుల
దేవి దర్శించి తనముగ్ధభావ మధిక, భక్తితాత్పర్యమున ననురక్తి నొంది.

ఉ. అక్షతగంధపుష్పచయ మంజలి సర్పణసేసి నమ్రయై
యకృతపుణ్యుఁ డుత్తముఁ డనంతుఁ డనంతయశుండు పుండరీ
కేక్షణుఁ డస్మదీయహృదయేశ్వరుఁ డయ్యెడుఁ దల్లి నీకృపా
వీక్షణలీల నంచుఁ బ్రియ మింపెసలారఁగ మ్రొక్కి క్రక్కునన్.

పురంబు వెలుపల గౌరీదేవి సేవించివచ్చు రుక్మిణీదేవిని శ్రీకృష్ణుండు గొనిపోవుట.

క. గుడివెడలెడునెడఁ గృష్ణుఁడు, కడుఁ గనియెఁ గవచ్చి కాంచెఁ గామినిఁ దఱితోఁ
బౌడమి సుధాజలనిధి య, ప్పుడు వెలువడి యున్నకమలఁ బోలెడుపొలఁతిన్.

చ. కని పరమేష్ఠి చేసినజగత్త్రియసర్గమునందు నిట్టిదం
బునఁ బోలుపారునద్భుతపుమూర్తులు గల్గెనె దీని విస్మయ
వ్వినుకలి యెట్టులైన నొకవెంట సహించితి నింక నెట్లు నా
మనసున నోర్వవచ్చు ననమానవిలోకనరాగవేగముల్.

సీ. మెలఁగి పైకొని చూడ్కిఁ దలఁకంగఁ గ్రాలెడుఁ దుఱఁగలి గొనుకారు మెఱుఁగుఁ బోలె
నురియాడు చిత్తంబు నెరియింపఁ దొడఁగెడు నాలోలపావకజ్వాల వోలె
భావించి మఱపునఁ బనుపడుబుద్ధికిఁ దనుపుసూపెడు సుధాధార వోలె
బహువిలాసంబుల భ్రమయుచైతన్యంబు మరులుగొల్పెడుఁ దీవ్రమాయ వోలె
చెనఁగి మరగినకోర్కులఁ బ్రిదులనీక, యాఁగి నిలిపెడు నలఘుదివ్యాజ్ఞ వోలెఁ
దరుణి యింతలోనన నన్నుఁ దనకుఁ దక్క, విలిచికొనియె నిహాకారకలన నిట్లు.

తే. ఇతనివలననె యుగములం దెల్లనుగ్ర, తిష్ఠమై యాదవ్యధర్మంబు తేజరిల్లు
సిరియుఁగీర్తియు జీవితపరమగతియు, నితనిఁజెందియ మెఱయు నూర్జితవిభూతి.

ఉ. ఈతని పాదపద్మముల కే ననిశంబును భక్తియుం బ్రియ
త్వాతిశయంబు నొప్పఁగ సమంచితసేవ యొనర్తు నంబుజ
స్వాతమనోజ్ఞమూర్తి కనపేతదయావిభవైకవర్తికు
ద్యోతితకీర్తి కీతనికి నుత్తమదాస్యనిరూఢిఁ జక్కటిన్.

వ. అని యిట్లు దేవుదివ్యమహిమ లన్నియు మున్ననేకవిధంబుల వినిపించెనని యద్దేవి నిశ్చంచలం బగునిశ్చయంబున నిరపోహాత్మ్యష్ఠయై నిలిచెఁ గృష్ణుండు నట మున్న సంకేతించినవాఁడు గావున నప్పుడు దన్నుఁ గూడవచ్చిన బలదేవున కొంత యెఱింగించి.

తే. నెచ్చెలులలోన నున్నయన్నీరజాక్షి, నొడిపువేడుక నెయ్యనఁ బొడవిసెట్టి
తెచ్చి రథముపై నిడఁగఁ దదీయజనులు, కలఁగి రచ్చటసైన్యంబు గవిసె మీఁద.

క. తన వ్రకటి సెటికి లాంగల, ధరుఁ డుద్ధతిఁ బూంచి హయరథద్విపసుభటో
త్కరముల మ్రగ్గింపఁగ న, న్నరవులు విచ్చుటయు మేదినీధరుఁ డలరెన్.

వ. అమ్మహాత్మాహం బెఱింగి యుగ్రసేనుండు సాత్యకి శతధన్వుండు విదూరథుండు ప్రసేనజిత్తు మొదలయినయదువృష్ణిభోజాంధకవీరు లనేకు లనేకరథతురంగదంతావళసహస్రంబులతోడం బన్ని యేతెంచి రామపురస్సరులై నిలిచి.

క. ద్వారావతి కరుగుము క, న్యారత్నముఁ గొనుచు నీవు నలినాక్ష మహా
వైరుల సంపద నేమని, వారించెద మనుచు మిర్ని హరిస్ఫూర్తిన్.

వ. సమరమ్మునకుం బ్రవర్తిల్లిరి హతశేషులైనకన్యారక్షకు లరిగి జరాసంధునకు రుక్మికి భీష్మకునకుం బౌండ్రకునకు శిశుపాలునకు దంతవక్త్రునకు మఱియునుం గలరాజుల కెల్లను బ్రత్యేకంబ రుక్మిణీహరణం బెఱింగించిన విని యద్భుతంబు నొంది రివ్వ సకలజనంబులు.

తే. ఎట్టిలా వెట్టిదీమస మెట్టితెగువ, యెట్టికడిమి కృష్ణుఁడు జగదేకవీరుఁ
డగుచు నీక్షాడియున్నధరాధిపతుల భంగపఱిచె నిం కేమని పలుకఁ గలను.

శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవిం గొనిపోవునెడ జరాసంధాదు లెదిరిపోరుట.

క. అని రత్తఱి మగధేశ్వరుఁ, డనయము గన లగ్గలింప నవుడుగఱచి కెం
పున నుగ్రము లగుచూడ్కుల, జననాథుల కిట్టులనియె సంభ్రాంతమతిన్.

ఉ. ప్రేనితనూజుఁ డొక్కరుఁడు వీర్యసమగ్రుఁడ పోలె వచ్చి నా
పూనికపూన్కి యంతయును బొంకగునట్లుగఁ జేసె నేను నా

మ. బలభద్రాదులు భద్రదంతిచయదృప్యద్వాహశుంభద్రథా
వళితో భూరిపదాతిసంకులముగా వైచిత్రప్రతానంబు ద
గ్గలికం దాఁకొని తీవ్రబాణతతి యాకాశంబునం జీఁకటుల్
గొలుప న్నిల్చి పెనంగి రయ్యహితులం ఘోరప్రకారంబులన్.

క. ఇరుదెస సేనాంగంబుల, బెరసిన పెంధూళి యెగసి పేర్చి రవికరో
త్కరసంరోధనలీలా, పరిణతమై మ్రింగె దిగ్విభాగము లెల్లన్.

తే. కొంచెమయ్యును యదుసేన కొలఁది కెక్కు, డై సరిపుసైన్యకోటితో నలవుఁ జలిమి
మిగులఁ బోరి పుట్టించె నిమేషమాత్ర, బహుళకీలాలపూరంబుఁ బ్రధనభూమి.

క. అనత్తును పృథురేణువి, తానము నడఁచుటయు సమ్మద మ్ముత్కటమై
మానసములు పొంగ నుభయ, సేనలజోదులు గడంగి చిత్రముగాఁగన్.

క. సాత్యకి మగధమహీపతి, నత్యుగ్రతఁ దాఁకి యేసె నాఱమ్ముల నౌ
ద్ధత్యమ్మున నతఁ డాతనిఁ, బ్రత్యాహతుఁగా నొనర్చె బహుబాణములన్.

సీ. శక్రదేవుం డను సక్రూరుఁ డను దంతవక్త్రునిఁ దలపడి వడిన నొకటఁ
దొమ్మిదింటను నేసి రమ్మహాబాహుండు బలియుఁడై పదియు నేఁబదియు నమ్ము
లోలి నయ్యుద్ధజయమొడళుల నాటించి యాలో విదూరథుం డలుముటయును
నాఱునారసముల నతని నొప్పించెను విపృథుఁ డుగ్రతఁ జేదివిభునిఁ దాఁకి
యేడుతూపులు నిగిడింప నెనిమిదింటఁ, బ్రతిహతునిఁ జేసె నాశిశుపాలుఁ డతని
నెసఁగ సేషుండు హైహయనివిశిఖపటల, తాడితుం డగఁ జేయఁ గ్రోధమున నతఁడు.

వ. అన్నియు మార్గణంబుల నాతని నొప్పించె బృహద్ద్యుమ్నం డనువాఁడునుం గదిసి యతని నేసె నిట్లు మువ్వురు మహారథులతోడం బెనంగుచుండియు నొక్కింత లెక్క సేయక యాదమఘోషసూనుండు.

తే. తోఁప మగుభల్లమున బృహద్ద్యుమ్నుశిరము, దునిమి నాలుగమ్ముల విపృథునిరథంబు
గుఱ్ఱముల నాలుగింటి నిగూల్ప నతఁడు, తొలఁగి చనియెక్కె నాబృహద్ద్యుమ్ను తేరు.

వ. ఎక్కి క్రమ్మఱం బగతుపైఁ గడంగిన నబ్బలియుండు మఱియు ననేకసాయకంబుల నయ్యాదవు దేహం బాచ్ఛాదించి కోదండమౌర్వీటంకారంబులు సకలాతంకావహంబులై పరఁగ సంగరరంగస్థలంబునఁ బరాక్రమవర్తనంబు కీర్తనీయంబుగాఁ బ్రవర్తిల్లె మఱియును.

క. కృతవర్మ పౌండ్రుఁడు ముప్పది, శితశరముల నేసి సూతుఁ జయ్యెడఁగ నేం
చి తురంగంబుల నస్త్ర, క్షతాంగములఁ జేసి పడగ ఖండించి వడిన్.

వ. సింహనాదంబున రోదోవిదారణం బొనర్చి దారుణాకారుండైన నవ్వీరుండు గని హార్దిక్యుం డిట్లు నలుకి యనేకమ్ముల వాలమ్ములు గ్రుచ్చిన నమ్మాలియుం

దాలిమి దాల్చి ధైర్యంబు విడువక యతండు పేర్కొ నశరాసనంబునం బరా
క్రమవ్యవహారంబు నడుపుచుండె నంత.

క. కరి నెక్కి సత్యకుండు, ధ్రుమునం బయి యంగాధినాథుఁ దాఁకి కడిఁదితోఁ
మరిముస వైచిన నతఁ డ, స్మరవరు నపరిమితమార్గణంబులఁ బొదివెన్.

వ. సత్యకునకుం దోడ్పడి చిత్రసేనుండును శ్వేతఘ్నుండును నంగబలంబులం జలంబు మిగు
లం గలంచి యాఁగి యంత నిలువక.

క. కాళింగుని కరిఘటలం, గ్రాలి కలము మాలనడుచు ఘనసనసమాన
ట్లాలంబున వాలంపఱి, దూలించిరి వార్వలాస మస్త్రము లగుచున్.

## బలరాముండు సంరంభ విజృంభితుండై వంగాదిసైన్యంబులఁ దనుమాడుట

ఉ. అత్తఱిఁ దేసు డిగ్గి హరియుగ్రగతిం దుగ్రహాలంబుఁ దాల్చి యు
ద్వృత్తిఁ గడంగి వంగజగతీపతియెక్కి న కుంజరంబుఁ బె
ల్లొత్తి యుదగ్రకుంభదళనోద్ధతకేళి యొనర్పఁగా నతం
డత్తలదాఁటి యొంతయు భయాతురుఁడై తొలఁగంగఁ బోయెనే.

క. క్రమ్మఱరథమెక్కి బలి, ష్ఠమ్మగుచాపంబుఁ దాల్చి సంరబ్ధుండై
స్త్రమ్ములు పఱగించి రిపు, గ్రమ్మునఁ బలువురఁ వధించెఁ గాఢ్యలఁ గడిమిన్.

వ. అమ్ముఖంబున మఱియు నార్వురు గామాశుల నార్వురు మగధుల నీటకం
గించె నిట్లు మహాబాహుండై మాఱులేక మలసి మగధనాథు పనుపు సేసి దినుసు.

ఉ. రాముని గాంచి వాఁడొకని శరత్రితయంబున నొంచె మగధుం
డామనుజేంద్రుఁ దీవ్రవిశిఖాష్టకవిద్ధునిఁ జేసి యయ్యొకు
గ్రామణి తోన రత్నమయకాంచనకేతువుఁ ద్రుంచి వైచి యు
ద్దామశరాసనంబు త్రుటితంబుగఁ జేసి చెలంగి వెండియున్.

క. తిలమాత్రశకలములుగా, నిలపైఁ దొరఁగించె రథ మనేకాస్త్రచయం
బుల నతఁడు విగతచాపుఁడు, దళితరథుండునై మహాగదాభుజుఁ డగుచున్.

తే. అడరి యమ్ముసలాయుధు నరద మల్ల, కణములుగ వడి నడిచి నేకడిసి యతని
వ్రేయుటయుఁ వ్రేటువడి నొచ్చి వివశుఁ డగుచు, నలఘుగద చేతఁ గైకొని తొలఁగ నుఱికి.

వ. బలదేవుండు సాత్యకిరథం బెక్కె జరాసంధుండును గదాహస్తుండై ప్రతిపీ
తులం గనుపుగొట్టుచుండె నప్పు డుభయసైన్యంబులు నొండొంటిం బెరసి
సందడి పెనఁగువఁ బెనంగునెడ రథికసముదయంబు లడరి యేసినం బిడుగుల
వాన దొందడిం బగిలిన పెనుగొండలపగిదిఁ బగిలియు ముఱిసియుఁ ద్రెవ్వి
యుం దొరఁగు నవయవంబులతో నధి కాతంకంబున ఘీంకారఘోరంబుగాఁ

వెరలుకరులును గిరిఘటలు సొచ్చినం గొమ్ములం వగిలియుఁ దొండంబులుం
దోడరియుఁ ద్రొక్కు సంజిక్కియుఁ జిక్కుచీరువడుతురంగంబులును, దురంగఘట్టం
బులు నడచిన దట్టంబులై చదిసియుం బొడియయ్యును జెడియును వికలంబు
లగుకాల్బలంబులును, ఒక్కొక్క నొడ నక్కడెక్కడయుని పలాయితులం బురికొలిపి
నిలిపి పోరిం బోరి భూరిశోణితంబులు బహుళపలలంబులు మేదురమేదంబులు
మేదినిఁ దొరఁగించి మానంబు మానక చచ్చియు నొచ్చియు గెలిచియుఁ గలిత
స్థంబు నెఱవునెఱబిరుదుమగలునుగ గట్టి మగలమిగని కడకెఁ దెచ్చుకొని మాఱు
మూఁకల కెదురై దళితకరీటులై నమధ్యమహోగులునై కదిసి పోట్లాడుట పోట
రులకైదువు లొకటొకటిం దాడరి క్రంగిన సదరులు సెదరం బొదలు కఠోర
నినాదంబులుం బరస్పరవిదారణదారుణంబు లగువారణంబులమద్గావరవిషాణా
కర్షణారాణంబులు నధికరభసంబున సారథులుఱుప నొండొంటిం బెరయుతేరుల
బలునొగలతాఁకుమ్రోఁతలుం గరికుంభస్ఫోటనకపాలఫేనసహముఖంబులఁ బ్ర
చండస్వనంబులును బహుప్రకారంబు లగు నస్త్రప్రహారంబుల పాల్పడి వావి
డిచి యఱచునరనాగతురంగనికరంబులయాక్రోశంబులనాదంబులు నొండొండ
పెచ్చి శబ్దాంతరంబు నడంచినభోంతరం బంతయు వాచాలంబు గావించె నయ్యు
వసరంబున.

తే. సత్యకాత్మజురథ మెక్కి సంగరమున, కట్టులెడ్డైన బలదేవుఁ డంతలోన
గమితఖేదుఁడై యుగ్రంపుగదయమర్చి, కొనుచుఁజనితాఁకె మాగధమనుజనాథు.

క. అతఁడును నభిముఖుఁడై యు, ద్ధతగద సారించుచునుఁ బ్రతాపసమగ్రుం
బ్రతివీరుం దలపడియెన్, బ్రతిభయగర్జారవంబు ప్రస్ఫురితముగాన్.

వ. ఇవ్విధంబునఁ దలపడి.

మ. గద లొండొంటిఁ బ్రచండతం జఱచి యుల్కాపాతభీమాగ్నిసం
పదఁ బుట్టింపఁ బదాగ్రపాతపటుశబ్దంబుల్ హాహుంకృతు
ల్పొదలం గూడి నభోదిగంతరపరిస్ఫోటంబు గావింప న
స్మదవేగం బెలరార నిద్దఱును సామర్థ్యంబునం బోరఁగన్.

క. వెరవున సంకర్షణుఁడ, స్మరనాథునిఁ గదిసి వ్రేసినం బెలుచన పే
[illegible]మున గద వడుటయుఁ బె, చ్చర మూర్ఛిలిపడియె నతఁడు చెయ్యేదిమహిన్.

వ. ఇట్లు జరాసంధుండు మూర్ఛితుండగుటయుఁ దత్సారథి యతని నెత్తి రథంబు
పై నిడికొని కలనికిఁ దొలంగించె నవ్విధంబు గనుంగొని తదీయసైన్యంబులు
గలంగిపఱచె సాత్యకి యొక్కెడ నంగవంగకళింగబలంబులం బఱపె నంత నథ
లక్షత్రియానీకంబులు నాకులంబులై చెదరె దొరలునుం దిరిగిరి బలదేవుండును

సత్యక తనయుండును సహితుల సహజితులం జేసి యార్చి శంఖంబు లొత్తిన నయ్యులివు విని జనార్దనుండు జరాసంధబలాయనంబు నిశ్చయించి తానును బాంచజన్యస్వనంబు నలుదెసల నిండించె నంత.

రుక్మిణీసహోదరుండగు రుక్మియనువాఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబుచేయుట.

సీ. ఆమగధేశుఁడు నఖిలరాజన్యులు నమ్మెయి వృష్ణిసైన్యంబు పేలుఁది
నరిగెడునప్పుడ యట రుక్మియును రుక్మిణీహృతివార్తకు నిబ్బరంపు
కోపంబుతో నాజి గోవిందుఁ దునిమి రుక్మిణిఁ గొని రాక యాత్మీయపురముఁ
జొర నని తండ్రియుఁ జుట్టలు వినఁ బంతమిచ్చి సన్నద్ధుఁడై యేపుమిగులఁ
గదలె గ్రథుఁడు కైశికుఁ డాదిగాఁగఁ గలుగు
యోధముఖ్యులు బహుళసైన్యోద్భటముగ
నాయితంబయి యాతని ననుసరించి
రనుజహితబంధుకోటియు నపరెఁ గదిమి.

వ. మఱియు దక్షిణాపథనివాసు లగునంశుమత్క్రథ శ్రుతపర్వ వేణుధారి ప్రముఖమహీపతులు తమతమవర్గంబులం గొని యతనితో నేకకార్యులై కడంగి రట్లు నడచి నర్మదాతటానుసారియై యరుగు శౌరిరథం బొక్కటియు దవ్వులం గని వైదర్భకుమారుండు శూరుమాని గావున సందటిం గడచి తనతేరు దోలుకొని పోయి గోవిందునెయుది మెలుంగెత్తి.

క. ఓరిపశుపాలపుత్రక, దూరీకృతధర్మ పరవధూదూషక నా
బారిఁబడి తెంపుఁ బోయెదు, పీఁగుని నను రుక్మి నెఱుఁగవే వైదర్భా.

ఆ. ఉసులు గాచికొనఁగ నుల్లంబు గలిగిన, నిపుడ బాల విడిచి యేగు మట్లు
కాక నిలిచితేని గ్రక్కున నిదె తల, గొను మదీయతీవ్రఘోరశరము.

క. అని యతఁడు పదిశరంబులు, వనజాక్షునిమీఁద నేయ వడినాతఁడు నా
తని నేసె డెబ్బదమ్ముల, ఘనమార్గణనినదభరితగగనుం డగుచున్.

ఉ. కేతువు ద్రుంచి చాపము నికృత్తముగా నొనరించి లీలమై
సూతునికంఠముం దునిమి చోద్యపుటమ్ముల మేను నొంపఁగా
నాతురుఁడై నరుక్మిఁ గని యాతనిమిత్రులు దాక్షిణాత్యుల
త్యాతతవేగులై పొదివి రంతటిలోఁ జనుదెంచి మాధవున్.

వ. ఆరాజు లొక్కటం గూడి యేయుసాయకసహస్రంబులు సహస్రకరుండు తిమిరంబు విరియించుకరణి విరియించి విష్ణుండు వేణుధారిపడఁ బుడమిం బడసేసి యంత నిలువక. తదీయదక్షిణభుజచ్ఛేదనంబు గావించి శ్రుతపర్వుం బటుబాణపాతంబుల నొప్పించిన నతండు కేతుదండం బూఁతగా నెఱఁగి యాలోనన తెలిసి యతనిపైఁ బెక్కువిశిఖంబులు పరఁగించె మఱియును.

క. గ్రథకైశికు లాదిగఁ గల, రథికులు బహురథసముత్కరంబులతో నా
రథచరణపాణిమీఁదం, బ్రథితోత్సాహమునఁ గవిసి బలువిడి సేయన్.

ఉ. వారలబాణవర్షములు వారక నిల్పుచుఁ దాను వారి నా
త్వారశరప్రతానపరివారితదేహులఁగా నొనర్చుచున్
వారిజనాభుఁ డుద్యదనివారితశోణితవారిధారలన్
వారలఁ దోఁచె వీరు లగువారలకెల్ల నొకండ మేటియై.

క. అంతటిలో రుక్మియును ర, థాంతరగతుఁడై మహారయంబుమెయిన్ దై
త్యాంతకు మార్కొని విశిఖ, ధ్వాంతమ్ము దిగంతరాళతతముగఁ జేసెన్.

తే. హరియు నతనిపైఁ బెల్లుగ నంపగములు, పఱపె వైదర్భుఁ డచ్యుతు గరుడకేతు
నొక్కయమ్మున సారథి నొకశరమునఁ, దాఁకనేసి రథ్యంబులఁ దరల నేసె.

క. కినిసి విభుఁ డహితువిలు ద్రుం, చిన నారుక్మియును గదముశ్రుముగ శరా
సనమొం డొక్కటి గైకొని, దనుజధ్వంసకుని గెలువఁ దమకించె వడిన్.

తే. వరుసమాహేంద్రవాయవ్యవారుణములు, రౌద్రగాంధర్వపైశాచరాక్షసములు
నైన దివ్యాస్త్రములు వారిజాక్షుమీఁద, వెసఁ బ్రయోగించె జతనంబు విస్తరిల్ల.

క. అవి యన్నియు దామోదరుఁ, డవహితచిత్తుఁ డయి తత్తదస్త్రమ్ముల సం
ప్రవిహతములు చేసి యతని, యవయవములు బహుళశరచయంబులఁ బొదివెన్.

వ. హాదివి తోడన కోదండంబు ఖండించి రథ్యంబుల వధియించి సారథిం దెగటా
ర్చి రథంబు నఱకిన నుద్ఘసంబు నడిదంబునుం గొని తోలంగ నుఱికి విపక్షుండు
సపక్షం బగునప్పతగభుజంగంబుభంగి నాభుజంగభంజను దెసం గవియుదెంచిన.

ఆ. పలుకపగుల నేసి యలుఁగుతుత్తునియలు, గా నొనర్చి శౌరి కనలు మిగుల
నారసములు మూఁటఁ బేరురం బుఱక వ్ర, చ్చినఁ గరంబు నొచ్చి చేష్టదక్కి.

వ. రుక్మి ధరణీతలంబున ముడింగి పడియె నట్లైన యతనిం జూచి.

క. బలమెల్లఁ జెదరి నాలుగు, వలఁకులఁ జెడిపోయె దొరలు వడి నాఁబోతుం
బులిగొనినఁ గలఁగుపసుల, ట్లలఘుభ్రమఁ బొంది యొదిఁగి రచ్చటనచటన్.

క. శరదళితదేహుఁడై భువిఁ, బొరలుచు నున్నతనితోడఁబుట్టువుఁ గని ని
ర్భరశోకంబున రుక్మిణి, యరదముపై వ్రాలి యార్తి నాక్రందించెన్.

## శ్రీకృష్ణుఁడు రుక్మి మూర్ఛితుం జేసి రుక్మిణిం గొని ద్వారకకు వచ్చుట.

వ. వృష్ణిపుంగవుండు నయ్యంగనం గౌఁగిలించి మెత్తన యెత్తి యాశ్వాసించి రుక్మికి
నభయం బిచ్చి రథంబు గ్రమ్మఱింప సారథి నాజ్ఞాపించి ప్రియకరం బ్రియం బా
ర్చినవాఁడై.

క. సరసము లగునుచితవచో, విరచనములఁ దెరువునందు వెలఁదిఁ బ్రియుసుం
దరుఁ డయి మఱియును దేర్చుచు, నరిగెఁ బురికిఁ బ్రమదనిర్భరాత్మకుఁ డగుచున్.

వ. యాదవులును మగధరాజప్రభృతుల జయించి రామసాత్యకుల మున్నిడికొని యార్పులు పెడబొబ్బలు విజయతూర్యంబులమ్రోఁతలు నెక్కటమై యెదురొత్తనుపౌరుల హర్షసంకలిత నినాదంబులతో నెదురొకొని కలయంబురప్రవేశం బొనర్చి రంతట మధుకైటభారి గడచిపోయినయనంతరంబ శ్రుతపర్వుండు రుక్మిం డనయరదంబుపై నిడికొని చనియె నలెండును రుక్మిణిం గ్రమ్మఱింపక కాని కుండినపురంబు సొరనని ప్రతిజ్ఞ గావించినవాఁడు గావున నట్లు భగ్నప్రతిజ్ఞుం డగుటం దనకు నేఁటి భోజకటకం బనునగరంబు గావించికొని యందు వసియించె మగధపతియును మూర్ఛ దేఱి చనరెనసైన్యంబులం గూర్చుకొని విదర్భపురంబునం గలజనంబులు సత్పూజకుం బాత్రులై శిశుపాలుం దోడ్కొని తనదేశంబునకుం జనియె నంత నిక్కడ.

చ. యదుకులవృద్ధు లంతయును నానకదుందుభి లోనుగాఁ బ్రియం
బొదవఁగ శౌరి పెండ్లికి ముహూర్తము వేలుగఁ బెట్టి చుట్టపుం
బడుపును దిక్కు నుం గలుగుపార్థివకోటినిఁ బిల్వఁ బంచి రమో
ప్పిదము లొనర్పఁ బంచిరి గభీరవిభూతి యెలర్ప వీటికిన్.

వ. ఇట్లు పనుచుటయు రాచనగరి నగరంబునందు.

సీ. మణికుడ్యములు కుంకుమంబునఁ బెలుపొందఁ దోడిసినమెఱుఁగులుతుటఁగలింపఁ
గాంచనస్తంభము ల్గవుసెనల్ పుచ్చి రింపారుశిల్పము లెల్ల నచ్చుపడఁగ
మృదుకుట్టిమంబుల మృగమదసలిలంబు లలికిరి చూడ్కులు నెలసి జాఱ
ముక్తాఫలంబులమ్రుగ్గులు పెట్టిరి పలుదెఱంగులరచనలు దలిర్పఁ
గ్రముకకదళికాకమనీయకాండసమితిఁ, జేర్చి యభినవాశ్వత్థ విచిత్రచూత
పల్లవంబులఁ దోరణప్రతతు లమరఁ, గట్టియెత్తిరి చీనాంశుకధ్వజములు.

మ. అతులైశ్వర్యసమేతులై వెలయుసౌహార్దంబునన్ బంధుభూ
పతులుద్దామరథద్విపాశ్వములతో భవ్యోజ్జ్వలాలంకృతుల్
వితతశ్రీలఁ దలిర్పవచ్చిరి మహావీడుం ద్రిలోకార్చ్యుఁ డ
చ్యుతుఁ గల్యాణవిధానవేళఁ బ్రియముల్ సొంపార నర్పింపఁగన్.

క. ఘనుని లేతెంచిరి చిత్తము, లనురాగరసాబ్ధిఁ దోలలాడఁగ దపముల్
గనియుంగఁబండెఁ దమకని, యనుపమభద్రు బలభద్రుననుజునిఁ జూడన్.

తే. వసుధఁ గలవిప్రభూవర వైశ్యశూద్ర, వర్ణముఖ్యులుఁ దక్కినవారు నర్థి
నరుగుదెంచిరి హరివివాహాభిజాత, మంగళం బనుమోదింప మనము లలర.

క. అందఱకు నుచితసత్కృతు, లొందఁగ నొనరించెఁ బ్రభునియోగంబున న
స్పందమతియుతుఁడు సత్యక, నందనుఁ డభినందనీయనైపుణయుక్తిన్.

వ. తదనంతరంబ లగ్నదివసంబు ముదితం బగుటయు.

సీ. ఆపూర్ణవర్ణసమగ్రస్వరంబుల నలఁతిభూసురులయధ్యయనరవము
మధురసల్లాపసమ్మదరసోత్సవమునఁ బాపలుఱాజులవచోభ్యుదితరవము
లలితవిలాసలీలాఖేలలను గ్రాలుచపలలోచనలభూషణరవంబు
జన్యజనాహ్వానచతురంబు లగుహస్తిహరులబృంహితహేషితారవంబుఁ
గలసి కల్యాణవాదిత్రకలితగేయ, రవముతో సాంద్రమై మనోరంజనముగ
దెసలు నిండించె దివమున దేవదుందు, భిప్రణాదంబు నెక్కుట బెరసి చెలఁగ.

వ. అంత నత్యంతమనోహరానేకసంస్కార పరిణతం బగుపరిణయ మండపంబున కమనీయకాంచనస్తంభచతుష్టయసంభృతయు మాణిక్యఖచితవిచిత్ర వితానవికసితయు మంగళరంగవల్లీరచనారుచిరయుఁ జతురంతనిబద్ధమరకతతోరణమణిదర్పణాభిరామయు సువర్ణపాలికాసమర్పితనవాంకురాలంకృతయు నుపాంతవిన్యస్తరత్నదీపికాశోభితయు నగుభద్రవేదికయందుఁ బురోహితుం డగ్నిముఖంబు చేసి వేల్వ నుగ్రసేనవసుదేవబలభద్రప్రభృతిగురువృద్ధవరులును బ్రసిద్ధతపస్విపుంగవులును బలసి యుండ వాసుదేవుండు తదనుజ్ఞాపూర్వకంబుగా శుభముహూర్తంబున.

రుక్మిణీ కల్యాణ మహోత్సవ ప్రకారము.

సీ. సౌకుమార్యమునకు సౌకుమార్యస్ఫూర్తి గలిగించునవయవకల్పనంబు
సౌందర్యమునకును సౌందర్యసంపద యొదవించులావణ్యయోగరుచియు
సౌభాగ్యమునకును సౌభాగ్యవిభవంబు గావించునరసరేఖాక్రమంబు
సౌశీల్యమునకును సౌశీల్యకలనంబు సందించునాభిజాత్యస్థితియును
దనకు నైజంబులుగ నొప్పు ధన్యజన్య, రుక్మిణీదేవి నానందరుచిరమూర్తిఁ
బాణిపంకజగ్రహణకల్యాణలీలఁ, బ్రీతి గడలొత్తుచుండఁ బరిగ్రహించె.

క. లలిఁ బుణ్యాంగన లొలికెడు, లలితాక్షతములు వియత్తలమున సమరకాం
తలు గురియుకుసుమవర్షం, బులు నెక్కుటఁ గృష్ణుమేను భూషించె సరిన్.

తే. సురలయిచ్చుదీవనలు భూసురులయిచ్చు, దీవనలుఁ గూడి యద్భుతోదీర్ణలీల
జనులయాకర్ణనంబు లుత్సవమునొంద, బరఁగె నభినవార్థోదాత్తపదము లగుచు.

వ. ఇవ్విధంబునఁ గృతవివాహుండై గోవిందుండు జననీజనకులకు వంశవృద్ధులకు నమస్కరించి వారివాగ్విశేషంబుల నభినందితుండై యనేకబ్రాహ్మణోత్తములకు

నెనిమిదివేలు రథంబులుఁ బదునొకండువేలు నేనూఱు గజంబులు నపరిమిత హయంబులు నసంఖ్యగోగణంబులు దానంబుగా నిచ్చి భూషణసంచయంబులు మణికాంచనరజతరాసులును వాసోనివహంబులును దాసదాసీసముదయంబులు నొసంగి సూతమాగధగాయకవందివైతాళికాదులకు నమితధనత్యాగంబుల ననురాగంబు గావించి సకలజనంబుల నభీష్టాన్నదానంబులఁ దృప్తులం జేసి మఱియును.

క. కుడువుఁడు కట్టుఁడు గైకొనుఁ, డడుగుఁడు వినావలనట్టియర్థము లర్థుల్
కడమ యొకింతయు వల దని, యెడపక ఘోషింపఁ బనిచె నెల్లెడ నెలమిన్.

వ. వివాహదివసంబు లన్నియు నిర్విఘ్నంబునఁ గడచినం దదనంతరంబ.

తే. కట్టు నిప్పించుకొని తాను గట్టు నిచ్చి, చుట్టములకును లాఁతిరాజులకుఁ గరము
నెయ్యమును గారవంబును నెఱయఁ బ్రీతి, సాలఁ గలిగించి తగ వీడుకో లొనర్చె.

క. మునుల నతిభక్తియోగం, బున నర్చనలను ముదంబుఁ బొందించి సదా
సననిర్గతవాక్పూజల, జనితానందుఁ డయి ప్రియ మొసఁగ వీడ్కొలిపెన్.

వ. తక్కినజనంబులును సముచితంబు లగుసత్కృతులం బడయాదరంబుఁ గని ప్రమోదించి నిజనివాసంబుల కరిగిరి పదంపడి.

మ. అనురాగంబులు ధన్యతన్ బొరయ నెయ్యంబుల్ ప్రియంబంద నె
మ్మనముల్ గోర్కులు చూఱలాడఁ బనియన్ మాధుర్యము ధుర్యతం
గని జృంభింపఁగ సోయగంబులు సముత్కర్షంబు వాటింప స
ద్వ్యసనాత్ముండు విదర్భరాజసుతయున్ వర్తిల్లి రిచ్చాగతిన్.

ఉ. చారువిహారసౌధముల సాగరతీరవనాంతరంబులన్
భూరిమనోజ్ఞరైవతకభూధరకందరమందిరంబులన్
హారిసరిత్సమీపలతికావసథంబుల నమ్మృగాక్షి నిం
పారఁగఁ దార్చి కేళిరతుఁ డయ్యె ముకుందుఁ డమందలోలతన్.

సీ. రాగపల్లవముల రమ్యలై యితరేతరాలోకలతలు పై నలమికొనఁగ
నిష్టార్థరచనల నెక్కులై యన్యోన్యసల్లాపములు సుధాస్వాదములుగ
రోమాంచలీలలఁ బ్రోవులై యుండఁ బులకమూర్తు లాశ్లేషకలనసాగియఁ
గామ్యప్రాతిమ్ములకు లీలలై సరిఁ బరిస్ఫురచేష్ట లానందసంపద నొసఁగఁ
గ్రమపరిపాకభరమునఁ గలసి మెలసి, మనసు లొండొంటిపై మమతలు మరిగి కరఁగ
సతియుఁ బతియును బొలిచిరి సౌఖ్యలహరిఁ, జిక్కి రసభావనాత్మవిచిత్రరతుల.

వ. రుక్మిణీవివాహానంతరంబున గృష్ణునకు మిత్రవిందయు జాంబవతియు సత్యయుఁ గాళిందియును భద్రయు లక్షణయు సుదంతియు నన నేడ్వురు భార్యలు గలిగిరి

వారియందు నతండు తుల్యభోగవిభాసి యయ్యె నిట్లుండ ననతిచిరం బగు కాలంబున.

క. పురుషోత్తము నగ్రమహిషి, ధరియించె నుదాత్తసామ్యతానిత్యమనో
హరమగుగర్భము పౌరం, దరి యగుదిశ తుహినధామము ధరియించుక్రియన్.

మ. నడు మొయ్యొయ్యనఁ దోర మయ్యెఁ దనరెన్ నాభీతలం బంగముల్
జడ నొందెన్ బలిసెం గుచద్వయము వెల్లంబాఱె మైదీఁగ యు
గ్గడువై కోర్కులు మూఁగె వస్తువులపైఁ గన్గోనలం జంద్ర మె
క్కుడు దోఁచెం గమనీయదౌహృదపరిక్షోభంబునం బొల్తికిన్.

క. తనపేర్మికి ననుగుణముగ, వనరుహలోచనుఁడు పుంసవనసీమంతా
ద్యనుపమకల్యాణంబులు, పొనరిచి సమ్మోదవిభవపూర్ణత నొప్పన్.

వ. తదనంతరంబ.

క. మును పురహరుఫాలానల, మునఁ జిక్కి యనంగభావముం బొందినయ
మ్మనసిజు మాధవవల్లభ, గనియెం బ్రద్యుమ్ను నాము గాదిలితనయున్.

తే. జాతమాత్రుఁ డైనశౌరిసూనునకు నా, కాశవాణి సుప్రకాశభంగిఁ
జేసె నామ మిటు ప్రసిద్ధిగాఁ బుట్టిన, యక్కుమారుఁ డుజ్జ్వలాంగుఁ డగుచు.

వ. సూతికాతల్పంబున జననిముందఱం దేజరిల్లుచుండ సప్తమనిశానిశీథకాలంబునఁ గాలవశంబున శంబరుం డనుదానవుం డతండు తనకు మృత్యు వగు నని యాదేశంబు గలదు గావునం జనుదెంచి బాలునిం బట్టి యెత్తికొనిపోయి.

క. వననిధిలో వైచిన నొక, ఘనమీనము మ్రింగె జాలికప్రవరుఁ డొకం
డనుపమజాలాకర్షణ, మున నజ్జలచరముఁ బట్టి ముద మెలరారన్.

వ. అయ్యసురపతినివాసం బైనయిష్టుమతీపురంబువాఁడు గావున నాజాలరి తదీయవల్లభయగు మాయావతికి నద్దానిం దానికగాఁ గొనిపోయి యిచ్చిన.

తే. తాన యద్దేవి తత్కుక్షిదళన మెఱయ్యఁ, జేసి యసమానసౌందర్యచిత్రమూర్తి
నర్భకునిఁ గాంచి సమ్మోద మతిశయిల్ల, నర్థిఁ గైకొని గారవం బారఁ బెనిచె.

వ. శంబరుండు ననపత్యుం డగుట నంగనచేత నంగీకృతం బైనకృతకాపత్యంబు కలిమికి సమ్మతించి యుండె నంత.

తే. అసురకులమునఁ గలుగుమాయాప్రపంచ, మంతయును నెఱిఁగించి మృగాయతాక్షి
యక్కుమారుని సకలవిద్యలఁ బ్రవీణుఁ, గా నొనర్చెఁ బ్రేమార్ద్రహృత్కమలయగుచు.

క. క్రమమున శైశవము విము, క్తముగా సుకుమారసుభగతారుణ్యమనో
రమదశ నొందె నృపాత్మజుఁ, డమృతాంశుఁడు పూర్ణదేహుఁడై యొప్పుక్రియన్.

సీ. చెలువంబు లగునెఱ్ఱసెరలవిశాలనిర్మలనేత్రములు నవశ్మశ్రురాజి
కమనీయ మగుముఖకమలంబు గంబుసమగ్రీవయును వృత్తమధ్యమంబు
నిడుదలై యెంతయు బెడఁ గగుబాహులు పొడవైనమూఁపులు వెడఁదయురము
గర మొప్పుసింహచంక్రణరేఖయు ధైర్యగాంభీర్యమాధుర్యగౌరవములు
నమరఁ ద్రైలోక్యమోహనోదాత్తమూర్తిఁ, బ్రకటపౌరుషోల్లాసవిభ్రాజమాను
నతనిఁ గామించి నానాఁటి కంతరంగ, మొలయురాగంబుకతన నాకులతనొంద.

వ. అమ్మాయావతిపలుకులం జూపులం దనకోర్కి బయలుపఱిచినఁ బ్రకటవివేక
విద్యావిశారదుం డగునయ్యుదాత్తచిత్తుం డత్తెఱంగునకు సంశయించి యొక్క
నాఁ డేకాంతంబున నయ్యింతి నుపలక్షించి.

తే. తల్లి వీవు పుత్రుఁడ నేను దగునె మాత్ర, భావ మురివి నాదెస నీకుఁ బాపచేష్ట
యిట్లు సూపఁగ నక్కటా యేమిచెప్పఁ, గామినీజాతి దోషైకకష్టగాదే.

క. నీతలఁ పెయ్యది యేమని, యీతుచ్ఛతకును దొడంగి తింతయుఁ దెలియ
న్నాతోఁ జెపుమా యనవుడు, నాతరుణి తదాననార్పితాలోకనయై.

సీ. అనఘ మాతండ్రి మహానుభావుఁడు యదువంశవర్ధనుఁ డగువాసుదేవుఁ
డఖిలపురంధ్రీజనాభ్యర్చ్య కల్యాణి తల్లి రుక్మిణి మహోదారతేజ
నినుఁ గన్నఁ బురిటిలోనన శంబరుఁడు దెచ్చి యుదధిలో వైచిన నొకక్రమమున
నిటుచేర్చె దైవ మేనిందాకఁ బెనిచితి నసురులయం దిట్టియసమకాంతి
నెసఁగుమూర్తులు పుట్టునే యిట్టిపట్టిఁ, బాసి వగఁ బొక్కుచున్నది పంకజాక్షి
యరుగు మీప్రొద్దజననిఁ గృతార్థఁజేయు, మాత్మదర్శనచిత్తోత్సవాగమమున.

క. నీరూపు చూచి వలచితిఁ, గారుణికాగ్రణివి నన్నుఁ గైకొనుము పరీ
హారంబునకుం గారణ, మేరూపున లేదు నిక్క మిది గుణమహితా.

వ. శంబరు నేను మాయా విమోహితుంజేసి మిథ్యాకళత్రభావంబునన కాలంబు
గడపితి నివ్విరోధిని నపరాధింగాఁ జూడు మని తెలిపినం బ్రద్యుమ్నుండు తద్వ
చనబోధితుండై కలుషించి యమ్మహాసురు నాహవంబునకు నాహ్వానంబు
సేయుటయు.

ప్రద్యుమ్నుండు శంబరాసురుం జంపి దేవి సమేతముగా ద్వారావతికి వచ్చుట.

మ. అలుకం బేర్చి సురారి యాతని నుదగ్రాకారుఁడై తాఁకినం
గలహం బిద్దఱకుం బ్రగాఢకఠినాక్రాంతిం బ్రవర్తిల్లె నం
దలఘుం డయ్యదురాజసూతి నిజవిద్యావాప్తిమై సప్తమా
యల నోలిం బ్రసరించి యెన్మిదవమాయం గూల్చె విద్వేషునిన్.

వ. ఇట్లు కాలశంబరుం గాలగోచరుం జేసి కుమారుండు మాయావతిం గైకొని మాయాబలంబున నంతరిక్షంబున దైత్యాంతకుపురంబునకుం జని రాజాంతఃపురంబున నవతీర్ణుం డగుటయు.

ఆ. వెఱఁగుపాటుతోడి వెఱపు నాకస్మిక, సమ్మదంబు మానసంబు నెలయఁ
గృష్ణభామ లెల్లఁ దృష్ణాతిలోలేక్ష, ణములఁ గ్రోలి రతనినవ్యమూర్తి.

వ. రుక్మిణియు నద్భుతాక్రాంతస్వాంతయై నిజాంతర్గతంబున.

చ. అతులితయౌవనోదయుఁడు హరిసలక్షణమూర్తి యీతఁ డీ
యతివయుఁ దాను నిచ్చటికి నాడటమైఁ జనుదెంచు టేమియీ
యితనిఁ దనూజుఁగాఁ గనినయింతి జగంబున నెంతఁ దాన యూ
ర్జిత యగుభాగ్యసంపదఁ బ్రసిద్ధివహింపక యున్నె యున్నతిన్.

తే. అకట ప్రద్యుమ్నుఁడాభంగి నవధిఁ బోయె, నదియుఁ దైవవిధాతచేసినచెయిది
ననుపమాకారుఁ డవికారుఁ డట్టిపట్టి, బ్రదికెనే నింతకును నింతబంటుగాఁడె.

మ. ఇతఁ డాపాపనియట్ల వెంట్రుకలు మోమింపాలుకన్నుల్ జగ
న్నుతుఁ డబ్జాక్షునిపోలి కైనయురము న్నాథంబు మోమోటకుం
బ్రతి యేమనొకదైవసంఘటనమైఁ బ్రాణవ్యపాయంబు లే
కతిగం బుత్రుఁడు వచ్చెనొక్కొ యను మాంగల్యంబు నొందింపఁగన్.

వ. అని తలంచుచుండఁ బుండరీకాక్షుండును బ్రమోదవికసితాక్షుం డగుచుం బుత్రు నాలోకించె నాలోన నారదుండు చనుదెంచి నారాయణునకు నక్కుమారుజన్మకారణంబును శంబరవధావసానం బగుతచ్చరితంబును నెఱింగించిన నమ్మునీంద్రుని మున్నిడుకొని కృష్ణుండు రుక్మిణిపాలి కరుగుదెంచి.

మ. ఉవిదా యీతఁడు నీతనూజుఁ డగుప్రద్యుమ్నుండు దుర్దాంతచా
పవిశేషోజ్జ్వలహస్తుఁ డాహవమునం బ్రత్యర్థి నత్యుగ్రదా
నవు నాశంబరుఁ గూల్చి ఘోర మగు తన్మాయాచయం బంతయుం
బ్రవరుండై హరియించి వచ్చె నెలమిన్ భార్యాసమేతంబుగన్.

క. ఈయువ నీకోడలు విను, మాయావతి యనఁగ భువనమాన్యచరిత్ర
శ్రీయుత యైనది సుమన, స్సాయకునకుఁ దానభీష్టసహచరి మొదలన్.

వ. అమ్మకరకేతనుండు భూతేశ్వరునయనజ్వాలాకలాపమ్మున నాపన్నుం డైననినా
తిరంబరువశంబునం జిక్కి తనమాయామయం బగురూపం బొక్కటి వానికిను
[illegible] యా నిందిరం బగుచందంబున నింతగాలంబు

నదపి జన్మాంతరగతుం డగునిజభర్తం బ్రద్యుమ్ను భజియించె నిష్కల్మశీల నాత్మ గృహాలంకారంబుగాఁ గైకొను మని చెప్పిన.

క. విని సమ్మదంబు చిత్తం, బునఁ గడలుకొనంగఁ బ్రణతమూర్తి యగుతనూ జునిఁ గౌఁగిలించె రుక్మిణి, యనుమోదము నొందె రచ్యుతాంగన లెల్లన్.

వ. ఇట్లు కుమారుండు ప్రత్యాగతుం డైన యమ్మహోత్సవం బంతయుఁ బురంబున ననేకప్రకారంబై పరఁగి సర్వజనంబులం బ్రహర్షభరితులం గావించె నని చెప్పి వైశంపాయనుండు వెండియు జనమేజయున కిట్లనియె.

క. విను ప్రద్యుమ్నుఁడు, రుక్మిణి, కనఘా తొలుపట్టిగాఁగ నాత్మజులు క్రమం బునఁ దొమ్మండ్రు మఱియు సం, జనితు లయిరి కన్య యొకతె జనియించెఁ దుదిన్.

వ. చారుదేష్ణుండును సుషేణుండును జారుగుప్తుండును జారుబాహుండును జారువిం దుండును జారుభద్రుండును జారుగర్భుండును జారు[illegible]ండును జారుమతియు నసఁ బదియనామంబులు దక్కినదేవులయందును భానువిందుండు సంగ్రామజిత్తు దీప్తిమంతుండు వృకుండు మొదలుగాఁ బెక్కండ్రు కొడుకులును మిత్రవతీ ప్రముఖ లగుకన్నియలును జన్మించిరి.

క. విను ప్రద్యుమ్నుఁడు జనియిం, చిన వెనుకం గోమలన పూర్యశీలుఁడు పుత్రుం డనుపమశౌర్యుఁడు సాంబుఁడు, జనియించెను జాంబవతికి జగదభినుతుఁడై.

తే. శైశవమునంద హరిమామ వాత్సల్యమెసఁగ, నర్కు మామయుఁ దాలధ్వజుఁ డాత్మ సేయుఁ గాఁగఁ గైకొని పెనిచి విఖ్యాతుఁ జేసె, నాయుధశాస్త్రప్రయోగములందు.

వ. ఆబలభద్రునకు రేవతియందు నిశఠుండు నుల్ముకుండు ననుపుత్రులు మహాస త్త్వులు జన్మించి రిట్లుపుత్రవంతు లైన యదుకులైకకాంతుం డస్ఖలితగజతురగ సంకీర్ణయు నపరిమితవస్తుపరిపూర్ణయు నగురాజలక్ష్మి ననన్యసాధారణ సామ ర్థ్యంబున ననుభవించుచుండె నట్టిసమయంబున.

ప్రద్యుమ్నుండు రుక్మికూఁతురగుశుభాంగిని స్వయంవరంబున వరించి వివాహంబగుట.

సీ. అట విదర్భాధీశుఁ డగురుక్మి దనపుత్త్రి యైనశుభాంగి నన్వర్థనామ నసమయౌవనసముల్లసనయై యుండంగఁ గనుఁగొని యనురూపకాంతుఁ డింతి కొదవెడు తెఱఁ గాత్మ నూహించి మహితస్వయంవరోత్సవము సమ్యక్ప్రభూతి నాచరింపఁగఁ దదాహూతులై యుర్విలోఁ గలరాజు లెల్ల నన్యూనవేష- సంపన్నులై యైశ్వర్యలీల నింపారుభోజ, పురికిఁ బోవఁగ రుక్మిణీ[illegible] నుచితపరివారసహితుఁడై యుల్లమలర, నరిగె దల్లియుఁ దండ్రియు ననుమతింప.

వ. ఇవ్విధంబున సముపాగతు లైనభూపతులం బ్రభూతసంభావనలం బ్రముదితు లం గావించి శుభదినంబున రుక్మి యమ్మహోత్సవంబు ప్రవర్తించిన.

మ. మును గోవిందసుతుండు దానును బ్రియంబుల్మీఱ నన్యోన్యశో
భనరూపోన్నతగుణావళుల్వినికిఁ దాబద్ధానురాగాత్ముఁడై
యునికిం గన్నియ యత్తఱిం దగిలి సర్వోర్వీశులుం జూడ నా
తనిఁ బ్రీతిన్ వరియించెఁ గోర్కులు కృతార్థత్వంబునుం బొందఁగన్.

క. ఈరూపవంతుఁ గోరుట, యీరమణికి నొప్పు నిమ్మృగేక్షణమీఁదం
గోరిక య్యీతని కగు నని, బోరన నయ్యుత్సవమునఁ బొగడిరి జనముల్.

వ. ఇట్లు నిజమనోరథానుకూల యగుసప్పణ్యాశీలం గైకొని ప్రద్యుమ్నకుమారుండు సకలరాజన్యకుమారులుఁ దమతమపురంబుల కరుగఁ దానును దనపురంబున కరుగుదెంచి కరగ్రహణానందం బనుభవించి.

చ. అనుపమయౌవనంబులు శుభాకృతులు న్విలసద్గుణంబులుం
దనరు మనోరథంబులును దద్దయు ధన్యత నొంద నిత్యమో
హనరతి నిద్దఱుం గలసియాడఁగ నమ్మదిరాక్షి గర్భశో
భనము వహించి కాంచె సుతుఁ బ్రాగ్దిశ భానునిఁ గాంచు కైవడిన్.

వ. అక్కుమారుం డనిరుద్ధుం డనుపేరం బ్రసిద్ధుండై వేదంబులు ధనుర్వేదసహితంబులు గా నధిగమించి సకలశాస్త్రంబులను సమస్తశస్త్రంబులం బ్రశస్తి నొంది గజతురగస్యందనసమారూఢియందు ననూనరూఢి వహించి యెలప్రాయంబు నలరారుసమయంబున.

ఆ. రుక్మవతి యనంగ రుచిరాంగి రుక్మికిఁ బౌత్రియైనకన్యఁ బంకజాక్షు
నాజ్ఞ నడుగఁ బుచ్చె నక్కుమారునకుఁ బ్ర, ద్యుమ్నుఁ డాత్మజనని యుల్లసిల్ల.

క. హరిదిక్కున మునుగలమ, చ్చర మించుక యాత్మ వదలి సంప్రీతిపుర
స్సరముగ నీ నొడఁబడియెను, హరిపౌత్రున కాత్మపౌత్రి నన్నరపతియున్.

వ. అవ్వివాహమహోత్సవంబున రుక్మిణీసహితుండై యనిరుద్ధుం దోడ్కొని వాసుదేవుండును బలదేవాదిసర్వయదుముఖ్యులుం బుత్రవర్గంబును దోడరా నుచితసైన్యంబు సమకట్టి సముద్ధికవిభవంబున విదర్భనగరంబున కరిగె వైదర్భుండు రవింప సతనిచుట్టంబు లగురాజు లనేకులు వచ్చి రంతఁ బ్రశస్తతిథినక్షత్రం బగుదివసంబునందు శుభముహూర్తంబునఁ గుమారుండు కుమారికాపరిణయం బొనరించిన.

తే. కుడిచి కట్టి చుట్టము లెల్లఁ గూడి కలసి, వెలసి పెండ్లిదినంబులఁ బెంపు మిగుల
నిచ్చ నాడుచుండిరి యాదవేశ్వరుండు, నావిదర్భాధిపతియును నాత్మ నలర.

వ. అంత వేణుధారియు శ్రుతవర్మ్యండును జయత్సేనుండును మొదలయినదాక్షిణాత్యులు తమలో విచారించుచు రుక్మిపాలికిం జని యేకాంతంబున నితని కిట్లనిరి.

ఉ. నెత్తముమీదఁ గౌతుకము నిర్భరమై జనియించె నిష్టు మా
చిత్తములందు నీవు గడుఁజిత్రపుజూదరి వాత్మలోన ను
ద్వృత్తుఁడు సీరపాణి కడువేడుకకాఁ డతనిన్ జయింతు మే
మిత్తటి మమ్మొకింత గదియింపు మొనర్పుము తత్ప్రసంగముల్.

రుక్మి బలరామునితో జూదమాడ నారంభించుట.

వ. అతండు నిర్జితుం డగుట మనకుఁ గీర్తికరం బనిన యాదంతుకాండ్రకలవులు విని రుక్మి వారునుం దానును మనోజ్ఞగంధమాల్యాభరణభూషితులై కాంచనస్తంభశతసంభృతంబును వితతవితానవిలసితంబును రుచిరచందనోదకసిక్తంబును ముక్తాప్రాలంబమాలికంబును నిరంతరకుసుమోపహారమండితంబును నగునభామండపంబునఁ బసిండిపలకయు సారెలుం బాచికలును నమర్చి.

క. ద్యూతమునకు బలభద్రునిఁ బ్రీతిసమేతంబుగాఁగఁ బిలుచుటయుండ.
ద్ద్యూతాధికకుతుకుండై, యాతఁడు దత్కితవగోష్ఠికై యేతెంచెన్.

వ. దాక్షిణాత్యు లందఱుం గూడి రుక్మి నతనితో నాడుటకు నియోగించి విశదముక్తామణిబహుళహేమరాసులు పణంబుగాఁ దెప్పించి జూదంబునకుం దొడంగి రంత బలదేవుండు.

తే. పసిఁడిమాడలు పదివేలు పణము గాఁగ, నొడ్డెనొడ్డిన నాడి యత్యుద్ధతుండు
గెలిచె వైదర్భుఁ డతనినయ్యలఘుచిత్తుఁ, డోడెనంత పసిండియు నొడ్డిమఱియు.

క. ఆపలకయు రుక్మి సము, ద్దీపితుఁడై గెలిచె నలుక దీపింపఁ జలం
బేపార నిట్లు పలుమఱు, నోపిక నాడుచును బలుఁడ యోడుచువచ్చెన్.

వ తదనంతరంబ కోటిసువర్ణంబులు పణంబు సేసి యాడి రౌహిణేయుండు జయంబు నొందిన నవ్విపక్షుం డక్షధూర్తశ్రేష్ఠుండు గావునం గడంక నార్చి.

క. బలభద్రు నక్షవిద్యా, బలవిరహితు దుర్జయప్రబలసత్త్వధనున్
గెలిచి బహుసంఖ్యహేమా, వళు లిటె యేఁగొంటి ననుచు వడిఁ బలుకుటయున్.

వ. అప్పలుకులకుం దోడ్పడి కళింగరాజును నిది యట్టిద యని దంతపఙ్క్తి వెలిగా వెలయం గలకల నవ్వె నవ్విధంబు నాగడంబునకుఁ గోపం బెత్తియు మెత్తనఁ జిత్తంబు నియమించియునయ్యుత్తవిక్రమోద్దాముండగురాముండుసభికులఁజూచి.

క. తా నిది గెలిచితి ననియెడు, నేను గెలిచి యుండ నీతఁ డిది యేటికి మీ
రేనెఱికి నిజము సెప్పుఁడా, నానొకరును బలుక రైరి నమితానను లై.

వ. భీష్మకాత్మజుండు మఱియును.

క. ఇందేమియునుం గలదే, సందియ మస్మజ్జయంబు సత్యము నీవీ
పొందొందనిపలుకులు పలు, కం దగునే యోడి యకట కక్కుఱితి మెయిన్.

తే. అనిన కేవలకపటోక్తి విని యొకటియు, ననక యూరకయుండె నయ్యదువరేణ్యుఁ
డప్పు డాకాశవాణి యయ్యందఱకును, వినఁగనయ్యెడుకొలఁది నిట్లనియెఁ దెలియ.

క. నిజముపలికె నూలధరుఁ డితఁ, డజితుఁడు వైదర్భుమాట యాహతము మహా
భుజులు మహీభుజు లిట్లగు, నెజపాకృతితోడఁ దగవు నెఱపక యుండన్.

జూదంబున నన్నృతంబాడిన రుక్మనింగళింగుని బలరాముఁడుదునుమాడుట

వ. అనినఁ దద్వచనంబు లాకర్ణించి మూకులై యున్న యచ్చోటిదొరలం జూచి సైరింపక సీరాయుధుండు సంరంభంబున సముత్థితుండై పటుముష్టిపాతంబున రుక్మిం జదిపి యుఱికి నెత్తపలక యెత్తి కాళింగుఁ దలపగుల నడిచి చంపి యంత నిలువక.

క. అడిదంబుఁ బెఱికి త్రెవ్వఁగ, నడిచెం బలువుర మహారినరనాయకులం
బొడిసేసెం గొందఱఁ దన, కడిమికిఁ బెఱవారు సెదరి కనుకనిఁ బఱవన్.

వ. ఇట్లు మత్తదంతావళంబు విడివడి యనర్గళక్రీడం గ్రాలుచందంబునం జరియించి రుక్మిం గొప్పుపట్టి సభాద్వారంబునందాకఁ దిగిచి నిహతప్రాణుంజేసి విడిచి నిజ శిబిరంబునకుం జని జనార్దనున కవ్విధం బెఱింగించిన

ఉ. కాదనియల్ల కానసవికాసము నొందక యూరకుండె దా
మోదరుఁ డమ్మహాభుజునియుగ్రభుజావిభవంబు సర్వమున్
యాదవు లొక్కరుమై బహువిధాభినవస్ఫుటవాక్యదర్శితా
హ్లాదవిశేషులై పొగడి రాబలదేవుఁడు నిచ్చఁ గైకొనన్.

వ. అంత నయ్యందఱు గోవిందపురస్సరులై నిర్వికారప్రకారంబునఁ గన్యాకుమారులం దోడ్కొని పురంబునకుం జనుదెంచి సమ్మదంబునం బొదలి రని వైశంపాయనవ్యాఖ్యాతం బైనవాక్యజాతం బభిజాతార్థసమర్థంబుగ.

స్రగ్ధర. ధీరప్రజ్ఞావికాసా దివిజపతియశస్తేయసంపద్విలాసా
వీరప్రాధాన్యధన్యా వినయజితమహావిద్వదిచ్ఛావదాన్యా
భీరుత్రస్నాభృచ్ఛరణ్యా పృథుభుజశిఖరస్ఫీతభూగణ్యపుణ్యా
మేరుప్రస్ఫారసారా మితహితవచనస్మేరరేఖాగభీరా.

క. ధీయుక్తమల్లరథినీ, నాయకమంత్రప్రయుక్తనయపూర్వకకా
ర్యాయత్తఖడ్గవిభవ, స్ఫాయద్విభవాభిపోష భాసురవేషా,

మాలిని. జలధివలయసేవాశాలినిర్నిద్రకీర్తీ
విలసదలసవామావీక్షితానద్యమూర్తీ
లులితవిమతహేలాలోలఖేలత్కృపాసీ
లలితవినయవిద్యా లాభశశ్వద్విభాసీ.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానంద సౌందర్యధుర్య సుకవిసంభవ శంభుదాసలక్ష్మణాభిధేయ యెఱ్ఱయ నామధేయ ప్రణీతం బైన హరివంశంబున నుత్తరభాగంబునందుఁ దృతీయాశ్వాసము.

---

ఉత్తరభాగము - చతుర్థాశ్వాసము.

క. శ్రీమద్ధ్యాంధ్రనుదేశ, క్షేమంకరవాల సుగుణకీర్తితగుణలో
లా మంజులవాగ్జాలా, వేమక్షితిపాలనిత్యవిజయసుశీలా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నవ్విధంబున బలభద్రునుద్రేకం బాకర్ణించి యాపూర్ణవిస్మయస్తిమితహృదయుండై జనమేజయ మేదినీశ్వరుండు వైశంపాయనమునీశ్వరున కిట్లనియె.

మ. జగతీచక్ర మశేషముం బృథుఫణాచక్రంబునం దాల్చి దై
త్యగణోన్మర్దనుఁ డాజనార్దనుఁడు దాన్దై మానసీయోన్నతి
న్నిగమాంతస్తుతిఁ బేర్చు శేషుఁడు భువిన్ లీలాకృతిం దాల్చె నాఁ
దగునీలాంబరుపేర్మి యేను వినుటన్ ధన్యుండఁ బుణ్యవ్రతా.

వ. ఇంకను నమ్మహాభాగుభాగధేయంబులు విన వేడ్కయయ్యెడు వివరింపుమనినఁ గృష్ణద్వైపాయనశిష్యుం డావిక్రమగుణవిశేషున కిట్లనియె.

క. బలమున ననదృశుఁ డగునా, బలదేవుబలోదయప్రభావములు వేవో
బలశాలి యనఁగఁ బరఁగిన, బలరిపుగురునకును బొగడ భరము నరేంద్రా.

వ. అయినను మదీయబుద్ధివాక్యప్రచారంబులకు గోచరంబు లైనవి వినిపించెద.

తే. అఖిలరాజన్యసహితుఁడై యరుగుదెంచి, యతనిఁ దొడరి జరాసంధునట్టిజెట్టి
ఘనగదారణమున నేమిగతి విహీనుఁ, డయ్యె నదిమున్ను నీవిన్నయదియెకాదె.

మ. కుదినేలేనుఁగులంతలావున భువిం బ్రఖ్యాతుఁడై నట్టిదో
ర్మదనిర్ముద్రుఁడు భీముఁ డాతనికి సమ్యగ్విద్యలన్ శిష్యుఁడై
యుదితోత్సాహతఁ గౌతుకాహవములం దొక్కొక్కచో నయ్యశో
విదితు న్మార్కొని యోడుగాఁడు కడఁకన్ వేమార్లకుం బోరికిన్.

వ. దుర్యోధనుండు తనకూఁతుం గృష్ణతనయుం డగుసాంబుం డెత్తికొనిపోవ వెను
కొని యెయిది పట్టి తెచ్చి హస్తినగరంబునం జెఱవెట్టిన నవ్విశేషం బెఱింగి సై
రింపక సంకర్షణుండరిగి పురబహిరంగణోపవనంబున నిలిచి తొలుత సామంబు
ప్రయోగించి తత్ప్రకారంబు కౌరవులు గొనక నిరాకరించిన విజృంభించి.

మ. పౌరశ్రేణులతో నశేషకురుభూపాలాన్వయశ్రీలతో
నాలూఢోన్నతపప్రహర్మ్యతతితో నవ్వీడు దుర్వారగ
ర్వారంభంబున గంగలో వయిచువాఁడై ఘోరసీరంబుప్రా
కారాంతంబునఁ జొన్పి పెల్లగిల నుగ్రక్రీడమైఁ దివ్వఁగన్.

తే. తలఁకికురుపతితాను జుట్టలును సాంబుఁ, దెఱవతోఁ దగఁ గొనివచ్చి తేర్పుటయును
దేజెలబలదేవుఁ డన్నరదేవుఁ డతని, నాత్మగురునిఁగ వరియించి యర్చలిచ్చె.

వ. ఇట్లు గదాపరిశ్రమంబునందు సుయోధనుండు రామశిష్యుం డగుట జగత్ప్రసిద్ధం
బయ్యె నాటనుండియు హలిహలాకర్షణంబున హస్తినాపురం బొకదెస నొడ్డ
గెడవై యుండు నిది యయ్యమునావిభేదను భుజసత్త్వప్రభావంబు ప్రలంబధేను
కముష్టికహననంబు మొదలుగా మున్ను నీవాకర్ణించితి మఱియు నతనిపౌరు
షంబు లనేకంబులు గల వవి త్రిభువనఖ్యాతంబు లనుటయు జనమేజయుండు
మునీంద్రా యుపేంద్రుండు విదర్భనగరంబుననుండి చనుదెంచినపిమ్మట నెమ్మెయి
వర్తనంబునం జరియించె నని యడుగుటయు నవ్వాగ్మివరుం డిట్లనియె.

సీ. ద్వారకాపురమున దానవాంతకుఁడు యోగక్షేమశాలియై కరుణ నఖిల
జగముల రక్షించుసన్నాహమున నున్నయాసమయంబున నసురయొకఁడు
వనరుహాసనదత్తవరసముద్ధతుఁడు ప్రాగ్జ్యోతిషపతి నరకుండు నాఁగ
ధారుణీదేవికిఁ దనయుండు సర్వదేవతల కవధ్యుండు దితిజవంశ
మంతటికిఁ దానయొడయఁడై యదటుమిగిలి, యెల్లలోకంబులకుఁజాలనెగ్గుసేయ
నంతయునువినికింకఁ జక్రాయుధుండు, దివిజరిపుఁగూల్చిమహిమనుద్దీప్తుఁడయ్యె.

వ. అమ్మహాదనుజుండు మహేంద్రాదులఁ బరిభవించి పదంపడి కంసమథనుకడిమి
కగపడి మడిసినకథయును సవిస్తరంబుగాఁ వినిపించెద వినుము.

క. సురదైత్యాదులదిక్కునఁ, బరాజయము రాకయుండఁ బద్మభవునిచే
వరము గొని క్రొత్తసిరిపస, సురారసమువ్రాలె నొడలు సొచ్చికలంపన్.

వ. అప్రమేయుఁడై తేయసేనాసహాయుండై కడంగి యానరకాసురుండు.

చ. తొలితొలి యేగి భూరిభుజధుర్యత యొప్పఁగ నింద్రుపీటివా
కిలితలుపుల్ ప్రగాఢపరికీలితముష్టిహతిం బగిల్చి వే

వెలలుము కయ్య మిమ్మని సవేగసముద్ధతసింహనాదసం
కలితముగాఁగఁ బిల్చుటయు గ్రక్కున వెల్వడియె న్మహేంద్రుఁడున్.

వ. అట్టియెడ.

ఉ. అంభోదద్విరదంబుపైఁ బ్రబలవజ్రాభీలహస్తంబుతో
గంభీరోన్నతరూపభీమపటురేఖం గ్రాలువీరాగ్రణిన్
జంభారిం గని చీరికింగొనక యస్త్రవ్రాతపాతోగ్రసం
రంభుండై దనుజుండు దాఁకెఁ గడఁకం ద్రైలోక్యమున్ ఘూర్ణిలన్.

క. ధరణీతనూజుఁ డేయఁగఁ, బురందరుఁడు గులిశనిహతిఁ బోఁగన నమ్ముల్
పరిహృతములు సేయఁగ న, య్యిరువురవెరవును సమగ్రపేలం బయ్యెన్.

క. యమవరుణకిన్నరేశులుఁ, దమతమసైన్యములతోడఁ దద్దయు వెసఁ ద
త్సమయమునఁ గూడుకొనిర, య్యమరాధిపు నఖిలసురసమాజసమేతున్.

వ. హయగ్రీవనిశుంభమురాభిధాను లగుదానవనాయకులు మువ్వురు నరకునకుం బాసటయై వాసవసహాయు లగునమ్మువ్వురు లోకపాలురం దలపడి రట్టికోత్తలం బేర్చి సర్వాదిత్యులు నశేషదైత్యులం దాఁకినఁ గయ్యంబు కడిందియై చెల్లె నందు రెండుదెఱంగులవారు నొండొరులఁ దూపుల నఱకియుఁ జాపంబులు ద్రుంచియుఁ దూణంబులు వ్రచ్చియుఁ గృపాణంబులు నుఱుమాడియుఁ గంకటంబులు సించియు నెఱఁకులు నొంచియు వాహనంబులు వికలంబులు సేసియు దేహంబులు తూలించియు నాభీలవిక్రమంబున విజృంభింప నమ్మహాసమరంబున.

హయగ్రీవ నిశుంభ మురాసురులతో వరుణ యమ కుబేరులు పోరి పాఱిపోవుట.

సీ. అంబుధీశ్వరుఁడు హయగ్రీవు నుగ్రబాణపరంపరాహననమున నొంప
నాతఁ డాతని ననేకాంబకంబులఁ బరిపీడితుఁ గావించి బెట్టిదంపు
భల్ల మొక్కంటను విల్లు ద్రుంచుటయును వరుణుఁడు ఘోరదుర్వారభుజగ
పాశంబు లమరారిపైఁ బ్రయోగించిన నవి ప్రచండాకృతిఁ గవియుదేర
నసురయంతంతఁ బట్టి యత్యద్భుతముగ, మగుడ వైచి యంతటన యున్మాదలీలఁ
బృథుగదాదండమున శిరోభిద యొనర్పఁ, దూలి నెత్తురుగ్రక్కుచు నేల కొఱగె.

వ. పశ్చిమదిశాధీశుండు నిశ్చేతనుండై నట్లుండి యాలోనన గ్రక్కున నంకిలిదేఱి మీఱినభయంబునఁ గయ్యంబున నిలువలేక యెక్కడనేనియుం గాడుపడిపోయె దైతేయుం డెగువం దదీయసైన్యంబు దైన్యంబునఁ జెల్లాచెదరై పఱచె నప్పుడు.

తే. పంచవింశతిశరముల నొంచె నంత, కుని నిశుంభుఁడు జముఁ డుగ్రధనువు దాల్చి
యేసె నొకవాలుఁదూపున నింద్రవైరి, నతఁడు వెసఁ ద్రుంచె నతనిశరాసనంబు.

క. విలువిఱిగినఁ గాలుఁడు గ, ట్టలుకం దనతీవ్రదండ మతిరయమునఁ జె
న్నలవడఁ గైకొని కవిసెం, బెలుచ నహితుమీఁద నఖిలభీషణరేఖన్.

చ. దనుజుఁడుఁ జేతివి ల్విడిచి తానొకఖడ్గము దాల్చి ప్రేతనా
థున కెదురై కడంగుటయు దుర్దమదండకృపాణు లైనయ
య్యనసుతదైత్యపుంగవుల కిద్దఱకున్ సమరంబు ఘోరమై
తనరెఁ గుతూహలైకభరితస్థితి నయ్యిరువాగుఁ జూడఁగన్.

క. కొండొకసేపునకుఁ గదిసి, దండధరుఁడు దనప్రచండదండమున శిరం
బొండొండ వ్రేయుటయు ను, ద్దండతఁ జీరికిని గొనక దర్పోద్ధతుఁడై.

తే. అసురభటుఁడు నిస్త్రింశంబునాయితముగఁ, బట్టితత్కాంతికాళిమపరఁగి దెసల
నంధతమసంబుఁ బుట్టింపనర్కతనయు, తనువు వ్రేసె నందందనెంతయును గినుక.

చ. అడిదపువ్రేటునం బఱియ లైనశరీరమునందు నెత్తురుల్
సాడసాడఁ గ్రమ్మ నెమ్మనము సొమ్మలు పైకొన నూర్పు లొక్కమై
నిడుదలు గాఁగఁ బ్రాణములు నిల్వక తల్లడిలంగ సంగరం
బుడిగి కృతాంతుఁడేగెఁ దనయూరికి సేన కలంగి పాఱఁగన్.

వ. కైలాసనాథసఖుం డమ్మురాసురుం దొడరి పెనంగునెడ మాణిభద్రప్రముఖు
లగుయక్షరాక్షసు లనేకు లతనిం దెలకడచి దానవులం దాఁకి వివిధాయుధం
బుల నాయోధనం బధికదారుణంబుగా నొనర్చిన నలిగి యతండు.

మ. ప్రణుతంబై నిజచాపకౌశలము దీప్తస్ఫూర్తి శోభిల్లఁగా
గుణనిర్ఘోషము సర్వపర్వతగుహాక్రోడంబుఁ బీడింప భీ
షణబాణౌఘములన్ విరోధిరథినీసంఘంబుపై నొక్కమై
గణనాతీతముగా నిగిడ్చె జగము ల్గంపింప దోస్సంపదన్.

క. ఆయంపపదువు పొదివినఁ, జేయార్పఁగ లేక ధనదసేనాగ్రసరుల్
పాయవడి విభుని విడిచి పలాయనపరులైరి మనసులందుఁ దలఁకుచున్.

తే. దొరలువిచ్చిన నొంటిమై తిరుగనేర, కున్నకిన్నరనాథు నయ్యుగ్రదైత్యుఁ
డేసెఁ జేతులతీఁటవో నేపు మిగుల, దారుణంబుగఁ గ్రొవ్వాఁడినారసముల.

చ. ఉరమున మూఁపుల న్నుదుట నొక్కటఁ గన్నులఁ గప్పచుం బరం
పరలయి తత్ప్రయుక్తపటుబాణచయంబులు బెట్టు నాటినం
దిరిగి కలంగి యెంతయును దీనత నర్థవిభుండు వోయె ము
న్నరిగినయాత్మభృత్యనివహంబులజాడన రాజతాద్రికిన్.

వ. ఇవ్విధంబున మువ్వురులోకపాలకులు నుక్కుదక్కిన దేవసైనికులు దేవేంద్రు
దెస నిరాశులై పఱవ శతమన్యుండు విద్రుతసైన్యుం డయ్యును ధైర్యంబు

నొండక మందరప్రమాణం బగునైరావణంబు నరాతిబలంబుపైఁ గొలిపి కలహా
కలనాత్తమంబును నక్షయబాణతూణంబు నగుబాణాసనంబు గైకొని మౌర్వీవిరావ
విజృంభణంబు దంభోళిధ్వనితంబుపోలికం ద్రైలోక్యాకంపనం బొనరింప నకం
పితరభసంబునం బగఱ మొనలమీఁదఁ గడంగినం గని నరకాసురుండు.

మ. ఇటరట మ్మే నిదె యున్నవాఁడ నని గంధేభంబు గంధేభముం
బటురోషంబునఁ దాఁకుభంగి భుజదర్పం బేర్పడం దాఁకి ది
క్తటముల్ వ్రయ్యఁగ నార్చి కార్ముకగుణాఘాతధ్వనుల్ సర్వసం
కటదుర్వార్యస్ఫూర్తిఁ జెలంగ శాతశరముల్ గ్రంసింగి మేఁ గ్రుచ్చినన్.

సీ. అఖిలగాత్రములు రక్తాక్తంబులై నొవ్వ దనికినఁ గినిసి శతక్రతుండు
విశిఖాష్టకంబున విద్వేషి నొంచి డెబ్బది బాణముల రథబంధనంబు
నెడలించి కేతువు నేకాస్త్రమునఁ ద్రుంచి సారథిఁ దొమ్మిదిసాయకముల
సమయించి హయములఁ జతురంబకంబులఁ గూల్చి విల్లొక్కటఁ గూలనడఁకి
విరథుఁడు హతాయుధుండునై సురవిరోధి, యుగ్రఖడ్గంబుగొనివీఁక నుఱికియుఱక
ద్రేసె నైరావతంబును వెసఁబలారి, యురమునుద్దామహతి వ్రచ్చియుబ్బి యార్చె.

మ. కరవాలక్షతి స్రుక్కి యేనుఁగొఱలంగాఁ దాను గ్రొవ్వేది ని
ర్భరవక్షస్స్రుతరక్తసిక్తుఁ డగుచుం బైపైని నిశ్వాసముల్
పరఁగ న్మూర్ఛలు పైకొనంగ దివిషత్పాలుండు వేతూలి సం
గరరంగంబు దొలంగి పోయె రిపుసంఘం బార్వ నెందేనియున్.

నరకుఁడు దేవలోకం బాక్రమించి యదితికుండలంబు లపహరించి యచ్చరలఁ జెఱగొనుట.

క. అమరేంద్రుఁ దోలి భూసుతుఁ, డమరావతి సొచ్చి యచటనచటఁ దనజయం
బమరభవనంబు లన్నిటఁ, గ్రమమునఁ జాటింపఁ బనిచెఁ గడుమోదమునన్.

వ. వాసవసింహాసనం బెక్కి యూర్వశి రావించి భావం బనురాగతరళంబుగా నత్త
రళనయనతోడ.

మ. వరుణుం దోలితి నర్థపుం జదిపితిన్ వైవస్వతున్ గెల్చితిన్
హరిఁ బోఁ జోఁపితి నేన యీశ్వరుఁడ సర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు మెచ్చు ల్మీఱ నీవింక స
న్నరవిందానన సత్కరింపుము మనోజానీకసంక్రీడలన్.

చ. అనుటయు నమ్మృగాక్షి యిది యట్టిద యంతటివాఁడ వైన నీ
పెను పసదే తలంప రిపుభేదన సంయమికోటి భక్తితో
నిను నఖిలాధ్వరంబులను నిత్యసమర్చితుఁ జేసిరేని నే
నును ముద మొప్పఁ గైకొని వినూత్నవిహారరసాబ్ధిఁ దేల్చెదన్.

వ. అంతటిమహత్త్వంబు గని నన్నుం గామింపుమనిన నట్లకాక యనియనంతరంబ యతండు.

సీ. సురపతివీడెల్లఁ జూఱాడి సురతరుకోటి యున్మూలించి కొని సుమేరు
రత్నంబు లన్నియుఁ ద్రవ్వితండమ్ములు గొని సురకన్యల వినుతరూప
యౌవనగర్విత లగువారి నెనిమిదివేలను జెఱగొని వేఱయొకతె
విశ్వకర్మనికూఁతు విశదలావణ్యసముజ్జ్వలఁ జేకొని మూఁరిఁబోయి
యదితి దేవికుండలము లనర్ఘరత్న, శోభితంబు లెవ్వారికిఁ జూడఁగోరఁ
గొనఁగరానివి హరియించి కొర్కి నిండఁ, ద్రిదివభూమి వెల్వడియెనుద్దీప్తుఁడగుచు.

వ. ఇట్లు వెలువడి మగిడి నిజపురంబునకుం జనుదెంచి యనుచరులం జూచి.

క. ఈపదునాలుగుజగముల, నేపగిది సువస్తుకోటి నెచటఁ గనిన మీ
రోపి కొనివచ్చి నన్నుం, బ్రాపింపఁగఁ జేయుఁ డిదియ పని మీకింకన్.

వ. అనిన నతనియాజ్ఞ ననేకదానవులు సకలదిక్కులం జరియించి సర్వజీవులకుం
బరిపీడనంబు గావించి సమస్తవస్తువులం జూఱగొని యశేషపురుషులం బరిభ
వించి సముచితరూపవిభవాభిరామ లగురామలం జెఱలు దెచ్చి యొప్పింప నప్సర
స్త్రీలు గలయంతవట్టువారునుం బట్టువడిరి పదియాఱువేలునూర్వురు గంధర్వ
కన్యకలు సేపడిరి యక్షకాంతలు లక్షలసంఖ్య లగపడిరి కిన్నరసిద్ధసాధ్యవిద్యా
ధరసుందరు లిందఱిందఱ ననికొలందియిడ రా దిట్లందఱు నేకవేణీధారిణులు నన
వరతాగళితబాష్పలోచనలు నజస్రనిశ్వాసవ్యాకులితవదనలునై యుండ నింత
టికి నధిష్ఠానంబై తదీయరాజధాని యగుప్రాగ్జ్యోతిషంబు విద్యోతించె నవ్వీటి
నాల్గుపొలిమేరలకుం గావలియై మురహయగ్రీవనిశుంభపంచజను లనుదనుజు
లనేకంబు లగునసీకంబులతో సమీకరసైకాయత్తచిత్తతం దనరుచుండ ము
రాసురుండు సుతసహస్రంబుకలిమిఁ గరంబు బలిమిం బెంపారి ఘోరంబు లగు
పాశంబు లాకాశావలంబితంబులయి వ్రేల్లఁ దెరువుల నరికట్టి యెట్టివారికిం
జొరవ యీక యొసంగు నీదృశసన్నాహదుస్సహుం డగునమ్మహాదనుజుండు
మనుజలోకంబు గెలుచు తలంపునం గడంగి.

మ. భువి నెచ్చోటఁ జరించి పూజ్యయజనంబు ల్గాసిసేసె న్మహీ
దివిజశ్రేణి వధించెఁ దాపసుల బాధించె న్నరేంద్రావలిన్.
వివిధోపాయములం గలంచెఁ బ్రజల న్వేమాఱు గారించె ధ
ర్మవిరోధంబది యొక్కఁడుం దనకుఁ గర్తవ్యంబుగాఁ జూచుచున్.

వ. ఒక్కనాఁడు బదరీవనంబునం బుణ్యయజనతత్పరులై కూడియున్నతపస్విపుంగ
వులం బెక్కండ్రం గాంచి యూర్వశివాక్యంబు దలంచి వారిం జేర నరిగి,

ఏవానిగుఱిచిచేసెద, రీవిధి యనుటయును వారి లింద్రుఁడు యజమా
నావలికి నిజ్యుఁడాఁతని, కై వేసంబులు విధించె నఖిలక్రియలన్.

క. కావున నస్మదనుష్ఠానంబు తదీయోద్దేశంబునం జెల్లుచున్నది యనినఁ గోపంబు
తోఁడియేపున న వ్వేల్పు నవ్విప్రులం జూచి.

చ. యముఁడు కుబేరుఁ డబ్ధిపతి యాదిగఁ గల్గినదేవకోటితో
సమరవరేణ్యు నూర్జితభుజాతిశయంబున భగ్నుఁజేసి త
త్సమధికరాజ్యవైభవము సర్వముఁ జేకొని యున్నవాఁడ వి
శ్వమునకు నేన కాక పెఱవాఁ డొడయండు గలండె యెప్పుడున్.

తే. నన్నుఁ గొలువుఁడు మ్రొక్కుఁడు నాకు సభిమ
తాధ్వరంబులు మత్ప్రీతికై యొనర్పఁ
డేన కడుమేలుసేయుఁ జెల్లెన నెపుడు
నొండు తెఱఁగులపనులు మీ రుడుగుఁ డనిన.

చ. మును లిది యేటిమాట జగముల్ పరిపాలనసేయఁ గర్తయై
తనరుమహేంద్రుఁ డుండ నిను దానవు దుష్టమనస్కు నల్ప నే
మనయము గొల్చువారమె యనర్హవిధం బిది యన్నఁ గన్నులం
గినలునఁ గెంపు పెంపెసఁగ నసురాధముఁ డాక్షణంబునన్.

వ. తనబంట్లం బిలిచి యిప్పాఱులు క్రొవ్వి వెఱయఱపు లఱచెదరు పీంద్రు డొడం
గినయిప్పని గాసిసేయుం డనిసం గని యార్చుచుం బేర్చి.

సీ. యజ్ఞశాలలు వ్రచ్చి యగ్ని కుండంబులు ఫగాడ్చి పశుశ్రేణి ద్రూడ్చి విడిచి
హోతలఁ బ్రామియు ద్గాతలఁ బోరిగొని యుపదర్శకుల సదస్యులనుమోఁది
యరణులు గాల్చి యూపావలి విఱిచి దర్భలు స్రుక్స్రువములును బాఱవైచి
చరువులు భక్షించి సర్వాన్నరాసులు వెదచల్లి సోమంబు పదటఁగొలిపి
తాపసస్త్రీలఁ జెఱిచి తత్కన్యకాచ
యంబు జెఱపట్టి యజమానులైనవారి
జడలు మ్రాఁకులతోఁగట్టి చదియ నడిచి
యాప్రదేశమంతయుఁ దారయై యసురులు.

వ. కొంతవడి విచ్చలవిడింద్రుళ్లి రిట్లు సేయించి తన్నుం గృతార్థకర్తవ్యుంగాఁ దలం
చుచు నిలింపమర్దనుండు మగిడి ప్రాగ్జ్యోతిషంబున కరిగె నిట వసిష్ఠుండు వాసు
దేవుండు కాశ్యపుండు కణ్వుండు జాబాలి భరద్వాజుండు మంకణుండు మొద
లుగా ననేకమహామునులు తమక్రియాకలాపంబులు విఘ్నంబు నొందుటకు నధి

కతిపస్థిన్నరు లగు బ్రాహ్మణులు పరిపీడితు లగుటకుఁ బాతివ్రత్యభూషణం బ
యోషిద్గణంబు దూషణంబునం బడుటకును డెందంబు లెరియ నందఱుంగూ
ర్చి విచారించి.

క. ఈచందంపు చెయిది యి, స్సీచుఁడు ప్రసరించె నేని నిఖిలజగంబుల్
వేచెడు మన కిఁక నెక్కఁడు, గాచు ప్రభుఁడు లేకయున్నఁ గలవే బ్రతుకుల్

ఉ. అడియాసం దొలఁగంగఁజాల మిటు ఘోరావస్థపాలై తి మే
ల్పడఁ దై త్రిలోక్యము గావఁబూని యవతారక్రీడ గైకొన్నవాఁ
డొడయం డావసుదేవసూనుఁ డజుఁ డాద్యుం డచ్యుతుం డాతనిన్
గడుభక్తిన్ సముపాశ్రయింపఁగ నగుం గల్యాణ మెబ్భంగులన్.

క. ద్వారవతి కేగి మనమీ, దారుణవిధి సెప్పఁదడవఁ దడయక కడిమిన్
దారకుఁడై కడఁగు ను, దారపరాక్రముఁడు చక్రి దయదళుకొత్తన్.

వసిష్ఠాది మహర్షులు ద్వారకకువచ్చుట.

వ. ఇంక నాలస్యం బేల లెండు గదలుం డని పయనంబున కాయితంబై యందఱు
వృద్ధపురస్సరంబుగా దక్షిణాభిముఖులై నడచి యెడనెడఁ బుణ్యతీర్థంబుల సేవ
సేయుచు దైత్యావమానదూనంబులై నమానసంబుల సేదదేర్చుచు భాగీరథి
సేరి యందు దభిషిక్తులై సర్వప్రాయశ్చిత్తంబులు గని యంతటనుండి నిత్యప్ర
యాణంబులం జని.

సీ. త్రిదివంబుకంటె నుద్దీపితంబై విశ్వకర్మమానససృష్టి కలన నగుట
యంభోధిపరిఘమై యలరార దేవతాదులకు నసాధ్యంపుదుర్గ మగుట
తనునేలువాఁడు నిత్యస్థిరలక్ష్మితోఁ బ్రాణేశుఁడై జగద్భర్త యగుట
హరుకోపశిఖఁ గ్రాఁగి యడఁగినమదనుండు తనయుండుఁ దనుసిద్ధి ధన్యుఁ డగుట
దనక కాని వేఱ ధరణీతలంబున, నితరనగరములకు నెందు లేక
యుల్లసిల్లియు ననుపమోదాత్తదీప్తమై, పొలుచుయాదవేంద్రుపురము గనిరి.

వ. కని తదీయవిభూతికి నద్భుతంబు నొందుచుఁ గృతప్రవేశులై యందఱు రాజమా
ర్గంబున నల్లన నరిగి నగరివాకిట నిలిచి పడిహారితో బదరీవననివాసు లగుతప
సులు వచ్చినారని దేవరకు విన్నపంబు సేయుండనిన వారు లోపలికిం జని యవ్వి
ధం బెల్లఁ దెల్లంబు సేయుటయు.

క. మునివిభులరాక విని తన, మనమున సంభ్రమముతోడ మధురిపుఁడు కుమా
రునిఁ బ్రద్యుమ్నుని నెదురుగఁ, బనిచెన్ దదనునయమునకుఁ బరమప్రీతిన్.

తే. అతఁడు వారి నెదుర్కొని యాదరమున, సంప్రవేశంబు నడపఁగ సౌమ్యచరితు
లరుగుదెంచి సుధర్మాఖ్య యగుమనోజ్ఞ, దివ్యసభ నున్నయట్టి యాదేవుపూజ్యు

క. యాదవులుఁ గుమారులును మ, హాదేవ్యుత్తములు వృద్ధహితమంత్రులు స
మ్మోదమున బలసికొలువ మ, హాదీప్తాసనముమీఁద నలరుమహాత్మున్.

సీ. నీలాద్రిఁ దనరుమాణిక్యపుశిఖరంబుక్రియ రత్ననూత్నకిరీట మెసఁగ
గగనంబునడిమిచక్కటి నెప్పునరుణాంశుకరణిఁ గౌస్తుభము వక్షమున వెలుఁగ
జలరాశిఁ బొదివినసాంధ్యపయోదంబుక్రమమునఁ బీతాంబరము దలిర్ప
మేచకాభ్రంబున మెఱయుసురేంద్రచాపములీల వనమాల ప్రస్ఫురిల్ల
నల్లనునుఁజాయమే నెప్పఁ దెల్లదమ్మి, విరులసిరిగన్నకన్నుదోయురుదుగాఁగ
నమరుజగదీశు సకలహితార్థజన్ము, జన్మవిరహితు వసుదేవజాతుఁ గాంచి.

ఎ. ఆనంద శీతలతనులై యంతంతం దమలోన.

ఉ. అక్కఱ లెల్లఁ దీర్చి జను లందఱఁ బ్రోచుటకున్ బ్రసన్నుఁడై
యిక్కరుణాకరుం డిచట నిల్చెలరారఁగ నింతకాలమున్
రక్కసుచేత నక్కట పరాభవ మొందితి మెవ్విధంబులన్
నెక్కొనకున్నె మర్త్యులకు నిక్కము ప్రాక్తనభోగ్యకర్మముల్.

వ. అదియునుంగాక.

మ. పరమాత్మున్ హరిఁ జూతమంచుఁ గనుదెప్ప ల్మోడ్చి లోలోన వే
తెరువుల్ వాఱుమనంబుఁ బట్టి బలిమిన్ దివ్వంగఁ దివ్వంగ దు
స్తరదుశ్శాసిక యయ్యెఁ బూర్వవిధి ప్రత్యక్షంబుగా నిమ్మహా
పురుషుం గంటిమి నేటనుండి సుకరంబుల్ సిద్ధపారంపరుల్.

క. తపము తప మనుచు నడవుల, నుపగతజడబుద్ధి మనికి యొందఁగ హరిఁ జూ
నుపకారంబయ్యె రిపుని, యపకారం బిట్టిభాగ్య మబ్బుటకి తనన్.

వ. అనుచుం గదియఁ జనుదెంచుటయు జనార్దనుండు ససంభ్రమంబుగా సముత్థి
తుండై సంయమిసమితికిం బ్రణామంబు సేసి యాసనార్ఘ్యపాద్యమధుపర్కం
బులఁ బరిపాటితోడం బూజ యొనరించి తదనుమతి నాత్మీయం బగునాసనం
బున నాసీనుం డయ్యె వృష్ణ్యంధకభోజవరులును వారలకు నమస్కరించి యథో
చితస్థానంబుల నుండి రప్పుడు కృష్ణుండు కృతాంజలియై యమ్మహామునుల
కిట్లనియె.

క. క్రతువులు నిర్విఘ్నములే, శ్రుతములు ధృతములె యసన్నిరుద్ధములె మహా
వ్రతములు తపములును ననుప, హతములె కత మేమి యుష్మదాగమమునకున్.

మ. పరమబ్రహ్మహితైకబోధమహిమం బ్రాజ్యంబు మీయోగభా
స్వరసామ్రాజ్యము ధర్మనిత్యము భవత్సత్యంబు మీ రీయెడన్

పరిపూర్ణాత్మకులార నేఁడు నను సంభావ్యాన్వయాదగ్రుఁగాఁ
గరుణింపంగఁ దలంచు టొక్కటియగాఁ గర్జంబు మీరాకకున్.

తే. అయిన నిత్తఱి నెయ్యది యైనమీరు, నన్న మాజ్ఞాపనము సేయుఁ డత్యుదాత్త
హృదయులార యెవ్విధినిర్వహింపనుత్సు, కంబులైనవియంతరంగములు మాకు.

క. అని గోవిందుఁడు పలికిన, యనుపమరసభరిత మంజులాలాపనపూ
జనముఖ్యక్రియతో న, మ్మును లందఱు సంప్రముదితమూర్తులు వెలయన్.

క. తమ తెచ్చినబదరీఫల, సముదయముల శిష్యహస్తసంపుటముల నా
కమలోదరునకు నుపహా, రముగ సమర్పించి భక్తిరాగాన్వితులై

వ. అంజలిపుటంబులు రచియించి దేవా యివి నీవు తొల్లి నరసఖుండవై విహ
రించినపుణ్యాశ్రమంబునందలితరువులవలన నానీతంబులైనవి నిచేతం బూర్వ
భుక్తంబైనపదార్థం బిప్పుడు నీకుం గానుక గావించితిమి మావచ్చిన కార్యం
బంతయు దత్తావధానంబుతో నాకర్ణింపుము.

క. ధరణీదేవితనూజుఁడు, నరకుఁడు నా నసురవంశనాయకుఁడు పురం
దరహృద్రోగసముద్యముఁ, డరియంగా సిద్ధసాధ్య యక్షాదులకున్.

—— వశిష్ఠాది మహర్షులు శ్రీకృష్ణునితో నరకాసురుని దుశ్చేష్టలు చెప్పుట ——

మ. జలధివ్రాతము నైనఁ గ్రోలఁగఁ గులక్ష్మాభృత్సమూహంబు నై
న లుఠత్తూలము గాఁ గదల్ప భువి యైనన్ లోపడం ద్రొక్కఁగా
బ్రళయోదగ్రకృశాను నైనఁ గబళింపం జాలునాభీలదో
ర్బలనిష్ణాతుఁ డభీతుఁ డాతతభయోత్పాదిప్రభావుం డిలన్.

వ. అద్దురాత్ముండు త్రైలోక్యపరాభవకరణంబ తనకు వినోదంబుగా నెందునుం
జరియించువాఁ డొక్కసమయంబున బదరీవనంబునకుం జనుదెంచి యజనతత్పర
వృత్తి నున్నమమ్ముఁ గనుంగొని యిట్లల బేలతనంబున వేల్పుగుఱించి చేసెద
రు యజనంబునకును భజనంబునకును భాజనంబు నేన కాక యన్యు లెవ్వరు
గలరు కర్తవ్యంబు లన్నియు నన్ను నుద్దేశించి చేయుం డని పలికిన మాపలుకు
లుత్తరంబులకు నలుక వొడమి తనయనుచరులం గన్నుగీటి పనిచి వారునుం
దానును.

తే. అగ్ను లార్చి హోతల నొంచి యఖిలయోగ్య
వస్తువిస్తారములును విధ్వస్తములుగఁ
జేసి దారల నెల్లను జెఱలువట్టి
కొనుచుఁబోయె నేమనిచెప్ప ననఘశౌర్య.

ఉ. క్రియ గోల్పోయి తపంబు పెద్దతికముల్ గీడ్పాటునంబొంది యు
న్నయముం గంది కలంగి యిప్పగిది నేమత్యంతదుఃఖార్తియుల్
భయముల్ భావములందుఁ బైకొనఁగ నిర్భర్తైకరతోన్స్ఫుర
ద్దయ దేవేశు నుపాశ్రయించితిమి నిత్యస్తుత్య రక్షింపవే.

క. నిరతుం డిటు ప్రత్యక్షువు, నరకంబునఁ ద్రోచె నీవు నరసంతతికిన్
నరకచ్ఛేదనకరుఁడవు, నరసఖ కరుణింపఁ దగు ననాథుల మమ్మున్.

మ. త్రిజగద్రక్షణలీలకై తగ ధరిత్రిన్ దేవకీపుణ్యగ
ర్భజుఁ డీదేవుఁ డనంగ నుద్యదనుకంపాశాలివై తోఁచి యీ
వృజినం బిప్పు డుపేక్షచేసిన నగున్ విశ్వన్యనచ్ఛేద మీ
శ జగామిత్ర యొకింత విక్రమసముత్సాహంబు నూహింపవే

చ. అనుమునికోటిమాటలకు నచ్చెరువంద వగిపు న్నసంబులోఁ
బెనఁగొన దైత్యచేతలకుఁ జేర్చినరోషము విస్ఫురద్విలో
చనయుగళంబు ప్రీతి విలసత్కరుణారుణకాంతిఁ జేయ స
ద్దనుజవిభేది ప్రమానుపడి తానొకపల్కును బల్కె కత్తటిన్.

వ. చింతాస్తిమితమూర్తియై యున్నం జూచి వెఱపును విస్మయంబును సంభ్రమం
బును సందడింప మునీంద్రు లందఱుం దమలో నొండొరులమొగంబులు చూచి
యేకముఖం బగుచిత్తంబుతో నయ్యుత్తమశ్లోకు నుదాత్తశ్లోకసనాథ లగుదివ్య
గాథల నిట్లని పరికీర్తనం బొనర్చిరి.

సీ. జయజయ జగదీశ జయదనుజధ్వంసి జయజనార్దన జయసర్వవంద్య
జయజయ గోవింద జయకృష్ణ వల్లవీవల్లభ జయయాదివరవరాహ
జయజయ సరిమృగాశ్చర్యశుభాకార జయకుబ్జకూర్మప్రసన్నరూప
జయజయ సర్వజ్ఞ జయహృషీకేశ నారాయణ జయసరోజాక్ష వరద
జయశరణ్యపదాంభోజ జయప్రసన్న, జయమనోరథదాయక జయముకుంద
జయ జయావాస జయనిత్యసత్యకీర్తి, మమ్ము నిటుసూడవే కృపామధురదృష్టి.

క. నీవు విష్ణుఁడ వగుటయు, నీవిశ్వంబునకుఁ జాల నెగ్గు జనించున్
నీవిక్రమతప్రపాదన, మానేశము సర్వమంగళానహము హరీ.

మ. సకలంబుం గలిగింపఁ బెంప నడుపన్ శక్తంబు మూర్తిత్రయా
త్మక మక్షోభ్యము నీమహత్త్వము భవన్మాయానుభావంబు వా
రక యవ్వారిరుహాసనాదుల కనిర్వాచ్యంబు సర్వాత్మ నీ
ప్రకృతిం జూతు రనాదిమధ్యనిధనప్రాధాన్యఁగా బోధనుల్.

మ. ప్రణతత్రాణపరాయణత్వ మెడఁదఁ భావించి సంభూతియున్
గుణకర్మప్రవిభాగపాటవముఁ గైకొంటన్ భవత్పూజన
ప్రణిధానంబులు భక్తితోడ నొనరింపం గల్గెఁగా కొండ ని
ర్గుణ యెవ్వారు నెఱుంగ నోపుదురె నీరూపంబు నీరూపమున్.

తే. అక్షరత్రయాత్మక మగునప్రమేయ, వర్ణమునకు నీతత్త్వంబ వాచ్యపదము
ఋగ్యజుస్సామములు పల్కు నెల్ల నాఁడు, దేవదేవ సమీహితస్థాపకములు.

క. క్రతుమూర్తి విక్రతుకర్తవు, క్రతుఫలయోగాత్మకుఁడవు క్రతురిపుహనన
వ్రతధరుఁడవు క్రతుపతి వీ వతులదయోపేతహృదయ యంభోధిశయా.

ఉ. నీకొనరించుపూజలు మనీషితసిద్ధివిధాయినుల్ సము
ల్లోకవిధావిదాశయులు లోకయుగస్థితిదాయినుల్ గుణో
త్సేకసమగ్ర లట్లగుటఁ జేసి భవత్ప్రియభక్తు లూర్జిత
శ్రీకులు వీతశోకులు గరిష్ఠవివేకులు దైత్యమర్దనా.

వ. నీమహానుభావంబు మహామును లెఱుంగ నేరకున్నవార లే మెవ్వారము వాత్స
ల్యం బొక్కటియ కారణంబుగాఁ గారుణ్యంబుతో భవదీయాశ్రయుల మమ్ము
నాలోకించి కైకొను మని యభ్యర్థించిన నాదరించి వాసుదేవుం డమ్మహాదేవో
త్తముల నుపలక్షించి.

శా. పాపాత్ముం డగుదైత్యుచేఁ బడిన మీపాటంతయుం జెప్పఁగాఁ
గోపం బుత్కటమై మనంబునకు సంక్షోభంబు ప్రాప్తించె మ
ద్రూపం బొండొకభంగి మీకు నిటులై తోఁచెన్ భవన్మంజులా
లాపంబుల్ ప్రకృతిస్థుఁ జేసె నను నుల్లాసంబుతోఁ గ్రమ్మఱన్.

వ. కావున నింకఁ బెక్కుమాటలకుం బని లేదు మదీయ వాక్యం బొక్కటి వినుండు.

మ. విలయోద్దీప్తపతంగమండలసమావిర్భావదుర్భావసం
కలనారౌద్రపరిక్రమం బయినచక్రం బస్మదాభీలదో
ర్వలభీక్షేపవిరూపమై నిగిడి గీర్వాణారిఁ గంఠచ్ఛిదా
కలితోదగ్రకబంధుఁ జేయు నపహృతైన్యంబుగాఁ జెచ్చెరన్.

క. మీ రేమియుఁ దలఁకక చని, ప్రారంభింపుఁడు సమస్తభవ్యవిధులు బృం
దారకయువతీలోచన, వారులు వెస నింకుఁగాక వారక యింకన్.

క. స్థావరజంగమరూపము, లై వెలసిన యీజగంబు లన్నియు భీతి
వ్యావేగవిరహితంబులు, గావుత మద్విక్రమంబు గని శీఘ్రమునన్.

తే. అనిజగత్పతి ప్రతినసేయం గనాకు, ణంబ దివినుండి దేవగణం బొనర్చు
జజయజయధ్వని యుప్పొంగె సర్వదిశలఁ, బరఁగి యఖిలజనశ్రోత్రపథము లలర,

వ. సంయమిపుంగవులు సమ్మోదవిలసితాకారులై యమ్మహావీరు వీరరసోత్సేకం బనేకవాక్యభంగుల నభినందించి మఱియును.

మ. అనుకూలస్థిరలీలమై నఖిలలోకాత్యంతదుఃఖావమో
చనకృత్యంబున కర్థితోఁ గడఁగు యుష్మద్విక్రమప్రక్రమం
బనపాయంబు నపేతవిఘ్నమునునై యాఢ్యం బగుంగాత యెం
దును ధన్యం బగుఁగాత ధర్మమిరవొందుంగాతఁ గల్యాణముల్.

వ. దేవా యేము పోయి వచ్చెద మని యమ్మహానుభావుచేత వీడుకోలు వడసి యయ్యం దఱును శిష్యసహితులయి యాప్రొద్ద కదలి బదరికాశ్రమంబునకుం జని రక్క డ నశేషయాదవులు మునిసమాగమంబునం బ్రకటంబై నకృష్ణమాహాత్మ్యంబు గొనియాడుచు విస్మయంబునొందుచు నతండునుం దారును నరకాసురవధంబు నకు నుద్యోగంబు చింతించుచున్న సమయంబున.

ఇంద్రుఁడు ద్వారకానగరంబునకువచ్చి కృష్ణునిఁజూచుట.

సీ. ఆకాశగంగోర్మిశీకరంబులు మోచి మందారసౌరభస్యంది యగుచు
సమరవిమానగత్యనుకూలమై లీల దివ్యవాయువు చనుదెంచెఁ దోన
గురిసె దేవోద్యానతరుపుష్పవర్షంబు ఖచరులానందింపఁ గడఁకతోడ
ననిమిషహృద్యవాద్యారావములు మించె నాలోనఁ దోతెంచె నంబరమున
నతిమనోహరతేజోమయప్రపంచ, మంచితార్కతేజస్ఫూర్తిననుకరించి
యదిక్రమంబున సకలజనావలోక, నీయబహుమూర్తులై ధాత్రి నిలిచి వెలసె.

వ. ఆమూర్తిసముదయంబునందు.

మ. రజతాద్రిప్రతిమానమై చనుచతుర్దంతోజ్జ్వలాంగస్ఫుర
ద్గజరత్నంబుపయిన్ సవజ్రకరుఁడై కల్యాణముక్తామణి
వ్రజభూషామహనీయదివ్యవసనస్రగ్గంధవిస్ఫూర్తితోఁ
ద్రిజగద్భర్త శచీవిభుండు వెలిచెన్ దేదీప్యమానోన్నతిన్.

ఉ. ఆతనిసూరెలం దమయుదంచితయానము లుల్లసిల్ల న
త్యాయతవైభవంబు లెలరార నలంకృతులై దిగీశ్వరుల్
ప్రీతిఁదనర్చి రెంతయును బెంపునఁ దక్కినుగల్గుదేవతా
జాతము నొప్పె నస్తు దమసన్నహనంబులతోడ నచ్చటన్.

వ. ఇవ్విధంబునం జనుదెంచినదివిజపాలు నాలోకించి నీలవర్ణుండు నీలాంబరసహి తంబుగాఁ బ్రత్యుత్థానం బొనర్చి బాంధవులుం దానును నెదుర్కొన నమ్మహేం ద్రుండును గజేంద్రావతరణంబు సేసి నిజవాహనావతీర్ణు లగుత్రిదశులు వొదివి కొని రాఁ గదిసి ముకుందుం దొలుతం గౌఁగిలించి తదీయాగ్రజు నుగ్రసేనుం గ్రమంబున నాలింగనంబు గావించి ప్రద్యుమ్నకుమారు నిరుగేలం గ్రుచ్చియె

త్రి యక్కునం జేర్చి యాదవులలోన మఱియు మాన్యార్హులైనవారినెల్లను బరి రంభణంబున సంభావించి.

క. ఘోరానిచుట్ట మితఁ డనఁ, గూరిమి చెలికాఁ డనంగఁ గోరి వరుస గో
త్రారి హరిబాంధవుల వే, ర్వేరం గుశలంబు లడిగెఁ బ్రియ మొలరారన్.

వ. బలదేవ పురస్సరుండై గోవిందుండును బురందరుం దోడ్కొని యతనివేడుక పట్టగుసుధర్మలోనికిం దెచ్చి యంచితాసనంబున నునిచి యర్ఘ్యపాద్యమధుపర్కంబుల నర్చించి తక్కిన లోకపాలకులకు నుచితోపచారంబు లాచరించె నంత నందఱు నర్హస్థానంబుల నుండ నాఖండలుండు పుండరీకాక్షుకరంబు కరంబునఁ దెమల్చుచుం దదాననంబునఁ జూడ్కి నిలిపి యిట్లనియె.

ఇంద్రుఁడు శ్రీకృష్ణుని నరకాసురవధకుఁ బ్రేరేపించుట.

తే. ఏను నీయున్నకడకు నిట్లు గుదేర, వలసినట్టికార్యము సాధువత్సలాత్మ
దేవకీపుత్ర యుత్తధీసమగ్ర, కలిగె నొక్కటి యది నీవు తెలియ వినుము.

చ. నరకుఁ డనంగ దైత్యకులనాథుఁ డొకండు సరోజసూతిచే
వరములు గాంచి పేర్చి సురవర్గము నెల్లను గాసిచేసె సం
గరమున నేము వానిభుజగర్వము సైపఁగలేక యిండ్లులున్
సిరులుఁ దొఱంగి వచ్చితిమి చెన్నఱి మానవజాతిలోనికిన్

మ. అమరావాసము లెల్లఁ జొచ్చి దనుజుం డభ్యర్చితద్రవ్యజా
తము లెల్లం బోరిఁ జూఱలాడినకథల్ ద్రవ్వంగఁ బెక్కేమి చె
ప్ప మహాభంగ మొకండు గల్గె విను మాభంగంబు నీకు న్నమాన
నమె యేఁ జెప్పఁగఁ జిత్తగింపుము జగన్మాన్యోల్లసద్విక్రమా.

తే. అనపహార్యంబు లెవ్వాని కదితిదేవి, కుండలమ్ములు సురలోకమండనములు
గొనియె విబుధాళివంతలఁగుందుచుండ, నింతయునుమాధవానీవయెఱుఁగుదింక.

క. ఖలుఁడు మునులయాశ్రమములు, గలయన్నియుఁజొచ్చిచెఱిచెఁ గ్రతువులుధర్మ
స్థలనం బొనర్చె సాధుల, యలజడి కది గుఱుతు కొలఁది యన లేదనఘా.

వ. ఇంతియకా దమ్మహాసురుండు.

శా. నీవాశ్చర్యపరాక్రమంబున మహి న్విశ్వైకరక్షార్థివై
దేవారాతులఁ గూల్చుచున్కి విని నీతేజంబు సైరింప కు
గ్రావష్టంభరతి న్ననుం దొడరి నీ కాజిం బరిభావమున్
గావింపన్ భవదంతరంబ మది నాకాక్షించు నెల్లప్పుడున్.

క. కావున నూర్జితబాహు, శ్రీవెలయఁగ నరిగి రిపునిఁ జెఱుచుటయ తగున్
గోవింద కర్జ మిత్తెఱి, నీవిశ్వంబునకుఁ జేయు మిట్టిహితంబున్.

శా. విక్రాంతిం ద్రిజగంబులందు ను గడుఁ విఖ్యాతుఁ డుద్దాముని
ర్వక్రస్ఫారజనంబులన్ బవనునన్ భంజించు పక్షిప్రభుం
డక్రూరాత్ముఁడు వీఁడన న్నెగడువాఁ డబ్జాక్ష యుష్మన్మహా
చక్రం దాల్పఁగలండు శాత్రవనభేద్యం జేయుఁ గార్యంబులన్.

వ. అని పలికి తనతోడన చనుదెంచి వినయావనతుం డగువినతాతనయు నతని
మొదరికిఁ బిలిచి దేవకీనందనుం గనుంగొని యింద్రుండు మఱియును.

మ. మును నీమెచ్చినవాహనంబు యిఘ్నుసన్నాహంబుతోఁ జేరఁ గ్రి
క్కున నాయానతిఁ బూనెవై జగంబులకుఁ బక్షిస్త్రీలు గావించుచున్
జని నే కౌశల ముల్లసిల్ల విజయప్రస్థానముం జేయుమా
వనజాతేక్షణ యూతణంబు తెగ సర్వంబున్ సుసిద్ధంబుగన్.

వ. ఇయ్యవసరంబున నయ్యసురకోపస్థానం బైనప్రాగ్జ్యోతిషపురంబున కేను దెరు
వు వెట్టెద విజయంబు సేయు మనిన వాసుదేవుండును దేవేంద్రునిం జూచి యుత్తరంబుగు
ముస్సయోలుంగుము నట్లనిన బదరీవననివాసు లగుతాపసపుంగవు లేతెంచి
దైతేయులచేతఁ దముపడినపాట్లెల్లఁ జెప్పి వారలు ద్విజులకు మర్దయుండని యు
పన్యసించి నాకు సహోదరులకాని యగునుగ దేవుం బొనర్చి పోయిరి తదనంతరంబ
నీవును వచ్చి నాకకంకవు సహాయంబుం బొనరించితివి యెంతయు లెస్స నీతోడఁ
జనుదెంచెదఁ బొమ్మ నని గద్దియ దిగ్గి యమహాత్ములు వీడ్కొని యాయితంబై
చక్రశార్ఙ్గాది సాధనంబులు గైకొని సత్యభామ రావించి తత్సహితుండై గరు
డస్కంధారోహణంబు సేసి.

మ. గురుబంధుద్విజకోటిగినవసలు ప్రకటభృత్యస్సభోభంగిబం
ధురతూర్యధ్వనులన్ సమస్తసుమనస్స్తోత్రప్రశంసంబులన్
వరవైతాళికవందిబృందజయశబ్దాడంబరంబులన్
వెరవై పేర్చి చెలంగి వెల్వడియె నింద్రప్రేమ న్నిజావాసమున్.

వ. ఇట్లు పురుహూతుం బుడోయాయింపకసి పురద్వారంబు నిర్గమించి మహీమా
ర్గంబునఁ గొంతదవ్వు నడచి యంతరిక్షపథంబు గైకొని యమ్మేఘవా
హనవిహగవాహను లిద్దఱు నుద్దామంబు లభిరామంబులై వెలయ నేకముఖం
బున నడచు శీతకిరణాళిప్రమయారోక్షిత లలమికొనఁ దేజరిల్లి రంత.

మ. పవనస్కంధము దాఁటిపోవఁ బటుకశ్యాపర్యాప్తపర్యాయన
వ్యవిచిత్రక్రమణం బొనర్చుచు లసద్వైమానికస్థానముల్
వివిధాలోకనకౌతుకంబు వెలయ న్వీక్షించుచున్ వృష్ణిసం
భవుఁ డొందెన్ సురసంచయంబు లలరన్ బ్రాగ్జ్యోతిషప్రాంతమున్.

వ. అచ్చట నమరపతివలన నహితునినగరంబుదురధిగమత్వంబును దచ్చమూస మూహంబులసన్నాహంబును సమ్యగ్భంగి నెఱింగి తదీయవిదళనవ్యవసాయంబు నకు ననురూపంబు లగునాలాపంబులు విని సపరిజనంబుగా నతని వీడ్కొలిపి యచ్యుతాటోపదీపితుండై కదియనడచి.

మ. స్ఫురదుద్దామరథాశ్వకుంజరభటస్తోమప్రభాస్వచ్ఛము దురధిక్షేపము లైనసన్నహనముల్ తోరంబులై యొప్పఁగా నిరకావాసము గాచియున్నఘనులన్ దైతేయులం దాఁకెఁ బ ల్వురఁ జెండాడె నఖండకాండవిసరవ్యుచ్ఛేదనక్రీడలన్.

సీ. మురదైత్యుచేత నుద్ధురనిజమాయాబలంబునఁ బ్రాగ్జ్యోతిషంబుచుట్టు నొడ్డంగఁబడి నిశితోగ్రనిరంతరగురుముఖంబులు గల్గి సురభుజంగ గరుడగంధర్వాదు లోరసిసఁ గొంచువిస్ఫారిపాశంబులు బహుసహస్ర సంఖ్యంబులోరుల కసాధ్యంబు లాతఁడు గావించినవి తీవ్రనకశనచక్ర ధార సన్నియుఁదునిమి యాదైత్యుఁదొడరి, చటులశార్ఙ్గవినిర్ముక్తశరచయములఁ బొదివెఁ ద్రిదశారియును నీడఁబోక సింహ, నాద మఖిలనభోభేదనముగ నెదిరి.

క. బలితపుగద గరుడునిపడు, తలద్రేసి కడంగి పటుగదాశూలము లు జ్జ్వలశక్తిపరశుతోమర, ము లనేకము లతనిమీఁదఁ బోరిఁ దొలఁగించెన్,

—— శ్రీకృష్ణునిచేత మురాసురుండు మొదలైనమహారాక్షసవీరులు చంపఁబడుట. ——

మ. కినుకం గెంపు గనుంగవం గదురఁగాఁ గృష్ణుండు కృష్ణోరగం బున కత్యుగ్రఫణంబు పేర్చినక్రియం బొల్పొందు తీవ్రక్షుర ప్రనిశాతాస్త్రము కార్ముకంబునఁ గఠోరస్ఫూర్తి సంధించి యూఁ పున నేసెన్ రిపుమస్తకంబు మకుటాంశుల్ పర్వ నుర్విం బడన్.

వ. ఇట్లు మురాసురుం బరిమార్చి మధుమథనుండు మథితవిబుధరిపుసైన్యం బగు పాంచజన్యంబు పూరించినం దదారవంబు త్రైలోక్యబాధాకరణంబై పర గుటయు.

మ. జలధుల్ పిండలివండుగాఁ గలఁగె నాశావారణశ్రేణి బె గ్గలి మ్రొగ్గంబడియెం జరాచరచయక్లేశోత్తరంబై ధరా వలయం బంతయు గ్రక్కునం గదలె గీర్వాణావళుల్ సాధ్వసా కులలయ్యెన్ హరపంకజాసనులు ప్రక్షోభించి రంతర్గతిన్.

వ. అవ్విజయశాలినెదిర్చి నిసుందుండు బృందారకద్విరదభిదాచండం బగుగదాదఁ డంబమర్చిపేర్చి తద్వక్షంబు వ్రేసి శార్ఙ్గచ్యుతంబులై కవియుసాయకంబు లందఁ

ద జడియుచు మఱియు నక్కడిందిక్కై మవ్వు విసరి యుఱిముఱి సత్యభామబాహు
దాఁకించిశూలంబులు దొఱఁగించి విల్లుగైకొని పెల్లేసనఁగినిసి యసురాంతకుండు.

క. రెండమ్ములఁ గరయుగ్మము, ఖండించి పటుప్రచండకాండం బొకటన్
గుండెలదీప్తులతోడను, మొండెము భువి ద్రెళ్ళఁజేసి మురిమున నార్చెన్.

తే. ఏసఁగి పంపురుదైత్యులయెత్తు నేసియ. నచ్చె నెవ్వఁ డొకఁడసురవ్రజముఁగలఁచు
నట్టియానిసుంభుఁడు హతుఁడై నఁగలఁగ, ననురసైన్యంబు పరికునియానమాలె.

క. అంత హయగ్రీవుఁడు ను, ద్ధాంతఘనుఃపాణియై మురద్విషుపై న
క్రాంతశరకోటిఁ బఱపె ని, తాంతఘనము వృష్టిఁ బర్వతముఁ బొదువుగతిన్.

ఉ. దారుణదైత్యనాయకవితానవిజృంభణ మాత్మలోపలం
జేరికనైనఁ గైకొనక సీరధరానుజుఁ డద్రిభేదన
స్ఫారబలోగ్రమైనపవిభంగి వెలింగెడుబాణ మొక్కటన్
వైరి నురంబు వ్రచ్చి యసువర్గముతో నవఁబాపెఁ గచ్చెరన్.

వ. ఆభంగిం గంసాంతకప్రపరిదళితంబై యాభటుదేహంబు లోహితంబుగంగలో
పలం బడి తదీయశిరంబు రక్తపూరంబు గావించె బురుషోత్తముం డయ్యసు
రం బరిమార్చి యమ్మనుమును సఘోరపాలుండు విరూపాక్షుండు ప్రాపణుండు
పంచజనుండు ననుమేటిమగలం దొట్టి యెనుబదినాలుగువేలరాక్షసులం జంపి
ప్రాకారబాహ్యంబున రక్తపూరంబుగావించి పురద్వారంబు గవియ నవస
రంబున.

ఉ. అచ్చటఁ బన్నియున్నసమునిగ్రసురారిచమూసమూహముం
జెచ్చెరఁ జొచ్చి యాసుభటసింహుని పరాక్రమసి విక్రమాఢ్యముం
బచ్చెపువై తలిర్పు విసధాయుధసంప్రహతిం బెనంగ శా
ర్ఙ్గోచ్ఛలితాస్త్రజాలముల క్రొక్కఁదుఁ దూలక యశ్రమంబునన్.

వ. అట్టిసంకులంబున

తే. మేఘతటసంగతం బగు మేఘ మొకటి, పృథులధారాప్రవర్షియై పేర్చునట్లు
కాశ్యపాత్మజబంధురస్కంధలగ్నుఁ, డై నవిభుఁ డొప్పె బాణవర్షాఢ్యుఁ డగుచు.

వ. ఆసమయంబున వాసుదేవునిసాయకపరంపరలపటుసందసంబున వరుసం గడసి
యుఁ జక్రపాతంబులం బొలిసియుఁ గదిసి కౌమోదకీఘాతంబుల మడిసియు
నందకప్రహారంబుల సమసియుఁ బాంచజన్యధ్వానంబున గుండియ లవిసియుఁ
గరతలప్రహారంబులఁ జదిసియుఁ దార్క్ష్యపక్షహననంబులం దూలియుఁ దద్రో
షవీక్షణస్ఫులింగంబులం ద్రేలియుఁ దదీయచంచుభేదనంబుల ముఱిసిర్గాలియుఁ
గరాళకాయులగు దైతేయులు పదునెనిమిదివేలు తెగిరి తురంగమాతంగపురుష

సీ. కోలఁదివెట్టఁగ రానికోలలు హరిమీఁద నేసె దిగ్భాగంబు లెల్లఁ గప్ప
భామునకు వేర్చి షష్టిసహస్రాంబకముల వైనతేయునిఁ బొదివె దాన
నొక్కింతయలిగి యదుసార్వభౌముం డయిదు నెన్నిదియును బదియును మెఱుఁగుతూపు
లోలి రక్కసునిపై నొండొండ నిగిడించి మఱియు నేడమ్ముల నెఱఁకులందు
నాటుటయు నరకుండు నాలుగిసనాభు, నంగకంబులఁ గీలించె నాఱుతీవ్ర
సాయకంబులు నొచ్చి యానక్రగ్రధియుఁను, దట్టకంపున లోచనాంతములు మెఱయ.

ఉ. శాత్రవుప్రాణముల్ గొనఁగఁ జాలెడుతీవ్రపుఁదూపొకండు లో
కత్రయవిస్మయావహముగా సడరింపఁగ దాని దానవుం
డత్రసదంతరంగుఁ డయి యంతరిమార్గమునందు ద్రుంచి యా
పత్రరథేంద్రు నుక్కడఁచు బాణమునం దెరలంగ నేసినన్.

తే. వజ్రహతిచేత శైలంబు వడఁకుభంగి, వైనతేయుఁడు నడనడనడఁకి యలుకఁ
గడఁది పగతుని నెఱకుల నడిచి త్రవ్వ, ముష్టిఁ బొడిచినఁ దెచ్చెర మూర్ఛమునిఁగి.

క. నరకాసురుఁ డగుడుకల్పిషు, నరసుర నరకుండు వలఁక భాసము నయ్యం
బురికొల్పికొని శరాసన, విస్ఫురితగుణరవంబు పర్వఁగ మఱియున్.

ఉ. అతిఘోరం బగుశాతసాయక మొకం డాకర్ణపూర్ణంబుగాఁ
గృతహస్తుం డగుటన్ వెసం దగిచి లక్ష్మీనాథువాలంబు వ్ర
క్కతిఁ బొందంగఁ గండకఁ నేయుటయు రక్తం బాస్యము న్ముంప మూ
ర్ఛితుఁడై వ్రాలె జగత్ప్రభుండు భుజగారిస్కంధపీఠంబునన్.

చ. కనుఁగొని సత్యభామ మదిఁ గంపము నొందక నాటియున్నయా
సునిశితబాణము న్వెఱికి శోణితము న్దరపల్లవప్రమా
ర్జనముల నయ్యఁ బాపుచును జామ వెమారుతసంప్రయుక్తి చేఁ
దను పొసరించి వల్లభు గతవ్యథుఁ జేసె ముహూర్తమాత్రలోన్.

వ. సుపర్ణుండును నిజపక్షపవనంబునఁ బ్రభునకు నాశ్వాసంబు బొసరించె నట్లు దెలిసి నగుచు నగధరుండు మగువ నెమ్మొగంబునం జూడ్కి నిలిపి యేను బరిపీడితుండనై డస్సితి నొక్కింతవడవు నీవు కయ్యంపుమోపు మోపుమని సముచితోత్సాహ సాహసాభాసిని యగునాభామినిచేతికిఁ దనశార్ఙ్గం బిచ్చి యంపపొదు లనువుగా నమర్చినం బేర్చి యాక్షణంబ.

## సత్యభామ నరకాసురునితో యుద్ధంబు చేయుట.

శా. వీరం బాఁడుఁదనంబు నొందె ననఁగా విక్రాంతిశాలిత్వల
క్ష్మీరేఖం బచరించె నాఁగ ధృతి యక్షీణాకృతిం జెందె నా

ధీరోదాత్త పతిప్రియాచరణభక్తిప్రౌఢ యాఁతిన్వ దాఁ
బ్రారంభించె మహారణక్రియకు నాప్రత్యర్థి సంశ్లాఘ్యసత్.

తే. క్రమము మెఱయభల్లార్ధచంద్రక్షురప్ర,ముఖశిలీముఖములు బహుముఖములందు
సత్య యేయ ససత్యంబు సత్యసహితు, సంచుమహిమాన్విసయ్యంబు నుంచె సరకు.

చ. తనపనిమాని యింక సనితం బురికొల్పి నిరాంబొనర్పఁ బం
చి నను జయించువాఁడఁట యిసే యిదియేటిది యంచు ఘోషమున
దనుఁడుసహాసవిస్మయవిభావిధుతాననుఁడై కడంగి యే
సె నఖిలలోకరతికునిచెల్వపుమయిం బదాద్విపబాణముల్.

క. తోడన చనుఁగవ యొక్కట, నేమ్ములఁ బొడ్వఁ్వయుగ్మ మొనఁగనరియుగం
బాడఁగ నాఱీట నేసినఁ, జేడియ యింతకయు లెక్క సేయక యలుకన్.

శా. విల్లుం గేతువుఁ ద్రుంచి రథ్యముల నుర్విం గూల్చి సూతున్ వెసం
ద్రెళ్లంజేయఁగ హీనసారతమయిన్ దీనత్వ మగ్లానికయున్
భల్లంబుల్ నిగిడింప రాక్షసుఁడు చాపంబొండు గైకొన్న న
వ్విల్లు న్నుగ్గుగఁజేసె నాగుణమ దేవీరత్న ముగ్రోద్ధతిన్.

క. మూఁడవవిల్లెత్త సదియుఁ, బోఁడిమి చెడిపోన ససుర పొలుపఱ యలుకన్
వాఁడిమి యెసఁగఁగ నొకడిగ, వేఁడిమిలోఁ జైచె వృష్టివిస్మితమూర్తిన్.

వ. దాని నడుమన తిలప్రమాణశకలంబులు గావించి సత్యభామ ఘనమహోత్సవ దీపి
తయై మఱియుం బ్రత్యర్థి పేరం బహ్వాయుధముక్తంబు లసిశక్తి సుంబులు పొడి
సేసి భాసితముఖంబు లసురులముఖంబుల నతని నెఱసి నేసినం జూచి ఖేచ
రులు ప్రశంసించి రట్టిసంరంభంబునకుఁ బ్రీతుండై యచ్యుతుండు.

మ. చెలువం జక్కఁగఁ గౌఁగిలించి నమస్వేదోష్ణవల్లం బైనయు
గ్మలిఫాలంబుఁ గపోలయుగ్మకమును న్మార్జించుచుం దేవి య
గ్గలికం బెద్దపెసంగి మెస్సి తిలకం బింకం బాలు సల్మంచు మొ
చ్చులు దోడ్తోడ మనంబునం బ్రియముతై నొంపారఁ బ్రేమంబునన్.

క. తనయుఱుత నేవళం బొకఁ, డనుకూలతఁ గేలఁ బుచ్చి యాసతియలుకన్
వనరుహలోచనుఁ డిడి లో, చనపారణ సేసెఁ దత్ప్రసాదసదృష్టిన్.

సీ. ఎయ్యది గాంక్షించి యెన్నఁడుఁ గాసలె దనయ్యుడుకేనెయంత యదియుఁ దొల్లి
కౌస్తుభాభరణంబు కంఠమున వల్లభంబై యుండు నెయ్యది యవ్విభునకు
నఖిలలోకములవిఖ్యాతమై యెయ్యది వెలవెట్టరాని పెంపులఁ దనర్చు
జగతి నానాలోకచంద్రికగాఁ జేయ నెయ్యది దనకాంతి నెల్లనింపు

కుండలంబులు గొని గోవిందుని సన్నిధికిం జనుదెంచి బాష్పకణకరాళకపోల యగుచుఁ గేలుమొగిచి యిట్లనియె.

మ. కరుణం బుత్రుని నీవ యిచ్చితి త్రిలోకద్రోహిగాఁ జూచి చె
చ్చెర నిప్పోకలఁ బుచ్చి తింక దివిజుల్ సిద్ధుల్ తపస్వుల్ గత
జ్వరులై తాల్తురు గాక మోదభరముల్ సాక్షిత్వ మొప్పం జరా
చరభూతాళి యెలర్చుగావుత భవత్సంప్రాప్తగర్వావిధుల్.

క. ఇవె రత్నకుండలంబులు, దివిజద్విషుఁడింద్రు నొడిచి తెచ్చినయవి శ్రీ
ధవ గొనుము తత్తనూసం, భవుఁ గావుము నిలుపు తండ్రిపదమున వానిన్.

వ. అని ప్రార్థించిన పృథివిపలుకు లాదరించి యాదేవుం డాదేవి నాశ్వాసించిన నయ్యింతి యంతర్ధానంబు నొందె నంత రథాంగుం డు ధరణీనందను దేహంబు సంస్కరింపం బనిచి యతనిపుత్రుం డగుభగదత్తు నుదాత్తరాజ్యపదస్థుం గా నభిషేకింపం బౌరప్రధానవృద్ధుల నాజ్ఞాపించె నివ్విధంబున విజయశ్రీవిభాసితుండై శ్రీవిభుం డాత్మీయ భుజబలార్జితం బగువిమతునూర్జితవిభవంబు గైకొనుతలంపునం బురంబు ప్రవేశించి రాజమందిరంబున గరుడావతీర్ణుండై భాండాగారంబు లకడ కరిగి యందు వేర్వేఱ యసంఖ్యంబు లగుమాణిక్యంబులును వజ్రవైడూర్యమరకతంబులును ముక్తావిద్రుమంబులును నిర్మలంబు లగుభర్మరాశ్యంబులుఁ గాంచి హైమంబులు రాజతంబులు రత్నమయంబులు నైనశయనాసనభాజన ప్రముఖంబుల నాలోకించి.

మ. అని నాపశ్చిమదిక్పతిన్ గెలిచి దైత్యాధీశ్వరుం డర్థిఁ జే
ర్చినదివ్యస్ఫురితాతపత్రము లసచ్ఛీతాంశుతుల్యంబు కాం
చనధారాపరివర్ణరత్నమయచంచద్దండ మాపద్మలో
చనుఁ డచ్చోఁ గని మానసంబు బహుళాశ్చర్యార్పితం బొందిసన్.

వ. ఆత్మగతంబున.

తే. అప్రజితాబ్ధిపవైభవం బస్తమితను, బేరసంపద్వరంబు నిష్పీడితేంద్ర
విభవమిక్కల్మి గక్కసువిక్రమంబు, చే నుపార్జిత మిది ప్రశంసింప వశమె.

వ. అనుచుండ భాండాగారికులు మొదలైనయఖిలస్థానాధికారులు సంతఃపురాధ్యక్షులు మున్నుగా నవ్వెన్నునియెదిరి కరుగుదెంచి కృతాంజలులై దేవా యివి దేవద్విషుధనంబులు వివిధంబులు విననవధరింపుము నిరంతరమదోదకధారాతరంగితకపోలంబు లగుభద్రశుండాలంబు లిరువదివేలు నన్నియకరేణువులు గలవు లక్షణావర్తంబు గలతురగంబులు లక్షయునెనిమిదివే లున్నయవి గోవులు

జాతికంబులు నపరిమేయంబులు మహార్ఘంబు లగుసూక్ష్మాంబరంబులు నతికో
మలకంబళాజినవల్కలంబులుఁ జందనాగురుకస్తూరికాదులు ననల్పంబు లిన్నియు
దేవరకు నివేదించితి మిట్టిసంపద యంతయు భవదీయవిచిత్రతరాత్రధర్మంబునం
జేరినయది యాత్మీయంబుగాఁ జిత్తగింపు మాజ్ఞాకారు లగుమమ్ము ననుశాసించి
యనుగ్రహింపు మనుటయు.

క. వారలవిజ్ఞాపన మ, వ్వారిరుహోదరుఁడు విని ప్రవర్ధితహర్షో
దారహృదయుఁడై యెంతయు, గారవమున సంతివట్టుఁ గైకొని వసనల్.

వ. ఆవస్తువులు ప్రత్యేకంబ పరీక్షించి యారాక్షసులచేతన నిజనగరంబునకుం గొని
పోవ నుచితప్రయత్నంబునం బుచ్చి యవ్వారుణచ్ఛత్రంబు దానవకరంబునం దాల్చి.

తే. కనకధారలు సోనలై కడలుకొనఁగ, నావిహంగపుంగవు నెక్కి ఘనాకారంబ
వినయమునసకలసురలుగొలిచిపోవఁ, బోయెమణిశైలమునకుఁ బ్రభూతయశుఁడు.

శ్రీకృష్ణుండు పదియాఱువేల నూర్గురు సురకన్యకల గ్రహించుట.

సీ. ఆపర్వతముచుట్టు నభిరామహేమమణిగణపతాకావళుల్ ప్రజ్వరిల్ల
లలితంబు లగుసౌధవలయంబు లుజ్జ్వలశంపాలతారమ్యశరదభ్ర
మండలంబులుఁబోలె మహితంబులై యొప్పఁగ నితాన్త్యృశగి నొచ్చి యనుపమాన
కమనీయమూర్తులు గంధర్వనాథులకూఁతులు కన్యలు గుణసమగ్ర
లసురపతిచేతఁ జెఱవడి యార్తితోడ, నేకవేణీధరలు నియతేంద్రియలును
నై నిజాభిజాత్యముఁ గాచి యాత్మపర్య, నంబ కోరుచుండఁగఁ బద్మనాభుఁ డచట

క. పదియాఱువేలనూర్వురఁ, బొదలినయెలజవ్వనంబు పొలివ్రావక యిం
పొదవెడువారిఁ గనియె న, మ్ముదితలు నద్దేవుదెస సముత్సుక లగుచున్.

వ. మురహయగ్రీవనిశుంభపూర్వకంబుగా సుర్వసుతుండు వర్ధిదోర్విభవుం డగుట
యెఱింగినవారుగావున.

తే. నిండుచందురు లొక్కట నెఱసి మెఱయు, కరణి నెమ్మోము లభినవకాంతి నలర
నందఱును నెదురుగ వచ్చి యతనిచుట్టు, నిలిచి విరచితాంజలు లైరి లలితలీల.

వ. వారలకుం గావలియై యున్న వృద్ధకంచుకులు సంతంత ప్రమ్రొక్కి నిలిచి రంత
నాకన్నియ లతని కిట్లనిరి.

క. సురకన్యల మే మసురే, శ్వరుచెఱ నిట్లుండి యధికసంతాపమునం
బొరలఁగ నొకతఱి సంయమి, వరుఁ డగునారదుఁడు కరుణవర్ధిలుబుద్ధిన్.

వ. ఇచ్చటికి వచ్చి మమ్ముం జూచి శోకింపకుండుఁడు శంఖచక్రగదాధరుం డగునారా
యణుండు ధరణీభారావతరణార్థం బకారణమానుషుండై నరకాసురుం బరి
మార్చి మీకు భర్త యయ్యెడు నని యాశ్వాసించె విశ్వభూతాత్ముం డై నమా

రుతుండు నిట్టులపలికెఁ దదాదేశంబు పరిక్లేశక్షమత యిచ్చిన నే నింతకాలం బును శీలంబు గోలుపోవక జీవంబు లొడళ్ల నిలుపుకొని యుండి నేఁడు ధన్యత్వంబు నొందితి మని విన్నపంబు సేసిన.

శా. ప్రేమోదాత్తము లైన తద్వచనముల్ పెంపారుసాకూతలీ
లాముగ్ధం బగుచూడ్కితోఁ బెరసి యుల్లాసంబు గావింప నా
శ్రీమంతుండును దాని కియ్యకొని సస్నేహావలోకంబు వా
క్యామోదంబున వెల్లిగొల్పి ప్రమదం బందించె నయ్యందఱన్.

వ. ఇట్లు దేవకన్యలం గైకొని యనేకసంఖ్యలు గలరాక్షసకింకరుల రావించి మణి కనకరుచిరంబు లగుశిబికానీకంబుల నయ్యింతులం దోడ్కొనితేర నాజ్ఞాప నంబు సేసి.

ఉ. అమ్మణిపర్వతంబు గలయం జరియించి తదీయ మైనశృం
గమ్మొక టిద్ధకానననికాయముతో మృగపక్షిజాతిజా
తమ్ములతోఁ జలజ్ఝరవితానముతో వెసఁ ద్రుంచి తార్క్ష్యుపై
నిమ్మగనుంచి తాను దగనెక్కె సముత్సుకచిత్తవృత్తిమై.

తే. భామినీసమన్వితుఁడగునాముకుందు, నమ్మహాశైలశిఖరంబు నచ్చుపున్నగి మోచెన శ్రమముగఁ బక్షిముఖ్యుఁ డంబ, రమునఁ బవమానసమజవప్రౌఢిమెఱయ.

వ. ఇవ్విధంబున.

సీ. స్వామిచేతోవృత్తిసరణి మెలంగి యవ్వైనతేయుఁడు హేమవర్ణలలిత
పటుపక్షవిక్షేపభగ్నంబులై గోత్రశిఖరంబులును దరుశ్రేణికలును
లగ్నంబులై సముల్లసితాభ్రచయములు నలుదెసఁ దూల సన్మార్గలీలఁ
జనఁ గ్రమంబున జనార్దనుఁడు మరుద్వసుతపనేందుసిద్ధసాధ్యప్రధాన
దివ్యధామంబు లెల్ల నతిక్రమించి, సురవరులలోకములను జూచుచును వేడ్క
నరిగి కనియె ననేకశతాశ్వమేధ, గమ్యమై రమ్య మగుశతక్రతువునెలవు.

వ. కని ప్రవేశించి వాహనంబు డిగ్గి శచీసమేతుండై యున్నయద్దేవునకు నమస్క రించి యదితిదేవికుండలంబు లిచ్చి తత్ప్రీతిపూజితుండై సముచితసంభాషణం బొనర్చెఁ బౌలోమియు సత్యభామయు నొండొరులం గౌఁగిలించుకొని.

క. తగుమాటలఁ జిత్తంబులు, సిగురొత్తఁగఁ గలసి మెలసి చెన్నగుగోష్ఠిన్
సొగియుంచునెడ ముకుందుని, మగువకు శచి యిట్టులనియె మంజులఫణితిన్.

క. దేవి నీహృదయేశుడు, దేవసమానుఁడు సమస్తదేవనివహావి
ప్లావకుని నరకుఁ గూల్చి మ, హావిక్రమకేళిఁ ద్రిజగదభయం బొసఁగెన్.

వ. నీసౌభాగ్యం బనన్యదుర్లభసంభావనోపభోగ్యంబు నిన్నుఁ జూచి ప్రియంబు నొం దితి నీయభిమతం బొక్కటి గావింపఁ గోరెద ననుటయు నవ్వనజవదన వినమ్ర

యగుచు నాకేమిటం గొంత లేదు నీనెయ్యం బొక్కటియ కలిగినం జాలు ననియె నంత.

తే. ఇంద్రుఁడు నుపేంద్రుఁడును సముదీర్ణపూర్ణ, హర్షచిత్తులై కూడి యయ్యదితి దేవి సదనమున కేగి తత్పుణ్యచరణములకు, వినతులై రట్టియెడ శచీవిభుఁడు నెమ్మి

వ. అయ్యఖండితచారిత్రకుఁ దదీయకుండలంబులు సమర్పించి కృష్ణుపరాక్రమంబు సవిశేషంబుగాఁ గీర్తించిన నాయమ్మ సమ్మోదంబు నొంది యమ్మధురిపునకు వేన వేలు దీవన లిచ్చి యయ్యిద్దఱునందనుల నభినందించి శచీసత్యభామలు ప్రణామం బొనర్చిన నాదరించి.

మ. అరవిందోదరుఁ జూచి నావగిపు నీవాత్మీయదోర్వీర్యబం
ధురతం జేసి తొలంగఁ ద్రోచితి భవత్పుత్రత్వపుత్రత్వముల్
పరికీర్ణం బయి యేకవాక్యనన చెప్పఁగ వేరు నీతో సా న
న్వరు లై త్రిలోక్యహితార్థజన్మవిధి భవ్యం బయ్యె నీ కెమ్మెయిన్.

తే. అమరవిభుఁ డెట్లు సర్వభూతావళికి న, వధ్యుఁడై యుండు నట్లు ప్రసన్నసంబు నొందు నీవును రిపులకు నుర్వి నెందు, నెన్వరికి నూర్జితరాక పుంపుసుగుణిమి.

చ. వనితల కెల్ల నెక్కుడన వాలినపేర్మి నహించు నివ్వరా
నన యగు సత్యభామయు ననన్యవిలాస మెలర్ప నిత్యవరా
వనరుచి నొప్పుగాత మనవద్యత నీవు మహీతలంబుపై
ననఘ మనుష్యమూర్తి యలరారఁగ నుండెదునంతెగాలమున్.

వ. అని యిట్లు దేవమాతవలన లబ్ధవరుండై యానర్వలోకవరిష్ఠుండు తల్లినిం దోఁబుట్టువు వీడ్కొని వైనతేయసమారోహణంబు సేసి దేవేనమేతంబుగా దేవోద్యానంబు నాలోకించుకౌతుకంబునం జని నందనప్రముఖంబు లగువానియందెందునుం జరియించి.

శ్రీకృష్ణుఁడు సత్యభామాప్రేరితుఁడై పారిజాతంబు గొనితెచ్చుట.

సీ. మందాకినీపద్మమధువులు మాని తుమ్మెద లిద్ధకుసుమసంపదకుఁ జేరి
నిత్యంబు వేల్పుఁగన్నియలు శాఖాందోళ మొంది యాటల నేడ్కనుల్ల సిల్ల
నాఁటినాఁటికి వచ్చి నవనవంబుగ నచ్చరలు హృద్యనై పథ్యరచన వడయ
భువనసంచరణవిస్ఫుటఖేదమున సిద్ధమిథునముల్ నీడలు మెచ్చి నిలువ
మేరునిర్ఝరపవనంబు మెలఁగి నూత్న, మంజగులఁ గదలించి వైమానికులకు
సౌరభంబులు గొనిపోవ సార్వకాల, గరిమ నొప్పారుకల్పవృక్షములు గాంచి.

వ. అమ్మహీరుహంబులందు.

క. ఏతరువు సురాభ్యర్చిత, మేతరువు కరం బభీష్ట మింద్రాణికి వి
ఖ్యాతం బేతరువు నిజవి, భూతిఁ ద్రిభువనంబులం బ్రభూతస్థితులన్.

క. ఏతరువుసమీపమునకు, నేతేరఁగ నాక్షణంబ యెంతయు నరుఁడై
జాతిస్మరత్వమగు నే, జాతికినే నట్టిపారిజాతముఁ గనియెన్.

ఉ. అత్తఱి సత్యభామ తనునాదిసురాంగనగాఁ దలంచు న
య్యుత్తమదివ్యవాసన సముత్థితయై మదినుల్లసిల్లి చె
న్నొత్తినవేడ్క నవ్వరమహీరుహముం గనసొమ్ము సేఁతకై
మొత్తననేఁడెఁ జిత్తవిభుమేకొని యచ్చొటుపుండుఁ జెచ్చెరన్.

తే. పెఱికి పారిజాతముఁ దార్క్ష్యు పెద్దవీఁపు, మీఁద నిడుకొని ప్రియకాంత మెచ్చి యలర
దేవలోకంబు వెలువడఁగా వనంబు, గాచి యున్న కింకరులు పెక్కండ్రు గడఁగి.

వ. అడ్డపడి యనేకశస్త్రాస్త్రవిలసనంబుఁ జూపిన నప్పు డయ్య సర్వగుణుండు.

మ. స్ఫుటశార్ఙ్గచ్యుతదివ్యబాణపటలస్ఫూర్జత్ప్రభావంబునం
బ్రకటితగ్రీవుల దారితోదరుల నిర్ధూతాంఘ్రులన్ భిన్నహ
స్తతులం జేయఁగఁ గొంది తేఁగి యధికత్రాణంబునం జెప్పి రి
ప్పాటు బాహావిభవుం డొనర్చుసక్రియాపర్యాప్తి నోత్రారికిన్.

క. దేవాధిపతియు మదిలో, నావిభుఁడు త్రిలోకహితసమాచరణకళా
కోవిదుఁ డగుట యెఱింగి య, థావిధ మగుతత్కృతంబు తగ నొడఁబడియెన్.

తే. మనసు పట్టలేక యనిమిషకోటిలో, సరిగి యుతనిఁ దాఁకి యనియొనర్చి
వజ్ర మతనిమీఁద వైచి తద్వేగసం, స్తంభనమున మదము దక్కఁ దక్కె.

వ. అమ్మహాత్ముఁ దలంచి తదీయనివృత్తిపర్యంతంబు దివ్యమహీరుహంబు మహీత
లస్పర్శిగా నుండంబనిచి యమరావతికిం జనియె నిత్తెఱంగునం బారిజాతంబుగై
కొని కృష్ణుండు నిజపురాభిముఖుం డయ్యె నట్లున్న నరకాసురవధానంతరంబున
నయ్యనంతగుణమణిపర్వతుండు మణిపర్వతాభిగమనం బొనర్చుసమయంబున
నమరవల్లభుండు విశ్వకర్మ రావించి గోవిందుండు దేవహితార్థం బనేకసంగ్రా
మంబులు సొచ్చి యచ్చెరు వగుపరాక్రమం బాచరించువాఁడీనాకంబున నే
నెట్లువిహరింతు నట్లతండు మర్త్యలోకంబునం గ్రీడింపవలవదే తన్నగరంబున
కింకను జెలువంబు లక్కజంబుగా సమకూర్పుము భువనంబు లన్నిట నెన్నిసద్వ
స్తువులు గల వన్నియుం దెచ్చి యచ్చట నునుపుము నాకుఁ బ్రియంబు సేయ
వలతేని యింతయు శీఘ్రంబ కావించుట కర్జంబుగాఁ జూడుమనిన నియ్యకొని
చని యమ్మహాప్రభావుండు.

క. తనవిద్యాతపములచే, తనుపార్జిత మైనపేర్మిఁ దగ నఖిలంబున్
వినియోగించి విభునిపం, చినకంజెలు నుదాత్తచిత్రశిల్పము దొడఁగెన్.

వ. ఇట్లు తొడంగి యెనిమిదియోజనంబుల పొడవును బండ్రెండుయోజనంబుల నిడుపును నై నయమ్మహానగరి తద్విస్తారప్రమాణమహనీయయు ననేకరాజమార్గరథ్యాచరణలలితయు మణికనకభాసురప్రాసాదసహస్రశోభితయుఁగా నిర్మించి వాసుదేవునగరు నలుదెసల నాలుగుయోజనంబులవిస్తారంబు గలుగ రచియించి మొగసాలలు నరుఁగులుఁ బసిఁడిఁ దీర్చి యతనిమందిరం బర్ధయోజనవిస్తీర్ణంబై విరజం బనుపేర నూఱుహస్తంబులపొడవునం బొలుపొందు పటికంపుఁగంబంబులు వైడూర్యపట్టికలును వజ్రకవాటంబులుం గాంచనకుట్టిమంబులు గరుడాశ్మకుడ్యంబులు నుల్లసిల్ల నొనర్చి సికిశోభ్యాను లగుమహిషు లెనమండ్రకు వేర్వేఱ యనురూపగృహంబు లమర్చి యన్నిటికిం బ్రదిదివసదనంబులం గలయొప్పిదంబు లెల్లఁ దెచ్చి పెట్టి వైజయంతం బనునచలంబు పష్టితాలోచ్ఛ్రితం బగుశృంగంబును నాదిత్యమార్గగామి యగుసుమేరుశిఖరంబును లోకంబులు గనుంగొనం గొనివచ్చి క్రీడాపర్వతంబులుగా నిలిపి దివ్యంబు లగుసరస్సులాకర్షించి తెచ్చి కేళీదీర్ఘికలుగానుంచి నందనప్రముఖంబు లగువనంబులలోనితరువులు పారిజాతంబు చిక్కం బెట్టు దెచ్చి శృంగారింపుఁదోఁటలో నాటి కోటలు గోపురంబులు దివ్యంబు లగుసర్వద్వారసంక్రమంబులును దేవాసురుల కసాధ్యంబుగా సంగసలకైన నిలిచి కైసేయవచ్చునట్లుగా నపరిమితయంత్రాట్టాలకపతాకాపరికల్పితంబులుగా సంఘటించి పరిఖలు పాతాళస్పర్శినులును దుస్స్పర్శతిమిమకరసంకీర్ణలుం బూర్ణసలిలసేవ్యలు నపరిభాష్యసన్నివేశప్రకాశితలుఁగాఁ బచరించి పురంబు తూర్పుదిక్కున రైవతంబు దక్షిణంబున లతావేష్టనంబు పడమట సకక్షయంబు నుత్తరంబున వేణుమంతంబున ననుగిరులకుఁ గనకశైలకైలాసమందరంబులు మొదలయినసగంబుల నేమేమివిశేషంబులు గల నవియన్నియుం గలుగ నుత్పాదించి వానికెలంకులఁ జిత్రకంబు భార్గవంబు పాంచజన్యంబు పుష్పకం బనుదేవోద్యానంబులు ప్రతిష్ఠించి నలిని పుష్కరిణి లోనైననురసరిత్తులు పురపరిసరంబున సాగరగాములుగాఁ గల్పించి యిట్లు విశ్వప్రభావవిభాసితయైన ద్వారవతి నమరావతి నతిశయిల్లునట్టిపేర్మి యావహించి దేవశిల్పి దివంబునకుఁ జనియెఁ దదనంతరంబ.

## శ్రీకృష్ణుఁడు పారిజాతంబుతో నిజపురంబునకుఁ వచ్చుట.

క. చనుదెంచె గరుడగరుదం, చనచంచలసకలభువనసంచయుఁ డగుచున్
వనజాక్షుఁడు నిజనగరికి, వనితాప్రియపూరణోత్సవపురస్సరుఁడై.

ఉ. అప్పురియొప్పిదంబులు ప్రియం బెలరారఁగఁ జూచుచుం బ్రభుం
డుప్పురవీథి నేగి తమయుత్తమధన్యనివేశనంబునం
దొప్పఁగ విశ్వకర్మరచితోజ్జ్వలబంధురసౌధనాథుపై
నప్పతగేంద్రుపై నెరఁగి యక్కడనుండి సముత్సుకద్యుతిన్.

తే. పాంచజన్యంబుసకలదిగ్భాగకంప
కారిభూరిఘోషంబుగాఁ గడఁగి యొత్తు
టయును యదుసమూహముఁ బౌరచయము నద్భు
తమున సంభ్రమమున నుద్యతంబు లయ్యె.

వ. అంత నయ్యనంతశాయి చుట్టలుం జెలులును గరుడోపరిభాగంబున శంఖచక్ర
శార్ఙ్గాదిపరికరంబు లలరసత్యభామాసమేతుండై తేజంబున దినరాజసమానుం
డగునాజగత్పూజితుం గని విగతశోకులు ప్రమోదమేదురమానసులు నగుచు
ననేకకల్యాణతూర్యనాదంబులతో నుగ్రసేనునుదేవులం బురస్కరించుకొని
తదీయం బగునాదివ్యగృహంబునకుం జను దెంచిన.

సీ. వైనతేయుని డిగి వచ్చి వృద్ధులకును గురులకు భక్తితో మ్రొక్కి నెరఁగి
తమ్ములఁ గొడుకులఁ దత్సమవాత్సల్యసౌభాగ్యలఁ బరిరంభణోపచార
ముల నాదరించి యంభోరుహనేత్రుండు తల్లు లేతెంచినఁ దత్ప్రమోద
మువ్పొంగ వినతుఁడై యుచితమంత్రిపురోహితార్యసేనావల్లభాదిజనుల
సత్కరించి వారు సంప్రీతిఁ దను వేన, వేల్విధములగారవింప నప్పు
డయ్విహంగవిభుని యటకటిపై మణి, పర్వతాగ్ర మిష్టభంగి డించి.

వ. పారిజాతంబును నవతారితంబు సేసి ప్రద్యుమ్ను నాజ్ఞాపింప నతం డయ్యుత్తమ
తరువు నంతఃపురంబునకుం గొనిపోయెఁ దత్సన్నిధానంబున నకలకురాంధక
వరులుఁ గుమారులును దివ్యంబు లగుతమపూర్వజన్మంబులు సంస్మరించి యది
తదీయప్రభావంబుగా నెఱింగి యద్భుతంబు నొందిరి గోవర్ధనధరుం డాధరణీధర
శిఖరంబును నవ్విటపిప్రవరంబును బ్రశస్తంబు లగునెలవులం బ్రతిష్ఠితంబులు
సేయించి.

తే. అసురకింకరకోటిచే నతులకనక, శిబికలందుఁ దెప్పించిన విబుధకన్య
లందఱును వృష్ణివృద్ధులయనుమతమునఁ, దాను వరియించినాఁడయ్యోదత్త గాంబ.

చ. తొడవులఁ జీరలన్ వివిధతోషకవస్తువులం బ్రహర్ష మిం
పడరఁగఁ జేసి యందఱకు నర్హగృహావళు లేర్పఱించి య
ప్పుడ తనయుత్తలున్ సకలబంధులు దేవులు గారవింపఁగా
నొడఁబడి వింతచంద మొకఁ డొందక చెందిరి సంప్రమోదమున్

అత్తలకు మ్రొక్క తక్కటి, క్రొత్తడు లందఱకుఁ బ్రియము నొసలునిగుడంగా
సత్తితి తిలకించె వరవ, ధూర్తమ యై సత్యభామ యుజ్జ్వలగరిమన్

వ. తదనంతరంబ.

సీ. బహుసంగరక్లేశభారసహిష్ణుఁడై తనకుఁ దోడ్పడినమ్మదం బొనర్చి
కొలిచినయాపక్షికులనాథు వీక్షించి వనజాక్షుఁ డాదరార్చనలఁ బ్రీతుఁ
గావించి చెలికానిఁగాఁగ మన్నించి పొమ్మని వీడుకొలుపంగ నమ్మహాత్ముఁ
డతిభక్తిఁ బ్రణమిల్లి ప్రాంజలియై దేవదేవేశ యొప్పుడు నీవిశుద్ధ
బుద్ధి నాదెస నెలయునవ్యతముగాఁగ, నవ్వనాశేతంచువాఁడ నీయాజ్ఞ చేత
కదిసునిశ్చిత మని దివి కేగఁ బఱె, సవనభూతోర్ములై పరితృప్తులు గలఁగ.

వ. ఇట్లయ్యాదవేశ్వరుండు యదుకులం బఖిలంబు తనవిజయం బభినందింప సభా
మండపంబు ప్రవేశించి యుగ్రసేనవసుదేవుల సగ్రాసనంబుల నునిచి రోహిణీ
సహిత యగుదేవకీదేవి నభ్యర్థించి యదితిం బూజించుబిడౌజుండునుంబోలెఁ
బూజించి యప్పుణ్యశాలిని సంతఃపురంబునకుం బనిచి యగ్రజుండునుం దాను
నంచితోజ్జ్వలపీఠంబుల నాసీనులై వృష్ణిపను లుచితప్రదేశంబులఁ బ్రవేశించి నివ
సింపఁ గింకరసమానీతంబు లగునిజభుజవిజితవిషయంబులు వేర్వేఱ యాలోకించి.

క. కమనీయములును బహుమూ, ల్యములు ననర్ఘ్యములు నై నయవి గురులకుఁ జు
ట్టములకుఁ జెలులకు నుచిత, క్రమ మొప్పఁగ నిచ్చెఁ బ్రియము గడలుకొనంగన్.

వ. విశేషించి సాందీపుని నధికార్చనంబులం దనిపి యుగ్రసేనశశ్త్రంబులకు
నగ్రిమభూషాంబరాదు లిచ్చి పుచ్చి శేషించినయర్థంబులు భాండాగారంబులుగా
నునిచి రథగజతురగాదులకు నధికారుల నియోగించి గ్రహనక్షత్రపరిపూరిత
మైనవియద్వీథిం బోలుపారుపూర్ణచంద్రునుచందంబున ననేకయదువీరపరికీర్ణ యగు
సభకు నెక్కరుండఁ యలంకారంబై మెఱసి యందఱుఁ గలయం గనుంగొని
యిట్లనియె.

చ. అనుపమ పుణ్యకీర్తు లగునట్టిమహాత్ములు మీర లిందఱున్
గొనకొని నిర్వహించునవికుంఠితదానదయాదిసాధువ
ర్తనములు లావ చూవె సురదైత్యుల కైన నవధ్యుఁ డైన నశ
త్రుని నడఁగించె నాదయినదోర్బల మె ట్లది యిట్టినేఁతకున్

వ. అనినఁ గృతాంజలులై వార లద్దేవు నుపలక్షించి.

శా. నీమాహాత్మ్యము నిక్కవం బెఱిఁగి వర్ణింపంగఁ బూర్ణోక్తియం
దేమెవ్వార మశక్తు లిప్పనికి వాగీశాదులు న్నిర్జర

క్షేమస్తోమ మొనర్చి ధర్మమున కుత్సేకంబు గావించితోఁ
బ్రేమన్ ధన్యము సజ్జనప్రకర మన్వీత్వార్థము ల్లోకముల్.

వ. భవత్ప్రసాదోపజీవు లయినయస్మదాదులు త్రైలోక్యవిజయు లగుట సెప్పనే యని పెక్కువిధంబులం గొనియాడుచున్నసమయంబున నారదుం డరుగుదెంచి యదుసమాజంబుచేతం బూజితుండై పరమాసనంబున నుండి.

నారదమహాముని శ్రీకృష్ణునిప్రభావము యాదవుల కెఱింగించుట.

క. అంభోజాక్షుని కేలు క, రాంభోజమునం దెమల్చి యయ్యంపటితో
నంభోదనాదనిర్భర, గంభీరస్వర మెలర్పఁగా నిట్లనియెన్.

క. యాదవులార మహాభుజు, లీదేవుఁడు వాసుదేవుఁ డలను గృతార్థ
ప్రాదుర్భావము నొందిన, యాదిపురుషుఁ డిట్టు లగుట సన్నుతిభంగిన్.

తే. ఇతనిమహిమ మీకందఱ కెఱుఁగునట్లు, గా సవిస్తరవ్యాఖ్యానకలన సేయ
నరుగుదెంచితి నేనునిర్జరవరేణ్య, ప్రార్థనంబున సమ్మోదభరితబుద్ధి.

వ. ఇమ్మహానుభావుండు బాల్యంబునుండి యెయ్యవి యొనర్చె నింక నెయ్యవి సేయనున్నవాఁ డానుకర్మంబు లన్నియుం గ్రమంబున వివరించెద వినుండు.

సీ. ఉగ్రసేనాత్మజుఁ డుగ్రపరాక్రముఁ డాకంసుఁ డదయుఁడై యఖిలవృష్ణి
కులమును జీరికిఁ గొనక జరాసంధుప్రాపున నేపారి భవ్యరాజ్య
పదవైభవము దాన బలిమిమైఁ గొని తండ్రిఁ జెఱవట్టె నట్టిపాపిష్ఠుఁ జంపఁ
బుట్టినవాఁడుగా బుద్ధిలోఁ గనుఁగొని వసుదేవుఁ డనఘుఁ డీవాసుదేవు
మధురయ్యనువనంబున నుప్పమహితగోకు, లంబునం దుంచె నీతఁ డలంఘ్యతేజుఁ
డగుట నేమిభంగుల నపాయంబు నొందక, కద్ధవహ్నియుఁబోలె నుదీర్ణుఁ డయ్యె.

ఉ. చంటవిషంబు మెత్తుకొని చంపను నర్భకు నంచు వచ్చి ము
వ్వంటలనాఁడు పూతన యవారణ నెత్తికొనంగఁ జన్నుఁగా
ల్గొంటయుఁ బ్రాణము ల్దిగిచికోలును నుక్కటిగాఁగ నీతఁ డా
గొంటునిశాచరి న్వసుధఁ గూల్చుట వింటిమి కాదె యేర్పడన్.

క. ఇరుమూఁడునెలలశిశువై, చరణచలనకేళిఁ గపటశకటముఁ దాఁచెం
బురుషోత్తముఁ డింతింతలు, మురియలుగా నిట్టిసత్త్వములు మహిఁ గలవే.

చ. చనుమహా చూతము నీతెఱంగనుచు నుత్సాహంబుతోఁ దల్లి దా
మెనత్రాటన్ బెనుఱోటితోన మును బల్మిం గట్టినం బాఱి సం
దున వేగంబ తగిల్చి యీడ్చి బలుమద్దుల్ రెండు నున్మూలనం
బును బొందించె మురాంతకుం డరిది యీపాల్పొందుటల్ చెప్పఁగాన్.

దాననకాదె దామోదరనామం బమ్మహాత్మునకుం బ్రసిద్ధం బయ్యె మఱియు.
కాళిందీనదిలోనఁ గాళియమహాకాళాహి నుద్యద్విష
జ్వాలాకర్ణకరాళదంష్ట్రుఁ బడగల్ స్రగ్గం బౌరెంద్రొక్కుచుం
గేళీనర్తనమాచరించి యడఁచెన్ గృష్ణుండు గోపాలనా
వేళం జేసెను నిమ్మహాత్మునకునుం ద్వేషంబు లాభీలముల్.
జడిదాఁకి నడఁకుపసులకు, గొడుగుగ దివసంబు లేడు గోవర్ధనమున్
వడిఁ బెఱికి యట్లు దాల్చిన, కడిఁదిబలం బరయ హరికిఁ గలరే సదృశుల్.
మ. సకలారిష్టుఁ డరిష్టుఁడన్ దనుజుఁ డిచ్చన్ గోపికాభీకర
ప్రకటోత్తుంగశరీరుఁడై వృషభరూపస్ఫూర్తిఁ బైఁబాఱుదెం
చి కఠోరం బగుశౌరిబల్లిదపుముష్టిం గంట మృత్యుప్రస
క్తికిఁ బాలయ్యెఁ బ్రవృద్ధిఁబొందదె త్రిలోకీహర్షమై యిమ్మెయిన్.
క. తురగాకృతి యగుదానవు, నిరుపరియలు గాఁగఁ జీగె నేమని పొగడన్
బురుషోత్తముశితనఖభీ, కరపాణిక్రకచ మెట్టికడిఁదిగొ కనుఁడా.
తే. స్నానవేళన యక్రూరునకు భుజంగ, భోగశాయిని యగు నిజపుణ్యమూర్తి
నియతిఁ బ్రత్యక్షముగఁ జూపినిరతమహిమ, దెలుపఁజేయాంతఁడతిధన్యస్పృష్టినలర.
క. అవలీలం గువలయపీ, డవిభేదనకేళి కుత్కటం బగుయశమి
య్యవనీధరుం డొనర్పఁడె, యవిరళవిస్ఫూర్తిఁ గువలయాపీడముగాన్.
క. లీలమెయిం జాణూరుని, గోలె మ్మొత్తండు విఱిచి ఘోరధ్వని జం
ఘాలుండై పంపెఁ గదే, త్రైలోక్యమునకు మనోజ్ఞతరశుభవార్తన్.
చ. ఘనచరణాభిఘాతములఁ గంసుశిరోమణు లుర్విరాల్చి యి
య్యనుపమశౌర్యుఁ డంఘ్రినఖరాభిహతిం గిరికుంభపీఠభే
దన మొనరించి మౌక్తికవితానము రాల్చుమృగేంద్రువిక్రమం
బు ననుకరించెఁ దత్కథలు మ్రోయుచు నున్నవి లోకపఙ్క్తులన్.
క. చచ్చినసాందీపునిసుతుఁ, దెచ్చె జముని నొడిచి యంచు దితిజధ్వంసున్
మెచ్చుట యాటది యీతని, యిచ్చకు మార్పడఁగ వశమె యేవేల్పులకున్.
వ. మఱియు ననేకవీరలోకసహాయుం డగుజరాజసంధుం బరాజితుం గావించుటయుఁ గాలయవనుం గాలవశంబు నొందించుటయు రుక్మిం బరిభవించి రుక్మిణీదేవి నుద్వహించుటయు మురపాశకర్తనంబులు మొదలయినపనులు మున్నుగా నర కురిగూల్చుటయు నాలోకింప వైకుంఠపౌరుషోత్సేకంబులు త్రిలోకవంద్యంబు లిటమీఁదట బాణాసురావధూననంబు శిశుపాలనిపాతనంబు ధనంజయసాహాయ్యం బాదిగా నిమ్మహాత్ముండు విచిత్రంబు లగుదివ్యచరిత్రంబులు ప్రకటింపం గలవాఁ. డివ్విధంబున నివ్వసుంధరపై నతిచిరం బగుకాలంబు కేళిసలిపి భూభా

రావతరణం బొనర్చి సమంచితోద్యానప్రాకారగోపురశోభిని యగునిజరాజ
నంబుధికి సమర్పించి మానుషత్వంబు పరిత్యజించి యాత్మప్రకృతియందు
ష్ఠుం డయ్యెడు నిట్టి మాహాత్మ్యంబునం బరఁగెడునియ్యాదిదేవుండు.

చ. అనుపముఁ డప్రతర్క్యుఁ డజరామరుఁ డాఢ్యుఁ డనంతుఁ డచ్యుతుం
డనఘుఁ డపేతదోషుఁ డనపాస్తగుణుం డతినాత్మనఃప్రప
ర్తిసుఁడు నితాంతభక్తికలితస్థితిఁ బెక్కుభవాయుంబుపుణ్యుల
స్మనుచు సమస్తసంపదసమానులఁగాఁ బరికించు సత్కృపన్.

క. మీఁగును నిర్విభుమహీశుల, నాఁగిసి కనుఁగొని కృతార్థతావాప్తికినై
యామూర్తి మనోవాక్క, ర్మారబ్ధసపర్యలగుఁ డనాంతభక్తిన్.

క. అని చెప్పిననారదముని, సనఘులు యాదవులు బహువిధార్చనములఁ బ్రీ
తునిఁ జేసిరి హరి వీడ్కొని చనియె నతం డాత్మయోగసన్నద్ధగతిన్.

శ్రీకృష్ణుఁడు పారిజాతకుసుమసమర్పణంబున సత్యభామాదులకుఁ బ్రియంబుసేయుట

వ. గోవిందుండును నందఱం బ్రియపూర్వకంబుగా వీడ్కొలిపి యుగ్రసేనవసుదే
వులఁ దన్మందిరంబుల కనిచి నిజదివ్యగేహంబు ప్రవేశించి ప్రతిదినసోచితంబు
లగునభిమతవిహారంబుల వర్తిల్లుచు.

సీ. ఎలరారుక్రొవ్విరు లెత్తులు గట్టి యొయ్యారంపుఁగ్రొమ్ముడి సలవరించి
పరువంపుఁబుప్పొడి బాగుగాఁ దీర్చినయలకలపై బొలుపార నలికి
జిగిదేఱునెనకంపుఁజగురుచెక్కున నీడ గానరా నవతంసకంబొనర్చి
నవకంబు మీఱుక్రొన్ననదండ సవరించి వలిచన్నుఁగవకుఁ జెన్నొలయఁ జేసి
సర్వకాలసమృద్ధి నాశ్చర్యమైన, పారిజాతంబు సిరియొల్లఁ బ్రణయమలర
సత్యభామకు నిచ్చి నిచ్చలుఁ బ్రమోద, జలధి నోలాడె సరసతాకలన వెలయ.

వ. మఱియు నతండు.

క. ఆకల్పతరువునందు న, వాకల్పోత్కరము లమ్మృగాక్షి నిజసప
త్నీకోటి కొసఁగి పెంపులు, గైకొనఁ గని యలరు నంత కామోత్సవులై.

మ. తనప్రత్యర్థినిఁ గూల్చి యాత్మవిభవస్థైర్యంబు గావించి నాఁ
డని యవ్విష్ణుదెసం దిరంబగుప్రియం బందంగఁ గర్తవ్యమై
నను దేవేంద్రుఁడు పారిజాతతరుశూన్యం బైనయుద్యానముం
గనుపోలోమిముఖంబు దైన్యమునకుం గాఁ గందుఁ దా నద్దివిన్.

తే. అదితిదేవికి మణికుండలార్పణంబు, శచికిఁ బారిజాతావతంసకవిరతియుఁ
జేసి హరిభక్తి వాసవుచిత్తమునకు, మోదఖేదపాత్రతతుల్యముగ నొనర్చె.

క. పదియాఱువేలనూర్వురు, మదవతులందును విచిత్రమంజులరతిసం
పదమెఱయ నమ్మురుందుఁడు, మదిదారును నద్భుతైకమగ్నత నలరెన్.

క. అందఱు హరిదెసఁ బ్రణయ, స్యందిమనోజ్ఞలును లబ్ధసంతానలునై
నందించిరి హరిమహిమల, చందము నజునకును బొగడ శక్యమె బుద్ధిన్.

తే. అని పరీక్షిత్తనూజున కతులబుద్ధి, యుతుఁడుసాత్యవతేయశిష్యుఁడు ప్రియమున
వాసుదేవమాహాత్మ్యవిలాసభంగు, లెఱుఁగఁ జెప్పినకథయెల్ల నింపు మిగుల.

శా. వీరశ్రీసహకారిదక్షిణభుజావిస్ఫూర్జితాలంక్రియా
సైరంధ్రీవ్రతశాలిఖడ్గలతికాసంభావ్యభవ్యోద్యమ
స్వైరాకృష్టవిరోధిపార్థివరమాసర్వస్వసద్వంచక
స్మేరాంతఃకరణానుపాలితజగన్మిత్రాయుతోద్యద్గుణా.

క. పండితగోపవిమతవే, దండదళనచండఖడ్గధరణాధరిత్రీ
మండలమహాప్రియానయ, మండలికరగండభువనమండనమహిమా.

మాలిని. స్మరవిగమితకాంతామానమానాద్యగణ్యా
శరవిగణితశత్రూత్సాహసాహాయ్యసిద్ధా
కరవిలసితదానాకల్పకల్పప్రతిష్ఠా
దరవిరహితచేతోధర్మధర్మార్థజన్మా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద
సౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్ష్మణాభిధేయ
యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైన హరివంశంబున నుత్తరభాగంబు
నందుఁ జతుర్థాశ్వాసము.

ఉత్తరభాగము - పంచమాశ్వాసము.

క. శ్రీమత్కవితాగర్విత, భీమోద్దామావళిప్రతిష్ఠితవిభవ
స్తోమారిపుసీమ కోమటి, వేమ సుజనసార్వభౌమ విక్రమరామా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నివ్విధంబునం గళత్రపుత్ర
పౌత్రవిశేషంబుల నతిమానుషం బైన త్రైలోక్యదుర్జయపరాక్రమంబున నద్భుత
క్రమంబై ధనధాన్యసైన్యదుర్గపరికరంబున నధికదుర్భరంబై పరఁగుమాధవుమా
హాత్మ్యంబున కచ్చెరువంది యచ్చతురంతమహీమండలంబునం గలమహామండ

లేశ్వరు లెల్లఁ దత్సంపదలు సూడ వేడుకపడుడెందంబులం దమకం బొదవు చుండ నుండి రిట్లుండి యొక్కసమయంబున సుయోధనుండు నిజాధ్వరంబునకు రావింపఁ గరిసగరంబునకు వచ్చి తదనుష్ఠానం బవసానంబు నొందినయనంతరంబు.

దుర్యోధనాదిరాజులు శ్రీకృష్ణుని దర్శించుట.

క. అందుండి దూతముఖమున, నందఱు సందర్శనేచ్ఛ యచ్యుతునకు నిం పొంద నెఱిఁగింపఁగా విని, మంధరధరుఁ డగ్గలంపుమన్నన వెలయన్.

ఉ. రండని మాఱుదూత ననురాగముగాఁ బనుపంగి వచ్చి రొం డొండ రథద్విపాశ్వసుభటోచ్చ్రయచండమహాసమూహముల్ చండమయూఖమండలవిలంఘివిశృంఖలభూరిజన్సము చ్చండసముద్ధతి న్నడువ శౌరిపురంబున కొక్కయుమ్మడిన్.

వ. ఇట్లు దుర్యోధనాదు లగుధృతరాష్ట్రనందనులు నూర్వురుం దద్వశవర్తు లగుదొరలును బాండవు లేవురుం దదీయబాంధవు లగుధృష్టద్యుమ్నప్రముఖులుం బాంఢ్యచోళకళింగులును మొదలుగా సకల మహీపతులు పదునెనిమిది యక్షోహిణులతోడ నేతెంచి రైవతప్రాంతంబున సద్దెసం బెక్కుయోజనంబులపఱపున బలంబులు విడియించి వేర్వేఱ నవరణలు చిందంబులు నైశ్వర్యంబులు మెఱయ నెఱసి యున్నంత.

మ. బలదేవుండును సత్యకప్రభుఁడుఁ బ్రద్యుమ్నుండునున్ లోనుగా బలుపై తో నడువన్ రథేభతురగప్రస్ఫీతసైన్యంబుతో బలవచ్చక్రగదాదిసాధనము లొప్పం బెద్దతేరెక్కి యు జ్జ్వలవేషంబున శార్ఙ్గివెల్వడియెఁ దత్సంభావనాభ్యర్థియై.

చ. వెఱవడిపోయి సర్వపృథివీపతులుం దనుఁజేరరాఁగ వా రలఁ దగుభంగులం గని పురస్క్రియ లోలిన మెల్లవారి క గ్గలపుఁబ్రియంబుతో నడపి గౌరవ మొప్పఁగ వారు సుట్టుసుం బలసి భజంపఁ జంద్రుఁ డుడుపఙ్క్తులలోఁ జెలువొందుచాడ్పునన్.

తే. అధికముగ నొప్పికొలువుండి యర్ఘ్యభాష, ణములఁదన్మానసములకానంద మొసఁగి వరుస వివిధమహాసర్ఘ్యరత్నకోటి, గణన మిగులంగ వారికిఁ గట్టనిచ్చి.

క. నావారు నేను ధనములు, మీవారును మీధనంబు మీమదికిఁ బ్రియం బోవీరులార యడుగుం డేవైనను దెచ్చి యిత్తు నెచ్చటివైనన్.

క. అనిపలికి వారినెయ్యము, దనరఁగ ననదృశమనోజ్ఞతరవాక్యములం దనమన మలరఁగ గోష్ఠికిఁ, బనుపడి యేపారి యచటఁ బ్రభుఁ డున్నతఱిన్.

చ. కదలనిక్రొమ్మెఱుంగు పొడగల్గినశారదనీరదం బొకో
యిది యని సంశయించుచు మహీపతు లెల్లను మీఁదుచూడఁగా
నెదవుపిశంగజూటమును నుజ్జ్వలదేహ మెలర్పఁదోఁచె నా
రదుఁడు ముకుందసద్గుణపరంపర వీణ గదల్చి పాడుచున్.

వ. తదనంతరంబ సంపూర్ణసుధాకరుండు వసుధాతలంబునకు నవతరించువిధంబున దివిజపథంబుననుండి యారాజసమాజంబున కవతీర్ణుండై యందఱచేత ససంభ్రమసముత్థానంబుల నంజలివిరచనంబులఁ బూజ్యమానుం డగుచు మాధవుం గనుంగొని సకలజనశ్రోత్రసుందరం బగుచుండం గలయం గనుంగొని.

క. అమరులు లోనగుజగముల, సమితాద్భుతకీర్తితో మహాధన్యుఁడవుం
గమలాక్ష నీవు నీతో, సము లెవ్వరు నిక్కవంబు చర్చింపంగన్.

తే. అనిన నవ్వుచు నవ్విభుఁ డతనితోడ, ననఘ యద్భుతాత్మకుఁడ నత్యంతధన్య
తముఁడ నగుదు నేనెకఁడన విమలదక్షి, ణాభ్యుపేతసద్భావన యమరునేని.

ఉ. నావిని నారదుండు యదునాయక నాచనుదెంచునట్టి కా
ర్యావధి సిద్ధ మయ్యెఁ బ్రియ మందితిఁ జెచ్చెరఁ బోయి వచ్చెద
న్నీవుమనీమహీవిభులు నిర్భరహర్షము నొందుచుండుఁ డీ
చ్ఛావిహితానులాపసరస్థితిసౌహృదగోష్ఠి నిచ్చలున్.

సీ. అని గమనోద్యుక్తుఁ డగుమునీశ్వరుఁ జూచి జననాథులాజనార్దనునితోడ
నిమ్మహాత్ముఁడు వచ్చి యిప్పుడు నిన్ను నుద్దేశించి పలికినతెఱఁ గితనికి
నిపుడు ప్రత్యుత్తరం బిచ్చినవిధమును గూఢార్థమైనది గోరి యితఁడు
నింతన సంతోష మెంతయుఁ గని పోవఁ గడఁగెడుఁ దెలియంగఁ గడఁది మాకు
నిట్టి యీదివ్యసంకేత మేర్పరించి, తెలుపఁ దగునే జలజనాభ తెలుపు మిప్పుడ
యనినఁ గృష్ణుండు మీకు నియ్యతివరుండ, దీని నెఱిఁగించు ననుటయు దేవమునియు.

### నారదుఁడు శ్రీకృష్ణుని ప్రభావంబు రాజులకెల్లం దెలియఁ జేయుట.

వ. వాసుదేవునిశాసనంబు గైకొని నిలిచి సమ్యగ్విహితాసనంబున నాసీనుండై యా సర్వమహీపతుల నాలోకించి యిట్లనియె.

క. వినుఁ డేను గంగలోపల, ననుపమనియమవ్రతివశాకలితస్నా
ననిరూఢి నుండి యొకనాఁ, డనుఁ బదయించుతఱిఁ జోద్య మెంతయు మిగులన్.

తే. క్రోశమాత్రము పఱపైనకూర్మ మొకటి, శైలకటకంబుచాడ్పున జలధి వెడలి
దరికి నెయ్యనే తేరఁగ దానిదేహ, మేను జేసంటి నవ్వుచు నిట్టులంటి.

క. అక్కజపుమేనితోని, ట్లొక్కఁడవును శంకలేనియుల్లమలర నీ
విక్కడ మెలఁగెదు ధన్యత, నెక్కొని నీయంద నిలిచె నిజము జలచరా.

ఉ. చిదియవు కొండపైఁబడినఁ జీమచిటుక్కనినంగరంబులుం
బదములుఁదోఁకయుం దలయు బల్విగుపూనిక వడంకోకింతయుం
గదలక నిల్చి యొయ్యొ సురుఁగింబడి పోవఁగ నేర్తు లాగుమై
నుదకములోని కిట్టి తెఱఁ గున్నదియే పెరసత్త్వకోటికిన్.

చ. అనవిని కూర్మ మిట్లను మహాపురుషా ననుఁ జూచి యద్భుతం
బన నిది యెంత నాదగుకృతార్థత యేటిది మత్స్యమంబులై
పెనుపవు సత్త్వము ల్గాలఁదివెట్టఁగరానివి లోఁజరింప సొం
పెనసినగంగగాక భువి నెందు మహాద్భుతయుం గృతార్థయున్.

క. నావుడు జాహ్నవిఁ జేరొక్కని, నీవద్భుతధన్యభావనిరుపమ వంటి
న్నావాక్యమునకుఁ గృప న, ద్దేవియుఁ బొడసూపె నవ్వదేటెడుచూడ్కిన్.

వ. నన్ను నాలోకించి నా తెఱఁ గరిదియగు టెంత యేనేమి ధన్య నాపాటియేఱు
కొలఁదికి మిగిలినవి యెందునుం జొచ్చి తనయందఁ యడంగం బొంగారుతరం
బులు నింగిముట్ట నెట్టవారికి నున్నయా పెఱుంగ రాక యున్న మున్నీటి సంద
గాక యనుటయు.

క. ఏను సముద్రునిఁ గానం, గానరిగి భవద్విధంబు కడునాశ్చర్యం
బోసీరధి ధన్యుఁడనం, గా నన్యుఁడు నిన్నుఁబోలఁ గలఁడేయనినన్.

మ. అతఁ డొక్కించుక నవ్వి నన్గుఱిచి యి ట్లాశ్చర్యతాధన్యతా
మతికిం గారణ మేమి యుర్వివెలిగా మా కిమ్మెయి న్నేఁడును
స్థిత యీధాత్రియ ధాత్రిగాదె త్రిజగజ్జీవాలికిం గాన న
ద్భుతయున్ ధన్యయు నివ్వసుంధరయకా బుద్ధిం దలం పొప్పగున్.

తే. అనిననగుఁ గాక యని కౌతుకాతిశయము, దొడరనద్దేవి నేను సంస్తుతులఁ దల
యరిది యెంతయు ధన్యవు ధరణి లోన, లోకధారణ మవు నీవు లోకజనని.

మ. క్షమ నీయందుఁ బ్రతిష్ఠఁ బొందె నది నిక్కం బెవ్వరున్ లేరు నీ
సము లన్నం బొడసూపి నిల్చి హసితాస్యం బొప్ప భూదేవి సం
యమిలోకోత్తమ మామకస్థితికి గోత్రాదుల్ మహాసత్త్వతా
సముదీర్ణాత్ములు హేతుభూతములు తత్సం ధార్య నేనెప్పుడున్.

ఉ. వీరలయందుఁ గానఁబడు నేయువిధంబులయద్భుతంబు లిం
పారఁ బ్రదేశభేదమున నంతరముల్ జనులం దొనర్చి నా
మేరలు దారమై నిలిచి మెచ్చగు పెంపున నుల్లసిల్లుచు
న్నా రటుగానఁ గీర్తన మొనర్చుట కర్హులు వీరునావుడున్.

క. కులగిరులఁ జూచి యద్భుత, ములు మీచందములు ధన్యమూర్తులు హేమా
దులకు బహురత్నములకును, లలితఖనులు మీరు భువనలాలితమహీముల్.

వ. అనుటయు నప్పర్వతంబు లయ్యా యిట్లనకు మేమెవ్వరము విశ్వంబునకు నాధా
రంబు పితామహుం డున్నవాఁడు తదీయసృష్టిపరమాణువు లగుమాదృశులకుఁ
బ్రశంస యెంతదవ్వు పరమాద్భుతంబు నధికధన్యంబు నగుమహాభూతం బతండ
పొ మ్మనుటయుం గమలగర్భుపాలికిం బోయి ప్రణతుండనై కరంబులు మొగిచి.

మ. అతిమాత్రాద్భుతధన్య దేవుఁడవు నీ వన్యుండు నీకోడితు
ల్యత కిం దెవ్వఁడు దేవదైత్యనరతిర్యక్సంచయస్థావర
ప్రతతుల్ లీలమెయిం గలంపుదువు యుత్పాదింతు విన్నాన్యదే
వతగాఁ జూచుట గాదె మాపు మునిగీర్వాణార్చితాంఘ్రిద్వయా.

క. అనిన నుదరిపడి యతఁడి, ట్లనునద్భుతధన్యపదము లాడకు నాది
క్కున నాకంటెఁ గలవు విను, మనఘా యత్యద్భుతములు నతిధన్యముల్.

వ. అట్టిప్రభావంబులు గలయవి వేదంబులు మావె నాకును సత్కారంబులు లోక
దారకంబులు ఋగ్యజుస్సామనామంబులు సన్మద్బుద్ధిబలంబు నుపబృంహితంబు
సేయు నని సంబోధితుండనై వేదంబుల నారాధించి సాక్షాత్కారంబు
నొందించి.

తే. ధర్మములు విప్రులకును నాధారభూత, మైనమీపేర్మిచే లోకయాత్రనడచు
నద్భుతాత్ములు ధన్యులు నరయమీఁగ, బ్రహ్మవాక్యంబు తెలిఁగిది ధన్యులార.

క. అనవుడు వేదములు తపో, ధనవరయాశ్చర్యధన్యదశ కర్హులమే
యనుపమమహత్త్వకలితము, లనంతములు యజ్ఞములు సమగ్రోదయముల్.

వ. ఏము గల్గుటయెల్లను యజ్ఞార్థంబ యజ్ఞంబులు లేనినాఁడు మాకలిమియు
నిరర్థకంబు మాకును బరమపరాయణంబులు యజ్ఞంబులుగా నెఱుంగు మనిన
నేనును యజ్ఞంబులం బ్రత్యక్షంబు గావించి.

క. దేవతలు మొదలుగాఁగల, యీవిశ్వము తృప్తినొంది యొసఁగును నరయన్
మీవలనఁ గాన నద్భుత, మేవిధి నీవిధము ధన్య మెంతయు నెందున్.

వ. అగ్నిష్టోమాదిసంజ్ఞలం బరఁగిభోగైశ్వర్యస్వర్గస్థితికిఁ గారణంబులై మీర లొ
ప్పెద రీప్పరమప్రభుత్వంబేమని కొనియాడుదు ననిననాతో నధ్వరంబు లిట్లనియె.

క. మాకాత్మ విష్ణుఁ డాతఁడు, గైకొని నడపంగఁ జెడక కలుగు న్మోతా
నీకం బగ్నియు హవియు న, నాకులమంత్రశుభగతులు నతఁడ మునీంద్రా.

వ. ఇట్లగుటం జేసి యాశ్చర్యధన్యశబ్దంబులు రెంటికి వాచ్యుం డమ్మహాపురుషుం డని
చెప్పిన నధ్వరంబులపలుకులు విని యిచ్చటికిం జనుదెంచి యే నిప్పరమేశ్వరుం
గని మున్ను కూర్మప్రభృతులతోడం బారంపర్యమార్గంబునం బలికినయట్ల

పలికిన నిర్దేవుండు తాన యజ్ఞమయుండ నగుదు నయ్యజ్ఞంబును సంపూర్ణ దక్షిణతోడం గూడినం గాని యస్మదాత్మకంబు గానేర దని యానతిచ్చె న వ్వాక్యసమాప్తి యితనియంతయుఁ గన్నవాఁడనై సంతోషించి యిక్కడఁ దడ య నెందుపని లేదు గావునఁ బోయి వచ్చెద నంటి నని సవిస్తరోపన్యాసం బొనర్చి నారదుండు.

క. ఆరాజన్యులు దన్నును, గారవమునఁ బూజసేయఁగా వీడ్కొని య న్నారాయణుచేతను స, త్కారము గని చనియె గగనగతి నాత్మేచ్ఛన్.

వ. తదనంతరంబ.

మ. నరనాథోత్తము లెల్ల విస్మయనిమగ్నస్వాంతులై సంయమీ శ్వరుఁ డిట్లొప్పఁగఁ జెప్పి తెల్పెనె జగద్వంద్యుండు గోవిందుసు స్థిరమాహాత్మ్యవిశేష మిట్టి దగునే జిష్ణుండు గృష్ణుండు శ్రీ కరుఁ డీదృగ్విభవుండుగా నెఱిఁగినం గల్యాణముల్ ప్రాఁతియే.

తే. మనము నిర్దోషమతులమై మంటిమనుచు, నమ్మహాతేజునకువినయమునఁ బ్రమొక్కి భక్తిఁ గీర్తించి రంత నుఁ బ్రభుత నాత్మ, నలరి కొంద ఱంతయును బ్రసుక్కి యదటడంగి.

క. ఇదియు నదియు నేటిది యని, మదిఁ గొందఱు మత్సరంబు మానక మానో న్మదమానసులై యుండిరి, సదోష యగుబుద్ధి వినయసంగతి యిమ్మిన్.

వ. వారలు సముచితసల్లాపానంతరంబ ప్రియపూర్వకంబుగా నద్దేవు వీడ్కొని నిజ దేశంబులకుం జనిరి జలజోదరుండు సమస్తబంధుజనసమేతంబుగాఁ బురప్రవేశం బొనర్చి సుఖం బుండె నని చెప్పిన జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

శా. మాపెద్దల్ హరిసంశ్రయంబున మునుమ్ మన్నారు తత్కీర్తనా లాపప్రీతిఁ గృతార్థజన్ములము తెల్లం బేము నట్లాట మా కేపారన్ భువనంబులం దులభ్రువంబిష్టార్థసంప్రాప్తి యే పాపంబున్ మముం జెంద దొంద దోకఁడుం బ్రత్యూహ మిపే ర్కిన్.

చ. మునివర యుష్మదీడితసముజ్జ్వలవిష్ణుకథాసుధారసం బనయముఁ గ్రోలిక్రోలి యిటు లాత్మ యొకింతయుఁ దృప్తినొంద దిం కను వివరింపవే లసదగణ్యగుణౌఘవిచిత్రుఁ డమ్మహా త్మునిచరితంబు లుద్ధతవిమోహహరణప్రవణప్రవీణముల్.

**అర్జునుఁడు ధర్మరాజునకు శ్రీకృష్ణుని ప్రభావంబు చెప్పుట.**

వ. అనిన వైశంపాయనుం డమ్మనుజనాయకున కిట్లను భీష్ముండు శరతల్పగతుండై ధర్మనందనునకు ననేకపుణ్యకథాకథనం బొనర్చుసమయంబునం బ్రసంగాధీనుం డై ధనంజయుండు మాధవుమాహాత్మ్యంబునకుం బ్రత్యక్షపరిజ్ఞానం బొనరించె నవ్విధంబు వినుము.

క. మునిపతులును జననాథులు, ననేకు లతికౌతుకప్రయత్నంబులతో
వినుచుండఁగఁ గృష్ణుం డి, ట్లనియె నిజాగ్రజున కధికసాదరవినతిన్.

మ. ఒకనాఁ డేను భవన్నియోగమున సర్వోర్వీశ యాత్మప్రభా
ధికలీలం జని వృష్ణివంశతిలకుం దైత్రిలోక్యవంద్యున్ హరిన్
సకలేశుం గని యాదవప్రతతిచే సత్కారముం గాంచి త
త్ప్రకటావాసమునన్ వసించితి మనోరాగావహప్రక్రియన్.

తే. ద్వారకాపురి మరగి యెంతయును గాల, మిట్టులుండఁగ నొకతఱి నెసఁగఁ బేర్మి
నచ్యుతుఁడు దీక్షితుం డయ్యె నధ్వరార్థ, మనుపమద్విజముఖ్యసాహాయ్య మమర.

క. యజ్ఞమును యజ్ఞకర్తయు, యజ్ఞఫలప్రదుఁడు నైనహరి యొప్పారన్
యజ్ఞసమయమునఁ బ్రాక్తన, యజ్ఞాకృతులకును గీర్తి యతిశయ మొందన్.

సీ. పశువులు యూపసంబద్ధంబులై యొప్పఁ బ్రదేతాగ్నిచయ మొప్పి దీప్తముగను
సద్వస్తువిహితక్రియావళి యలరారె హోతాదిప్రవర్తితాహుతులు నెలయ
నుద్గాత యొనరింప నుదితసామోదితప్రస్తుతు లమరులు ప్రస్తుతింప
విధికలాపంబులు వీక్షించుబహుసదస్యులజాగరూకత సొంపుమిగుల
భక్ష్యభోజ్యాదితర్పణభవ్యవస్తు, వితతి లోకైకసులభసంప్రీతిఁ బసర
భువనసంభావనీయమై పొలుపు మిగిలె, యదుకులాబ్ధిచంద్రునిసమిద్ధాధ్వరంబు.

వ. అమ్మహాయజనసమయంబున జానపదుం డొకభూసురుం డొక్కరుండు పరుగు దెంచి దీక్షాస్థానంబున నాసీనుం డైనవాసుదేవుసమ్ముఖంబున నిలిచి దీనాననుం డగుచు నిట్లనియె.

శా. దేవా విన్నప మస్మదీయసతి యర్థిం బుత్రులం గానఁ దో
డ్తో వారిం బ్రసవక్షణంబునన యెందో యెవ్వఁడో కొంచుఁ బో
వేవుర్ ముప్పురు నివ్విధంబునన కోల్పోఁ బాలిదై నుంచె నన్
దైవం బిప్డు చతుర్థగర్భ మిటమీఁదం బ్రొద్దు లాచూలికిన్.

క. నీవు సకలజగతీర, క్షావిధికధికారి వట్లుగావునఁ బ్రభుతన్
గావుము గర్భస్థార్భకుఁ, గావింపు మభీతిదానకరణము కరుణన్.

క. ఏధర్మము గాచినప్రభుఁ, డాధర్మమునందు నాలుగవసంశము ని
ర్బాధముగఁ బొందుఁ దెలియని, దే ధర్మధురీణ యివ్విధి భవన్మతికిన్.

వ. అనిన వాసుదేవుం డవ్వసుమతీదేవున కిట్లనియె.

ఆ. కావరయ్య యనినఁ గరుణ నెవ్వరినైనఁ, గాచు టపరిహార్యకార్య మెందు
నెలసి విప్రజాతియెడరు చయ్యనఁ బాయఁ, జేయవలయు నేమిచెప్ప ననఘ.

క. ఈవిధము వినినయప్పుడ, వేవే కడఁగంగఁ దగవు విను మిప్పుడు దీ
క్షావిధి నున్నాఁడం గ్రియ, యేవిధమో యనువిచార మెంతయుఁ బొడమెన్.

వ. ఏమిసేయుదు నని చింతించునమ్మహాత్మునితో నేను సవినయంబుగ.

క. ననుఁ బంపుము భూమిసురేం, ద్రునియానది యుపనయించి రూఢిగ నీనె
మ్మనమునకు సంప్రమోదం, బొసరించెద నంటి ననిన నయ్యన నగుచున్.

వ. అద్దేవుండు నీకు నిప్పని యొనర్ప శక్యంబగునే యనుటయు నొక్కింతసిగ్గునం దల
వాంచినం జూచి యైననేమి యొక్కొండవ చననలవడు రామప్రద్యుమ్నులు
దక్కఁ దక్కినయదువీరుల సాత్యకిమొదలుగాఁ దోడ్కొని సైన్యంబులం గొని
చను మని వీడ్కొలిపిన.

అర్జునుఁడు బ్రాహ్మణకుమారుని రక్షింపఁబోవుట.

మహాస్రగ్ధర. గజవాజిస్యందనాఘోత్కటసుభటసమగ్రస్ఫురద్భూరిఘోరి
ధ్వజినీసన్నాహమొప్పం దిగతిరమ మహాధన్వులై యోధు లిద్ధ
ధ్వజరాజీరమ్యలీలల్ దనర నడువ నుద్యద్రథస్థుండనై యా
ద్విజనం శేసుండు మున్నై న్యాక గలిగిఁ జనితిం దీవ్రయానోగ్రభంగిన్.

వ. ఇట్లరిగి కతిపయప్రయాణంబుల నాగ్రామంబు సేరి తన్నగ్రంబున యదువీరసమే
తంబుగా విడిసి సైన్యంబుల నూరిచుట్టును వినయించి యంగణమును విశ్రాం
తవాహనులమై యున్నంత.

చ. ఖరకర్ము డున్నదిక్కున సృగాలఖగావలి రూక్షఘోరవి
స్వరములఁ గూయఁ జొచ్చె ఘనసంధ్య యకాలమునం దలిర్చె నం
బరమున భానుఁ డెంతయుఁ బ్రభారహితత్వము నొందె నుల్కభీ
కరముగ మ్రోయుచుం బడియె గాఢపరాభవభంగిఁ దెల్పుచున్.

క. అంతయుఁ గనుఁగొని యేన, త్యంతసముత్సాహ మమర నాయితపడి య
న్నంత ధరణీసురోత్తమ, కాంతకు నయ్యెం బ్రసూతికాలం బనఘా.

వ. అతండును మా కవ్విధం బెఱింగించెఁ దదీయసూతికాసదనంబు మహారథులు
సజ్యశరాసనులై రక్షించి రట నర్ధరాత్రసమయంబున.

సీ. బ్రాహ్మణికడుపులోపలనుండి వెలువడినప్పుడ చెలఁగి యందంద నేడ్చు
బాలకు నేడ్పు లేర్పడ వింటి మంతన పొరిఁబొరి నదె పోయెఁ బోయెఁ జెడితి
మనుచు నాక్రందించునంగనాజనులయార్తధ్వను లోకట నుద్గతము లయ్యె
నాలోన వీతెంచె నర్భకురుదితంబు పలుమాఱు మఱియు నంబరతలమున
నేను మొదలుగ నందఱొండ నెనఁగునంప, వెల్లినఱపియు నస్త్రముల్ వెలయఁజేసి
కాన మొక్కని నందుఁదాఁకమదగులను, ఱిచ్చవడినిలిచితిమి వెఱమచ్చముడిఁగి.

క. ముమసల్లుమంతనంబులు, మొదలుగ మముఁ బెక్కుచందంబుల మర్మంబుల్
వదలఁగఁ బొడిచిరి మాటలఁ, బదపడి చనుదెంచి రోషపరుషాకృతినై.

వ. భూదేవుండు నన్ను నధిక్షేపించి యిట్లనియె.

ఉ. నిక్కము బంటవై యపుడు నీరజనాభునిముందటం గడున్
మిక్కిలి మాటలాడి యిటు మేకొని వచ్చితి కార్యభార మీ
వక్కట నీవశంబె భువనైకధురీణుఁడు దానవాంతకుం
డక్కట సేయుచేఁత యిటు లందఱుఁ గూర్చియుఁ జేయనర్జునా.

క. పురుషోత్తముతో నెప్పుడుఁ, బురు డీతం డింద్రుఁడు పోలఁబోవునె నీకున్
హరికి విను హస్తిమశకాం, తర మెన్నఁడు రజ్జు లింకఁ దక్కుము కుమతీ.

తే. కావ నోపుదు నని వచ్చి కావవైతి, ధర్మరతి సేయనివాఁడు ధర్మహాని
యందుఁ జతురంశభాగి యట్లగుట నీకుఁ, జెందెఁ బాపంబు నేమియుఁ జెప్పనేల.

క. మోఘం బీగాండివము, మోఘము దోర్బలము శరము మోఘము నీకున్
లాఘవము బలిసె నాత్మ, శ్లాఘము సడఁచి పడఁ జనుము చక్కఁగ మగుడన్.

వ. అని పలికి క్రమ్మఱఁ గృష్ణుపాలి కరిగె నమ్మహీదేవుపలుకుందన యేనును నస్త్రై
న్యుండనై లజ్జాశోకభరంబున నవనతాననుండనై యరిగిన నన్నుం గనుంగొని
నారాయణుండు దీని కింతయేల వేఱొకటి గల దది పిదప నెఱింగించెద నంతా
పంబు వలవ దని యాశ్వాసించి దారుకుం బిలిచి తే రాయితంబు సేయుమనిన
నతండు సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబు లనునాల్గుతురంగంబులం గట్టి
గరుడధ్వజం బెత్తి దివ్యం బగురథంబు దెచ్చినం జూచి.

క. ననుఁ బ్రియమున సారథ్యం, బునకు నియోగించి విప్రపూర్వంబుగ న
మ్మన మరల నెక్కి రభసం, బునఁ జనఁగాఁ దొడఁగె నర్థపునిదిక్కునకున్.

క. ఓలి నరణ్యములు మహా, శైలంబులు నదులుఁ గడచి చని కనియెఁ బ్రభుం
డాలోలవీచివిస్ఫుట, వేలావాచాల మైనవిపులార్ణవమున్.

మ. తనయాకారముతోడ సాగరుఁడు మోదంబార నర్ఘ్యంబు నే
గొని గోవిందునిఁ గాంచి యానతశిరస్కుండై మహాభాగ యే
పని యేఁ జేయుదు నానతిమ్మనినఁ దత్ప్రీత్యావ్యాహృతం బైనపూ
జనముం గైకొని యాపరం బెసఁగ నాసర్వేశ్వరుం డయ్యెడన్.

వ. ఆత్మీయరథంబునకు ననర్గళం బగుమార్గం బడుగుటయు నాసముద్రుండు కృతాం
జలియై దేవా దేవర నాయందు లబ్ధరథగమనుండ వయ్యెదవేని నన్యులుం దమ
లావునఁ దెరువుగొనఁ గడఁగుదురు నీవు నన్ను నలంఘ్యసలిలుంగాఁ బ్రతిష్ఠించి
తద్విధంబునకు విపరీతంబుగా నవధరింపఁ దగునే యనుటయు నతండు.

మ. విను నాచేసినచేఁత చేయఁగలఁడే వేఱొక్కరుం డేల యి
ట్లన విప్రార్థము నస్మదర్థమును జేయం జాలు దెబ్బంగి నీ

కనఘా యొండువిచారముల్ వలదు తోయస్తంభముం జేయు మేఁ
జనఁగా నెప్పటియట్లనై నిలువు నైజస్ఫూర్తి శోభిల్లఁగాన్.

వ అని యారత్నాకరు నొడంబఱిచి యవ్విధంబువానిఁగా నొనర్చి కదలి యుత్తరకురుభూముల నతిక్రమించి గంధమాదనశైలంబున కరుగునమ్మాధవుం గాన్పవచ్చి జయంతంబు వైజయంతంబు నీలంబు శ్వేతంబు త్రికూటంబు కైలాసంబు ననుపర్వతంబు లాఱును మహామేరువుం బురస్కరించికొని యనేకధాతుచిత్రితంబు లగునిజాగ్రంబు లుల్లసిల్ల నిలిచి పనియేమి యానతిచ్చి మమ్ముం బనుపుమనుటయుఁ బరిటుపురుషుండు.

క. మద్రథవేగంబునకును, భద్రం బగుమార్గ మిచ్చి పాయుఁ డనిన న
య్యద్రులు నెమఁగుటయునునన, ముద్రిగతింజనియెముదితమూర్తిఁ బ్రభుండున్.

తే. మేఘసంఘాతములలోనమిహిరమండ, లంబుననుభంగిఁబృథులశైలములనడుమఁ
దగులువడ కేగువిష్ణురథంబు సూచి, మ్రొక్కి వినుతించె ననిమిషమునిగణములు.

క. అటఁబోనఁబోనఁగా వెలుఁ, గటఁబోయెను బోయెఁ బోయి యేపాగెడుచీఁ
కటిఁ జొరఁబడితిమి గడుసని, కట మునిపెనుగొంపనొచ్చికరిణీ సగేంద్రా.

తే. అపులఁ దాఁటిపోవనురాక యద్రికిరిణిఁ, గిరిసమ్మై యూఁగ నపు పంధకారపటల
మెంతయును భీతిఁబొందితినేను రథ్య, ములును రథమీడ్వఁగాలేక ముచ్చముడిఁగె.

క. అంత ససురిమర్దియు దు, ర్దాంతసురగర్వనకరాళిభారాహతి నా
సంతమసమంతయును నిం, తింతలుతునియలుగ నడచి యెడలించి వెసన్.

క. చననిమ్ము రథం బని నసుఁ, బనుచుటయును గొంకుదేఱ పలిపితిఁ దే రెం
దును దాఁకుపెగులు లేకయ, యనుపమహాటు లమ్భుతంబులై లీలఁ జనన్.

వ. ఇట్లు కొలఁదియిడె రానిదవ్వు కొండొకవడిన యరిగి యగ్రభాగంబున.

చ. అలఘుసహస్రభానుతుహినాంశుకృశానులు వేనవేలుల
కులు పెమలోపలం గదిసి గట్టిగఁ బ్రోవయి యున్నచాడ్పునం
జెలువయి దివ్యదృష్టులకుఁ గెందను జేరనురానియద్భుతో
జ్జ్వలమునతిక్రమోగ్రవిభవం బగుతేజము గంటి మేర్పడన్.

క. కన్నంతన గోవిందుఁడు, నన్నును బ్రాహ్మణునిఁ జూచి నవ్వుచు రథమున్
గ్రన్నన డిగి చని చొచ్చె న, మున్నతతద్దీప్తికూటముం జోద్యముగాన్.

క. ఎక్కడివెలుఁగిది యివ్విభుఁ, డొక్కఁడ యిటుచొచ్చె నెట్లొకో తెలఁగనుచున్
వెక్కసపడియెడుమా కతఁ, డొక్కముహూర్తమున మగుడ నెయ్యనఁ దోఁచెన్.

వ. అంత.

శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణునకు మృతపుత్రదానంబు చేసిపంపుట.

చ. మును చనియున్న బాలకులు మువ్వురుఁ దత్క్షణజాతుఁ డొక్కఁ డి
ట్లొనరుమహీసురేంద్రసుతు లొక్కటనల్వురఁదెచ్చి యిచ్చెఁ ద
జ్జనకున కమ్మహాత్ముఁ డతిసమ్మదవిస్మయవారిరాశిలో
మునిఁగెఁ దమ్మహాద్విజుఁడు మున్నుగ నేను నృపాలపుంగవా.

క. మమ్ముం దోడ్కొని యరిదము, గ్రమ్మన మునుసన్న తెరువు గ్రక్కొని మగుడన్
నెమ్మన మలరఁగ నాత్మపు, రమ్మున కేతెంచె విభుఁడు రమ్యస్ఫూర్తిన్.

వ. ఇవ్విధంబున నమ్మహాకార్యం బర్థదివసంబులోనన సమాప్తం బగునట్లుగాఁ జను
దెంచి యవ్విప్రవరునకు సత్కారపూర్వకం బగుభోజనంబు సంఘటించి యభిమత
ధనధాన్యంబులఁ దృప్తి సేసి యతనివీడ్కొలిపి యనంతరంబ మున్ను సమా
రబ్ధం బైనయధ్వరంబును సమాప్తి నొందించి యొక్కనాఁడు.

సీ. స్నాతుఁడై త్రైలోక్యచతుఁ డంబుజమిత్రు నర్ఘ్యార్పణాదిసమర్చనమున
భావించి మధ్యభూదేవసహస్రంబునకు నభీష్టాన్నదానం బొనర్చి
యేను సాత్యకి యాదిగా సర్వులగువారిఁ దనబంతి నిడుకొని తనుజమథనుఁ
డంచితాహారకృత్యము నవ్రబమోదించి విలసితాలంకారములు దలిర్పఁ
గొలువుకూటంబునకు వచ్చి యెలమి నగ్గి, పీఠమునునుండి యేము సంప్రీతితోడ
బలసియుండ విచిత్రసంభాషణముల, నలరుచుండఁగ నాప్రసంగాంతరమున.

వ. ఏ నవ్విప్రబాలకులపోక కేమి కారణం బెవ్వరు గొనిపోయి రెక్కడ నుండి రని
యడిగితి నడిగిన నద్దేవుండు నాకిట్లనియె.

మ. వినుమా విశ్వచరాచరంబులకు నావిర్భావదుర్భావముల్
పొనరింపం బ్రభుఁ డైనయాద్యుఁడు మహాభూతంబు భూతేశ్వరుం
డనుగూహాకృతి యప్రమేయవిభవుం డద్వంద్వుఁ డస్పందుఁ డెం
దును దానై తనరారుతత్త్వము జగద్ధుర్యుం డహోర్యోన్నతిన్.

క. ప్రకృతి యనఁ బురుషుఁ డనఁగా, సకలమునకు నాశ్రయంబు సాంఖ్యమునకు యో
గికులంబునకును గమ్యం, బొకఁడై చనుచోటు శశ్వదుదితుఁడు బుద్ధిన్.

క. ఘోరతమఃపారమున ను, దారంబై తోఁచుపరమధామము సంసా
రోరురుజకు దివ్యౌషధ, మారబ్ధసమిద్ధకర్మ మగుధర్మ మిలన్.

వ. అట్టిపరమేశ్వరుండు మదీయదర్శనం బపేక్షించి కృష్ణుండు బ్రాహ్మణప్రయోజనం
బనుష్ఠేయం బగునేని సర్వంబు నుజ్జగించి యెల్లభంగులం జనుదెంచు నిదియ
యుపాయం బని విప్రబాలకుల నుద్భవకాలంబులయందు కొనిపోవుచు వచ్చె
నేను నడుమ నడ్డపడిన సముద్రంబు స్తంభించి పర్వతంబులయం దంతరంబును

బడసి యంధతమసపాటనం బొనర్చి పోయి యప్పరమబ్రహ్మంబు దర్శించి మద్దర్శ
నంబునఁ దదీయకృతార్థతయు నాపాదించి యాత్మీయప్రభావంబున నతిదీర్ఘం
బగుమార్గం బల్పకాలంబునన రథగమనాగమనంబుల విలంఘించితి నిది నీయడ
గినవిధంబునకు వివరింపవలసిన తెఱంగు.

సీ. పరమేశ్వరుఁడు పరబ్రహ్మంబు పరమాత్మ యనఁ బేరుకొనినయయ్యాదిపురుషు
డరయఁగ నేన కా కన్యుఁ డున్నాఁడె యంభోధులు గిరులును భువనములును
దెసలు గాలంబును దెల్లంబు నన్న కా నెఱుఁగుము సృజయింతు నీజగంబు
పాలింతు హరియింతు నాలుగుశ్రుతులును ముఖములుప్రణవాదిమంత్రములున
మననయమములు మేదినీమారుతాంబు, వహ్నివియదిందుభానుజీవంబు లనఁగ
వెలయు మాకును స్థూలమూర్తులు పరాయ, ణంబుమత్తేజమఖిలంబునకుఁగిరీటి

క. శ్రుతిశాస్త్రవిధిమథనసం, భృత మగుసవనీతముగను బేశలబుద్ధుల
మతులం గైకొంద్రు తదూ, ర్జితవిజ్ఞానంబు నిత్యసిద్ధిక ననఘా.

క. వినుబ్రహ్మము బ్రాహ్మణులును, ననుపమసత్యంబు నిత్య మగుతపమును నే
నొనరించితి లోకస్థితి, కనంతధర్మగతి హేతువై యఖిలంబుల్.

తే. నీవు నాకుఁ బ్రియుండవు నిర్మలుఁడవు, గాన నతిగోప్య మగుతత్ప్రకారం మిట్లు
తెల్లియఁ జెప్పితి దీనిన తలఁపు మిది జ, పంబు నింపున్న భావంబుఁ బాండుతనయ

వ. అనిన నమ్మహాపురుషుభాషితంబులు భక్తిభరితహృదయుండనై యాకర్ణించి యప
ర్ణం బగుమనోరథంబునం బ్రథితం బగుసమ్మోదంబు నొందితి నివ్విధంబున
గోవిందుమాహాత్మ్యంబు దృష్టంబును శ్రుతంబు నయ్యె నని యర్జునుండు సెప్పిన
బాండవాగ్రజుం డప్పుతానందంబులకుఁ బాత్రం బయ్యె ననినవిని జనమేజయుఁ
డు వైశంపాయనున కిట్లనియె.

చ. హరిరజతాద్రి కేగి త్రిపురాసురమర్దనుఁ గాంచె నచ్చటన్
సురలు మునీంద్రులుం దిగిలి చూచిరి శంకరకేశవాత్మక
స్ఫురదురుతత్త్వయుగ్మ మని పూర్వులు సెప్పఁగ విందు నేను వి
స్తరముగఁ జెప్పఁగా వలయుఁ దద్విధ మంతయుఁ బ్రాజ్ఞపూజితా.

క. అనుటయు వైశంపాయనుఁ, డనఘా లెస్సకథ యడిగి తచ్యుతశుభ్రలాం
ఛననామధామ మాత్మ్యం, గొనియాడి కథింతు నీకుఁ గోరిక యలరన్.

క. హరిహరి నీరూపము త, త్పరమార్థం బెఱుఁగి చెప్పఁ బ్రాజ్ఞులు లేరె
వ్వారికిని దమతమతోఁచిన, తెరువులఁ దలుపుదురు బుధులు ధీమంతులకున్.

క. అనధీతున కతపస్వికి, ననుపాసకునకును మఱియు నకృతాత్మున కీఁ
జన దీవిజ్ఞానము మది, ననిరూప్యం బతిరహస్య మగుట నరవరా.

క. వినువారలకుం జెప్పెడు, ఘనబోధనులకు నశేషకామస్వర్గా
ద్యనుపమశుభంబు లిచ్చును, మునిసేవిత మిక్కథాసముచ్చయ మెందున్.

వ. నీవు గౌరవాన్వయపావనుండవు గావున నర్హుండవు వినుము వాసుదేవుండు దేవతారాతుల నరకుండు తుదిగా నందఱం దునిమి యనిమిషహితం బొనర్చియిచ్ఛానురూపంబు లగుకేళీకలాపంబుల నలరుచు నొక్కనాఁడు పుణ్యరజనీసమయంబున రుక్మిణీశయనంబునం బ్రీతుండై యద్దేవి నొక్కవరం బడుగుమనిన నాయమ యిట్లనియె.

రుక్మిణీదేవి శ్రీకృష్ణునితోఁ దనకుఁగల సంతానాపేక్ష యెఱింగించుట.

క. తనయులఁ బ్రద్యుమ్నాదులఁ, గనియుఁ దనియ దాత్మ కొడుకుగములను నానా
ధనరాసులనుం దనిసిన, జనములు భువిఁ గలరె యిది నిజంబు మహాత్మా.

వ. ఇట్లగుటం జేసి రూపసియు బలియుండును విద్యాన్వితుండును శ్రీమంతుండును నై తేజంబున నిన్నుంబోలుపుత్రు నింక నొక్కనిఁ గోరెడ ననిన నల్లన నవ్విభుండు.

క. విను మఖిలలోకసుఖములు, ననంతములు పుత్రవంతు లగుపుణ్యులకున్
దనయవిహీనులు దుఃఖులు, తనూజలాభంబు పరమధనమని రాన్యల్.

తే. పతియ చూవె భామినియందుఁ బట్టియందఁగఁ
బుట్టుఁ బదియవునెలఁ బుత్రభూతిఁ దనియు
వాని కింద్రుఁడుఁ దలకు నెవ్వారలకును
వెఱవఁ డాత్మజోపేతుఁడు మెఱుఁగుఁబోఁడి.

క. నీవడిగినట్టిపుత్రుని, నీవచ్చలతాంగి తొల్లి హిమగిరిఁ దపమేఁ
గావించి కంటి నుత్తమ, భావునిఁ బ్రద్యుమ్నుఁ దొలుతపట్టి నుదారున్.

వ. తపంబునకు నసాధ్యంబైనది లేదవ్విధంబునన యింకను శంకరారాధనంబు చేసి కొడుకుం బడసెద నేనుఁబోయి రజతాచలంబున నచలకన్యాసమేతు నాభూతేశ్వరుం దపస్సన్నిధి నునిచి తపంబును బ్రహ్మచర్యంబును ఫలితంబులుగా నడుప జగన్నాథుండు ప్రసన్నుండై యెల్లవిధంబుల నస్మన్మనోరథంబు నొసంగు నాదిదేవుండు నజుండు నజమహేంద్రాదివంద్యుండు నగునయ్యిందుశేఖరు దర్శించి నమస్కరింపఁ గనుట యొక్కటియును నతుమ బదరీవనంబున ననవరతతపోనియమవ్రతసిద్ధులు నఖిలసిద్ధాంతసిద్ధదర్శనులు జీవన్ముక్తులు నగుమునీంద్రుల నభినందింపఁ గనుట యొక్కటియుఁ బరమేశ్వరుండు నాయందుఁ గలపక్షపాతంబు నారదాదియోగివరులకుఁ దెలియఁదెలిపి తదనురూపంబు లనుగ్రహింప నాకర్ణింపం గనుట యొక్కటియుఁగాఁ బెక్కుకల్యాణంబులు సిద్ధించుఁ దడయక కైలాసయాత్ర యొనర్చెద ననియె నమ్మాటలకు నమ్మానినియును సమ్మదాతిశయంబు నొందెఁ దదనంతరంబ.

సీ. తనవినిర్మలబుద్ధిఁ దనరునుద్యోగంబుతోడఁ బ్రాభాతికద్యుతులు వెలయఁ
దనయుత్సహించినపనికి దవ్వగువిఘ్నతమముతోడనతిమిరములు తొలఁగఁ,
దనమనోరథములఁ దలకొనురాగసంతతితోడఁ బూర్వసంతతియు వెలయఁ
దనమనంబునఁ బేర్చుఘనవికాసంబుతోడన పంకజోల్లాసమును దలిర్ప
నమరశర్వరివిరతియం దచ్యుతుండు, తనయునర్కోదయంబుచందమున మెఱయు
నుజ్జ్వలాకోదయంబున నుచితనియమ, జాలమంతయుఁ బాటించి లీలనరిగి.

క. గోవులుఁ బసిండిప్రోవులు, దేవతలంబోలు ధరణిదేవతలకు సం
భావనతో నిచ్చి భువన, పావనుఁ డనుజీవికోటి పరివృతి నొప్పన్.

వ. ఆస్థానమండపంబునకుఁ జనుదెంచి సింహాసనోపరితలంబున నుదయశిఖరిశిఖరో
పరిభాగం బలంకరించుతరణికరణి నలంకరించి.

సీ. బలభద్రదేవునిఁ బిలువఁ డు సాత్యకిఁ దోడ్తెండు గృతవర్మఁ దోడ్కొనుచు
రండు సారణు నేగ రాఁబంపుఁ డీవు ప్రద్యుమ్నుని విజయము చేయుమనుఁడు
బ్రతుకళ్లఁ దనబుద్ధిప్రాపకా నమరులు దనునీతికలరఁగఁ దనమహాత్వ
మొసఁగ యమప్రేణి కెక్కటికొనియాట కెల్లయై తనరార నెంతుఁ బర్గఁగు
నుద్ధవాచార్యు నార్యు సనుద్ధతోక్తి, ధుర్యు రావింపుఁ డనివేగఁ గార్యకరులఁ
బనుప వారును నట్లసేసినన శేష, వృష్ణివీరావళియు వచ్చె విష్ణునాజ్ఞ.

వ. ఇట్లు వచ్చి మహనీయసభాభవనంబున నందఱు నుచితప్రదేశంబుల నుండి తన
ముఖకమలంబునం జూడ్కిగములు ప్రోడతొమ్మెదపమువ్వులఁగాఁ జేయుచు నుల్ల
సిల్ల నుత్ఫుల్లవదనుం డగుచు నంబుధిసదనుండు వారల కిట్లనియె.

**శ్రీకృష్ణుఁడు బలభద్రాదులకుఁ దనకైలాసయాత్ర దెలియఁజేయుట**

చ. వినుఁడు యమప్రవీరు లతివిశ్రుత మైనమదీయవిక్రమం
బనయము బాలభావమునయంతటనుండియుఁ గల్గినట్టిబ
ల్పనులొనరించెనో యది దలంపఁగఁ జెల్లమకాదె మీకుఁ బూ
తనపడుటాదిగా నరకదైత్యునికూలుట యంతిమంబుగాన్.

శా. ఇంకొక్కండు గలండు నాకుఁ బగతుం డీమూఁడులోకంబులం
గింకం దానెకరుండు గెల్వకడిమిం గీర్తింపఁబడ్డాఁడు సా
హంకారుండు నిరంకుశప్రసభసోపారంభుఁ డత్యంతని
శ్శంకస్వాంతుఁ డనంతవిక్రమకళాశౌండుండు పౌండ్రుం డనన్

క. వానికిఁదలఁకుము నెప్పుడు, నే నవ్వీరుఁడును నన్ను నెదఁ గైకొనఁ డ
మ్మానఘనుఁ గూల్చునంతకు, నానెమ్మన మెద్దియుం గొనదు విజయముగాన్.

క. నీకుఁ బరిభవము గలదే, లోకోత్తర యరయ భక్తలోకములకు లో
నై కాదె యిట్లు పలికెదు, మాకొలఁదులమతులు దివ్యమతిఁ బూన్పుటకున్.

వ. దేవర యెంతటివానింగా నవధరించితి నంతటివాఁడనై సర్వోపాయంబులఁ బ్రసాదభాజనం బయ్యెద ననియె నయ్యాదిదేవుండు బలదేవున కభిముఖుండై మహాత్మా నీవు మహాసత్త్వుండవు మహావిక్రమోద్దీపితుండవు నీపరిపాలనంబున బ్రతుకు మాకు లోకంబులచేతియుపహాసంబు వాటిల్లకుండెడుఁ దెఱంగయ్యాది యయ్యనువు దలంపులోనం గదియింపుము.

క. అని పలికి యతనియాదర, సునిశ్చితార్థవచనములవొప్పునకు మనం
బున నెలమిఁ బొంది మాధవుఁ, డనంతరము యుగ్రసేనుఁ డాదిగ పరుసన్.

వ. యదువృద్ధుల నందఱఁ బ్రత్యేకంబ సంభావించి పిదపఁ గమనోన్ముఖుండై గరుడునిం దలంచిన దత్క్షణంబ.

సీ. సర్వపక్షీనుఁడై చనుపతంగుఁడు గలఁడో కాక యరయ నస్యూఁడు జగము న
నెఱకలు వడసి యెయ్యెడఁ బ్రవర్తిల్లెడుమేరు గాంచెను కాక మేరుశిఖరి
యంబరశ్యామక యంబుధిపోగులుగా బ్రమసి యెక్కెనుకాక బాడబాగ్ని
హైమమై పగఁగుబ్రహ్మాండంబు నుక్కుమై యెగరఁబట్టెను కాక ఖగముకండు
వైనతేయుఁడు నిదృశవ్యాప్తదీప్తుఁ, డతఁడు కాక యితం డని యఖిలజనులు
బహువిధానుమానారంభపరతఁ జూడ, నరుగుదెంచెఁ బక్షిప్రభుఁ డభ్రవీథి.

వ. ఇట్లు చనుదెంచి మహీతలంబున కవతరించి ముందటఁ బ్రణతుండగుచు బ్రాంజలియుఁ బ్రశంసావచనవాచాలుండునై యున్నం గనుంగొని.

క. తనమూర్తియ వేఱొకఁడై, చనునావిహగేంద్రు నింద్రదిశము సమగ్రకృపా
వసన మగుపాణిపయోరుహ, మున నంటె రథాంగపాణి ముదము దలిర్పన్.

వ. సౌమ్యనతురుండవై చనుదెంచితే యనుపలుకు పలికె.

## శ్రీకృష్ణుఁడు కైలాసంబునకుఁ బుత్రార్థియై పోవుట.

క. శైలాత్మజాసహాయుని, ఫాలాంబకు నఖిలభువనపతి దర్శింపన్
గైలాసాద్రికి నేగెద, నీలావెఱఁగింపు మాకు నిరుపహతగతిన్.

వ. అని యానతిచ్చిన నయ్యచ్చ కనురూపంబుగాఁ గొలుపుమాటలు ప్రకటించు నయ్యుద్ధంచితదేహు బంధురస్కంధం బధిరోహించి రోహిణశృంగసంగతం బగునీలాంబుదంబు ననుకరించి యాదవుల నందఱ నిలువుం డని పూర్వోత్తరదిశాభిముఖుం డగుటయు.

క. పతిచిత్తమెఱిఁగి రెఱకలు, వితతంబుగఁ బఱపి విహగవిభుఁడు నెగసె న
ద్భుతము దనర నఖిలబలో, ద్ధతిఁ జూపుటకుం దలంపుదళుకొత్తంగన్.

వ. ఎగసి క్రమంబున సిద్ధవిద్యాధరదివ్యసేవితంబు లగుభవ్యమార్గంబుల ననర్గళప్రాకారం బగుసంచారంబు గైకొని.

సీ. తోరంపుటూర్పులఁ దొడరిపాతాళము దాఁకంగి సాగరౌఘములు గలఁగ
వికటంపుటెఱకలవిసరున నుప్పొంగుతుప్పరి జెండంబు దూపడంగి
బలితంపుజంఘలపెలుచనితాఁకున సమరంధ్రాసములు తుత్తుమురుగాఁగ
నుగ్రపుఁజూపుల నొడలికెంపుల దిక్కులన్నింట నెఱసంజ లావహింపఁ
బఱచునుగవడిఁ బొడమునిబ్బరపుమోఁత
కొండగొబలెల్లఁ జొచ్చి యొండొండఁ బెరుగఁ
గమ్రతనుకాంతిపూరంబు గడలుకొనఁగ
హరి వహించి నభంబున గరుడుఁ డరిగె.

శా. ఆదేవు స్సగుడాధిరోహణవిహారాభిన్నసద్భావపూ
ర్వాదిత్యోత్తమసంయమిప్రపమ లంతంతం గనుంగొంచు నా
హ్లాదంబుల్ హృదయంబులం బొదల భవ్యస్తోత్రవాచాలురై
రోదస్యంతరమంతయు న్నినిచి రామోద్ధాత్మఘోషంబునన్.

వ. వార లందఱు నతిభక్తి సంసక్తులై తన్ను ననువర్తింప నప్పుణ్యకీర్తనుం డటఁ జని తొల్లి నరనారాయణసమాహ్వయం బగునాత్మీయమూర్తిద్వయంబునకు ననేకసహస్రసంవత్సరంబులు తపోనుష్ఠానంబునకు నధిష్ఠానంబై నిరంతరోత్తుంగ గంగాతరంగంబులం బొదలు శీకరంబులం బునరుక్తఫలోత్కరంబు లగుతరుని కరంబుల నలంకృతంబై వృత్రవధాదిపాతకంబులం బాపికొనం బాకశాసనాదు లగును శరణ్యంబు లగుపుణ్యప్రదేశంబులు తనయందు తనరుటం ద్రిదశదేశప రాయణంబై బాదరాయణాదులు నాదరంబుతోడం జిరసమాహితసిద్ధులు గోరి నిలువం దగువిభవంబున నప్పుతంబై పద్మప్రభవాదులు వేదోక్తవిధానంబుల వివిధాధ్వరంబులు తిరంబుగాఁ జెల్లించి యెల్లచోట్లను హాటకరత్నమయరూపంబు లగుయూపంబుల నలంకృతంబు గావింపం బొగలు పెంపున నకంపనకల్యాణంబై వెలసి నిఖిలపావనం బగుబదరీవనంబు ప్రవేశించి సాయాహ్నసమయంబునం దదీయమధ్యంబునందు.

సీ. తరువిటపాసక్తధౌతవల్కలపఙ్క్తి కమనీయతోరణకల్పనముగ
హోమాయమానంబులై యొండొండ వెలిఁగెడుత్రేతాగ్ను లభినవదీపములుగ
దుగ్ధపానంబులఁ ద్రుళ్లుపెయ్యలనోరినురువులు సితపుష్పవిరచనలుగఁ
గోరి నీడంబులు సేరెడుఖగములవాసితంబులు జయధ్వానములుగఁ
దనసమాగమోత్సవమునఁ దగినశుభము, లప్రయత్నసిద్ధములుగ నతిశయిల్లు
మునిజనాశ్రమరేఖ నవనీరజనాభుఁ డర్థిఁ దలఁచెసి యం దొకరమ్యమైనచోట.

వ. సుపర్ణస్కంధావతీర్ణుండై మున్ను తన్నుం గొలిచిచనుదెంచిన దేవతలు మునులుం బరివేష్టింప నున్న యవసరంబున.

సీ. వ్యాసభరద్వాజవాల్మీకిగౌతమకాశ్యపజాబాలికణ్వపులహ
యాజ్ఞవల్క్యాత్రిగార్గ్యాంగిరోభృగుపరాశరధూమ్రగాలవశంఖలిఃత
హారితసంవర్తకహయశిరశ్శౌనకభద్రకకౌశికదివ్యభాండకోగ్ర
బకదాల్భ్యకౌశికాపస్తంబమాండవ్యమంకణరోమశమండపాల
కఠకలాపకరోహితకాముకాయనాది, మునులు చిరతపోనిర్మలమూర్తు లాప్యా
లరుగుదెంచి కాంచిరి పరమాత్ము సభవు, నాదిదేవు నచ్యుతుం గృష్ణు సత్కభక్తి

తే. కాంచి యర్ఘ్యపాద్యము లిచ్చి గౌరవమున,
బ్రణతులై మోడ్పుఁజేతు లొప్పంగ నిలిచి
చిత్తములు హర్షరసమునఁ జిగురుపొత్త
నంగములు పులకలప్రోవులై యెలర్ప

ఉ. ఈయెడకుం బ్రసన్నమతి నిందఱుఁ గైకొని దేవ నీవు వి
చ్చేయుటఁజేసి మానియమశీలత యుత్తమసిద్ధిఁ బొందె నే
మేయది సేయువారము మహేశ్వర సత్కృప నాసతిమ్ము ని
శ్రేయసదాయి దాదె సవిశేషభవత్ప్రియకర్మ మొప్పుయిన్.

వ. అనినఁ బరమపురుషుం డందఱుఁ బ్రసాదదృష్టిదానంబున సన్మానించి సర్వం బును సువిహితంబ యని వేఱువేఱ కుశలంబు లడిగి వారలప్రతివచనసంవిధా నంబున నానందంబు నొంది సముచితానుష్ఠానంబు సమ్మట సమ్మునులు గావించు విందులు గైకొని బృందారకమునిబృందసహితుండై నిశాసమయంబున సమీ పితంబు లగుశయ్యాస్థానంబులం బ్రమోదించె నిట్లు పుణ్యనివాసంబున వసి యించి యన్నారాయణుండు.

క. తనపూర్వతపస్స్థానం, బని యనురాగమున బదరి సంతయుఁ జూచెన్
మనమునఁ గలపోసి యొకం, డును మధ్యరాత్రమునఁ గడుం గుతుకమునన్.

వ. అచ్చోట వసియింపక చని గంగయుత్తరతీరంబు దొఱంగి.

సీ. పంచాగ్నిమధ్యతపస్కులు గొందఱు సలిలాధివాసనిశ్చలులు గొంద
ఱూర్ధ్వబద్ధకరులుతద్ధ్యానులు గొందఱు నిరశనవ్రతసమన్వితులు గొంద
ఱమితనిరంతరయజనులు గొందఱు ప్రాణసంయమనైకపరులు గొంద
ఱేకాంతికత్వనిశ్శోకులు గొందఱు జపయజ్ఞవిధివిచక్షణులు గొంద
ఱగుచు జటిలముండితనగ్ను లాదిగా న,నేకరూపతపోనిష్ఠయెసఁగ నొప్పు
మునులనెలవులు ప్రీతిఁ గన్గొనుచువివిధ, కాననాభ్యంతరంబులఁ గలయ మెలఁగి.

శా. సిద్ధోద్భాసితశృంగసత్తులు సమాసీనోల్లసత్కిన్నరీ
బద్ధానేకవిచిత్రగానసుతలప్రస్థంబులున్ యోగిస
న్నద్ధానందసమాధిరమ్యగుహలున్ గంధర్వవీణాధ్వని
శ్రద్ధాముగ్ధమృగంబులుం గలమహాశైలస్థలుల్ గాంచుచున్.

వ. పెద్దయుం బ్రొద్దు విహరించి యొక్కమనోహరప్రదేశంబున నాసీనుండై.

శ్రీకృష్ణుండు బదరీవనంబున సమాధియోగంబుననుండుట.

తే. అపరరాత్రంబు ధన్యసమాధివేళ, యగుట నప్పుడు తనయంతరంగమునను
నెలయ సుప్రసాదంబున యోగనిష్ఠ, నేయలంతియై యుంపాదఁ జేయుటయును.

సీ. స్వస్తికాసనము నిశ్చలముగా బంధించి తనువు గంధరయు మస్తకము సరిన
చక్కనై నిలువ నాసాశిఖరంబునం దిరమొప్పచూడ్కి యేకాగ్రసరణి
నిలిపి మూలాధారనిర్గత నిర్గుణధామంబు షడ్గ్రంథికళనకారి
యై పోయి పరమాంబరామృతబింబంబు గరఁగఁ దోడన తోనఁగుసోనఁ
దడిసి తన్మయానందసాంద్రాత్ముఁడగుచు, నొకఁడు నెఱుఁగనిపామగవ్యోదయమున
గలె నెంతయు నొప్పె సమ్యగాదిసిద్ధిఁ, బలసిద్ధులు వనసిద్ధి యభినుతింప.

వ. ఇవ్విధంబున నప్పరమేశ్వరుండు పరమప్రాణాయామధారణంబునఁ దన్నుఁ దాన యనుసంధించి సంపూర్ణసంవిత్స్వరూప యగుచేతోవృత్తి నున్నసమయంబున నవ్వనంబునందు.

క. మృగయూథలకల మొక్కటి, దిగంతములు మ్రోయ నుప్పతిల్లెను నాలో
జగతీశ పరేశ విష్ణో, నిగమస్తుత యనునెలుంగు నెక్కిపించెన్.

సీ. అవ్విధంబున కాత్మ సన్నుతిం బండెసహరి యున్నయెడ కిందున్నుముమునుఁగఁ
బఱతెంచె నొఱలుచుఁ బహుశాణవిద్ధంబు లగుబెబ్బులులు పందులాది యైన
మృగములు వెనుకన మగినేయునాగమేయూవళు లేతెంచె నడవియెల్ల
వెలుఁగఁగా నొక్కట వేసనే నొప్పుదివియలతోడఁ దోతెంచి రంతఁ
జాపహస్తులు తఱుచుగాఁ జనలవికృత, రూపులైనపిశాచు లాటోపదీప్తు
లోలి మాంసఖాదనముఁ గీలాలపాన, మునునొనర్చుచుఁ బేర్చుచు బొబ్బలిడుచు.

క. శిశువులఁ జంకల నిడుకొని, కృశకర్కశరోమరాజికృష్ణశరీరుల్
రశనాయితాంత్రవల్లులు, పిశాచికలు వృడమి రెండుఁ బ్రియులవెఱుంగన్

వ. ఇట్లనేకసాహస్రంబు లసంఖ్యులసరుగుదెంచిన వారికి నందఱకు నగ్రణులై యుద్ధతమహాపిశాచులు ధూమ్రకపిలకేశంబులు గలమస్తకంబులును వెలికుఱికిన గ్రుడ్లతోడికవిలకన్నులతుదలు ముదిసి యంపతునుక లెడలం జిక్కి మిట్టలై తెలుపుమీఱు గ్రుడ్లు శంఖనిభంబు లగుకర్ణంబులు నిర్మాంసంబు లగునురంబులు వీఁపులువట్టికొనుకడుపులు గుఱుచచేతులు నస్థిస్నాయుమయంబు లైనయూరు.

జంఘాద్వయంబులు వక్రాంగుళికంబులును వికటచరణంబులునై యేకలంబులం గ్రుచ్చుట కాభీలంబు లగుశూలంబులు కేలం ద్రిప్పుచు నుప్పరంబున కెగసి నడయాడుచుం బోరుచు వీఁడీఁడిమాటలతోడం బెలుచఁ బెనంగుహాసంబులు బెరసి వెలయ హరినామకీర్తనంబులం గీర్తనీయామృతరసంబు నుత్పాదింపం దమలోన.

సీ. నాలుగుమొగముల వేలుపు మొదలుగా నెవ్వనికడనుదయించె జగము
లెవ్వనికతమున నీవిశ్వమును సమపేతసుస్థితి గాంచి యెసకమెసఁగు
నంతకాలంబున నంతయు నెవ్వనియొనరించుమాయలో నడఁగి మడఁగు
నిష్కలం బమృతంబు నిర్వాణ మజ మని పాటింతు రెవ్వని బ్రహ్మవేదు
లమ్మహాదేవు హరి సరోజాక్షుఁ గృష్ణుఁ గంసమర్దను నెచ్చోటఁ గాంతు నెట్లు
గాంతు మెప్పుడు గాంతు నేకాంతికత్వ, సులభు వాసుదేవుని దేవుఁ జూడఁగనుట.

క. అక్కట తొలుతగాముస నే, మొక్కట నేకరిణి పాప మొనరించితిమో
యిక్కష్టపిశాచభవము, నెక్కొని యిట్లనిశదుఃఖనిధిఁ ద్రోచెన్.

మ. అనిశంబు న్నరమాంసరక్తతతి యాహారంబుగాఁ గొంచు నే
పునఁ బ్రాణిప్రకరంబుపీడనములం బొందించుచుం బుణ్యపుం
బనికిం దవ్వగుచుఁ బాయుచున్ మెలఁగఁగా బామిన్మెయిం బోను నేఁ
డును నుల్లంబున నెల్లఁబా టొలసె నెట్లుం బూని యిమ్మేపయిన్.

క. అది యట్టిద సంసారము, మొదలు తుదియు నొక్కరూప మోహం బెచ్చో
వదలదు తృష్ణయు నెన్నఁడు, ముదియదు సమువులను నిట్లు మును గని రార్యుల్.

వ. ఎట్లనిన బాల్యంబునఁ గేవలం బగునజ్ఞానంబును యౌవనంబున విషయాభిలాషంబును వార్ధకంబున జరావ్యాధిపీడనంబును నాత్మహితం బొనర్పనీక జన్మంబు నిరర్థకంబు గావించి పుచ్చు నంతసమయంబున నప్పటియాపదయును నరకదుఃఖస్వర్గసుఖంబులయందలిపరతంత్రతయుఁ గ్రమ్మఱం బాటిల్లెడుగర్భవాసాయాసంబునునత్యంతమోహమయంబులునగు సర్వజగన్నివాసుం డగువాసుదేవుం డొక్కరుండ యిక్కలుషంబునకుం బరమౌషధం బప్పరమాత్ము సందర్శనంబవశ్యంబు సిద్ధించునట్టివెరవు దలపోసి యెఱుంగవలసి యున్నది యని యిట్లు బహువిధంబుల నుగ్గడించుచుఁ జనుదెంచి ముందర.

క. కని రానీలవలాహక, సన్నాభితను నాభికమలసంజనితజగ
జ్జనకు నకలుషనిర్మో, చనలోచనపూర్ణచంద్రుఁ జంద్రాస్యు హరిన్.

### ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణునిం గని సంభాషించుట.

మ. కని డాయం జనుదెంచి యెవ్వఁడవు నిక్కం బివ్వనాభ్యంతరం
బున నొక్కండవు కోమలాంగుఁడవు సన్మూర్తిన్ మహాఘోరస

త్త్వనికాయంబులలోన నేమిపనికై వర్తిల్లె మత్పుల్లలో
చనుఁ డావిష్ణునిమూర్తితో ననయు నీసన్మూర్తి యూహింపఁగన్.

క. దేవుఁడవో దనుజుఁడవో, దేవేంద్రప్రముఖముఖ్యదిగధీశులలో
నీ వొకఁడవొ పరమర్షివొ, నావేశితచిత్తుఁ డున్నయట్లు తెరయన్.

వ. ఇంతయు నెఱింగింపు మనినయప్పిశాచనాయకులం గనుంగొని యాజగన్నాయకుం డు

తే. క్షత్రియుఁడ నేను యదువంశసంభవుండ, దుష్టమర్దనసుజనసంతోషణముల
యందుఁ జాలె దువాఁడ ఫాలాక్షుఁ గాన, నరుగుచున్నాఁడఁ గైలాసశిఖరి కిపుడు.

వ. ఇది నా తెఱంగు మీ రెవ్వ రివ్వనంబు సాధు లగుతపోధనులకు నియతనివాసం బాసురచరితులకుఁ జేరఁ దగినయది గాదు మృగంబులును హింసకు విషయంబులు గావు ఘోరంబగు మాంసంబు మరిగి కుణపసంబాధం బగుమృగయానుబోధంబున మెలంగుచుమిమ్ము నేను సైరింప ననిన నద్దేవువచనంబులు విని యయ్యిరువురయందు నుత్తుంగదేహుండును దీర్ఘబాహుండు నగువాఁ డొక్కరుం డిట్లనియె.

తే. ఆదిదేవు జగన్నాథు నమలు విష్ణుఁ, గృష్ణు నతిభక్తిఁ బొలుతు సంకీర్తనమునఁ
దలఁచి నీవు నన్నడిగిన తెఱఁగు దెలియ, వినుము చెప్పెద నవధానవృత్తితోడ.

వ. ఏను ఘంటాకర్ణుం డనుపిశాచనాయకుండఁ గుబేరకింకరుండ భయంకరకృత్యంబున మృత్యువు ననియగు మితండు నాయనుజుండు మత్సమానవీర్యుం డవార్యం బగు నిమ్మహాసైన్యం బస్మదీయం బిప్పుడు ప్రవర్తిల్లెడుమృగయావిహారంబును విష్ణుపూజాప్రకారంబుగా సమర్పింతుఁ గావున దీని హింస యనరాదు మఱియు నొక్కటిగల దెయ్యది యనిన.

మ. చరమాంభోధితరంగముల్ తనమహాసాలాంఘ్రిమూలంబు ని
స్ఫురదమ్లానసపీనఫేనకుసుమంబు ల్చేర్చి యర్చింపఁగా
నరుదై ద్వారవతీసమాఖ్య సకలవ్యాఖ్యాతమై యొప్పునే
ర్పరి మత్స్వామినివాస మప్పురి మహిన్ భూషించు నామోన్నతిన్.

క. ఎందున్నవాఁడు నిత్యా, నందుఁడు వసుదేవుకూర్మినందనుఁడు మహా
నందకహస్తుఁడు త్రిజగ, చ్ఛందనుఁడు ముకుందుఁ డార్తశరణుం డెందున్.

మ. భువనోత్పాదనరక్షణప్రశమనంబుల్ సంతతస్ఫూర్తినా
త్మవిధేయంబులు గావునన్ సురపరిత్రాణార్థమై వచ్చి యా
దవుఁడై నాఁడతనిన్ వినమ్రవదనున్ దర్శింపఁగాఁ గోరి యు
త్సవకల్పంబుగ నిందఱుం గొని సముత్సాహంబుతో నేగెదన్.

మ. అజుఁ బుట్టించి తదీయవిద్యయు ఘనాద్యం బై నయామ్నాయముల్
నిజరూపం బెఱిఁగించి యిచ్చి ముఖముల్ నిర్మించి తద్దర్శముల్

సీ. సర్వజగత్కర్మసాక్షి నక్షరుఁ బుండరీకాక్షు గోవిందు శ్రీకళత్రు
వాసుదేవుని భక్తవత్సలు శ్రీవత్సవక్షు నధోక్షజు వనజనాభు
నే నిన్నుఁ గీర్తింతు నిట్టికీర్తనమున వరద ముకుంద నిర్వాణరూప
నాచిత్తమే కీడునకుఁ జేయలంటిగా కే ప్రొద్దు నీయందు మెలయుఁగాత
నీచకర్మదూషిత యిప్పిశాచపీర, తనువు దైత్యారి నీచక్రధారఁ ద్రెస్సి
వెండియునుబుట్టువులనొందకుండవలయు, బ్రహ్మభూయంబునాకిమ్ము పరమపురుష.

మ. జననంబుల్ మఱి గల్గెనేనియును నాజన్మంబులం దెల్ల నా
మనసు నీపాదాన భవన్మనోజ్ఞపదపద్మధ్యానతాత్పర్యమిం
[illegible]నుఁగా గంచితకల్పభూరుహము నీనాగుణ్యా [illegible]సక్రములం
దనరఁగా వింతు మదీయవాంఛ దగఁ జేయన్ దేవ నీకెమ్మెయిన్.

ఉ. ఘోరపిశాచజన్మఁ బతిఘోరచరిత్రుండను పీని కేల నిం
తటఁ గరుణింప వంచుఁ గృపవప్పకుమీ నినుఁ దప్ప నొండు ది
క్కెట నిటఁ గోర సంత్యజనీయాంఘ్రులను నామది యిట్లఁ జేయుమీ
పటుతర కాలపాశములపాల్పడఁజాల జమీ జనార్దనా.

సీ. ఎన్నిజన్మములనో యియ్యింద్రియంబులు నాచేతఁ జిక్కక నీచవిధికిఁ
దిగువంగఁ దిగువంగఁ దగిలి పోయినమానసము చెడ్డ నిప్పాపజన్మమ్మెలాసె
నీజన్మమునయందు నివి గ్రమ్మఱఁగ గాసిసేయ నున్నవి దీనఁ జిక్కువడిన
నెన్నిసేసినఁ గొఱఁతేమి పరద్రవ్యపరదారపరివాదపరిహారణము
నాకు నీవిచ్చువరము నిర్ణయముగాఁగ, నామశ్రోత్రాదివర్గంబు నలినరనాభ
యంబరాదిభూతములయం దడిమియవియు, నిన్నుఁగలసినన్నానందనిష్ఠమనుపు.

తే. నీకు మ్రొక్కెద నోకృష్ణ నీరజాక్ష, నీకు మ్రొక్కెద ధర్మప్రణీతదక్ష
నీకు మ్రొక్కెద నిశ్శోకనిగమరూప, నీకు మ్రొక్కెద నిర్వాణనిత్యదీప.

వ. అనిపలికి మహాభాగుం డగునబ్భాగవతుండు.

తే. బాహ్యగతిమాని మఱిగినభావముఖ్య, దైకసంశ్రయంబునఁ గంప మేది నిలిచి
గాలిసోఁకనిదీపియ కరణి వెలుఁగ, నుండుపరమాణుసంధానయుక్తి నలరి.

వ. ఇత్తెఱంగున నుత్తమధ్యాననిష్ఠుం డైనయాగుణగరిష్ఠుని నిలుకడయంతయుం
జూచి సంతసిల్లి యుత్ఫుల్లవిలోచనుం డగుచుఁ బద్మలోచనుండు తనయాత్మగతం
బున నతని సుకృతకారణంబులు దలపోసి వీఁడు ధననాథునకు నన్నుంగుబంటగు
ట నమ్మహాదేవసఖువలనం బరమజ్ఞానంబు వడసి పూర్వపుణ్యవాసనానురూపం
బుగాఁ బ్రౌఢమితభక్తికిం బ్రోదిగా ననవరతంబును గృష్ణకేశవజనార్దనాదినామం
బులు కీర్తించుచు మృగంబులవధియించుతతిఁ దన్మాంసఖాదనం బొనరించునెడఁ
దదీయరుధిరపానంబు సేయునప్పుడు సర్వావస్థలయందును సమస్తకరణంబులు

 

నాయంను సమర్పితంబులు గావించుఁ గావున నవ్విశిష్టకర్మంబు పక్వంబై యిట్టి
పదంబు బొందవె వీనిం గృతార్థుం జేయుదు నని నిశ్చయించి.

క. ఆతతభక్తిసముజ్జ్వల, చేతోదర్పణమునందు సిద్ధంబుగ వి
ఖ్యాతప్రతిబింబముక్రియఁ, బ్రీతిం దనదివ్యమూర్తి వెలయించెఁ గృపన్.

వ. అట్టి సాక్షాత్కారంబు సంభవించిన నతండు.

మ. జలజిం జక్రిఁ గృపాణిఁ గార్ముకి గదిన్ సంప్రీతపీతాంబరున్
విలసత్కౌస్తుభవక్షుఁ గుండలవిభావిద్యోతవక్త్రాంబుజున్
జలదశ్యామశరీరుఁ జారుమకుటప్రస్గంధమూర్ధున్ నిరా
కులదార్ఢ్యాంసవిభాసితుం గనియె నాగోవిందు నంతర్గతిన్.

వ. తదీయమాహాత్మ్యంబును దనబుద్ధిగోచరంబుగా నధిగమించె నిట్లు దేవదేవునిఁ
బ్రత్యక్షంబునం గనిన తెఱంగున నంతరంగదర్శనంబున నెఱింగి.

క. అరమోడ్చినకన్నులు సు, స్థిర మగునాసనము నచలదేహంబును స
ప్రహసనము యుండఁగా ని, ర్భరసమ్మోదానుభవవిభాసితుఁ డగుచున్.

మ. హరి నాత్మేశ్వరు విశ్వరక్షకుఁ ద్రిలోకారాధ్యునిమ్మాడ్కి నే
నరు దోప్పారఁగఁ గంటి నంతయును గృతార్థారంభ మిక్కార్య మిం
కరయంగా నొకఁ డెద్ది నీచపుఁబిశాచావేశముం బాసితి
న్పరమానందవిధాయి సిద్ధిపదముం బ్రాప్యంబ నా కిమ్మెయిన్.

క. నాయనుజుండు ననిశము నా, రాయణచరణాబ్జచింతనాసక్తుఁడ వాఁ
డాయనుపునఁ బరమేశ్వరు, సాయుజ్యముఁ బడయుఁగాత సముచితరీతిన్.

వ. అని తలంచుచు మున్ను నియమింపఁబడినప్రాణపవనంబు నెయ్యన సడలవి
డిచ్చి యోగాసనంబు సడలి శరీరసన్నాహంబు బెడలి కన్నులు విచ్చి యుండెను.

క. తనయంతఃకరణంబున, వినుతం బగుభక్తియోగవిశదాలోకం
బునఁ గానఁబడినమాడ్కిం, దనరెడుయదునాథుఁ గనియెఁ దనబాహ్యమునన్.

క. ఏపగిదిఁ దలఁచుభక్తుం, డాపగిదిన తోఁచు నీశుఁ డనుపల్కు నిజం
బై పొలుపుగ నమ్మెయిఁ బొడ, సూపినపరమాత్ముఁ గృష్ణుఁ జూచి ముదమునన్.

ఘంటాకర్ణుండు శ్రీకృష్ణమూర్తిం బొగడని స్తుతించుట.

వ. ఘంటాకర్ణుండట్లు సముత్థితుండై సమదాట్టహాసంబుతో నర్తనంబు సేసి.

క. హరిఁ గంటిఁ గృష్ణుఁ గంటిం, బరమేశ్వరుఁ గంటి భక్తభయహరుఁ గంటిం
బురుషోత్తముఁ డచ్యుతుఁ డీ, శ్వరుఁ డభవుండు వీఁడె వీఁడె సమ్ముఖుఁ డయ్యెన్.

తే. ఏను భక్తితో మనసున నెంతయేని, మరగి వెదకంగఁ దోఁచినమాడ్కి రూపు
వెలుపలను దోఁచె నీతని వెనుక నింకఁ, దగిలి విడువక బంటనై నెగడువాఁడ

క. ఆశార్ఙ్గధన్వుఁ డితం, డాశంఖ సుదర్శనాబ్జహస్తుఁ డితం డా
పేశలనవజలధరసం, కాశశరీరుండు వలఘుకరుణుఁడు బుద్ధిన్.

తే. పసిఁడిబొమ్మ నీలపు రాతిపలకఁ జెంది, యున్న తెఱఁగునఁ బేరురం బొందె లక్ష్మి,
నెఱసి బెరయఁగఁ బాలమున్నీటినడుమఁ, బవ్వళించునిత్యానందభావుఁ డితఁడు.

క. లోకంబులసృజియింపను, నాకలితముగాఁగఁ బ్రోచి యన్నియుఁ బిదపన్
లోకడుపున నడఁగింప న, హాకర్తృఁ డితఁడ చింతితాత్ముఁడు మహిమన్.

సీ. మధుకైటభాసురమథనుఁడై రయసుప్త నిద్రించి దంష్ట్రియై భద్రదంష్ట్రి
నిలయెత్తికూర్మమై యలఘుశైలము మోచినరసింహుఁడై దైత్యునురము వ్రచ్చి
కుబ్జుఁడై మూఁడడుగులమూఁడుజగములు గొలిచి భార్గవుఁడునై నృతులనతులఁ
దునుమాడి దశరథతనయుఁడై రావణుఁ బరిమార్చి రోహిణిపట్టి యనఁగ
నుప్పసన్నయుఁ దానునై యుర్వి నిపుడు, దేవకీసూనుఁడై యున్న దేవదేవుఁ
డితఁడు పూతనాప్రాణపాయితఁదలిర్చెఁ, బురిటపాపఁడై యొప్పారుపరువమునను.

క. బోరగిలఁగ నించుకయును, నేరనినాఁడె యడంగ నెట్టనఁ ద్రోచెం
గ్రూరశకటంబు చరణాం, భోరుహచలనమున నితఁ డపూర్వపుశక్తిన్.

తే. ముద్దుఁబాఁడయి వ్రేతల మొఱఁగిపాలు, వెన్నలును దాఁపరింపఁగఁ దన్నుఁబట్టి
తల్లి రోలితో దామెనత్రాటఁ గట్ట, నితఁడె కాఁడె మద్దులఁ గూల్చి రేపుసూపె.

క. కాళిందిలోనఁ దిరిగెడు, కాళియనాగంబుఁ గిట్టి కట్టలుకవిష
జ్వాలలు గ్రక్కఁగఁ ద్రొక్కఁడె, నోలి నితఁడు తత్ఫణంబు లొక్కట నలియన్.

క. గోవర్ధనపర్వతమును, గోవులకై యెత్తి యితఁడు గొడుగుగ మఱి ఘూ
ర్ధ్వేంద్రు సంతవానిని, సావజ్ఞతఁ బాపఁడే పదానతుఁడై నన్!

క. తనయౌవనంబు గోపీ, స్తనభరభోగమున భవము చరితార్థముగా
ననుపముఁ డితఁడు బృందా, వనమునఁ గ్రీడించు గోపవర్గము గొలువన్.

క. వృషభాకారంబున దు, ర్విషహతురంగాకృతిని ధరించిన దేవ
ద్విషుల నని వ్రచ్చి సర్వం, కషతం గ్రీడించె గోపవర్గము గొలువన్.

క. ఈదేవుఁడు యమునాజల, మాదర్శముగాఁగఁ జూపె నక్రూరున క
య్యాదితనువు గ్రమ్మఱఁ దద్భేదత యాయొడలియంద వెలయించె లలిన్.

తే. రజకుఁ బొరిగొని కొనియెఁ జీరలు సుగంధి, పుష్పదాయిక నొసఁగె సమ్మతివిభూతి
గంధకారిక. కప్పురోంగనలకంటె, నిచ్చె నెక్కుడుసౌందర్య మివ్విభుండు.

క. బాణాసనంబు విఱిచిన, పాణిన గజకుంభతలముఁ బగిలించి వెసన్
జాణూరువీఁపు విఱిచె ధు, రీణభుజుండీయశోగరిష్ఠుఁడు కడఁకన్.

సీ. కంసకువలయాపీడవిధ్వంసనకేసరి మాగధతృణమహామారుతుండు
యవనజీవితసముద్ధరణకృతాంతుండు రుక్మిమానద్రుమచ్ఛేదపరశువు
మురపాశకర్తనోన్ముద్రదలవిత్రంబు నరకతమిస్రసంహరణహేళి
యదితిదుఃఖోచ్ఛేదనావంధ్యధర్మంబు సత్యామనోరథాశ్చర్యదాత
యీతఁ డీస్వామి నేఁగంటి నేమిభంగి, నెంతసుకృతినో యేను జన్మాంతరమున
నెట్లు గడియగు కానిక యేమియిత్తు, నితని కేమనిభాషింతు నితనితోడ.

క. జయగోవింద జనార్దన, జయమాధవ కృష్ణవరద సర్వజ్ఞ హరీ
జయ విజయసఖ జగన్మయ, జయనారాయణ ముకుంద జయ చక్రధరా.

తే. ఇదె నమస్కార మంజలి యిదె మహాత్మ, యిదె సమస్తాంగసన్నుతి యీశ్వరేశ
యిదె శరణ్య నీశరణంబ యెపుడుఁ గోరు, తలఁపు రక్షించు భవదేకధర్మ నన్ను.

వ. అని బహువిధంబులం బ్రశంసానురూపంబుగా వాక్యాలాపంబు విస్తరించి మఱియు విశృతంబుగా వర్తించి శూలప్రోతం బైనశవంబు నొక్కటఁ బుచ్చి ఖడ్గంబున రెండుద్రయ్యలుగాఁ జీరి శౌరిముంగట సమర్పించి సలిలంబున సంప్రోక్షించి ఖడ్గంబు దాలఁగఁబెట్టి చేతులు మొగిచి.

మ. ఇదె భూదేవశవంబు పావనము నీ కే భక్తి నర్పించెదన్
విదితం బెక్కుడు సర్వవర్ణములకున్ విప్రాళి యగ్రాట నిం
పుదలిర్పంగ మదర్పణంబు త్రిజగత్పూజ్యా భుజింపం జనున్
సదయాళుల్ సతులై నయాశ్రితులయర్చల్ గొంద్రు నిశ్శంకతన్.

వ. అనిన నతండు తదీయం బగుపిశాచభావబీభత్సంబు సూచి వీనికి మద్భక్తియుక్తి యెంతగలిగియు నైసర్గికదోషంబు విడువ దిబ్బంగి నేజాతియందును భక్తపక్షపాతి యగుటఁ గృపసేయవలసి యున్నయది యెట్లున నేమి నాదైనదయాళు

త్వంబు నెఱపెదఁగాక యని విచారించి యతనిం గనుంగొని.

క. వీనుఁగు నంటరు మాదృశు, లై నెగడెడుపెద్దవార లందును జూడం
గాను మహామానోన్నత, యీనీయిడుపూజనంబు హేయము నాకున్.

మ. సకలప్రాణిసముచ్చయంబునకు సర్వశ్యం బగ్రగణ్యంబు వి
ప్రకులం బక్కట యేఁ దిసం దగున ఘోరం బైనహింసాదరిం
బొకసామాన్యపిశాచజంతులకుఁ గా కోహూ యసర్వంబు నీ
కకలంకాత్మున కిట్టిచేఁత మహనీయారంభ మెబ్బంగులన్.

మ. అనిశంబున్ హృదయంబునందు నను నధ్యాసీనుఁ గావించి యెం
దును మత్పుణ్యకథావళీవినుతి కుద్యోగించుచున్ జన్మమి

ట్లనఘా మెచ్చితి నీవు గావునఁ బ్రమోదాత్ముండ నైతిం గృపం
గని నీకిత్తు నమర్త్యతుల్య మగునాకం బెందుఁ గీర్త్యంబుగాన్.

వ. అని యానతిచ్చి వరదవరేణ్యుం డగునా సర్వలోకశరణ్యుం డప్పుణ్యుదేహంబు మోదావహం బగుతనదివ్యపాణిపయోరుహంబున సంస్పర్శనంబు సేసిన.

**ఘంటాకర్ణుఁడు పిశాచదేహంబునవలి పుణ్యలోకంబునకుం బోవుట.**

తే. పరుసవేది సోఁకుటయును బరుసలోహ, మధికశుద్ధసువర్ణమ యైనపోల్కి
సతని కేలుదామర సోఁకి యాతఁ డంబ, యాపిశాచరూపము మానియద్భుతముగ.

చ. అమరులు సిద్ధు లాదిమును లాదిగ దివ్యతపంబు భవ్యయో
గముఁ దగి నిర్వహించియును గానఁగ నేరని యట్టిదివ్యరూ
పము ధరియించె సర్వగుణభాసిగ నాతఁడు చారుగంధస
న్స్రఙ్ముఖరభూషణాన్వితులు తత్సదృశోదయలీలఁ బొల్చుగాన్.

క. అది యట్టిద యచ్యుతుఁ డన, హృదయంబునఁ దాల్చుసుకృతి కెవ్వేటను న
య్యదియును బ్రాఁతియె యణిమా, ద్యుదితపదము లతనిచేత నున్నవి గావే.

వ. అట్లు సిద్ధత్వంబు నొంది సిద్ధపూర్వాంగుం డై నయనంగుభంగి సంగీకృతాద్భుత దేహుం డై సముఘంబహువిధంబున సతులయతనులాభసహితుం డై నతారాద యితుచందంబున నాదమయశరీరుం డై నయయ్యుదారుఁ డన నాలోకించి యా లోకేశ్వరుండు.

మ. త్రిదివం బంతటిదాఁక నేలు నలమిన్ దేవేంద్రుఁడుం బంచాఁక సి
ద్ధుఁడ ముప్పారఁ బదీయమిత్రపదవిన్ ధన్యుండవై యుండు త
త్పదవిచ్ఛేదము పిమ్మటం బ్రకటమత్సాయుజ్యసంప్రాప్తి సి
ద్ధి గాంచున్ వేల్పులకైన నంద దది నీవొక్కండవుం దక్కఁగాన్.

క. వరముగ నిచ్చితి నీకున్, గురుత్వదశ యింతకంటెఁ గోరిక మదిలోఁ
దిరముగఁ గలిగిన నడుగుము, సురాసురప్రముఖులకు నసులభమ యేనిన్.

వ. అనిన ఘంటాకర్ణుం డుదీర్ణపూర్ణహర్షుం డగునీలవర్ణునకు సాష్టాంగప్రణతుండై లేచి నిలుచుండి మొగిచినకేలు ఫాలంబునం గదియించి.

ఉ. దేవర సుప్రసాదశుభదృష్టిసుధావిసరంబు నాపయిన్
వావిరి వెల్లిగొల్పితి మనంబున కింకొకవర్తి గల్గునే
దేవ మహేశ యైనను మదీయమనీష నితాంతభక్తి నే
త్రోవల నెమ్మెయిం దొలఁగఁ ద్రొక్కక నిన్ను భజింపఁజేయవే.

వ. అనిన నవ్వరం బట్ల యొసంగి వాసుదేవుం డతనివీడ్కొలిపె నాసిద్ధుండును సిద్ధ గతి నరిగె నని.

క. అభిమన్యుపౌత్రునకు వా, గ్విభవసమర్థుఁడు ముకుందవృత్తంబు ముని
ప్రభుఁడగువైశంపాయనుఁ, డభయుఁడు వినిపించినట్టి వఖిలముఁ దెలియన్.

మ. భుజగేంద్రాయితభూరిభూభరణ విస్ఫూర్జద్భుజశ్రీభుజ
త్యజితానేకనరేంద్రవర్గ మతిమత్సంభావ్యవర్గా మహా
భుజగారిధ్వజ తత్త్వశోధన యశోభూయిష్ఠ తేజోధనా
భుజగాకల్పక కల్పభూపమహితా భ్రాజోల్లసద్భాసితా.

క. రత్నాకరనాయక గుణ, రత్నోజ్జ్వలరాజితాత్మరంజిత శశ్వ
ద్యత్నాంతర్ద్వీపాంతర, రత్నాలంకృత సమస్తరాజ్యరమాంగా.

మాలిని. నయవినయసమర్థా నైజసంవిత్కృతార్థా
జయవిభవధురీణా సాధురక్షాత్మపాణా
హయహృదయవిధిజ్ఞా హాసితాన్యాధిపాజ్ఞా
గయనృగునలతుల్యా గాఢదోస్సారకల్యా.

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్య
ధుర్యశ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్ష్మణాభిధేయ యెఱ్ఱయనామ
ధేయ ప్రణీతంబైనహరివంశంబునను త్తరభాగంబునందుఁబంచమాశ్వాసము.

## ఉత్తరభాగము – షష్ఠాశ్వాసము

క. శ్రీనాథకథాశ్రుతిని, త్యానందవిలాసమందిరాంతఃకరణా
దానగుణైకాభరణా, భూనారీరమణసుభగ పోలయవేమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు భక్తానందసంవిధాయకుం
డై నయయ్యాదునాయకుండు బదరీవనాపవర్గకనపారీణుండై యున్నంత.

మ. తనపైశాచికభావముం దొరఁగి సిద్ధత్వంబునం జేర్చి నె
ట్టనఁ దేజోమయమూర్తియై చనినఘంటాకర్ణుతో మచ్చరిం
చెనొకో నా నిబిడంబులై యెసఁగుపెంజీకట్లు వాయంగ నూ
తనసంధ్యామయదీప్తి దాల్చెఁ ద్రిజగత్కల్యాణకల్యాకృతిన్.

క. వినతాతనయుఁడు మున్నుగ, ననుపమతేజుఁడయి తోఁచెహరి తానయనన్
వినతాతనయుఁడు మున్నుగ, ననుపమతేజుఁడయి తోఁచె హరి యుదయాద్రిన్.

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు గంగాస్నానవిశదగాత్రుండును బవిత్రా
సేవితసరోజమిత్రుండునునై దేవకీపుత్రుండు సనుదెంచి సవినయంబుగాఁ ద
నిఖిలమునిదేవసముదయంబును నెదుర్కొన నయ్యందఱు నభినందించి రా

దనపోయినపోక లన్నియుం జెప్పిన నప్పరమవ్రతు లప్పిశాచంబునకుం గలిగిన
పుణ్యపాకంబు గొనియాడి రనంతరంబ వారల వీడ్కొని.

క. గరుడారోహణలీలా, సరసం బగుగగనమార్గసంచారమునం
ద్వరితగతి నుత్తరపుదెస, కరిగి మురద్విషుఁడు ప్రముదితాత్ముం డగుచున్.

మ. కనియెం గ్రీడదమర్త్యదంపతిమిథోగంభీరహాసంబు ని
త్యనిరుద్ధేంద్రియసిద్ధసంయమిగణైకావాసమున్ వాసవా
ద్యనఘారాధనరమ్యరుద్రచరణన్యాసంబు నానస్నఫే
లనలోలాద్రిసుతామనోజ్ఞగిరిశోల్లాసంబుఁ గైలాసమున్.


శ్రీకృష్ణుండు కైలాసంబు గనుంగొని తద్విభవంబు నభివర్ణించుట.

వ. కదియం జని తదీయవిభవంబు లూహించి.

సీ. ఈకొండ సెలయేఱు లీశ్వరువృషభంబు గోరాడు కూలము లగ్గాడి యొప్పు
నీగిరికుంజంబు లిందుశేఖరుదేవి మెచ్చుపూఁబజపులు మెఱయ మెఱయు
నీయద్రినెత్తంబు లీశతాండవరంగభూములై యసమానఘాతిఁ దనరు
నీపర్వతముకోఁట లిభదైత్యదమనుపూజకు భృంగి కోయుపుష్పములు పూచు
నీనగంబు క్రేవలు ప్రమథేశ్వరులకు, రుద్రకన్యాసహస్రంబు రుచిరకేళి
నలర నెలవులై యొంతయునమరునని, బొగడఁ దగదె యీరాజతభూధరంబు.

తే. తలలు దఱిఁగి పూజించినదప్పలేల, నెనఁగునీఁదుఁడు నీశైల మెత్తఁబోయి
బాహు లిఱుకంగఁ దాల్మి నిబాసి కూలె, నీనిగౌరవంబున కెద్దిమాన మరయ.

మ. తొమ్మిదిపెన్నిధానములు దూకొని యర్థపిఘుం డనం బ్రబ
స్తమ్మగుపేర్మి నిందుధరుసఖ్యము గాంచినమేటి యొండు వో
టిమ్మొయి మెచ్చ కిప్వర మహీధరుపాదము నాశ్రయించి సౌ
ఖ్యమ్మున మూరిఁబోయెఁ జెఱియద్రుల కింతటిపేర్మి గల్గునే.

శా. యత్కుస్త్రీస్తనభంగురోర్మి యలకేశాంతఃపురోత్తంసతా
దక్షస్వర్గసరోజకిన్నరవరద్వంద్వానుభూతస్థలీ
వృక్షచ్ఛాయ వియత్తరంగిణిపయోవేగంబున న్నిత్యముం
బ్రక్షాళింపఁగ నొప్పుదీనిచఱు లీభద్రంబు సామాన్యమే.

చ. అనిశమకి సార్వభౌమకరి యభ్రముపైఁ గమనీయపుష్కరం
బునఁ గనకంపుఁజెంగలువపుప్పొడి నొప్పగునీరు సల్లఁగాఁ
దనరుచు నంచకాఁపులకుఁ దానకమై కడలుల్లసిల్లఁ బెం
పెనసినమానసం బమరు నిచ్చలు మెచ్చరె యిమ్మహీధ్రమున్.

మ. కరులున్ సింగములున్ వృకంబులుఁ గురంగంబుల్ భుజంగంబులున్
బురినెమ్మిల్ మొదలైనకాననచరంబుల్ వైరము ల్దక్కి శం

కరసంస్మృత్యనుభూతియం దొకటి కెక్కం బ్రీతితోఁ దెల్పుచున్
బరఁగున్ దీనితటంబునన్ శుభమిమిప్పట్టాత్మవిత్కోటికిన్.

సీ. అరిగి దక్షాధ్వరం బఱనఱసేయంగ భద్రతేజునివీరభద్రుఁ బనిచె
దర్పించి పలికినఁ దలద్రుంచి కమలజుఁ గ్రొవ్వడఁగింప రుద్రులను బనిచె
నన్యాయకారియై యసురినయంతకుఁ బ్రహరింపఁ గాలభైరవునిఁ బనిచె
నిజభక్తరక్షణానిష్ఠమై మృత్యువు భంజింప బహుగణప్రతతిఁ బనిచె
నర్థి నిమ్మహాచలము సింహాసనముగ, నెలమి నుండి విశ్వలోకేశ్వరుండు
అమరగవాసంబు మొనలునాసన్నభూము, లెఱుఁగఁ జేసెంభసనఘమెచ్చునిదియెకాదె.

వ. అని బహుప్రకారంబుల బహుమానతత్పరుం డగుచు నటఁ బరిక్రమించి.

క. ఇదె ప్రేపయుపవి ప్రమథులు, ముదమున శతకోటిసంఖ్య మునరికొని ప్రియం
బుదలిర్ప దీనఁ గోలలు, గుదియులుఁ గైకొండ్రు తమకుఁ గోరికగింపన్.

మ. అదె నందీశ్వరనేత్రవారితనిలింపాజస్రసమ్మర్దసం
పద సొంపారెడుశంభుగోపురము సంభావ్యంబులై మించె నిం
పొదవంగా నవె సర్వగేహమణిశృంగోన్నద్ధచామీకరో
ద్యదనేకధ్వజవైజయంతిక లమందాందోళనోల్లాసముల్.

ఉ. అంశికనెచ్చెలు ల్విజయయాదిగఁ బువ్వులు గోయుకేళిరా
గం బగునిక్కువంబు గలకంధరసంబులతోడఁ గూడి వ
ద్యంబుగ వీచె ముందట వనాంతములం దవె శంకరార్ధదే
హం బడగోలుగొన్నసతి యమ్మితహాసవిలాసగేయముల్.

వ. అనుచుఁ గొండొకతడవునకు తత్ప్రదేశంబు లతిక్రమించి చని మానససరసియు
త్తరతటంబునఁ దార్క్ష్యువలన నవతీర్ణుండై యమ్మహాత్ముండు.

క. అచ్చటిమునులు న్సిద్ధులు, నచ్చి తనుం గాంచి వినయవత్పూజనముల్
మెచ్చుగఁ జేయఁగఁ దగుచో, నిచ్చ నిలిచి తపముమీఁద నెసకపుఁగడఁకన్.

తే. ద్వాదశాబ్దకృత్యం బగువ్రతము నిర్వ, హించుతలఁపున జడలు ధరించి శాక
మూలఫలకోటి యాహారముగఁ దొడంగెఁ, దన్మయాత్ముఁడై తాపసధర్మమునకు.

వ. ఇట్లు ఫాల్గునశుక్లపక్షంబున దీక్షించి యక్షీణంబు లగునిత్యస్నానాధ్యయనధ్యాన
జపతర్పణహోమబలిప్రముఖంబు లగునమష్ఠానంబుల దెస నతిగరిష్ఠ యగునిష్ఠ
నవలంబించి యున్నయంబుజోదరునకుఁ గాకోదరద్విషుం డగ్నికార్యప్రయోజ
నంబు లైనయింధనంబులు దెచ్చియిచ్చు, సుదర్శనచక్రరాజంబు పూజార్థకుసు
మంబులు గొనివచ్చు, నందకఖడ్గం బఖండితకుశలంబు సంఘటించు, అఖిలాస్త్రం
బులతోడ శార్ఙ్గంబు దైత్యదానవభీకరంబై భృత్యభావంబున మెఱయు, అగ్రభా

గంబునఁ బాంచజన్యంబు సకలదిశలు రక్షించుఁ గౌమోదకి సమస్తవస్తువులు సంపాదించి సర్వపరిచర్యలుం జేయు నద్దేవుండును నియతభావుండై.

క. ఒకనెల యొక్క పదార్థం, బొకనెల వేఱొకటి మఱియు నొకనెలలోఁ దా
నొకటి యశనంబుగా నీ, ప్రకారమున నొక్కవత్సరము చరియించెన్.

వ. రెండవయేఁడు నట్లకాఁ గ్రమంబునఁ బండ్రెండువర్షంబులు గడపి పండ్రెండవ యేఁటిమాఘమాసంబున నవసానంబునందు.

క. ప్రణిధానంబున నంబా, ప్రణయుం బశుపతి సమర్చి భక్తియెలర్పన్
బ్రణవము రుద్రాధ్యాయము, ప్రణుతమతి జపించుచుండెఁ బర్యాయమునన్.

ఇంద్రాది దేవతలు శ్రీకృష్ణుని దర్శించుటకుఁ గైలాసపర్వతంబునకు వచ్చుట.

మ. అతిమాత్రాపరతంబు పేర్మిఁ గృశుఁడై యాపింగళంగజ్జటా
ధృతి నొప్పారుపురాణసంయమిఁ బ్రభుం దేనార్చితుం దేవకీ
సుతు విశ్వంభరు విశ్వలోకవరదుం జూడంగ నేతెంచి రం
చితగాఢోద్యయద్వైభవంబులు గడుం జెన్నొంద బృందారకుల్.

వ. ఇవ్విధంబున నైరావణంబు నెక్కి యొక్కెడ నొప్పునను బోలెడు భానునంబు కేలి సమద సమగ్రకరకలితకనకసంఘాతాలస్పందానిలంబులు ఘంటలంబులు నదల్ప ననల్పమణిమరీచిరుచిరంబు లగుభూషానికరంబులు నయనసాహస్రంబును సహస్రదళసముదయంబున నలంకృతం బగుగాత్రంబునఁ బునరుక్తిపరిష్క్రియా చిత్రంబు గాత్రంబునఁ గావించి పెంపారుపాకశాసనుండును లోకత్రాసకరం బగుకాసరంబు నధిరోహించి రోహితేక్షణంబును నాక్షిప్తకపాతమస్సమూహంబును నగుదేహంబుతో దేహినివహజీవితఖండనచండం బగుదండంబు ధరించి దర్పోద్రేకభయంకరు లగుకింకరులు పరివేష్టింప నక్లిష్టతేజుం డగుభానుతనూజుండును మనోజవం బగువాహనంబై మెఱయుమరాళంబు నెక్కి పోలుపారు ధవళ యగుతనువు విలసనంబుగఁ జేయుముత్తియంబులతొడవులును దుకూలాత్మకంబు లగుపరిధానోత్తరీయశిరోవేష్టనంబులుం దదనురూపంబు లగుసితచ్ఛత్రచామరవాలవ్యజనంబులు నొక్కటెలుపై వెలయ బహుళయాదోనివహంబులు గొలువ వరుణుండును నరుగుదేరం దోడన యశ్వినులు వసువులు సాధ్యులు లోనగుగణదేవతలును సిద్ధవిద్యాధరాది దేవయోనులును బర్వతనారదప్రముఖమునివరులును వచ్చినం గైలాసశైలాసన్నప్రదేశంబు లక్లేశసమ్మర్దసుందరంబు లయ్యె గంధర్వగానంబులుం గిన్నరవల్లకీధ్వానంబులు నప్సరోనర్తనంబులుం జారణసంకీర్తనంబులు వైమానికపుష్పవర్షంబులు నొక్కట నుల్లసిల్లె నట్టియెడ నయ్యందఱుం దమలోన.

ఉ. చూచితిరే పురాణపురుషుం బురుషార్థసమర్థు యోగిహృ
ద్గోచరుఁ గృష్ణు నేమి తెలిఁగో యిట వచ్చి తపంబు మైఁ గడుం
గోచరి యైన నాఁ డితనిగూఢమనోరథ మెట్టిదో ఫలం
బేచతురాస్యుఁ డో యీతనికి నిచ్చుటకుం బ్రభుఁ డిజ్జగంబులన్.

క. కంటిమి గన్నులపండువు, మంటి మనుచుఁ దద్గుణౌఘమధువాహిని పె
న్నింటం దేల్చుచు సమ్మద, కంటకితాంగులయి యేగి కాంచిరి వరుసన్.

వ. అట్టిమహోత్సవంబున నద్దినంబు పరిపూర్ణం బగుటయు మఱునాఁడు.

సీ. ఎనిమిదిమూర్తుల నెవ్వఁ డీవిశ్వప్రపంచంబు దానయై పరఁగి యొప్పు
సకలంబునకు నంతరాత్మయై యెవ్వఁడు సాంఖ్యయోగజ్ఞానసరణిఁ దోఁచు
నజుఁ డనాద్యంతవిధాయి యింతకు ననఁ దలపోయ నెవ్వఁడు దనరు శ్రుతుల
వేల్పులకును వేల్పు విభులకు విభుఁ డెవ్వఁ డచలభక్తికి గమ్యుఁడై వెలుంగు
నమ్మహాదేవుఁ డనిరూపితానుభావుఁ, డప్రమేయుఁ డనంతదయావిధేయుఁ
డచ్యుతుం డున్నెడకుఁ బ్రీతి నరుగుదెంచె, నద్రిజయుఁ దానువృషభవాహనము నెక్కి.

వ. అద్దేవుపార్శ్వంబున నపరిమితయక్షరాక్షసపరివారుండును నక్షయసిద్ధగణసేవితుం
డును బుష్పకవిమానారూఢుండును నై వైశ్రవణుం డొక్కకెలన నుదగ్రమూ
షికమయూరవాహనులై యాత్మీయచిహ్నంబులతోడం గరివదనకార్తికేయు
లును నగ్రభాగంబున వేత్రదండపాణులై నందిమహాకాళులు ముందటం బిఱుం
దను నెలంకుల మఱియు సర్వదిక్కులనుం బరఁగి ఘంటాకర్ణశంఖకర్ణవికటాక్ష
దీర్ఘరోమదీర్ఘనాసదీర్ఘలోచనదీర్ఘబాహుదీర్ఘముఖులు ననూగువక్త్రపార్శ్వవ
దనశతగ్రీవశతోదర కుంభోదరులును మహాగ్రీవస్థూలజిహ్వసింహముఖవ్యాఘ్ర
ముఖోన్నతాంసమహాహనులును ద్విబాహుచతుర్బాహుపంచబాహుశతబా
హులును పేళ్లుగలిగి తాదృశంబులై నయాకారంబుల నద్భుతంబులై పెంపు దెంపా
రిన యసంఖ్యాతభూతంబులు సంహితప్రేతకరాళంబు లగుశూలంబులతోఁ బరి
ఘారితకీలాలంబు లగుకరతాళంబులతో నతికఠినపాతంబు లగుచరణఘాతంబుల
ధరణి యదరిపడ నాడుచుఁ బటుహాటంబరనిర్ఝరంబు లగువీరస్వరంబులం బాడుచుఁ
బ్రకంపితదిగ్భాగంబు లగునూరువేగంబులఁ బరువులు వెట్టుచు నాక్రాంతగగ
నంబు లగులంఘనంబుల నెగయుచుఁ దమతమవంగడంబు లేర్పడ నడిచిరి ప్రశాం
తస్వాంతులు ప్రాప్తేంద్రియజయులు నంగీకృతయమనియములు నాత్మజ్ఞాననిష్ఠా
నులును నగుప్రమథులుఁ ద్రిపుండ్రాంకితలలాటంబులు భస్మోద్ధూళితవక్షంబులు
నక్షసూత్రశోభితహస్తంబులు రుద్రాధ్యయనతత్పరముఖంబులు భక్తిపులకితావ
యవంబులు నానందబాష్పవిస్ఫురల్లోచనంబులు నైనదేహంబుల వెలసి విలసిల్లిరి
చతుర్భుజులుఁ ద్రినేత్రులుఁ జంద్రరేఖాంకితజటామకుటులు శూలడమరుఖట్వాం

గలకంఠులు నాగయజ్ఞోపవీతులు శార్దూలచర్మవసనులు భద్రమూర్తులునై కీర్తి
తానుభావధుర్యంబు లగునైశ్వర్యంబు లెనిమిదియుఁ దమవశంబునఁ బర్తిల్ల జగ
దుత్పత్తిస్థితిసంహారకారణంబులయందుఁ జంద్రశేఖరునంతవారల యగుటం జేసి
వారిరుహాసనవాసవప్రముఖులకు సకలోపచారంబుల నర్చనీయులు గావున నగమ
నీయవైభవంబున శోభిల్లిరి విముక్తసంసారులు విపులతపశ్శాలులు సకలసర్వవే
దములు సత్యవ్రతశాస్త్రవాదులు ననన్యభక్తిగంభీరులు నగుమునివరులు కృష్ణాజిన
కమండలుకుశముష్టిప్రభృతిచిహ్నంబు లమర భూతిధవళితంబు లగుశరీరంబు
లలర మాహేశ్వరంబు లగుశ్రుతిసూక్తంబులఁ బౌరాణికంబు లగుభవ్యస్తోత్రం
బులఁ గారికంబు లగుజయజయధ్వానాలోకనశబ్దంబులం బరమేశ్వరునిఁ బరితుష్టుం
జేయుచు మహాసంఘంబులై మెఱసిరి సర్వాంగసుందరులును సమస్తసిద్ధిసంప
న్నులును సంతతసుఖాభిరాములును సంభృతానందపారవశ్యులును సమ్యక్ప్రబు
ద్ధులు నగుసిద్ధులును విద్యాధరులుం బ్రియాసమేతులయి దివ్యభూషణగంధ
మాల్యాంబరాకారంబు లగునలంకారంబుల నింపారఁ జెలువొందిరి వీణావేణు
మృదంగనాదనంబులు మంగళగానంబులు నెసఁగించు గంధర్వులు నప్సరోంగ
నలులలితాంగనాసత్త్వపదోదాత్తంబు లగునృత్తంబులు రమణీయంబులు గావిం
చిరి మహావాచాలురగు చారణులు ప్రస్ఫురదహీనదశపద్వరధ్వనంబులు మొద
లుగాఁ గలగంగాధరువిజయావధానంబులు కైవారంబులు సేయుచుఁ జెన్నుమీ
ఱిరి వైమానిక ముక్తంబు లగుపుష్పవర్షంబులం బొదలుసౌరభ్యంబులు గైకొని
కైలాసశైలనిర్ఝరశీకరంబులం బడిసినమందసమీరుండు సమీహితసురవితాన
నైజయంతికాపల్లవుం డగుచు నల్లసిల్లె నిట్లు మహావిభూతి విస్తరిల్ల విజయం
చేసి విశ్వేశ్వరుండు.


శివుఁడు సపరివారుండై శ్రీకృష్ణునిఁ గానవచ్చుట.

మ. కనియెం దార్క్ష్యసుదర్శనాదినిజభక్తప్రత్యూహాపాదితా
ప్సనహోమోచితవస్తుసంచయములం బ్రజ్వల్యమానానలున్
ఘనకృష్ణాజినవాసు భాసురజటాకల్పున్ సుసంకల్పు భా
వనిరుద్ధేంద్రియు సత్సమాధిపరతావర్ధిష్ణునిం గృష్ణునిన్.

తే. కని యమ్మునము కృపాదృష్టి, మునఁ దోఁగఁగ సుప్రసన్నముఖుఁ డగుచు నప్పుం
డనురాగంబునఁ దనవా, హనవృషభము డిగ్గి దయిత నందడి యేగెన్.

క. వెన్నుఁడు నవ్విభు దవ్వులఁ, గన్నంతన నిజసమాధికలితాసనమున్
గ్రన్నన విడిచి యెదురుసని, సన్నతమౌళి యయి భక్తిసంభరితగతిన్.

వ. కేలు మొగిచి ఫాలంబునం గదియించి ఫాలనయనుమూర్తి దప్పక చూచుచుం
డె నట్టియెడ.

సీ. ఔఁదలఁ జదలేటి తేటదరఁగలు వాలుఁ దగుచందమామ నుయ్యాలలూఁపఁ
దొడవుల తలలఁ జెన్నడరుమానికములచాయ దిక్కుల నెఱసంజవలుపఁ
ధోరంపుబెనికతోలియె త్తైఱకప్పు కుత్తుకతోఁ బ్రీతిఁ బొత్తుసేయ
పట్టంపుబూదిపూఁతల బూదిసఱచిసపునుకలపేరురంబునఁ దలిర్ప
మూఁడులోకంబులును గావ మొనసినట్లు, చేతముమ్మొనకయిదువు చెన్నుమీఱ
వేల్పుపడువుచూడ్కికిఁగడువింతయొప్పు, నేసెముక్కంటియున్నయాచెలువుపేర్మి.

క. హరిఁ జూతురు హరుఁ జూతురు, హరుఁ జూతురు గ్రమ్మఱంగ హరిఁ జూతురు ని
ర్జరులు మునులు వారిమ్మెయి, హరిహరతత్త్వయుగవిస్మితాలోకనులై.

వ. అంతటఁ బయ్యిరువురకుం బ్రణామంబులు చేసి యంజలిపుటంబులు ఘటి
యించి.

సీ. యజ్ఞరక్షకుఁడును యజ్ఞవిధ్వంసియు నై లోకనుతులఁ బెంపొందువారు
కందర్పజనకుండు గందర్పదర్పైకదమనుండు నై లీలఁ దనరువారు
భువనసంభర్తయు భువనసంహర్తయు నన నాప్తగుణకృత్యులైనవారు
భూధరోద్ధారియు భూధరావాసియు నగుట నిత్యప్రీతి నెగడువారు
విషధిజాతంబు లగురత్నవిషము లురముఁ, గప్పుకంఠంబుఁ గైసేయ నొప్పువారు
భుజగశయనుండు భుజగవిభూషణుండు, నపుడు గరుణతో వరములయ్యెదరు మాకు.

క. ఈశ్వరేంద్రమూర్తులును నిం, పారఁగ నిటు గదిసియున్న నంతఃకరణం
బారాధింపఁగఁ గని యీ, ప్రారంభము లెల్లఁ బ్రాప్తఫలముల మాకున్.

## శ్రీకృష్ణుఁడు శివుని మాహాత్మ్యం బభివర్ణించి స్తుతియించుట.

వ. అనుచుం బుండరీకాక్షుం డట్లు ప్రత్యక్షమూర్తియైన యష్టమూర్తికి సాష్టాంగ
దండప్రణతుండై యిట్లని వినుతించె.

క. శ్రీకంఠ గగనతటినీ, శీకరకోరకితజూట శీతకిరణరే
ఖాకల్ప కల్పతరుశ్రీ, లాకల్ప దయావిలాస లాలితసుజనా.

ఉ. నీమహనీయనామములు నీమహనీయగుణోదయంబులు
న్నీమహనీయశీలములు నిత్యవిచిత్రము లాద్యసంయమి
స్తోమనిరుక్తులం దెలిసి చూతురు ప్రాజ్ఞులు సర్వదేవచూ
డామణిలగ్నముల్ భవవిపద్భరమోచనముల్ మహేశ్వరా.

మ. ఉరుఖట్వాంగకపాలభస్మభుజగామ్యద్దామచిహ్నంబు ల
ట్లరుదై యొప్పఁ బ్రభూతభూతవికృతవ్యాపారము ల్నాడ్కికిన్
బరమాత్ముం డొక్క మొనర్పఁగా నెసఁగురూపం బొంద కీవున్న నె
వ్వరు సర్వజ్ఞ యెఱుంగువారు భవదవ్యక్తాద్యసూత్మ్యాకృతిన్.

క. చిరతపములు మెచ్చను సు, స్థిరభక్తికి వలచి వచ్చి చిక్కను త్రిజగ
ద్వరదా ప్రభు నిన్నుఁ దక్కఁగ, హర యన్యునిఁ జెప్పఁగలవె యామ్నాయంబుల్.

ఉ. మేదిని తోయముల్ శిఖి సమీరుఁడు మిన్ను రవీందులాత్మనా
నైదును మూఁడు నీతనువులై వెలుఁగొందఁ బ్రపంచనిష్ప్రపం
చోదితభావకర్తవయి యొక్కఁడ వవ్యయ వసరారు చెంపు లో
కాదిని నిన్నెఱుంగుబుధుఁ డన్యుఁ గణించునె విశ్వవందితా.

ఉ. దక్షుఁడు దక్షుఁడై చెడియెఁ దన్మఖమందుఁ గడంగి భాహుఁడం
తాక్షిరసజ్ఞులాదిగ నపాయమునొంది రనేకనిర్జరుల్
ప్రక్షతులైరి నీనుదుటిపావకుఁ జేరిన గాలుఁ గాలుఁడుం
బక్షులుఁ బైననీ న్ఱకిఁడ రాజవు రాజకళావిభూషణా.

మ. గిరిరాజాత్మజ దేవి నీకు గిరి దా గేహంబు విశ్వామరే
శ్వరులుం బంట్లు సుభూతముల్ సహచరవ్రాతంబు త్రైలోక్యమం
బరమైశ్వర్యపదంబు నీకు ననఁ జెప్ప న్నీ సకా కన్యులె
వ్వరు నీయుద్ధతతాండవం బనితరవ్యాప్తం బె యంబాపతీ.

క. హుతభుజుఁడును యజమానుఁడు, హుతమును నీవ యని చెప్పుచున్నవి శ్రుతులా
శ్రుతిముఖములు నీప్రియములు, క్రతుఫలదాతవును నీ వ్రకరుఁడవె రుద్రా.

క. అతిసౌమ్యము లతిఘోరము లతిసూక్ష్మము లతివిపులము లద్భుతములు నీ
వ తదాకారంబులు త, ద్గతహృదయుల కెఱుఁగవచ్చుఁ గిందిప్పహరా.

క. భూతివిధాయకుఁడ వఖిల, భూతనియామకుఁడ వీవు భూతినిధివి స
ద్భూతిమయుఁడవు నమ్రులకును, భూతేశ్వర నీమహిమ ప్రభూతంబు శివా.

క. భద్రాకారుఁడవు సతత, భద్రచరిత్రుఁడవు వీరభద్రుఁడవు మహా
భద్రాభిధానుఁడవు బహు, భద్రప్రదుఁడవు త్రిలోకపతివి మహేశా.

చ. నినుఁ గొనియాడ నేర్తు నన నిక్కువ మెవ్వఁడు శక్తియుక్తిఁ దె
వ్వనిమనము న్మనీషయును వర్ణిలు నెవ్వనిజిహ్వ సాగు నే
యనువు ప్రశంస చెప్పు సకలార్థసహిష్ణుఁడ వీవు నైపఁగాఁ
జనుఁ బరమేశ మాదృశులసంస్తుతిచాపలముల్ వృషధ్వజా.

ఉ. ఏసనిశంబు దేవ నిను నెంతయు భక్తిఁ దలంతు నీవు న
న్నీ నటివానిఁగా నెఱుఁగు డిట్లగు టెంచుక చిత్తగించినం
బూని కృతార్థతామహిమఁ బొందెద భక్తశుభక్రియానుసం
ధానము నీకు నైజము గదా జగదాత్మక యెవ్విధంబునన్.

క. మొఱ్ఱక్కఁదఁ గృపరక్షింపుము, మొఱ్ఱక్కఁదఁ గృపతోడఁజూడుము నిరంతరమున్.
మొఱ్ఱక్కఁదఁ గృపఁ గైకొను మే, దిక్కున నీదిక్కె మాకు దిక్కు శరణ్యా.

వ. అని బహువిధంబుల స్తుతియించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు పద్మలోచను పాణిపంకజంబు నిజహస్తతలంబునం బట్టి సర్వదేవమునిసమూదయంబులు వినుచుండ నతని కిట్లనియె.

తే. దేవవంద్య జనార్దన దివ్యతపము, పేర్మిఁ దొల్లియ తగుసిద్ధిఁ బేర్చినాఁడ
వీవు పుత్త్రుండు నీ కుదయించెఁ గాదె, మున్ను నాయోగివలన జగన్నుతార్థ.

క. విను మేను బ్రథమయుగమున, ననేకవత్సరశతంబు లంచితనిష్ఠం
బనుపడి కావించితిఁ దప, మనఘా యెందేని నొక్క యభిలాషమునన్.

వ అసమయంబున.

క. నాకుఁ బరిచర్యసేయుట, కై కొండొకప్రాయమున నిజాత్మజ సిమ్మై
నాకజనకుండు దెచ్చి న, నాకలితసహాయముగ నప్పగించెం బ్రీతిన్.

వ. ఏను నక్కన్నియ కోలుపుచ కయ్యకొంటి నట్టున్న నన్ను నద్దేవుం గూర్చుట యపేక్షించి సహస్రాక్షుం డుత్సుకసాహసక్రియుండగు జృంభమాణోద్దాముం డగు కాముం బనిచినం బనివూని.

సీ. ముందటనేలమావిముక్కుల నలరింపఁ గొత్త దానగు చెలికాఁడు నడువ
నిరువంకలందును విరులతేనియగ్రోలుచారిలు మోదంబునఁ బ్రమ్మియాడ
నునుఁగుత్తుకలతిప్పగనఁ గూయుపులుఁగులచారునాదములు కైవారములుగఁ
జందనగిరినుండి చనుదెంచి చల్లనిబం క్తులపనులకుఁ బరువువెట్టఁ
జలుకమూఁకలు గట్టినచిగురుతేరి, పసిఁడిబలుమీనుపడగ యెద్దెసల మెఱవఁ
జెఱకువిల్లు ప్రసవమ్ము లేర్తెఱ ధరించి, గట్టిబిగిసి యేతెంచె నక్కడిమిమగఁడు.

వ. ఇట్లు వచ్చి పచ్చవిల్తుండు వివిక్తప్రదేశంబునఁ బత్రచిత్రకాయచర్మాస్తరణంబున నాసీనుండనై యనూనధ్యానముకుళితలోచనం బగుచువనస్థానంబున నాత్మానుసంధానంబు సేయుచు వెలుపలినహవడి దడవుగా నుడిగి యడంగి మడంగి మనంబు పలయంబు నొందెడుపాకంబు కైకొనియున్ననన్నుం గని సమాధిసమవసానం బగుసందాఁక నాయితంబై నిలిచి యనంతరంబ పరిచర్యాపరతం బ్రొటయె మాపంబున నున్నశైలనందన యునికిం జూచి.

చ. అతులితమోహనాస్త్రము రయంబున వింట నమర్చి విస్ఫుర
ద్రతిశరనాదకర్షణధురంధర మైనకరంబునన్ సము
ద్ధతిఁ దెగనిండఁగాఁ దిగిచి తార్కొని నాహృదయంబు నల్లల
కీతముగఁ జేసి యేసె నిజజీవితనిస్పృహుఁడై మురాంతకా.

వ. ఇట్లేయుటయును.

చ. కదలి మనంబు నూతనవికారము నొందఁగ నేను భార్గవీ
వదనసరోరుహంబుపయిఁ వావిరి నిల్పితిఁ జూడ్కి వేడ్కఁ స
మ్ముదితయుఁ బ్రస్ఫురత్పులకముగ్ధము లై నిజాంగకంబు లిం
పొదవఁగ నుండె మేఘసముదోత్థకదంబకవల్లి చాడ్పునన్.

క. ఇది యేమిచంద మీటికి, మది యిట్లేది యయ్యె ననుచు మఱి యొయ్యన నేఁ
బవిలుఁడనై పలుదిక్కులు, పసలక పరికించునప్పుడు వల నొప్పంగన్.

క. తనకుఁ గలయమ్ములన్నియు, మునుకొని యేయుటయుఁ బూని మున్నున్న తెఱం
గునన చల మొప్ప నిలిచిన, ఘనుఁడు మనోభవుఁడు నాకుఁ గానఁగఁబడియెన్.

తే. ఈమనాత్ముని చేఁతయ యిగియనియుప, గాధిఁ గాఱుచుట యొంగు సర్వంబు కాగె
యని తలంచునాతలఁపుతోన నసలుఁ దుప్పత్తిల్లె గోచులఁ బాఁపఘాలదృష్టిఖమున.

చ. అలుగకు తప్పసైపు కుసుమాయుధుఁ గావుము దేవయంచు నా
కొలఁదిన దేవతల్ చనలఁ గ్రాఁడి యొలుంగులునూపి వేఁడ నే
కొలఁదిఁబలఁబోవ కట్లు దలకొన్నహాలుతానెనుఁ జెంత నోనఁ బూ
విలుతునిఁ జుట్టుముట్టుకొని ప్రేల్చి దహించి నొనరించె నీఱుగన్.


శివుఁడు శ్రీకృష్ణుని మాహాత్మ్యము వర్ణించి స్తుతిచేయుట.

తే. పిదప బ్రహ్మాదిసురలు సంప్రీతితోడఁ, జేరి యొసఁగింపఁ గందర్పచేష్టితంబు
త్రిభువనములకుహితముగఁ దెలిసియేను, గ్రమ్మఱఁగ నాఁడిఁ గలిఁగింపఁగ గుణాపుట్టె.

వ. లోకపితామహునిర్దేశంబునుం గలిపించి భవదీయపుత్రుండవై జనియించు
నట్లుగా ననుగ్రహించితి నట్లతండు గాఁడె రుక్మిణీప్రథమప్రసవంబునఁ బ్రద్యు
మ్నుం డనఁ బ్రసిద్ధనామధేయుండై సర్వగుణంబుల నిన్నుం బోలుకుమారుండు
దయించి తనయైశ్వర్యం బంతయు వహించి యీరూపంబున జగన్మోహనుం
డై యున్నవాఁడు నీవు పూర్వంబునందును నధికతపం బొనర్చి తిప్పుడు పరమ
తపోనుష్ఠాననిర్వాహకుండవు నైతి నీదైనయీభవిష్యత్తపోవిభవంబు వెలిఁగి
యింతవట్టునకును ఫలరూపంబుగాఁ గొడుగుకు మున్న యిచ్చుట యిట్లు సువ్య
క్తంబు సేయవలసె వినుము నీవు నాకును బూజనీయుండవు నీమహత్త్వం బిమ్ము
నులు సురలు సిద్ధులు నెఱుఁగనలయు వివరించెద.

సీ. ప్రకృతియు గుణములు ప్రకృతిజన్యం బగువికృతిసప్తకమును వినువికార
ములు పదియాఱునై కలిగినయీప్రోవు మాధవ నీస్థూలమహిమ వీని
కతిరిక్తుఁ డిరువదేనవతత్త్వ మీవని సాంఖ్యులు సూక్ష్మదర్శనులు బుద్ధిఁ
గని చెప్పుదురు జగజ్జననసుస్థితివిలయంబుల గుణమూర్తివై యొనర్తు
పురుషసూక్తవాచ్యుఁ డపూర్వపురుషుఁ డనుచు
నిన్నుఁ గీర్తింతు రామ్నాయనిష్ఠమతులు

• విశ్వసంప్రాప్తికతమున విష్ణునామ
మఖిలవిద్వన్నియుక్తమై యతిశయిల్లు.

క. నారము లండ్రు జలములిం, పారఁగ నారంబు లయనమై నీ వునికి
న్నారాయణుఁ డనఁగా నీ, పే రఖిలపురాణములను వెలయుఁ బ్రసిద్ధిన్.

క. వసధాతువు దివ్ధాతువుఁ, బొసఁగిన వసుదేవసంప్రభూతార్థములం
దెసఁగుట జగన్నివాసా, భ్యసనరసికు వాసుదేవుఁ డందురు నిన్నున్.

చ. హరియన సర్వసంహరుఁడ వౌటఁ బ్రసిద్ధుఁడ వైతి భక్తులం
గరుణ సుఖాత్మజీవనులఁగా నొనరించుట శంకరుం డనం
బరఁగితి బ్రాహ్మణత్వమున బ్రహ్మ యనందగి యీత్రిలోకముల్
వెరవున విక్రమించుటఁ ద్రివిక్రముఁ డైతి త్రివిక్రమంబులన్.

క. మధువులనఁగ నింద్రియములు, మధుద్విషుఁడ వింద్రియప్రమథముకతన నీ
వధికశ్రీనిధి వౌటను, బుధవర్యులు మాధవాఖ్యఁ బొగడుదురు నినున్.

క. విషయేంద్రియప్రపంచము, హృషీకమనఁ బరఁగు నీవతీతుఁడవై యు
న్మిషితముగ నది ధరించుట, హృషీకేశనామశోభి వైతివి కృష్ణా.

క. గోవుమహీదేవి మహీ, దేవిఁ బ్రకాసితేవు ప్రియసీతిలకమునం
గావున గోవిందుఁడ వను, భావంబున వామనుఁడనఁ బరఁగితి పేర్మిన్.

క. మననంబున మునియనఁగా, ననఘ తపస్థితిఁ దపస్వియనఁగా విశ్వం
బును శాసించుట నీశ్వరుఁ, డనఁగా నీకివియుఁ బేరులై యొప్పారున్.

వ. నీవు సకలచ్ఛందంబులయందు గాయత్రియు వేదంబులయందుఁ బ్రణవంబును వర్ణంబులయం దకారంబును నాదిత్యులయందు విష్ణుండును రుద్రులయందు శంకరుండును నగ్నులయందుఁ బావకుండును దేవతలయందుఁ బురందరుండును గుహ్యకులయందుఁ గుబేరుండును దేవమునులయందు నారదుండును దైత్యులయందుఁ బ్రహ్లాదుండును సర్పంబులయందు వాసుకియు నదులయందు గంగయుఁ బర్వతంబులయందు మేరువునై యుండుదువు సర్వవస్తువులయందును నుత్తమం బైనయట్టిది భవద్విభూతివిశేషంబును భవదీయవ్యాప్తికలితం బని నిన్ను నెఱింగి వినుతింపఁ జాలువారాలు రెవ్వరు విను మింక నొక్కటి చెప్పెద.

క. నీవే శైలన్నిరియు యన్నియు, నావేల్పును నను ముకుంద నాకు న్నీకున్
రూపింప లేదు భేదం, బీపగిదిని నిన్నుఁ గనుట యెఱుఁగుట నన్నున్.

క. నిను నెల్లక ననుఁజేరుట, ననుమెచ్చక నిన్నుఁ గొలుపు నరునకు నరకా
యనకారణములు హరిహర, వినిరూపణతుల్యమతులు విభు లేయెడలన్.

వ. అని పలికి పరమేశ్వరుండు తపస్వివరులదెస నాలోకించి.

క. మునివర్యులార యిందఱుఁ, జనుదెంచిన వారు మీరు సంప్రీతిననుఁ
గని యెయ్యదేని నొక్కటి, యనుపమభద్రంబు గనుటకై కడుఁగాంతున్.

తే. అదియు మీ కేను జెప్పెద నవహితాంత, రంగులై వినుఁ డింపార సన్మదుక్తి
విని సమస్తభావంబుల ననవరతము, నభ్యసింపఁగ వలయు సయ్యర్థమాత్మ.

సీ. త్రైవిద్యులకు నిరంతరసేవ్యుఁ డధికతపస్సులకును నిత్యభావనీయుఁ
డర్చనాపరులకు నవిరతారాధ్యుఁడు యోగజ్ఞులకు మనోయుక్తిపదము
సాంఖ్యుల కత్యంతసంఖ్యేయతత్త్వంబు విరతుల కానందవేద్యభూమి
బౌద్ధుల కేకాంతబోధనిధానంబు సిద్ధుల కైశ్వర్యసిద్ధిదాత
యఖిలలోకేశుఁ డావిష్ణుఁ డాదిదేవుఁ, డప్రమేయుండు భక్తదయాళుఁ డీశుఁ
డతనిఁ బరమదైవతముగా నెఱుఁగుఁడీ దియ, యధికధర్మంబు మీకుఁ బుణ్యాత్ములార.

క. ప్రణవాభ్యాసైకపరా, యణులై సతతంబుఁ దలఁచునాత్మవిమలతన్
బ్రణుతపదుఁ డైననారా, యణుఁడు ప్రసన్నుఁడయి చేయు నమృతావాప్తిన్.

ఉ. మీరును నియ్యుపాయము సమాహితసంయము లైనబుద్ధి నిం
పారి సధీకరించి కమలాక్షుఁ దలంచుచు నుండఁగాఁ బ్రబో
ధారతఁ జేయుఁ డుత్తము నిరంతరశుద్ధవివేకులై తమ
పాపము సంపఁగాఁ దు దనుభావ్యవిభావము నిమ్మహాత్మునిన్.

క. అనియుపదేశించిన న, మ్మునివరులందఱును సంప్రమోదము దమన
మ్మనములఁ గదలుకొనఁగ శం, భువనుం బ్రణమిల్లి వినయమునఁ బ్రాంజలులై.

శా. దేవా సంశయము ల్తొలంగెఁ గలఁకల్ దీఱె న్మనోవృత్తులన్
భావంబుల్ పరమార్థము న్గనియె సద్భక్తిం బ్రయత్నించి నీ
యావాసంబున కేము వచ్చినఫలం బారంగఁ బండె న్మహా
దైవంబుల్ మిము నొక్కచోటఁ గనుటన్ ధన్యంబు మాజన్మముల్.

క. లోకగురుండవు నీవిట్టి, మాకుం గరుణించి యుత్తమంబగు ప్రష్ఠా
లోకము నిచ్చితి భక్తి, స్వీకృతి యీవిద్య యగుట చెప్పితి దెలియన్.

వ. అనిన యనంతరంబ యమ్మహాదేవుండు వాసుదేవు నభినందించి వీడ్కొని దేవీ
సమేతంబుగఁ బ్రమథగణంబులతోడం గూడ నచ్చోటన యంతర్ధానంబు నొందె
మునులు ననిమిషులుఁ గృష్ణునకు నమస్కరించి యతనిచేత వీడ్కోలు వడసి
తమతమనివాసంబులకుఁ బోయిరి హరియును గరుడుని నెక్కి యెప్పటిమార్గం
బునం గ్రమ్మఱి సాయాహ్నసమయంబున బదరీవనంబు ప్రవేశించె నని చెప్పి
వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

పౌండ్రవాసుదేవుఁడు ద్వారకమీఁద దండెత్త నుద్యోగించుట

తే. వాసుదేవుఁడు ప్రీతిఁ గైలాసయాత్ర, సేయ నేర్పడఁ జారులచేత నెఱిఁగి
పౌండ్రుఁ డాత్మీయపక్షభూపాలకోటిఁ, గూర్చి యందఱ కిట్లనుఁ గొలువునందు.

మ. ధరణీమండలి నెందునుం దొడరి దోర్దర్పోద్ధతిం గ్రాలుభూ
పతులం బల్వుర నుక్కడంచితిఁ గడున్ వశ్యాత్ములై వారు నా
కరిగా నాత్మధనావళు ల్వరుసఁ బ్రత్యబ్దంబు నర్పింతు రె
వ్వరు నస్మత్పటువిక్రమస్ఫురణకున్ వక్రింప రెక్కాలమున్.

క. యాదవులు కృష్ణుప్రాపున, నాదగువేఁడిమికి నోర్చి నడుకక యెదురై
యేదియు నెఱుఁగరు శౌర్యో, న్మాదంబున నున్నవారు మహిమోద్ధతులై

వ. ఇది మఱియు నాహృదయంబున శల్యభూతంబై యున్నయది యదియునుం గాక.

తే. తాను బసులఁ గాచినగొల్లపిన్నపనేటి, మహిమయాకృష్ణుఁ డనునునింతమఱచినాఁడు
చక్ర మొక్కట్టి గలదని చక్కనుండఁ, దేపు మిగిలినమగఁటిమి సూపఁ గడఁగు.

క. తనచక్రముఁ దనశంఖముఁ, దనశార్ఙ్గముఁ దనదుగదయుఁ దనఖడ్గంబున్
నను పోఁకినఁ జెడిపోవుట, మనమునఁ దలఁపఁ డతఁ డధికమత్తుఁడు గాఁడే.

తే. వసుధలోపల నిపుడు వాసుదేవు, లున్నఁ డనఁబాటు గాదె యే నొక్కరుఁ డన
పేరు సెల్లింతు నని వీని నెదిరింతు, మెచ్చి భూపాలు రెల్లను బిచ్చలింప.

క. నాకును సుదర్శనం బను, భీకరచక్రంబు గలదు పెట్టిదముగ నే
నాకైదువు గొని చేసెద, నాకృష్ణు సుదర్శనంబు ననిఁ బొడిపొడిగాన్.

తే. అతనిపాంచజన్యమునకు నస్మదీయ, పాంచజన్యశంఖం బది ప్రతిభటంబు
దీనియుద్ధతధ్వానంబు దెసలఁ బొంగి, మ్రింగుఁ దన్మహాశంఖసముద్ధరవము.

క. హరిచేతినందకము మ, త్కరవాలం బైననందకంబును నని ని
బ్బరముగఁ దాఁకెడుక్రేంకృతి, విరచింపదె మీకు నెల్లవిస్మయభయముల్.

మ. కమలాక్షుండును నేను నొండొరులపయిం గౌమోదకుల్ వైవ ను
గ్రముగాఁ బోరి సహస్రలోహరచనం గావింపఁగాఁబడ్డ యి
య్యమదండోపమ మైనమద్గదకు నాహారంబు గాకుండఁ బ్రా
ణములం గావఁగ శక్యమే యతనికిన్ సర్వప్రయత్నంబులన్.

క. మామకశార్ఙ్గవినిర్గత, మై మార్గణవేగ మెసఁగి యచ్యుతశార్ఙ్గ
వ్యాముక్తతుచ్ఛశరతతి, వే ముంపఁగఁ జూడుఁ డింక వేడుక మీరల్.

వ. చక్రాయుధుండును పాంచజన్యలక్షణుండును శార్ఙ్గధన్వుండును గదాధరుండును నందకహస్తుండును నైనవాసుదేవుండ నేన కాని గోపాలబాలకునకుం బనిగాదు

న న్నట్టిప్రశంసనంబునఁ గొనియాడుండు కొనియాడనివాఁడు సువర్ణనిష్కధాన్యంబుల భారశతంబుల దండంబురువగలవాఁడు మత్ప్రియసఖుం డైనసరకాసురు వధియించి మాఁటులేక మలయునట్లులియుం బరిమార్చి కృతకృత్యుండ నయ్యెద నిది నిశ్చయం బనిన నతనివాక్యంబులు గొంత అభినందించిరి గోవిందు విక్రమంబునఁ దొల్లి సెట్టంబడినరాజులు సంత్రాసంబు నొందిరి కొందఱవశ్యంబును విష్ణు నిర్జించి నీకుం బ్రియంబుసేయుదు మని పంతంబు పలికిరి పౌండ్రపతియును యమునగరిపై నరుగనుత్సాహంబు సేసె నయ్యవసరంబున.

—— పౌండ్రకవాసుదేవుఁడు నారదునితో శ్రీకృష్ణునిమీఁది వైరంబు చెప్పుట. ——

క. చారుశశిరద్యుతిజిత, శారదనీరదముఁడు శ్రీవిశాగమఁడు భవ్యా త్మారదుఁ డాశ్రితవితతికి, నారదుఁడు వదీయగృహమునకు నేతెంచెన్.

క. మునివల్లభునకు నెదురుగఁ, జని యర్ఘ్యం బిచ్చి తెచ్చి సముచితకనకాసనమున నునిచి యొనర్చెన్, జనపతి పాద్యాదిహృద్యసత్కారంబుల్.

క. అన్నియుఁ గైకొని యతఁడు ప్రపన్నతఁ గుశలంబు లడుగ సర్వంబును సంపన్నముగఁ జెప్పి యిట్లను, నున్నతభుజుఁ డగుసరేంద్రుఁ డూర్జితనీతిన్.

మ. సురదైతేయభుజంగమద్యచరరక్షోయక్షగంధర్వకి న్నరవిద్యాధరగోచరంబు లగునానాలోకముల్ లోకశ త్వర నీకున్ సుగమంబు లెందును గతివ్యాఖ్యాత మేకాలముల్ గోరయం జెప్పుము నీవిహారసరణిం బుణ్యుండ వీ వెమ్మెయిన్.

క. కావున నెచ్చటి కెచ్చటికి వరిగెద వచట నచట నేర్పడ నర్యం తావహితబుద్ధివై బుధ, సేవిత నాకొక్కటి యొకటి సెయఁగ నలయున్.

సీ. సమరపరాక్రమశౌర్యుఁడు పౌండ్రుఁడు విఖ్యాతుఁ డఖిలపృథ్వీతలమున వాసుదేవుం డనువానిపే రంచితచక్రాదిఘోరలక్షణము లెల్ల వానివి వాని నవ్వానికి నిర్జింప నలవిగా దొకగొల్లఁ డతిచపలత నవ్విహుపేరును నడిగొాలములుఁ దాను గైకొని యున్నాఁడు గానఁ డొకఁడు నట్టిపగతుని ననిఁ గూల్చి యద్వితీయ, కముగఁ దనసంజ్ఞ చెల్లింపఁ గలుగువాఁడు వానిలావును నెఱుఁగుదు మానవేంద్రు, లెంద ఱేనియు వానిచే హింస పడిరి.

వ. అని యివ్విధంబునుపదేశంబు క్రమంబున.

చ. అజుసభఁ జెప్పు మింద్రుసభ నాడుము వాసవసభ న్గణింపు మ ర్కజుసభఁ బల్కు యక్షుసభఁ బ్రస్తుతిసేయుము గోవృషాంచిత ధ్వజుసభ నుగ్గడింపు మహిదానవభూచరకోటిదొట్టి యీ త్రిజగములందు నెందును జరింపుము సర్వసభాంతరంబులన్.

క. ఇదె నీయడుగుల కెఱఁగెద, సదయాత్మత నింతవట్టు సంప్రార్థనముల్
తుదిముట్టఁజేసి క్రమ్మఱ, ముద మొందింపు దగ నన్ను మునివర యింకన్.

సీ. చెలులుఁ జుట్టలు నైనబలియురు భూపాలు రేపాటికూడినా రెందఁ జేని
రథములు గరులు దురంగంబు లెన్నఁగఁ బెక్కు కాల్బలములు లెక్క కెక్కు
డీసైన్యకోటితో నీసున జగములు తల్లడిల్లఁగ బెట్టు దాఁకివెట్టి
యమగణంబుల నెల్ల నెగడెడుఁ దూలించి తత్పురిఁ గాల్చి మాధవునిఁ దోడరి
శార్ఙ్గవినిర్ముక్తశరసంచయమ్ములఁ దనుపురక్తంబుల భారితిద్దఁగ
నీకు గగనరంగంబున నిర్నిమేష, దృష్టిఁ జూడ నాట్యంబు సంధించువాఁడ.

క. అనిన విని యల్ల నవ్వున, దనవదనము వింతచెన్ను దలకొనఁగా లో
చనరోచులు దళుకొత్తఁగ, ననిమిషముని యిట్టు లనియె నాతనితోడన్.

ఉ. ఏను సమస్తలోకముల నెప్పుడు సద్దము లేక వేడుకం
బూని చరింతు సర్వజనపూజ్యుఁడ నాపలు కెల్లవారు నె
న్నొనని యాదరింతు గది యట్టిద యైనను నీదువాక్యముల్
మానవనాథ యన్నియును మానుము కానివి నాకుఁ జూడఁగన్.

క. హరి యెక్కడ నీ వెక్కడ, హరికిని నీకును విశేష మరయఁగ భూభృ
త్పరమాణువులకుఁ గలయది, పరికింపవు హరికి నీవు ప్రతియోధుఁడవే.

ఉ. సర్వసముండు సర్వగుణసంపదుపేతకుఁ డైనయాత్ముఁ డీ
సర్వజగంబు నొక్కరుఁడ చక్రములావునఁ జక్రవర్తియై
గర్వ మెలర్ప నేలురిపుగర్వహరుండు మురాంతకుండు నీ
గర్వము నెల్ల నిచ్చటన కాకట నల్లెడు సాగివచ్చునే.

తే. వలవ దుడుగుము నిన్నును వాసుదేవుఁ, డందు రే బుద్ధియుతులు సర్వాధివాస
సిద్ధయై వాసుదేవాఖ్య సెల్లె నట్టు, లుర్విలోపలఁ దత్తుల్యుఁ డొరుఁడు గలఁడె.

క. నీచక్రము నీశంఖము, నీచాపము నీదుగదయు నీఖడ్గంబుల్
నీచారోపితములు విను, చూచిన నవ్వుదురు వీని చూరులు ధరణిన్.

చ. చక్రము శంఖము న్గదయు శార్ఙ్గము ఖడ్గము విస్ఫురన్మహా
విక్రముఁ డయినదేవుఁడు త్రివిక్రముసొమ్ములు నిక్క మింత నీ
చక్రము శంఖము న్గదయు శార్ఙ్గము ఖడ్గము మాటెవానికి
వ్యక్రమవాక్యము ల్పెలుచు నాయువు శ్రీయుఁ గుల్లంబుఁ దేజముల్.

క. నవ్వెడువారల నెఱుఁగవు, క్రొవ్వున నిటు పలికె దేల గోవిందుని నీ
వెవ్వనిఁగాఁ దలఁచితి వతఁ, డువ్విళ్లూరెడు భవన్మదోద్ధతి యడఁపన్.

వ. అనినఁ బౌండ్రుండు ప్రహసితాననుం డగుచు నమ్మునిపుంగవుం గనుంగొని.

క. మాటాడినఁ గోపింతురు, నీటుగ శపియింతు రేమొ నీబోంట్లకు నీ
శూరతములు వెఱతురె మముఁ, గాటియగా నిట్లు పలుకఁ గలరే యన్యుల్.

తే. నీవు మాముంగఁటిమి గని నిక్కువముగ. మెచ్చుతెఱయును వచ్చెడు మీఁద నింక
నిప్పు ద్వారక వాగ్వాద మించుకయును, సెలవులేదు విచ్చేయుము సిద్ధవర్య.

క. నావుడు బ్రహ్మతనూభవుఁ, డేవాక్యముఁ బలుకక కఫుని యేగె బదరి క •
• ప్పే విష్ణుఁ గాంచి పౌండ్రునిబ, లావష్టంభంబుచందమంతయుఁ జెప్పెన్.

పౌండ్రవాసుదేవుఁడు ద్వారకానగరంబునకు డెత్తివచ్చి, యుద్ధముచేయుట.

వ. అమ్మహావీరుఁడును విని యతనితోఁ దదనురూపం బగువీరసల్లాపం బొనరించి
వీడ్కొలిపె నంతట.

క. ఆరాత్రియ పౌండ్రుండును నీ, ప్రారంభుఁ డనేకబల సహస్రంబులతో
ద్వారావతినగరిపయిం, దా రూఢము దాడివెట్టెఁ దద్దయు నలుకన్.

వ. ఇట్లరిగి పురంబుపూర్వద్వారంబు గని సహస్రసహస్రదీపనికరాలోకనంబువ
లన విస్మయకారి యగుప్రకాశంబు గలిగించుచు గజబృంహితంబులుఁ దురంగ
మహేషితంబులు వీరభటసింహనాదంబులు నెక్కుటు దిక్కుహరపూరణం బొన
ర్ప దుస్సహు లగుమహీపతులుం దానునుం గూడి పేరువాడి భేరీనిస్సాణకాహ
ళకోలాహలం బొనర్పం బనిచిన.

చ. అనిశము నప్రమత్తమతినాయితమై కరదీపిక ల్వెలుం
గనఖిలరాత్రులుం దివసకల్పత నొందఁగ నున్నయాదవుల్
ఘనుఁ డగుపౌండ్రురాకకుఁ దిగంగ నెకింతయు సంభ్రమంబు లే
కనువుగ సర్వసైన్యముల నప్పుడ పన్ని భయంకరోద్ధతిన్.

వ. ఉగ్రసేనబలదేవసాత్యకి కృతవర్మలు మున్నుగా వెడలి ప్రతివీరులం దలపడి రట్టి
తలపాటున హయంబులమీఁదివారు హయారోహకులం దాఁకి పెనంగ గజంబు
లంగలవారు గజోపరిస్థితులఁ దొడరి పోర రథికులు రథికులం బొదివి కయ్యంబు
సేయఁ గాల్వురు కాల్వురం బెరసి పోట్లాడ సందడి నొండొండ నొదవుపెంధూళు
లెగసి దివియలచేతనుం బొలిసి క్రొత్తచీఁకటిఁ గలిగించి దిగులు పుట్టునట్టిబెట్టిదం
పుఁజీఁదంబు దలకొలుపందలంకక తఱికిం జొచ్చి చిచ్చఱపిడుగులంబోనియమ్ములు
విజ్జుఖంబుల దీటుకొలుపుచు మేటిజోదులు కన్నాకులయి తమతమవంగడంబులఁ
బురికొలిపిన నిరువాఁగు నద్భుతసంప్రహారం బొనర్ప నందు.

మహాస్రగ్ధర. కూలెం గుంభివ్రజంబుల్ గువలయమద్రువన్ ఘోటకశ్రేణి ద్రుమగ్గం
ధూలెం దేరు ల్పదాతు ల్దుమురులయిరి నిర్ఘాతఘూళీకనిర్య

తీక్ష్ణాలోలోగ్రగ్రసనంబు ల్వాలికురి రథసంక్రీడమానోగ్రభూతా
భీలక్రీలం దలిర్చెం బృథుపలలచయస్ఫీతకోదస్యు లొప్పన్.

వ. అట్టియెడ నేకలవ్యుం డేపుమిగిలి యాదవసైన్యంబున కెదిర్చి తనపేరు సెప్పి యార్చి శంఖం బొత్తి యిదియేమి సాత్యకి యెక్కడంబోయెఁ గృతవర్మ పొడసూపండు బలదేవుండు మునిరామునిం బు కెలిపెనే విష్ణుం డెచ్చోట నొదిఁగెఁ నేను వచ్చుట నెఱింగిన నింతటివారికిం దాల్మి దలకొలుప శక్యం బగునే యనుచుఁ గదిసినం గడుంగి యదువీరు లతనిం దాఁకి రమ్మహాధన్వి యుగ్రసేను నెనిమిదిబాణంబులను వసుదేవు నేడింట నుద్ధవునిఁ బదియేనింటను నక్రూరు నేనింటను గదుని నిరువదేనింటను సారణుం బహునొకంటను హార్దిక్యు నాలుగింటను నొంచి తదనుచరులగుయోధుల నపరిమితశరపరంపరలం గప్పినం దలరి సైన్యంబులు విచ్చి యెల్ల దెసలం దెల్లడంబున నీనహస్తులు దివియలు వైచి పాఱినఁ జీఁకటి భయాంధకారంబునకుం దోడ్పడియె నట్లు యదువర్గం బోడుంగుటయుఁ బౌండ్రుండు తన్నుఁ బ్రాప్తవిజయుంగాఁ దలంచి చెలంగి యెలుంగెత్తి.

సీ. ఓరాజవరులార మీరును మీవారుఁ బడియ కొక్కట నెల్లకడలఁ గలసి
కోటఁ బ్రాఁకుఁడు లీలఁగూలఁగఁ ద్రోయుఁడు శాలోగ్రయంత్రకేతనచయములు
పురిలోనఁ జొచ్చి విస్ఫారితగేహంబులయర్థసంచయమును నాఁచికొనుఁడు
వెలయాండ్రఁ బురను గొండియలఁ బరిచారికాశ్రేణుల నొండొండఁ జెఱలువట్టుఁ
డేనుఁగులను గుఱ్ఱంబుల హేమరత్న, రథవితతిఁ గొనుఁ డనిఁ దొడరంగఁబడిన
పురుషునాయుధహస్తునిఁ బొడిచి కూల్పుఁ, డింతతోడ నిర్వృత్తిపొందెఁ యిలయెలర్ప.

వ. అనిన నతనియాజ్ఞ నఖిలసేనాచరులుం గోటపొదివి బరసనంబుచేసి రాసమయంబునఁ దదీయకలకలంబులు బహుళంబు లైన నాకర్ణించి యనుత్సాహులైయున్నయాత్మీయుల నందఱం జూచి సాత్యకి తనమనంబున.

చ. సకలకుటుంబభారమును సమ్మతి నాపయిఁ బెట్టి యాత్మలో
వికృతి యొకింతలేక కడువేడ్క నుమాపతిఁ గొల్వ దవ్వుగా
నకట ముకుందుఁ డేగె రిపు లాక్రమ మిట్లొనరింప నాకు నూ
రక కనుఁగొంట పాడియె పురంబును రాజ్యముఁ గాతు నెమ్మెయిన్.

క. ఏను గడంగిన నెదురం, గా నెవ్వానికి వశంబె కమలాక్షపద
ధ్యానపరుల కెందు నభయ, మా నని చెప్పుదురు పెద్ద లది బొం కగునే.

వ. శాత్రవునిర్ఘర్జయత్వంబునను బహుదేశసైన్యంబులు గూడి పెల్లుగాఁ ద్రోచుట వలనను గేశవుండు లేకునికిని బలుమగలును జిచ్చువడి చూచెదరు వీరిం దేర్చిపురి కొలుప కున్నఁ గర్జంబు దప్పు నని తలంచి దారుకానుజు నరదంబు నడుపం బనిచి సింహనాదంబు సేసి శరాసనశింజినీపరిస్ఫాలనం బొనర్చి దొరలం బేర్కొని.

మ. ప్రగుణోత్సాహులు యాదవోత్తములకుం బ్రత్యర్థులై తొల్లి యే
మగలున్ మైమయిఁ బోరొనర్చిరె వృథా మానాంకులుం డైనయీ
పగతుం డెంతటివాఁడు క్రొన్నెల్మిడిన యే భంజించెదన్ వీని మీ
రు గరిష్ఠస్థితి నన్నుఁ జూడుఁడు రణారూఢి న్వినోదింపఁగాన్.

క. మెఱచితిరే యనువిభుఁ డిం, దెఱుకను బురికొల్పఁగించి తెగ నేగుట యి
త్తఱి నది శూరులు వోవఁగఁ, గొఱయగునే మగతనంబుఁ గులమును మనకున్.

వ. అని పలుక నందఱు నుత్సాహంబునం బొదలి యప్పురుషుం గూడికొనిరి క్రమ్మఱం గరదీపికాసహస్రంబులు వెలసె సనాథంబు లగుటం జేసి సైన్యంబులుం గలంక దక్కి కడంగె రణతూర్యంబులరవంబును సుభటులసింహనాదంబులుం గజబృంహితతురంగహేషితరవంబులు రథనేమినినాదంబులుం గలసి యొక్కటియై పక్కటిల్లి దిక్కులు పగిల్చె నట్టియెడ.

క. నలుదెసలం గోటం బ్రాకెడు, బలవంతులం బగఱం జూచి ప్రస్తుతబాధా
కలనంబు మాన్పుటకుఁ గా, బ్రలుక శినికులోద్వహుఁడు సమాహితమతియై.

క. అనిలాస్త్రంబు ప్రయోగిం, చిన నది చీకాకు లట్ల చెల్లాచెదరై
చనఁ జేసెఁ బెలుచ శాత్రవ, జనులం బ్రాకార మస్త్రసంవృత మయ్యెన్.

వ. అట్లు చెదరినపౌండ్రసైనికులం దెల్ల నేలిక యున్నయెడకుం బోయిరి సాత్యకియు సైన్యంబు దనతోడన చనుదేరఁ దఱిమికొని చని ప్రతిసేనయెదురం, నిలిచి యిట్లనియె.

### సాత్యకి పౌండ్రవాసుదేవుని నెదిర్చి యాక్షేపించి యుద్ధంబుచేయుట.

సీ. అక్కట రాజాన్వయంబునఁ బ్రభవించి నీచుఁడై యేమియు రాచపాటి
యెఱుఁగక నడురేయి యెల్లజనంబులు సుప్తులై యుండఁగఁ జోరునట్లు
సనుదెంచె నెవ్వఁ డాతనిఁ గోరి వెదకెద నిగ దివియలు వట్టి యెచట నున్న
వాఁడు మూఢుఁడు పౌండ్రవసుధేశుఁ గేశవుబంట సాత్యకి నేను బ్రకటబలుఁడ
నాయితంబయి వచ్చితి నాలమునకుఁ, గార్ముకం బొదిగొ నల్లకైదువులను
శూరవరుల మెప్పించెద శూరశక్తి, కలిమి దానును జూపఁగ వలదె నాకు.

క. తను మగిడి పోయివచ్చినఁ, దనయానయ రాజధర్మతత్పరుఁడై నా
సునిశితశరములచేఁ జ, చ్చిన మేలా ప్తజను లింతసెప్పఁ దతనికిన్.

క. నావిని పౌండ్రుఁడు నిజసై, న్యావలిముందటికి వచ్చి యతులధ్వజలీ
లావిర్భావము శరచా, పావష్టంభంబు మెఱయ నధికోద్ధతుఁడై

వ. ఆతని నుపలక్షించి యిట్లనియె.

తే. ఓయి సత్యకాత్మజ నీవు యుద్ధమునకు, వచ్చినాఁడ వెక్కడ నున్నవాఁడు కృష్ణుఁ
డేసువిడిచి చిక్కులపారు టిదియ యతఁడు, పసులఁ గావక యోధుఁడై పరఁగు టెట్లు.

క. నను నెఱుఁగఁడె నానామము, దనకలవడునే తలంపఁ దగదే దీని
న్వనితాహంతకుఁ బకువిశ, సనకారికి నిట్టిపేరు సహ్యశ్శమె యరయన్.

ఉ. నాచెలికాని నాధరణినందనుఁ జంపినవానిఁ గాన బా
హాచతురుండనై యతని నాజమొన న్వధియింప వచ్చితిన్
వే చనుదెంచి తాను నను వీఁక నెపుర్చుట యొప్పు నీదెస
న్నీచము నాకు సంగరము నీవు దొలంగఁగఁ బొమ్ము నెమ్మదిన్.

ఉ. అటుగా కించుక న న్నెదిర్చిన మదీయాఖండకోదండ ము
ద్భటమై యీనెడుబాణసంతతులచందంబుం దగం జూడు మం
తటిలో నీవని సక్కసయ్యెడు ననేత్రప్రాణుఁ గావింతు మి
క్కుటపుంగ్రొ వ్వడఁగంగఁ గంపి దని మిాగోపుంపు గోపాలకా.

వ. ఇచ్చోటఁ బనులన్నేఁ గంతయు నీయలకే మెత్తి తాను గైలాసపర్వతంబునకుం
బోయె ననివింటి మాకృష్ణుండు వచ్చినయప్పటికిం దగినకర్జంబు నూచికొనియె
డిము నీవు నిలువక పొమనిలిచి యేకకిం బ్రియంబు గావించుటయు నిది
ధర్మంబకా యనిన నైనేయుం డట్టహాసంబు చేసి యతనికిట్లనియె.

చ. హరిఁ బరమేశ్వరుం బ్రభు సమస్తజగత్ప్రియుఁ గేశవల్కుసు
న్నరుఁడవు నీదుజిహ్వ పలున్నయ్యలుపాయుచు నోరఁ జెల్లుగాఁ
ద్గొరిఁగవు తొఁకపుర్వ లెదదూఱు ప్రాణము నూడ మామహా
ద్భురమహిఁ జేర మృత్యు విటు త్రుళ్లకు మొప్పను నెప్పెడు మదిన్.

తే. ఆదిదేవునిపేరు చిహ్నములు మోచి, సంతటనె యాతనికిఁ దుల్యుఁడం డ్రడె నిన్ను
సింహకవచంబు దొడిగినఁ జెనఁటికుక్క, గంధగజగంధమునకును గలదె నిలువ.

క. ఒక్కఁడె సర్వగతుండై, యొక్కుడు క్రియ వాసుదేవుఁ డని పెద్దల్
ప్రొక్కఁగ నుండుజనార్దనుఁ, డొక్కండె యనన్య మెఱుఁగ వైతి దురాత్మా.

మ. భువనస్వామికి ద్రోహి వై నకుమతిం బోనీక నిన్నిప్పు డి
ష్టవిధిం బట్టి తిలప్రమాణశకలప్రస్తారంగుఁగాఁ జేసి మ
జ్జవసామిశ్రభవత్తనూపలలముల్ నాలంగ నేఁ డిచ్చెదన్
నవభంగిన్ బహుయాతుధానతతికి స్పందించు నాబాణముల్.

తే. ఇంతలో శౌరి చనుదెంచెనేనిఁ దీవ్ర, భూరిదివ్యాస్త్రచయమునఁ బొదివి పట్టి
కట్టి యొప్పింపఁ బశువవై కంసదమను, ఖడ్గధారకు లోను గాఁ గలవు నీవు.

వ. అని యావ్విధంబున నన్యోన్యంబు పరుషంబులు పలికి తలపడినం గయ్యంబు బయ్యె
రువురకు ఘోరం బయ్యె నందు.

క. తెగనిండఁ దిగిచి యొకయా, శుగ మపేన్ద్రకునియురము సానిపెఁ దొలుత నా
నగధరుతమ్ముఁడు దానం, బగతుఁడు వడవడవడంకి భ్రమగొని తిరుగన్.

క. ముక్కున నోరను నెత్తురు, గ్రక్కున వెడలంగ ధైర్యకలితుఁ డగుటఁ దా,
నుక్కంత సైచి యంతన, నెక్కొన్న తెలివునఁ బ్రహసనిర్భరమతియై.

తే. తొమ్మిదియునై మహోగ్రోవ్వాఁడితూపులయ్యసాత్వహునివిూఁద నేసి వేఁడ్కొన్న లుప
నారసంబున ఫాలంబు నాటుటయును, మూర్ఛఁ బ్రాయి రథంబుపై బ్రమొగ్గసతఁడు.

వ. ఆలోనఁ బౌండ్రుండు నిరువదేనమ్ముల సాత్యకి నొప్పించి రథ్యంబుల నాలు
గింటిని నాలుగుశరంబుల గ్రుక్కించి సింహనాదంబు సేసి సంతోషం దెలిసి
తినివరుండు.

క. తూఁగాడుసూతుని సము, ద్వేగంబున నటఁ నెక్కివిలసితం గని గో
పాగమకలితుండై, ఘనభోగనిభం బైనచాపమున నొకశరముగ.

వ. నత్రోపమం బైనదాని సంధించి బెట్టిదంబుగాఁ దిగిచి నగతునుదంబు బ్రయ్య
నేసి మూర్ఛపుచ్చి.

తే. పడగతోఁ బసతునుపరాతి పటుహయములఁ, జంపి సారథిఁ బగిమార్చి సకలసభము
బూరటిల్లంగ సింగంబుపోల్కిఁ బెలుచఁ, గ్రోధి నుదీర్ణగర్జాపరిస్ఫూర్తిఁ బెలఁగె.

వ. పౌండ్రపతియును నాలోనన తెలిసి హతరథ్యం బగురథంబు డిగ్గి సాత్యకిరథం
బుగుఱ్ఱంబులం బడనేసి సగాతుసమయించి రథానయనంబు లన్నియు ననేకన
హస్రసంఖ్యంబు లగువిశిఖంబులం గొఱిసేసి నిర్విఘ్నంబున.

క. ఇనుసుపును విరథులయి కొలం, దాటిపుల చాపములు సఱికి కొమ్కుటఁ బోయితో
మరశక్తిప్రముఖాదులఁ, దివముగఁ బోరిరి చలంబుఁ జేవయు నలరన్.

వ. తదనంతరంబ గదాహస్తులై తాఁకి యభ్యస్తంబు లగుసమస్తకళావిస్తారంబులు
ప్రశస్తంబులుగాఁ బెద్దయుం బ్రొద్దు పెనంగి యన్యోన్యఘాతంబుల నస్ఖలితం
బైనరక్తంబున సిక్తంబు లైనయంగంబులు వసంతాశోకంబులకు సదృశంబు
లై యసదృశోల్లసనంబున నుద్భాసిల్లఁ గొండొకదడవునకు గదలు మిథోహన
నంబు లైన విడిచి పిడికిళ్లకుం జొచ్చి పెచ్చువెరిగి పొడుచునప్పటిచప్పుళ్లు సర్వ
భూతభీతిజననచండంబులై యొండొండఁ బొదలఁ దలంబుల వ్రేసియుఁ బెడ
చేతుల నడిచియుఁ గూర్పరాహతు లొనర్చియుఁ జానువుల నొంచియుఁ గేశా
కర్షణనఖవిఖండనప్రముఖంబులం దొడరియుఁ బోరి తమపోరుసూచువారు తమ్ము
నుద్దేశించి యీసాత్యకి యీపౌండ్రుం బొరిగొనక యేల విడుచు నీపౌండ్రుండును
సాత్యకిని మడియింపక యుడుగ నేరండు వీరిద్దఱు నొక్కలావువారు గాన నెం
డొరులచేతం జచ్చి వీరస్వర్గంబు నొందుదు రింతియ కాని యలంతుల నిలువ
రిట్టిశౌర్యం బిట్టిధైర్యం బిట్టిచలం బెచ్చోటఁ జూడ మెయ్యెడల విన, మెన్నఁడు
నెఱుంగ మనుచుం బ్రశంసింప నకంపితప్రకారులై దయ్యవసరంబున నుభయ

బలంబులం బెక్కురురథికు లిరుదెసలం గ్రందుగాఁ దఱిమి సందడిచేసిన నానా హాసికులు పాసిపోయి రంత.

ఏకలవ్యుఁడు బలరామునితోఁ దలపడి ఘోరయుద్ధంబు సేయుట.

మ. బలదేవుండును నేకలవ్యుఁడును దృప్యద్బాహులై తాఁకి యు
జ్జ్వలచాపంబులఁ బోరుచో బలుసి వింశత్యస్త్రతీవ్రాహతి
న్వ్యాలియం జేసి తదాశుగంబుల వెసన్ సూత్రుం బ్రపీడించి క
ట్టలుకం ద్రుంచె నిషాదనాథుఁడు ధనుర్జ్యావల్లి భల్లంబునన్.

తే. వింట నొండొకగొనయంబు వేగఁ గూర్చి, కేశవాగ్రజుఁ డొకకోలఁ గేతుదండ
మురివ్వఁ గూల్చి కార్ముకము వేఱొకట నఱకి, పదిటఁబదిటసారథిరథిబలిమి నొంచె.

క. మఱియును ముప్పదియమ్ములఁ, గిఱికొన సరదంబు వొగిడి కీలియ పోలెన్
మెఱసిన స్నైపక వేఱొక, నెఱవి ల్లెక్కిడి కిరాతనృపతియుఁ గడఁకన్.

క. ఆతనిచనుమర విశిఖ, న్యాతము సెయుటయు నొచ్చి ద్రుక్కి హాలాంకుం
డాతతకోపసముద్ధతుఁ, డై త్రుంచెం బిడికోలఁదికి నహీతునిధనువున్.

వ. ఏకలవ్యుం డడిదంబుఁ బుచ్చికొని వివరి వైచె నది యమునందనుం డేపమ్ముల నడుమన పొడిసేసి మఱియు నొక్కమండలాగ్రంబు సారథిగుఱిచి విసరివైచినం బదిబాణంబుల ఖండించి చండఘంటావిభూషణ యగుభీషణశక్తి వైచిన నొడిసిపట్టి మగుడఁ గద్వేషంబు లక్ష్యంబుగా వైచిన నప్పాటున నమ్మేటిమగండు సొమ్మవ్వోయి తేరిపయింబడినం గని తదీయ లగునిషాదయోధు లెనుబదియొని మిదివేలు రథతురంగమాతంగసముదయంబుతోడం గవిసి.

క. మిడుతపరిన్నాలై దిక్కుల, నొడములు దమమయముగాఁగ నేకాకృతితో
గడిఁదిగఁ బొదివిరి రాముని, నడరఁ దదాఘోష ముగ్రమై గగనమునన్.

తే. అలిగిహలముసుముసలంబుహస్తయుగము,నందుధరియించితాలాంకుఁడరదముడిగి
మెఱుకుమీఁకలమీఁదికి నుఱికి విలయ, కాలకలుషకృతాంతానుకారియగుచు.

క. నాఁగటఁదగిలిచితగిలిచి, గ్రేఁగగుదోఁకలి యమర్చి గ్రేయుచుఁ దోఁకల్
రేఁగెడుదర్పము వొసట, గాఁ గూల్చెను బగఅనెల్లఁ గడుఁజోద్యముగాన్.

వ. ఇట్లు ముహూర్తమాత్రంబున నఖిలనిషాదసైన్యంబులం బొడిసేసి యపరిమిత రక్తమాంసమేదంబులఁ గ్రవ్యాదభూతజాతంబులకు నభూతపూర్వం బగుప ర్వంబు సంఘటించె నంతం దెలిసి యేకలవ్యుండు.

క. తనసేనపాటు దెలియం, గని కోపము మిగులఁ బెద్దగదఁగొని బలభ
ద్రునిమీఁదఁ గవిసె నతఁడును, ఘనగదఁ గైకొని కడంగెఁ గలుషం బెసఁగన్.

వ. వారలకు నతిభీషణం బగుగదారణంబు ప్రవర్తిల్లె నందు

సీ. గదలొక్కటొకటిఁ దాఁకఁగ నుప్పతిలుమిడుంగుఱుల దిక్తటములు మెఱుఁగలించ
హుంకారములు నగరోన్నతప్రాకారవలభులఁ బ్రతిశబ్దనతులఁ జేసెఁ
జరణఘట్టనముల ధరణియంతయుఁ బట్టుగదలి పాతాళంబు గలయ బ్రుంగెఁ
దర్పనోత్క్షిప్తపటుధ్వానంబు లాకాశచరులకుఁ జిత్తసంచలన మొసఁగె
నుభయబలములవారుఁ బోటుడిగి వెఱయు, వెఱఁగుపాటునుగదురఁ నవ్వీరవరుల
జూచుచుండిరి కలహసంక్షుభితఘోర, ఘోరవారణద్వితయంబు జూచుకరణి.

వ. ఇవ్విధంబునఁ బౌండ్రసాత్యకు లొక్కదిక్కునను నిషాదపతిబలదేవు లొక్కవలనను గయ్యంబు సేయుచుండ నలుపురికారణంబున నపరిమితజనసంక్షయం బగుచుండ నంత.

తే. దీపరుచులతోన తిమిరంబు దోఁత్రోఁచఁ, వెలుఁగఁ దారకములు విరళంబ
యడఁగ వస్తుమూర్తు లన్నియు నొండొండఁ, దోఁప వెల్లనయ్యెఁ దూర్పుదిక్కు.

క. అరుణోదయరుచు లొయ్యనఁ, బరఁగుచుఁ గమలములతోన భ్రమరుల కెల్లం
బరిబోధము నొదవింపఁగఁ, గరిణీయంబులు బహుప్రకారత వెలసెన్.

క. కుముదవనంబులతోడన, కమనీయవిభ్రమజననికరపాణితతుల్
సమ్ముకుళితమ్ములు గాఁ, గమలహితుఁడు ప్రథమగిరిశిఖరమున నుదయ మయ్యెన్.

## శ్రీకృష్ణుండు కైలాసంబునుండి మరలి ద్వారకానగరంబునకు వచ్చుట.

వ. అట్టిదివసప్రారంభంబున సంరంభం బెసంగ రెండుదిక్కులయోధులు నధికసంబాధంబుగా బెరసి పెనంగఁ బౌండ్రవిభుం డెలుంగెత్తి యాత్మీయసైన్యనాయకుల నుద్దేశించి.

క. మన మెంతలావు సేసినఁ, బని డీలుదు నెకుఱుండు పగతుఁడు లోకం
బున దూఱు రాదె యితరుల, ననిఁ జంపినఁ గాన వలవ దాహవ మింకెన్.

మ. హరి యేతెంచుట లెస్సగా నెఱిఁగి తీవ్రాటోపదీప్తంబుగాఁ
బరిమై వర్తము గాకయున్నఁ గడిమిం బ్రత్యర్థి నాహూతిఁ జే
సి రణక్రీడఁ జలంబు సూపుదము ప్రస్ఫీతాస్మదీయోగ్రవీ
ర్యరసారూఢికి నోర్తురే నిలిచి యీయల్పుల్ వృథావిక్రముల్.

వ. అని పలికి బలంబులం దివియం బనిచిన వారును నట్లచేయ సైన్యసమేతుండై క్రమ్మఱి చని.

క. తనకుం గాశిమహీపతి, యనుఁగుం జెలి యగుటఁ జేసి యాతనినగరం
బున నుండె సహాయుల నె, ల్లను బిల్వ ననేకసమరలంపటబుద్ధిన్.

వ. ఇక్కడఁ గృష్ణబాంధవులు విజయంబు చేకొని తూర్యవిరావంబులుం బ్రమోదనాదంబులు మేదురంబులుగాఁ బురంబు ప్రవేశించి యుండఱుం దమలోన.

తే. స్వామియే తెంచుటయుఁ దదాజ్ఞాసమర్థ, కరణమిట్లు నివేదింపఁ గలిగె మనకు
ధన్యచరిత్రుల మైతి మనన్యసులభ, మెందుఁజూచిన సామాన్యమే గణింప.

వ. అని సంసనంభాషణపరితోషణంబులం బొంగుసంతోరంగంబులతోఁడనున్న సమ
యంబున.

క. ఇదె యనుదెంచె మురాంతకుఁ, డదె పుట్టోనుఁడు సకలజగదధీశు నతని నిం
పొదవఁ గనుఁడు గన్నారఁగ, యనువారు లనుపలుకు లెసఁగె నంబరవీథిన్.

వ. చారణప్రయుక్తమైనయయ్యుత్సవప్రాప్తికి నుద్యుక్తులై సర్వయాదవులును
సర్వాలంకారకల్యాణవేషంబులతో సర్వపౌరసైన్యపురస్సరంబుగాఁ బురంబు
వెలువడి రంత నంతరిక్షంబునం దార్క్ష్యస్కంధాసనాసీనుండై దేవకీసూనుండు
గానంబడియె నట్లరుగుదెంచి యతండు.

క. వాహనము డిగ్గి దారుకు, వాహిత మగునరద మెక్కి వరబంధుజను
స్నేహము లభినందింపఁగ, మోహాపహుఁ డురప్రవేశముం బొనరించెన్.

తే. నగరిలోనికిఁ జని యావ్యసనగమునందు, నగసుతాధీశ్వరుం దర్శనంబు నంత
యతనిఁ గనుట భాషించుట యఖిలమును న, పూర్వపంబును వినిపించె సర్వతతికి.

వ. ద్వాదశవత్సరంబులు తన్నుం బాసి మున్నిరి యున్నబంధుమిత్రభృత్యకోటి
నెల్లను బహుళవాక్యామృతప్రవాహంబునం దేల్చి పౌండ్రావరోధప్రకారంబును
నోర లెక్కింగింప నెఱిఁగినవారై యుద్ధప్రాగ్రసేనబలదేవులఁ బ్రశంసించి సా
త్యకి నెంతయు నుపలాలించి పులకోద్గమవిభూషితవదనసరోరుహుండై.

శా. ఏమీ పౌండ్రుఁడు దానుఁ జుట్టములు నై యేతెంచెనే మేలు మే
మ్మైమెఁ డన్నువధించు నంత కొఱకుం బ్రేరేచువాఁ డబ్బెనే
నేమింబూనికి లేకయుంటమి నిజం బెం కూర కెట్లుండ నే
భూమధ్వంసము విమ్మటన్ బ్రథనలిప్సం గూర్చె నాకై దువుల్.

క. భయ మొకటిలేక కుకురా, న్వయుల నగరిమీఁద వచ్చినట్టిదురాత్మున్
రయమున నేనును బలసం, చయములతోఁ బడఁగనరిగి చంపుదుఁ బోరన్.

వ. అనిపలికి పగతుపోయినతెరువును దత్సన్నాహంబు సరయఁ దగినమానుసుల
బుచ్చి నంస్మరణకాలంబునన చనుదెంచువానిఁగా వైనతేయు వీడ్కొల్పి సమ
చితవ్యాపారంబుల నున్నంత నటఁ బౌండ్రుండు వారణాసిపురంబున నుండి చా
లవలన వసజనయనురాక విని కాశిరాజునుం దానును డక్కినభూపతులు నాల
చనంబు చేసి యొకదూతె నాద్వైత్యడమనుపాలికిం బనిచిన.

క. కోలగమున వాఁడును, నారాయణుఁ గాంచి పౌండ్రనరపతి నన్నుం
గోరి భవదంతికమున కు, దారతఁ బుత్తెంచె వినుము తద్వచనంబుల్.

సీ. పుట్టినగోలెను బోఁడిమి సెడ గొల్లమందలోఁ బెరిగి ధర్మం బెఱుఁగక
వనితావధయును గోవధయును బాంధవవధయుఁ గావించి దుర్వర్తనమునఁ
దిరిగి తంతటఁబోక తేఁకువమాలి నాపేరుఁ జిహ్నములుఁ గల్పించికొంటి
వాసుదేవుం డన వసుధపైఁ గారణజన్మంబు నొందినసత్యఘనుఁడఁ
గడఁగి నేన కా నీకు నక్కడి తెఱంగు, బ్రతుక వలతేని వినుము నాపనుపు సేసి
చక్రమాదిగ విడిచి మత్సంజ్ఞ యుడిగి, నడికె చనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ.

వ. అని యిట్లు దూతముఖంబున వెడలినవిమతువాక్యం బాకర్ణించి యాకీర్ణవికాస హాసభాసురముఖుం డగుచుఁ గమలలోచనుం డవ్వానిం గనుంగొని.

క. మీయేలికమాటలు దూ, తా యెంతయు మంచి వేసు తప్పక యాతం
డేయనువునఁ బలికెం దగ, నాయస్థము చేయువాఁడ నటు విను దెలియన్.

సీ. నను నట్టు లడుగు దెమ్మనియెఁ గావున నెల్ల యడియాలములతోడ నడుగుదెంతు
వినుతచిహ్నంబులు విడువు మన్నాఁడు గావునఁ జక్రముఖ్యాస్త్రతతిఁ బనరువానిఁ
దనమీఁద విడిచెదఁ దనశరణముఁ జొచ్చి మనుమంట గలదు గావునఁ గడంగి
తనసేనంబె యంతఃపురంబుఁ జొచ్చి నిర్భయుఁడనై భూరిసంపద హరింతు
ధరణి నందుఁ బెక్కులవాఁడు దాను నాకు, దాఁటవచ్చున తనయాజ్ఞ దడయకింత
పట్టు నేను నల్లిటిలోన నిట్టలముగాఁగఁ, జేయఁగలవాఁడ నింతయుఁ జెప్పు మీవు.

క. అని కట్టనిచ్చి వీడ్కొలి, పన దూతయుఁ జని యుదారభీమగభీర
ధ్వనిరమ్యమైనవిష్ణుని, వినిశ్చితోక్తంబు పౌండ్రవిభునకుఁ జెప్పెన్.

వ. అతండును సహాయు లగురాజులం బెటుకు నివ్విధం బెఱింగించి వారునుం దానును సర్వసైన్యంబులం గొని వారణాసిపురంబు వెలుపట నాయితంబై మురాంతకునిరాక కెదురుసూచుచుండెఁ గాశీవిభుండును దనసేనలతోడఁ జెలికానికిఁ బెను కవయై నిలిచె నంత నక్కడ.

సీ. సాత్యకిముఖ్యులగా శత్రునిర్మథనంబునకుఁ దారతార నిర్ణయముగాఁగఁ
జాలుదు మని వచ్చి యాలిఁ బంతంబులు పలుకుచుట్టంబులఁ బరమపురుషుఁ
డాదరంబునఁ జూచి యస్మత్ప్రతోషంబునందు మీచేసినయట్టిలావు
సామాన్యమే రిపుజయము మీచేతికి వచ్చినయది సహవాసకృత్య
మింతే గడవంగ నేటది యేను బోయి, నాకు వలయుకార్యాంశ మొనర్చి వత్తు
నిలుఁడు మీ రని యందఱ నిల్పి గురుజ, నానుమతమున మంగళోద్యమ మెలర్ప,

**శ్రీకృష్ణుఁడు గరుడవాహనారూఢుఁడై పౌండ్రవాసుదేవునిఁ జంపం బోవుట.**

క. గరుడస్కంధారోహణ, ధురవిక్రమగమనలీలతో నరిగె వెసం
బరిపంథిమీఁద భూతో, త్కర మఖిలము దనకు శుభము గాత్మింపంగన్.

వ. అరిగి తదీయస్కంధావారమ్మున కనతిదూరమ్మునం బాంచజన్యస్వనంబునం బంచ
మహాభూతవిస్తారవిదళితంబు సేసిన.

ఉ. ఆతనిఁ గాంచి పౌండ్రబల మార్పులుఁ దూర్యరవంబులుం దిగం
తాతతసంప్రహారమున నచ్చెరువై యెసఁగంగఁ దాఁకి యు
ద్ద్యోతితకుంతయష్టిశరతోమరశక్తిపరశ్వథాతిసం
పాతినిరంతరంబుగ నభంగురఘోరరణం బొనర్చినన్.

తే. చటులశార్ఙ్గనిర్ముక్తోగ్రసాయకములఁ, గలుషకౌమోదకీవిమోక్షక్రమముల
గడియతడవులోఁ బొడిపొడిగా నొనర్చె, నసురమథనుండు విపులమోహారము నెల్ల.

వ. ఇట్లు కాశీశసైన్యసహితంబుగాఁ గలసేన లన్నియు మడిసినఁ బౌండ్రవాసుదే
వుం డవ్వాసుదేవున కెదురునడచె నట్టిసమయంబున.

తే. శంఖచక్రగదాఖడ్గచాపములకుఁ, బాంచజన్యాదినామకల్పనము లోలయఁ
బడగఁ గృత్రిమతార్క్ష్యుండు ప్రజ్వరిల్లఁ, దేరిపై నున్నపగతు నాశౌరి గనియె.

వ. కని తదీయశరీరంబున కలంకారంబు లైనపీతాంబరకృతకకౌస్తుభశ్రీవత్సవైజ
యంతీమకుటలక్షణంబు లుపలక్షించి యెలుంగెత్తి నవ్వి యద్దేవుం డవ్యాగం
భీరస్వరంబున నతని కిట్లనియె.

సీ. పౌండ్రభూవర నీవు భావంబునందు మదీయాంకములు మోవఁ దివిరితేని
నాపాలి కేతెంచి నమ్రుఁడవై యేను నీవాఁడ నాకిమ్ము నీదుచిహ్న
ముల నని వేఁడిన లలి శాశ్వతంబులై చెల్లును వెఱ్ఱివై చెట్టచేసి
తింకనైన వినీతి నేతెంచి వేఁడుము గాచెద నఖిలలోకముల నిన్ను
నీదృశోజ్జ్వలవేషసమ్మోదమూన, హృదయుఁగాఁ గరుణించెద నింత నిజము
వినుము శరణాగతత్రాణవిపులనిష్ఠ, యాఢ్యుఁగా నెఱుంగుము నన్ను నాత్మలోన.

క. నాచక్రముచే మడిసిన, యాంచపలుర సరకుఁ దొట్టి యకట యెఱుఁగ వీ
వాచెడుటలు మేలులుగాఁ, జూచెదు నినుఁ గావ నొకనిఁ జూపుమ యిచటన్.

వ. నీవు నన్ను రమ్మని దూతచేతఁ జెప్ప పుత్తెంచిన నీదెస వచ్చి తగినబుద్ధియుం జె
ప్పితి నిట్లు సేయుము చేయకున్న నేను నీచెప్పినట్ల చేసి చక్రకౌమోదకీప్రముఖ
చిహ్నంబులు నీమీఁద విడిచెద గరుడునిం దదీయధ్వజంబుపైకిం బనిచెద నట్లు
చూడు మని పలికినఁ బౌండ్రుం డతని కిట్లనియె.

మ. అవనీనాథుల నెల్ల నుద్ధతుల గర్వాంధ్యం బడంగింప నే
నవతీర్ణుండ నెఱుంగనే యకట మిథ్యావాసుదేవాహ్వయం
బవినీతిన్ ధరియించి కొందఱకు మోహభ్రాంతి పుట్టించె దీ
యవలేపంబు నెఱింగి కాదె నిను దండార్హుండుగాఁ జూచితిన్.

తే. నాకు వెఱచి కైలాసయానంబు పేరఁ, గొంతకాల మమ్మెయిఁ దప్పఁ ద్రుంకిపోయి
నీవు లేకున్నఁ జూచె మహావిభూతి, మెఱయ వచ్చియు నీయూరు సెఱుపనైతి.

క. మేలయ్యె నిట్లు వచ్చితి, లేలెమ్ము రణంబులో బలిమి చూపుము రో
షాలోలరక్తనయనుఁడు, గాలుఁడు నిన్నర్థిఁ జేయఁ గడఁగెడుఁ దనకుఁ.

చ. అని నిజశార్ఙ్గముక్తవిశిఖావలిఁ గృష్ణునిఁ గప్పి వైనతే
యునిఘనదేహ మంతయును నొక్కట రక్తమయంబు చేసినం
గినిసి బలానుజుండు శరకీలల నాతనిఁ ద్రేల్చెఁ బెల్చ న
త్యనుపమదావతప్తగిరియాకృతి నొంద నిమేషమాత్రలోఁ.

వ. పౌండ్రుండు పుండరీకనయను నయనోపాంతంబు కాండవిదళితంబు గావింప
నెత్తురు ధారయై తొరఁగ నిన్యాణవిగళితస్వదగ్దారం బగు నుత్తవాగ్గోత్తమం
బుం బోలె నయ్యుత్తమపురుషుం డతిపరుషం బగుశరం బతనియురంబు గాఁడ
నేసిన.

క. ఒక్కింత సొగసి యంతన, గ్రక్కునఁ దెలివిన్నొంది రిపుఁడు కౌమోదకినా
నెక్కొని మిడుఁగుఱు లడరఁగ, నుక్కగడ మురారి గెనకు నుక్కున వైచెఁ.

వ. అద్దేవుండు కౌమోదకీప్రయోగంబున దాని నడుమన పొడిపొడి గావించె
ననంతరంబ.

క. పగతుఁడు చక్రము వైచిన, నగధరుఁ డనుపర్శనమున నది తుత్తుమురై
జగతీస్థలిఁ దొరఁగెమున, నగ్గిఁ జేసె సమస్తజగములును ముదమొందఁ.

వ. నందకసంజ్ఞం బగుఖడ్గం బాపౌండ్రుండు జళిపించి విసరివైవం జూచి యచ్యు
తుం డది వానిచేతన యుండఁ బ్రచండకాండంబున ఖండించె నతండు గ్రమ్మఱం
దనచాపంబు పుచ్చికొని యచ్చెరువుగా ననేకబాణపరంపరలు వెల్లిగొల్పుటయు
నల్లన నవ్వి యవ్విభుండు.

క. మార్వీటంకృతి దిక్కులఁ, బర్వఁగ శార్ఙ్గంబు గుడుసువడఁ దిగుచుచు దో
ర్గర్వంబున రిపుశరచయ, చర్వణాతం బగువ భూరిశరతతు లేసెఁ

తే. పరఁగ సూతుని గూల్చి యుద్భాసిరథ్య, సమితిప్రాణము ల్గొనిసిడంబడరఁ ద్రుంచి
యహితుదేహంబు బహుళరక్తారుణముగఁ, జేసి పెల్లార్చె వెండియుఁ జెలఁగి నగియె.

వ. ఇబ్భంగిఁ బగతు నపగతసమస్తసాధనుంగా నొనర్చి యమ్మహావీరుండు.

తే. ఏమిరా వాసుదేవుఁడ నేన యనుచుఁ, జెప్పికొన వచ్చునే యింకఁ జెపుమ నాకు
నిన్నుఁ గన్నడ్డ చక్రాగ్ని నీఱుసేయ, వచ్చు మూఢలించుట కింత వలసెఁ జేయ.

వ. అని పలికి వానిచేతివిల్లును శంఖంబును శకలంబులుగా నేసి గరుడచరణప్రహార
ణంబుల్కఁ గృత్రిమగరుడలాంఛనం బగుతదీయధ్వజదండంబు ఖండంబులు సే

యించి యాభీలజ్వాలాజ్వలితదిక్చక్రం బగుచక్రంబు సంప్రయోగనిర్వక్రంబు గాఁ బనిచిన.

క. అది వ్రాయి శత్రుదేహము, భిదురము గిరి వ్రయ్యనడుచు పెలుచఁగ లీలన్
విదళితము సేసె వ్రయ్యలు, పొదలిననెత్తురులతోడ భువిఁ బడ వ్రాలెన్.

క. ఇట్లు పౌండ్రుండు సమసిన.

వ. చెలికానిచావు గనుఁగొని, వెలసినవగతోడఁ గినుక పెనఁగొనఁ గాశ్యం
డీలఘుఁడు డై తేయాంటెరఁ, దలపడి బెట్టేసెఁ దీవ్రశరవిశిఖములన్.

తే. మిత్రుదేహంబునొద్దన మేదినికి మ, హోపహారమై నీమేను నొసఁగుఁగాక
యనుచు శార్ఙ్గిఁ శార్ఙ్గచ్యుతసునిశితాస్త్ర, జాలములఁ గప్పె నతని నాభీలలీల.

క. క్షణమాత్రము చిత్రగణ, క్షణము ననుభవించి పిదపఁ గాశ్యునిఁ గమలే
క్షణుఁడు శిరశ్ఛేదవిధ, క్షణుఁడై నిరజనయోగ్యగతులకు ననిచెన్.

వ. ఇత్తెఱంగునం గాశీదేశాధీశ్వరుం ద్రుంచి త్రుంచినదివ్యాస్త్రంబునన యతనితల తదీయనగరమధ్యంబున వైచి మఱియు మార్గంబున నెదురైన యనేకులం దునిమి తూఁగాడి విజయశ్రీసనాథుండై యదునాథుండు క్రమ్మఱి నిజపురంబున కరిగి సుఖంబులం బ్రమోదించె నంత నిక్కడ.

శ్రీకృష్ణుఁడుసుదర్శనచక్రంబుచేఁ గాశిరాజసుతప్రేషితయగుకృత్యందునుముట.

సీ. తండ్రి పౌండ్రునకునై దనుజారిచేత నకారణమ్మృతి నతిక్రాంతుఁ డైనఁ
గడుశోకవివశుఁడై కాశ్యతనూజుండు హితబుద్ధి యగుపురోహితునిచేత
వేలిమి వెట్టింప వెస దక్షిణాగ్నియం దుద్భూతమై కృత్య యుగ్రభంగి
నెయ్యది కర్తవ్య మెఱిగింపు మనవుడు యదువంశ్యుఁ డగుకృష్ణు నతనివారిఁ
జఱపు మని పంపఁగా నేగెఁ జటులరోష, రక్తలోచనజ్వాలాకరాళ మైన
తనువు మిన్నంటికొనఁ బేర్చి దనుజవైరి, యెచట నెచ్చట ననుచు నే పెనక మెసఁగ.

వ. ద్వారకానివాసు లప్పిశాచి నంతంతం గని తలంకి.

చ. ఇది యొకఘోరరూపము సమిద్ధలయాంతకతుల్యరూపతం
బొదలి యవార్యవేగమునఁ బ్రోజ్వలశూలము గేలఁ ద్రిప్పుచున్
వదనము విప్పఁగాఁ దెఱచి వచ్చుచు నున్నది యేమిమాయయో
కదిసె శరణ్య కృష్ణ కృపఁ గావుము మమ్మనియార్తమూర్తులై.

క. తనశరణము చొచ్చుటయును, గని యపుడు ముకుందుఁ డక్షకలితక్రీడా
జనితాసక్తిఁ దలిర్చుట, ననాదరప్రీతిలీల నచలాసనుఁడై.

వ. అంగీకృతాకృత్యమైనయాకృత్య నుద్దేశించి యుద్దీప్తలీలానిర్వక్రం బగుచక్రం బుఁ బనిచిన నమ్మహాస్త్రంబు సంవర్తమార్తాండమండలచండంబై కదియం దత్తేజంబున నిజతేజంబు నిరస్తం బైన సంత్రస్తాంతరంగయై.

క. కాశీశసుతపురోహిత, నాశని యగుకృత్య మరలి చందోడన యా
క్రోశార్తయై సధానిం, గేశవసాధనము వెనుకఁ గెలెఁ దీవ్రగతిన్.

వ. అదియునుం గాశీపురంబు సొచ్చినం జిదార్తధ్వానం బనల్పభూరిరంబున బౌ
రులు గలంగిరి రాజసేనాపతు లిది యేమి యనుచు సకలసైన్యంబులం బన్ని
యడ్డపడ నడచి.

తే. కనిరి మిన్నును నేలయు ననలశిఖలఁ, గదివి శతకోటిసంఖ్యాకభానుభాసి
మ్రొక్కఁ బ్రోవయి చనుదెంచునోజఁ గృత్య, ననుగమించువైకుంఠుని యాయుధంబు.

క. కనుకని తమతమకైదువు, లనువుగఁ బచరించుకొనుచు నభిముఖులై యం
తన తత్తేజోహతిఁ బెట్, ఘను లగుటం బల్లటిల్లి క్రమ్మఱిరి వెసన్.

వ. అవ్విధంబున నండఱు విఱిగి పురంబు సొచ్చుటయుఁ గృత్యయు ననుకొని వచ్చు
సమ్మహాచక్రంబు సవ్వటిపైఁ బడి కృత్యాసహితంబుగాఁ బౌర్వభూపాలభృత్యభృత్య
బ్రాహ్మణబాలవృద్ధవనితాపరివారణరహితంబుగ భాండాగారకోష్ఠగృహంబులతోడ ను
న్నతహర్మ్యప్రాసాదసభాచత్వరోపవనములు యగునగర యంతయు నిమిషంబున
నీఱు సేసె నట్లు దేవాసురాదులకు గెలువ రానియట్టి దివ్యనివాసం బొసుర
చరితులకెల్లను నుపహతంబు గావించి సర్వభూతపద్దర్శనం బైనసుదర్శ
నంబు విష్ణుసమీపంబునకుఁ జనుదెంచె నని వైశంపాయనుండు వివరించినపౌండ్ర
వధప్రకారంబు విని జనమేజయుండు విస్మయప్రమోదరసనిమగ్నం బగుమనంబు
తోడ మఱియు నతని కిట్లనియె.

క. ఎంతెంతవింట మహాత్మకు, సంతతియు ప్రియము సేసె హరిచరితము లా
త్యంతవిచిత్రమ్ములు సరి, కాంతము లద్భుతము లధికకల్యాణంబుల్.

తే. తనియ దింకను జిత్తంబు మునివరేణ్య, యమృతసారంబు వీనులయందుఁ గోల్వు
మనిన నతఁ డానరేంద్రున కాదరమున, నిట్లనియె వాక్యసౌభాగ్య మొప్పు మిగుల.

క. నిర్మలయశుఁడు జనార్దను, కర్మము లమితములు చెప్పఁగా నొప్పవయే
నిర్మితి లెక్కడఁగల రతి, ధార్మికసంప్రాజ్య చెప్పెదను గొన్ని నగన్.

వ. అవియును సవిస్తరంబుగా నుదాహరింప ననేకకాలంబు వలసియుండుం [illegible]
భాషణంబుల నిర్దేశించెద నాకర్ణింపుము.

సీ. ద్వారకాపురమున వసియించి యవ్వాసుదేవుండు క్రమమునఁ దేజ మెసఁగ
సకలనరేంద్రరాజ్యశ్రీలు వన్నె చేరఁ ననుపాయముతోడఁ దెగడిమిఁ దెచ్చె
బాండ్యులఁ గేరళపతులఁ గాళింగుల సంగవంగేశుల నాహవమునఁ
బగిలి యొక్కొక్క రవిమత్తంబున భంగించెఁ బెక్కండ్రు నృపతుల నుక్కడంచెను
రాజితాన్వయగాంధారరాజకన్యఁ, గోరి గ్రహియించెఁ గురువున స్త్రీగుర్వునికొడుకుఁ
గృపునిఁ గర్ణునిఁ గురుపతి గెలిచి భీష్ము, ఘనతఁ గార్యాంతరమ్ములఁ గడఁగి గెలిచె.

క. వేడుకకుం దలపడి పృథ, సూడఁగఁ బోరాడి వాయుసుతు నోడించెన్
గ్రీడిఁ బరాజితుఁ జేసెం, గ్రీడాహితబాహుశక్తిఁ గేశవుఁ డధిపా.

తే. బభ్రుకోటరునై సౌవీరపతి జయించి, తెచ్చెఁ దత్పుత్రి సకలపార్థివులఁ గూడి
వేణుధారి తగ దొడరిన విక్రమించి, శౌరి యందఱ నిర్జించి చంపె నతని.

వ. మఱియుఁ గరూశదేశాధీశుం డగు దంతవక్త్రు దక్షిణాపథంబున వధియించెఁ బర్వ
తసహస్రంబులు చక్రంబున భేదించి ద్రుమసేనుం బరిమార్చి నిరానతీనగరంబుఁ
బొదివి గోపతి తాలకేతులను భూపతులఁ దునిమె యత్యుగ్రపరాక్రమంబున నలవునం ద్ర
బలబలాన్వితులైన నిమ్మహాంసు లను నృపులం గూల్చె వజ్రాంశుఁడైన ఋశ్యండు శత
ధన్వుం డుగ్రసేనుండు నను రాజులం ద్రుంచెఁ గంసామాత్యులం బృథుం డను దై
త్యుఁ దత్పుత్రుం డసిరోమునితోఁ గూడ సమయించె మానుషరూపధరు విరూపాభి
ధానుం డానవు నైరావణుం ఘనమంత్రిసహితంబుగా వధియించె హిమశైలసం
చారులైన లోకాపకారు లగు మైంద ద్వివిదు లను వానరులం దెగటార్చె శోణపు
రంబునం బురవైరిచేత రక్షితుం డైన బలిసూను బాణుం బ్రాణమాత్రావశి
ష్టుం జేసి బాహుసహస్రఖండనంబునం బోవ విడిచెఁ బావకుల జయించి నిస్తేజు
లం గావించె నాగరంబు గెలిచి వచ్చి నడచువారి వరుణుం దిరస్కరించె నివి
త్రివిక్రముని విక్రమంబులు బాల్యంబునఁ బూతనాఘాతంబు మొదలుగాఁ గంస
ధ్వంసనంబు తుదిగా నొనర్చినవి నెత్తెఱంగులు వివరింప జరాసంధవిరోధంబు
నం జేసినచేత లెవ్విధంబులు కాలయవనసంహారణంబు ద్వారావతీకరణంబు రు
క్మిణీప్రహరణంబు నరకనిపాతనంబును లోనుగా నిర్వహించిన సర్వకార్యంబు లె
బ్బంగులు గాండీవిచేత ఖాండవదహనంబు నయించుట భీమసేనుచేత జరాసంధుం
జంపించుట యతనిచేత నన్నరనాథుల విడిపించుట నపరాధశతంబు నిండిన
శిశుపాలు జముపాలు సలుపుట సాంభవిభుం బడంచుట పాండవసహాయుండై స
ర్వక్షత్రంబు నిశ్శేషంబుగా నొనర్చుట యేచందంబు లూహింపుము.

క. తనమేనయత్త గొంతికిఁ, బ్రమదంబుగఁ బుత్త్రరాజపంచకమును గ
య్యానుల బ్రతికింతు ననియెఁ, గమలాక్షుఁడు పలికినట్ల కథ యేతెంచెన్.

క. మీతండ్రి ద్రోణబాణవి, ఘాతితుఁడై పుట్టుటయును గంసారికృపా
న్వీత యగుదృష్టి నాతని, కేతెఱువున నిచ్చె జీవ మెఱుఁగవె యనఘా.

వ. ధర్మవిద్వేషులు ధర్మవిప్లావకులు నగు పాపాత్ముల నెల్లను మడియించుట యద్దేవ
దేవు దివ్యలీల లిట్టిమహిమ లెన్ని పేర్కొనిన నన్నియ కల వవి యెల్లను ముని
ప్రణీతంబులు శ్రీభూపసహితంబులు సకలమంగళోత్తారకంబులుఁ బ్రచురకళ్యాణ
కారకంబులు నై యుండు నని వైశంపాయనుండు వర్ణించినచందం బానంద
నిష్యందసుందరంబుగ.

తరల. వినయభూషణ విశ్వభూషణ విక్రమక్రమపోషణా
వినుతఖేలన విప్రపాలన విశ్రుతశ్రుతశీలనా
కనకవర్ణ కాంతిహర్షణ కామిసిద్ధ్యతిధర్షణా
ఘనయశోధన కార్యబోధన గర్వితారినిరోధనా.

క. కేశాదిరాయ వితరణ, కేళీనిరపాయ స్ఫూర్తిగీతకళాస
క్తీలోపేతోత్సవ యధిప, కాలంకృతభాగ్య సుస్థిరాయుర్భోగ్యా.

మాలిని. సకలజలధివేలాశైలవత్ప్రాభవాంకా
ప్రకటకరకసైన్యా భవ్యసౌజన్యధన్యా
వికలనికరరక్షా వీక్షితోదీర్ణపక్షా
ప్రకటితసుధనౌఘా బాంధవామోఘమేఘా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధు
ర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతంబైన హరివంశంబున నుత్తరభాగమునందు షష్ఠాశ్వాసము.

ఉత్తరభాగము— సప్తమాశ్వాసము.

క. శ్రీవత్సాంకవిభూతివి, భావన పావనచరిత్ర భాసురభానస
ప్లావనగుణాఢ్య సుస్థిర, జీవన కేమజననాథ రాజజననాథా.

వ. అవ్విధంబున శౌనకాదిమహామునులకుం జెప్పి నట్లు వాసుదేవచరిత్రంబుహరి
పాటి యంతయు నంతఃకరణంబున నభినందించి పరీక్షిన్నందనుండు వైశంపాయ
నున కిట్లనియె.

క. మునివంశవర్య యెవ్విధ, మునఁ బశుపతిగుప్తగరిమఁ బొదలెడి దనుజేం
ద్రునిఁ బరిభవించె విష్ణుఁడు, వినవలతుఁ దదీయవృత్తవిస్మయవిధముల్.

వ. అని యడిగిన నతని కిట్లనియె.

సీ. మానుషమూర్తియై మధుసూదనుఁడు చరియించుకాలంబున నేను మిగిలి
బాణుఁడు దొడఁగినపనియు నయ్యచ్యుతుఁ డనలాక్షగుహసహాయత్వదీప్తు
నాతని భంగించి ప్రాణమాత్రావశిష్టునిఁ జేసి పోవనిచ్చినవిధంబు
నసురేశ్వరునకు నుమాధినాథుఁడు తొల్లి యొసఁగినపుత్రత్వయుక్తికల్మి
కతనఁ గ్రమ్మఱఁ గలిగినగణపతిత్వ, మాది యగుశుభములు కడునద్భుతంబు
లింతయుఁ గ్రమంబునను మనుజేంద్ర నీకు, విస్తరింతుఁ బ్రశస్తవాగ్విరచనముగ.

చ. విను బలిపట్టి బాణుఁ డతివిశ్రుతబాహుసహస్రుఁ డిద్ధయా
వనవశ. నెల్లచోఁ దిరుగువాఁ డొకనాఁడు మనోజ్ఞదివ్యఖే

క. ప్రియ మొక్కటి యేఁ జెప్పెద, నయవినయనిధీ మనంబునం దీవు గడుం
బ్రియముగఁ దిలకింపుము మ, త్ప్రియుఁడవు మత్ప్రియమునందుఁ బ్రియమందంగన్.

క. నావుడు నద్భుతమతియై, దేవాహితమంత్రి యధికధీనిధి యగుటన్
దా వేగిరపడ కాతని, భావ మరయఁ దలఁచి చతురభాషాసరణిన్.

వ. అతనితో నల్లన నిట్లనియె.

తే. అధిప ప్రియము సెప్పెద నని యానతిచ్చి, నంతలోనన నీమాట కాత్మఁ జాల
నుబ్బియుడిగెట నెయ్యది యొక్కొ యట్టి, ప్రియము ప్రియములు రూపింపఁ బెక్కు గలవు.

ఉ. భర్గుప్రసాదముల్ గుహునిప్రాపును నీ కసహాయము ల్వినూ
తార్గళ మైనవిక్రమ ముదంచిత మిట్లగుటన్ జగత్త్రయీ
సర్గమునందు నెవ్వరికి సాధ్యము గానివరంబు నీమనో
మార్గ మెఱింగి శంభుఁ డసమంబుగ నిచ్చెనె నేఁడు నేఁడెనన్.

శా. వైకుంఠాశ్రయగర్వమై పొదలు నవ్వృత్రిం దోలంగించి యా
లోకం బంతయు నీవ యేలు మని త్రైలోక్యేశ్వరుం డైనయా
శ్రీకంఠుం డొసఁగంగ నింద్రుఁడు సురశ్రేణీసమేతంబుగా
నాకంబుం బెడఁబాసిపోవఁడు గదా నాగాలయంబుం జొరన్.

క. జలధులఁ గ్రుంకియుఁ బన్నగ, నిలయంబులు దూఱఁబడుచు నేఁడాదిగ నా
కులసంతతిపో నీచేఁ, గలిమి గనియెనయ్య దేవగణముల నలవున్.

సీ. పాంచజన్యధ్వని పర్విన గుండెయ లవిసి చేష్టించలే కలసియలసి
ప్రకటకౌమోదకీప్రథమానదెబ్బల దిగ్భ్రాంతి వాటిలి విఱిగివిఱిగి
నందకచ్ఛాయ నంటంపఁ జీకట్లు పైఁబొదివినఁ గానక యొదిఁగియొదిఁగి
తీవ్రసుదర్శనదీప్తభానునివేఁడి పరఁగినఁ గ్రొవ్వాఱ సురిఁగిసురిఁగి
యసుర లేపీఁగకడిమి సురారి గెలుచు
రట్టివిష్ణుని నోర్వంగ నబ్బె నేని
మనకుఁ బరమకల్యాణంబు మహిమ యొదవు
వెరవు నేఁడు సూపఁడు గదా విశ్వగురుఁడు.

వ అదియునుంగాక.

సీ. కలఁదు లాఁ డగుచక్రికపటంపుటనువున, దను మోసపుచ్చిన ధర్మరతుఁడు
గాన సత్యం బనుకట్టునఁ దగఁగట్టువడి పోయి పాతాళభువనకోటి
కెల్ల నుగ్రం బైనయిఱుకున నున్న మీతండ్రి విరోచనతనయుఁ డెలమి
నీయట్టిసత్పుత్రు నాయతవిక్రముఁ గనుటఁ దద్బంధమోక్షణము వడసి
నేఁడు వెలువడి తనతొంటినెలవు రాజ్య, గరిమ నేతెంచెనే దివ్యగంధమాల్య
భూషణాంబరశ్రీ లీలఁ బొలుచునాబ, లీంద్రుఁ జూడంగఁ గాంచుట యెట్టితపమొ.

క. వెలువడి బాణపురంబున, వెలుపల మందాకినీపవిత్రతటమున సం
బోలుపారెడునెలదోఁటల, నలరెడునాట్యలకుఁ దొడఁగి యచ్చటనచటన్.

సీ. భ్రమరనాదములును బ్రకటగంధర్వమృదంగనాదములును దడఁబడంగఁ
గోకిలారవములు గోమలకిన్నరీగీతులు నెంతొంటిఁ గలిగొనంగ
లలితానిలాఘాతలోలనృత్తములు నచ్చరలయాటలు సరసముగ దొరయ
నభోనవరాజకీరావళీపలుకులుఁ జారణస్తుతులు మచ్చున మొనర్పఁ
బ్రియము నొందించుచుఁ బ్రసన్నయవిహారి
సరసిఁ గల్పభూరుహమూలవీథులఁ బ్రియయు
నమునఁ గ్రీడసి మన్మథు నకలలోక
మునకు నేకాధికారిగా నునిచి నాఁడె.

ఆ. ప్రమథులు నాంద్రదుం దారుచు, సమయిచ్చల నెందు సంచితము లగుటేగా
భువనములు నలరి రపరో, క్షముగా బ్రహ్మానుభవము గని పొగయుగతిన్.

క. మగపొడవు వెల్లి శివుఁడును, మగువలు శివయు ననుగ్రహతులమాటలు నిక్కం
బుగఁ దెలుపుభంగిఁ బెత్తము, లగుగణదంపతులయొప్పు లప్పుడు మెఱసెన్.

క. ఎచ్చోటఁ జూచినం దా, నచ్చోటన యున్నయట్ల యయ్యె గణముల
య్యచ్చెరువుపుష్పవృష్టి పలుమఱు, మెచ్చుచునున్నపుడానిసరియొప్పుడుఁ డునునగఁగాన్.

వ. అట్టిసమయంబున.

మ. ఒకయేకాంతపుఁదోటఁ జంద్రమణిదివ్యోత్సంగతల్పంబుపై
నకలేశుండు విచిత్రకేళికలన్ శర్వాణి సంప్రీత గాఁ
బ్రకటప్రేమనిరూఢలీల విహరింపం గోరి యొక్కింత యు
త్సుకుఁ డయ్యెం గుసుమాకరాపకీర్ణమధుపస్తోమాభిరామస్థలిన్.

వ. అమ్మనోహరవిహారవిన్యాసంబునందు.

సీ. కంఠకాళిమ దనకంఠంబునను నవాత్మకస్తూరికాదీప్తి విస్తరింప
నొదలఁ జందురుఁ డమృతబింబములఁ దనయలకల జీనిపువ్వులను దొడుగ
నవతంసనిశ్వాస మల్లనఁ దనయవతంసోత్పలమున కుత్కంప మొసఁగ
సంగదమణిదీప్తు లలమి యొప్పగుభుజగములకాంతికిఁ బ్రోదిసేయఁ
గడఁకఁ బరమేశ్వరుఁడు దన్నుఁ గౌఁగిలింప, నతనిదోర్మధ్యసరసినోలాడుచున్న
ఘనతరస్తనచక్రవాకముల నలరు, నంబ ననురేంద్రుకూఁతు రింపారఁ గనియె.

క. కని కోర్కి లంకురింపఁగ, మనసిజరాగమున ముగ్ధమానసమున ని
య్యనఁ బోగ రెక్కఁగఁగన్నియ, తనమున నెంతయును భ్రాంతితనుఁ బొడవికొనన్.

వ. ఆత్మగతంబున.

క. తగుమగనిఁ బడసి కౌఁగిట, సొగియఁ గనుట గాదె యగయజోటికి సఫలం
బగుభాగ్యఫలము నాకిం, పుగ నిం కెన్నఁడొకో యిట్టిపోఁడిమి గల్గున్.

చ. జనకుఁడు మూఁడులోకముల సన్నుతి కెక్కిన మేటి సంయమిం
ద్రనిరుపమానుఁడు మాకుఁ గులదైవము పర్వతకన్య కన్యనై
యొనసిసిభక్తిమైఁ గదిసి యేఁ బరమేశ్వరి నాశ్రయించినన్
ననుఁ గృపఁజూచు కంబ కరుణానిధి యూరక యేల యుండెడున్

## పార్వతీదేవి యుషాకన్యకు నభిమతవరంబొసంగి యాదరించుట.

తే. అని తలంచు రుద్రాణి యయ్యబలతలఁపు, తనతలంపునఁ గనుఁగొని కనికరమునఁ
జిత్తమలరంగ నల్లనఁ జేరఁబిలిచి, యిట్టులనుఁ దన్మనంబున కింపు మిగుల.

శా. బాలా నీతలఁ పొప్పఁ గన్నియలకున్ భావంబు నిత్యంబు నా
లోలంబై పతిలాభలోభ మనుకల్లోలంబులం దేలుటల్
తెల్లన్ హాయిఁ గూడి యే నెటులు నిష్ప్రత్యూహమౌ
బోలన్ గోలది నట్లు నీకును బ్రియాశ్లేషంబు నే చేయుదున్.

వ. అట్టికల్యాణంబునకుఁ గారణంబు వినుము వచ్చెడు వైశాఖశుక్లద్వాదశినాఁటి నిశాసమయంబున సముచ్చత సౌధతలంబునందు నీవు నిద్రించియుండఁ గల లోన వచ్చి యెవ్వండు నిన్నుఁ గలసె నతండు నీకుం బతియయ్యెడు. బ్రహ్మనిను నిర్మించినది విలాసంబు పృథ్వీలాసంబు నలంకరింప నింపారు మొక్కన నక్క పద్మ కుటుంబిని పేడ్కొని పెద్దలు పెక్కటిల్లునుల్లంబుతో మరల నప్పుడు.

క. చెలువుడు నవ్వుచుం బరి, హాసోక్తులు పలుకుచుండ నాయువ్వలు లీ
లన్నుసరణియ పరమేశ్వరి, చేసినకృప తెలుఁగు బ్రకటితేసిరి నెమ్మిన్.

వ. ఇవ్విధంబున గిన్నర గంధర్వ యక్షరాక్షస దైత్య దానవ దేవాన్వయ జనసభన్యలయిన కన్యలు వేలసంఖ్యలు గొలువఁ జని నగరు సొచ్చి యుషాకన్య యనన్యసామాన్యంబై జగన్మాన్యం బగుసౌభాగ్యంబునకు భోగ్యం బయ్యెడుసమయంబు ప్రతీక్షించి యుండె నంత.

సీ. వనకేళి సాలించి తనపారిషదులును దానును శంభుం డుదారయశుండు
దారగృహీతార్ధతనుఁ డష్టతనుభేదసంవ్యాప్తభువనుఁడు సకలభువన
సంభవస్థితిలయస్వామి సామీప్యాదివిభవవిజృంభితవినతచయుఁడు
వినతనుతిక్రియావిసరవిశ్వామరగణుఁ డగణితమాత్మగతవిలాసుఁ
డెలమి నభిరామకామభోగేచ్ఛ లిచ్చఁ, బాల్చి సంసారతంత్రప్రధానకర్త
యైనవాఁడు గావున విహారానుషక్తి, నంబుకేళికై చనుదెంచె నమరనదికి.

తే. అందుఁ బ్రమథముఖ్యు లందఱుఁ గ్రందుగాఁ, దఱిసి తమయనుంగుతెఱవపిండుఁ
గూర్చుకొని మనోజకోలాహలస్ఫూర్తి, యలర నోలి నోలలాడుచుండ.

ప్రయుక్తం బైనసరససంగీతం బవధరించి మధురావలోకనంబుల నందఱుఁ గృ
తార్థులం జేసె నయ్యవసరంబున.

సీ. గురుగోత్రతటములు గోరాడ నను మొక్కవోయి నవలి గొమ్ముదోయి మెఱయ
ఘనమేఘతటములు కాల్ద్రివ్వ క్రొమ్మెఱుఁగులపస నూనిన గొరిజ లొప్ప
భూరిదిగ్భిత్తులఁ ద్రోచికొన సన్నగిలు కెక్కు కప్పారుకంఠ మొప్ప
స్థూలఘువాయుస్కంధములు దాఁకి తోఁకలు పోరఁగ నాడుచు నింపుతోఁక యలరఁ
దారశిఖరిఁ గ్రాలించిన మేరుశిఖల, మనఁగ ధవళాంగకల్పిత మైనపసిఁడి
పల్లమును రత్నకింకిణీపటకరంబు, నమర వృషభేంద్రమిఁ డాయితంబయి తనర్చె.

వ. అమ్మహాదేవుండు మహాదేవీసహితుండై యావాహనంబు నారోహణంబు సేసెఁ
బ్రమథపుంగవులుం బ్రధానగంధర్వులును సిద్ధవరులు నప్సరోముఖ్యులు వార
ణంబులు తేరులు నశ్వంబులు నందలంబులు నెక్కి రి కొందఱు విమానారూఢు
లు నాకాశగాములు నై యిట్లు సపరివారంబును గొలువ శర్వుండు మగిడి
యాత్మీయం బగుదివ్యనివాసంబు ప్రవేశించి సుఖంబుండె.

ఉషాకన్య స్వప్నమందు ననిరుద్ధుని సమాగమంబు గనుట.

ఉ. అంటినఁ గంను మేనుఁ బసనాడెపుజవ్వనముక్త రసంబుప
న్నంటలఁ గూర్చు కామమును నిబ్బర మైనమదంబునై మనం
బొంటకఁ బోక భర్తృరతి కువ్విళులూర నిరంతరస్పృహా
కంటకితాంగియై యలయుకన్నియ బాణునికూఁతు రత్తఱిన్.

చ. తనవిహరించుసౌధమునఁ దల్పమునై మునుదేవి యిచ్చినతి
చ్చినసకియందు భోగులును జేరువ నిద్దురవ్రాలఁ దాను నిం
పలరఁగ నొంటెఱుంగనిసుఖోచితనిద్ర నెలర్చియుండఁగా
ననఘశరీరుఁ డైనపురుషాగ్రణి మారసమానుఁ డిమ్ములన్.

సీ. కలలోన నయ్యింతిఁ గదిసి ప్రేమమున నవ్వ గములొత్తఁ దియ్యని పలుకు పలికి
కెంగేలితోఁ గేలు గీలించి నెమ్మేను మేనను జేరయించి మెలపుతోడ
బిగియారుకౌఁగిట బౌఁగియించి మనసులు రెండును గదిసి యొక్కండు గాఁగ
నేకోర్కు లేమిటి కెలసిన వాని జుబ్బునఁబాఱులై చొప్పడంగఁ
జతురరతిసంభోగరసములు చుప్పలవంటు, నిద్దలును గ్రొత్తగాఁ గని యెప్పుమీఱి
నట్టిచందంబు గావించి యాత్మమూర్తి, యబలతలఁపున సచ్చిత్రేట్లు సేసె.

వ. అయ్యనంతరంబ.

తే. అదిరిపడి మేలుకని కన్ను లువిద విచ్చి
చూచి కానక యట్టియాసోబగు నచట

భయము లజ్జయు మోహంబు బొలమనసు
పొదివెఁ దమము మంచును దమ్మిఁ బొదువుమాడ్కి..

చ. అది కలలోనికానుపయి యంబికయానతి యున్న కల్గి య
ట్లొదవుట ముగ్ధతం దలఁప కగ్గలి నిక్కముగాఁగఁ జూచి పె
ల్లొదవెడుబాష్పవారి నయనోత్పలపంక్తి యొనర్ప రోదనా
భ్యుదయమనోజ్ఞమై వదన మొప్ప వడంకుచు నార్తి నుండఁగాన్.

వ. మణిదీపస్తోమోదారం బైన యమ్మందిరంబుచేరువ నిద్రించి యున్న చెలికత్తియ లెల్ల మేల్కాని సంభ్రమంబునం బొదివికొనిరి వారిలోనం జిత్రరేఖ యల్ల నమ్ము ద్దియ నెరం బొక్కకేలఁ గ్రుచ్చియెత్తి కౌఁగిలించి.

మ. చెలియా యోడకు మేల యేడ్చెదవు నీచిత్తంబులోఁ దాపముం
దలఁకుం జేయఁగ నెవ్వరుం గలరె యీత్రైలోక్యమధ్యంబునన్
బలిసూనుండట తండ్రి నీ కెఱుఁగవే భగ్నాత్ములై మ్రగ్గరే
బలభిన్ముఖ్యనిలింపు లీతనికి నీభాగ్యంబు సామాన్యమే.

తే. గురుఁడు ప్రెగ్గడయును రక్షకుండు మీకుఁ, బొలఁతి శుక్రుండు శోణితపురము నెలవు
క్రుక్క నెక్కడవచ్చి నీ కొక్కకీడు, సేయువాఁ డొల్లఁ దాల్మి యజహితంబు.

వ. కావున భయంపడవల దని కన్నీరు దుడిచి బుజ్జగించిన నబ్బోటి వారిం గనుంగొని.

క. ఏనిచ్చట నిద్రితనై, యీనిశి నుండంగఁ బురుషుఁ డెవ్వఁడొ యుపగూ
హానుభవంబున వికృతం, గా నొనరించె నది కలయొ కాదో యెఱుఁగన్.

చ. కల యనరాదు రామలకుఁ గాములపొందము లెన్నిచందముల్
గల వవి యన్నియున్ వలసెఁ గన్నెఱికం బిటు వీటఁ బోయెఁ బె
ద్దలకును బెద్దయై తనరుతండ్రికిఁ దక్కువపాటు దెచ్చితిం
గుల మొరియించితిన్ జననిఁ గూర్చితి శోకములోఁతువాటమున్.

క. ఏనింక ను గన్నియ నని, మేనం బ్రాణములు దాల్ప మెయికొని యున్నన్
దైన నిహముఁ బరమును గల, వే నిక్కం బగుట చెప్ప నింతటికంటెన్.

వ. అని యవ్వాలందియ యందంద వగచుచుఁ బెద్దయుం బ్రొద్దు విలాపంబు సేసినం గన్నియ లందఱు విహ్వలభీతలోచన లగుచు నవ్వామలోచన కిట్లనిరి.

క. కలయగుఁ గాక యిట్టవి, గలవే నిక్కములు నీవు గఫుపటికి వెడం
దలఁపక యున్నను గలుగుం, బొలఁతీ యేమేని వికృతపుం దెఱఁగు గలన్.

మ. తెలివింగూరి యొనర్చుకొన్నిపనులం దెల్లంబు దోషంబునుం
గల దాచందము గల్గుకాంతఁ గులటంగా నెన్నుదు ర్సజ్జనుల్

గలదే దీనికినింతయేనిఁ గలలోఁ గన్నట్టియాభోటికిం
గులశీలంబులు పేర్మిఁ బూన్పఁ దగునే కుందింపఁగా డెందమున్.

చ. ఎఱుఁగమె యేము నీహృదయ మేల తలంచెదు నీచరిత్ర మే
తెఱవలయందు లేదు సుదతీ మదతీవ్రము లయినభావముల్
దెఱసినభావ మొక్కటియ నీమతలంపు మొఱంగి యిట్టియా
మఱుటకుఁ జెప్పఁ గాలగతి మాన్పఁగ శక్యమె యెట్టివారికిన్.

ఆ. ఇన నేమితప్పు ధీర యిసీ యను, తాప మొకఁడు నిన్ను దిస్సఁ జేసె
విను మహామహత్త్వము లనురాగమును దుర్ది, నొలయఁగనుట మునుపలుకుగాదె.

చిత్రరేఖ యుషాకన్యక స్వప్నకలనఁ గాంచినం బురూహించి యుషాకన్య నూరార్చుట

వ. అనుచుండఁ గుంభాండపుత్రి నొక్కింత సేపూరకుండి యయ్యఖండితచారిత్ర నుద్దేశించి.

క. ఇంతనడి కేనుదలఁచితి, నింతి జగదంబ నిన్ను నేమని చెప్పం
గాంతునిఁ గోరినకోర్కికి, సంతుష్టిని నాదరించి యది గనుఁగొనుమా.

వ. వైశాఖశుద్ధ ద్వాదశినాఁటిరాత్రి హర్మ్యతలంబున సుప్తయైన నిన్ను ననుభావ్యభోగసంస్కారంబు గనఁ భోగసంభవవిహారంబు నొందించినవాఁడు వల్లభుం డగునని యద్దేవి నిర్దేశించె నది యిప్పుడు ఫలియించె నింకం బరితోషంబు నొందు మనిన నయ్యిందుముఖి ముఖంబు మంచుదొలంగినయిందుబింబంబు పగిది నగతబాష్పకంఠయై భూరితాపంబినవహించె నచ్చెలులెల్ల నుల్లాసంబు నొంది రనంతరంబ యయ్యబల ప్రియసఖిం గనుంగొని యల్లన నిట్లనియె.

క. భ్రమవాయఁ జేసి యిటు నన్, సమ గ్రమ్మఱఁ దెలియ నీవు నాకిచ్చితి పీ
సమధిక మగుభాగ్యము లో, గ్యముగా నోపఁగూపపుత్రీ వ యరయుమ యింకన్.

క. మనసున నాఁడెడునయ్యన, ఘనిరూపాకృతి యలిక వాక్యగోచరముగఁ జే
య నశక్యము సుభగశ్రీ, నెనసినయది దీని నీవ యెఱుఁగుదు వెదకన్.

క. నినుఁ జెప్పగాఁగఁ గైకొని, మనోరథపయోధి యేను మానిని గడవన్
గని చరితార్థతనొందుదు, నని తలఁచెద నీసహాయ మల్పమె యెందున్.

ఉ. నావుడుఁ జిత్రరేఖ లలనా యగి యక్కట నాకు దేహమున్
జీవితము న్భవత్ప్రియముచేఁతకు నై యవి గాక యొంటికే
యేవెర వైననూఁది భవదిష్టునిఁ దెచ్చెదఁ దొల్తఁ జెల్లగా
నావినుతానుభావుఁ దెలియన్వలయుం దదుపాయ మెద్దియో.

తే. ఇట్టివాఁ డని నీవును నెఱుఁగఁ జెప్ప, నేర వెమ్మెయి నెఱుఁగంగ నేరవచ్చు
వినక చూడక యెఱిఁగెడువిధము గలదె, కడఁది యెవ్విధమున నిది కమలనయన.

క. చాయయు నందము నించుక, యీయనువని నీవు చెప్ప నెఱిఁగెద వేనిన్
వేయేల పుట్టుఁ బేరును, శ్రీయును బ్రాయంబుఁ దెలియఁ జెప్పుదును దుదిన్.

సీ. వసువులు రుద్రులు వాయువు లశ్వినులాదిగా నెవ్వారి కైనఁ జొరఁగ
రానిశోణితనగరంబు నిర్భయత దైత్యాధీశుతల ద్రవేసినట్లు సొచ్చి
సరసభావమున నీసర్వభావంబును భోగించి పోయినపుంసవృషభుఁ
డిప్పు డెన్నినవీరి కెల్లను వేనేల క్రమమున నెక్కుడు గాక యున్నె
భూమునకు వేయిభుజములభరము శించు, కయ్యమిచ్చువాఁడు మహీంద్రకాంక్షఁ బోలు
నిట్టిపతిఁ బొందలేనియయ్యింతి రూపుఁ, బ్రాయమును సిరియును నపార్థములు గావె.

చ. అనుపమభాషితంబులకు నంగజరాగరసంబు దోడుతోఁ
దనువున నాత్మఁ బిక్కటిలి దందడి నేగిరపాటు నార్తియున్
ఘనముగఁ జేయ నచ్చెలిగన్నుల ఱెప్పల నశ్రుబిందువుల్
వనరుహకేసరస్థహిమవారిలవంబులమేలు డింపఁగాన్.

వ. నెచ్చెలికేలు గేలం గైకొని మఱియుం జేర్చి.

మ. తమకార్యంబుల కెల్లనాఁడుఁ గడునుత్సాహంబు వాటింతు రు
ద్యమ మన్యార్థము చేఁత సుర్లభము మత్ప్రాణంబుతోఁ దుల్యగా
రమణీ యేను దలంతు నిన్నుఁ బ్రియ మారంగ నీవు నన్నట్టిభా
వము పాటించి భజించినం గలుగు దైవస్ఫూర్తి నాకోర్కికిన్.

క నిక్కము సెప్పెద నాదెస, నక్కటికము నీకు లేనియట్టిది యేనిన్
దిక్కెవ్వరు ప్రాణము, లిక్కాయముతోడఁ బాయు నింతియ పిదపన్.

వ. అనినఁ జిత్రరేఖ పరితాపతరళ యగు నత్తరళనయన కేలు కేలం బట్టి.

క. ఎడ, యిమ్ము నా కొకించుక, తడవెద నాబుద్ధియందు త్రైలోక్యమునన్
బొడవైనవి యెల్లను గని, తడయక నీప్రియుని నెవ్విధంబునఁ దెత్తున్.

మ. కరుణాలోకసమూర్తి సర్వజగదేకస్వామినిన్ శివతే
శ్వరి శైలేశ్వరకన్య నీదెసఁ గటాక్షం బొప్పఁగాఁ జేయుటం
దరుణీ యెంతయు ధన్య వీవు దయితుం దచ్ఛోదితున్ లోకసుం
దరు నిశ్వాధికుఁ బొంది తెట్లుఁ దుది యేడం గాంచు నీకోరికల్.

వ. అని యయ్యువిద నూరార్చి సఖీజనంబులం దదీయరక్షణార్థంబు నియోగించి
యోగవిద్యావిదిత యైనయమ్మహాభాగ యేకాంతంబున నుండి.

సీ. అధికవిస్తీర్ణమై యమరునాలేఖ్యపటంబున వలయువర్ణంబు లెల్ల
నొడఁగూర్చి తూలిక యొప్పఁ గైకొని పదునాలుగుజగముల నోలి నెవ్వ
రెవ్వరు ముఖ్యులై యెందుఁ బ్రఖ్యాతిఁ బొందుదు రట్టిపురుషులఁ జదు రెలర్ప
నాకారములుఁ జాయలంబరాభరణాదు లొప్పులు నిలుకడ లొకఁ దప్పదు

కుండ సప్తరాత్రంబున నొసర వ్రాసి, తెచ్చినచ్చెలిముందట విచ్చి చూపి యచ్చెరువునొందు నమ్ముగ్ధ కవ్విధంబు, వేఱువేఱ యిట్లని చెప్పి విస్తరించి.

ఉ. ఈయఖిలాండసృష్టి నుడలెత్తినధన్యుల నెల్ల నేను నీ
కై యిదె యస్మదద్భుతకళాతిశయంబున నాహరించి శా
తా యిటు చిత్రవిన్యసనలక్ష్ములఁ జేసితి నింపు నీ ప్రియుఁ
శ్రీయుతు నొప్పుగాఁ బడవి చెప్పుము నిక్క మెఱింగి క్రమ్మఱన్.

—— చిత్రరేఖ దేవదానవప్రముఖుల నెల్లఁ జిత్రపటంబునఁ లిఖించి తెచ్చియుషకుఁ జూపుట ——

మ. విను మాద్యం బగుతేజ మొక్కటియ యీవిశ్వంబుఁ బుట్టింపఁ బెం
ప నడంపంగఁ ద్రిమూర్తులై వెలసె నాథవ్యాప్తకుల్ వీరె లో
కనుతుల్ బ్రహ్మయు విష్ణుఁడున్ శివుఁడు నాఁగా నా త్రిమూర్తిమావ
త్యనురాగానవహు లెల్లవారలకుఁ దారారాధ్యు లబ్జాననా.

సీ. ఒడలెల్లఁ బసిఁడియై పొలుచుమహాశక్యపుఁ దనులనొప్పెదుకొండ తమకు నెలవు
ముదిమియుఁ దేవులును గనుకనుంపఁగఁ బాలతెరిఁగిన్న వస్తువు తమకుఁ గూడు
పొలివ్రానిపంట యెప్పుడుఁ గలతరువులనలరుతోఁటలు దమయాటపట్లు
యుశకోటి యెఱిఁగినయువతు లయ్యోసిక్కఁ గొలుభామలు దమకొలువువారు
వీరు వేల్పులు ముద్దియ వేయికన్ను, లమరనూఱంచుమెసఁగుఘోరాయుధంబు
గేలఁ దాల్చినమేటి దస్మేల గ్రాలు,సౌఖ్యనిరతులు వ్రతులు నిష్కలుషమతులు.

చ. అమరులకంటెఁ బూర్వు లమరావలిఁ జేర్చి సహింప రుగ్రులై
యమరకులంబు నొంచుటకునై తపముల్ సవరించి సర్వలో
కములను నాక్రమింతురు మఱింటిమిఁ గోపమునం జలంబునన్
సమధికు లింతి వీరు పటుసాహసనిత్యులు దైత్యు లారయన్.

క. దైతేయులయట్టుల వి, ఖ్యాతులు సర్వగుణనివహగౌరవమున ను
ద్యోతితమూర్తులు చూచితె, నాతి దానవనికాటనాథుల వరుసన్.

శా. పక్షంబు ల్గలిఁ దాల్చు కీరనిభదీవ్యద్వాణులున్ గాణులుం
జక్షూరాగము గంఠరాగము సురాసంసక్తి గానోక్తి నా
లక్షింపం బొలుపారుమోహకతనూలక్ష్మీపరేణ్యు ల్లస
ద్దాక్షిణ్యుల్ మఱి వీరిఁ జూడు పరగంధర్వుల్ కురంగేక్షణా.

మ. అణిమాద్యష్టవిభూతులుం దమకు నిత్యాయత్తలై చేరఁగాఁ
బ్రణయంబుల్ దళుకొత్తఁ దారుఁ బ్రియలుం బ్రాణంబు లైక్యంబుగా
గుణితక్రీడలఁ గూడి రూఢ మగుకోర్కు ల్సంతతామోదపా
రణలం దృప్తిసనంగ నొప్పుదురు వీర ల్సిద్ధు లిద్ధాకృతుల్.



మత్తకోకిల. ఆధనేశుపురంబువారలు యక్షవర్యులు వీరు వి
ద్యాధరేంద్రులు వీరు నిత్యశుభాభిరాములు భూరిమా
యాధికారులు వీరు గుహ్యకు లంగనారమణక్రియా
వీధి సర్వపదీను లుగ్మలి వీరు కిన్నరపుంగవుల్.

మ. సకలాజాండవిలంఘనక్షమబలస్ఫారుల్ మహావిక్రముల్
శకునిశ్రేష్ఠులు వీరు వీరు త్రిజగత్సంభావ్యభోగుల్ యశః
ప్రకటోద్యోగులు భోగు లక్షయసుఖప్రాప్తోర్ధ్వలోకాస్పదుల్
సుకృతుల్ వీరు సురాంగనాహృదయహృత్సుస్నిగ్ధభావోజ్జ్వలుల్.

ఉ. మర్త్యులు వీరు పెంపున సమర్త్యులకంటె నుదగ్రులై మనో
వర్త్యవిరోధసంప్రసరవర్గచతుష్టయలబ్ధవిస్ఫుర
త్కీర్త్యనుభావముల్ భువనశీలనలోలములై యెలర్ప నా
పూర్త్యసమానసంపదలఁ బొంపిరివోయెడివారు నెచ్చెలీ.

చ. మనుజులయందున స్ఖలితమానసమగ్రులు రాజవంశసం
జనితులు వీరు హైహయులు శైబ్యులు వైన్యులు రాఘవాన్వయుల్
జనకులు నైషధుల్ భరతసంభవు లాదిగఁ గాశికోసలా
ద్యనుపమదేశరాజ్యవిభవాధికసౌఖ్యకళావిజృంభితుల్.

వ ఇట్లు గా నస్మద్విలిఖితం బైనయీచిత్రపటంబునం దగులనిరూపంబు లేదు వీరి నందఱం గలయం గనుంగొను మనిన నయ్యంగన యంతరంగంబలర నాలోకించి.

సీ. దేవతలను బూర్వదేవతలను జూచి దేవయోనులనెల్లఁ దెలియఁ జూచి
విహగేశ్వరులఁజూచియహినాయకులఁజూచిమనుజసంఘముఁజూచిమనుజపతులఁ
జూచి యాదవకోటిఁ జూచుచో వారిలోఁ బోరిఁబోరిఁ బోలిక తెరువు గాంచి
ప్రద్యుమ్నుఁ జూచి సంభ్రాంతయై యల్లన ననిరుద్ధుఁ జూచి యత్యాదరమున
విగతసంశయ మగుచూడ్కి వేఱొకటికిఁ, బోక యాకూతకౌతుకాద్భుతవిలోల
తారకం బయి నిలుకడపగుల లీల, మనసు దోడ్తోడ మన్మథోన్మాద మొంద.

తే. బిగియఁ జనుఁదోయి యొత్తినపేరురంబు, నలరుమోవితీ పానినయాననంబుఁ
దనియఁగురులు దెమల్చియాడినకరంబుఁ, దరుణిమెచ్చుచునెమ్మోముఁదమ్మియలర.

క. నను మఱపి యెందుఁబోయితి, గనుఁగొంటినిఁ బట్టువడితి కైతవ మిటు సే
సినఁ బోనిత్తునె యనుచును, దనమదిఁ బలుకుగతిఁ గొంత తడ వీక్షించెన్.

వ. చిత్రరేఖయుఁ దదీయభావం బుపలక్షించి.

మ. అనిరుద్ధాకృతిమీఁదఁ జిక్కువడి యయ్యబ్జాక్షిచూపంగముల్
ఘనరోమాంచమునం దనర్చెఁ బ్రియు నిక్కం బిట్లు గన్నట్లు పై

కొనిపూర్వానుభవంబు తియ్య మగుకోర్కుల్ చిత్రరూపంబుపై
మునుఁగంబోలుట, దెల్పెదుర్ వివశతాముగ్ధంబులై భావముల్.

వ. కావున నిమ్మత్తకాశిని యున్మత్తదశఁ బడకుండం దేర్చి తదయక దీనిమనోరథంబు దీర్చెద నని తలంచి యల్లన నగుచు నిట్లనియె.

సీ. కన్యాపురంబునఁ గనకసౌధంబుపై నిద్ర నేమఱి యున్ననిన్నుఁ గదిసి
తనచెయ్దములు సూపి మనము ద్రుచ్చిలి కొని యరిగినద్రుచ్చు నబ్జాయతాక్షి
నీనేర్పు సులువుగా నెఱిఁగితి నేర్పడఁ బోయెద నచ్చట నేయునుపుస
నున్నను బలిమియు నోపికయును నీవు మెచ్చఁగఁ దెచ్చెదఁ దెచ్చి నీకు
జేయలంతిగా నిచ్చలు చెలియ యిత్తు, నీకలాపుపాతంబున నెఱయఁగంటి
భోగలలితశృంగారమై పొసఁగుగృహము, సందుఁ ద్రోచి నీవలచినయట్లు సేయు.

వ. అనిన ససంభ్రమంబుగా నయ్యబల చిత్రరేఖం జూచి చిత్రరూపం బంగుళిపల్లవంబున నిరూపించుచు.

క. నీకౌశల మేమని చెలి, యీకొనియాడుదు మదయమగుమదికి విచిత్రాకృతి మును గలఁ గలసిన, యాకారం బెంత నేసె సంతియ చేసెన్.

క. ఏపుణ్యవంశమునఁ బుట్టెఁ, నేపురుషశ్రేష్ఠుపుత్రుఁ డేగుణములను
దీపింతుఁ డెయ్యది పేర పేరిక, నేపగిదిం జేయుఁ జెపుమ యింతయుఁ దెలియన్.

వ. అనినవిని చిత్రరేఖ యసురరాజపుత్రి కిట్లనియె.

చిత్రరేఖ యుషాకన్యకు ననిరుద్ధుని కులశీలనామంబులు దెలుపుట.

శా. త్రైలోక్యంబును నేలు దేవుఁడు ధరన్ ధర్మంబు గాప న్నపుం
డై లీలన్ యదురాజవంశమున విఖ్యాతింబుగాఁ బుట్టి గో
పాలీకేళివిరుండు నాఁ బరఁగి నేభవ్యాత్ముఁ డాశౌరికిన్
బాలామన్మథుఁడు పేఁడు తత్సముఁడు సౌభాగ్యానుభావంబులన్.

మ. కనుకం దొల్లి యనంగుఁ జేసి పిదపం గ్రీడాయతానుగ్రహం
బున భూతేశుఁడు కృష్ణనందనుఁడుగాఁ బుట్టించినం బుట్టి యే
పునఁ బ్రద్యుమ్నుఁ డనంగ నొప్పెడుమహాభోగాఢ్యపుత్రుండు తి
న్ననిరుద్ధుం డనిపేర్కొనం బరఁగు నత్యాశ్చర్యశౌర్యుం డనిన్.

సీ. పేర్చి శైలంబులు పెఱికి శైలములపై నూడుకొనంగ నొండొంటి వైవఁ
గడఁగి యంబోధులు గలఁచి యంభోధులపైఁ గ్రందుకొన నూర్మిపటలి గలఁప
గిట్టి దిగ్గజములఁ బట్టి దిగ్గజములతో రాయిడిఁ దాకించి పోరొనర్ప
బ్రహ్మాండపజ్క్తులు బ్రహ్మాండపజ్క్తులతోడుత నొండొంటిఁ ద్రుంగ నడువఁ
జాలుఁ గినిసినఁ దక్కినసత్త్వధనుల, తరముగా నెన్నరాదు దుర్ధరభుజుండు
లలితశృంగారనిధి కళాకలితభువన, గీతకులకేతు వీబుశ్యకేతు వబల.

తే. అఖిలలోకంబులకుఁ దల్లి యైనవిశ్వ, గురునియిల్లాలు చేసినకరుణపేర్మి
యింతయొప్పునె నీసరి యెవ్వరింతు, లింతి యొప్పితి పతిఁ బొంద నింతవాని.

క. సాధించి సురల నేలిన, యాధిక్యము వెలసెఁ దండ్రి కతివా నీచే
నీధన్యత గొనియాడఁగ, వేధయు జడముఖుఁడు వేయివిధముల నరయన్.

వ. బాణనిలయం బగుశోణితపురం బట్లు నిత్యగుప్తంబై యుండు నట్ల కృష్ణనివాసంబైన ద్వారకాపురంబును యదువీరసంరక్షణంబున నెవ్వరికి దుష్ప్రవేశం బయి యుండు నట్లయినను బ్రద్యుమ్నతనయుం గదియుపనికి సర్వోపాయంబుల నుత్సహించి నీకుఁ బ్రియంబు సేసెద ననిన నసురరాజతనయ యమ్మంత్రితనయ కిట్లనియె.

క. యోగినివి కామరూపవు, ఘగణ్యవు ఖేచరత్వదీపితవు మహా
భాగవు భామిని నీయు, ద్యోగమున కసాధ్యభంగి యొకటియుఁ గలదే.

ఉ. పున్నమచందురుం జెనయుపోల్పున నయ్యనిరుద్ధువాని నా
కన్నులతృష్ణ దప్ప నెటుగల్గినఁ బ్రాణము నిల్చు నట్లుగా
కున్నఁ గృతాంతదండహతి నొందుటకుం దగి వైనకాల మా
సన్నము నన్ను తాంగి యవసన్నత మానఁగఁ జేయవే కృపన్.

తే. యేడుదివసంబు లోర్చితి నింకఁ గడియ, దడవునకు నైన లేదు నా తాల్మి చెలియ
నన్ను బ్రతికించుటయ నీదు నైపుణముల, కెల్లఁ దలకట్టు చెలి ప్రాణమెత్తుట నదె.

క. కులమొల్లరు నిందఁ యొకటి, దలఁపరు కామార్తులైన తరుణులు మాన
స్థలన మెఱుంగరు నన్నా, కలఁకకు రాసికు నీవు గలఫల మతివా.

క. దూతీముఖమునఁ గరువము, ప్రీతియుఁ బొదలంగఁ గదియుఁ బ్రియములరయఁగా
ర్యాతురత దార పైకొను, టే తెఱువునఁ గాదుచూడు మిది నీబుద్ధిన్.

వ. దౌత్యంబు లాఁతివారిచేన నెక్కింత యెగ్గయి తోఁచుం గాని తనప్రాణంబులతో సమానం బగుజనంబునందుఁ గేవలగౌరవంబునకె యయ్యుండు నిన్నియు నీయెఱుంగనిభంగులే యనిన నయ్యంగన యింత యన నేల నన్ను నేలం బనిచెదవు గాదె వేగంబ సర్వశుభంబులకు భాజనం బయ్యెదవు గాక యొక్కింత ధైర్యం బవలంబింపు మని యూఱడించి యమ్ముగువం గౌఁగిలించి యొప్పటియట్ల చెలికత్తియలం బరివేష్టించి యుండం బనిచి వీడ్కొని యంతరిక్షంబున కెగసి యంతర్ధానంబు నొంది.

క. చెలియ మనోజవ గావునఁ, గళాంతరములోన చనియెఁ గంసరిపునియు
జ్జ్వలవైభవముల కెల్లను, నెల వగు తద్ద్వారకాఖ్యనిరుపమపురికిన్.

వ. చని తదీయసౌందర్యంబున కాశ్చర్యంబు నొందుచుఁ దనకార్యగతియందొక్కింత చింతాకులయై యుండి యక్కడ నెక్కసలిలాశయంబున నున్న నారదుం గని

చేర నరిగి ప్రణామంబు సేసిన నతండు దీవించి సన్నుచు సవ్వేళ నందియాగమన
కారణం బడిగినం జేతులు మొగిచి.

క. బాణసుతకోరిక యుద్ధ, ద్రాణిక్రుపాదానమును ముదంబున సుమనో
బాణసుతుఁ గుఱిచి తాన, క్షీణత్వం గనవచ్చుటయును జెప్పెం గ్రమమునన్.

వ. చెప్పి మునీంద్రా యేను యదుకుమారునిం గొనిపోయిన నవశ్యంబు నెఱింగి
బాణుండు సైరింపండు బాణపరాక్రమ మనిరుద్ధునకు భరంబై వచ్చు మీరు
మురాంతకునకు నివ్విధం బెఱింగింప నలయు బలితనయపను దేవసూనులకుం
గయ్యం బగుననియుం గల దందు దైత్యారికి విజయంబు సిద్ధంబు మఱియొక్కటి
యర్థించెద.

చ. మనుమని నొక్కకాంతకయి మాయపుభంగిఁ జెలంగి తెవ్వగాఁ
గొని యటుపోవ బ్రుల్లను మురాంతకుఁ డెఱింగినఁ జూపవహ్నిచే
నను నేటు సేయునో యని మనంబునఁ బెల్కుఱియున్న దాన స
న్మునివర నీవు దోఁచితి మనోరథదేవతవై ప్రసన్నతన్.

క. కావునఁ గృష్ణుని దెస భయ, మేవిధముఁ బొందకుండ నలయుఁ గృపన్ మీ
యీవరవు డుపాకస్వతు, దేవా యిట్లున నల్లదియు సిద్ధించున్.

క. అనిన మునీశ్వరుఁ డయ్యం, గనఁ గనుఁగొని నీకు సకలకార్యములకు సా
ధనముగ నిచ్చితిఁ దామసి, యనువిద్య ప్రియంబు నొందు మంబుజవదనా.

క. నీ వనిరుద్ధుని నటఁ గొని, పోవంగ సురరిపులతోడి పోరు గెలుగు నే
నావేళ నరుగుదెంచి ర, ణావష్టంభంబు సూతు నాదిట ప్రోవన్.

వ. అవ్విధంబునఁ బ్రద్యుమ్నసూనువృత్తాంతం బనుసంధించుట యయ్యెడుఁ బొ
మ్మని తాను నిజేచ్ఛం జనియెఁ జిత్రరేఖయు సదృశ్యమూర్తియై వాసుదేవు పె
ద్దనగరును బ్రద్యుమ్నుమందిరంబును నరసి యావల ననిరుద్ధుగేహంబు గాంచి
యందు మనోహరస్థలంబున.

చిత్రరేఖ యనిరుద్ధుమందిరంబు సొచ్చి యతనిం గొనివచ్చుట.

తే. పసిఁడికోరల నించి యింపెసఁగ మధువు, గ్రోలుచును జుట్టు సతివలు గ్రాలనడుమ
సమరుపిడిపిండులోనిమహాగజేంద్రు, కాంతి నలరుకుమారు నంతంతఁ గనియె.

వ. కని తదీయభావం బుపలక్షించి యాత్మగతంబున.

చ. సరసవయోవిశేష లగుచామలు పాటలునాటలుం గరం
బరుదుగ విస్తరించుచుఁ బ్రియంబులు సూపఁగ దీన నేమిటం
బొరయమి గానరా నొకయపూర్వపుఁజందముతో నృపాత్మజుం
డెరవయ యున్నవాఁ డకట యేమికతం బగునొక్కొ దీనికిన్.

సీ. బలిమిఁగోలున నవ్వుదళుకొత్తినను మొగంబెల్లఁ దానైయున్న వెల్లఁదనము
ధీరత దెచ్చికోల్ పొందినఁ బలుకులయందు గద్గదిక వాయంగ లేదు
గరువంపుఁజూపులఁ బురికొనియున్నను రాగమే తెరువున రాదు చేరఁ
జేతులు వేడుక చేఁతలకై చక్కఁ బచరించినను నచ్చుపడదు చేష్ట
యితనిచిత్తమెవ్వతయెనిఁ జతురయొకతె, గొన్నయది దైత్యనాథునికూఁతురితనిఁ
బొందినట్టుల యితనికిఁ బొందు గలుగఁ, బోలు దైవికమయ్యు నప్పొలఁతియఘము.

చ. అగు ననుమానమేమిటికి నమ్మదిరేకుణ దక్క నొండెడర్
మగువలు నీయుదారుసమానమనఃపరిపీడ నొందునన్
ట్లుగ నొనరింప శక్తలె త్రిలోచనదేవిప్రసాదసంపదల్
జగదభినంద్య లయ్యె సరసంబుగఁ బండె మదీయయత్నముల్.

వ. ఇప్పు డితనితోఁ సంభాషింప వలయు నవ్విధంబునకు ననురూపంబుగా వివిక్తంబు గావించెద నని తలంచి యన్నాతి నారదదత్తయైన విద్య నక్కడిజనంబు నెల్ల సమ్మోహితంబుఁ జేసి చేరంజని పొడసూపి నిలిచి విరచితాంజలియై యిట్లనియె.

సీ. బలిదైత్యపుత్రుండు బాణుండు నాఁగఁ బ్రఖ్యాతుఁ డాతనికి హిమాద్రికన్య
వరమునఁ బుట్టినయరిదికూఁతురు త్రిలోకైకసుందరి యుషయనుకుమారి
యప్పరమేశ్వరియానతి నిశ్చలనిద్రితయై యుండ నీవు దన్నుఁ
గలయంగఁ గలగని కామార్తయై తాల్మి గోల్పోయి నవ్వగ కొలఁదిమిగులఁ
జెఱిచి మఱచిన తెఱఁగునఁ జెయ్వులెల్ల, నెడలవిడిచి యున్నది బోటియేను జిత్ర
రేఖ యనుదాన నినుఁ బ్రియలీలసుముఖుఁ, జేసి తోడ్కొనిపోవ వచ్చితిఁ గుమార.

క. నాచెలికత్తియరూపం, బాచతురాననుఁడుఁ బోలఁ డభివర్ణింపన్
గోచరమే యస్మాదృశ, వాచోయుక్తులకునైన వలయుం దెలుపన్.

సీ. చందురునకు నంబుజంబులనెత్తావి యెల్లఁ గొఱఁత: జెంద కనఁగనేనిఁ
గోకంబులకుఁ బైఁడికుండలఁ గొఱలురూపంతయు నతముగా నబ్బెనేని
మదనుబాణముల కేణాలోకములకల్కితనము నిక్కంబుగాఁ బినరెనేనిఁ
బికభాషలకు విపంచికల మ్రోఁతకు భావ మఱలేక తోడ్పడి మెఱసెనేని
బాణనందనయాననప్రభకుఁ జన్నుఁ, దోయికాంతి కపాంగదీప్తులసరణికి
వాక్యభంగికి నెనయనవచ్చుఁగాక, యొక్కటిగఁ బోల్పనుపమాన మెందుఁ గలదు.

తే. ఏను మాబిడ్డఁ బొగడుట యెంతయేని, నైశికం బగు నచటికి వచ్చి చూచి
యెఱిఁగెదవు గాక యామాట లెల్ల నిప్పు, డిన్నియును బచరింపఁగ నేల యిచట.

క. ఆవెలఁదికి నీవును నీ, కావనజాననయుఁ దగుదు రన్యులు సరి లే
రీవిశ్వంబున మీకిది, దైవఘటన మపరిహార్యతరము కుమారా.

చ. అనువున నేను నిన్నెఱిఁగి యంచితచిత్రపటంబునందు నీ
యనుపమమూర్తిఁ వ్రాసి ప్రియమారఁగఁ జూపిన నేర్పుపెంపునన్.
దనువునఁ బ్రాణముల్ నిలిచెఁ దన్వికిఁ బల్వగు నీకు వల్లభన్
ఘనభుజదైనఁ గామహతఁ గాచుట పుణ్యము సర్వభంగులన్.

క. ఏనిదె మ్రొక్కెద మ్రొక్కెద, నానెచ్చెలిమ్రొక్కఁగా నెనయుకృపతో న
మ్మానిని బ్రతికించుటకుం, బూనుము తడవింక యోర్వఁ బోలదు సుమ్మీ.

వ. అనిన నతండు సంతసిల్లి యక్కాంత కభిముఖుండై.

తే. మెలఁత యేమని చెప్పుదు మీమృగాక్షి, గన్నకలయ యేనును గనియున్నచొప్పు
గానకున్నాఁడ వచ్చితి పూని నీవు, కాంత కలగన్నచోటికిఁ గంపఁగొనుచు.

ఉ. ఏవిదినంబులో రజనులెయ్యవియో విను నిద్ర యెట్టిదో
నేవుట యెప్పుడో యకట వెమ్ముమనంబున కద్ది మందొ యే
త్రోవలఁ బోయెనో తలఁపుతోడను చెయ్వు లెఱుంగ నేను నా
కీవెఱవేఁకి మాన్పఁ గమనేషణ యబ్బితి నీవు వెజ్జవై.

క. నను నీవు వేఁడుకొనియెదు, పని నిను నేనిప్పు డతిన ప్రార్థించెదఁ దో
డ్కొనిపొమ్మ చటికిఁ గొనిపో, యిన వచ్చెద మచ్చెకంటియిచ్చకు దొరయన్.

వ. అని యివ్విధంబున మనసు సెలసి పలికినయక్కుమారు నుత్కంఠాతిశయంబు
నకుం బ్రముదితయై యమ్ముగిత తదీయహస్తంబు నిజహస్తంబున నవలంబించి
యంతరిక్షంబున కెగసి యంతర్ధానంబై యిరువురయందును నిజవిద్యాప్రభా
వంబు దనరం గలిగించి నిమిషమాత్రంబున శోణితపురంబున కన్యాగేహంబున
కరిగి యందు.

సీ. వలవంతసంతాప మొలసియుఁ బెల్లాసచలిమిరిఁ దోఁష్టోన శమన మొందఁ
గోర్కులతమకంబు గొదరియుఁ దాలిమిపొందున నందందఁ గ్రిందువడఁగఁ
దలపోఁత తలఁకు వెగ్గల మయ్యు భావంబు నూటట పోరిఁబోరి నూరఁబోవఁ
దగులనునురివెట్టఁ దనికియు నలుకని తెలివిఁ బల్మఱుఁ గార్యదృష్టి నడఁగఁ
గామవికృతులు నైజంపుగౌరవమునఁ
బరిహరించుచుఁ దనరాక వార్చియున్న
యుషనుఁ బొడసూపెఁ బూర్ణచంద్రోపమానుఁ
డైనయమవీరుతోఁ గూడ నమ్మృగాక్షి.

### చిత్రరేఖ యనిరుద్ధునిఁ దోడ్కొనివచ్చి యుషాకన్యకతోఁ గూర్చుట.

వ. ఇట్లు చిత్రరేఖ దోడ్కొనితేర నరుగుదెంచి ముందట నావిర్భవించిన యని
రుద్ధు నక్కన్య యాలోకించిన నతండు నయ్యువిదం గనుంగొనియె నంత.

మ. ప్రమదోద్దామసుఖానుభూతి గలలోఁ బ్రాపించుట న్మున్న చి
త్తములం బ్రాపడియున్నయయ్యిరువురుం దద్వేళ వీక్షించుచోఁ
దమకం బారఁగ వింతగాక సమతం దార్కొన్నయాలోకముల్
గమియం బ్రాఁకెఁ బరస్పరాంగములపైఁ గౌతూహలోద్యద్గతిన్.

క. సెగ్గంబుల దెసఁ బోవక, సిగ్గులు గైకొనక మానసీమఁ జనక పే
రగ్గలిక నెండుమనసులు, డగ్గఱి చూపులబడి నుత్కటంబుగఁ గలసెన్.

తే. మనసులొండొంటిఁ దార్కొనుమానమునన, ఘర్మశ్రములుఁ బులకలుఁ గంపమునఁగ
నలరుభావంబు లుభయాత్మలందు బెరసి, వెలసె మోహాంధతిమిరంబు పేర్చి పొదువ.

వ. ఇత్తెఱంగున నొక్కింతసే పన్యోన్యావలోకనసంభ్రమంబున సాగసి.

క. తనిసి యిసుచూపు నుచితపుఁ, బనులకు నాసపడి క్రేళ్లువాఱఁగ బోటిం
గనుఁగొని యమాత్యనందన, యనిరుద్ధునిఁ జేరఁ దెచ్చి యనురాగమునన్.

క. పంతము చెల్లించితి నిదె, కాంతుం గైకొనుము శైలకన్యకకృప
నీకెంతయుఁ గలదేమియు నుడిఁ జింతిలవల దిమ్ము కేలుఁజిగు రితనికిన్.

వ. గాంధర్వవివాహంబు రాజులకుఁ బ్రశస్తంబు గాదె దేవీప్రసాదం బనుబుత్వి
జుండు గూర్పఁ గామాగ్నిసాక్షికం బగుకల్యాణంబు సమంజసం బగుఁగాక య
నిన నక్కన్యక నెచ్చెలిం గౌఁగిలించి నీవు సర్వమంగళారంభంబునకు నాచార్య
వు నీపనుపున బరమభద్రం బగుటకు సందియం బేమనియె నంత.

తే. చిత్రరేఖ యొసఁగఁ జిత్రమాల్యాంబరా, భరణశోభమానభవ్యమూర్తి
రాజసుతుఁడు దైత్యరాజకన్యకకర, గ్రహణమాచరించెఁ గరమువేడ్క.

ఉ. ఊఱటచెయ్వులం దివుట లూరఁగ దర్పము లొండొకంటికిన్
మాఱుకొనంగ ముగ్ధనిసమంజులసౌఖ్యరసంబునిక్కలం
దాఱుచుఁ గోరికల్ గొఱలి దాఁటులు వైవఁగ సోయగంబుపై
దేఱఁగఁ బ్రౌఢదంపతులతీరునఁ బెంపెసలారి రిద్దఱున్.

సీ. కలలోన నొండొరుఁ గలసినయప్పటియానందపూర్ణధన్యత్వములును
బెరసి యొండొరులపైఁ బ్రేముడి సలిపినసంతాపబహుళదశాంతరములు
నెమ్మినొండొరులకు నెచ్చెలికతమున నబ్బినయసమభాగ్యాతిశయముఁ
బ్రియుల నొండొరులకుఁ గీల్కొననొదవినయావనోచితకళావ్యాప్తివిధముఁ
జెన్ను మిగుల నొండొరులకుఁ జెప్పికొనుచు
నద్భుతంబులు భయములు నాదరములుఁ
గౌతుకంబులుఁ బొదలాడఁగాఁ బ్రియుండుఁ
బ్రియయుఁ గ్రోలిరి నూతన ప్రేమరసము.

క. వితతపరిరంభణంబులుఁ, జతురవచోరుచులు నపుడు సస్మితములుగా
నితరేతరరతి వారికిఁ, గతిపయదినములనె నెఱసెఁ గఱచతనంబుల్.
వ. అంత నయ్యుద్దఱసమాగమంబు నెఱింగి కన్యాంతఃపురంబు కావలివారు దైత్య
వల్లభుపాలికిం జని యవ్విధంబు విన్నవించినం గోపించి.
శా. నావిక్రాంతియుఁ బేరుఁ బెంపు మదిలోనం గాన కున్మార్గుఁడై
నాపై డక్కుట సొచ్చి నాప్రియసుత స్వంశైకభూషామణిన్
భావం బేదఁగ నెక్కుమర్త్యుఁడఁట దర్పం బేర్పడన్ దూషితం
గావించెన్ మది సైపఁగా వశమె యిక్కాలుష్య మెబ్భంగులన్.
క. అరుగుఁడు పొదువుఁడు పట్టుఁడు, పొరిగొనుఁ డాదుర్వినీతుఁ బోనీకుఁడు మ
త్పరిభవకారికి నజరా, మరదేహులు నైనఁ గలదె మనుగడ యెల్లన్.
వ. అని యనేకసహస్రసంఖ్యలం గలకింకరులం బనిచిన నయ్యసురు లసిశరాసన
ప్రాసపట్టిసప్రహరణపాణులై బాణజామాత యున్నయున్నతసౌధంబు చుట్టువా
ఱి బిట్టదల్చి యార్చిన.
క. ఉషకౌఁగిట నలరుచుఁ దా, నుషస్సు నిశి యని యెఱుంగ కుద్దామరసో
న్మిషితుఁడయి రేయుఁబవలును, సుషమలుగాఁ గ్రాలు రాజసూనుఁడు నెమ్మిన్.
వ. అమ్మహాకలకలం బాకర్ణించి తనకు నెగ్గుసేయ డగ్గఱుదానవులకట్టలుకగా నెఱింగి
కట్టాయితంబై సౌధగిరిగహ్వరంబు వెలువడి సింహాసమరేఖం బొలుపారి దారు
ణంబుగా నిల్చె నట్టియెడ.
సీ. కన్నియలకుఁ జేయఁ గానిచేఁతకుఁ జొచ్చి కులనాశ మొనరించి కులట నైతిఁ
ద్రైలోక్య నాథుండు తండ్రికిఁ బెడఁబాసి చెడితి నిం కెయ్యది, చేయుదాన
నటమీఁద నాకుఁగా నాఱడి వెలవెట్టరానిరత్నముఁబోని రాచపట్టి
యవధిఁబోయెడి జగదంబ యిచ్చినవరంబునకును నొకహాని పుట్టు నెక్కొ
భాగ్యదేవతలార యీబారిగడవఁ, బెట్టరే యంచుఁ జేతులు పిసికికొనుచుఁ
గన్నుసీరునించుచు నార్తకంఠి యైన, యాత్మవల్లభఁ గనుఁగొని యల్ల నగుచు.
వ. అక్కుమారవరుండు.
క. నాళ్లావుకొలఁది యెఱుఁగవు, బాలా తలఁకెదవు బాణపరివార మొకం
డేలా యేను జయింతును, ఫాలాక్షుఁడు ప్రమథవరులుఁ బన్నిరయేనిన్.
ఉ. సోరణగండ్ల సన్నిలిచి చూచుచునుండుము మద్భుజాయుగ
ప్రేరితముష్టినిర్దళదుదీర్ణవిరోధిశరీరముల్ నవ
ద్వారములందు వెల్వడునవారితశోణితధారలన్ నుఱేం
ద్రారిపురంబుపేరు నిజమై యొడఁగూడెడునట్లు సేయఁగాన్.

## అనిరుద్ధుఁడు బాణప్రేరితులై తన్నుఁ బట్టవచ్చిన రాక్షసకింకరులఁ బాఱఁదోలుట.

వ. అని పలికి యచ్చటికిం జేరువయై యున్న కన్యాంతఃపురద్వారపరిఘంబు గైకొని నిశుకతోండంబున నుద్దండం బగు వేదండంబు కదళీకాండంబుపైఁ గవియుచందంబున బృందారకరిపుబృందంబుపై నడచె నట్టియెడ నారదుండు చనుదెంచి చదలం నిలిచి యదువీరునుత్సాహంబు కుతూహలంబలరనాలోకించుచుండె నంత.

చ. తడఁబడ నమ్ము లేయుచు గదల్ నిగిడించుచుఁ గుంతసంతతిం
బొడువఁగఁ జూచుచున్ సురరిపుల్ మఱియు న్వివిధాయుధంబు లె
వ్వడువున నెవ్వి సేయనగు వానికి నయ్యనువు ల్ఘనర్చుచుం
గడఁగిన నగ్గలంపుఁగినుకం గనుఁగ్రేవలఁ గెంపు పెల్లొనఁగాన్.

తే. శౌరిమనుమఁడు తనచేతిదారుణంపు, పరిఘమున మాటిమాటికిఁ బనులు నూఱు
లవుల వే లనుసంఖ్యల సహితభటుల, నేచి నుఱుమాడుచును వచ్చె వైచివైచి.

చ. ఎడనెడ ముష్టిపాతముల యేపున వజ్రవిభిన్నశైలముల్
పడియెడుభంగి నూపెఁ బరిపంథుల నుద్ధతిఁ గాల్చికాల్చి యు
గ్గడు వగునెత్తురుల్ బహుళగైరికధారలఁ బోల నాఁటిమం
డుసుగకఁ గంచెపీచుచును నుబ్బున దబ్బర యాట లాడఁగన్.

వ. అట్లమ్మహావీరుపరుసఁదనంబునఁ దండడిం జచ్చియు నొచ్చియు విచ్చి కింకరులు సంకులంబుగాఁ దమయేలికపాలికి వచ్చినం గనుంగొని యయ్యసురపుంగవుండు.

మ. తగునే యింతటివారి కివ్విధమునన్ దైన్యంబు సౌజన్యముం
బగవానిం గడుఁ జెట్టనేసి చలము ల్వంతంబు లుత్సాహముల్
దెగిపో నాఱడిపోయి వచ్చితిరి మీతేజంబునం దొల్లి యీ
జగమే నోర్చితి నామనమ్మిక వృథాసంకల్ప మయ్యెం దుదిన్.

క. పోర నకటు ప్రాణముచవి, గూరి తగవు మఱతు రేనిఁ గులజులు ధీరుల్
శూరు లనుమాట యేటిది, పోరామికిఁగాదె ధైర్యముల్ శౌర్యంబుల్.

క. మరలుఁడు మీవెనుకన యిదె, కరిహయరథసుభటబహుళఘనసేనలతో
దొరలెల్ల నడచెదరు రిపుఁ, బొరిగొన కెట్లోర్వ గలుగుఁ బురుషుఁడు నైచున్.

వ. అని తనకుం జేయఁగలవారి నెల్లనుం బనిచినఁ దోలుకాఱునం గదలుతోలు మొగిళ్ల మొత్తంబు కరణిఁ గాలకాయు లగుదైతేయులు దెసలు నాకసంబునుం దారమై సతర్జనంబు లగుగర్జనంబులతో వివిధాయుధద్యుతులు విద్యుత్తులుగా నుద్యుక్తులయి శక్తిమర్ని వారుం డగుకుమారునిమీఁద నురవడించిన.

క. అంతంతఁ బగతురం గని, సంతసమున నెక్కుడసియుఁ జర్మముఁగొని దు
ర్దాంతగతి నడచెఁ దా మిసి, మింతుఁడు గా కతఁడు ప్రేయుసు మెచ్చు ధళిర్పన్.

క. దీప్తహుతాశనుఁ బొదివెడు, దృప్తశలభతతులఁ బోలె దితిజబలము ల
ప్రాప్తపరిభవుని నాహరి, నప్తఁ బొదివి రంత నుల్బణక్రౌర్యమునన్.

తే. తరతరంబ విద్వేషులు దారుణాస్త్ర, శస్త్రచయములఁ బొదువఁ దుషారపిహితుఁ
డైన రవిమాడ్కిఁ గొంతసేపతఁ డపుడు, రూపున ననిరుద్ధుఁ డయ్యు నిరుద్ధుఁ డయ్యె.

చ. అనువున నద్భుతంబు లగునాక్రమణంబుల వానినెల్ల ను
ద్ధనమున నాఁగియాఁగి సుదృఢం బగుఖడ్గముచేతఁ గొన్నితు
త్తునియలు సేయుచుం గినిసి దుర్దమవిభ్రమచపేటమై కడం
గిన హరిలీలఁ గూల్పఁ దొడఁగెం గరిసన్నిభదైత్యపుఙ్కులన్.

క. అనిరుద్ధుఁ డొక్కరుండ, య్యనిమిషరిపు లపరిమితసహస్రము లట్ల
య్యును డయ్యనిమగఁటిమి సడలఁ, డని సంపదఁ గన్నిరూపులై దీపించెన్.

క. కరికోటికి బిమ్మిటియై, హరిసమితికి గగ్గోలుఁడియై రథతతికిన్
సరిదన్ని తాపలయి త, త్కరవాలకరాళఘోరఘనతఁ బేర్చెన్.

సీ. తోరంపుటమ్ములతోడ నుగ్గునన నుగ్గడు వగుఘణఘణాత్కారములును
గింకిణ్యౌఘలయంగకంబులు పెక్కునగ్రము లగుచటచటాత్కారములును
శస్త్రభూషణసముచ్చయములు మెఱుపంగఁ గడలొత్తువలుదక్రేంకారములును
నాపాదమస్తకాహతి నయ్యెఁ దాఁకంగఁ దళుకొత్తుపటపటాత్కారములును
నెల్లదెసలును దారమైయొసఁగనల్ల, మెఱుఁగు లంబరాంతరమున మిక్కుటముగఁ
గ్రాలుప్రద్యుమ్నసుతుచేతివాలు దనరఁ, జూచె నారదముని తుంచె వీచివీచి.

క. వరుణునితో సంతకుతో, సురపతితో నడరితొల్లి చూపెమె యిమ్మైఁ
బరుసఁదన మెంపు లే దిది, యరుదని వెఱఁగొంది రాత్మ నసురప్రవరుల్.

వ. అట్టిఘోరసంప్రహారంబునం దలలు దెగియును గాలుగేలుదునిసియు మేను లవిసియు దంతజిహ్వాప్రముఖంబులు మురిసియు రూపుచెడి కొందఱు మడిసియు నెత్తురులు దొరఁగి కండ లురికి కనులు దిరిగి కొందఱు భ్రమసియు వెండ్రుకలు వీడ వలువలు సడలఁ గైదువు లెడలఁ గంపితకంటకితఘర్మంబు లగుగాత్రంబులతో నాక్రోశస్వరవిహ్వలు లగుచుఁ గాందిశీకులై కొందఱు దొలంగం గలంగి తొల్లి ధీరు లనం బెంపారువారును నైరణ విడిచి జడిసి సందడి నొండొరులం ద్రొక్కుచు నుక్కు దక్కి మరల దొరలును దురంగమాతంగశతాంగంబులతో భంగంబుల కోర్చి సైన్యంబులం బురికొల్పనేరక భయంబునం దిరిగి సురిఁగిపోవం గుమారుం డుబ్బి బొబ్బవెడిచి యార్చి యర్చిష్మంతుండు గ్రీష్మసమయతీవ్రుండై వెలుంగుపగిదిఁ గయ్యంపునేల యనునింగిం గైకొని వెలింగె నట్లు విజిగ్గి వఱతెంచినతనవారిం జూచి యవిశ్వాససంచలప్రాణుండై బాణుండు.

మ. అనిలోఁ జంపక కాచి పోవిడిచినం బ్రాణంబులం బట్టి యా
కనకక్ష్మాధర మెన్నఁడుం దిగుటకై కంసింతు రింద్రాదుల
య్యని నాచేతులఘాత కల్గు సదిసేయంజాల కిట్లున్న నె
ట్లును బోదయ్యెఁ గడంకమై వలసె నాటోపంబెదం గైకొనన్.

బాణాసురుఁడు సర్వసైన్యసమేతుండై యనిరుద్ధుమీఁద యుద్ధంబునకువచ్చుట.

వ. రథంబు దెమ్మన్ని పరిజనంబులంబనిచిసమస్తసమరసమారోగంబునుయోజించి.

సీ. వెలయంగ నాలుగువేల్లకిష్కువులవిస్తారంబు కల్గి యుదార మైన
గడితంపుఁ బలుఁగుతో లగ్పినసొప్పారుబలు తేరు వేయిమావులు వహింప
నెక్కి బర్హిధ్వజం బెత్తించి రక్తపతాక గ్రాలఁగఁ దనుత్రంబు దాల్చి
గదలు గార్ముకములు ఖడ్గముల్ శక్తులు మొదలైనయాయుధంబులు గ్రమమున
వెలుఁగ వేయిచేతులతోడ వేయికిరణ, ములఁ దనర్చువిభాకరుపోల్కి యమర
సమరుకుంభాండసారథి యై కడంగె, సుచిరకాంక్షితసంగరోత్సుకత వెలయ.

వ. సర్వసైన్యనాయకులును నిజస్వామిపూనిక కనురూపంబుగా నాటోపంబు దెచ్చుకొని యతనిముందటఁ గెలంకులను బింకంబులు మెఱవ నడచి రిట్లు నడచి బలిసూనుం డయ్యాదుసూను దవ్వులం గనియె నతండును బగతుబాహుసహస్రంబును బాణసంధానసామగ్రియు నగ్రేసరులయుగ్రతయుఁ జీరికిం గొనక యడిదంబు జళిపించి యొడ్డనంబున నిడుపును దాఁటుచు నెదురునడిచె నవ్వీరుం గాంచి కలుషించి.

చ. నరుఁడు విహీనసాధనుఁడు నాకెదురై లలిఁ ద్రుళ్లియాడఁ జె
ల్లదె యిటుచూడఁగాఁ దగునె లాఘవ మేర్పడఁ బట్టుఁ డుక్కునం
బొరిగొనుఁ డంచు యోధగణము న్బురికొల్పుచుఁ దాఁకి యేసె ని
బ్బరముగఁ బెక్కుబాణముల బాణుఁ డుషాసతిప్రాణవల్లభున్.

క. చంపుము నని మఱియును సై, రింపక తోమరగదాపరిఘశూలాదుల్
కంపితభువనుం డగుచు ని, లింపరిపుఁడు పఱపె నబ్బలియుపై నాజిన్.

శా. వానిం గైకొన కుగ్రచర్మచలనవ్యాఘాతము ల్సేయుచున్
నానాసైన్యము లడ్డమై తొడర నున్మత్తాకృతిం గూల్చుచు
న్మానోదగ్రుఁ డవార్యనిర్భరగతి న్ఖడ్గైకసాహాయ్యుఁడై
తా నద్దానవనాథుతేరు గదిసెం దద్బాంధవు ల్బెల్కుఱన్.

తే. కదిసి రథ్యము ల్వ్రేయింటఁ గడమవడక, యుండఁ జించి పెన్నెత్తుట నుర్వి ముంచి
యుగ్రుఁడై తనమీఁదనునుఱుకఁ దలఁచు, నతనిఁ గనుఁగొని సైపక యసురవిభుఁడు.

క. శరముద్గరకుంతగదా, పరిఘక్షురతోమరములు పైపై నెమువన్
బరపి తిరోహితుఁ జేసెను, విరోధి మఱి సెనని విబుధవిద్విషు లార్వన్.
వ. ఇవ్విధంబున ననిరుద్ధు నిరోధించి యయ్యంతరంబున నతండు దివ్యశక్తి యొ
క్కటి యతనిపయిం బ్రయోగించిన.
క. వినిమిదిఘంటలు మ్రోయఁగ, నినదీప్తులు మాయ నుల్క కెనయగుకరణిన్
జనుదెంచుచున్నతత్తా, ఘన మాస్మరిసుతుండు సూచి తలఁకనిబుద్ధిన్.
చ. వెరవునఁ బట్టి క్రమ్మఱఁగ విద్విషుమీఁదన బిట్టువైవఁ జే
రురముఁ బగిల్చి వీఁపున మహోగ్రగతి వెల్వడి యుర్విసొచ్చి డె
చ్చెర నది దైత్యభర్త గతచేతనుఁడై ధ్వజయష్టి యూఁతగా
నిరవట మ్రొగ్గఁ జూచి దొర లెల్లఁ గలంగిరి సమ్మసంబులన్.
వ. కుంభాండుం డొయ్యన నతనిం దేర్చి యిట్లనియె.
మ. పగవాఁ డల్పుఁడు గాఁడు సంగరవిధిం బల్పోకలంబోయినాఁ
డు గణింపం జెదిరిం దృణంబుగను నాటోపంబు దీపింప నీ
జగమెల్లం బయిఁబడ్డ నోర్పుఁ గపునిర్వంకాకృతిం జూచితే
తెగువం గ్రాలెడు వీనిశౌర్యము బలోద్రేకంబు నక్షోభ్యముల్.
శా. చేయం బోలినవెల్లఁ జేసితిమి దోర్వీర్యావిశేషోద్ధతుల్
మాయం జేగతి నెంచు వీని బలిమి న్మాయింపరా దేటికిన్
వేయు న్నిన్నును నన్నుఁ గాచుకొను ముద్వేగం బపేక్షించిసం
జేయుఁ లోక మితండు పీతదనుజశ్రీకంబుగా ద్రేల్చెడిన్.
క. అని పెగ్గడ దెలిపిన న, ద్దనుజేంద్రుఁడు దెలిసి యపుడు దర్పితునిమ్మో
ఘుని భుజగుఁబాముపుగరుడుం, డనఁ బాముపుఁ జూడుమనుచు నాశుగమతగన్.
వ. గంధర్వనగరంబుచాడ్పునఁ జూడంజూడ నదృశ్యదేహుండై.
క. తనుఁ గానక నలుదెసలన్, గనుఁగొనుప్రద్యుమ్నతనయుఁ గౌక్షేయకశే
లనదీప్తుదీప్తమధ్యం, దినదినకరతేజు నుగ్రతేజుం డగుచున్

బాణాసురుఁడు అనిరుద్ధుని నాగపాశబద్ధుని జేసి పఱచిపోయుట.

వ. కృష్ణోరగముఖంబు లగుశిలీముఖంబుల ముఖప్రముఖాఖిలాంగంబుల నావేష్టి
తుం జేసి త్రోచినం గదలనేరక యతండు మేఘవలయపరివృతం బగుమైనాక
పర్వతంబుపగిది నుండెఁ దాదృశం బగుతదీయదశాంతరంబు దశకంఠసుతవిశిఖ
వివశుం డగుదశరథనందనుచందంబు దలఁపించె నిట్లు నిమిషమాత్రంబున ననిమి
షేంద్రసమానుఁ నమ్మానఘను నవమానించి దానవేశ్వరుం డమాత్యునిం జూచి.
క. కుంభాండ దుష్టయావన, జృంభితుఁ డగుదాయ మనకుఁ జిక్కెఁ దనదురా
రంభమునకుఁ దగ నిపుడు ని, శుంభితుఁ డగుఁగాక వీఁడు సాలవక యుంకన్.

తే. వీనిచేత దూషిత మైనవినుతవృత్త, నీమ వెలయ దీక్షలు నిట్లు చేయకున్న
నన్నుడు నాతఁడు దేవర యానతిచ్చి, నట్ల యగు నైన నొకవాక్య మవధరింపు.

సీ. గాంధర్వవిధిఁ గోరి కన్నియ పెండ్లియైనవాఁ డితఁడు కార్యంబు గడచె
నీతని నొక్కట నెలయింప బాల నుత్కటశోకవహ్నిఁ ద్రోచుటయె కాదె
యెందుండి వచ్చెనో యెవ్వఁడో యప్పురు నెఱుఁగుటయును లెస్స యెల్లభంగిఁ
బ్రకృతిదుస్స్వభావుఁడుగాఁ డకలంకరూపవిక్రమముల నమరులకంటె మేటి
శీలవృత్తవయోబలశ్రీసమగ్ర, లీల సౌందర్యగుణముల మే లనంగఁ
దగినవాఁ డిమ్మహాత్ముఁ డీఫణిశిలోన, మాన్యుఁ డగు నెంచిచూడఁగ ధన్యుఁ డధిప.

మ. ఇరుగేలం గలయంగ దోర్ద్యుతము లై యేపారునిప్పొంటితో
దుర మేభంగి నొనర్తు నాక సరి నీతో రాసె నానాస్త్రని
ర్భరపీడం బడియుండియుం దనపరాభవాంగంబునం జొచ్చి క్రో
ధరసోగ్రంబుగ నిద్దెసం బఱవెనం దైత్యేంద్ర లక్షించితే.

ఉ. ఆతనియున్నరూ పరసితయ్య యవశ్యమునీకుఁ బుల్యరా
మాత యనంగ నీమహితసత్కృతి కర్హుఁ డనంగ నిప్పు నం
ప్రీతునిఁ జేయఁ జాలెదుగభీరగుణుం డన నుల్లసిల్లెడున్
నాతనిఁ బిచ్చగింపు మనిసం బ్రశంసించుక యియ్యకోలునన్.

వ. అక్కుమారునకుఁ దగినకావలి పెట్టి నిజభవనంబునకుం బోయె నంత.

క. చనుదెంచి నారదుండా, తనినాశ్వాసించి కంసదమనుని వేసఁ దో
డ్కొనివచ్చెద నీపుర్దశ, యనుచుఁ గటి కుగ్రభానుఁ డగునట్టులుగాన్.

వ. వీరజనసత్కార్యం బగుధైర్యంబు కలిమి యిట్టిపోట్లకుం గాదె కావున నీపరిపీ
డనంబు సైరించుట లెస్స యని చెప్పి యతం డరిగినఁ దనయున్న తెఱంగు చూ
చి యశ్రువిలులితలోచన యైనవల్లభతో ననిరుద్ధుండు.

చ. ఎమరెమరై పెనంగుటకు నేమియు నోర్వక మాయ పన్ని యీ
త్రిదశవిరోధి చేసినయుదీర్ణవికార మవశ్యభావియై
కదిరెఁ గడిందియై పరఁగుకాలము గెల్వ వశంబె యైన నా
పద దొలఁగింపఁగాఁ బరమబంధుఁడు శౌరి గలండు మానినీ.

మ. లయకాలోత్థపతంగబింబముక్రియన్ లాయున్ యదీయోగ్రని
ర్దయనిర్ముద్రసుదర్శనాఖ్యపటుచక్రం బిద్ధమై తేయసం
క్షయసంక్రీడకు నట్టిదేవుఁడు కృపాకళ్యాణుఁ డబ్జాక్షుఁ డ
క్షయుఁ డాత్మీయపరాభవం బెటులు నిచ్చన్ సైపఁగా నేర్చునే.

వ. నీవేలవగచెదవు ప్రాణభాగధేయంబున కిది యవసానం బగునుఁడు మని యయ్యంతిం గొంత యుపశమితశోకం జేసి.

క. ఆపదలకుఁ బరిహారణం, బై పూర్వులు నిశ్చయించి సట్టిమతము దు
ర్గాపదసంస్మరణమ యని, యాపరమేశ్వరిఁ దలంచి యంచితభక్తిన్.

వ. మహాముని ప్రకరపరికీలితం బైన వాక్యజాతంబున ననిరుద్ధుండు విద్ధాంతరంగుం డై యిట్లని స్తుతియించె.

ఉ. నందనికూర్మినందన యనంగ యశోదకృపాకరంబు నిం
డం దను నావహించి ప్రకటంబుగ విష్ణునితోడఁ బుట్టువై
సుందరి గోకులైకసవశోభనయై జనియించి యేజగ
ద్వందిత యొప్పె నాయసురదారుణి నాశమశక్తిఁ గొల్చెదన్.

తే. తనువులం జెల్ల నెలసి చేతన యనంగఁ
బ్రజయ యన మాయ యనఁగఁ బూరణి యనంగఁ
బరమ యన దాంత యన సుస్వాహారిపురంధ్రిఁ
బరమభద్రప దాయినిఁ బ్రస్తుతింతు.

సీ. చంద్రబింబాననఁ జానునేత్రత్రయశోభిని సురమునిస్తుతచరిత్రఁ
గాళిఁ గాత్యాయనిఁ గంసకాళ్కారిణి సహితభయంకర సభయదాత్రి
బ్రహ్మవాదినిఁ గామపాలిని సిద్ధసౌదామిని రేవతిఁ దారిణి సచల
యోగప్రదాయిని యోగిని గంధర్వి లక్ష్మి సరస్వతి లజ్జఁ గీర్తి
సకలతిథులఁ జతుర్థి షష్ఠిఁ బౌర్ణ, మాసిఁ బంచమి మహనీయమహిమ నంబ
ధ్రువఁ దపస్విని సావిత్రిఁ దుష్టి శాంతి, దైవమాత భక్తప్రియఁ దలఁతు భక్తి.

చ. ఇరువదియేడుతారలును నేఱులు దిక్కులుఁ దాన యైనయీ
శ్వరిఁ బరమాత్మికన్ మలయవాసిని వారుణి వింధ్యమేరుమం
దరగిరిమందిరోద్ధరణి ధారుణి సింహరథ స్వ్రపధ్వజన్
వరతరుణీలలామ ననవద్యవరప్రద నాశ్రయించెదన్.

తే. దుర్గ దుర్జయ దుర్దమ దుర్గ్రహ సతి, భద్రదర్శన శివ వజ్రపాణిభగిని
శబరి జీవనదాయిని శబరసైన్య, నాధనాయిక నాత్మ వర్ణన మొనర్తు.

క. కౌమారిఁ గామదాయిని, సోమరసాస్వాదలోల శుంభనిశుంభ
వ్యామర్దినిఁ బార్వతిఁ బృథుసామజకుంభస్తనిం బ్రసన్నఁ దలంతున్.

సీ. దేవపత్నులు సర్వదివిజకన్యలుఁ గాద్రవేయకుటుంబినీవితతి వారి
కన్నియ లప్సరోగణములు మునిభామినులు సిద్ధవిద్యాధరులవనితలు
మనుజపురంధ్రు లిట్లెనసినసుందరీసృష్టి యంతయును లక్షింప నంబ
నీవ యచింత్యవు నిత్యాప్రమేయప్రకృతివి త్రైలోక్యసంకీర్తనీయ

వెవ్వతవు నీవు నీవతన్నెఱుఁగు దెఱుఁగ, నెవ్వరికినైనశక్యంబె యెట్టిరూపొ
యెల్లవేళ్ళను నీవువే ళ్ళెల్లరూప, ములును నీరూపములు భవ్యభూతిలలిత.

చ. హరిహరపద్మగర్భతుహినాంశురవిగ్రహతారకాబ్ధిభూ
గిరిశరదగ్నివాయుముఖకీర్త్యసముజ్జ్వలమూర్తు లెల్ల నిం
పెసుమగఁ గీర్తనంబు గనునట్లు ముదంబునఁ బొంపు నిన్నుఁ
బ్రస్ఫురదురుకీర్తనం బ్రమదపూర్ణగఁ జేసెదఁ బుణ్యకీర్తనా.

క. పదునెనిమిదిభుజములతో, నొదవినహారమకుటాద్యనుత్తమభూషా
మృదులాంబరశోభిని నినుఁ, ద్రిదశేశ్వరిఁ దలఁచువారు దేవీ ధన్యుల్.

క. వరదాయిని మహిషాసుర, పరిమర్దిని వైదికాద్రిబ్రహ్మాణి శివసుం
దరి నారాయణి యచలే, శ్వరకన్యక యనఁగ నీదు సంజ్ఞలు తల్లీ.

క. ననుఁ జూడుము దుష్కృతు లె, ల్లను దొలఁగింపుము శుభోజ్జ్వలశ్రీయుతుఁగా
నొనరింపుము భవదాశ్రిత, జను లాపద్రహితు లనరె చదువుల నార్యుల్.

తే. కేలుమొగిచి మ్రొక్కెద నిదె కీర్తనంబు, లర్థిఁ జేసెదఁ దలఁచెద నర్చనంబు
లాత్మ నిచ్చెద నీకెక్కినట్టి వన్ని, చందములు భద్రములు గావె సర్వభద్ర.

కాళికాదేవి ప్రత్యక్షంబై యనిరుద్ధునిబంధనంబుదునిమి యాశ్వాసించుట.

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతించుచున్న యన్నరోత్తమునకుం బ్రసన్నయై దుర్ధమపరాక్రమ యగునద్దుర్గ తత్పురోభాగంబునఁ దనరూపు సూపి నిలిచి తదీయబంధనస్థానం బైనవజ్రమయపంజరంబు కరస్పర్శనంబున భంజించి నిగ్రహంబు మాన్చి యతనిం గనుంగొని

మ. ఘనబాణాసురబాహుమండల మనిన్ ఖండించి దండించి నే
నిమేఁ జక్రాయుధుఁ డార్తబంధుఁడు దయానిత్యుండు దైత్యాంతకుం
డనఘా మోక్షితుఁ జేసి తోడ్కొని చనున్ హర్షంబుతో నంతదాఁ
కను సైరింపు మొకింత దీన నొదవుం గళ్యాణ మేభంగులన్.

క. అని కరుణించి మహేశ్వరి, యనఘుఁ డతఁడు సూచుచుండ నంతర్ధానం
బునుబొందె నంత నెంతయు, ననిరుద్ధుఁడపోలె నుండె ననిరుద్ధుండున్.

క. ఆర్యాస్తోత్రంబిదివిధి, ధుర్యతఁ బఠియించుమరితదూరులు లక్ష్మీ
పర్యాప్తిఁ బరఁగి యెయ్యెడ, నార్యులు గొనియాడఁ గాంతు రతులసుఖంబుల్.

క. అనుదినమును నియతిమనం, బునదీని జపించుపుణ్యపురుషునకు జగ
జ్జనని కరుణ నెలకొనఁగా ననుగ్రహము సేసి మనుచు నతులప్రీతిన్.

క. అని వైశంపాయనముని, జనమేజయవిభున కెలమిఁ జక్రాయుధపౌ
త్రునిసౌభాగ్యము శౌర్యము, వినిపించినకథ ప్రశస్తవిస్తరఫణితిన్.

ఉ. సాధితసర్వధర్మ యవసాదితమర్జనకర్మ నిత్యస
త్త్వోదితశర్మ నీతిసముపార్జితభాసురభర్మ శాణసం
వేధితవైరిమర్మ దురుపేక్ష్యసముద్యమమర్మ వృత్తసం
శోధితపుణ్యజీవన యశోమయగాంగజలైకపావనా.

క. శ్రీమల్లచమూపతిసే, వామధురిమనిత్యసుముఖ వామవిచార
వ్యామూఢవిముఖ యర్చిత, వామార్ధాంగిపరతత్త్వ వాసవసత్త్వా.

మాలిని. అనతనృపతికాంతాహారహంసాపకారీ
ధ్వనితగురుధనుఃప్రోద్యాంతనారాచవృష్టీ
వినమదభిమతార్థావిష్క్రియాసాదదృష్టీ
జనితసుజనహర్షాసత్యనిత్యప్రకర్షా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధు
ర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతం బైనహరివంశంబున నుత్తరభాగంబునందు సప్తమాశ్వాసము.

---

## ఉత్తరభాగము- అష్టమాశ్వాసము.

క. శ్రీనందనసమసౌంద, ర్యానందితయువతిహృదయ యధికాభ్యుదయా
యానతజనహృద్యదయా, భూనుతజయశక్తిభీమ పోలయవేమా.

క. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు దేవీవచనసమాశ్వాసి
తుండై వాసుదేవతనయతనూభవుం డున్నంత నటమున్నె యక్కడ.

సీ. ఆచిత్రరేఖ మాయాచిత్రముఖమున నమ్మహాభుజుఁ బ్రణయముఁ గొనుచుఁ
బోవ నాతనియంతిపురముభామిను లెల్ల నాత్మేశుఁ బొడగాన కార్తి నొంది
ప్రియులఁ బాసినకిన్నరీసమూహముఁబోలె నాక్రందనము సేయ నవ్వేళఁ దుల
యులివు దివంబున నుద్విగ్నకురరీవిరావంబుక్రమమునఁ బ్రబలమగుచుఁ
బరఁగెనయ్యేడ్పులోనప్పడఁతులకట,యెవ్వఁడో కోమామనోనాధునినసమానుఁ
గడఁగి మాకన్ను లెల్లను గప్పి మమ్ము, ననవలుగఁజేసియెక్కడేఁగొనుచుఁబోయె.

చ. బలరిపుఁ డాదిగాఁ గలసుపర్వులు గర్వితదైత్యభీతులై
బలమఱి వచ్చి యేవిభునిబాహులనీడ యుపాశ్రయింతు ర
య్యలఘునిపౌత్రుఁ గొంచుఁ జనునంతటివాఁడును గల్గె నౌర తా
బలియుఁడో .భీతిదాయికినిఁ బ్రస్ఫుటభీతిదుఁడయ్యె నియ్యెడన్.

తే. పగఱబరి ద్రేవేసి యాఁగి దర్పంబుఁ జలముఁ
గోలుపుచ్చుమురారాతిక్రోధవహ్ని

యుఱక నిటు మండ నూఁదెడునుదుటు గలుగు
వాఁడు గుండియగలవాఁడు గాఁడె జగతి.

చ. తెలిచినమోరితో నొదవుతీవ్రవపుమ్మృత్యువుకోఁ జయాఁతగా
సఖులు గాదె మాధవున కప్రియ మిట్లొనరించు టింద్రుఁడుం
బలిపతిగాక పోఁగలఁడె బాహుమదంబున వాసుదేవు న
క్కట్టఁబడఁ జేసి రిట్టివిధి గానరుగాక దురాత్ము లేమియుః.

తే. పగలపెనుపిల్లిఁ బడితి మెవ్వలనఁ దేప, గాంతు మసురాంతకునికృపగాంచుచంద
మెద్ది పతిలేనియతివల్మయడటు జముని, యూటపట్టు దుర్దశలకు నాకరంబు.

వ. అనియి ట్లొనర్పువిలాపంబునకుం గలంగి యిది యేమి యెక్కడియార్తస్వరం
బనిరుద్ధగేహంబున నేమిభయంబు పుట్టెఁ గృష్ణసంరక్షితులకు భయంబుకలిమి
యపూర్వం బనుచు నెండొరుల కెఱింగించుచు యాదవు లెల్లను సంభ్రమం
బున ససహ్యకోపవిహ్వలంబులై గహ్వరంబులు వెలువడుసింహంబులుంబోలె
నెక్కటి నాత్మమందిరంబులు వెలువడి రంతటిలోనన సభాపాలప్రహతంబై
సంవర్తజలధరారావంబై భైరవం బై నసన్నాహభేరి చెలంగిన.

శ్రీకృష్ణబలరాము ప్రభృతులనిరుద్ధునిపోకనుఁ గారణంబూహించుట.

ఉ. ఆసభ కందఱుః హరిహలాంకులు మున్నుగ వచ్చి పుప్ప బా
ణాసనుపట్టిపోక తెలియ న్విని యుత్కటశోకబాష్పని
శ్వాసవివర్ణమూకవదనాంబురుహంబులతోడ విస్మయా
యాసితమూర్తులై గొలకకాలాంతర మున్నెడ వారిలోపలః.

వ. వికద్రుం డనుయదుముఖ్యుండు మురాంతకున కిట్లనియె.

మ. భవదీయోద్ధతబాహుపంజరమునం బర్యాప్తగుప్తంబు యా
దవవంశంబ యనంగనేల దివిషత్పాలుండు నాభిలశా
త్రవసంతాపశరణ్యుఁగా నిను మదిం దా నమ్మి యుండుం గదుః
భువనేశుండవు నీవు నీకుఁ దగునే పోరామితోఁ జింతిలః.

క. అనిరుద్ధునిఁ గానమికం, బును నీ విట్లుంగిఁ జింత డించుట గని నీ
యనుఁగులు వగచెద రిందఱ, ననునయవాక్యములఁ దేర్పు మనఘువిచారా.

వ. నీవు నీమనంబున నొక్కింత దెలిసి చూచినం దోఁపనితెరువులు లేవు కుమారు
పోకడ యూహించి తగినయుద్యోగంబు వాటింపు మూరకయుండుట తగదనిన
నీమదుల్లాసవిశదవదనుం డగుచు నంబుధిసదనుం డిట్లనియె.

క. పాపనిపోయినతెఱఁగే, నోపి యరసి చక్కఁబెట్టకున్నను జనులా
రోపింతురు నాపై నొక, యోపమి యటుగాన జింతనొందఁగ వలసెః.

తే. చిఱుతనాఁడె ప్రద్యుమ్నునిఁ గటకటసుర, గొనుచుఁబోయినయాపోక గనుటలేక
యేము వగవంగ రిపుఁ జంపి యెలమి నతఁడు, దానయే తెంచితటిగె మత్పరిభవంబు.

ఉ. ఈతనిచందమ్ముం దెలుప నిట్టిది యక్కట వైరు లుగ్రులై
నాతలపై సభస్మచరణం బిడిపోయిరి గాక యల్పమే
యింతెఱఁ గేమిసేయుదు సుదీర్ణబలంబున నీనికారముం
జేతోలఁగింతుఁ ద్రోప గనువెంటకుఁ జూపుఁడు మీ రుపాయముల్..

క. అనవుడు సాత్యకి దేవా, పనుపుము బహుజనుల నరియ బహుభూముల నెం
దును బహుభంగుల నరయఁగఁ, గనియెదము కుమారుఁ నరసి కాదే చేతల్.

వ. అనిన నుగ్రసేనుం డది యట్టిద యరయక యెఱుఁగవచ్చునె యిప్పటికి నాల
స్యం బేల యనుమాటకు మాధవుండు రథచారుల నశ్వచారులఁ బాదచారుల
నాపణంబ యనేకులం బిలిపించి రైవతంబు వేణువంతంబు లతావేష్టంబు ఋ
క్షవంతంబు ననుపర్వతంబులయందును వివిధోద్యానవనంబులయందును నదీప్ర
స్రవణవేశంతసరోవాపికాతీరంబులయందును నెమకుఁ డని యనిచె
నట్టియెడం దదీయసేనాపతి యగు ననాధృష్టి యొకని కిట్లనియె.

సీ. అధిప యెంతయుఁ గాల మాత్మలోఁ దలఁప యే నాకార్య మూహించుచుండి నీదు
మనసునొప్పెఱుఁగక మాటగా వెరలంగ నది విన్నవింపంగ నయితి నిప్పు
డవసరంబై యున్నయది కాన నాఁడెడఁ బనిలేక నల్పులపనికి నీవు
కడఁగి దానవులఁ బెక్కండ్రఁ ద్రుంచితి వారిపుత్రపౌత్రసహాయమిత్రవితతి
పాలఁ గలదు పారిజాతంబు గొనునెడఁ, దోడరె వృత్రభేదిఁ నొంచి తతఁడు
గొంత మనసునం దుఁగొఱకొఱ గాకున్న, యోట సైచునే మహాత్ముఁడంతు.

వ. నాకుం జూడ నీయపాయంబు వీరిలో నొక్కదెసం బొడమినది కాఁబోలు నని
రుద్ధహారణం బన్యులకుం బనియేమి విశేషించి యింద్రుండు దీనికిం గారణం
బగునని యూహించెద ననినం గృష్ణుండు నవ్వుచు నతనియాననం బాలోకించి.

చ. అసురులచేత నెట్టిడి సురాధిపు లక్కట దుష్టచిత్తులై
యసదృశవిక్రమంబున సురార్థము కాదె నిరంతరంబు నీ
వసుమతి నేఁ బ్రవర్తిలుట వారికి నింతయెఱుంగరే సురల్
పసగఁ బరోపకారులకుఁ బాప మొనర్తురె పుణ్యచేతనుల్.

వ. నీ వెఱుంగక యిట్లాడితి తనిన నక్రూరుండును దనసురూపంబుగాఁ, బలికెఁ గృ
ష్ణుండు పలికియును.'

క. వినుఁడు పురుషు లెవ్వారికిం, బనిగా దనిరుద్ధుచనినభంగి జలధినాఁ
జనునది యెవ్వతయేనియు, ననురక్తి నటించి కొనుచు నరుగఁగఁ బోలున్.

తే. దైత్యదానవదేవసుందరులు మాయ, లెన్నియేఁ జూపఁగా నేర్తు రెట్టివాని
నైనలోఁతు రెక్కడనైన నధికగుప్తిఁ, జొత్తు రరుగంగ వలఁతు లెచ్చోటికైన.

వ. కావున మన మవ్విధంపుజాడ లరయవలయు ననియె నట్టివిచారంబున నయ్యం
దఱు నున్నచోఁ గొన్నిదివసంబులకుం జారు లరుగుదెంచి సభాద్వారంబున య
దువీరవర్గంబు నెదుర నిలిచి వాసుదేవునకుం బ్రణమిల్లి దీనాననులగుచుఁ గరం
బులు మొగిచి.

క. దేవర యానతిచ్చిన, యావివిధస్థలములందు నన్యములందున్
వేవిధముల వెదకితి మె,చ్చో వీరుఁ గుమారుఁ గానఁ జొప్పడదయ్యెన్.

వ. ఇంక నెక్కడి కరుగుదు మెయ్యెడ రోయుదు మేమి యానతి యనిన నందఱు
శోకంబులు గలంగం గన్నీరు నినిచి యొండొరులమొగంబులు సూచి యెయ్య
ది కర్తవ్యం బని యెప్పటియట్ల భిన్నప్రకారవిచారులై యాదివసంబును రజని
యు నవ్విధంబునం గడచిన.

తే. భద్రతూర్యనాదంబులఁ బ్రకటసూత, మగధకీర్తనంబుల వందిమధురనుతుల
మేలుకని కృష్ణుఁ డుచితసమీహితక్రి, యాకలాపంబు దీర్చి సమానరమున.

వ. సభామండపంబునకుం జనుదెంచి యుగ్రసేనపూర్వకంబుగాఁ దగినతెఱంగున
సకలయాదవులు నాసీనులుగా నాసీనుండై యున్నసమయంబున.

నారదమహాముని శ్రీకృష్ణునికిననిరుద్ధునివృత్తాంతంబంతయు నెఱింగించిపోవుట.

క. ఉదయించినభానుఁడు గా, కుదయించెను కాక వేఱ యుష్ణకరుఁ డొకం
డిది యద్భుత మనఁగా నా, రదముని కట్టెదురఁ దోఁచె రాజితలీలన్.

వ. అమ్మహాత్మునిం గని కమలనయనుండు మున్నుగా నందఱు నభ్యుత్థితులై జయ
జయశబ్దంబులం బూజించిరి కృష్ణుండు మధుపర్కంబున నఖిలలోకార్చనీయు
నతని నర్చించె నతండు నర్హాపీఠంబున నుండి యందఱు నెప్పటియట్ల యుండం
బనిచి యిదియేమి యందఱుం జింతాకులవికలంబులైనయట్లున్నభావంబుల
తోఁ బౌరుషంబు దెస నుదాసీనులుం బోలె నున్నా రనిన నారాయణుం డత
నిం జూచి.

క. మునివర యనిరుద్ధుం డెటఁ, జనియెను యెఱుఁగంగ లేక సర్వదిశల నా
తని వెదకించియుఁ గానక, మనముల నెవ్వడర నిట్లు మఱిఁగెద మిచటన్.

వ. త్రైలోక్యజంఘాలుండ వగు నీ విచ్చటికి విచ్చేయుట మాభాగ్యంబు గాదె కు
మారునకు నింక నభ్యుదయంబ యనిన నవ్వుచు నవ్విబుధసంయమి యిట్లనియె.

క. కన్నులకసివోఁ జూచితి, నెన్నఁడు నెచ్చోటఁ బోరు లిట్టి వెఱుఁగ నో
యన్న భవత్పౌత్రుఁ డొకఁడ, యున్నతభుజు బాణుఁదొడరి యుక్కునఁ బెనఁగెన్.

వ. ఇట్లనిన బాణదైత్యునికూఁతు రైన యుషయనుకన్య యనిరుద్ధునిఁ గామించినం జిత్రరేఖ యనునచ్చర యచ్చెలువకై యిచ్చటికివచ్చి యతనిం దోడ్కొని పోయి యిరువురం గూర్చిన నెఱింగి బాణాసురుండు కుమారుపైకి నడిచినం బొడిచి యతం డతనికి మిక్కుటం బగుమగంటిమి మెఱయుటయు.

ఉ. లావున గెల్వలేక తనలావగుమాయ యొనర్చి సర్పరూ
పావిలఘోరబాణముల నాతనిఁ గట్టెఁ బురందరద్విషుం
డావిధ మెల్ల నేను దెలియం గని వచ్చితి నీకుఁ జెప్పఁగాఁ
జీవ మొలర్పలె మ్మఖిలజిష్ణు జయింపు బలీంద్రనందనున్.

వ. బాణనివాసం బగుశోణపురంబునఁ బ్రద్యుమ్నసూనుండు న్నవాఁ డది యిచ్చటికిఁ బదునొకండువేలయోజనంబులదవ్వుగలదు మానుషంబున నధిగమింప నశక్యంబు.

క. తలఁపుము వినతాసుతు న, బ్బలియుండు మనోజవుండు ప్రతిహతి లేదా
వ్వలన నతనిగతి కేటికి, నలఘుమతీ యింకఁ దడయ నని పలికె నగన్.

వ. నారదుం డరిగిన నాక్షణంబ పుండరీకాక్షుండు తార్క్ష్యుఁ దలంప నయ్యాకలుషితప్రభావు భావం బెఱింగి యొకకలమెఱుంగులు నలుంగలిగొనం జనుదెంచి భుజంగదమనుండు భుజంగశయను కట్టెదురం బ్రాంజలియై నిలిచి ప్రణతమస్తకుండై ప్రశస్తవర్ణస్వరమనోహరంబుగా నిట్లనియె

తే. అఖిలజగదుపకర్తవై యలరునీకుఁ, బిలిచి పనుఁ బంచి చేయింప వలయునట్టి
కార్య మెయ్యది యిత్తఱిఁ గలిగె నాన, తిచ్చి రక్షింపుమన్నింపు మింపుమిగుల.

సీ. పక్షవిక్షేపసంభవ మారుతంబునఁ దొడరి యెవ్వనిపేరు ధూళిఁబుత్తుఁ
గ్రోధరూక్షేక్షణక్షుభితాగ్నికీలలఁ జెనసి యెవ్వని బలశ్రేణిఁ గాల్తుఁ
జరణనిపాతన చటులఖేలనముల నెఱసి యెవ్వని వెఱచటువ నడుతు
దారుణత్రోటీవిదారణతీవ్రతఁ గడఁగి యెవ్వనియంగకములు రాల్తు
నేను నీబంటనై యుండ నెఱుఁగ నేర, కకట యెవ్వాఁడు నీకు నెగ్గాచరించె
మిగిలి మిన్నందిపెనఁగొను మేటి కైన, నాయువును శ్రీయు నెవ్వాని కవశమయ్యె.

మ. అనవద్యోన్నతమాంసలస్థిరమదీయస్కంధపీఠస్థితుం
నిను నెవ్వాఁ డనిలోనమార్కొని కనన్నిర్భిద్రచక్రానలంబున
కాత్మీయశరీరజీవితధనంబుల్ సాధుసాన్నాయ్యతా
వినియోగ్యంబులుగా నొనర్పఁ దలఁచెన్ విశ్వైకరక్షామణీ.

సీ. పాంచజన్యస్వనపారుష్య మెఱుఁగక యదుసేనముంగలియగుట గనక
కౌమోదకీఘోరఘాతంబు దలఁపక నందకగరిమ యెన్నంగఁ జొరక

శార్ఙ్గమౌర్వీఘోషచండత యూహింప కలముదివ్యాంబకకలన వినక
హలిసీరకర్షణవ్యాప్తి పాటింపక ముసలసంప్రహారణముఖ మరయక
నిన్ను నెవ్వఁడు చెనకి యన్నిరజాక్ష, సుతుని యింటికి నతిథిగాఁ జూచె నిప్పు
డింతయును నానతిమ్ము సర్వేశ సర్వ, భద్రకారి కృపాలాభ పద్మనాభ.

వ. అనినం బ్రసన్నహృదయుం డగుచు వాసుదేవుం డాపక్షిదేవున కిట్లనియె.

క. బలిసుతుఁడు బాణుఁ డనియెడు, బలియుం డిప్పు డనఘ వినవె ప్రద్యుమ్నసుతుం
గలుషవిహారగవాశం, బులఁ జుట్టినవాఁడు కూఁతుఁ బొందినకతనన్.

వ. బాణనగరంబు మర్త్యలోకచారులకుఁ జరింపరాని తెరువై దూరంబునం జేర నల
వి గానిదియునై యుండు నీవు మమ్ము నటఁ దోడ్కొని పోయితేనిఁ బగఱ
సాధింప సుకరంబు.

క. నీకోపలు కొఱుకుకున్నకె, శోకం బుడిగింపలేక సుడిసినయది య
స్తోకబలంబునఁ నమ్ముఁడ, నేకడగఁగవలయు బాలు విడిపించుటకున్.

చ. ఎఱికలఘూర్ణి పన్నగులయూతగణము ల్గబళించి చుట్టునుం
జుఱచుచుఁ గొప్పుమంటలవి సొంపుగ నార్చియుదగ్రయోధులన్
బఱిపఱిచేసి వేలుపులపాలిసుధాఘన మింపు దెచ్చి తే
చెఱ యుడిగించి తల్లికిఁ బ్రసిద్ధిగఁ జే పవె నీసుకృత్యముల్

క. ఆతతజవసత్వధృతి, ఖ్యాతుల నిక్కము గణింపఁగాఁ బఱివరా
నీతోడు నీసమానులు, భూతానుకలోన నెంచఁ బుట్టరుపుసుషుల్.

తే. అఖిలజీవజాతము పేఁపునంపుమోచి, కన్ను గిఱిపినంతన త్రిలోకములుఁ దిరుగ
నోపు దీప్తు, ఱెక్కలతోడ నుప్పొమేమి,ననఁగఁ డగుఁగాక నిన్ను నెండనఁగవశమె.

క. చెలికాఁడవు నాపైన, గ్గల మగుకూర్మియుఁ బ్రియంబుఁ గలఁవాఁడవు నా
కొలసినపోరామితటిం, దలకొని నీపేర్మి నుఱుపఁ దగదె మహాత్మా.

వ. అని యిట్లతండు తన్నుఁ బ్రశంసించుట కోర్వక విగతిగర్వుం డగువిహగసార్వ
భౌముండు భయవినయవినమ్రుండగుచునప్పరమేశ్వరుం దప్పక చూచి యిట్లనియె.

గరుత్మంతుఁడు శ్రీకృష్ణుని ననేకవిధంబుల స్తుతిచేయుట.

క. కమలగ్రోత్తలు నీ విటు నను, బడుగుం బాటించి మిన్నుప్రాఁకించెదు నీ
యడుగులగొనియాటకుఁ బని, వడుపనియాతనికి మున్ను పాడియె పొగడన్.

క. మున్నింటిభవదనుగ్రహ, మెన్నఁడు గన్నారు గలరె యెవ్వారలు నే
నెన్నిక కెక్కినధన్యుఁడ, వెన్నుఁడ నీమీఁదిభక్తివిభవముకతనన్.

సీ. నిగమనాయకుఁడవు నిఖిలసురాసురేశ్వరుఁడవు భక్తవాంఛాప్రదుఁడవు
సంతతామోఘదర్శనుఁడవు సకలయజ్ఞప్రవర్తకుఁడవు సత్వనిధివి

చతురాశ్రమప్రకాశితవు చతుర్దేహుఁడవు చతుర్బాహుమండలవిభాసి
వంచితశంఖచక్రాసిశరాసనధరుఁడ వనేకావతారకృతివి
దేవకీదేవికిని వసుదేవునకును, బుట్టివై పెన్నాఁ బాలపడువుఁ గాచి
కొండ గొడుగుగ ఘటియించి కోటిరక్కసుల వధించితి కేశికంసులు మొదలుగ.

క. హలముసలలాంఛనుఁడవై, బలనామము దాల్చి నీవు పటుదైత్యువిని
ర్దళనచణచండబాహుం, జ్వలత వెలింగెదవు సకలచక్షుష్కుఁడవై.

క. విప్రకులపూజకుండవు, విప్రప్రియుఁడవు సమస్తవిప్రాత్ముఁడవున్
విప్రప్రాణప్రదుఁడవు, విప్రత్రాణుఁడవు భజితవిప్రుఁడ వెందున్.

క. నీవుగత కాలమున ను, గ్రీవునిచెలివై సురారిఁ గిల్బిషకారిన్
రావణుఁ గూల్చి తదీయ, శ్రీవిభవము లనుజన్ముఁ జేర్చితి కరుణన్.

క. బలిరాజ్య మపహరించితి, జలనిధి ద్రచ్చితి ధాత్రిసర్వము క్రోడా
కలనమున నుద్ధరించితి, గొలిచితి శాసించితి లోకత్రయ మెర్మిన్.

తే. నేలయును నీవ నింగియునీవ దెసలు.గాలమును నీవ యగ్నియు గాడ్పు రవియుఁ
జంద్రుఁడును నీవ సృష్టియు సంహృతియును, నీవ కావింతు విశ్వంబు నీవ తాల్తు.

క. అజుఁడవు హిరణ్యగర్భుఁడ, వజరామరదేహుఁడవు మహాదేవుఁడవున్
విజితుఁడవు నిత్యజైత్ర, స్వజనుఁడవు జనార్దనుఁడవు జనివఁలముకున్.

క. పొగడుటలు నిన్న చేయం, బొగడెడువారలును నిన్న పొగడెడ రర్థిన్
బొగడెడువారికి నీవి, మ్ముగ రాజ్యస్వర్గమోక్షముల నిత్తు హరీ.

క. నీ వించుక క్రోధముతో నేవారలఁ జూతు వారి కేలోకములున్
లేవు భవత్కరుణోద్య, ద్భావితు లాబ్రహ్మభవనభాగ్యదగ్రుల్.

వ. అని వినుతించి గరుత్మంతుండు దేవా యేను నీతలంపులోనివాఁడ నెవ్విధంబు
నం బనిగొనఁ దలంచి తవ్విధంబున కెల్లను వశ్యుండ ననవద్యకర్తవ్యంబులయందు
నన్ను నిట్లాదరించుట మహాప్రసాదం బిదె యాయితంబై లి నెక్కు మెక్కడకు
విజయంచేసెద వక్కడనడిచెద ననిన నంతయు సంతసిల్లి శ్రీకాంతుం డమ్మహా
సత్వుం దిగిచి కౌఁగిలించి.

శ్రీకృష్ణుఁడు బలరామప్రద్యుమ్నులతోఁగూడి బాణునిఁ జయింపఁబోవుట.

సీ. అర్ఘ్యంబు దెప్పించి యతనితో జయహేతు విది నీవు గైకొను మింపు మిగుల
ననుటయు నవ్వీరుఁ డట్లచేయఁగ సర్వసన్నాహమును బూని చక్రధరుఁడు
యదువృద్ధు లెల్లఁ బ్రియంబున దీవింప విప్రులు జయవచోవితతి యొసఁగ
నర్థిఁ బుణ్యాంగన లక్షత లొలుకంగ వందిమాగధసూతవరులు పొగడ
జయవిధాయి తూర్యధ్వని సకలదిశలఁ, బరఁగఁ జేతఃప్రసాదసంభరితుఁ డగుచు
నెక్కెగరుడునిఁదోడనెయెక్కెరాముఁ, డెక్కెఁబ్రద్యుమ్నుఁడునుమోదమెసకమెసఁగ.

వ. అప్పుడు సిద్ధమార్గంబునఁ బ్రసిద్ధు లగుమునులును సురసిద్ధవిద్యాధరులును నొక్కట నెలుంగెత్తి.

క. గెలువు మసహాయుఁ డగునా, బలిసూనుని నీకు నెదురుపడలేరు జగం
బుల నెవ్వరు సిరియు జయముఁ, దెలివియు నీయందు నిత్యదీప్తము లనఘా.

వ. అనుచుండ వినుచుం బ్రమోదమేదురచిత్తుం డగుదామోదరుచిత్తం బెఱింగి మొత్తన వియత్తలంబున నెగసి వైనతేయుండు వైమానికమార్గంబు గైకొనియె నట్టియెడ నాచతుర్భుజుం డష్టభుజవైభవప్రాత్తుంగం బగుసంగంబు నంగీకరించుటయుఁ జక్రగదాఖడ్గబాణంబులు దక్షిణపాణితలంబుల మెఱసె శంఖపద్మచర్మశార్ఙ్గంబులు వామకరంబుల నలవరించెఁ గృష్ణతలంబును దీర్ఘోన్నతఘ్రాణంబును విశదవృత్తాయతేక్షణంబును దామ్రమాధరబింబంబును నాజానులంబిబాహుకంబును నారక్తపాలికంబును మధురస్నిగ్ధగంభీరఘోషంబునునై యయ్యాదిదేవు దివ్యరూపంబు రూపించువారికిం గన్నులపండువై సహస్రసూర్యోదయతీవ్రం బగుతేజంబునం బొదలె బలదేవుండును వేయుపడగలం బొలుచుమానికంబులు దిక్కులం గ్రొత్తయెండగాయ నిండుచందురుచాయం జెలువొందె చంద్రధరశైలంబుపోలికం దనరారుతనపురాణమూర్తిం గీర్తనీయుం డయ్యెఁ బ్రద్యుమ్నుం డును ననవద్యం బగుప్రాగ్రూపాకారంబున నమానుషమహిమోదారుండై యొప్పె నిట్టియమ్మువ్వుర నుద్వహించి.

మహాస్రగ్ధర. ఘనపక్షాక్షేపవాతోత్కటనిహతిఁ గులక్ష్మాధరంబుల్ నడంకం
దనుసంపాతోద్ధతిధ్వస్తము లయి దివిజోద్యానముల్ దవ్వుదవ్వై వ
చనఁ దీవ్రాంఘ్రిప్రసక్తిన్ జలధరచయ ముత్సంగముం బొంది తూలన్
జనియెం బక్షీంద్రుఁ డిచ్ఛానదృశగతుల నాచక్రహస్తుండు మెచ్చన్.

వ. ఇట్లు మనోమారుతవేగంబున సిద్ధసంచరితప్రదేశంబు లనేకంబులు గడచి యరుగుచుండ నొక్కయెడం గృష్ణుం జూచి బలభద్రుండు.

చ. మనతనుదీప్తు లన్నియును మాధవ పేర్కొనచంచమై కన
త్కనకసువర్ణతం దనరెఁ గాంచనశైలముఁ జేరఁజేర వ
చ్చిన నిటు లయ్యెనో కడువిచిత్రము కారణ మొండు గల్గునో
యనుపమబుద్ధి దీని నెఱుఁ గొనసి కర్జము చూడు మిత్తఱిన్.

వ. అనవుడు నతం డబ్బాణనగరసమీపంబు తద్రక్షణార్థంబు రుద్రాజ్ఞ నఖిలవహ్నులుం బరివేష్టించి యుండు నందులో నాహవనీయం బనువహ్ని మనకు నెదురై వచ్చెఁ దదీయద్యుతివలన నిట్టివికారం బొలసె నిమ్మహాగ్ని యధికదుర్జయంబు

వినతాసుతుండు దీనికిఁ బ్రతివిధానం బెఱుంగు ననిన నాతఁడు నంబ యప్పటి
వరుండు.

చ. వెడలుపుగ్గలునోళ్లు లొక్కవేయిధరించి వియన్నదీజలం
బడరఁగఁ బుక్కిలించి రయమారఁగఁ దెచ్చి మహానలంబుపై
నిడపడకుండఁ జల్ల నది యెంతొ వెసం బొడవేది పోయె న
ప్పుడు భుజగారి యద్భుతముఁ బొంది మదిం బెనుఁదాస్య మెచ్చుచున్.

మ. విపులజ్వాలలఁ గల్పసంక్షయమునన్ విశ్వంబు భస్మీకరిం
చి పటుస్ఫూర్తి వెలుంగునట్టిది మహాగ్నిశ్చండ మివ్వహ్నియి
ట్లుపఘాతం బయి పోయెఁ గృష్ణుడును సేనాంకుండుఁ బ్రద్యుమ్నుడుం
ద్రిపురారాతికి నైనసంకట పెఱువం దెల్పుం ద్రిలోకంబులున్.

వ. అని తలంచుచుండె నన్నరకాంతకుండును నాగాంతకునిద్రాంతికి నత్యంతంబును
సంతోషించి యతనిం బిచ్చలించె నవ్విధంబున నాహవనీయంబు ప్రశాంతం
బయిన తెలుపఁ బతిప్రభుండు భాసమానినిజపాతంబులం బ్రభూతం బగునా
తపంబు నుత్పాదించుచు నుత్పాతపతంగుభంగి నధికక్షణచమత్ప్రభాపరివేషం
బుతో నటఁ గడచిపోవ మఱియు నింద్రానుపత్నులైనయగ్నులు బ్రహ్మపుత్రు
లు గల్మాషుండును గుసుముండును దహనుండును శోషణుండును దపనుండు
ననువారేవురును బితరుండును బతంగుండును స్వర్ణుండును నాపుండును భ్రాజుం
డు ననునేవురును నెండుమొత్తంబులై నడచి.

క. ఈవచ్చువాఁడు గరుడుం, డావిరునివీఁపుమీఁద నెవ్వరో యుగ్రుల్
మూవురు వెలిఁగెద రేమిటి, కై వచ్చెదరో మహోద్ధతాకారధరుల్.

వ. మనము వీరలఁ బ్రతిహతులం జేయవలయు నని యెదిర్చి సింహగర్జితంబులం
బోని యెలుంగుల శోణపురప్రాసాదరంధ్రంబులం బరఁగించిన సమ్మహాధ్వని విని
బాణుం డవ్విధం బరయించి సర్వసైన్యంబుల సన్నద్ధంబులఁ గావించె నంత.

సీ. ఘనులు జ్యోతిష్టోముఁడును విభావసుఁడును వహ్ని లిద్దఱు నెండువలఁగలందుఁ
దనరుఁ దోర్దైరా నువగ్రతేజోమయం బగురథం బెక్కి క్రూరాయుధంబు
దాల్చి యంగిరసుఁడు ధనువు లోనగునస్త్రశస్త్రజాతము రథస్థంబు సేసి
సన్నుతస్వాహావషట్కృతివిభు లగునాదశాగ్నులును మురారితోడి
నాహవం బొనర్ప నచటికే తెంచి చాపంబు గొని యనేకబాణావితతిఁ
బఱపె నట్లు గూడఁబడినకృశానులఁ జూచి నగుచుఁ గంససూదనుండు.

క. ఓపావకులార మహాహో, ద్దీపితభవదీయతీవ్రతేజ మఖిలమున్
మాపెద మదస్త్రతేజో, వ్యాపృతి నెక్కింత నిలుపుఁ డాహవభూమిన్.

క. అంగిరసుఁడ నీకేటికి, సంగరము తపస్వివరులసవనము హుతముల్
మ్రింగినలావకట యిచటి, కింగోలయ్యెఁ దొలఁగు మెదిరి కెడయక నాచేన్.

వ. అనిన నయ్యంగిరసుండు గోపించి విల్లు విడిచి శూలంబుగొని దీనఁ గృష్ణుని ప్రాణంబులు గొందు ననుచుఁ బూన్చి వైచిన నది యద్దేవుండు నడుమన యర్ధచంద్రాంబకంబునం ద్రుంచి మఱియొక్కబాణంబు దొడిగి దృఢముక్తంబుగా వించిన.

తే. వెస నురంబు గాఁడి వీఁపున వెడలె న, య్యాశుగంబు నెత్తు రంగ మెల్లఁ
దొప్పఁదోఁగ మూర్ఛదొడరి రథంబుపై, ముచ్చముడిఁగి పడియె మునివరుండు

వ. ఇట్లంగిరసుండు వడినం దదీయసారథి రథంబు దోలంగం దోలెఁ దక్కినయగ్నులు భగ్నులై నలుదెసలం బానుంగుపడి యడంగి రట్టియెడ వారలు పాసిన వాసుదేవునకు నసురేంద్రపురంబు లోచనగోచరం బయ్యె నప్పుడు నారదుం డరుగుదెంచి యమ్మహాభాగుం గని.

ఉ. బాణునిపట్టణంబు మురభంజన చూచితె రుద్రుఁ డిందు రు
ద్రాణియుఁ దాను గ్రౌంచగిరిదారణపూర్వముగాఁగఁ
బ్రాణసంత్రాణఘృణిలీలఁ బ్రమదం బలరారఁగఁ బాయకుందు న
క్షీణభవత్సముద్యమము సిద్ధికిఁ జూడుము త్రోవఁ బొందుగాన్.

చ. అనవిని యల్ల నవ్వుచు బలానుజుఁ డాతనిఁ జూచి యేము నీ
పనికిఁ గడంగుదో హరుఁడు బల్విన సంకిలిగాఁగ నష్టపా
టునకుఁ దొడంగె నేసియుఁ గడుం బ్రియ మవ్విధ మూసినంత నే
యన తగుఁ గాక మాకుఁ దగునయ్య తొలంగుట కార్యహానిగన్.

వ. నీ వెక్కడఁబోయెద వింద యుండి చూచెదవు కాదె యనియెం దదనంతరంబ నిమేషమాత్రంబునం బురద్వారంబు చేరి యతండు పాంచజన్యంబు పూరించిన.

శ్రీకృష్ణబలరామ ప్రద్యుమ్నలు బాణసైన్యంబులం బాఱఁదోలుట.

మ. పరివర్తోద్గతమేఘగర్జితసమప్రారంభమై పేర్చుత
ద్గురుఘోషంబుసహింప కొక్కమొయిసంక్షోభించి బాణాగ్నికిం
కరసైన్యంబు లసంఖ్యము ల్గజతురంగస్యందనోగ్రంబుగా
నురలం ద్రోచె రథాంగపాణికెదురై యొండొంటఁ జండాకృతిన్.

క. ప్రమథగణమిశ్ర మగున, య్యమరారిబలంబు లట్టు లడరి ఖగేంద్రుం
గమలాక్షు బలుని మన్మథు, నమితాయుధసమితిఁ బొదివె నాశ్చర్యముగన్.

వ. అన్నలువురు నొక్కక్షణంబునం దదస్త్రక్షతులై బహుళక్షతజధారలం దొప్పఁ దోఁగి రప్పుడు బలదేవుండు.

క. వీరల కాతించుట యిటు, సైరించిన మనకు మీఁద సాగునె వేవే
వారించి నిగుడు మనుటయు, వారిజనాభుఁడు ప్రదీప్తవచనుం డగుచున్.

వ. ఆగ్నేయరాక్షసంబు లగుదివ్యాస్త్రంబులు ప్రయోగించి యమ్మహాసైన్యంబులఁ దెరల్చిన నవి మహాపవనవిధూతంబు లగుజీమూతంబుల తెఱంగునం గులిశవిధ్వస్తసన్నాహనంబు లగుశైలవ్యూహంబులవిధంబున వికలంబులై తొలఁగుటయుఁ బురంబులోను దఱియం జొచ్చె నప్పుడు.

ఉ. చేయఁగలుగుసైన్యనాయకు లెల్లను, బహురథధ్వపాశ్వప త్తితతులు
మొనలు సేసి వృష్ణిముఖ్యు మార్కొ నిరుగ్ర, యోధ్యభటనినాదదుస్సహముగ.

క. అమ్మోహాగములపెల్లును, సమ్ముఖమై వచ్చురిభసచండతయునుఁ దె
ల్లమ్ముగఁ గని బలదేవుఁడు, తమ్ముని కెఱిఁగించి బాహుదర్పం బెసఁగన్.

ఉ. సేనలఁ బెక్కుమోములుగఁ జేసి సముద్ధతిదోఁప నుగ్రులై
దానవు లేగుదెంచెదరు తక్కక యిత్తఱి శాక్తి ఁయుఁగో
నేనును గృష్ణ నీకునెకయించుక బాసట యాట లెస్స గా
దే నిజ మాహవేచ్ఛయు మదిం దళుకొత్తెడుమాకు నెంతయున్.

వ. దీనికి సమ్మతింపు మనిన నతం డేనును నట్ల తలంచితి మేలని దక్షిణపార్శ్వంబున నవ్వీరుండును వామభాగంబునం బ్రద్యుమ్నుండును నుండ నలవరించె నిట్లాయితంబై వైరివ్యూహంబులం దలపడి రట్టియెడ.

క. ఏవిధముచేత నైనం, దా వెరవయి మలఁగితిరుగుతార్క్ష్యునిపై న
మ్మావురుఁ బరాక్రమించుట, దేవారాతుల కసహ్యతీవ్రం బయ్యెన్.

వ. అప్పుడు.

మ. ప్రళయావాప్తి నశేషభూతచయముల్ భస్మీకరింప న్నము
జ్జ్వలుఁడై యాత్మవిలాసమంతయు నభివ్యక్తంబు గావించునం
కులసప్తార్చియుఁ బోలెఁ బేర్చెఁ గడు నుగ్రుండై నిజస్ఫూర్తి శ
త్రులకుం జూపఁ దొడంగుగాముని మహాదుర్దాంతరూపం బనిన్.

క. సీరమునఁ బట్టి తిగుచుచు, దారుణముసలమునఁ బటుగదాయష్టిం దు
ర్వారత బారిసమరుబలు, బారి గడవలేక మడిసెఁ బ్రతిభటబలముల్.

చ. కుసుమశరాసనుం డధికకోమలపుష్పము లేయు నాఁగ ము
న్నెసఁగినచుల్కపాటు మది నేమియు నోర్వఁగలేక యిప్డెయిన్
మసఁగె ననంగఁ గృష్ణునికుమారుఁడు గర్కశచాపముక్తదు
ష్ప్రసహశరావలిన్ రిపులప్రాణసమీరముఁ బీల్చె నుద్ధతిన్.

క. ప్రద్యుమ్నుబాణవిసరము, సద్యోజనితాంధకారసంతతుల సమ
స్తద్యోభూమ్యంతరములఁ, బ్రద్యోతనకిరణసంప్రవర్తనఁ బాపెన్.

స్రగ్ధర. జ్యానాదోదగ్రగర్జాచటులమయసముచ్చండచిత్రోరుచాప
శ్రీనిండారంగఁ దార్క్ష్యోర్జితచలదచలాసీనకృష్ణాభ్రభ ముద్భా
తానేకాస్త్రప్రతానం బశనిసమితిగా నాహవక్షోణివిద్వి
ట్సేనానాసేనాంగవృక్షోస్త్రుథనపరుషసన్నాహసంక్రీడఁ గ్రాలెన్.

మ. హరిబాణావళి మృత్యుదంతతతియ ట్లాశీవిషశ్రేణియ
ట్లురువేగంబున బ్రహ్మదండములయ ట్లొండొండ దుర్వారని
ష్ఠురలీలం బొదవంగ దానవు లొకింతన్ మాఱుసేయంగ లే
కరుదారం దెగటారి రిర్కకిరణవ్యస్తాంధకారాకృతిన్.

క. తెక్కల నడిచియు నఱిముఱి, ముక్కునఁ బొడిచియును నఖరములఁ జీరియు నే
దిక్కు హరి చూచెఁ దానా, దిక్కురిపులనెల్ల వైనతేయుఁడు నుఱిచెన్.

క. గరుడుఁడు బాణానీకముఁ, గొని గొనియెడుజాడ జమునిపోయెడుక్రీడా
సరణికరణి శవమయమై, యురు ప్రభయానకాద్భుతోద్ధతిఁ బెంచెన్.

వ. ఇట్లు నన్నలువురచేత హన్యమానంబగుదానవసైన్యంబు నిలువ నోర్వక నలువంకలం బఱచె నెఱచితోడి నెత్తురువెల్లువ పెల్లుగా బాణునగరినడిత్రోవం దొలఁకులాడం దొడంగె నట్లు గడంగి మాఱులేక యుద్రేకంబున వెలుంగుర థాంగధరుం గనుంగొని సైరింపక విజృంభించి.

ఉగ్రజ్వరంబు శ్రీకృష్ణునితో యుద్ధంబు చేసి పరాజయంబునొందుట.

ఆ. మూఁడుమస్తకములు ముమ్మూఁడుకన్నులు, మూఁడుకాళ్లు రెండుమూఁడుకేల్లు
గలమహాజ్వరంబు ప్రళయాగ్నియునుబోలె, నెదురుపడియె నార్పుపెలుఁగుతోడ.

వ. ఇట్లెదిర్చి వారల నుద్దేశించి.

క. లావునను గ్రొవ్వి యిచటికిఁ, జావఁగ వచ్చితిరి నావశంబునఁ బడినన్
బోవఁగవచ్చునె మెయిమెయి, దేవతలకు నింక మీకు దిక్కెవరుఁ జెపుఁడా.

వ. జ్వరనామధేయంబునఁ ద్రిలోకంబుల నెరియించునట్టినన్ను మున్నెఱుంగరేని నిప్పు డెఱింగెద రని యదల్చి హలాయుధుం బొడువ సమదసంవర్తజలధరనిర్ఘాతంబులంబోని పిడికిళ్లతనిపయింబూఁచి వైనతేయుగగనమండలభ్రమణవేగం బుల నవిసోఁకకున్నం గోపించి.

క. తనయాయుధ మగుభస్మం, బున వైచిన నది తదీయభుజమధ్యము బో
రనదాఁకి చెదరి దవ్వగఁ, జని మండుచు మేరునగము చఱియం బడియెన్.

వ. తత్పరిపాతవేగంబున నయ్యద్రితటంబు ద్రయ్యలై పడియె నట్టియుజ్జ్వలజ్వరస్ప ర్శనంబున వాసుదేవపూర్వజుండు.

చ. వివశత నొంది మేను నిడువెంద్రుకవెట్టఁగ వెక్కుమీఱి క
న్గవ దెఱవంగరాక పొరిఁ గంపమునొందుచు నిశ్వసించుచున్

దవిలి భ్రమంబుఁ జాడ్యమును దండడి చేతనఁ బాపఁగా భయ
ప్రవికలచిత్తుఁడై భుజగభంజనుఁ బేర్కొని గద్గదోక్తులన్

క. అనఘ సముద్దీప్తం బగు, ననలంబున నెరియుచున్నయవి గాత్రంబుల్
ననుఁ గావు మెవ్విధంబునఁ, గనువాఁడఁ బ్రశాంతి యిన్నికారంబునకున్.

తే. అనినఁ దలఁకకు మింతేలయకటయేను, గలుగ ననుచునవ్విభుఁడన్నఁ గౌఁగిలించెఁ
గృష్ణసంస్పర్శమునఁ బాసెఁ గిల్బిషంబు, బలుస కెప్పటికంటెను బల మెలర్చె.

వ. తదనంతరంబ జనార్దనుం డనాదరదృష్టి నయ్యుగ్రజ్వరంబు నాలోకించి.

క. జ్వరవర యే నుండఁగ నీ, కోరుఁ దొరఁగఁ దగునె రమ్ము యురణింపుము నీ
పరువెల్లఁ జూపు నాచేఁ, బోరి బ్రాయెడు తెఱఁగు నెయ్యఁ బొందెదు పదపన్.

వ. అని పలుకుటయు నమ్మహాజ్వరంబు ప్రచండజ్వాలాగర్భం బగుభస్మం బతనిపై
వైచిన నది యవ్వసుదేవపుత్త్రుఁ బ్రదీప్తగాత్రుం జేసి కొండొకసేపునకుఁ బ్ర
శాంతం బగుటయు విద్వేషి కలుషించి.

క. భుజగేంద్రభీషణము లగు, భుజముల హరి బోదివి పట్టి పొడిచెను గ్రీవా
భుజమధ్యంబులఁ గినుక, నజ మగుపటుముష్టి నతఁడు గడుకోపమునన్.

తే. తాను సందంనపిడికిళ్ల దానిఁ బొడిచెఁ, బోర నిరుపురముష్టిప్రహారవిధము
పెద్దకొండలపైఁ బడుపిడుగులట్లు, గడఁగి పరుసనిమ్రోఁత లగ్గలము సేసె.

చ. తడవుగఁ బోరి శాత్రవుని దండడి లోఁబడఁబట్టి బాహుబలం
గడునలియంగ నొత్తి మృతుఁగాఁ దలపోసి ధరిత్రిమీఁదఁబో
పడుమని వైచినం బడక పంకజనాభునిమేను సొచ్చె న
క్కడఁదివిరోధి యాత్మబలగర్వ మఖర్వముగాఁగ నుద్ధతిన్.

వ. అట్టి యుగ్రజ్వరావేశంబున వివశుండై విశ్వంభరుండు మున్ను పూర్వజుండు
పొందినసమవస్థం బొంది మహాబుద్ధిగావున సంతయు నెఱింగి తత్ప్రతిఘాతి యగు
నట్లుగా నను ప్రకృతి యనుజ్వరంబు నుత్పాదించిన.

క. హరిజనితజ్వర మాద్య, జ్వరముఁ దనంగంబుఁ బాయ వడిఁ దిగిచి బలం
బరుదుగఁ బ్రిదులఁగనీయక, మురారి కొప్పించుటయు సమ్మద్ధతి నతఁడున్.

వ. దానికడకాళ్లు పట్టి విసరి నూఱుపఱియలు సేయుతలంపున నుర్వీతలంబున బ్రే
యం బూఁచిన నది యార్తిశోడం గావవే యని యాక్రోశించుటయు నంతటి
లోనం గృష్ణకృష్ణ యుడుగుము జ్వరంబు రక్షణీయం బని యశరీరవాణి వీతేర
నతండు నట్లకాక యని విడిచె నదియును శరణాగతత్రాత యగునాజగద్విధాత
పదంబులు శిరంబు సోఁకఁ బ్రణామంబు సేసి.

క. జ్వర మనుపేర నొకండన, జ్వర మొం డెయ్యదియు లేదు జగముల నెందున్
వరద యది యట్ల చేయఁగఁ, గరుణింపుము పారమేదఁ గావుము నన్నున్.

వ. అని యనేకవిధంబులం బ్రస్తుతించినం బ్రసన్నుండై వాసుదేవుండు నీకోరినయట్ల వరం బిచ్చితి నాచేత నిర్మితం బైనద్వితీయజ్వరంబు నాయందు లీనం బగు నీవును మనుష్యస్థావరతిర్యక్కులయందు నీతేజంబు మూఁడు భాగంబులు గా వించి మత్ప్రసాదంబున నుదీర్ణుండవై చరింపు మనినఁ బ్రియంబు నొంది జ్వరంబు మఱియుం బ్రణమిల్లి.

చ. అసురకులప్రమాథి యగునాత్రిపురాంతకుసేర్మిఁ దొల్లి యిం
పెసఁగ సృజింపఁగాఁ బడితి నేనఖిలంబున మర్జయుండ నీ
యసదృశశక్తిచే జితుఁడ నై పరిరక్షణ మిష్టుగాంచి నీ
వశమునఁ జిక్కితిం బను లవశ్యము చేసెదఁ బంపు మచ్యుతా.

క. అనవుడు యమభర్త ప్రియం, బునఁ గనుఁగొని నాదుపనుపు పొనరింప మనంబున నీకు వేడ్క గలిగిన, విను చెప్పెద నొకతెఱంగు విస్పష్టముగాన్.

ఉ. ఏనును నీవుఁ గయ్యమున నిట్లు పెనంగినవిక్రమక్రియా
నూనవిధంబు లెవ్వరు సముద్గతభక్తిఁ బఠింతు రర్థిమై
వీనుల వింతు రట్టిసుపవిత్రులకున్ వివిధామయజ్వర
గ్లానిభయంబు పొందక సుఖం బగునట్లుగఁ జేయు మెప్పుడున్.

క. నావిని యియ్యకొని జ్వరం, బావిష్ణుఁడు వీడుకొలుప నాహవమహికిన్
వేవేగఁ దొలఁగె బలుఁడును, గోవిందునిసుతుఁడుఁ బ్రీతిఁ గొరలిరి బుద్ధిన్.

వ. అమ్మువ్వురు మూఁడగ్నులుంబోలె బ్రజ్వరిల్లి వైనతేయపవనవేగంబున దైతేయసేనాసహస్రంబు లనుకాననంబు లాక్రమించి చక్రగదాముసలశరపాతంబులు ప్రచండజ్వాలాపాతంబులుగాఁ బ్రేల్ప నుపక్రమింప నవ్విక్రమంబునకు వెఱచి దానవు లెవ్వరు నెదురై నిలువక కనుకనిం బఱచినం గని బాణుం డెలుంగెత్తి దొరల నుద్దేశించి.

శా. శౌర్యోదగ్రత దానవాన్వయమునన్ జన్మించి గాంభీర్యముం
గార్యంబుం జెడకుండఁ గాచుచుఁ గనత్ఖడ్గత్రిశూలాద్యసం
హార్యానేకవిధాస్త్రశస్త్రకళలం దారూఢులైనా రనిన్
ధైర్యం బిమ్మెయిఁ బోవఁబెట్టఁగఁగటా ధర్మంబె మీరాబోంట్లకున్.

తే. మానఘనుఁడ నేనున్నాఁడ మంత్రివరుఁడు, వీఁడె కుంభాండుఁ డున్నాఁడు వీరవరులు ప్రమథు లున్నారు మీ రేల భయము నొంది, యిట్టులైతిరి విద్వేషు లెంతవారు.

వ. వలదు నిలువుండు నన్ను నెక్కింత చూడుం డనుచుండ నిలువక ప్రమథగణశేషంబుగా నశేషబలాధ్యక్షులుం దమతమబలంబులతోఁ బలాయనంబ పనిగాఁ బాటించిరి బాణమంత్రియుం బ్రభువాక్యంబులకు ననురూపంబు లగునాలాపంబుల సైన్యవరులం బేర్కొని.

మహాస్రగ్ధర. శరణార్థిత్రాణవిద్యాచణుఁడు త్రిణయనస్వామి యస్మత్కుటుంబో
ద్ధరణవ్యాపారనిత్యాదరమున నిచటం దాను పాణ్యాతురుండుం
గరుణాసాన్నిధ్యలీలం గయికొని వెలుఁగంగా సహాయంబు బాణుం
బోరయింప న్సక్తుఁడే యేపురుషుఁడు వెఱుపుం బొంద నిల్లేల మీకున్.

క. నిలుఁ డవి నిలుపఁగ నెవ్వఁడు, నిలువర హరిచేత వెలుఁగునిష్ఠురధారా
కలితఘనచక్రదీప్తులు, దలఁకించక ముసేయుచుండ దానవయోధుల్.

వ. ఆసమయంబున.

సీ. తనప్రియభక్తుఁడౌ దైత్యేశ్వరునకు నాభంగిఁ బాటిలినయాపద మనమున
సైరింపనేరక శంభుండు సంరంభ మొదవఁ గయ్యమునకు నుత్సహించి
యతులితసింహసహస్రయుక్తంబును నున్నతవృషభకేతూజ్జ్వలంబుఁ
బ్రకటనందీశసారథికంబుఁ బృథులరత్నప్రభాపటలదీప్తంబు నైన
రథము మేఘవినిర్ముక్తరవిసమూహ, కరిన దీప్తి నువ్వార శీఘ్రుంబ యెక్కి
గుహుఁడునిజవాహనస్థుఁడై కొలువఁగ భువన, విలయకృతికినై కడఁగెడువిధము దోఁప.

వ. గరుడధ్వజుచెను దెంచు దెసకు రభసంబుగా నడచ నద్దేవుముందటం బెఱుందను
బార్శ్వంబుల ననేకవిధవికృతవక్త్రులు ననంఖ్యబాహుచరణనేత్రులు నాభీల
వ్యాళయజ్ఞోపవీతులు నతివిశాలసింహశార్దూలచర్మవసనులు నాసక్తమణిమనో
జ్ఞమకుటకుండలాదివిభూషితులు నభిరామగంధమాల్యాంబరాలంకృతులు నా
కలితవివిధాయుధప్రదీప్తులు నతిరౌద్రసౌమ్యసమ్యక్సత్వభావులు నప్రమేయ ప్ర
భావులు నతులితాష్టైశ్వర్యధుర్యులు నగుప్రమథపీసులు వెరింగిరి బాణసైన్యం
బును దొరలుమున్నుగాఁ గ్రమ్మఱం గడంగి యమ్మహాదేవుం బరివేష్టించి నవ్వి
ధంబున నురవడించునుగ్రు సంతంతం గని.

స్రగ్ధర. క్షేపిష్ఠప్రేష్ఠతార్క్ష్యోత్థితరుచిపసరత్తిక్ష్ణసప్తాశ్వదీప్తి
వ్యాపారుండుం బ్రగాఢవ్యవసితధనురుద్ధ్వాంతమౌర్వీవిరావ
వ్యాపృత్యుద్ధత్యఖండవ్యథితభువనుఁడున్ వర్ధితోద్వృత్తచక్ర
శ్రీపర్యాప్తిప్రభావోర్జితుఁడు నగుచు లక్ష్మీవిభుం డుగ్రలీలన్.

వ. సమరసమ్ముఖుం డయ్యె నయ్యవసరంబున రుద్రదామోదరద్వయవ్యతికరంబు
నకుం దలంకి ధరణివడంకెఁ బర్వతంబులు గ్రుంగె నుత్తుంగశృంగంబు లురిలిప
డియె దిక్కుల నాకసంబునఁ బెనుమంట లొదవె నుల్కానిర్ఘాతపాతంబులు
శివాగావంబులునిర్మేఘగర్జానినాదంబులుం బ్రవర్తిల్లె మారుతంబడంగెఁ బతం
గప్రభలు మాసె వైహాయసవిమానంబులు విపర్యస్తగతిం జరించె విరించి
మొదలుగా సకలత్రిదశులు నశేషమునులును సమస్తదేవయోనులుం జనుదెం

చి సభయంబుగా దివంబున నిలిచి చట్టితులపాటున దవ్వుదవ్వుల శర్వుండు శౌరి మీఁద శరశతకం బేయుటయు నారాయణుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన.

క. ఆయస్త్రమువలన మహా, సాయకములు శతసహస్రసంఖ్యంబులు వే వేయుప్పతిల్లి పొదివెఁ, దైన్యంబక మగురథంబుఁ దగ్రసూర్యాభ్రీతిఁ.

చ. అలిగి పురాంతకుండు దహనాంబక మేసిన నెల్ల దిక్కులు న్వెలుఁగఁ గృశానుకీలములు విష్ణుశరానలి ప్రుంగి యాతనిం బలునిఁ బ్రయానసాయసునిఁ బక్షివరేణ్యునిఁ జుట్టుముట్టినం బొలిసిరి వైరులం చసురపుంగవులార్చిరి పేర్చి యుబ్బునన్.

క. మురరిపుఁడు గినుక వారుణ, శరము ప్రయోగింపఁ దపన శాంతం బయ్యెన్ హరుబాణము బాణాసురు, పరివారంబునకు విస్మయంబాటు దలిర్పన్.

వ. భర్గుండు మఱియును పైశాచరాక్షసరౌద్రాంగిరసంబు లనునస్త్రంబులు ప్రయుక్తంబులు గావింప గోవిందుండును వాయవ్యసావిత్రవాసవమోహనసంజ్ఞంబు లగుమార్గణంబులవలన వరుస నన్నాలుగింటి నడంచి వైష్ణవాస్త్రం బభిమంత్రితంబు సేసి యేసిన.

తే. తలఁకి సురసిద్ధసాధ్యగంధర్వు లాది, గాఁగ దివి నుండ నోపక కలఁగఁబడిరి బాణబలములుఁ గ్రమ్మఱ భయము నొంది, చెదరెఁగనుకనిభూతంబులదరె నాత్మ.

వ. అమ్మహాస్త్రంబు చనుదెంచుక్రమంబునకు బుద్ధిపుండును బ్రతికారం బెఱుంగక యొక్కింత విచారవివశుం డయ్యె నాలోన నాఖిలజ్వాలాకరాళంబై యది యద్దేవుతేరు సరథ్యసారథికంబుగాఁ గొదివి ప్రజ్వరిల్లె నంత నంతయు నెఱింగి యతిత్వరితంబుగ బాణుండు సమరంబునకు నిశ్చయించి బ్రాహ్మణోత్తములకు నమస్కరించి వారిఁ గావించుశుభస్వస్త్యయనంబులును సిద్ధమంత్రౌషధసంభావనంబులుఁ గని యుద్దీపితుండై గోభూహిరణ్యాదానంబు లనేకంబు లొసర్చి దివ్యం బగురథం బెక్కి మహారథులు పరివేష్టింప నరుగుదెంచి మహాదేవస్యందనంబు చేరువ నిలిచి నట్టిసమయంబున.

ఉ. వైష్ణవబాణపావకనివారణభంగికి నెుండుమైసలం భూష్ణుత సంభవింపమిఁ బ్రభుండు పురత్రయదాహుఁ డుద్యతా ధృష్ణు వసంగఁ బేర్చినప్రదీప్తతరాంబకమున్ యుగాంతకాలోష్ణకరాభముం బటుబలోద్ధతిఁ గైకొని క్రోధచండుఁడై.

వ. కార్ముకంబున సంధింప నుద్యుక్తుం డగుటయు నెఱింగి వాసుదేవుం డమ్మహాదేవు న యుద్యోగంబువలనం బాపుటకు వెరవు గనుంగొని.

ఉ. జృంభకబాణముల్ భుజవిజృంభణ మొప్పఁగ నేసె నేసినన్
శంభున కావులింతలును జాడ్యము, నిద్రయుఁ బొంద శౌర్యసం
రంభము మాని విల్లును శరంబును జేసడలంగ దేహసం
స్తంభము గాఢ మయ్యెఁ బ్రమథప్రవరుల్ వెఱఁగంది చూడఁగన్.

శివుఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబుసేయక తొలంగిపోవుట.

వ. బాణాసురుం డొయ్యన నద్దేవుం గదిసి ప్రబోధించిన నెక్కొంత దెలిసి యప్పర
మేశ్వరుండు యోగదృష్టి నాలోకించి యాలోకస్థితికర్తకుం దానొసంగిన వరం
బును నతనికిం దొల్లి ద్వారావతీపురంబునఁ బ్రత్యక్షంబై మేలొనర్చి యాడిన
మాటయుం దలంచి యుత్తరం బెయ్యదియుం బలుకక యేమియుం జేయక
యూరకుండె నట్లున్న యాఖండపరశుం గనుంగొని.

తే. పాంచజన్యఘోషంబునఁ బదిదెసలును, నినిచె గోవిందుఁ డదియెల్లఁగనిసహింప
కడరి ప్రమథవీరావలి యచ్యుతాత్మ, జన్ముఁ బొదివె ననేకాస్త్రశస్త్రతతుల.

వ. దానవులును బ్రసిద్ధం బగుమాయాయుద్ధంబున నతనిం జిక్కుపఱుపం దొడం
గినం గినుక నమ్మకరకేతనుండు చేతనాస్తంభన యగుసమ్మోహనవిద్య నయ్యం
దఱుం గొంతవడి నిద్రాసక్తులం గావించి యసురులం బెక్కండ్ర నెక్కట విగ
తాసులం జేసె నంత.

క. అందంద నావులింపఁగ, నిందుధరునివదనమున ననేకాగ్నిశిఖా
సందోహంబులు వెలువడి, క్రందుగ దశదిశలుఁ బొదివి కాల్పఁగఁ దొడఁగెన్.

వ. అట్టిదారుణత్వంబునకు నఖిలభూతంబులు భీతిభ్రాంతంబు లయ్యె భూదేవి తల్ల
డిల్లి పితామహుపాలికిం బోయి దేవా మహాదేవవాసుదేవసంగరభరం బోర్వ
లేక దిగంబడియెడి కొలఁదికి వచ్చె నకాలప్రళయంబునం జరాచరంబులుం బొ
లియు నేకార్ణవంబును నయ్యెడు నింతియ యింతకు మిక్కిలి విన్నవింప నేర న
ఖిలవిధాతవు నీవ యెఱుంగు దనినం జతురాననుండు.

తే. ఒకముహూర్తంబు సైరింపుము విదనీకుఁ, జులుకనగుసట్లు నేసెదఁదలఁకు మాను
మనుచు గ్రమ్మఁజను దెంచియభవుఁగాంచి, మ్రొక్కి భక్తిభావంబున మ్రోలనిలిచి.

వ. ఇట్లని విన్నపంబు సేసె.

చ. అనుకూలవశ్యవధ్యు లని యాదిన కాదె మహేశ యేను ద
ద్వ్యసనము నిర్ణయించితి భవత్కృప యేటికి నిట్లు వీరిపై
నెసఁగెడుఁ గృష్ణుతోడఁ దగునే పెనఁగంగ నొకింత బుద్ధిలోఁ
బసరిడి చూడు మాహరియు భర్గుఁడు నా నొకఁడో విభిన్నులో.

క. నీవ నిను నెఱుఁగకుండిన, నేవారికిఁ దెలుపవచ్చు నిట సకలజ్ఞో
భావహమగు నీయుగ్రపు, భావమునకుఁ జాల వేఁగుపడినవి జగముల్.

వ. ప్రసన్నుండ వగు మనినఁ బరమేశ్వరుం డాజగత్పితామహుం జూచి నీచెప్పినట్ల
సేసెదఁ గయ్యంబు మానితి ననియె నప్పుడు కృష్ణుండును గదియ నరుగుదేర
నాహరియు హరుండు నెండొరులం గౌఁగిలించుకొని పరస్పరోపలాలనపరులై
రనంతరంబ పురాంతకుం డచ్చోటువాసి యుండెడకుం జనియెఁ జతుర్ముఖుండును
మార్కండేయాదిమునిప్రణీతంబు లగుశంకరనారాయణైక్యంబు లగువాక్యం
బులు నాగ్న లగుసిద్ధులు ప్రశంసింప వినుచు నిజలోకంబున కరిగె నంత.

## కుమారస్వామి శ్రీకృష్ణబలరామప్రద్యుమ్నులతో యుద్ధంబుచేయుట.

క. హరుఁ డరుగుఁగాక యసురే, శ్వరరక్షణ మింకఁ దొలఁగవచ్చునె నాకున్
హరి నెడుతుఁ బొడుతుమగఁటిమి, యరుదుగ ననికార్తికేయుఁ డనికిం గడఁగెన్.

వ. ఇట్లు కుంభాండప్రహితం బగురథంబుతోడ నడరి యతండు.

ఉ. దానవకోటి యుబ్బ వినతాసుతు మేనును కృష్ణు మేను ద
త్సానుని మేను ముష్టికనిషూదను మేనును వాలురంపపెన్
సోనల ముంచి సాంద్రతరశోణితధారలు ధాత్రి నించినం
దా నొకచేతకున్ సమనధానము లేక మురారి ధీరతన్.

వ. ఒక్కింత సైరించి శార్ఙ్గనిర్ముక్తశరంబు లాశరజన్ముపై నిగిడింప రౌహిణేయ
రౌక్మిణేయులును సాయకసహస్రంబులం బరఁగించి రమ్మువ్వురు మూఁడగ్నుల
తెఱంగున మహాతేజంబు నూపి మహాసేనుతేజంబు మట్టుపడం జేర్చినం గోపించి
కుమారుండు.

చ. జగముల నేర్చునాటిరవిచాడ్పున దుస్సహదీప్తిచండమై
నెగడి సమస్తశాత్రవవినిర్మథనోత్సవసాధనం బనం
బ్రగుణవిభూతిఁ బెం పెసఁగుబ్రహ్మశిరం బనుసాయకంబు న
న్నగధరుమీఁద నేయ గగనంబున నిండె సురార్తనాదముల్.

మ. హరి యాలోన సమాహితాత్ముఁ డయి సర్వాస్త్రావిమర్దక్రియా
పరుషోపక్రమ మైనచక్రము నతిస్పర్ధం బ్రయోగింపఁద
త్పరిపాతంబున షణ్ముఖాంబకము విధ్వస్తప్రభాజాలమై
పరమక్లీబత నొందె మేఘపటలప్రచ్ఛన్నసూర్యాకృతిన్.

తే. బ్రహ్మశిర మివ్విధంబునఁ బ్రతిహతప్ర, భావమగుటయునగ్నిసంభవుఁడుఘుటియుఁ
దనకుఁ బ్రియసాధనం బయితనరుశక్తి, వైచెదడయకహరిఁగూల్చువాంఛఁ బేర్చి.

మ. చలదుల్కావళిమాడ్కి సంక్షయశిఖిజ్వాలాకరాళాకృతిన్
గలఘంటాతతిమ్రోయ దిగ్గగనభాగం బెల్ల నుక్కింతయై
వెలుఁగన్ వచ్చుతదస్త్రముం దివి సురల్ వీక్షించి విభ్రాంతిమై
జలజాతాక్షుదెస న్నిరాశు లయి చేష్టల్ దక్కి రత్యంతమున్.

తే. శక్తి గలవాఁడు గావున శక్తిసేర, వచ్చునందాఁక సుస్థిరత్వమునఁ జూచి
చేర రానిచ్చి యుగ్రహుంకారమునన, నిలిపెనమరులెలర్పనయ్యలఘుయశుఁడు.
క. అంతట నిలువక మతీయును, నంతకవక్త్రానుకారి యగుచక్ర మతం
డెంతయు వెస గుహుపై ని, శ్చింతత వైచుటకుఁ జక్కఁ జేత నమర్చెన్.
సీ. ఆసమయమున మహాదేవుపనుపునఁ బార్వతిచైతన్యభాగ మైన
లంబాభిధానలీలామూర్తి గాంచనాభరణ దీధితు లెందుఁ బ్రజ్వరిల్ల
దిగ్వాసయై వచ్చి దేవసేనానికి నడ్డమై నిలువంగ నచ్యుతుండు
గని శీఘ్రమున దృష్టి క్రమ్మఱించి యిటేల నిశ్చితకార్యంబు నీవు చెఱిచి
తకటతొలఁగు తొలఁగు మట్లుగాకున్న వి, శాఖుఁ గొనుచుఁ బాసి చనుము వేగ
నేను జక్ర ముడిపి యిదె యూరకుండితి, ననిన సంతసిల్లి యవ్వధూటి.
వ. అమ్మహాప్రభావుపలికినయట్ల సేసె నట్లు మహాసేనుం డపక్రాంతుం డగుటయు
మాఱు లేక మలయుమాధవుం గనుంగొని బాణుండు.
మ. కలవారెల్లను దక్కి రిట్లు గలయొక్కండం దుదిం జిక్కితిన్
బలియుండై పగతుండు గ్రాలెడుఁ బటుప్రారంభఘోరంబుగాఁ
గలహం బీతనితోడఁ జేయుటయ దక్కం గర్జ మొండెద్ది బా
హులకుం గోరినపండు విప్పుడు గదా యొప్పెం బ్రియం బేర్పడన్.
క. దైతేయవంశ మంతయుఁ, బ్రీతిం బొదలంగ నఖిలబృందారకులుం
జేతోవృత్తంబుల న, త్యాతురులై యెసఁగ నడరి యహితుల నోర్తున్.
వ. ఇదియ నిశ్చయం బని తలంచి సేనాచరులం బిలిచి తనయుత్సాహం బెఱింగించి.
క. చిందమ్మును మ్రోయించి య, మందగమనమున రథంబు మధురిపుదెసకున్
గ్రందుగఁ బఱపించి విశిఖ, సందోహము లఖిలదిశల సంఛాదింపన్.
వ. కదిసి యప్పీరవర్యున కభిముఖుండై యిట్లనియె.
క. ఇందాఁక నీ వెనర్చిన, దొందడిపని మెచ్చ నేను దొడరి తిపుడు లా
వుం దాల్మియుఁ జూపి గదా, యెందుఁ బొగడు గనుట నిలుపు మించుక యాజిన్.
మ. కనకచ్ఛాయఁ దలిర్చువృక్షములు నిక్కంబున్ విలోకించితే
యనుమానింపక కాలచోదితుఁడవై యస్మద్విరోధం బెదం
బనిగా వచ్చితి వేల యింక మగుడన్ బంధుప్రజంబుం బురిన్
ధనుమే లొందెదవేని నిష్ఫలభుజాగర్వుండఁ గానే తుదిన్.
చ. ఎనిమిదికేళ్ల వాఁడ నని నెక్కటి వేయిభుజంబులం దన
ర్చిననునుఁ జేరఁగా వశమె చిత్రము నాదగుదోస్సహస్రకం
బున నిను నుక్కనం దొడరి పోరునెడన్ బహుకోటిసంఖ్యలై
యొనరెడుఁ జూడు మెప్డు వివిధోజ్జ్వలహేతివిహారభంగులున్.

క. సురవరులనెల్ల గెలిచిన, గరువపుబంటనకు నేఁడు గడయంకము సం
గరమున నిను గెలుచుట నా, కిరవగుభాగ్యంబు గాదె యిది యొక్కటియున్.

క. అని బాణుఁడు గర్జిల్లఁగ, విని సభమున యోగపట్టె విసరుచు మోదం
బున నాడె నారదుఁడు దన, మనమునఁ గౌతూహలంబు మల్లడిగొనఁగన్.

వ. యదునాయకుం డవ్విరోధి నుపలక్షించి.

ఉ. నీకని పూని నిల్చినవినిర్భరశౌర్యులు నీవె చూడ నే
పోకలఁబోయిరో తెలిసి బుద్ధి నెఱింగితి వేల యిట్లు జ
ల్పాకుఁడవై వృథావచనటుష్కృలు కయ్యము సేయ నెల్ల శ
వ్యాకులమవ్భుజారుచికి నంకిలి సేసెను దైత్యపుంగవా.

మ. గెలువం బోయిననిన్నుఁ బట్టితిమె యక్లేశుండవై పోరరా
బలవద్బాహుఁడ వేటి కిట్లాడుఁగ మత్పర్యాప్తచక్రాగ్నికిన్
శలభత్వంబును దొల్లి పొందినభుజాశ్లాఘ్యుల్ రిపు ల్లెక్కక
గ్గల మీవంతటికంటె నెక్కు డయినం గాదంటిమే యుత్తరిన్.

క. మోడుపడినచేతులతోఁ, గీడగుదశఁ బొంది కాక కిన్నరగీతా
క్రీడితమద్భుజసంప, త్క్రీడలు నీ కకట యిపుడు తెలియఁగ నగునే.

క. అని మర్మభేదనము లగు, ననేకవాక్యముల నొంచి యట్టివమై పే
ర్చినసాయకముల నొంచెన్, దనుజారి యనంతరంబ దనుజాధీశున్.

బాణాసురుఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబుచేసి పరాజయంబు నొందుట.

ఉ. బాణుఁడు వృష్ణిపుంగవునిబాణపరంపర కెల్ల మాఱుగా
బాణము లేసి వెండియుఁ గృపాణగదాదులు మున్నుగా మహా
బాణసహస్రముల్ పృథులబాహుసహస్రమునన్ సమాహిత
ప్రాణసమున్నద్యమం బలరఁ బర్వఁగఁ జేసి నభంబు మూసినన్.

క. తమప్రపితామహుఁ డగువి, క్రమకోవిదుఁ డాహిరణ్యకశిపునకే లా
వమరునితఁడు నట్టేఁడ యని, యమరద్విషు లతనిఁ బొగడి రప్పటిదశకున్.

వ. బలిసూనుండు తామసాస్త్రంబు ప్రయోగించెఁ దదీయప్రభావంబునఁ జీఁకట్లు
నలుదెసలఁ బొదువ నెఱమంటలు పగఱ నెరియించె నట్టియాశ్చర్యంబునేఁ దిమి
రతిరోహితంబు లగుదిగ్వివరంబులు నగ్నిశిఖాపరీతం బగునాత్మీయసమవస్థానం
బును గనుంగొని గోపాలదేవుండు దేవేంద్రదైవత్యం బగుసాయకం బేసిన.

మ. దెస లెల్లం దెలుపెక్కఁ జేసి దహనోద్రేకం బడంగించి శా
ర్ఙ్గసమాఘోషము దైత్యకర్మదళనప్రారంభమై పర్వఁగాఁ

ప్రసరద్బాణసముత్కరంబున నభోభాగంబు శోధించె ని
ట్లసమోత్సేకమునం గడుం దడవు క్రీడాయత్తుఁడై యంతటన్.

వ. వైరసమాప్తి గావింపం దలంచి యమ్మహానుభావుండు భవ్యాంబక ప్రకరంబు నిగిడించి.

మ. అరదం బల్పకణంబులై తొరఁగ నుద్యత్కేతు వుర్వింబడన్
వరరత్నోజ్జ్వలమాళిమండనము విధ్వస్తంబుగా నాయుధో
త్కరముల్ నుగ్గుగఁ గంటకంబు దునియం దర్పంబుతోఁ బేర్చి పే
దుర మొక్కమ్మున నుచ్చిపోవఁగ ససాహయ్యోత్సాహుఁడై యేసినన్.

వ. దైత్యేశ్వరుండు మూర్ఛితుండై పడియె నట్టిసమయంబున జయజయశబ్దంబులతో దేవతలు దేవా నీవవతరించినపని నెరయం జూడుము జగంబులు కావుమను నెలుంగులు సెలంగ సంతసిల్లి చెంతయుం గలంగి దనుజులు దొలంగి రవ్విధం బాలోకించి శోకం బెసంగఁ గుమారదత్తం బగుబాణధ్వజమయూరంబు.

ఉ. కన్నుల మున్న కాఱునుదకంబులు గెట్టిగఁ జేయుక్రోధ మ
భ్రోన్నతిఁ గాలమై తనకు నుద్ధతిఁజేయఁగ నత్తనక్రియాం
సన్నహనంబునం దనరుచాడ్పునఁ దీవ్రగతిం బ్రవృద్ధమై
పన్నగవైరిఁ దాఁకెఁ గనుపంకజనాభున కద్భుతంబుగాన్.

ఆ. గృధ్రపుంగవుఁడును కేకినాయకుఁడును, నిట్లు దాఁకి పోరి రేపు మిగిలి
నఖరముఖవిదారణములఁ జంచూభేద, నములఁ బక్షతాడనములఁ దొడరి.

సీ. తదనంతరమ వినతాసూనుఁ డలుకతో నమ్మహాబర్హి బెట్టాక్రమించి
పదములరెంటను బార్శ్వంబు లిఱికి పేరెఱకలఁ గొని వెఱచఱవ నడిచి
యడ్డంబు నిడుపు నూర్ధ్వాధరభాగంబులునుగా విచిత్రఖేలనగతములను
దిగిచి లోఁబఱిచి యుదీర్ణవేగంబున నవ్విహంగమము నుదగ్రలీలఁ
గడఁకె నెసఁగఁ జూచి పుడమిపైఁ బడవైచెఁ, బడియె నది నిజప్రభావ మెడలి
యంబరముననుండి యపగతతేజమై, యెడలుభానుబింబ మిది యనంగ.

క. భుజగాశనుచే నిటు దన, భుజగాదనుఁ డధికభంగముం బొందుటయున్
బ్రజనితభయుఁడై దనుజుఁడు, భుజగర్వంబెల్ల నపుడు పోవిడిచి మదిన్.

చ. మదిమదినుండి యేను బలవంతుఁడనై బెడిదంపుఁగయ్యమె
ట్లొదవును యెఱుగు నాప్తసచివ్యోక్తుల కెన్నఁడు వీనులొగ్గకి
య్యదనది పొందఁ బాల యితి నక్కట మెచ్చనిదైత్యదానవ
త్రిదశవరుల్ గనుంగొనఁగ దీనతవచ్చెనె నేర్పు చాలమిన్.

వ. ఇంక నేమి సేయుదు నని చింతింపఁ దదీయచింతాభరం బాత్మచింతితంబున నవధారణంబు సేసి మహాదేవుండు నందికేశ్వరుం బేర్కొని.

తే. భగ్నవాహనుఁడై చిక్కె బాణుఁ డనఘ, హోమ్మమనసింహయుక్తరథమ్ముగొనుచు గణసమన్వితుఁడగునాకుఁ గయ్యమింకఁ, దగదువానిఁగావుము నీవతగువిధమున.

చ. అనుడు శిలాదసూనుఁడు రయంబునఁదే రటు గొంచుఁబోయి శం భునికృపకల్మి దైత్యకులపుంగవుతోఁ దగఁ జెప్పి నెమ్మి నా తని రథిఁజేసి సూతకృతిఁ దాను వహించె నతండు క్రమ్మఱన్ దనుజవిభేదిపై నడరె దర్పము నూతనమై జనింపఁగాన్.

వ. ఇట్లు బ్రహ్మనిర్మితం బగుదివ్యస్యందనంబుపై నున్నయతనికి బ్రహ్మసృష్టం బగు బ్రహ్మశిరం బనునస్త్రంబు ప్రత్యక్షంబై నిలిచె నంత.

క. దానిఁ బ్రయోగించెఁ గడఁగి, దానవుఁడు ముకుందుపై సుదర్శనసుమహా ద్భానునెదుర ఖద్యోత, గ్లానిఁ బడి యడంగె నదియుఁ గడుఁజోద్యముగాన్.

వ. అప్పుడు బలిధ్వంసి బలినందనున కిట్లనియె.

మ. జగమెల్లం గొనియాడ నప్రతిమదోస్సంపత్తిఁ బెంపొంది యా తగవుం గానక పిమ్మటన్ వెడఁగవై దర్పించి తెల్లప్పుడున్ బిగువు ల్వల్కెదు సారెసారె కిటు రప్పించెన్ విధాత్రుండు ని న్నగచందంబున నింకఁ బాయక యని న్మల్లీల సైరింపుమీ.

మ. మును వేచేతులు గల్గిక్రొవ్విన మహామోహాంధునిన్ హైహయా ర్జునుడన్ రాజు నుదీర్ణుఁడై భృగుతనూజుం డాజిలో నెవ్విధం బునకుం ద్రెచ్చె నెఱుంగవే యటుల నీహం గే నడంగింతు నెం దున్న బోనీన్ బొరివృచ్చెదన్ గెలిచెదం దో డెవ్వఁ డేతెంచినన్.

వ. అని పలికి యమ్మహాప్రభావుండు సహస్రధారాకరాళంబును లయకాలసహస్రకరసహస్రసమప్రభాభీలంబును సూర్యసోమాగ్నిగ్రహనక్షత్రవజ్రాశనివిద్యుత్ప్రముఖతేజోమయంబును యమనియమబ్రహ్మచర్యాపాతివ్రత్యయోగవ్రతాదిసుకృతసముచ్చయసంశ్రయంబును దేవాసురగంధర్వమనుష్యస్థావరాత్మకత్రైలోక్యసత్త్వస్వరూపంబును సర్వభయతిమిరనిత్యప్రదీపంబును బ్రమోదితాశేషదివిషచ్చక్రంబు నగుచక్రం బమ్మహాదైత్యుపైవైవ నుద్యుక్తుం డయ్యె ననంతరంబ.

క. శర్వుఁడు పార్వతిఁ గనుఁగొని, సర్వజగంబులను విష్ణుచక్రము తేజో గర్వ మజయ్యము గావున, దుర్వారము బలిసుతునకుఁ దోయజవదనా.

క. నీ వొకవెరవున వానిం, గావుము నావుడు మృడాని గ్రక్కునలంబా దేవిఁ బనిచె నెప్పటిక్రియ, గావింపఁగ దాను నపుడు కరుణ యెలర్పన్.

## పార్వతీదేవి శ్రీకృష్ణునిఁ బ్రార్థించి బాణాసురుని చావుదప్పించుట.

వ. విజయాసమన్వితయై యదృశ్యరూపంబునం దోడనచనియె లంబయు బాణున కడ్డంబై ముందటిచందంబున నిలిచెం బరమేశ్వరియుఁ గృష్ణున కొక్కనికి కాన వచ్చునట్లుగాఁ దనపాడవుచూపి యానగ్నశక్తికి సమానన్న యయ్యె నప్పుడు చక్రధరుం డయ్యాదిమశక్తి నుద్దేశించి.

క. ఈవెడమాయము లేటికి, దేవీ యొనరించె దిట్టు దీనికి నెడగా
నీవొకటి యొడ్డి చూపినఁ, బోవఁగ నిత్తునె విరోధిఁ బోరిగొనక కెట్లున్.

వ. అనినఁ గాత్యాయని దైత్యారికిట్లనియె.

ఉ. ఆదిజు నవ్యయుం బ్రభు ననాది ననంతు మహాత్ము సర్వభూ
తోదయకర్త నిన్నుఁ బురుషోత్తముఁ దథ్యముగా నెఱుంగుదున్
గాదన నేను నీక్రియ కొకంటికనై వినుఁ దొల్లి పుత్రుఁగా
నీదితిజాన్వయుం గరుణ యింపెసలార ననుగ్రహించితిన్.

క. జీనత్తనూజఁగా నను, భావింపఁగఁ దగదె నీకు బాణాసురునిం
గావుము నాయత్నము వృథ,పోవఁగనీకుము త్రిలోకపూజితశౌర్యా.

చ. అనుటయుఁ గృష్ణుఁ డిట్లనియె నంబిక యీదనుజుండు బాహువుల్
పెనఁగొన వేయి మోచి మనఁ బెద్దయు మత్తిలి యుండు నిన్నియుం
దునిమినఁగాని పాయదు సుదుర్దమగర్వము రెండుచేతులే
నునుపఁగ జీవపుత్రతయు నొందెడు నీకు ననిందితస్థితిన్.

క. అసురభావం బీతఁడు, పాసిభవత్సంశ్రయమునఁ బ్రతికెడు నీసున్
రోసము నంతట నుడిగెడు, నేసిలుగులఁ బడక తొలఁగు మీవన్నుఁ దగన్.

వ. అద్దేవి సఖసమేతయై లంబం దొలంగి రాఁ బనిచి యంతర్ధానంబు నొందె నంత నసురాంతకుండు.

ఉ. ఇంచుక యడ్డపాటొదవె నింతన యంతయుఁ గంటి మంటి నే
నంచు భవాదృశుం డకట యూఁటది గావ నొదుంగెఁ బాడియే
మించినదర్పము న్మదము మిన్నకపోయెనె యిస్సిరో తుదిన్
వంచనసేసినం బ్రదుకవచ్చునె నాదగుచక్రధారకున్.

ఆ. చేటుదలకు బాణ చిక్కనిమనసుతో, నిలువు మెందుఁబోవ నేర్చెదింక
నేనుచు బెట్టువైచె నతఁడు మహాఘోర, దర్శనంబు నాసుదర్శనంబు.

వ. ఇట్లు కృష్ణకరవిముక్తంబై ఖరకరసహస్రప్రభాచక్రంబునుంబోలె నమ్మహాచక్రం బడరెం దదీయసంరంభంబున నఖిలభూతంబులు బ్రమసి చేష్టలు దక్కి నిట్లడరి య్యాదివ్యసాధనంబు నిజతేజంబున దైత్యు తేజం బుపసంహరించి.

ఉ. చేతులు రెండు దక్కఁగ విశృంఖలలీల నిమేషమాత్రలో
నాతనిచేతు లన్నియును నాతతశోణితధార లూర్ధ్వని
ష్ఠ్యూతత నొంది యంబరము నుద్ధతసాంధ్యవిభావిభావసం
స్ఫీతము సేయ రూపడఁగఁ జెక్కె సమూలముగాఁ గ్రమంబునన్.

క. స్వామి మన సెఱిఁగిన కర్జం, బేమియుఁ గడమపడకుండ నెఱపి తదుగ్రా
మేయమగుహేతి క్రమ్మఱ, దామోదరు కరమునందు దగ నెలకొనియెన్.

తే. నెత్తురొండొండ వెల్లువై నేలఁ బెద్ద, కాలువలుగట్టి పాఱంగఁ గడుఁ దనర్చి
కావిసెలయేఱు లురిలెడుగనపకొండ, కరణి నొందె బాణుఁడు బాహుకర్తనమున

క. ఆవిధమున నిశ్చలుఁడై, పోవక యయ్యసుర బొంకు బొం కని వియదా
శావివరమెల్ల నద్రువం, గా వెస బొబ్బలిడి యార్చి కడురభసమునన్.

వ. కార్ముకసాయకంబులు కరయుగంబున సమర్చినం గని సైరింపక శౌరి వెండియుం జక్రక్షేపంబునకు నాయితం బగుటయు మహాదేవుండు మహాసేనసహితుండై సత్వరంబుగా నరుగుదెంచి.

సీ. ఓకృష్ణకృష్ణ యత్యుగ్రపరాక్రమ నిన్ను నే నెఱుఁగనే నీవు సకల
జగములు గలిగించి సర్వంబు నొదవించి యఖిలంబునకుఁ దేవవై యజేయుఁ
డెల్లలోకంబుల నీదేవుఁ డన మధుకైటభాద్యసురవిఘాతి వైతి
సురల కాద్యుండవు పురుషోత్తముఁడవు సనాతనుఁడవు విశ్వభూతనిధివి
నీదుచక్రము రణముల నిక్క మెవ్వ
రికి నసంహార్య ముపసంహరింపు మీవ
బాణుఁ డస్మదాశ్రితుఁడు నాభక్తుఁ డనఘ
విఫలముగఁ జేయకుము నామవిభుత యిపుడు.

వ. అనినఁ బుండరీకాక్షుం డవ్విరూపాక్షు నుపలక్షించి.

తే. దేవ నీవు జగంబుల దేవదైత్యు, లాదిగా నెల్లవారి కభ్యర్చితుఁడవు
సేయకుండవచ్చునె నీవిశిష్టవాక్య, మేను జక్రంబు నిలిపితి నీశ్వరేశ.

క. దితిసుతుఁడు బ్రతుకుఁగా కను, మతి నిమ్మై నరిగెదను నమస్కృతి యిదె నీ
కతులభవత్ప్రియకరణ, ప్రతిపాదన మెంతుఁ బరమభద్రము కాదే.

వ. అని యమ్మహాదేవుం బ్రస్తుతించి వాసుదేవుండు గరుడగమనమనోహరం బగు రభసంబునం బ్రద్యుమ్నతనయుం డున్నయెడకుం జనియె నక్కడ నందికేశ్వరుండు దైత్యేశ్వరుం గనుంగొని మహేశ్వరోపవాహ్యం బగురథంబున సద్దేవుం డున్నదెస సేరం గొనిపోయి బాణుం జూచి.

మ. అనిలోనం బ్రతియోధుచే నీకు కరం బార్తుండవై యున్ననీ
కనఘా యార్తిహరుండు వీఁడె సుముఖుండై శంభుఁ డున్నాఁడు నీ
తనుదైన్యవ్యపనోది యైనశోభ మొందింగల్గు వేగంబ చి
క్కినయాచేతులు రెండు విచ్చి ప్రభుఁ డీక్షింపంగ నర్తింపుమా.

చ. అనుటయు భక్తియుఁ భయము నార్తియుఁ దోఁపఁగ మే ననహ్యావే
దన నెరియంగ నాఁడు ప్రమథప్రియయుముందట బాణుఁ డవ్విభుం
డును బ్రసరద్విలోకనకరాంకకృపాయతిపూర్ణచిత్తుఁడై
దనుజునిఁ జూచి విస్మితనితాంతమనోహరగీతి నిట్లనున్.

శివుఁడు బాణాసురునకు నభిమతవరంబులిచ్చి ప్రమథపదం బొసఁగుట.

క. చిరకాల మేను నీకును, వరము లొసంగుటకుఁ గిరము వాంఛించి తదా
చరణసమయంబు వార్చితిఁ, బరిపాకము నేఁడు నది యుపాగతమయ్యెన్.

వ. కావున నొక్కవరం బడుగు మనిన నతండు దేవా యేను లోకంబుల నెవ్వరికి
నజేయుండనై యుండం గోరెద ననుటయు శివుండు.

క. నీయడిగినట్లు యిచ్చితి, నేయెడలను నేమి మృత్యు వెన్నఁడు నీక
త్యాయతమతి నింకను నొక, ఁడయిన ప్రియము మడుగు మనఘ యిచ్చెద నీకున్.

వ. అనిన బాణుండు.

శా. ఏనిమ్మైభవసుగ్రభాగమున నిష్టీ బాణ నర్తించి ని
న్నానందప్రముదిగా నొనర్చితిఁ బ్రియం బారంగ నీదైనభ
క్తావ్రసందంబున నాదుపుణ్యులకు నత్యంతప్రసన్నుండవై
నానావాంఛితసిద్ధు లిమ్మిది నగి న్నానిచ్చుమే లిత్తటిన్.

వ. అనిన విని శంకరుండు నియతాహారులు నిత్యశౌచవంతులు నితాంతనిత్యా
ర్జవసమాహితులునై మద్భక్తు లెవ్వరు నాయెదురం గెరలి యాడుదురు వారికి
నఖిలంబును సులభం బగుఁ దృతీయం బగువరంబు వేఁడు మనవుడు నద్దనుజవ
రుండు చక్రచ్ఛేదనసంభవ యగువేదన యుడుగునట్లుగా నడిగిన.

క. వేసేతులు పోయినఁగడు, గాసిపడక మేను తొంటికంటెఁ గరయుగ
వ్యాసక్తిన యెంతియు ను, ద్భాసితమై మెఱయ నిచ్చి పశుపతి మఱియున్.

వ. చతుర్థం బగువరంబున కతని నుద్యుక్తుం జేసిన నమ్మహాసురుండు.

ఆ. ప్రమథకోటియందుఁ బ్రవరుఁ డితఁడు నాఁగ, నందితుల్యపదవి నంది మెలఁగు
నట్టిమేలు వేఁడె నట్లకా కని యమ్మ, హేశ్వరుఁడు దయార్ద్రహృదయుఁ డగుచు.

వ. మహాకాళాభిధానుండవై ప్రమథపదంబునం బ్రదీప్తుండ వగుమని యిచ్చి వెం
డియుం బంచమం బగువరంబున నతని కనంతతేజంబును నప్రతిమరూపంబును
ననుగ్రహించి యిట్లనియె.

క. వినునాభక్తుల కాపద, లును శోకంబులును లేవు లోకంబున నెం
దును నేను బ్రసన్నుఁడ నగు, దనుపమసర్వార్థదాయి సంచితచరిత్రా.

ఆ. భక్తరక్ష నాకుఁ బని వార లడిగిన, సిద్ధి యైన నిత్తు నింత నిజము
సిద్ధదేహుఁడవు ప్రసిద్ధుండ వై యొప్పు, మింక జగములందు నేపు మిగిలి.

వ. అని పలికి యద్దేవుండు దేవతలును మునులును దివంబుననుండి కనుంగొనుచుండ సపరివారంబుగా నచ్చోట నంతర్ధానంబు నొందె నటఁ గృష్ణుండు.

క. నారదుఁడు వచ్చి ప్రియ మిం, పారఁగఁ గాంచుటయుఁ బ్రీతుఁడై మునివర వే
వేరా క్రిందేయసుతునకు, గౌరవమునఁ జేయవలయుఁ గల్యాణంబుల్.

వ. ద్వారకానగరంబున నతనిం గానక పడినపాటు గ్రమ్మఱం దత్సందర్శనప్రమోదశోభనంబు శోభిల్లం జూచినయప్పుడు గదా నామనంబు సమాధానంబు నొందుట యనిన నయ్యోగీంద్రుండు కన్యాంతఃపురంబున నతనియునికి యెఱింగించి యందులకుం దోడ్కొని చనుసమయంబునం జిత్రరేఖ యెదురుగా వచ్చె నయ్యింతి ముంగలిగా వారిందఱుం దన్మందిరంబు ప్రవేశించి వాహనంబులవలన నవతీర్ణులై రప్పుడు.

క. గరుడాలోకనమాత్రన, యురగము లనిరుద్ధు విడిచి యుర్వీస్థలికిన్
సురిఁగి తొలఁగి చని యొప్పటి, శరంబులై యుండె నక్కజం బగుభంగిన్.

వ. వాసుదేవుండును సమ్మోహనసంభ్రమంబునం జని మనుమనిం గౌఁగిలించిన నద్దేవుదివ్యాంగస్పర్శనంబున నక్కుమారుదేహంబు నిర్వ్రణంబును విగతపీడనంబును బ్రభూతసర్వహర్షోత్సవంబును నై యొప్పె బలదేవప్రద్యుమ్నులు నతని గాఢపరిరంభణంబున సంభావించిరి నారదవైనతేయపూర్వు లైనయేవురకుం గ్రమంబున నమస్కరించి యాయుష్యకేతుండు తదాశీర్వాదంబుల నభివర్ధితుం డయ్యెఁ జిత్రరేఖాప్రభృతి సఖీజనంబులపనుపున నుషాసుందరియు నంతంత నమ్మహాభాగులకుం బ్రియభక్తిలజ్జారమణీయం బగుసాంజలిప్రణామం బొనరించిన దీవించి రిట్లు సముచితాచారంబులు నడిచినయనంతరంబ.

క. నారదుఁడు కృష్ణువదనాం, భోరుహమునఁ జూడ్కి నిలిపి పురుషోత్తమ యి
ద్దారంభుఁడ వై తింకఁ గు, మారున కొనరింపు ముచితమంగళ మిచటన్.

వ. శోభనతిథినక్షత్రం బగుకాలంబున నభిమతం బగులగ్నంబు సమాసన్నం బైనది తడయ నేల యనుసమయంబున సర్వవైవాహికద్రవ్యంబులు నలవరించుకొని కుంభాండుం డరుగుదెంచి యంతంతఁ గృతాంజలియై నిలిచి.

క. శరణాగతరక్షకుఁడవు, కరుణాకరుఁడవు త్రిలోకకల్యాణుఁడ వీ
శ్వరుఁడవు గావున నిన్నే, శరణము చొచ్చితి ముకుంద సర్వార్తిహరా.

వ. ప్రసన్నుండ వగు మునిన నారదుండును సయ్యసురోత్తముఁ బ్రసాదయోగ్యుం
గా నుదాహరింప, నభయం బిచ్చి యచ్యుతుండు.

క. నిను లెస్సవానిఁగాఁగను, వినినాఁడం గాన బాణువిభవము సర్వం
బును నీకిచ్చితిఁ బరజే, వనసౌఖ్యము నొందు మనుచు వర యని నెమ్మిన్.

వ. అతనిం బిలిచి కుమారునకుం గన్యకకు నభిషేకంబులు నలంకారంబులు నర్హాజ
నంబులచేతం జేయించి వివాహవేదిపై నయ్యిరువుర నునిచిన సమయంబున.

సీ. వరమునిసహితుఁడై వనజాసనుఁడు వచ్చె నమరసమేతుఁడై యనిమిషేంద్రుఁ
డేతెంచె నప్సరోన్వితులయి గంధర్వు లరుగుదెంచిరి పరిస్ఫురితలీల
నాటలుఁ బాటలు నలరంగఁ దతవితతాదివాద్యములు హృద్యముగఁ జెలఁగఁ
గై సేసి శచిలోనుగాఁగల దేవపురంధ్రిసర్గములు పేరటము సేయ
దివిజమంత్రిబుత్విజుఁడయిదివ్యవహ్ని, యంపువిధియుక్తముగఁ జేల్చిహర్షమెసఁగఁ
గరసరోరుహగ్రహణమంగళము నాఁగ, ముగ నెసఁగె దంపతులకింపులు దలిర్ప.

వ. అట్లు వివాహంబు సంపన్నంబు గావించి గోవిందుం డయ్యుషప్రభుం దోడ్కొని
రుద్రుండును రుద్రాణియు నున్నయెడకుం జని మ్రొక్కించిన నయ్యాదిమగృహి
ణీగృహస్థు లానూతనమిథునంబు నాదరించి యభినందించిరి శైలనందన ప్రద్యు
మ్ననందనునకు వాహనంబుగా బాణవాహనం బగుబర్హిపుంగవు నిచ్చె నవ్వి
ధంబునకుం బ్రీతుండై పీతాంబరుండు.

క. భవుని భవానిని వీడ్కొని, దివిజేంద్రుని దివిజగణము దివిజజ్యేష్ఠున్
సవినయముగ వీడుకొలిపి, పవనాశనదమను నెక్కి పయనం బయ్యెన్.

తే. అపుడు హరిఁ జేరి కుంభాండుఁ డధిపవరుఁడు, పాల నున్నవి బాణునిపసులు వాని
పాలు ద్రావిన సత్త్వసంపన్ను లగుల, దుర్జయత్వవిభూతి నొందుదురు వినుము.

శ్రీకృష్ణుఁడు బాణునిగోధనంబుకొఱకు వరుణునితో యుద్ధంబు చేయఁబోవుట.

వ. అవి దేవరసొమ్ముగావించుకొనుట లెస్స యనుటయు నవ్విధంబునకుం జిత్తగించి
యట్ల చేయుద మని యతని నిలిపి మయూరారూఢులగు కన్యాకుమారుల
మున్నిడుకొని వెన్నుం డన్నయుం గొడుకును దన్ను నుభయపార్శ్వంబులం గ
దియ్యం గదలి గరుడాత్మకం బగుయానం బనూనవేగంబునం గొని పోవ నతి
దూరం బరిగి.

క. చరమాంబుధితీరవనాం, తరముల బహువర్ణచిత్రితములై లీలన్
జరియించుగోగణంబులఁ, జరితార్థుఁ డనేకలక్షసంఖ్యలఁ గనియెన్.

ఆ. పసులఁ బిల్చునేర్పు పసిపాపనాఁటనుం, డియును దనకు నైజ మయిన తెఱఁగు
గాన బసులఁ బిలువఁగా నుత్సహించి వి, హంగగమనుఁ డవరి యక్షి మేగె.

తీవ్రబాణహాసంబున రసాతలతమిస్రంబుఁ బ్రోదిసేసినఁ బ్రహసవిభవ్రాదారుం డగుచు వృష్ణికులవీరుండు.

క. దారుణతాపం బగుస, వ్వారుణబాణాత్మక ప్రవాహముఁ దనదు
ర్వారవిశిఖసేతువున ని, వారించి విరోధిమేను వ్రయ్యఁగ నేసెన్.

క. అలిగి ప్రచేతసుఁ డొక్కట, బలమన్మథతత్తనూజపతిసేంద్రులతోఁ
గలయఁగ ననేకశరముల, జలజాక్షునితనువు రుధిరజలములఁ దేల్చెన్.

వ. అట్టి విపక్షోత్సాహంబు సహింపక దుస్సహప్రభావుం డగువాసుదేవుం డాత్మీయతేజోనిర్మితంబై నిర్మితానేకరిపుధ్వంసం బగునస్త్రకళావతంసంబు కేలం గైకొని యభిమంత్రించి వరుణుం గన్గొని.

ఉ. ఏను మదస్త్రరాజ మిది యేసెద నీవు మదంబు పెంపునం
గానక నన్ను మార్కొని మగంటిమిఁ జూపెద వంచు నాజనం
బూనితి నిల్వు మింక నెటఁబోనఁగవచ్చు భవద్దిగీశల
క్ష్మీనిరవద్యభోగములమేలిమిఁ గం డనియయ్యె నియ్యెడన్.

వ. అని పలికి నియతిం బ్రయోగించిన నవ్వైష్ణవాస్త్రంబు.

మ. దెసలెల్లం గబళించి మంటలు గడుం దీవ్రంబులై పర్వఁగాఁ
బ్రసరద్దాహ మొనర్పఁ జొచ్చిన వెడం బ్రత్యర్థియుక్ వారుణా
స్త్రసమారోగ మొనర్చెఁ దత్సలిలముల్ దైత్యారిబాణానల
ప్రసభవ్యాప్తి సహింగ నల్పకణసంభావ్యంబులై గ్రిక్కెనన్.

తే. వారుణాస్త్రంబు సమయించి వరుణుదెసకుఁ, గవిసె వైష్ణవనాయకాకారవహ్ని
ప్రాణరక్ష వేఁడొంపమొఁ బతయరాదు, తెలిసి యంత నాపశ్చిమదిగ్విభుండు.

వరుణుండు శ్రీకృష్ణునితో యుద్ధంబుచేసి పరాజితుండై స్తుతించుట.

క. కరముల నున్నశరంబును, శరాసనముఁ దొలఁగఁబెట్టి సమధికశాంతి
స్వరమగువాక్యంబుల నా, హరి నుద్దేశించి యిట్టులనియె వినీతిన్.

సీ. భవదీయశాశ్వతప్రకృతి యారయ సత్త్వగుణము నీ విప్పు డాగుణము విడిచి
తామసి యగువృత్తిఁ దగునె పాటింపంగ బంచభూతాశ్రయ బహుళదోష
సంకీర్ణ మైనయహంకృతి నీవుఁ బొంది యున్నది జలమూర్తి యోగివర్య
నీయధీనమ నేను నీవకాఁ దలఁతు నిట్లేటికి మద్దాహ మిచ్చగించి
తగ్ని దెసనగ్ని యేమిసేయంగ నోపుఁ, గానుడుగు మీయుగ్రంపుఁగడఁకయీశ
ప్రభుఁడ వీవిశ్వమునకును బ్రభుత నీకుఁ, జూపిచక్కఁబోఁగలఁడె యేశూరుఁడైన.

వ. ఆగ్నేయవారుణసంజ్ఞంబగు ప్రకృతిద్వయంబున నియ్యఖిలజగంబు నుత్పన్నంబై నయది తద్వికృతు లెన్నియేనియుం గలిగి నిజాధికారంబులు నడుపుచుండు నేను మదీయప్రకృతియంద యున్నవాఁడఁ బ్రకృతిదూషకుండఁ గానియిట్టినన్ను

నాత్మీయప్రకృతిఁ బొందొందంగెదవు సర్వభూతంబుల కాదికర్తవు సర్వసత్త్వం బులకు నజేయుండవు సర్వధర్మప్రవర్తకుండవుమానుషప్రకృతిం జెందిబాలుండు క్రీడకవస్తువుల వినోదించువిధంబునఁ బ్రమోదించెదవు సర్వజ్ఞుండవు నీయె ఱుంగనియది లేదు మాబోంట్లకు సమ్మోహనం బొదవించుకొని కిట్టివాఁడ వైతి వెఱుంగుట గహనం బెట్లున్న నుండుము రక్షణీయుండ నగుదు నన్ను రక్షింపుము నీకు బ్రమొక్కెద ననిన నక్కుమారులలోచనుండు కరుణాపేశలుండై పాశపాణింజూచి.

క. వాణీవిభవమున నతి, ప్రీణన మొనరించి యిట్లు ప్రియములఁ దలఁచె దా బాణుపసి నొసఁగ కూరక, ప్రాణత్రాణంబు నీకుఁ బడయఁగ వశమే.

వ. ఇంత యెఱింగి బుద్ధిమంతుండ వగు మనిన నవ్వరుణుండు దేవా దేవద్విషుండు పశుధనంబు నిల్లడ పెట్టునప్పు డెవ్వ రడిగినఁ బ్రాణాత్యయపర్యంతంబుం బెనం గునదిగాని యీఁదగ దని సమయంబు సేయించుకొనియెఁ బలుకు దప్పనోడుదుఁ దగవులెల్ల నడప నొడయండ వింత యవధరింపుము.

క. నను మన్నింపఁగఁ దలఁచిన, మనిచి పసులవిూఁదితలఁపు మాని చను పసిం గొనిపోకయ నిర్బంధపు, బనియైనం బండె నాకుఁ బాపం బనఘా.

తే. ఇది నిజంబుగఁ జెప్పితి నెట్లు చూడఁ, గోలె నట్ల సేయుము మహాపురుష పూజ్య యనిన నల్లన నవ్వి దివ్యాస్త్రవహ్ని, యుడిపి గోధనాపేక్షయు నుజ్జగించి.

వ. తదనురూపం బగునల్లాపం బొనర్చి యదునాథుండు యాదోనాథునకు నభయం బిచ్చి యతనిచేత ననర్ఘ్యరత్నపూర్ణం బగునర్ఘ్యప్రదానంబునం బూజితుండై తదీయలోకంబు వెలువడి నిజస్థానాభిముఖుం డయ్యె నయ్యవసరంబున.

సీ. ఆదిదేవుఁడు విష్ణుఁ డఖిలలోకహితార్థ మాశ్చర్యకార్య మిట్లాచరించి
వేడ్కఁ బురంబు ప్రవేశించునప్పుడు మిక్కిలివిభవంబు మెఱయ వలదె
యని పురందరుఁడు సర్వామర్త్యులను నారదాదసిద్ధులను సమస్తభువన
వాసులఁ గొనుచు నవ్వాసుదేవునిఁ గానవచ్చి దీప్తవిమానస్వైభవముల
నంబరము తిగ్మకిరణసహస్రభాసు, రంబు సేయుచు దివ్యతూర్యధ్వనులును
గుసుమవృష్టియునం స్తుతిఘోషములును,బృథివిజనవర్గములకునిం పెనఁగఁగొలిచె.

వ. అవసరోచితం బైనతదీయసేవాధర్మంబు ధర్మధుర్యుండు గావున నాత్మీయభావం బునం బరిగ్రహించి యయ్యింద్రు ననుగ్రహించి యగ్రేసరుం బై సురకరికరంబు మార్గం బొసంగ ననర్గళోత్సవంబున.

చ. గరుడమయూరయానములఁ గంజదళాక్షుఁడు పుత్రపౌత్రసం
భరితవిభూతియై దివిజపఙ్క్తులచూడ్కుల కెల్ల నుత్తరో
త్తరకుతుకానురంజనవిధాయక మైనవిధం బెలర్పఁగా
సరిగ నపూర్వసమ్మదభరార్ద్రితఁ దానును బూర్వజన్ముఁ డుక్.

వ. ఇట్లరిగి నిజరాజధాని నంతంతం గని విజయసూచకం బగుక్రమంబునం బాంచ జన్యశంఖధ్వానం బొనర్చిన.

చ. విని యదువంశవృద్ధులు ప్రవృద్ధకుతూహలలీలవైఁ బురం
బునకుఁ బ్రభూతశోభనవిభూషణభంగులు సంఘటింపఁగాఁ
దనిచి రథద్విపాశ్వభటబంధురసైన్యసహస్రలక్ష్మితో
ననుజతనూజపౌరసచివాన్వితులై యెదురేగి రర్థితోన్.

క. అటమున్న వచ్చి నగరని, కటకేళీవనములందు గరుడుని డిగి వి
స్ఫుటనిర్ఝరపరిపాతో, త్కటముగఁ బరమేశుఁ డుండె గడు మోదమునన్.

శ్రీకృష్ణుఁ డింద్రాది దేవతలతో ద్వారకా పురంబునకు వచ్చుట.

వ. ద్వారకానివాసులు మంగళతూర్య జయాశీర్వాదనాదంబులతో నద్దేవు దర్శించి రమ్మహానుభావుం డట్లు సనుదెంచి యాత్మీయజనంబు నఖిలంబునుసముచితప్రకారంబు లగుసత్కారంబుల గారవించి దారుకసారథికం బగురథం బగ్రజతనూజ సమేతంబుగా నెక్కి మయూరావళీర్గ లగునుపానిరుద్ధుల నుద్ధతస్యందనారూఢులం జేసి వినతాతనయుండు వినతుండై కొలువ నఖిలనిలింపులు నిలింపపతిమున్నుగా ననుసరింపఁ బెంపారి పురంబు ప్రవేశించె నంత.

క. తనవిజయవార్త యంతన, యనేకముఖములఁ బ్రసిద్ధయై పురజనులన్.
జనితవచోవిభవులఁగా, నొనరింపఁగ నిరుగెలఁకుల నుద్భటఘోషితిన్.

సీ. అదరుటగ్నులకోటులార్చి బ్రహ్మాదులుఁ దీరలేని బలిసూనుపురముఁ జొచ్చెఁ
బ్రమథవీరులుఁ దాను బన్నినమిక్కిలికంటిజేల్పునకు నగ్గలికఁ జూపె
నాలుమోములపట్టి కడ్డమై వచ్చినదానవాయణికిఁ బుత్రభిక్ష యొసఁగెఁ
దనయిచ్చఁ బగవానిదర్ప మంతయుఁ బుచ్చి యిరుగేలితోఁ బ్రాణ మిచ్చి కాచె
సురలు బంట్లయి తిరిగెడ దరిది యెల్ల, భువనములకు నితఁడు రాజు భూరితేజుఁ
డివ్విభుని రాజుగాఁ గంటి మెట్టిపుణ్య, మెట్టితప మెట్టిభాగ్య మిట్లొసఁగె మనకు.

వ. అని యనేకవిధంబుల వీతెంచుసంతోషకలకలంబు వీనుల కానందం బొసంగ నాకసంబునం దొరఁగుదివ్యపుష్పవర్షంబులం బెరసి పుణ్యాంగనాకరకలితలలితాక్షతవిక్షేపంబులు కిరీటకుసుమస్రగుత్తరీయాదులం దగిలి మిగిలినయొప్పిదం బొనర్పఁ దరుణీవిలోచనగోచులు రుచిరస్మితచంద్రికలఁ దార్కొన నర్కప్రభాపరిభావియై భవ్యకౌస్తుభగభస్తిరాగంబున ననురాగరమ్యం బగుపురం బంతయుం గుంకుమపంకాభిషేకంబున నుత్సేకంబు నొందింప మందానిలాందోళితమణిధ్వజవైజయంతీవిరాజితం బగురాజమార్గంబునం జని యదురాజు రాజమందిరంబు సొచ్చి యుషాసమేతంబుగా ననిరుద్ధు నంతఃపురంబునకుం బుచ్చి యచ్చటచ్చట

నవతీర్ణ లయినవిబుధుల విమానంబుల మృగనృషభవాజివారణహంససారసమ యూరాద్యనేకవాహనకల్పనంబుల ననల్పం బగుసద్భుతంబు జనంబుల కావహిం చుచు నపరిమితరథగజతురగసంకీర్ణ యగునగరభూమిక మీఁదటినగరంబునందుఁ దద్దయు సందడియై యుండె నప్పుడు గోవిందుండు సర్వయాదవులం గనుంగొని యిట్లనియె.

ఉ. నాకుఁ బ్రియ్యం బొనర్ప నిదె నాకవిభుం డిట వచ్చినాఁడు నా
కౌకసు లందఱుం సురగణాధిపులో జనుదెంచినారు సు
శ్లోకులు నారదాద్యఖిలసిద్ధులు నిక్కడ నేగుదెంచినా
రీకమనీయమూర్తులకు నింపుగ మ్రొక్కుఁడు చూడుఁ డిందఱుం.

సీ. వీరె రుద్రాదిత్యవిశ్వాశ్వివసువులు గంధర్వయక్షరాక్షసులు వీరె
వీరె వాసుకిముఖ్యవివిధభోగీంద్రులు శ్రీదివస్థపూర్వపార్థివులు వీరె
వీరె సప్తర్షులు మేటిగానూర్జితజ్యోతిరాకృతు లైనసుకృతనిధులు
వీరె సర్వప్రజావిభుపుణ్యముగా నధికులు మన్వంతరాధిపతులు
నగములగములుహ్రదములునదములు సింధు,లివియెదిక్కులివ్విదిక్కులుపవనపథము
వనజభవలోకగోలోకనాకవితతి, యాదిగా మూర్తిమంతంబు లయిన విచట.

వ. మీర లందఱును వందనాదిసమాచారంబులు నడపుట లెస్స యనిన సమ్మ హాప్రభావునమ్మన వార లవ్వేల్పుల కెల్ల నుల్లసితచందనకుసుమాక్షతాదిద్ర వ్యంబుల నర్ఘ్యపాద్యాదిపూజనంబు లొనర్చి ప్రియవాక్యోపన్యాసంబులఁ జేతోవికాసంబు గావించి.

క. తలఁపఁగ నీ బువ్వెలకతనం, దల కెక్కెన్ ద్వారకానువిధంబున హరివా
రల యుగుట నిట్టిపేర్మికి, నలవడితిమి ధన్యతముల మైతిమి ధరణిన్.

వ. అని సంతసిల్లి రనంతరంబ వాసవుండు వాసుదేవు నిజుగేలం గ్రుచ్చి యురంబునఁ గదియించి వసుదేవబలదేవుల నుగ్రసేన సాత్యకి ప్రద్యుమ్నులను దక్కిన కుమారవర్గంబును బ్రత్యేకపరిరంభణంబులఁ బరిగ్రహించి కుశలం బడిగి వారికి వారిజోదరు దెసఁ జూపి యిట్లనియె.

మ. యదువంశైకవివర్ధనుం డలఘుసత్వాకల్పుఁ డీకృష్ణుఁడ
భ్యుదయోదగ్రుఁ డొనర్చినట్టిపను లీభూతప్రపంచంబులో
మది నెవ్వారికిఁ జేయఁ జూడఁ దలఁపన్ మానంబులే యద్భుత
ప్రద మీయున్నిట బాణునిం బఱుచుటే పారంబు గా దారయన్.

ఉ. కావఁగ నేర కాహరుఁడుఁ గ్రౌంచవిభేదియుఁ దాను జూడ బా
హావన ముగ్రచక్రహతి నంతయు నొక్కట నుగ్గుచేసి యా

దేవునిప్రార్థనం గరుణ దేవవిరోధికిఁ గేలుదోయితో
జీవిత మిచ్చె నేమియని చెప్పుదు నివ్విభుదోర్విలాసముల్.

వ. ఇమ్మహానుభావుండు మహీతలంబున నవతరించినకార్యంబు జగద్ధితంబై, పర్యాప్తిం బొందె నేము విగతశోకుల మైతి మింకను నిమ్మహాబాహుబాహువుల ప్రాపు గలదు గావున నేవిధంబులయందును బరిస్పందంబు లేక నాకంబున సుఖించెదము మీరు ద్వారకానగరసౌధోద్యానసరసీప్రముఖంబులు. సుఖోచితస్థానంబులుగా మనుష్యోచితపురుషాయుష్యం బంతయుం జింతం బొరయక, నిర్వహించువా రని పలికి పాకశాసనుండు.

ఉ. క్రమ్మఱఁ బంకజాక్షు నతిగాఢతరంబుగఁ గౌఁగిలించి హృ
ద్యమ్మగుభాషణంబులఁ బ్రియప్రవిపూరణ మాచరించి నె
య్యమ్మలరార వీడ్కొని సమస్తసురాసురసంయమీంద్రసం
ఘమ్ములు గొల్వ నేగె నవికల్పత నాత్మనివాసభూమికిన్.

వ. ఇక్కడఁ గమలనాభుండు సభాసీనుండై సర్వయాదవులం గుశలం బడిగి తాను పోయివచ్చినవృత్తాంతం బంతయు సవిస్తరంబుగా వారల కెఱింగించి తదీయంబు లగుప్రత్యభినందనవాక్యంబుల సవిశేషసంతోషంబు నొంది వినతాతనయు నభిమతోపలాలనపూర్వకంబుగా వీడ్కొలిపి నారదమునీంద్రు నమందమాధుర్యధుర్యంబు లగువచనచాతుర్యంబుల నుత్పాదితప్రమోదునిం జేసి విజయం చేయుం డని పనిచి.

ఉ. మున్ననిరుద్ధుఁ బాసి పతిమోహభరంబున స్రగ్గి యెంతయున్
విన్నఁదనంబునం బడినవీ డఖిలంబునకున్ మహోత్సవం
బెన్నఁడు నెందు నెవ్వరును నిట్టి దెఱుంగ రనంగఁ జేయుఁ డం
చున్నతి నానతిచ్చె గురుసోదరబాంధవపౌరకోటికిన్.

వ. అమ్మహోత్సవసమయంబున నుగ్రసేనాభ్యనుజ్ఞాపురస్సరంబుగా నతండు బాణతనయతోడం జనుదెంచినచెలికత్తియలలోనం గుంభాండుకూఁతుఁ జిత్రరేఖ చెలియలి రామాభిధాన యగుకన్యక సాంబకుమారునకును మఱియును సురాసురసిద్ధకన్యలం బెక్కండ్రఁ దక్కినకుమారులకును వివాహంబు సేసె నట్టికల్యాణపరంపరయందు గృహంబు గృహంబున నరనారీసముదయంబులకు ననేకచిత్రాలంకారవిరచనంబులు నభిరామతూర్యనాదంబులు నవిశంకితప్రమోదనర్తనంబులు ప్రవర్తిల్ల నఖిలగృహంబులు నేకగృహంబుతెఱంగున శోభిల్లె నంత.

క. ఒకనాఁడు యదుప్రవరులు, సకలోత్సాహమునఁ గృష్ణు సదనమునకు ను
త్సుకతఁ జనుదెంచి సమ్మద, వికసితసంభాషణ ప్రవీణత యొప్పన్.

వ. అప్పరమేశ్వరునైశ్వర్యంబులుం గార్యంబులు నాశ్చర్యంబు లగుట నుదాహరించి
యది ప్రసంగంబుగా నిట్లనిరి.

క. దేవా దేవరబాంధవభావంబున మమ్ముఁ గలసి భవ్యక్రీడా
ప్రావీణ్యము నటియించుట, నేవారలు లేరు తుల్యు లెందును మాకున్.

మ. నిను నిత్యంబును గన్నులారఁ గనుట న్నీ వాక్యముల్ నిత్యముం
దనియన్ వీనులఁ గ్రోలుటన్ భవదనుధ్యానంబు నిత్యంబు నె
మ్మన మానందమయంబుగాఁ బడయుట న్మాపుట్టువుల్ దివ్యభా
వనిరూఢంబుగఁ జేసె నిట్లు కరుణావ్యాసక్తిఁ బాటింపుమా.

వ. అని పలికి యమ్మహాత్ముచేత నభినందితులై వారలు నిజగృహంబుల కరిగి సు
ఖంబుండిరి హరియును బూర్వప్రకారంబున విహరించె నంత.

క. దేవకియును రోహిణియును, రేవతియును రుక్మిణియును బ్రియము లెసఁగ సం
భావనఁ లోనర్ప గారా, మై వెలసె బలీంద్రసుపౌత్రి యమతతి కెల్లన్.

క. ప్రద్యుమ్ను దేవి కోడలి, హృద్యచరితమునకుఁ బ్రీతి యొలయఁ దమకులం
బుద్యోతిత మగు నియ్యెడ, యుద్యద్గుణసమితి నని ప్రియోత్కట యయ్యెన్.

ఉ. ఆవసజాతిఁ బొంది పరసాభిమతోజ్జ్వలవస్తుజాతముల్
కేవలభోగయోగ్యపరికల్పితిఁ దలిర్పఁగ పీతఖేదమై
యావన ముల్లసిల్లఁగ గుణాభిరతుం డనిరుద్ధుఁ డుద్ధత
శ్రీవిలసత్సుఖోన్నతులఁ బొందె నమందరసోదయాత్మతన్.

వ. ఆచిత్రరేఖయు సఖీసాంగత్యప్రమోదంబునం గతిపయదివసంబులు వసియించి
యనంతరంబ యయ్యింతి వీడ్కొని తక్కినచెలులకుం బ్రియపూర్వకంబుగా
నెఱింగించి యప్సరోలోకంబున కరిగె నని చెప్పి వైశంపాయనుండు జనమేజ
యున కిట్లనియె.

క. నీవడిగినబాణకథా, శ్రీవిభవము విస్తరించి చెప్పితి నిమ్మై
గోవిందచరిత మతిసంభావితము సమస్తభువనపావనము నృపా.

ఉ. విష్ణునిమూలతత్త్వమును వేమఱు నయ్యయిజన్మకర్మవ
రిష్ణుత లాదరించుటలు దేవకికిన్ వసుదేవునకున్ ధరన్
గృష్ణుఁ డవంగఁ బుట్టి శిశుఖేలన మాదిగఁ గల్గుభావముల్
ధృష్ణుత నిర్వహించుటలు దెల్లఁగ వింటి నరేంద్రపుంగవా.

సీ. వినుము నారదముని చనుదెంచి సకలరాజన్యులయెదుర నాశ్చర్యభూతుఁ
డితఁ డని కృష్ణునియుదయించు టాదిగా గోవిందుమాహాత్మ్యకోటి యెల్ల

నాశ్చర్యముగ నోలి ననఘుకీర్తించితి నాశ్చర్య మంభోగ హోతునందుఁ
గాక యొండెడ మఱి గల్గునే యవ్విభుజన్మంబు లాశ్చర్యసంశ్రయములు
కర్మములు మహాశ్చర్యముల్ నిర్మలములు
గుణము లాశ్చర్యపరసీమ లణువునకును
నణువును మహత్త్వములకును నతిమహత్త
రాత్మ నారాయణుఁడు సత్పరాయణుండు.

క. దైత్యులయందును మఱి యా, దిత్యవరులయందు నఖిలదివ్యులయందున్,
నిత్యుఁడు ముకుందు గడవఁగ, సత్యధికుం డైనధన్యుఁ డరయం గలఁడే.

క. వసురుద్రాదిత్యాశ్వి, శ్వసనులు దిగ్గగనములును సలిలాగ్నులు ధ
ర్మసమాధితపోదమశాం, తిసత్యయజ్ఞములు వాసుదేవునిమూర్తుల్.

క. ధాతయు సంహర్తయును వి, ధాతయు నచ్యుతుఁడు హరిపితామహమూర్తి
స్ఫీతుఁడు పీతాంబరుఁడు మ, హాతత్త్వము విష్ణుఁ డొకఁడె యను నాగమముల్.

క. దేవదనుజమనుజాదిక, జీవచయంబులకు నెల్ల శ్రీవిభవములుం
గైవల్యము నొసఁగెడుపర, దేవత మఱి గలఁదె విష్ణుదేవుఁడు దక్కన్.

క. నీవిదియంతయు సమ్య, గ్భావంబున నెఱిఁగి విష్ణుపదకమలధ్యా
నావేశమునఁ గృతార్థవు, జీవనుఁడవు గమ్ము నృపతిశేఖర భక్తిన్.

తే. అనఘ యీభారయుద్ధకథానుబద్ధ, మైనపుండరీకాక్షుమాహాత్మ్య మర్థి
వినినఁ జదివిన మది ధరించినఁగలప్ర, తిష్ఠయును శ్రీయుధర్మబుద్ధియునుగలుగు.

వ. అని యుపన్యసించి యమ్మునీంద్రుం డన్నరేంద్రు నుపలక్షించి.

సీ. నీమహాయజ్ఞంబు నిర్వర్తితంబుగాఁ దత్పరమతిభారతప్రసంగ
మున విష్ణువంశంబు మొదలిటనుండియు నేను గీర్తించితి నిద్ధపుణ్య
యెవ్వఁ డీయాఖ్యాన మెప్పుడు పఠియించు వినయంబుతో విను విని మననము
మఱవక యనుచునమ్మనుజుఁడు నిర్ముక్తకలుషుఁడై విష్ణులోకంబు నొందు
నిచ్చలును రేప మేల్కని నియతి నింపుఁ, గొంతకథ యెద్దియేనియుఁ గోరిజపము
సేయుసుకృతాత్మునకు నఱచేతిలోని, వైహికాముష్మికశ్రీలు లక్షలములును.

మ. హరివంశశ్రవణానుకీర్తనల బ్రహ్మక్షత్రవిట్ఛూద్రులా
దరణీయశ్రుతలక్ష్మియున్ విజయనిత్యశ్రీయు భవ్యార్థలా
భరమావర్గము సర్వసౌఖ్యములునుం బ్రాపింతు రారోగ్యమున్
బరమాయుస్సుతకీర్తులున్ సమత యొప్పం జెందు నీయందఱున్.

క. అనివైశంపాయనముని, వినుతవ్యాఖ్యానసంప్రవీణతఁ బ్రకటిం
చిన జనమేజయుజనపతి, యనుపమసమ్మోదసుఖసమగ్రత నొందెన్.

వ. మీరలిమ్మహోవాఙ్మయప్రపంచంబునందలిసముచితార్థంబు సమర్థమేభాగోచ రంబు గావించి శ్రుతంబు కృతార్థంబుగాఁ జేయుం డని సమస్తయదువంశాను చరితసమేతం బగుకృష్ణావతారగుణకర్మజాతంబు సమధికరసస్ఫీతంబుగా.

తోటకము మానవతీజనమానసవర్తీ, మానవనాథసమర్పితకీర్తీ
దానవభేదికథానతమూర్తీ, దానపరాయణతానుతపూర్తీ.

క. జగరక్షపాల స్వంతత, జగతీసురభరణలోల సన్నుతశీలా
విగతపరితాపకారా, నిగళితరిపుభూప రాజనిగమదిలీపా.

మాలిని. నిరుపమగుణరత్నోన్మేషనిర్దోషశశ్వ
త్పరిచితమితసమ్యగ్భావ సత్పోష విద్వ
ద్విరచితపదవాక్యోద్గేయశ్లాఘ్యచేతః
పరిణతబహుధర్మోపాయ వీతవ్యపాయా.

గద్య. ఇది శ్రీశంకరస్వామి సంయమీశ్వర చరణసరోరుహ ధ్యానానంద సౌందర్య శ్రీసూర్య సుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయ ప్రణీతంబైన హరివంశంబున నుత్తరభాగంబునందు అష్టమాశ్వాసము.

---

ఉత్తరభాగము – నవమాశ్వాసము.

క. శ్రీకీర్తివిభవవిజయో, త్సేకసుఖవదాన్యతావిలీనైశ్వర్యా
వ్యాకాంక్షాయోగార్థన, మాకలనగుణాభిరామ యన్నయవేమా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు హరివంశం బాకర్ణించి నైమిశారణ్యవాసు లగుతాపసోత్తములు రోమహర్షణపుత్త్రు నభినందించి.

క. జనమేజయునకు నెందఱు, తనయులు చిరకాల ముర్విఁ దద్వంశము గ
ల్గె నెఱింగింపు మనిన ని, ట్లనునుగ్రశ్రవసుఁ డమ్మహాద్విజతతికిన్.

క. వినుము వపుష్టమయందా, జనమేజయనృపతి గనియెఁ జంద్రాపీడుం
డన సూర్యాపీడుం డనఁ, జనుతనుజుల నిద్దఱం బ్రశస్తచరితులన్.

వ. అందుఁ జంద్రాపీడునకుం బుత్త్రులు నూర్వురు జనియించి యనేకవంశంబులు సృజియించి రందఱకుఁ బెద్దవాఁ డగుసత్యకర్ణుండు హస్తిపురంబునకు రాజై విగాజితవిభవంబునఁ బ్రసిద్ధినొందె.

ఆ. శ్వేతకర్ణుఁ డనంగ నాతని కుదయించి, యదుకులాబ్ధిచంద్రుఁ డగునుదారు
పుత్త్రి మాలిని యనుపూఁబోఁడిఁ బెండ్లియై, యఖిలరాజ్యసుఖము లనుభవించి.

వ. ఉండియుండి విరక్తుండై ధరణిపాలనకృత్యంబు నమాత్యులకు నిచ్చి వనంబున కరుగునప్పు డప్పొలఁతి యధికదుర్భరం బగుగర్భంబుతో నతనివెనుకం జనుచు నొక్కయెడ.

క. శైలనికుంజమునఁ దనయు, బాలార్కప్రతిముఁ గాంచి పతిశుశ్రూషా లోలయయి పోయె నచటన, బాలుని నిడికరము వెఱఁగుపడ భూతంబుల్.

వ. అంత.

కో. కొండవడ దాఁకి వాడి యొ, కండును దెసలేక యేడ్చుకోమలతను నా ఖండలసమానుని శిశువు, నిండినకృపఁగోరి చేరి నెఱి సంబునముల్.

వ. ఆత్మీయతోయకణంబులు నెయ్యన సంతర్పితుం జేయునెడ వసిష్ఠతనయు లైన పైలకపిలాదికౌశికు లనుబ్రాహ్మణోత్తము లెత్తుకొనిపోయిగర్భక్లేశంబు వాయం బర్వతనిర్ఘరంబునం గడుగఁబోటం బ్రక్కలు రెండును రాలుసోఁకి చిఱునెత్తురు వెడలి కంది యజతనుచ్ఛాయంబు లగుటం జేసి యజపార్శ్వుం డనుపేరువెట్టి.

క. వేమరుఁ డనుమునిపత్నికిఁ, బ్రేమముతో నిచ్చుటయును బెనిచె నదియు ను ద్దామనవ యౌవనంబున, భూమీశ్వరుఁడై కుమారపుంగవుఁ డెలమిన్.

వ. ఆవిప్రుల నందఱం దనకు మంత్రులంగాఁ గైకొనియె నన్నరనాయకునకు నమాత్యులకునుం బుత్రపౌత్రులనేకులు గలిగి తుల్యంబుగాఁ జిరకాలంబు బ్రతికి రిట్లు పూరుండు మొదలుగా నవిచ్ఛిన్నంబై వచ్చినపాండవవంశంబు జగంబున సుప్రతిష్ఠితంబై వెలయుచున్నది యని యవ్విధంబున నహుషసూతి యగుయయాతి చెప్పినశ్లోకం బొక్కటి గలదది యెట్లనిన.

క. రవిశశితారలు వెలిగా, దివి యున్నను నుండుఁగాని తెల్లంబుగఁ బౌ రవవంశము లేకుండుట, భువి నెందును లేదు కాలములు దగ మూఁటన్.

వ. అనియె నని చెప్పినసూతునకు శౌనకాదిమహామును లిట్లనిరి.

సీ. జనమేజయునకు వైశంపాయనుఁడు వాగ్మివిభుఁడాదరంబున విస్తరించి నట్టిమార్గంబున హరివంశకథనంబు సర్వంబు నితిహాసపూర్వకముగ నీ వుపన్యాసంబు గావింప వీనుల కమృతంబుపోనయై యమర మేము వింటిమి నెఱయంగఁ గంటిమి వాంఛితసిద్ధిఁ బుణ్యము లెల్లఁ జేరె మాకు ననఘ భారతాఖ్యానంబు నచ్యుతాన్వ, యప్రశంసయు వినినయనంతరంబ య్యాపరీక్షిత్తనూజుఁ డుదాత్తచిత్తుఁ, డేమి యొనరించె నవ్విధం బెఱుఁగఁ జెపుమః

వ. అని యడిగిన నతండు వారల కిట్లనియె జనమేజయుండు సర్పసత్రానంతరంబ ఋత్విక్పురోహితాచార్యులం బిలిచి.

గీ. హయమేధ మేనొనర్చెదఁ, బ్రియమునఁ బనుపుఁడు సమస్తపృథివినిఁ ద్రిప్పన్ హయరత్నము ననుటయు నటు, ల యియ్యకొని వారు నిర్మలప్రతిభ మెయిన్.

## శ్రీ వేదవ్యాస మునీంద్రుండు జనమేజయునకు నరాగతంబు చెప్పుట.

వ. సంభృతప్రారంభు లైనయవసరంబున.

శా. వేదజ్ఞుండు త్రిలోకవేది ధృతసంవిత్సంప్రమోదుండు ని
ర్వేదుం డప్రతిమప్రభావుఁడు తపోవిద్యానవద్యాత్మకృ
త్యోదీర్ణుం డవిదీర్ణధర్ముఁడు సముద్యుక్తుండు యుక్తుండు శ్రీ
వేదవ్యాసమునీశ్వరుండు గరుణ న్విచ్చేసె నచ్చోటికిన్.

క. మునిపతి నంతంతం గని, జనపతి పరిజనముఁ దాను సంప్రీతి నెదు
ర్కొని యర్ఘ్యపాద్యముఖ్యా, ర్చనములఁ బరితుష్టుఁ జేసి సవినయబుద్ధిన్.

వ. కొంతసేపు విచిత్రవాక్యార్థసంవాదంబునం బ్రమోదించి పదంపడి యమ్మహా
త్ముతో నిట్లనియె.

శా. సర్వామ్నాయపురాణశాస్త్రపదవీసంభావితార్థస్థితుల్
నిర్వాహంబునఁ బొంద సర్వకవితానిర్బంధముం బూర్ణమై
గర్వాహూతిఁ దలిర్ప సర్వజనతాకర్ణామృతస్యందిగా
సర్వజ్ఞుల్ భువి మీరు భారతము ప్రజ్ఞం జేఁత యింతొప్పునే.

క. హరివంశకథోత్తరముగఁ, గురువంశకథారసంబు గ్రోలెదు నెడ నెం
డుగసంబులు చెవు లొల్లవు, పరవశమై మనసు చెవులపాలిద యయ్యెన్.

ఉ. ఇంతకృతార్థతన్ వెలయునే కురుపాండవకీర్తు లిట్టు ల
త్యంతగుణోజ్జ్వలం బగునె యాదవవృత్తము యోగదృష్టి మీ
కెంతటఁ బర్వె నంతయును నెందును దెల్పెడువాఙ్మయంబుప
ద్యంతముగాఁగ భారతమహాగమ మిమ్మెయి మీరొనర్చుటన్.

క. భారతమున హరివంశము, పారాయణమొండె వినియుఁ బ్రాజ్ఞోత్తమ నా
కోరిక దనియదు వెండియుఁ, గోరెడు భవదీయవాగ్విగుంభనరుచికిన్.

వ. కావున నొక్కటి యడిగెద రాజసూయమహాయజ్ఞంబు సేయుమనునప్పుడు తత్క్రియాపరిసమాప్తివలన నపరిమితజనక్షయకారణం బగునని నారదుండు సెప్పిన వినియును ధర్మజుం డేల ప్రవర్తిల్లెఁ దొల్లి సోమునిరాజసూయంబువలనఁ దారకామయసంగ్రామంబును హరిశ్చంద్రురాజసూయంబువలన నాడిబకయుద్ధంబును బహుజీవలోకంబున కపాయకరంబులై కలిగె ననం బెద్దలచేతం బ్రాజ్ఞులు వినియుండుమరు పాండవజ్యేష్ఠుం డయ్యనుష్ఠానంబునఁ జొరకుండునట్లుగా నుడిపెడుతలంపు మీకునుం బుట్టదయ్యెనే యిది నామనంబున నెప్పుడుం గలిగియుండు.

శా. త్రైకాల్యజ్ఞులు సర్వభూతహితచేతస్కు ల్విశేషించి మీ
రీకౌరవ్యకులప్రరోహమునకున్ హేతుత్వసంభావితుల్

మాకెల్లఁ భయదోషవిప్లవములఁ మాన్పఁ శరణ్యుల్ శుభ
శ్లోకాపేక్షు లుపేక్షసేయుటకు నెట్లో మూల మయ్యాపదన్.

క. ఇది యగుఁ గాదనఁ దగువా, రోదవనిదుర్మతులఁ గీడు లొందుంగా శ
భ్యుదితమతు లగుసనాథులఁ, గడియును నే వికృతులును జగత్త్రియవంద్యా.

వ. అనినసమ్మహాత్ముం డమ్మహాబుద్ధి కిట్లనియె.

క. విను మప్పటిజనములకును, జనవర యవసాన మొందుసమయము సేరం
జనుదెంచుటఁ గ్రతువిధికై, జనియించెఁ దలం పజాతశత్రునకాత్మన్.

తే. కాలచోదితు లయి భావికాలగతులు, వార లగుట నేనును వారిఁదగమి
నెఱిఁగియును జెప్పనైతి సమిద్ధబుద్ధు, లే మెఱుంగుదు మని వత్తురే తలంప.

క. మదిఁ గడఁగి కాల మెఱుఁగుట, తుది నెఱిఁగియుఁ బౌరుషమునఁ ద్రోవఁగ భరమే
చదురునకు బ్రహ్మ వ్రాసిన, నుదుటిలిపులు దుడువఁ గలవె నూలొక్కనువెరవుల్.

వ. అయిన నేమి నీకు ననాగతంబు సెప్పెద నీవశ్వమేధంబు సేయుతలంపున నున్న వాఁడవు తత్ప్రారంభంబు నొనర్చెద వమ్మహాక్రతువు శతక్రతుచేత విఘాతంబు నొందెడుఁ బ్రారంభింపవ తక్కెద వన్నను పౌరుషంబుకంటె దైవంబు బలవంతంబు గావున నవశ్యంబును దోషంగన వలసియుండు నింతట నుండి యశ్వమేధయాజు లగురాజు లెవ్వరు లేకయుండుదురు సేనాని యనుపార్థివుం డీకలియుగంబునం గడపట నమ్మఘుం బొనరింపం గలవాఁ డదియాదిగాఁ దదీయాన్వయజాతు లెల్లం దనుష్ఠాననిష్ఠు లయ్యెద రనిన జనమేజయుండు.

క. కలియుగమున ధర్మంబును, నలిగులియగు నని సుధీజనంబుల వాక్యం
బుల విందుఁ దత్ప్రకారం, బలఘువచోవిభవ నాకు నానతియీవే.

శ్రీవేదవ్యాసమునీంద్రుండు జనమేజయునకుఁ గలియుగధర్మంబు లెఱిఁగించుట

వ. అనినవేదవ్యాసుం డతని కిట్లనియె.

తే. వర్ణములు నాశ్రమంబులు వసుమతీశ, కలియుగంబునఁ గత్తెఱఁగలసి పోవుఁ
గానధర్మంబు రూపయి కానరాదొ, కింత గలిగిన నది ఫలం బెక్కుడించు.

క. అరులు గొనియు నృపతులు ప్రజ, నరయ కుపేక్షింతు రుర్వి నక్షత్రియులున్
బరిపాలింతురు వారలు, పరహితము లొనర్ప రాత్మభరణమ తక్కన్.

తే. ఆయుక్తియులై బ్రాహ్మణులాత్మవిధులు, విడిచి శూద్రులఁ గొల్తురు వినుము శూద్రు
లంచితబ్రాహ్మణాచారులై చరింతు, రిరువెఱఁగువారు భుజియింతు రేకపఙ్క్తిఁ.

క. చోరులు నరపతు లగుదురు, చోరు లగుదు రవనిపతులు సుజనచరిత మె
వ్వారికి నపూజితము ధన, మేరూపునఁ బడయుటయ యభీష్ట మొకండున్.

క. భృతి గానక భృత్యజనులు, పతి యొసఁగనిసొమ్ము లాసపడుదురు మనుజుల్
పతితుల దెస నొక్కింతయు, మతిరోయరు గలయుటకు సమస్తక్రియలన్.

క. కూడమ్మికొంద్రు జనములు, బాడబు లాగమము లమ్మి బ్రతుకుదు రెందుం
జేడియ లమ్ముదు రచ్చోటు, గాడుపడిన కలియుగమునఁ గౌరవముఖ్యా.

తే. పండ్లతెలుపున్న నింద్రియప్రతతిగెలుపుఁ, దలలబోడతనంబుఁ గావుల బెడంగుఁ
గలుగు ధర్మంబు శూద్రులతలన నిలుచు, శాక్త్యబౌద్ధాదిదుర్మత శ్లాఘలెసఁగు.

క. క్రూరపుమృగములు గములగు, గోరాశి యడంగిపోవుఁ గుజనులు వృద్ధిం
గూరుదురు సాధుజనులకు, దారుణదుర్దశలు పొందుఁ దఱచుగ నెందున్.

క. కడపటిభూములు నడుమగు, నడుభూములు కడప లగు విప్రమస్థలినున్
కడగొంద్రు జనులు సెఱుపం, బడుఁ జేనులు చిత్రవృష్టిఁ బండవు మిఱ్ఱున్.

క. అడిగెడువారలు మునుమయి, పుడికెడువాఁ డొకఁడు లేక పురుషాల్పతమై
పడఁతులు తఱుచై కులములు, సెడి యన్యులు ప్రబలి జగము శిథిలత నొందున్.

క. ముచ్చులు జారులుఁ బోరిఁబోరిఁ, జిచ్చులఁ గఱవులను రాచసిలుగులఁ జెడియున్
జచ్చియుఁ బ్రజ కొంచెముగా, నెచ్చోటులుఁ బాడగును మహీతలమెల్లన్.

క. ఒడఁబాటులు సత్యములున్, గడు నమ్మఁగఁ బల్కుటలును గయికొనక వృథా
విడుతురు జనములు ఋణ మి, చ్చెడికొనియెడిచోటఁ దగవు సెల్లకపోవున్.

క. చదువక పెద్దలగోష్ఠికి, నొదవక ధర్మంబు లెఱుఁగ కూరక మిగులన్
జదివినవారై యెఱుకలు, పదివేలు నటింతు రుర్విఁ బండితమానుల్.

క. పరలోకము సందియ మని, చిరములు జీవితము లని యసిద్ధము సుకృతో
త్తరఫల మని పాటింతురు, శరీరములను సువిహితప్రసరసౌఖ్యములన్.

చ. వినిమయయాజ్యయాజనము విప్రు లొనర్తురు యజ్ఞముల్ దపం
బుఁ ననఘు జట్టి యిత్తురు విమూఢతఁ బాయుదు రగ్నిహోత్రముల్
గొనకొని బ్రహ్మవాదులయి కొందఱు మద్యము గ్రోలి మాంసముల్
దిని ధనవాంఛమై జనులఁ ద్రిప్పుదు రుగ్రపువంచనంబులన్.

క. బలియును భిక్షముఁ బెట్టక, యిలువేల్పులఁ బూజసేయ కిచ్చమెయి గృహ
స్థులు గుడుతు రతిథిసత్కృతి, దలఁపరు పితృమేధవిధులు దడవరు బుద్ధిన్.

తే. కొడుకు తండ్రి నాజ్ఞాపించుఁ గోడ లత్త
నాదరింపక పనిగొను నతివ మొఱఁగి
మగఁడుఁ బతి డాగురించి భామయుఁ దిరుగుదు
రుఱక గురుని శిష్యుఁడు నిష్ఠురోక్తి నడుచు.

క. శారీరమానసము లగు, దారుణరోగములు మదము దర్పంబు ననూ
యారోషంబులు జనులవి, కారులఁ గావించు బెట్టుగా నెల్లెడలన్.

క. అతివైరము లతియుద్ధము, లతివిషమము లతిమగుత్తు లత్యాగ్నులు ప్ర
ఖ్యతి నొందించుమనుష్యుల, ధృతియును లజ్జయునుమురువుఁ దేఁకువయుఁ జెడున్.

సీ. అపగతస్వాధ్యాయు లపఘాతహవ్యు లహంకారదుస్సహు లధికమూర్ఖు,
లర్థపరాయణు లతిమాత్రలుబ్ధులు పరదారనిరతులు పరధనాప
హారులు కామపరులు నతిలోలు రనపేక్షు సాహసు లప్రియస్ఖలితవాక్యు
లప్రియచారిత్రు లపరాధకారులు నిజకార్యనిష్ఠులు నీచు లనఁగ
విప్రరాజన్యకులజు లుర్వీతలమున, ధర్మ మంతయుఁ జెడఁజేసి తారుఁ జెడుదు
రాదరింతురు కొండియం బవనిపతులు, ప్రోవ రాశ్రితజనముల భూపవర్య.

క. ఇవ్విధమున నేధర్మము, నెవ్వలఁ బొడలేక పోవ నేమని జెప్పం
బ్రువ్వలుఁ బాములు మొదలుగఁ, గ్రొవ్వెసఁగఁగ నెందుఁ బరఁగికొని కాఱించున్.

క. అని చెప్పినజనమేజయుఁ, డనఘా యంతంత కెట్టు లగు మఱి లోకం
బనయము ఘోరంబిదియే, యనువునఁ గృతయుగము చొచ్చు సంతటిమీఁదన్.

వ. ఇది వినవలయు ననినం బరాశరతనయుం డిట్లనియె.

క. కలికాలము గలయంతయుఁ, గలుషము కా కొండు తెఱఁగు గలదే దీనన్
గలదోష ముగ్గడింపం, గొలఁదియె యందు జనియింపఁ గూడునె చెపుమా.

వ. నీవడిగినవిధంబు వివరించెద వినుము.

తే. కుటిలమన్నియుమము దమ్ముఁ గూటువప్రజ, పెద్దసేయఁగ నొకరాచపేరు దాల్చి
బలియురేలెదరరులఁ దూటులుగఁ ద్రుంచి, ధరణిఁ బామయేలికలును దస్కరులుగ.

సీ. తమలోస రాసి భూధవులు చూఱలు గొన్నఁ గలుము లెల్లనుబోయి నలవు లెడలి
బాంధవులును దారుబహుకుటుంబము ముదుసళ్లు బాలుర నఱచట్లమోచి
నీరు కూడును గాన కారటంబున భీతులయి పాఱెదరు కళింగాంగవంగ
కాశ్మీరభూములు గాశికి యనునేఱు చలికొండయును బెఱయలఘుగిరులు
సాగరానూపవనములు సంశ్రయింపఁ, గలరుజనులుపాడును బాడు గానియడయుఁ
గాక యీయుర్వియుండు రక్షకులుగాని, వారుఁ గాకుందురు ధరావరులు నపుడు.

ఉ. నారలు పట్ట లాకులు జనంబులు తాపసు లట్లు కట్టుదుర్
చీరలు గాఁగఁ బల్లములు చిక్కనికొయ్యలఁ ద్రవ్వి విత్తుదుర్
గోర్కిక యారటంబులుగఁ గొండలకాలువ లడ్డకట్టుదుర్
నీరికి నొయ్యనొయ్య నతినీతచ నొంది మనుష్యు లెయ్యెడన్.

చ. మలినములై శరీరము లమంగళతం గులగోత్రచిహ్నముల్
దొలఁగఁగ నల్పసంతతులతోఁ బరమాయువు ముప్పదేండ్లయై
కొలఁదికి వచ్చి లావులును గ్రొవ్వులుఁ బోవఁగ నింద్రియార్థసం
కలనము గొంచెమై మఱియుఁ గల్గు ననేకరుజావికారముల్.

వ. ఈభంగి నాభీలంబైన కాలంబు దప్పుగాఁ బరుగఁ గడపట సకలవ్యవహారవిచ్ఛే
దంబున నిర్వేదంబు పుట్టు నిర్వేదంబున సత్త్వగుణంబును సత్త్వగుణంబున నభి
జ్ఞానంబునుం గలుగుఁ గలిగి సాధుజనంబుల వెదకి పోయి యెయ్యది శోభనం
బేమి యొనర్చిన నిశ్శేషదోషనివృత్తి యగు నెట్టిది ధర్మం బని యడుగుదు రట్టి
తలఁపువారును బెక్కండ్రై యెల్లయెడల నొదవ నది కారణంబుగాఁ గ్రమ్మ
ఱ ధర్మంబు తలసూపి వర్ణాశ్రమగోచరంబై వర్తిల్లుచుఁ దొల్లిటిక్రమంబున
నెంతెంత హానియై వచ్చె నంతంతియ వృద్ధియు సంభవింప నవ్విధంబున కృత
యుగంబై తోఁచి పరిణమించు.

తే. రాహుకబళనమునసహిమరశ్మి పొలుపు
వెలయఁ గడఁగినసమాప్తి నిక్కలియుగమున
నొయ్య నడఁగు ధర్మము రాహువ్యాసరింపఁ
జంద్రరుచివోలెఁ గృతయుగోత్సవముదోఁచు.

క. గుణకర్మవిభాగంబులు, ప్రకటతపోధర్మములును బ్రహ్మవిబోధ
ప్రణయములు గృతయుగమ్మున, నణుమాత్రముఁ గొఱఁతవడక యతిశయముగనున్.

క. యుగములు త్రిమ్మటకాలం, బగణేయంబై చనంగ సకలజనంబుల్
జగతీవరపరివృత్తిం, బగుచుండు సముచ్ఛ్రయక్షయంబుల నోలిన్.

వ. మహామునులును ధర్మార్థకామరూపంబులై నయ్యాశంసనంబులం గోలజ్ఞులై యెల్ల
యాగంబుల నాత్మీయచరితంబు నస్ఖలితంబుగా నొనరించి నిర్దోషం బగుసంతో
షంబునఁ దపంబు పోషింతురని చెప్పినయమ్మహామునివాక్యం బమ్మనుజేశ్వరుం
డభినందించె నచ్చటిజనంబు లందఱు నానందపులకాశ్రుశోభితశరీరు లగుచు విని
యమృతాస్వాదతుల్యప్రమోదకల్యం బగుకల్యాణంబు గని రనంతరంబ.

క. అభిమన్యుపౌత్రు వీడ్కొని, సభాసదులు నతఁడు ననుప సమధికతేజో
విభవుఁడు పారాశర్యుఁడు, ప్రభావవిభాసితుఁ డభీష్టపథమున నరిగెన్.

### జనమేజయ మహారాజు అశ్వమేధయాగంబు చేయ నుద్యోగించుట.

వ. కురువంశగురుం డగునమ్మునిం గొంత దవ్వనిచి మగుడం జనుదెంచి జనమేజయుండు
సర్వసభ్యప్రకరంబును దత్తదుచితస్థానంబులకు వీడ్కొలిపి సర్పసత్రప్రదేశంబున
నుండి యఖండితైశ్వర్యం బగుపరికరం బమరం గరిపురంబు ప్రవేశించి.

మ. భుజగేంద్రాయతభోగభాసురభుజాభోగంబునన్ భూభరం
బజితశ్రీయలరారఁ దాల్చి జనముల్ హర్షింప నుత్కర్షభా
గ్భజనీయోత్తమరక్షణక్షమతమైఁ బ్రాచ్యక్షమాధీశులన్
విజితోత్సేకులఁ జేసె నూర్జితయశోవిక్రాంతదిక్చక్రుఁడై.

వ. ఇట్లుండి కొంతకాలంబునకుఁ బూర్వసంకల్పితం బైనయశ్వమేధంబునకు నుత్సహించి సముచితసమయంబున సముగ్రదీక్షామంగళం బంగీకరించె నంత.

సీ. ధరణి నంతటఁ ద్రిప్పి మరలంగఁ దెచ్చినయశ్వంబుఁ బ్రోక్షించి యంతికమున
నధ్వర్యుఁడును రాజు నంతంత నుండ నారాత్రి యమ్మేదినీరమణుదేవి
కాశిరాజతనూజ కమనీయమూర్తి వపుష్టమ విధియుతంబుగ హయంబుఁ
గదిసి నిద్రింపంగఁ ద్రిదశేశ్వరుఁడు కాంతఁ గామించి ఘోటకాంగంబు సొచ్చి
చెలువఁ జెనకుటకై చరించిన నెఱింగి, నృపతి తురగంబు మేదిలెడు నెఱయ నేల
ప్రోక్షణము సేయ రనిన సబ్భ్యాసుఁడుండు, సెప్పె నతనికినదియింద్రుచేష్టయగుట.

వ. విజ్ఞానమహనీయుం డగునతం డట్లు చెప్పినం గోపించి రాజర్షిముఖ్యులును విప్రముఖ్యులును వినుచుండ నేను యజ్ఞదానతపఃఫలంబుల సపరిమితంబు లగుసుకృతంబులు సమకూర్చితి నేని విశుద్ధాన్వయప్రభవుండ నేనిఁ బ్రజాపాలనంబున నప్రమత్తుండ నేని నిర్జితేంద్రియుం డగునిర్జరేంద్రుఁ డేఁడు మొదలుగా నేరాజును వాజిమేధయాగంబున యజింపకుండెడుమని శపియించి యద్దురాత్మునిదౌరాత్మ్యంబు పొందకుండ ననిందితం బగునియమంబు నిర్వహింపం జాలనివృథాకర్మశీలు రీవిప్రులెల్లను మదీయరాష్ట్రంబున నుండవలవ దెందేనియు వెడలిపోవునది యని పలికి పత్నీశాలయం దున్నయువిదలం జూచి వపుష్టమం జూచి

ఉ. నాయశము న్మగంటిమియు నానయు వమ్ముగఁ జేసెఁ జూడఁగా
దీయసతిఁ మదీయగృహ మిప్పుడ వెల్వడఁ ద్రోచి రండు గా
లేయకలీఢ మైనహవి లెస్సగఁ జూతురె యన్యదూషితం
బాయఁగ వైవఁగాక కట ప్రాయిఁడయైనను నిచ్చగించునే.

జనమేజయునకు విశ్వావసుండను గంధర్వుండు హితోపదేశంబుచేయుట.

క. అని యొత్తిలి యాడఁగ నా, ఘనభుజు విశ్వావసుఁ డనుగంధర్వవిభుం
డనఘుఁడు సనుదెంచి ప్రియం, బున నిట్లనునద్భుతంబుఁ బొందఁగ జనముల్.

చ. అలుగకు పార్థివేంద్ర భవదన్వయభూషణ మివ్వరాంగి యే
కలుషముఁ బొంద దింద్రుఁడు మఖంబులఁ బేర్చిననీనిరూఢికిం
గలఁగి యొనర్చెఁ జూవె తురగంబు శరీరము సొచ్చి మాయ నీ
కలఁకి క్రతుక్రియావిధికిఁ గల్పితవిఘ్నతఁ గాంచె హర్షముల్.

ఆ. వినుపతివ్రత లగు వెలఁదులదిక్కురా, వెత్తియే యమర్త్యవిభుఁడు నీకు
వలవ దతనివిూఁదివైరస్య మనుకూల, వృత్తిఁ బోలునయ్య విప్రియంబు.

క. విదితయశుఁ డైనపురుషుఁడు, పదిలుండై కూడినేడువఁ బడయక సోమం
బొదవఁగ రాయుట యేటికి, నెదిరిం దనయట్లకాదె యేకార్యములన్.

తే. అనఘ యప్సరోరత్నమై యలరురంభ, యివ్వపుష్టమయై పుట్టె నీలతాంగి
దియ్య మెసఁగ భజింపుము దేవతాంశ, భవము యోగ్యంబుగా దెసంభావనలకు.
క. ఖరకరదీప్తులు వైశ్యా, నరశిఖలును బోలె నెసఁగునడవడిపేర్మిన్
బరఁగు పురంధ్రులు దోషముఁ, బొరయరు ద్వా రెచట నేమిపొందున నున్నన్.
క. పాపంబు లేనికులసతిఁ, గోపంబునఁ గుతిలపఱుచు కుత్సితునకుఁ ద
త్పాపంబులు బహుతరపరి, తాపం బిహపరములందుఁ దరికొల్పునృపా.
క. తమయింటిస్త్రీలుగారే, సమంచితాచారలయిన సాధ్వులు సత్కా
రము ప్రేమము సల్లాపము, సమర్పఁగా వలయు వారియం దనిశంబున్.
వ. అనిచెప్పినం గలంక దేఱి జనమేజయుండు వపుష్టమ నభేదదృష్టిం జూచి విప్రు
లం బ్రసన్నులంజేసి దేవేంద్రునిదిక్కు విమతత్వంబు విడిచి గంధర్వపతివలనం
బ్రీతినొందె నతండును నిజేచ్ఛం జనియె నంత.
క. పురి కరిగి తొంటిపగిదిన, సరసమహీరాజ్యవిభవసమ్మోదమునన్
దరుణియుఁ దాను నెలర్చెం, బరీక్షిదాత్మజుఁడు ధర్మపరిణతబుద్ధిన్.
తే. వ్యాసవాక్యస్వరూపమై యతిశయిల్లు, నీభవిష్యత్కథాజాత మెవ్వఁ డర్థి.
వినుఁ జమవు వాని కాయువు వృద్ధిఁబొందు, బుద్ధి వర్తించువిభవానుభూతిపొడల.
క. శతమఖజనమేజయత, త్క్రతులకు నపకల్మషప్రశంసన మగునీ
యితిహాసము వినువారి దు, రితరహితులఁ జేసి యిచ్చు నిచ్ఛాపూర్తిన్.
వ. అని చెప్పి హరివంశభవిష్యత్పర్వరూపం బగువాఙ్మయం బంతయుం బేర్కొని.
సీ. ఇప్పురాణం బెప్పు డింపార జిహ్వకు నమృతంబుగాఁ గ్రోలునట్టివారు
శ్రవణరసాయనం బవునట్లుగా నాత్మ నెలకొల్పువారును నిత్యసుకృతు
లై దుఃఖనిర్ముక్తులై సారసంసారసుఖములు జబ్బనఁజాఁ బలాడి
యాత్మజ్ఞులయి తుది నఖిలలోకముల వర్తింతురు సిద్ధత్వదీప్తమహిమఁ
గన్య విన్ని పొందు సద్భర్త గర్భిణియును, విని సుపుత్రునిఁ గను బేద విని సమర్థుఁ
డగు మహారోగి విని త్రోచు నఖిలరుజలు, బంధనస్థుఁడువిని పాయుబంధనములు.
మ. ధరణీదేవుఁడు భక్తి విన్న సుకృతోదాత్తస్థితిం గాంచు భూ
వరుఁ డొందున్ సకలక్రియావిజయమున్ వైశ్యుండు లాభోన్నతిన్
బరఁగున్ శూద్రుఁడు సత్యసౌఖ్యవిభవప్రాప్తుం డగు న్నిత్యను
స్థిరదేవత్వవిభూతి యిందఱకు సాదృశ్యంబునం జేకుఱున్.
వ. అనినసంతసిల్లి శౌనకాదిమహామునులు సూతుం బ్రియసత్కారంబులంబూజించి.
క. జనమేజయ వైశంపా, యనులకు సద్గోష్ఠి యనఘ హరివంశాక
ర్ణనమునఁ బరిపూర్తిశ్రీ, గనియెను మఱి కలదొ శేషకథ యేమేనిన్.
వ. అవ్విధం బెట్లనిన నక్కథకుం డమ్మునులం జూచి.

తే. వినుఁడు హరివంశకథ యెల్ల విని కురూద్వ
హుండు సాత్యవతేయశిష్యునిఁ బ్రియమున
నడిగె మఱియును విష్ణుకథాంశవిలస
నంబు మీ కెఱిఁగింతుఁ దన్మతము వరుస.

వ. జనమేజయుండు వైశంపాయనుతో మునీంద్రా కృష్ణావతారకథనంబునకుం దొడంగుసమయంబునఁ బౌష్కరవారాహనారసింహత్రైవిక్రమంబు లగునవతారంబులకథలును సంక్షేపరూపంబున నుదాహరించితి భవదీయవాక్యామృతాస్వాదనంబున మనంబునకుం దనివి లేకున్నది గావునఁ బ్రత్యేకంబ తద్విస్తరంబులు వినఁ గోరెదఁ బుష్కరనాభుండు పౌష్కరం బనునవతారంబున నెంతకాలంబు పుష్కరశాయియై సౌఖ్యం బనుభవించు మేల్కని లోకసృష్టికి నెవ్విధంబున నిచ్చగించు నెవ్వరికి సృష్ట్యధికారం బొసంగు నెవ్వరు సృజియింపంబడుదు రఖిలచరాచరజంతుప్రణాశంబై యప్రకాశం బైనయాకాశంబున నక్లేశంబునం గేశవాత్మకం బగుపరమాత్మజ్యోతి యే తెఱంగున విద్యోతించు నింతయు సర్వజ్ఞప్రవరుండవై నన్ను యడుగవలయు నీవ చెప్పశక్తుండవు శుశ్రూషువులైనమాబోంట్లఁ గృతార్థులం జేయుట మీయంతటి పెద్దలకుఁ గర్తవ్యంబు గాదే యని ప్రార్థించినం బార్థివున కతండిట్లనియె.

క. నారాయణాంశజాతులు, గారేనిఁ దదీయతత్త్వగరిమ యెఱుంగం
గోరునె చిత్తము పుణ్యా, ప్రారంభుఁడ వీవు విష్ణుపరతఁ గృతాత్మా.

వ. అడిగి మేలు సేసి తేను బురాణవిదు లగుకోవిదులవలన వినినవిధంబునను విద్వదారాధ్యుం డగుకృష్ణద్వైపాయనుండు నిజతపోబలంబునం గని యానతిచ్చిన మార్గంబునను మదీయబుద్ధి కెయ్యది ప్రకాశంబై తోఁచె నదియంతయు నెఱింగించెద మాధవమాహాత్మ్యంబునందలిసాకల్యబోధంబున నాదివేధయు వైధుర్యవివశుండ యనినం దపస్విమాత్రుం డెట్లు శక్తుం డగు నాకర్ణింపుము.

సీ. గోప్యవేదముల కతిగోప్య మనంగను దత్త్వవాదుల కాదితత్త్వ మనఁగ
నాత్మబోధనుల కధ్యాత్మంబనంగను వేదశ్రుతికి నిత్యవేద్య మనఁగఁ
గర్తయుఁ గరణంబుఁ గార్యంబుఁ బురుషుండుఁ బ్రకృతియు బుద్ధియుఁ బ్రాణచయముఁ
గాలంబుఁ గళయు వక్తయును వక్తవ్యంబు వాక్కను ననుబహుత్వంబు లెల్లఁ
దానయైనిత్యుఁ డమృతుఁ డద్వంద్వుఁ డజరుఁ డప్రమేయుఁ డనాద్యంతుఁ డజుఁ డనంగఁ
బరఁగువిష్ణుండు విశ్వైకభర్త నిఖిల, మునకు నొకరుండ సంహర్త పుణ్యయశుఁడు

వ. కృతత్రేతాద్వాపరకలినామంబు లగునాలుగుయుగంబులుం బండ్రెండువేలదివ్యాబ్దంబులం బర్యవసితంబు లగు నట్టిచతుర్యుగంబులును డెబ్బదియొక్కమాటు దిరిగిన మన్వంతరం బగు నట్టిమన్వంతరంబులు పదునాలుగు ససంధికంబులయుచునుట

సహస్రయుగపరిమితం బైనబ్రహ్మదివసంబాదివసంబుకడపటం బరమపురుషుండు సప్తమూర్తి యుగుమార్తాండుండై సర్వప్రాణిజాతంబును భస్మీకరించి యాత్మో ద్భవం బగుదివ్యసలిలంబున నఖిలంబును నాప్లావితంబు చేసి యేకార్ణవసంజ్ఞం బైనయమ్మహాజలౌఘంబున నద్భుతాకారుండై పవ్వళించియుండు.

మ. విను మమ్మైం బవళించి యున్నవిభుఁ డీవేషంబువాఁ డిట్టివాఁ డనఘాయింత తదీయసుస్థితికర్తం బైనకాలంబు మే లనుచందం బిది నా నెఱుంగఁ డొకడుం గాలంబు గర్మంబు నా తనికిం గీడ్వడియుండుఁ గావున నచింత్యంబుల్ తదాకారముల్.

జనమేజయునకు వైశంపాయనుఁడు మార్కండేయచరిత్రంబు చెప్పుట.

వ. మఱియు నొక్కయాశ్చర్యంబు గలదు మార్కండేయుం డనుతపస్వి యమ్మహా ప్రళయసమయంబున నమ్మహామూర్తిం గని తత్సంభాషణసౌహార్దం బనుభ వించి కృతార్థుం డయ్యె నవ్విధం బతనివలన వినినవారెల్లను నెఱుంగుదురు తత్ప్రకారంబు విను మమ్మునివరుం డద్దేవునియుదరాభ్యంతరంబున లబ్ధసన్ని వేశం బగుభువనప్రపంచంబునందుఁ దీర్ఘయాత్రాప్రసంగంబునం బృథివియంత యుం బరిభ్రమించుచుఁ గ్రమంబునం జనుదెంచి తదీయవదనమార్గంబు వెలు వడితె నయ్యది యెయ్యదియొ యొండుం దా నెఱుంగండు పరవశుండై మహాతి మిరసంవృతం బైనయమ్మహాప్రళయసలిలంబు సొచ్చి.

ఆ. తల్లడంబు నొంది తనజీవితమునందుఁ గరము సంశయించి కలయొ భ్రమయొ మాయయొ తలంప నీయుగ్రదశ నిజం, బగునె యెందు నిట్టి యద్భుతంబు.

చ. తరులు గిరుల్ నరుల్ సురలు దైత్యులు పక్షులు లోనుగాఁ జరా చరతతి చూడఁజూడ నవసన్నత నెందడఁగెం దమంబు ని ర్భరమయ్యె యిమ్మెయిం బొదల భాస్కరచంద్రవిలాస మెచ్చటన్ సురిఁగె మహాజలం బఖిలశూన్యతఁ బేర్చుట యేమి చందమో.

వ. అని తలంచుచు నటఁజూచునప్పు డెపుర నుదకమధ్యంబునం గాలాంజనపర్వతం బునుంబోలె నతిప్రమాణం బగుదేహంబుతోడం దనతేజంబ తన్ను వెలయిం పం దోయోత్థితం బగుజీమూతంబు మాడ్కి నుల్లసిల్లుపురుషుండు దృష్టిగోచ రుం డగుటయు.

క. కని యితఁ డెవ్వఁడొ యేనీ, తని నడిగెదనివ్విధంబు దప్పక నిఖిలం బును నని యెయ్యన్యజేరం, జని తద్వదనపవమానసంఘమున వడిన్.

వ. ఆకృష్యమాణుం డయి తదీయజఠరంబు ప్రవేశించి యందుఁ బూర్వపరిచితం బైనజగం బాలోకించి తనవశంబుగాక యెప్పటియట్ల తిరుగం దొడంగి యక్క

డక్కడ ననేకాధ్వరప్రసక్తు లయినయజమానులను బుణ్యాదేశంబులం దపస్స్వాధినిరతులయి యున్నయోగీంద్రులను దమతమయాచారంబులం దగిలి నడుచువర్ణాశ్రమధర్మంబులం గలజనులం గనుంగొనుచు విష్ణుమాయవలన, నెందును గాల్కొని నిలువ సంభ్రమింపక శతసహస్రసంఖ్యలయేండ్లు చరియించి యుం గుక్షిలోఁ గడపలఁ గానఁడయ్యె నతని నివ్విధంబున.

క. డయ్యుఁ దిరిగించి దేవుం, డొయ్యన వెడలించె నోరియూర్పునసమ్మై నయ్యమివర్యుఁడు వెలువడి, యియ్యెడ గనుఁగొనియెఁ దొంటియేకార్ణవముల్.

వ. అందుమహోన్నతం బగువటభూరుహం బొక్కటి గాంచి తదీయపర్ణపర్యంకంబున.

మ. తనకాంతిన్ విలయాంధకారము నిరస్తంబై కడున్ దవ్వగాఁ
జనఁ బూర్ణేందునిభంగి లోచనసమాస్వాద్యాకృతిం బొల్చుబా
లుని నీలోత్పలదామకోమలతనున్ లోలత్కచార్కిన్నఫా
లునిఁ గాంచెన్ మధురస్మితోజ్జ్వలముఖున్ లోకైకరమ్యోదయున్.

చ. కని తనమున్నుగన్నటులు గామికి విస్మయవారిరాశిలో
మునుఁగుచు నమ్మహార్ణవసముద్ధతవీచులమీఁదఁ దేలుచున్
మునిపతి ఖేదభారమున మోహము నొందఁగ నట్లుబాలుఁడై
తనరుప్రభుండు విస్ఫురదుదాత్తమనోజ్ఞమితస్వరంబునన్.

క. పాపఁడ మార్కండేయుఁడ, తాపసపూజితుఁడ వలదు తలఁకంగ భవ
త్తాపం బెఱుఁగుదు నాదు న, మీపంబున కెలమి రమ్ము మేలొనరింతున్.

వ. అనినవిని కోపించి యతండు.

చ. అమితసహస్రవర్షవిశదాయుషు నన్నిటు లెవ్వఁడొక్కొ నా
విమలతపంబు గైకొనక వృద్ధత సూడక బాలుఁగా నవ
జ్ఞమిగుల నిట్లు పేర్కొనియె సర్వపితామహుఁ డబ్జసూతియున్
సమధికదీర్ఘజీవి యనుశబ్దము పెట్టక పిల్వఁ డెన్నఁడున్.

తే. ఇట్టిగర్వితుఁ డస్మదీయేరితోగ్ర, శాపమునఁ బ్రేరితం బగుచండమృత్యు
వునకు నెరగాఁ దలంచెఁ గా కని తలంప, మఱియు నల్లననగుచు నమ్మాయశిశువు.

వ. అతని నుద్దేశించి.

మ. అనుమానింపకు రమ్ము నే ననఘ నీ కాయుఃప్రదుండైన తన
ర్చినదేవుండ నిరంతరంబును సమర్చింపంగ నర్హుండ నీ
జనకుం డాదిఁ దపం బొనర్పఁ బరితోషం బంది యీ సర్వభూ
తనికాయక్షితియందుఁ జావనిసుతున్ ధన్యాత్ము నిన్నిచ్చితిన్.

క. ఇంతటివాఁడవు గా కి, ట్లంతము నాదియును లేనియవ్యయు ననుఁ గ
ల్పాంతక్రీడారతు ని ని, శ్చింతతఁ గనుభాగ్య మెట్లు సేకుఱె నీకున్.

చ. అనుటయు నాత్మఁ డాత్మ వెగడంతయుఁ బాయఁ బ్రబోధలక్ష్మి గ్ర
మ్మనఁ దలయెత్తి నాద్యు ననమాను సనాతను వాసుదేవుఁ డాఁ
గన్ని కదియంగఁ బోయి ఘనకౌతుక సంభ్రమభక్తియోగముల్
పెనఁగొన గోత్రనామములు పేర్కొని నెమ్మి నమస్కరించినన్.

వ. ఇందు ర మ్మని దేవుండు సమధికాధికారంబు సూపుటయుఁ జేరం జని విస్రమగా
త్రుండై నిలిచి కేలు మొగిచి ఫాలస్థలకీలితంబు గావించి.

చ. ఉదరమునందు విశ్వమును నున్న ది వెల్వల శూన్య మిమ్మెయిం
బొదలినమఱ్ఱియాకుపయిఁ బొచ్చెపుబాలుఁడవై వినోదసం
పద విలసించె దింతటికిఁ బ్రాప్యము నాఁ దగుభూత మీవకా
నొదవెడుఁ దర్కమిట్టి దనియుం దెలియ న్భయమయ్యెడిం దుదిన్.

క. నను నాశ్రితుఁడుగఁ గై కొని, మను చుటకుం దగ భవత్సమగ్రవిభవముల్
గను తెలివు నిచ్చి నెఱపుము, ఘన మగునీకరుణ పెంపు కారుణికవరా.

నారాయణుండు మార్కండేయునకు నాత్మప్రభావం బెఱింగించుట.

క. నావుడు మున్ను ప్రసన్నుఁడు, గావున నద్దేవుఁ డాత్మగౌరవ మెల్లన్
వేవిధముల నిట్లని య, ప్పావనచరితునకుఁ జెప్పెఁ బ్రస్ఫుటఫణితిన్.

తే. అనఘనారాయణుఁడు నాఁగ నాద్యమైన, దైవతంబను బ్రహ్మనై తగ నఖిలముఁ
దొలుతఁ గలిగింతుఁ గడపటఁ బ్రళయదహన, చండమూర్తినైయంతయు సంహరింతు.

క. క్రతుకోటులెల్ల ను శత, క్రతుఁడై చేసితినిఁ గ్రతువు గ్రతుపురుషుఁ డనన్
నుతికొంతు హుతవహుఁడనై, హుతములఁ గ్రతుభోగరతులకొసఁగుదుఁ దృప్తిన్.

ఉ. వేయికరంబులన్ వెలిఁగి విశ్వజగంబు వెలుంగఁ జేయుదున్
వేయిశిరంబులం దనరి విశ్వజగంబును దాల్తుఁ దాలిమిన్
వేయియుగంబు లిచ్చమెయి విశ్వజగంబుల కిత్తు సంస్థితుల్
వేయిముఖంబులన్ వెలయువిద్యలు ధర్మములున్ మదాకృతుల్.

క. క్రియయును గ్రియాఫలంబును, గ్రియారహితపురుషుఁడును బ్రకృతియున్ విద్వ
త్ప్రియము లగుసాంఖ్యయోగా, శ్రయపరిబోధములు నానుసంజ్ఞలు వత్సా.

తే. అంబరము వాయు వగ్ని తోయంబు పృథివి
దెసలు పర్జన్యుఁ డబ్ధులు దీవు లేఱు
లమృతకరుఁడు తారకములు యముఁడు కాల
మింతయును నన్న కాఁ జూడు మింత నిజము.

క. బాడబదహనుఁడనై వడి, నేఁడు సముద్రములజలము నేఁగ్రోలుదు నీ
రేడుజగంబులు విలయముఁ, గూడెడు నెడఁ దజ్జలంబు గొనకొనివిడుతున్.

క. మునివర యింక బహూత్కృతులఁ, బని యేమి చూడ వినఁగఁబడియెడునవి యె
ల్లను నేనయేను గానిది, యణుమాత్రంబేల కలుగ దణువును జగతిన్.

క. జ్ఞేయం బని యెయ్యది ప్ర, జ్ఞాయుక్తులు యుక్తబుద్ధిఁ జర్చింతురు నీ
వాయిద్ధపదము మార్కం, డేయ కనుము నన్నుఁ గాఁ బటిష్ఠపునిష్ఠన్.

తే. విలయసంప్లవంబు వెలుపలఁ బరచించి, లోన నబ్జభవుఁడు లోనుగాఁగ
నడఁచినాఁడ జగము సర్వమున్నాఁ డాని, కాన మీవు కొంత గంటి గాదె.

క. నా వాఁడవైతి దుఃఖము, లేవియు నినుఁ బొంద వింక నెప్పటిభంగిన్
నీవలసినయట్లుండుము, హావిస్తారముసఁ బొదలు నస్మత్కుక్షిన్.

వ. అని యానతిచ్చి స్వప్రవేశమార్గంబున నతని నాత్మస్థుం గావించె నమ్మహాముని
యు నచ్యుతప్రసాదలబ్ధంబైన యుపలబ్ధివిశేషంబున నశేషంబునుం గని యుల్ల
సిల్లె నని చెప్పి వైశంపాయనుండు మఱియు నిట్లనియె.

సీ. అమ్మెయి జలశాయి యైయున్న పరమేశుఁ డఖిలంబు సృజియింప నాత్మఁ దలఁచి
తనయందు తనబుద్ధిఁ దగిలించి యుగ్రంపుఁదప మాచరించి యుత్తపముపేర్మిఁ
గర్తవ్యమార్గంబు గాంచి సిసృక్షమై యోగనిద్ర యమున నెక్కొంతబయలు
గని యెయ్యెడ వెరపునఁ గలయంగ శబ్దంబు పొడమె శబ్దంబునఁ బుట్టె గాడ్పు.
గాడ్పు తోడ్తోడ మసరంగఁ గలిగె వహ్ని
వహ్ని ఘోరంబుగా దివ్యవారి దొరఁగె
వారి క్రమమున బలియంగ వారిగుహము
మొలచె నన్నాభియందును భూమమూర్తి యగుచు.

వ. అమ్మహాపుష్కరంబున మేరువు కర్ణికయును దిక్ప్రదేశంబులు దళంబులుఁ బర్వ
తంబులు కేసరంబులు నంబుధులు మకరందంబును నై యుండె నూర్ధ్వాధో
విభాగంబులు దేవాసురసన్నివేశంబులయి యుల్లసిల్లె.

చ. అతులహిరణ్యమూర్తి యగునయ్యరవిందమునందుఁ దోఁచి య
ద్భుతచతురాగమాత్మక చతుర్ముఖుఁడై నహిరణ్యగర్భుఁడ
ప్రతిమతపోవిభాసితవిభావసుఁ డచ్యుతు శాసనంబునన్
జతురుఁడు సర్వభూతచయసంజననిచింత నహించె నాత్మలోన్.

వ. ఆసమయంబున వాసుదేవవశంబునం బేర్చు రజస్తమోగుణంబులు రెండును
మధుకైటభు లనుపేళ్ల నతిప్రమాణదేహులగు నసురులై యాబిసరుహాసనుం
గని చేరంబోయి యనాదరంబున నతని కిట్లనిరి.

తే. తమ్మినడుకొనఁగూర్చుండి నెమ్మొగములు, నెమ్మినాలుగు ధరియించి పమ్మునాత్మఁ
గైకొనక యున్నవాఁడవు గర్వితుఁడవు, సెప్పు మెవ్వాఁడ వేప...యు దిచట.

క. నిన్నుఁ బుట్టించినవానిం, బనిపనిచినవానిఁ గావఁ బ్రభుఁ డగువానిన్
వినవలయుఁ జెప్పుమ పిమ్మటఁ, బెనఁకువ మమ్మునోర్చికొనుము పేరును బెంపున్.

వ. అనినం బరమేష్ఠి యప్పరమసాహసనిష్ఠులం గనుంగొని.

క. యెవ్వఁడ వని మీరడిగిన, యవ్వచనము నాకు నాహ్వయం బెవ్వనిపే
రెవ్వరు నెఱుఁగ రతఁడు నను, నివ్విశ్వంబును సృజింప నిటు సృజియించెన్.

వ. అమ్మహాత్ముండ యస్మదీయసంరక్షణక్షమం బగుప్రాభవంబునుం బూనినవాఁ
డనిన నద్దనుజులు తద్దయు విజృంభించి.

చ. వినుము రజస్తమంబు లనవిశ్రుత మైనగుణద్వయంబు మా
తనువులు గాన విశ్వవిదితం బగుపేర్మిఁ దనర్తు మేము ధ
ర్మనిరతులం దనూనరుచిమానుతు మర్థముఁ గామమున్ సుఖం
బును నిరతంబు భూతతతిఁ బొందుట లెల్లను మావికారముల్.

క. ఎచ్చట బహుళపరిగ్రహ, మెచ్చట సిరి మదము ముదము నెచ్చట నచ్చో
టచ్చుగ మానెలవుల యని, యిచ్చఁ గనుము యిచ్చగించె దేటికి నెరులన్.

వ. అనుటయుఁ బద్మసంభవుండు.

క. వినుఁడు రజస్సు దమస్సును, మును సృజియించినప్రభుండు మొగలిత్రిభువనం
బునకును సత్త్వగుణం బా, తనిసొమ్ము భవద్విరుద్ధధర్ముఁడు సూడన్.

వ. అమ్ముకుందుండు వీఁడె సమీపస్థుండై వెలింగెడు నతనిం గదిసి మీ రెట్టివా
రైననగుం డన్నిన నయ్యసుర లసురాంతకుం జేర నరిగి కృతాంజలులై నీవు
సకలభూతస్వామివి నీమహత్త్వంబు గంటిమి ని న్నుపాస్తిచేయుటకుఁ బ్రసక్త
మైనబుద్ధిఁ జనియించె నమోఘదర్శనుండవు నఖిలవరదుండవు నగు నీవలన వరం
బులు వడయఁగోరెద మనిన నతం డట్లకాక మీతలం పేమి యనుటయు.

మధుకైటభులను దనుజులు నారాయణునిచే నిహతులయిన వృత్తాంతము.

చ. దనుజుల దేవ నీవఖిలదర్పితులం దమియింపఁ గర్తవై
యునికి నిజంబుగా నెఱిఁగి యుండుదు మేము భవద్భుజాబలం
బున కిట నెమ్మెయిం బ్రిదిలిపోవఁగ లేము వధించె దేని మ
మ్మనఘ వధింపు తొల్లి నరు లన్యులు సావని యట్టితావునన్.

వ. నీకుం బుత్రులమై జన్మింపఁ గోరెద మనినం బురుషోత్తముండు మీకోరినయట్ల
చేసెదఁ గల్పంబుకల్పంబున మదీయశరీరసంభవు లయ్యెద రని యయ్యిరువురం
గరికరోరువు లగునూరువులపైఁ బట్టి యదిమి సమయించి బ్రహ్మకుం బ్రమో
దం బాపాదించె నంత.

క. ఆరాజీవభవుం డతి, దారుణ మగుతపము చేసి తద్దయుఁ బ్రబలుం
డై రచియింపఁగఁ దొడఁగె న, పారభువనసంచయ ప్రపంచము లోలిన్.

వ. అంతఁ దొలుత యోగసాంఖ్యంబులం దదాచార్యులను సృజియించి మహావ్యాహృతిత్రయంబున లోకత్రయంబు నుత్పాదించి నిజశరీరార్థంబున నఖిలవాఙ్మయమూర్తి యగుసుందరిఁ గలిగించి తదీయసంగతి ననేకకాలం బభిరతుండై సావిత్రిం గని యాయమ నవిత్రిగా నఖిలనిగమంబులు నిర్మించి ధర్మునిం బుట్టించి వరుస దక్షమరీచ్యత్రిపుల స్త్యపులహక్రతువులను గౌతమాంగిరోభృగువసిష్ఠదక్షమనువులను జనితులం జేసి వారివలన నాదిత్యరుద్రవసువిశ్వమరుత్సాధ్యాప్సరఃప్రభృతిదేవగణంబులను దైత్యదానవనివహంబులను యక్షరాక్షసగంధర్వాదిదేవయోనులను విహంగభుజంగమనుష్యమృగపశుపర్వతమహీరుహగుల్మలతాతృణసముదయంబులనుం గల్పించె నిది యంతయుఁ బౌష్కరసర్గంబనం బరఁగు నిట్టిసంసరణంబునందు.

సీ. వినుము గురూపాస్తి యొనరించి శ్రుతమునయంతంబు గని గృహస్థాశ్రమమున
నావృత్తయజ్ఞులై యలమితపంబునఁ బండినకర్మముల్ పాటవైచి
యాత్మసంప్రీతికి నలవడ్డకృతబుద్ధు లిపుడు గీతిఁ దెంచినయీప్రపంచ
మింతయు వెలిఁజూడ కంతరంగమునన కని నిరంతరయుక్తి గారవమున
విఘ్నములఁ ద్రోచి యుపసర్గవితతమూర్ధ్ని, లై నసిద్ధులఁ దగులక యప్పు నిగిడి
పొందుదురు నిత్యనిర్వాణభూరిచిత్సు, ఖాద్వయానందనారాయణాఖ్యపదము.

వ. పౌష్కరప్రాదుర్భావం బెఱింగించితి నింక నాదివరాహదేహుం డైనదేవదేవు చరితంబు వివరించెద.

మ. పరమం బెల్లపురాణజాతమునకున్ బ్రహ్మోక్తమత్యుత్తమం బరు
దామ్నాయసమంబు నాస్తికుల కీనర్హంబు గా దిమ్మహా
త్తరవిజ్ఞానము సాంఖ్యయోగసకలార్థజ్ఞానతుల్యంబు భూ
వరనీవర్హుఁడ వాత్మలోనునుప నవ్యాపన్న నృత్తోన్నతిన్.

వ. శుచియు సమాహితంబు సుచిత్తంబు శ్రవణేంద్రియాయత్తంబు గావించి యాకర్ణింపుము చతుర్యుగసహస్రపరిమితం బయిన వారిరుహాసనువాసరంబు కడపటం బరమేశ్వరుండు వైశ్వానరరూపంబున నుద్దీపితుండై దేవాసురమానుషం బగుచరాచరప్రపంచంబు నెరియింపం దొడంగునప్పుడు దయాళుం డగు ధాత యంతయుం గనుంగొని.

ఉ. అందఱుఁ గొంచుఁ జంచదితిహాసపురాణసమన్వితాఖిల
చ్ఛందములుం దనుంబొదువ సమ్మతిఁ బోయి పురాణుఁ బుణ్యు న

స్పందితు విశ్వసంప్రభవసంహరణప్రభు నాదిదేవు గో
విందు ముకుందు నంచు నరవిందదళేక్షణుఁ జూచ్చుఁ జెచ్చెరన్.

తే. కడఁగి కల్పాదిఁ గ్రమ్మఱఁ గలుగఁజేయఁ, దనక పని గాన నట్లు సొచ్చినజగముల్
నోలిఁ గంజోదరుండు నిజోదరమున, నింట్రపడకుండఁగా నిల్పె నెడము లిచ్చి.

వ. అవియును దదీయగర్భవాసంబున ననాయాసం బగుసంచారంబు గని భూరిప్ర
మోదంబున నాది నెట్లు వర్తిల్లు నట్ల వర్తిల్లు నవ్విధంబునం బ్రబలినచంద్రా
ర్కతేజంబునఁ బ్రధ్వస్తజీవలోకంబును బ్రగాఢతిమిరపరివృతంబు నైనమహాగ
హ్వరం బాత్మయోగసంభవం బగునమ్మహాస్వనం బూరించి యందు.

సీ. నీలజీమూతసన్నిభ మైనశుభమూర్తి బహుబాహుమండలమహిమ నొప్ప
శ్రీవత్సకౌస్తుభోర్జితవక్ష మతులపద్మసహస్రరచితదామమున మెఱయ
నసితకుంచితకేశవిసరబంధము ప్రశస్తమనోజ్ఞమణికిరీటమున నలర
రమణీయపీతాంబరస్ఫీతకటి క్రమకలరత్నఘటితశృంఖలఁ దలిర్ప
నతులకల్యాణనిధి యైనయాదిలక్ష్మి, చిక్కఁ దనుఁ గౌఁగిలించి రంజిల్ల నాద్యుఁ
డచ్యుతుం డెవ్వరికి నిట్టి దని యెఱుంగఁ, బడనిపొక్కునఁ బొగయించి పవ్వళించు.

వ. ఇట్లు నారాయణాభిధానంబున యోగనిద్రాసక్తుం డై సహస్రయుగమయం బైన
కాలంబు గడచినం దనయంతన మేల్కని లోకసృష్టి చింతించి యాపరమ
హంసుండు.

తే. ఆత్మకుక్షిలో నున్నమహాండ మొకటి, వెడలనుమియఁ గాంచనరూపవిస్ఫుటముగ
నదియు వేయివత్సరములయంతఁ బక్వ, మైన నయ్యెనరెండువ్రయ్యలుగఁ జేయ.

వ. అవ్విభాగంబు లూర్ధ్వాధోనివేశంబుల నాకాశంబును బృథివియు ననుపేళ్లం బ
రఁగె నతండు వెండియు నయ్యండంబు చుట్టు నెనిమిదితూంట్లు వుచ్చి దిక్కులని
వేర్వేఱసంజ్ఞలు గావించె మీఁదఁ జిల్లి వుచ్చి కనకరసధార దొరఁగించిన నది
కఠినంబై నిలిచి మేరుశైలం బయ్యెఁ దక్కిన తెరువులం గాఱినబహువర్ణసలిలం
బులు నట్ల కులనగంబులై తనరె నంత నిలువక యమ్మహాతోయంబు దోడ్తోన
తొరఁగి వెల్లిగొని పెరిగి సాగరంబులై యవియును గరుసులు దప్పఁ బెరిగినప్రేఁ
గునకు నుర్వి తేలి యోర్వనేరక దిగంబడినం గనుంగొని జగదీశ్వరుండు.

## నారాయణుండు వరాహరూపంబునఁ బాతాళగతి యైన భూమి నుద్ధరించుట.

క. నాయాత్మశక్తివై మ, త్ప్రియసతివై యుండు నీవు పృథివీ నిను నే
నీయఖిలచరాచరములఁ, జేయుటకై సంప్రతిష్ఠఁ జేసితిఁ గరుణన్.

తే. అట్టినీవు పంకనిమగ్న యైనగోవు, భంగిఁ బాతాళమునఁ దిగఁబడి చనంగఁ
జూడ నేర్తునె యోడకు చూడు నాదు, శక్తి భవదుద్ధరణకళాసక్తి యందు.

వ. అనినయాశ్వాసవచనం బాకర్ణించి యద్దేవి యిట్లనియె.

శా. ఈవిశ్వంబును దాల్ప శక్తుఁడవు నీ వెవ్వాఁడునుం దాల్ప లేఁ
డేవానిం గనుఁగొందు నీవురుఁడు ని న్నెవ్వాఁడుఁ గానండు నీ
వేవానిం బచరింతు వానిఁ దెలియం డెవ్వాఁడు నీవెవ్వరిం
గావం బూనితి వారు ధన్యులు జగత్కల్యాణ నారాయణా.

క. విశ్వంభర నీవలనను, విశ్వంభర నైతి నేను విశ్వంబునకున్
శాశ్వతకర్తవు భర్తవు, నీశ్వరుఁడ వనీశ్వరుఁడవు హితుఁడవు నాకున్.

చ. అసురులచేఁ దురుధర్మము లపాయము నొందిన నోర్వలేక యే
నన మఱి మ్రొగ్గి నీకు శరణంచు భయంబునఁ గూయిడం గృపా
ఘనుఁడ వీవు చేయు దశరిత యుగంబుల నెల్ల నిట్లయై
యొనఁగుభవత్సమాశ్రయసమిద్ధజనాత్మత నాకు నచ్యుతా.

ఆ. నన్ను నుద్ధరింపు నాకింత వగవని, నీవ చూచి మోప నెమ్మి నేర్తు
నేను నీవు నిలుప నెల్లకాలంబు ను, స్థిరత నొందుదానఁ బరమపురుష.

వ. అనిన నట్లచేయుదు నని యభయం బిచ్చి జలక్రీడాలోలస్వభావంబగు క్రోడభా
వంబునం గాలాభ్రశోభిశ్యామం బగుధామంబును నిరంతరనిర్ఘోషసత్ప్రాణం
బగుఘ్రాణంబును దీక్ష్ణదంష్ట్రాఖనిత్రం బగుపోత్రంబును స్తబ్ధరోమబంధం బగు
స్కంధంబును నుత్సాహజనితాశ్రుసేచనంబులగులోచనంబులును నిర్నిరోధరా
గం బగుచరణన్యాసవేగంబునునమరిననేకశతయోజనాయామసముచ్ఛ్రాయంబు
ననుపమానచ్ఛాయం బగుకాయంబునుఁబొదలఁ బాతాళమూలంబు ప్రవేశించి.

శా. ముస్తాకందముఁ గ్రుచ్చి యెత్తుక్రియ నిర్ముద్రస్వరద్దంష్ట్రికా
హస్తాగ్రంబునఁ గ్రుచ్చి యెత్తి క్రియ మింపారంగఁ గేళీరసా
భ్యస్తోదీర్ణజవంబునన్ వెడలి యయ్యాశ్చర్యతోయం బనా
యస్తాధారపథంబుగా నునిచె విశ్వాభారుఁ డద్ధారుణిన్.

ఆ. అమ్మహాత్ము నాజ్ఞ సంబుమధ్యంబునఁ, బోతపాత్రవ్రోలె భూతధాత్రి
భూతభరణమున కభూతపూర్వం బగు, గర్వ మపుడు దాల్చి కర మెలర్చె.

వ. ఇవ్విధంబున వసుధఁ బ్రతిష్ఠించి యప్పరమేష్ఠి సరిత్తులు దీర్చిసాగరంబులుగరుసు
వెట్టి పర్వతంబులు కుదురుపఱిచి దీవు లేర్పఱిచి భువనంబు లచ్చుకట్టి భువనాధి
పతుల నిర్ణయించి వాఙ్మయంబుల సృజియించి వాచకుల నియోగించి వాచ్యం
బులు దెలిపి దిక్కులునిర్దేశించి జ్యోతిస్సులు వెలయించి కాలంబు గణియించి
కర్మంబులు గలిగించి కర్తల నాజ్ఞాపించి ఫలంబులు సూచించి ఫలమూలం
బులు రూపించి యర్థంబులు సూత్రించి నేర్పులు నిర్మించి కామంబులు గెరలించి
కామ్యంబులు సవరించి యోగంబు లుపదేశించి నిర్వాణంబు నిర్వహించి నిర్మో

హం బగునుత్సాహంబున విహరించుచుండె సట్టిసంస్కారంబులం బ్రస్ఫురితసా
రంబై సంసారంబు ప్రవర్తిల్లె నొక్కకాలంబున.

చ. కులగిరిపూర్వకంబు లగుగోత్రము లన్నియు మేటిఱెక్కలం
గలిగి నిజేచ్ఛ భూతలము గ్రక్కదల న్వెసఁ బెల్లగిల్లి యె
వ్వలన ఖగంబులట్లుగ దివంబునఁ గ్రుమ్మరఁ బ్రాణిబాధగా
నెలయు మహాజలాశయము లెంపును జొచ్చె గజంబులోయనన్.

వ. అట్టియద్భుతంబునలన భూదేవి యెంతయుం బీడిత యగుచుండె నింతియ కాదు
హిరణ్యాక్షుం డనుదైత్యపతియు నత్యుత్కటం బగుబలదర్పంబునం బ్రొక్కిన
నెక్కొక్కచోటు గ్రుంగి పాతాళంబునకుం బోయెఁ దదీయభృత్యులగుదైత్యుల
చేతియాతంకంబును భూతసంప్లవకారి యయ్యె నాసమయంబున.

హిరణ్యాక్షప్రముఖులు దేవతలతో యుద్ధంబు చేయుట.

ఆ. సురలఁ బిలుకుమార్చి సురరాజుఁ జెఱఁబెట్టి, కోరి త్రిదశపదవి గొని సుఖింత
మేల యూరకుండ నింతశక్తుల మయ్యు, ననుచు దనుజు లాత్మ నదటు మిగిలి.

మ. తమరా జైనహిరణ్యనేత్రునకు నుత్సాహంబు పుట్టించి యు
ద్ధమదంతావళపూర్వకం బగుసముద్యత్సర్వసేనాంగముం
తమ్ము సన్నద్ధము సేసి యస్త్రములు శస్త్రంబుల్ తనుత్రమ్ము లు
గ్రములై యొప్ప నుదగ్రులై నడిచి రుత్కంపంపఁ ద్రైలోక్యమున్.

చ. అమరులు నవ్విధం బెఱిఁగి యాయితమై యమరాధినాథుఁ డ
భ్రముపతి నెక్కి వజ్రపటుబాహుతతోఁ దమ కగ్రగామియై
యమరఁగఁ దూర్యనాదములు నార్పులు మిక్కుటమై దిగంతభా
గములు వగుల్పఁగా నెదురుగా నడతెంచిరి వైరికోటికిన్.

క. సురబలమును నసురబలమును, బరవసమునఁ దాఁకెఁ బ్రళయపాథోధులు ని
ర్భరముగ నొండొంటిపయిన్, దెరలఁగఁ దోతెంచిపెరయుతెఱఁగునఁ బెలుచన్.

వ. అట్టిక్రందునం బరిఘాఘాతంబులు ముసలనిపాతంబులుఁ గుంతప్రహారంబులు
నస్త్రసంచారంబులుఁ గృపాణధారాఖండనంబులు గదాదండదండనంబులుఁ దోమ
రక్షేపంబులు శక్తివాహనాటోపంబులు మొదలుగా బహువిధకదనంబుల నిరు
దెఱంగులవారును బరస్పరధ్వంసనం బొనర్చిరి గజతురంగస్యందనవ్యతికరంబు
లతిభయంకరంబు లయ్యెఁ బేరుగలయోధులతలపాటులు చలంబున బలంబున
నిచ్చగించి నిశ్చలం బగునిశ్చయంబున ననపేక్షితజీవితంబులై చెల్లె నప్పుడు దై
త్యులచెద్దు యాదిత్యులకు భరంబగుటయు బెగడనీక నాకపతియుత్సేకంబునం
గడంగిన.

మ. ఘనసంధ్యారుణతుంగదేహుఁడు పిశంగశ్మశ్రుకేశుండు దీ
ప్రనిశాతోత్కటదంష్ట్రుఁ డుగ్రపరిఘవ్యాదీర్ఘదీవ్యద్భుజుం
డనికోద్ధాయుధయోగదీప్తుఁడు హిరణ్యాక్షుండు దుర్వీక్ష్యభా
వనిరూఢిన్ రిపుకోటి మార్కొనియె సంవర్తాంతకాకారుఁడై.

క. స్వామిసముత్సాహంబున, నేమియు నరవాయి గొనక యిరువాఁగును న్యు
ద్దామసమరం బొనర్పఁగ, నామెయి భూతనుల కెల్ల నద్భుత మయ్యెన్.

వ. అందు.

మ. క్షతులై పాతితులై విధూతులయి రక్తస్యందిసందిగ్ధజీ
వితసమ్మూర్ఛితచేష్టులై విరథులై వీతాసులై దారుణ
చ్యుతులై పాటితపేతులై వికటసంక్షుణ్ణాంగులై నిర్జరుల్
ధృతి దూలంగఁ దొడంగి రెల్లెడల దైతేయాహవాళీలతన్.

వ. హిరణ్యాక్షుండు సహస్రాక్షుం దలపడి యప్రమేయమాయావిశిఖపాతంబుల
నైరావణసమేతంబు ప్రతిబద్ధదేహుం జేసినఁ గదలనేరక యూరక నిష్ప్రతీకా
రుండై యతం డుండె నంత నిలువక మఱియును.

తే. అనిమిషుల నెల్లఁ బోనీక యాఁగి యున్న, వారి నున్నచోటనకట్టి క్రూరదైత్యుఁ
డార్చె సంహారసమయసప్తార్చి నార్చి, కాలమేఘుంబు గర్జల్లు లీలఁ జెలఁగి.

వ. ఇవ్విధంబున నఖిలవిబుధులు దిక్కులేక చిక్కనవిధంబును విబుధవైరి యొక్కగుం
డుక్కుమిగిలి మగఁటిమి నుక్కివుండై పేర్చినభంగియుఁ దనచిత్తంబున నవధ
రించి యాశ్రితాభయప్రదానవిద్యావిదగ్ధుండును సేవలవిదగ్ధుండును సర్వభూ
తజ్ఞచిత్తుండును ప్రవర్తితాఖిలయజ్ఞుండును సగుయజ్ఞపురుషుండు యజ్ఞవరాహ
దేహం బవ్యాహతబాహులీలాలలితంబును ప్రభూతదివ్యాయుధకలితంబునుం
గా నుద్భవించి.

క. చనుదెంచి పాంచజన్య, స్వనమున దానవులహృదయసంపుటభేదం
బొనరించుచుఁ దనునీలిమ, పెనుఁజీకటి గదిసి రిపులు బెగ్గిలి కలఁగన్.

క. సితశంఖదీప్తచక్ర, ద్వితయావిర్భాతిఁ బొలిచె దేవోత్తము మే
నతులితశశిరవిబింబ, ప్రతిబద్ధం బైనమేచకాభ్రముఁ బోలెన్.

వ. అమ్మహామూర్తి నాలోకించి యాలోకవిద్వేషులు వెఱఁగుపాటును వెఱపును
డెందంబులం దొడరం దమలోన.

చ. అమరులఁ గావఁ బూని వికృతాకృతియై యిట వచ్చినాఁ డితం
డమితబలుండు నాఁబరఁగునమ్మధుకైటభశత్రుఁ డింక నే
క్రమమున నైన నీతని విఖండితగర్వునిఁ జేయ నంతతో
సమధ్యు నిలింపకోటిపని సర్వముఁ జెకుఱు నస్మదీయమై.

సీ. అనుచు నుత్సాహంబు సేసి యనేకసహస్రసంఖ్యలు గలయందఱు నొక్క మొగంబై క్రోధరక్తాక్షుం డగుహిరణ్యాక్షుం బురస్కరించి యప్పురాణవీరున కెదురునడిచిరి పరమేష్ఠి పరమయోగిప్రకరపరివృతుండై చనుదెంచి దేవతల నాశ్వాసించుచు నావిశ్వవంద్యు పిఱుంద నిలిచె నప్పుడు.

క. దైతేయులవివిధాయుధ, జాతంబులు పొదివెఁ బ్రభునిసర్వాంగము ప్ర స్ఫీతాతతన్వాతనజీ, మూతజలము లుద్యదచలముం బొదువుక్రియన్.

తే. చక్రధారలఁ జెదరెడుచండదహను, శిఖల నవియెల్ల భస్మమై చెడఁగ మంచు విరియ వెలుఁగొందుమార్తాండుకరణి నొప్పె, నొకఁడ తేజస్వియైపురుషోత్తముండు.

## నారాయణుఁడు హిరణ్యాక్షుని బొలియించి సురలరక్షించిన వృత్తాంతము.

క. ఆతనిఁ జూచి సహింపక, దైతేయవిభుండు వైచెఁ దద్వక్షము న త్యాతతముగ లక్షించి వి, ధూతాహితశక్తి యైనతోరపుశక్తిన్.

వ. అమ్మహాశక్తి యనర్గళగతి నరుగుదెంచి దేవదేవుదేహంబు దాఁకి రుధిరధారలు చెదరంజేసిన నంబుజాసనుం డాదిగా సురలందఱు నచ్చెరువు నొంది యసురలా వు మెచ్చులించిరి వినిశ్చలుండై నిలిచిన యఖిలేశ్వరుండు శాశ్వతయశోవిభూష ణంబును ప్రతిపక్షతేజోదూషణంబును బరితోషితాశ్రితచక్రంబు నగుచక్రంబు దనుజుదెసకుం బ్రయోగించె నది కల్పవిచ్ఛేదజ్వలితజ్వలనమండలంబుంబోలెఁ జని దానవు మెడమీఁదఁ బడి శిరంబు శరీరంబునకుం బాపెఁ బ్రదీప్తహరిహేతి పాతితశిఖరం బగుసిద్ధమహీధరంబుపగిది నప్పుడు తావహుండగుచు నసురకులోద్వ హుండు వసుధాశాయి యయ్యె నవ్విధంబున.

మ. అహితుం జంపి తదీయజాతు లగుసర్వారాతులన్ భోగభృ ద్గహనం బైనరసాతలంబు సొర వీఁకం దోలి లీలాయిత స్పృహణీయాకృతి యమ్మహాత్ముఁడు గృపన్ జిష్ణుండు లోనైనస ర్వహితశ్రేణికి మాన్చె శత్రుకృతమర్మంధోత్థనిర్బంధమున్.

వ. ఇవ్విధంబునం బ్రాప్తనిర్వాణులై గీర్వాణులు వాణీపతి మున్నిడుకొని చేరి య య్యాదిపురుషునకుం బ్రణామంబు చేసి దేవా దేవర మామీఁదివాత్సల్యం బె య్యెడ నేమఱమి దెల్పెడునట్టియిమ్మహాపౌరుషం బేమని కొనియాడ నేర్తు మెల్లనాఁడు నిట్ల నీబంట్ల మగుట నిక్కంబు చేసికొని మమ్ము రక్షించుట వరంబు గా వేఁడెద మనినం గరుణించి కమలేక్షణుండు.

క. మును మీ కేనిచ్చినయ, వ్విను తైశ్వర్యంబులును హవిర్భాగములున్ బెనుపుగఁ గ్రమ్మఱఁ జేరుం, జనుఁ డాత్మీయాధికారసంపద కేలమిన్.

సీ. తమతమయాశ్రమధర్మంబు లిమ్ముగా నడచినవారు దానవ్రతులును సత్యసంధులు మహాసమరశూరులు ననసూయులు నిత్యయజ్ఞులు సదయులు

నగుపుణ్యులకు నెల్ల నర్వలోకంబులీ నెుదయఁ డీయింద్రుఁ డచ్యుతుఁడు విశేషు
నర్థకామాదుల కాశ్రయులయి పరలోకముల్ నమ్మకలోకనింద్య
మైనచందంబు గైకొని యవనిసురుల, నాదరింపక శ్రుతివాక్య మతకరించి
తిరుగు దుర్బుద్ధు లుద్ధతనరకవహ్నిఁ, బడుదు రంచుఁ పేర్కొయ మీఁదుప్రభుగుణంబు.

క. వినుఁ డీట్టివారలయి తగ, ననిశము నామీఁదితలఁపు నంపును నవధా
ననిరూఢు లగుట మేలెం, దును నేదురితములు మిమ్ముఁ ద్రొగరక యుండుర్.

వ. అని యానతిచ్చి యనంతుం డంతర్హితుం డయ్యె నహితనిరాసనంబునకు నుల్లా
సం బెసంగ వాసవాదులు నబ్జాసనుండు మున్నుగా నవ్వరాహమూర్తిం గీర్తిం
చుచు నిజనివాసంబుల కరిగె ధరణీదేవియు దేవారాతులు నిఘాతితు లగుట
నపేతవికృతయై యాత్మప్రకృతియంద నిలిచె మఱియు నయ్యార్యకు నతిస్థైర్యం
బు గావింపం దలంచి,

ఉ. పూని పురందరుం డఖిలభూమిధరంబుల నెయ్యెడ న్నిజ
స్థానములంద యుండుఁ డని సర్వసమర్థత నాజ్ఞవెట్టి యు
త్తానకఠోరధార మగుదారుణవజ్రము దాల్చి సంతత
త్తానతదీయపక్షసముదాయము క్రమోడుగఁ జెక్కె నుక్కునన్.

క. అకలకలమున నెుకటియు, నాకాధిపహేతిఘాతనకుఁ దప్పెను మై
నాకం బనేకలహరీ, వ్యాకీర్ణపయోధిగర్భవాసప్రాప్తిన్.

వ. ఇది వరాహావతారప్రకారంబు.

చ. తనయులఁ గోరువారు వసుధాతలనాథతఁ గోరువారలా
విను సిరి యాయు వర్థమభివృద్ధి యసంబును గోరువారలా
ర్యనిగమసమ్మతంబు నతిరమ్యము నైనమహావరాహవ
ర్తనము పఠించినన్ వినినఁ దథ్యము పొందుదు రిన్నికోర్కులున్.

క. పితృయజ్ఞులు సురయజ్ఞులు, నతులితయోగమున నాత్మయజ్ఞులు నగువా
రతిపుణ్యయజ్ఞమయు న, చ్యుతుఁ గొలిచినవార యగుదు రుత్తమభక్తిన్.

వ. నీవు భక్తిమయం బగుభావయజ్ఞంబున యజ్ఞేశ్వరు నర్చింపు మని వైశంపాయ
నుండు జనమేజయుతో నింక నారసింహరూపధరుం డైనచక్రధరుచరితంబు విను
మని యిట్లనియె.

క. ఆదియుగంబున నసురుల, కాది యగుహిరణ్యకశిపుఁ డవిరతమదధై
ర్యాదిగుణమ్ములఁ దనరెం, బాదిమునులువొగడఁ జేసె నధికతపంబున్.

వ. ఏకాదశసహస్రసంవత్సరంబులు నిర్మత్సరం బగుయోగంబున నభియోగింప
శకశంబు గానియొశేరరం బట్టు నిరహించినయాపూర్వగీర్వాణసంయమికిం బ్ర

సన్నుండై ప్రపన్నవత్సలుం డగుసరోజసంభవుండు సకలసురసంఘంబులు గొలువ హంసయుక్తవిమానంబుతో నేతెంచి యాతనికోరినవరంబు లిచ్చి సర్వభూతదుర్జయుం జేసి పోయిన.

తే. తలఁకి వేల్పులు విశ్వవిధాతపాలి, కరిగి యెంతయు దూఱిన నతఁడు వారి కసురయెయ్యదియడిగిననుసఁగవలయు, తీవ్రతపముమహత్త్వంబు తెలియఁజెప్పి.

వ. అవ్విరోధికి నవసానంబు నిట్టిది యని నిర్ణయించిన నిలింపులు కాలాంతరం బాపేక్షించియుండిరి దితినందనుండు నదితినందనుల నందఱం దొడరి క్రమంబున భంగపఱిచి నెఱసినసత్త్వవంతు లగుమునుల నవమానించి లోకంబులఁ దాన కైకొని బహుకాలం బేలుచుండఁ బదచ్యుతులై యచ్యుతు శరణంబుసొచ్చి యమరవరులు నమపడినపాట్లు విన్నవించిన నభయం బిచ్చి యద్దేవుండు వారి వీడ్కొలిపి.

నారాయణుఁడు దేవతాప్రార్థితుండై నరసింహరూపంబున నావిర్భవించుట.

ఉ. వేవురు చంద్రులో లిఁ బదివేవురు సూర్యులు లక్షపావకుల్
ప్రోవయి యున్నయట్టి దగుభూరితరం బగుతేజ మయ్యజాం
డావలి కెల్ల దుష్ప్రసహమై యెసఁగంగ నృసింహభావసం
భావితమూర్తి గైకొని విపక్షపతిక్షపణక్షణోద్ధతిన్.

వ. ఆక్షణంబ దైత్యేంద్రుపురంబున కరిగె నాకర్ణింపుము.

క. దితిసూనునిమైశ్వర్యం, బతిలోక మపేతశోక మాశ్చర్య మత
ర్కితసంపద్భరధుర్యం, బతిరమ్య మగమ్య మిాశ్వరాదుల కైనన్.

వ. ఒక్కసభాభవనంబు శతయోజనవిస్తారంబును సార్ధయోజనదైర్ఘ్యంబును బంచయోజనసమోన్నతియుఁ గలిగి కామగామియు సర్వకామగామికవస్తుభరితంబునై కనకనిర్మితస్తంభభిత్తివలభిఘనకవాటాదులను సకలకాలకుసుమఫలోల్లసితపాదప్రపకరంబులను బద్ధోత్పలాకీర్ణపూర్ణసరసీస్తోమంబుల నభిరామం బగుచుండు నందుఁ గిష్కుశతోన్నతవిస్తీర్ణం బైనసౌవర్ణసింహాసనంబున నాసీనుం డైనయతని నూర్వశి ఘృతాచి మేనక మొదలయినయచ్చరలు పదివేవురును విశ్వావసుప్రముఖు లగుననేకగంధర్వులు నాటలఁ బాటల నేప్రొద్దుం గొలుతురు దివిజులకంటెం దేజంబు మిగిలి సర్వాలంకారకలితులయి విప్రచిత్తి మయుండు శంబరుండు రాహువు లోనుగా నఖిలదానవు లుద్యతాయుధహస్తులై పరివేష్టింతురు ప్రహ్లాదుం డాదియగుతనయులు వినయంబునఁ బ్రాంజలులై యుండుదు రట్టివిభవంబుతోడన కొలువున్నసమయంబున నారసింహదేవుం డాదేవద్విషుముందట నావిర్భవించిన.

క. తనపాలిమృత్యుదేవత, యనుబోలెను వచ్చి యిట్టు లున్నమహాత్ముం
గని దైత్యేంద్రుఁడు విస్మయ, మును భయమును గౌతుకంబు మున్పిరిగొనఁగన్.

వ. సర్వమంత్రులం జూచి చూచితిరే యిది యొక్కయద్భుతాకారంబు సరుండును నఖాయుధుండునునై కలసి యిదియని నిశ్చయింపరాక శరీరచ్ఛాయ శంఖకుందేందుసన్నిభంబై నైజం బగుతేజంబున జగంబు ద్వేజకంబై నయట్లున్నది యనిన నందఱు సంభ్రమావేశవిహ్వలులై రి ప్రహ్లాదుండు దివ్యానలోకనంబున నాలోకేశ్వరుం దత్త్వంబుగా నిరూపించి తండ్రి కిట్లనియె.

మ. దితిజాధీశ్వర దేవమర్దన మహాతేజస్వి సంపూజ్య యి
ద్వితతాశ్చర్యనృసింహమూర్తిఁ దెలియన్ వీక్షించితే సత్త్వశా
శ్వతసర్వజ్ఞసదద్వయాంచితచిదవ్యక్తాత్మసువ్యక్తమై
దితిజోచ్ఛేదనకేళికై యిటులు దోతెంచెం జుమీ యారయన్.

సీ. నదులు సాగరములు నగములు చంద్రార్కనక్షత్రతారాగణములు దినము
ధరణి దిక్కులు మారుతంబు లాదిత్యాశ్విపసురుద్రసాధ్యవిశ్వప్రముఖులు
మునులు యోగీంద్రులు మనువులు దాతలు సరసిజగర్భుండు చంద్రధరుఁడు
యక్షులు గంధర్వు లచ్చరలురగులు పక్షులు మనుజులు పశుచయంబు
లీసభాంతరమున నున్న యింతవట్టు, వారు నీవిశ్వరూపునిఘోరరూప
మునసయున్న తెఱంగుసూపుసకువెలసెఁ,జంద్రబింబంబులోఁదోఁచుజగముపోలె.

వ. మీరు కంటిరో కానరో కాని యే నింతయుం గంటి నాకుం జూపె, నాయుగ్రతేజంబు నిగ్రహించుకొలంది గా దెయ్యదియే నొక్కభవ్యోపాయంబున నపాయంబు దప్పించుకొనుటయ యిప్పటికి నొప్పెడుకర్జం బనిన నామూర్ఖుండు దుర్జాతు లగుదైతేయులం బిలిచి.

క. ఏయడవినుండివచ్చెనొ, యీయర్ధమృగేంద్ర మిచటి కిప్పుడు బాహా
వ్యాయామంబున దీని న, జేయులరై కిట్టిపట్టి చెండుఁడు కడిమిన్.

క. పోనీకుఁ డనిన నసురులు, నానాప్రహరణులయి కూడి నరసింహుపయిన్
గానన సింహముపై శున, కానీకము లడరుమాడ్కి నదరిరి పెలుచన్.

వ. అందఱుం బొరిగొని యద్దేవుం డద్దేవారికి విహారస్థానంబై నయయ్యాస్థానరంబంతయుం గరచరణవిక్షేపంబులం బొడిచేసి త్రోచె నిట్లు భగ్నసభాస్థలుం డయ్యును సభయుండుగాక యతండు దనకుఁ గలయస్త్రశక్తి యంతయు సంస్మరించి క్రమంబున మహాదండంబు బ్రహ్మదండంబుఁ గాలచక్రంబు సృష్టిచక్రంబు బ్రహ్మవిష్ణుమహేంద్రచక్రంబు లార్ద్రశుష్కసంజ్ఞం బగునశనిద్వయంబు రుద్రశూలంబు గంకాళంబు ముసలంబు బ్రహ్మశిరంబు బ్రహ్మాస్త్రం బైషీకంబు శక్రాగ్నిపవనశిశిరాస్త్రంబులు గాహాళంబు గైరికంబు హయశిరంబు సౌమ్యపిశాచసత్యాస్త్రంబులు మోహనశోషణతాపనవిలాపనదర్పణంబులు గాలముద్గరంబు సంవర్తన

సంబు మాయాధరంబు ప్రస్థాపనంబు మొదలుగా నపరిమితంబు లైనయస్త్రంబు లేసి సర్వాస్త్రరాజంబును నప్రతిహతప్రభావంబు నగుపాశుపతంబుం బ్రయోగించెనయ్యస్త్రంబులన్నియు నన్నరమృగేంద్రుగం బొదువుట ఘర్మసమయంబున ఘర్మాంశుకిరణంబులు తుహినకరుం బొదివినచందం బయ్యె నాసమయంబున.

మ. సకలానీకము పన్ని విష్ణునిపయిన్ సంహారవాత్యాభయా
నకవేగంబున వచ్చి తాఁకి వరుసన్ సర్వాస్త్రశస్త్రంబులుం
బ్రకటోపాయనికామనిర్భరముగాఁ బ్రక్షిప్తముల్ సేయ న
య్యకలంకుం డవియెల్ల మ్రింగె వికటవ్యాలోలవక్త్రంబునన్.

విప్రచిత్తిప్రభృతి దానవులు హిరణ్యకశిపుతోడంగూడి నరసింహదేవునితోఁ బోరుట.

చ. ఉడుగక వెండియుం దనుజయోధులు శక్తిశరాదు లోలి ను
గ్గడువుగ దీటుకొల్పి హరిగాత్రము సర్వముఁ గప్పి యాకసం
బెడపడకుండఁగాఁ బొదివి యేపున నార్చి నిజేశుచూడ్కికిం
గడుఁబ్రమదంబు నద్భుతవికాసముఁ గల్గఁగఁజేసి రుద్ధతిన్.

మ. అలుకం బేర్చి నృసింహుఁ డొక్కమొగి నయ్యస్త్రంబు లుద్ధూనన
స్ఖలితస్కంధసటాసమీరునకు మేఘశ్రేణి గావించి య
వ్వలనం గన్నులఁగ్రేవలం గనలు తీవ్రజ్వాల లాభీలభం
గులుగాఁ జూచిన విచ్చె సద్దెసలకుం గ్రొవ్వేది తద్దైన్యముల్.

వ. అప్పుడు నరమృగేశ్వరు నాదైత్యేశ్వరుం డెదిర్చి యర్చిష్మతి యనుశక్తి యొక్కటి వైచిన నతండు దాని నుగ్రహుంకారంబున నడంచి పెలుచ గర్జిల్లిన నమరశత్రుండు శరాసనంబు గైకొని నిశాతశరంబు లతనిపైఁ బఱపె నవి క్రొమ్మొనల నలువున నాభీలనలినీకాననంబు కాంతి గగనంబునకుం గలిగించె నయ్యుత్సాహంబు గని యటమున్ను చెదరినదొరలుం గూడికొని.

తే. పొదలి మోయ నష్టృశ్యులై చదలనుండి, కొండలంతలురాలు ముకుందుమీఁద
నూడుకొనవైనఁదొడఁగిరొండొండ దెసలు, మూసెఁబాషాణరోధసముత్థతమము.

క. అవియెల్లను నానరహరి, యవయవములు సోఁకి యిసుకలై చెడిపోయెన్
దివిజవిరోధులు మఱియును, వివిధం బగునింద్రజాలవిభవముపేర్మిన్.

వ. వేదండతుండస్థూలం బగుసలిలధారలు గలిగించి నిరంతరాసారం బగుప్రచండ సమీరప్రసారంబు ఘోరంబుగాఁ గల్పింపఁ గల్పాంతకాలంబునఁ గాలాంబుదంబు లడరి కురిసిన మునిసిపోవుపగిదిఁ బృథివి యెయ్యెడలను బ్రయ్యం జొచ్చె నెచ్చోట్లు నెవ్వరికిం దోఁపనీక చీకట్లుపర్వి సర్వలోకంబు నాకులంబుఁ జేసె నయ్యస్త్రప్రయోగంబునందు.

క. ఒకచినుకు సోఁక దవ్విభు, నొకయింతయుఁ దాఁక దనిల మొకలవమును జూ
డ్కికి నడ్డపడదు తిమిరము, వికసితదివ్యప్రభావవిభ్రమముఁ దగుటన్.

ఉ. దానవు లంతఁ బోక పటుదారుణవహ్ని సృజించి తీవ్రవే
గానిలవర్ధమాన మగునట్లుగఁ జేసి తదీయవిగ్రహ
గ్లాని యొనర్పఁ జూచిరి శిఖాచయముల్ జగదండదాహదీ
క్షానటదుగ్రనేత్రరుచికల్పములై పొదివెన్ దిగంతముల్.

వ. అంతయు నెఱింగి శతమన్యుండు శతసహస్రసంఖ్యలజలధరంబులఁ సత్వరంబుగాఁ
బనుప నవియవిరళోదారధారావర్షంబున నయ్యాయుధహవ్యవాహను నుపహతుం జేసి య
ద్దేవునకుఁ బుష్పవృష్టిప్లావనం బొనర్చి చనియె నివ్విధంబున.

క. తమకపటపుఁజేఁతలు వో, ఘుములై చెడుటయును భీతికంపితమతులై
యమరద్రోహులు నిజవిభు, సమేయబలుఁ జేరి యొదిఁగి రచ్చట నచటన్.

వ. ఆసమయంబున సపర్వరాహుగ్రహదిగ్ధూపలకోపితవర్ష నిర్ఘాతపాతంబులు లోనైన
నయుత్పాతంబులు దైతేయాన్వయవినాశపిశునంబులై తోఁచె నవ్విధం బుపల
క్షించి హృదయక్షోభంబునఁ గోపంబు రెట్టింప బెట్టిదం బగురభసంబునం గడంగి
దితిసూనుండు.

సీ. కులపర్వతంబులు కుసుఁరులు కదలి సంధులు వాసి తటములు దునిసి పడఁగ
జలరాసు లేడును గలగుండుగొని యొడగడ్డలపై దొరగపలు దొడర
దిక్కూలములు గూల దిగ్గజంబులు గట్టుపట్టులు విడిచి విభ్రాంతిఁ దూల
దర్వీకరాధిపుతలలచుట్టలు వీడి పడగ లొండొంటితోఁ దొడరి క్రమ్మ
నాదికూర్మంబునకు భీతి యగ్గలింప, సప్తపాతాళములు డిగ్గజాటి యుడఁగ
నూర్ధ్వభువనంబులుత్కంప మొందనుర్వి, రెండుచెఱఁగులఁ బట్టియొండొండ్లనూఁచె.

వ. ఇట్టి రౌద్రంబునకుఁ దల్లడిల్లి త్రిదివనివాసు లందఱు మునిబృందసమేతంబుగా
జీమూతమార్గంబున నిలిచి యద్దేవుం బ్రస్తుతించి దేవా యీదుష్టదైత్యుం
డత్యంతవిప్లవంబునకుఁ దొడంగె జరాచరభూతంబు లుపఘాతంబు నొందుచున్నవి
యింకఁ దడవుగా వినోదింప వలదు వీనిం బొరిగొని వీనియంతటివార లైన
దానవుల నిందఱ బొరిసమరి సంప్రాప్తవిజయలక్ష్మీసమాగమసౌఖ్యుండవై సుర
ముఖ్యులం గావుము జీవలోకంబునకు సుస్థితి గావింపుము.

క. అసురాంతకరణమును స, ర్వసురాభయవితరణము భవద్బాహువులకున్
వసములుగాక కలదె యెం, దు సమర్థము వేఱియొకఁడు దురితధ్వంసీ.

క. శతముఖుఁ జెప్పదు చెప్పదు, శతధృతిఁ జెప్పదు విముగ్ధశశిధరుభువన
స్థితికి నభూతోనభవి, ష్యతి యని శ్రుతి నిన్న కాదె యచ్యుత పొగడున్.

ద్ధరణధృతసమాఖ్యా దానధౌరేయసఖ్యా
కరణసమయముఖ్యాకల్పితానల్పసఖ్యా

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్య ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైనహరివంశంబునుత్తరభాగంబున నవమాశ్వాసము.

---

ఉత్తరభాగము - దశమాశ్వాసము.

క. శ్రీవేమక్ష్మానాథ మ, హావిభుతావశ్యబహునృపాశ్రయ సుకర
శ్రీవిశ్రాణనవైశ్రవ, ణావజ్ఞా చతురచతురుపాయవిధిజ్ఞా.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు నారసింహావతారంబు విస్తరించి వైశంపాయనుం డింక వామనప్రాదుర్భావం బెఱింగించెద నవహితుండ వగుమని జనమేజయున కిట్లనియె.

క. జనవర బ్రహ్మకుమారసన, తనయుఁ డగుమరీచిసుతుఁడు ధన్యతపోవ
ర్తననిధి కశ్యపుఁ డాతని, యసుఁగుసతులు గలరు దితియు నదితియు నన్నన్.

వ. దితికి హిరణ్యాక్షహిరణ్యకశిపులు పుట్టి రదితికి ధాతయు నర్యముండును విధాతయు మిత్రుండును వరుణుండును బరశుండును భగుండును నింద్రుండును వివస్వతుండును బూషుండును బర్జన్యుండును ద్వష్టయు నను నాదిత్యులు పన్నిద్దఱు పుట్టిరి తదనంతరంబ హిరణ్యకశిపుపిమ్మటఁ బ్రహ్లాదుండు రాజై దివిజుల జయించునంతటితేజంబు చాలకుండెఁ దత్తనూజుం డగువిరోచనుండు నట్టివాఁడ యయ్యె వైరోచనుం డగుబలి తద్దయు బలిష్ఠుండై.

ఉ. దానము సత్యముం దపము ధర్మము నెందుఁ బొగడ్త కెక్క వి
జ్ఞానము శాస్త్రనిశ్చయవిశారదమై వెలయం గృపారతం
బైనమనంబుతో సరసిజాసనుఁ డాదిగఁ బెద్దలెల్ల నౌ
నౌనన నుల్లసిల్లె ననపాయసముజ్జ్వలనైజతేజుఁడై.

తే. అతనిప్రపితామహుం డగునాహిరణ్య, కశిపునంతటివానిఁగాఁ గని దనుజులు
గడఁగి దైత్యేంద్రపదవికి నొడయుఁ జేయఁ, దలఁచి ప్రార్థించి యేలమి నందఱుఁ గూడి.

వ. ప్రహ్లాదవిరోచన సమేతంబుగా సర్వప్రయత్నంబులం బొదివి చెప్పి.

శా. గంగాసాగరసంగమాదివిలసత్కల్యాణతీర్థాంబువుల్
గాంగేయోజ్జ్వలకుంభసంభృతముగాఁ గావించి దివ్యౌషధీ
మాంగల్యాక్షతపుష్పగంధతతితో మంత్రజ్ఞపూర్వంబుగాఁ
దుంగస్వర్ణమయాసనస్థు నభిషిక్తుం జేసి రవ్వీరునిన్.

క. మీపెద్దతాతఁ బోలుము, దీపింపుఁ బ్రతాపలక్ష్మి దితిజుల కెల్లన్
దేవవగు మనుచు దీవన, లేపార సురారు లాబలీంద్రున కొసఁగన్.

వ. ఇట్లభిషేకించిన యనంతరంబ దొరలెల్లను దండప్రణామంబులుసేసి యంజలి పుటఘటనంబులు శిరశ్శిఖరంబులం బెరయ నతని కిట్లనిరి.

మ. భవదీయప్రపితామహుండు మహితోద్భాసిప్రతాపాఢ్యుఁ డ
వ్యవసన్నోదయుఁ డాహిరణ్యకశిపుం డాత్మీయసత్త్వంబునన్
భువనాభోగము లన్నియుం దనవశంబుం జేసి వర్తిల్లఁగాఁ
బ్రబలశ్రీసుఖలీలలం గనుట సెప్పన్ వింటి వీరోత్తమా.

ఆ. కపటనరమృగేంద్రకాయుచే నతనిఁ జంపించి యేమిచెప్పఁ బెరిగి సురలు
శత్రునకుఁ దదీయసంపద యిచ్చి యేలించి రీజగత్ప్రపంచ మెల్ల.

ఉ. ఇంతయుఁ జూచియుం గడిమి యేమియుఁ గొల్పక లావుకల్మి దు
ర్దాంతుల మయ్యు నే మిటు నిరాశ్రయతాదశ గ్రమ్మి యుండి నీ
యంతటిరాజు నిప్పుడు ప్రియం బెసఁగం గని మిన్నుదాఁకి య
త్యంతపరాక్రమక్రియకు నట్టులుసాఁచెద ముబ్బుపెంపునన్.

క. నీయామ్యలమైశ్వర్యము, నీయదిగాఁ గ్రమ్మఱం గొనినలెస్స మహా
పాయుఁడవై మముఁ జేకొని, చేయుము బరవసము లక్ష్మిచేకుఱు నీకున్.

క. బలవిక్రమములఁ గడుమి, క్కిలి తేఁకువగలవు నీవు కినిసిన నెదురం
గలరె నిలింపులు వారల, కొలఁదు లెఱుఁగ మెట్లు సరకుగొనకుము బుద్ధిన్.

వ. మావిన్నపం బవధరించి రాజధర్మం బవలంబింపు మనినయసురులవచనంబులు రుచియించిన విని వైరోచనుం డాక్షణంబ.

క. గెలుతు నవశ్యము నమరుల, బాలిర్వానిపరాక్రమంబు భువనభయదమై
వెలయఁగ వెలయుదు నని య, గ్గలికఁ బగఱమీఁద నడువఁ గౌతూహలియై

వ. సర్వసైన్యపతుల సైన్యసమేతంబుగా వెడల నాజ్ఞాపించి ప్రస్థానభేరి వేయించిన.

క. అరదంబులుఁ గుంజరములు, హరులుఁ బదాతులును బహుసహస్రము లోలిన్
దరతరమ దైత్యు లత్యు, ద్ధురశౌర్యులు వెలువడంగఁ దోడఁగిరి కడఁకన్.

మ. హరితాశ్వంబులు వేయి పూనినమహార్హస్యందనం బెక్కి యా
హరిదశ్వుం బ్రహసించుచుం గరసహస్రాభీలతం జాపము
ద్ధరఖడ్గాదివిచిత్రశస్త్రము లనేకంబు ల్గలిం దాల్చి ని
ర్భరబాణుం డగుబాణుఁ డొప్పె సమరప్రస్థానసంరంభియై.

వ. ఇట్లు వెడలినబలితనయు నిరుగెలంకుల ననేకరథసహస్రంబులు పరివేష్టించె నతని కత్యంతాప్తు లైనసుబాహుండు మేఘనాదుండు గజముఖుండు వేగవంతుండు గేతుమంతుండునను నేవురురథికులు రథంబు గదిసి కావలియై కొలిచిరి మఱియు.

వ. ఎలుఁగులు వేయి పూనినసితేతరలోహరథంబుమీఁదఁ గ్రొ
న్నలుపగుమేను నీలమణినవ్యవిభూషల నొప్పుఁ రూపుగా
మలఁచినకొండభంగి ననమం బగునీఁకటిప్రోవుకై వడిన్
బలుఁ డరిగెం గఠోరపటుబాహుఁడు తేరులు కోటి కొల్వఁగన్.

ఫులోమహయగ్రీవ ప్రముఖదనుజముఖ్యులు యుద్ధంబునకు వెడలుట.

వ. కినుకఁ బులోముఁ డుద్యదహికేతనుఁ డర్వదివేలు తేరులు
ల్యూన నడువం గిచాకలితభూరిభుజుం డయి యుష్ట్రిలక్షపూ
నినయరదంబుపైఁ దనరునిల్వు యుగక్షయహేతుకేతువ్రా
యనఁ జనియెన్ సరత్నమకుటాంశులు ప్రజ్వలితాగ్నిచాడ్పుగన్.

మ. సితవస్త్రాభరణప్రసూనముల లక్ష్మీమంతుఁడై శ్వేతప
ర్వతతుల్యుండు సితాశ్వలక్షయుతదివ్యస్యందనస్థుం డలం
కృతసప్తాశ్వసితాహికేతుఁడు హయగ్రీవుండు పేర్చెన్ ఘనా
వృతినిర్ముక్తశరచ్ఛశాంకుఁ డన విద్వేషాంబుజశ్రేణికిన్.

తే. స్ఫురితతాలధ్వజంబును హరిసహస్ర, రాజితము నై సమాణిక్యరథముమీఁద
నరిగెఁ బ్రహ్లాదుఁ డమరభయంకరు లగు, కింకరులు కోటిరథికు లశంకఁ గొలువ.

మ. అలఘుస్వర్ణభుజంగకేతులసితంబై వేయునిన్నూటుకి
ష్కులవిస్తారము నాల్గుగండ్లు నమరన్ శుంభన్మృగేంద్రాస్యవా
జులు వే పూనినమేటితేరిపయి నక్షోభ్యుం డనుహ్లాదుఁ డి
మ్ములనేగెం దనుఁబోలుదైత్యులరథంబుల్ కోటి సుట్టుం జనన్.

చ. కనకమృగేంద్రకేతు వెసఁగం దురగంబులు వేయి పూనఁగా
ననుపమరత్నదీప్తియుతమై నవసాంధ్యపయోధరద్యుతిన్
ఘనతరనేమిఘోషపటుగర్జఁ దనర్చురథంబుతో మయుం
డనిభృతమాయుఁ డొప్పె నుదయస్థదివాకరుఁ ప్రేణిసేయుచున్.

శా. శార్దూలంబులు వేయి పూనురథరాజం బొప్పఁగాఁ గేతువున్
శార్దూలాంకముగా ఖరాళికలితోద్యత్స్యందనుల్ దానవుల్
శార్దూలంబులుఁ బోలె నర్వదిసహస్రంబుల్ దనుం గొల్వఁగా
దోర్దర్పోజ్జ్వలమూర్తియై నముచిదైత్యుం డేగె నిశ్చింతతన్.

ఉ. అంబరమధ్యవర్తి యగునంబుజబాంధవుఁబోలి క్రౌంచనా
యం బగుకేతువున్ హరిసహస్రము గల్గినతే రెలర్పఁగా
శంబరుఁ డేగెఁ గోటిరథివీరులు గొల్వఁగఁ బెంపుమీఱి ది
వ్యంబు పసిండినేవళము హస్తి కమర్చినకక్ష్య గ్రాలఁగన్.

చ. అతులమృగేంద్రకేతులలితాశ్వసహస్రసమేతకాంచనో
న్నతరథ మెక్కి భూరిపృతనాన్వితుఁడై చనియెం బ్రవీరస
మ్మతమహనీయబాహుఁ డసమానధనుర్ధరుఁ డంతకాలమా
రుతసఖతుల్యతీవ్రుఁడు విరోచనుఁ డిద్ధవిరోచనుం డనిన్.

క. కాలాంగుం డగుజంభుఁడు, కాలుఁడపోలెం బ్రదీప్తకనకరథంబు
త్తాలంబై తాలధ్వజ, లీల నమర నడిచె దురవలేపము మిగులన్.

మ. అసిరోముండు రథాంగమాత్రనయనుం డాభీలనీలాంగుఁ డు
ర్విసలింపంగఁ బదాతియై నడిచె నుగ్రప్రోత్తప్రభూతాయుధుం
డసమానుల్ తనకున్ సమాను లగునుద్యచ్ఛైలశస్త్రిల్ పటు
ప్రసరోదగ్రులు దానవుల్ బహుసహస్రంబుల్ దనుం గొల్వఁగన్.

మ. కపిలశ్మశ్రుఁడు నీలవర్ణుఁడు మహాకాయుండు వృత్రుండు ర
క్తపరివ్యాకులనేత్రుఁ డశ్వశతయుక్తస్యందనుండున్ మహా
విపులోదంచితదంతికేతనుఁడునై వేనేలుదైత్యుల్ విచి
త్రపరిక్రాంతి భజింపఁగా నరిగె నుత్సాహంబునం బోరికిన్.

వ. ఏకచక్రుం డనుదైత్యుం డేకచక్రశోభితం బగుకరంబునం జక్రధరుతోఁ బురణిం
చుచు ననేకభారనిర్మితంబు లగుచక్రంబులు నాలుగుగలిగి కాలచక్రంబుపగిది
భయంకరంబై నచక్రద్వయంబునం బొలుచురథం బుల్లసిల్లం గాలాయసనకలా
యుధు లగుదైతేయులు కాలకాయులు నభశ్చరులు నై నభోభ్రింబులభంగి నధం
గురపక్షంబు లగుభూధరంబులకరణిఁ దన్ను ననువర్తింప నాహవార్థియై యరిగె
వృత్రభ్రాత యగువీర్యవంతుండు రక్తగర్దభయుక్తం బగురత్నమయరథంబున
సంధ్యాగర్భగతుం డగుగభస్తిమంతుఁ గ్రేణిసేయుచుఁ దాళప్రమాణం బగుకా
ర్ముకంబు గుణఘోషణభీషణంబుఁ గావించుచుం దీవ్రనారాచనఖరంబులు దాల్చి
శార్దూలంబులపోలిక నహితమృగయూథవిదళనాపేక్ష దీపింపఁజనియెమఱియును.

మ. శతశీర్షుండు శతోదరుండు శతదంష్ట్రాభీఘోరవక్త్రుండు ప
ర్వతతుంగాంగుఁడు చంద్రసూర్యరిపుఁ డారాహుండు బాహూత్కరం
బత్తిక్రోధంబుగ విశ్వకర్మకృతదివ్యద్భుతో కేతూజ్జ్వలో
ద్వృతయానంబున నేగె నార్చుచు ననేకానీకసంవీతుఁడై.

సీ. వేదాదివిద్యల విశ్రుతుఁడై క్రతువులు వేయిచేసి యాజలజభవుని
చే వరంబులు గని సిద్ధశ్వష్టకంబును దమఁ జెంద నెందుఁ గీర్తనలఁ బరఁగి
విలసితంబై మూడువేలునిమ్నాలుచేతులపర పైనయుజ్జ్వలరథంబు
నెక్కి హంసధ్వజం బెసఁగ సితోష్ణీషగంధమాల్యాంబరకల్పన మెఱసి

రజతశైలంబుఁబోలెనాత్మజులుమనుమ,లాత్మసములెందఱేనినెయ్యమునఁగొలువ
వెడలెఁ గాశ్యపసుతుఁ డగువిప్రచిత్తి, చిత్తముత్సాహరసమునఁ జెన్నుమిగుల.

తే. కేశి యేఁబదిరెండువేలాశుగతము, లగురథంబులతోడ నుష్ట్రాంక మైన
పడగ గలతేరిపైఁ బెడబారివిల్లు, చేత నొప్పంగ నేగె నాజికి రయమున.

క. వృషపర్వుఁడు గర్వంబున, వృవపూర్వకులైనసకలవిద్విషులదెసన్
విష మొలుకుకనుక నరిగెను, వృషభధ్వజరథముతోడ విషమాత్మక్రియన్.

వ. మఱియు సుపార్శ్వుండు లంభుండు కుంభాండుండు మొదలుగా నసంఖ్యేయు లగు దైతేయు లప్రమేయసేనాసమేతంబుగా నాముక్తకవచులును నాత్తకిరీటులు నాగృహీతవివిధాయుధులు నారూఢవిక్రమప్రయత్నులు నాబద్ధసమరపరికరు లునై వెలువడ బలీంద్రుండు చంద్రాంశుసదృశదుకూలవాసస్సుగంధికుసుమదామసురభిగంధబంధురాభరణంబుల నలంకృతుండై వీర్యవంతంబు లగుమంత్రంబుల నౌషధంబుల నుపబృంహితంబును బహువిజృంభణంబును నగుతేజంబునం బొదలి బ్రాహ్మణోత్తములకు నుత్తమంబు లగువిత్తంబులరాసులు గోభూప్రముఖంబులుం బ్రియభక్తిపూర్వకంబుగాఁ బ్రతిపాదించి తదాశీర్వాదసహస్రంబుల నభివర్ధితుండై రిపుపరాజయత్వరితం బగుమనంబుతోడ ననల్పవిస్తీర్ణంబును సౌవర్ణవృకధ్వజవిరాజితంబును నగువిశ్వకర్మనిర్మితమాణిక్యస్యందనం బారోహించి రోహణాచలసితం బైనమహామేఘంబు మహేంద్రచాపంబునం బోలుచుకరణి వివిధమణికిరణవ్యతికరస్ఫురితం బగుశరాసనంబు ధరియించి నిఖిలదిగంతరవ్యాపకం బగుతూర్యఘోషంబునం బెరసి వందిమాగధచయజయజయశబ్దంబులు బహువీరబిరుదాలాపంబులు నాటోపంబు నుద్దీపితంబుఁ జేయఁ గదలె హయశిరుండు నశ్వశిరుండు శిబితురంగుండు వికచుం డజుండు మరాపుండు నికుంభుండు హరుండు ననుదానవులు పదుండ్రు తదీయరక్షకులై కదిసి నడిచిరివ్విధంబున.

క. బలిఁ బ్రభుఁగా మున్నిడుకొని, బలియురు బలుఁడాది యైనప్రత్యర్థులనా
కులరభసంబునఁ దమపై, జనుదెంచుచునున్నవిధము శక్రుఁడు వినియెన్.

తే. విని సమస్తదేవతల రావించి యంత, యును నెఱింగించి శత్రులయుద్యమమున
కుచిత మైనట్టిప్రతికార మొాపి చేయ, కునికి యైశ్వర్యకాంక్షికిఁ జనునె యెందు.

వ. కావున నెదురునడచి పొడిచి గెలుతము లెండు సన్నద్ధులై రండని పనిచి.

ఇంద్రుండు సకలదేవతలతోడ బలితోడి యుద్ధమునకు వెడలుట.

శా. వీరోల్లాసము హాసమిశ్రితముగా వేగంబ కైసేసి యిం
పారన్ వేల్పులు వేల్పుతేములును రాగాగూఢత స్వేచ్ఛఁగా

ధారారోచుల వహ్ని లోల్కోడుమహోదంభోళి చేఁ బూని దు
ర్వారోద్యద్గజరాజు నెక్కి వెడలెఁ బర్జిష్ణుదోర్వీర్యుఁడై.

వ. అతనియగ్రభాగంబున.

చ. హయములు వేయి పూనినమహారథ మెక్కి మహేశమిత్రుఁడు
క్షయనిధిగోప్త యక్షతభుజాబలుఁ డర్థవిభుండు యక్షసం
చయసమవేతుఁడై నడిచెఁ జంచదుదాత్తగదావివర్తన
ప్రయతసలీల చూపఱకు భ్రాంతవిలోకత నావహింపఁగాన్.

ఉ. ఘోరశితప్రతాపశతఘోటకయుక్తరథంబు నెక్కి క్రో
ధారుణనేత్రరోచుల సితాంబుదతుల్యశరీరకాంతితోఁ
గ్రూరములై తలిర్ప బహుకోటిమితోద్ధతకింకరుల్ పరీ
వారముగాఁగ నేగె సమవర్తి సముద్యతదండపాణియై.

మ. అమితాఖిలభుజంగవాహ్యరథుఁడై యాదోగణం బిద్ధవి
క్రమతం దోడుగ నడువం బ్రదీప్తమణిరేఖాచిత్రభూషామనో
రమవేషంబున వార్ధిపుం డరిగెఁ గ్రూరద్వేషికంఠగ్రహా
ద్యమనిర్నాశము లైనపాశములు హస్తాలంకృతిం జేయఁగన్.

వ. మఱియును వసురుద్రాదిత్యాశ్వివిశ్వసాధ్యులు లోనుగా నశేషగీర్వాణులును సర్వగంధర్వసిద్ధవిద్యాధరగరుడోరగాధిపతులును సముద్రనగగ్రహనక్షత్రదేవతలును దివంబున నున్నరాజర్షులును సకలభూతాంతరాత్ములు నతిగంభీరంబులై నయాకారంబుల విలసిల్లి యవికారంబు లైనవాహనంబులు రంజిల్ల నాత్మీయపరివారంబులతో నాహవకౌతూహలంబు మనంబుల నపూర్వగర్వంబులుత్పాదింపఁ బెంపారి నిలింపపతిముందటం బిఱుంద నుభయపార్శ్వంబుల నరిగిరి వసిష్ఠుండు జమదగ్ని నారదుండు పర్వతుండు వాచస్పతి యాదిగాఁ గల మహానుభావు లతనికి జయంబుగోరుచు నంబరమార్గంబునం దోడ్తో చనిరి వనరుహాసనుండును సనత్కుమారాదిసిద్ధులు గదిసి కొలువ మూర్తంబు లైననిగమప్రముఖవిద్యాధర్మతపస్సత్యంబులు పరివేష్టింప నరనారాయణసమేతుండై సమరవ్యాపారం బనుసంధించుతలంపున నరుగు దెంచి యంతరిక్షంబలంకరించె నమ్మహాసైన్యంబు కేతుపతాకాదివికాసంబుల గజాదిచతురంగవిజృంభణంబులఁదూర్యవిరావంబుల గాంభీర్యంబునం జారణసంకీర్తనంబులతుములంబున నధికదర్శనీయంబును నతిమాత్రభయదంబును నతిసముల్లసితంబును నత్యంతమనోహరంబును నై నడచె నంత.

క. కదియఁ జనుదెంచు దైత్యులు, త్రిదశులఁ గని నరకుగొనక తెంపుఁ గడిమియున్
మదమును నొండొంటిఁ గడచి, యొదవఁగ దలపడిరి సంప్రహృష్టులు మెఱయన్.

క. అమరాసురసైన్యద్వయ, సముదాయం బప్పు డధికచండం బయ్యెన్
సమసుప్తిసమయజృంభిత, సముద్రయుగసన్నిపాతసమత మెలర్పన్.

వ. అట్టిసంకులంబున బాణాసురుండు సావిత్రుం డనువేల్పును బలుండు ధ్రువుం డనువసువును నముచి వసువులలోన ధరుం డనువానిని మయుండు విశ్వకర్మనిఁ బులోముండు సవితారుని హయగ్రీవుండు పూషాదిత్యుని శంబరుండు భగుని నిశుంభకలభులు చంద్రసూర్యులను విరోచనుండు విష్వక్సేనుం డనుసాధ్యుని జంభుం డంశుని వృత్రుం డశ్వినులను కేశి భీముం డనురుద్రుని వృషపర్వుం డు నిష్కంభుం డనుదేవతను బ్రహ్మోమండు దండధరుని నముహ్లోముండు లంబోద రుని విప్రచిత్తి వరుణు నెదిర్చిరి బలీంద్రుం డింద్రునిం దొడరి పెనంగె మఱియు ననేకద్వంద్వయుద్ధంబులు ప్రవర్తిల్లె నిప్పుడు సెప్పిన యిన్నియుం గ్రమంబున వివరించెద.

దేవదానవులకు ద్వంద్వయుద్ధంబు సుప్రసిద్ధంబుగా జరుగుట.

క. బాణుఁడు సావిత్రునివిలు, బాణహతిం ద్రుంచి యతనిబలసాగరమున్
బాణాంశులఁ గ్రోలి మహా, ప్రాణుండై తేజరిల్లెఁ బ్రళయార్కక్రియన్

తే. ఏచి సావిత్రుఁ డొకశక్తివై చుటయును, దనుజుఁ డెడఁద్రుంచెనతఁడురథంబుడిగ్గి ఖడ్గహస్తుఁడై కవిసినఁ గాలుసేయి, యార్పరాకుండ నేసి యయ్యసియుఁ దునిమె.

క. బెగడి నిజరథముమీఁదికి, మగిడి హరులఁ దోలుకొని సమస్తామరులున్
దిగు లొందఁ బఱచె నాతఁడు, దిగంతము లద్రువ నార్చె దేవద్విషుఁడున్.

క. బలుఁడు గదఁ బూన్చి ధ్రువునడు, తలవైచిన సొమ్మవోయి తత్క్షణమాత్రన్
దెలిసి యతఁ డతని వివిధో, జ్జ్వలశరముల నేసె సురలు సంస్తుతిసేయన్.

వ. ధ్రువునితోడంబుట్టువు లైనయాపుండును సీలుండు ననువార లతనికిం దోడ్పడి బలుని ననేకవిశిఖంబులం గప్పి రబ్బలియుండు బలిష్ఠం బగుకార్ముకంబు గైకొని యుగ్రంపుటంపఱఁ బఱప నయ్యన్నదమ్ములుం బోక పెనంగినం గనుంగొని.

క. క్రమ్మఱ గద గైకొని శీ, ఘ్రమ్మున నరదమ్ము డిగ్గి కడఁగి రథానీ
కమ్ములకుఁ గదిసి పలువుర, నమ్మహితాయుధముచేత నసువులఁబాపెన్.

తే. విడిచివిడిచివై వఁగఁ బెనుపిడుగుఁబోలె, మ్రోయుచునువచ్చిగదశిరంబులకడఁపగఁ
పడినదివిజకాయంబులఁ బ్రధనభూమి, మెదడుప్రోవులమయమయ్యెమిక్కుటముగ.

మ. తమచుట్టుం బయలైననుం గడిమియున్ ధైర్యంబుఁ బాటించి సాం
ద్రముగా సాయకవర్షముల్ గురియుచున్ దైత్యు న్నిరోధించి వి
క్రమమును జూపె వసుత్రయంబు బలుఁ డాగర్వంబు సైరింప కు
ద్భ్రమితస్ఫారగదాప్రవర్తనము ఘోరంబై ప్రకాశిల్లఁగన్.

వ. ధ్రువవ్యతిరిక్తు లయినయయ్యిద్దఱమ్మీఁదం బఱతెంచినం గని యడ్డంబు వచ్చి ధ్రువుండు దానును గదాపాణియై రథంబు డిగ్గి యసురం దలపడియె నమ్మహావీరద్వయంబు శుండాదండచండం బగువేదండయుగళంబు తెఱంగునఁ బటుసటాటోపదీపితం బగుమృగేంద్రయుగ్మంబు విధంబునం బెద్దయుం ప్రొద్దు గదలం బోరాడి గద లొండొంటిం దాఁకి విఱిగినం గృపాణఫలకపాణులై యేటులాడఁ గృపాణఫలకంబులు నట్ల తుమురై పడిన బాహుప్రహారంబులం గొంత దడవు సురాసురయశస్కరులై పెనంగి పెనంగి యనంతరంబ.

క. బలమఱి ధ్రువుఁ డహితునిదో, ర్బలవిభవము సైపలేక పరిభవదైన్యా
కలనమున కోర్చి శత్రులు, చెలఁగఁ దొలఁగఁబాఱె దేవసేనలు గలఁగన్.

వ. తక్కినవారలు నతనిపోయినపోకలన పోయిరి ధరుం డనువసువు దలపడిన నముచి తొమ్మిదియమ్ముల నొప్పించినం బరిగోలలపోట్లం గనలుకరిపతివిధంబునం బేర్చి యతండు.

క. వెలిమావుల నొప్పెడుతన, యలఘుస్యందనముతోడ నతిభీషణమై
యలరెడురిపురథమున క, గ్గలమునమీపముగఁ బఱపఁగాఁ బంచి వెసన్.

శా. జ్యానిర్ఘోషముల న్నభం బెదురమ్రోయం బఱపవాతోద్యమ
గ్లానిం బొంది దిగంతమేఘములు ప్రేంఖత్పుంఖరత్నప్రభల్
భానుద్యోతతిరస్క్రియానిపుణతం బర్వంగ సర్వంకషో
గ్రానేకాస్త్రపరంపర ల్వఱపె నత్యాశ్చర్యచాపంబునన్.

క. ఏభంగి నేసె సురవరుఁ, డాభంగిన పేర్చి యేసె నసురవరుండ
వైభవ ముభయబలభయ, క్షోభావహ మగుచు నుండెఁ గ్రూరస్ఫూర్తిన్.

క. మునులును సిద్ధులు నంబర, మున వారలపోరుసూచి మోదం బెసఁగన్
వినుతించిరి నారదముని, యనుపమనటదలసత న్మయత్వము నొందెన్.

తే. ఒడుతుఁ బగవాని సేనను నుద్యమమున, దానవుండును గూల్తు శాత్రవుని నిపుడ
యనుచలంబున దివిజుండు నధికరోష, భరము సదృశంబుగా నొనర్చిరి రణంబు.

వ. అంత.

క. ధరుఁ డడ్డవాతియమ్మున, సరభసుఁడై త్రుంచె నముచిచాపము నతఁడు
ద్ధురుఁడై యుగాంతభాస్కర, పరిధి నెనయుచక్ర మొకటి పటువేగమునన్.

వ. కరంబున నమర్చి ధరునిదిక్కు వైచిన నది పరిస్ఫురద్ధారాస్ఫులింగం బగుచుఁ గడంగి తదీయరథ్యంబులశరీరంబు లన్నియు వ్రయ్యలు గావించి సూతుని శిరోవిదళనం బొనర్చి నయ్యంతరంబున రథంబు డిగ్గనుఱికి నిలువ నోడి యవ్వసువు పలాయనంబు వాటించె నట్లు ప్రత్యర్థిం బఱపి దనుజపుంగవుండు సెలంగి యార్చి శంఖంబు పూరించి వైరినికరంబులఁ జీరికిం గొనక నిగిడి చాపహస్తుం

డై హస్తితురంగరథానీకంబులు పొడిసేసె విశ్వకర్మ తన్ను నెదిర్చినమయుని మీఁద ముప్పదియమ్ము లేసిన నతండు.

క. కొలఁది యిడరానిశరతతిఁ, బొలివోవక దేవశిల్పిఁ బొదివినఁ గ్రోధా
కలనమున మొగ మెఱ్ఱఁగ, నలఘుశరాసనము విడిచి యాతఁడు పెలుచన్.

తే. అసురకోటిప్రాణములెల్ల నపహరింప, నిదియచాలుఁ బొమ్మనఁగ నభ్యుదితశక్తి
యైనశక్తిఁ గైకొని వైచె నహితుదెసకు, నశని యద్రిపై విడుచుజంభారిపగిది.

క. అంతంతన యార్కై దువు, నింతింతలు తునియలై మహిం బడనేసెన్
సంతసముగ నసురులకు ని, తాంతభుజస్సయుఁడు మయుఁ డవారణలీలన్.

క. శక్తి యెడలుటయు నెంతయు, శక్తియెడలి యున్నరిపునిఁ జటులధనుర్ని
ర్ముక్తాస్త్రంబులచే ని, ర్ముక్తాహవుఁ జేసి లగ్గిఁబోలె రుద్ధునిఁ జేసెన్.

వ. త్వష్టయును విల్లు గైకొని యంపగములనుఱక మయునిశరీరంబు సెక్కి నయ్యు ధువురు శాతనఖచంచూపాతసంబులం బోరుమహాశ్యేనంబులపోలికం దడవుగా నేల్లాడుచు నొండొరులం దెఱల్పం జాలక సదృశదశం దేజరిల్లి రది సహింపక యసురశిల్పి యనల్పరోషంబున.

ఉ. చేతిశరాసనం బురివి శీఘ్రమ సర్వవిపక్షజీవితా
ఘాతిని యైనయుగ్రగదఁ గైకొని వైచినఁ దన్నిపాతనన్
సూతతురంగకేతువులు చూర్ణములై యెడలెన్ రథంబు వే
భూతలగామియై నిలిచె బుద్ధిగలంగక విశ్వకర్మయున్.

క. అప్పుడు గుణసంధానం, బొప్పఁగఁ జేయుచును బహువిధోగ్రశరములం
గప్పియును మెఱయ నాతఁడు, నెప్పటివిలుగొని విరోధి నేసెం గడఁకన్.

క. మయునమ్ములు సురవర్ధకి, మెయిఁ గాఁడి పసిండితగడు మెఱవఁగ నస్త్రా
శ్రయహీనరుచి యగుహరి, ధ్ధయుమేనం బొలుచుదీప్తులట్లై మెఱసెన్.

వ. ఇట్లు పోరుచు విరథత్వంబుకతంబునం బ్రయత్నంబు లేవియు ఫలియింప కతండు దొలంగిచనిమె మయుండును బ్రతివీరుని భంగించి రంగత్తురంగం బగురథంబుతో విరోధివాహినిం దఱిసి చిత్రక్రీడావిలోకనంబుల నుల్లసిల్లె మఱియును.

## పులోముండు వాయుదేవునితో యుద్ధంబు సేయుట.

మ. పవనుం దాఁకి పులోముఁ డుగ్రపటుచాపజ్యానినాదంబు ల
ద్దివియున్ దిక్కులు వ్రయ్యఁ జేయఁ బ్రతిహస్తిక్రోధగర్జారవ
శ్రవణం బాత్మ సహింప లేనిసమదస్తంబేరమంబో యనం
గవిసెన్ సాయకవర్షధార లురులంగా నాతఁ డాశత్రుపై.

క. ఇరువురు నేయువెరవు ల, చ్చెరువుం జేయంగ నుభయసేనలవారున్
బొరిఁబొరిఁ బొగడఁ దదారవ, భరితం బయ్యెను దిగంతభాగం బెల్లన్.

వ. అయ్యవసరంబునం బులోముమన్నించుదైత్యు లేప్వు రతనికం దలకడచి వాయు
దేవునిపై ననేకాస్త్రశస్త్రంబులు ప్రయోగించుచుం గదిసిన సమ్మహాబలుండు
నిజబలంబు ప్రబలవేగనిపాతంబున నుద్యోతింప నుఱికె.

తే. ఎడమచేత విల్లుండంగ నితరబాహు, ముష్టి సమ్మహాదనుజులమూర్ధతలము
లేడు దాఁకింప నొక్కటనిల చలింపఁ, బడిరి నవరంధ్రముల నెత్తు రడరిఘుఱియు.

వ. మహాబలుండు పూర్వభంగి నిలుకడన నిలిచి కార్ముకవిస్ఫారంబులు ఘోరం
బులుగా నేయం దొడంగినం గినిసి పులోమునియిరుగెలంకుల నున్నయసురు
లనేకులు రథగజాశ్వసంకులంబుగా నడరి యంబుదంబులు పర్వతంబుం బొదువు
పగిదిం బవను నిరోధించి తదీయవిక్రమంబున నొక్కముహూర్తంబున సైన్య
సమేతులై ప్రగ్గినం గరులు గూలినచోట్లు శుండాఖండదంతచ్ఛేదకుంభకర్పరం
బులు బెరసిన విస్ఫురితఘంటావిభిన్నకక్ష్యావికీర్ణతోమరాంకుశంబులును హయం
బులు మడిసినయెడలు నిర్భిన్నోదరనిర్దళితస్కంధనికృత్తచరణంబులతోడం
గూడి యొడలినపల్యాణకృపాణపర్యసనంబులును రథంబులు నమసినతావులు
భగ్నాక్షగళితరథాంగవిఘటితత్రివేణుకంబులం గలసినకేతనచ్ఛత్రకూబరధను
స్తూణీరశకలంబులును దంతురంబులయి నిపతితవసామాంసమస్తిష్కభారంబు
లగురుధిరపూరంబులు భీరుభయావహంబులు శూరప్రమోదసంపాదకంబులు
నయ్యె నివ్విధంబున నవ్వీరుం డనమన్నాణుదైత్యనాయకులం ద్రుంచి జయంబు
గొని యొక్కదెసం దెఱపిసేసి యాకసంబున నిజేచ్ఛం జనియె నతనిపోయిన
త్రోవ వాయుపథంబునా నేఁడును నేర్పడి సిద్ధసంచారయోగ్యంబై యుల్లసిల్లు.

సీ. వినుము హయగ్రీవుఁ డనుపమశౌర్యుండు పూషు నత్యుద్భటరోషదృష్టిఁ
గనుఁగొని సంధానకర్షణభేదంబు నిశ్చయింపఁగ రానినిబ్బరంపు
రయమునఁ గార్ముకభ్రమణంబు మెఱయంగ నగ్నిమండలమున నడరుమంట
లివియనఁ దగుతూపు లెన్నంగఁ బెక్కులు పరఁగించి పూషునిఁ బ్రపతితాంగుఁ
జేయ నాతఁడు ధైర్యంబు సిక్కఁబట్టి
తనదుపెంపును బేరును దలఁచి నిలిచి
యహితుఁ బ్రతిబాణముల నొంచునగ్గలికకు
నద్భుతము నొంది రుభయసైన్యములవారు.

ఉ. ఒండొరు నేయుసాయకము లుక్కున నిద్దఱు ద్రుంపఁగా సము
చ్చండములై కరం బెసఁగుశబ్దములుం వెసఁ దాఁకి క్రొమ్మొనల్
మండఁగ నుజ్జ్వలోల్కములమాడ్కిఁ దలిర్చుమహోగ్రకీలలు
న్నిండి వియద్దిగంతధరణీతలమధ్యము మ్రింగె సర్వముం.

క. కోపించి హయగ్రీవుఁడు, చాపముఁ గేతువును నఱికి సారథిహరులన్
నే పడనేసిన విరథుం, డై పఱచెం బూఁషుఁ డాసురావలియార్వన్.

వ. శంబరుండు ద్వాదశారత్నిదైర్ఘ్యప్రచండం బగుకోదండంబున నశుదండప్రమాణంబు లగుబాణంబులు భగునిమీఁద నిగిడించె నతండును విశ్వకర్మనిర్మితం బగు కార్ముకంబున నిర్ముక్తంబు లయినరిపుసత్త్వాపహసాయకంబుల నయ్యసురవరు శరీరం బూతయుం గప్పె వారిరువురుఁ బరస్పరశరనికరనిర్దళితగాత్రులై చైత్రసమయకుసుమితంబు లగుకింశుకంబులకుఁ బాటియగుచు నెత్తుటం దోఁగి యుండొరులకు వ్రటపడక పోరుచుండి నప్రమేయమాయుం డగుదైతేయుండు మాయ గావింపం దొడంగి.

క. హరులఁ బరిమార్చి సారథిఁ, బారిగొని కేతనము నఱికి భూరిశరంబుల్
వరపి పరిపంథిదేహం, బర్రవేలెఁడు తెఱపి లేనియట్లుగఁ జేసెన్.

వ. అనంతరంబ యదృశ్యుండైన యాకసంబున నార్చి క్రమ్మఱ దృశ్యమూర్తియై మహీతలంబున నిలిచి పెలుచం బగతుబాణంబులచేత నచేతనుండైనయట్లు కొంతవడి యుండి యంతన తెలిసి యైరావణారూఢుండైన దివిజపతి తెఱంగునం దోఁచి యాలోనన పర్వతప్రమాణఘోరంబు లగుశరీరంబులు నూఱు దాల్చి యెల్ల దెసలం బొడసూపి యుడిగి ప్రాదేశమాత్రం బగుగాత్రంబున నుజ్జ్వలుండై మెఱసి జలధరంబుచందంబున నుదారంబు లగునాకారంబు లనేకంబులు గైకొని తిర్యగూర్ధ్వసంచారంబుల గర్జిల్లి విలయకాలంబున సోనపగిదిఁ గురిసి యవ్విధంబు మాని సంవర్తవైశ్వానరువడువున బెడిదంపు మంటలం బేర్చి యేర్చి శతమస్తకుండును శతసహస్రబాహుండును నైపొదలి యెదిరిసేనలవలనం జనుదెంచు శస్త్రాస్త్రపరంపర లెల్లను గ్రమింగుచుం దనకుం దగినయట్టిమహారథం బెక్కి వివిధాయుధంబుల యుద్ధంబు సేసి గంధర్వనగరంబుపగిది నక్కడన యంతర్ధానంబు నొంది యొంత్రీయరూపంబున నెప్పటియరదంబుపయిం గానఁబడి విరోధి ననిరోధశరనికరంబులం బొదివిన.

క. అతఁడు వెఱచఱచి లజ్జయు, ధృతియును బోవిడిచి పఱచి దేవేంద్రుని నున్నతశౌర్యుఁ జేరియొదిఁగెను, దితిసుతసైన్యంబు లార్చె దెస లద్రువంగన్.

**శరభశలభులను దైత్యులు సూర్యచంద్రులతో మహా యుద్ధంబు చేయుట.**

వ. శరభశలభులు లనుదైత్యు లత్యుగ్రసాయకంబుల సూర్యశశాంకుల శరీరంబులు నించినం గోపించి యందుఁ జందురుండు.

క. ఆయిరువురకాయంబులు, నాయతహిమరూపదారుణాస్త్రంబులపెల్లైయుడిగిపడఁగఁ జేసి య, జేయుండై కవిసె దైత్యసేనలమీఁదన్.

సీ. కదిసి నీహారంబు గవియింప నెడఁ జొలు మడిఁగియు మూర్ఛిలియును
హయవారణస్యందనావలిపై నుండ లేక యారోహకు ల్వసుధిపైఁగూల
నెక్కడెక్కడఁజోయె నక్కడ నెల్లను దావాగ్ని ద్రొక్కినదావభూమి
క్రమమునఁ బొడిపొడిగాఁ గాలమృత్యువుఁ జూచిన ట్లసురులు చూచి తలరఁ
ప్రళయసమయంబునం దుగ్రభంగిఁజీవ, పశుగణంబులసమయించుపశుపతియును
బోలె నాభీలదుస్సహలీల మెసఁగఁ, జల్లఁ జంపయ్యెఁ జంద్రుఁడు శత్రుతతిని.

వ. అట్టియెడ రెండుసేనలయందును నుదుటు గలపోటరు లాహవనికాలంబున మేపు
గ్రొవ్విన మందలయందుఁ గడంగి నలిరేఁగి తొడరువృషభంబులుం బోలె దర్పిం
చి తలపడిననధికసంకులం బయ్యె నందుఁ బలువురమీఁద నొక్కరుండును నొక్క
రునిమీఁదం బలువురునుబలువురు పలువురమీఁదం గవిసి పోట్లాడ ననూనశస్త్ర
పాతంబులనంగకంటకంబులు దునిసియు శిరస్త్రాణంబు లెడసియుఁ బరిక్షతాంగు
లగువారును రథ్యంబులు సమసియు సారథులు పడియును విరథులై వెడంగు
పడువారును విండ్లువిఱిగియు ఖడ్గాదిసాధనంబులు సమసియుఁ జేయునదిలేక
చేష్టుడువారును గాలుసేతులు దునిసియు నవయవంబులు వ్రస్సియుఁ దృక్తజీవి
తు లగువారును నానాభూషణస్థానంబులం బ్రదీప్తబాణంబులు గాఁడి చంద
నోత్థితవక్షంబులు మేదోమాంసవసావిసరంబునఁ బ్రుంగి హసితోల్లసితవదనం
బుల బహుళరుధిరంబులు గ్రక్కి కూలియు లీలావికాసంబున భాసిల్లువారు
నగుచు నార్పులుఁ బెడబొబ్బలుం దూర్యరవంబులుఁ దర్జనంబులుఁ జొగడ్తలు
నెసంగఁ గోలాహలమయంబు లగుచోట్లును జెడి తూలి యడఁగి మడఁగి వ్రగ్గి
మడిసి యులివులడఁగి పాడువాఱుప్రదేశంబులును గరినరతురగకళేబరంబులు
కరాళంబులయి కీలాలంబులు కాలువలై మాంసకర్దమంబులు దుర్గమంబులై
దుర్దర్శంబు లగునెడలునై మహారౌద్రంబు ప్రవర్తిల్లుచుండ.

క. ఉరవడి విష్వక్సేనుని, యురస్థలమునందుఁ జొనిపె నొకశరము రిపూ
త్కరతిమిరవిరోచనుఁ డగు, విరోచనుఁడు దానఁ గనలి విబుధోత్తముఁడున్.

తే. నవశరంబుల నెంచె దానవుని దేహ, మాతఁ డాజ్యాహుతులఁ బేర్చునధ్వరాగ్ని
పగిది నుద్దీప్తుఁడయి యేడుబాణముల వి, రోధిసర్వమర్మంబులు గ్రుచ్చుటయును.

క. స్థాధ్యుఁడు మూర్ఛమునిఁగి రథ, మధ్యంబున వ్రాలి వేగమ ప్రబుద్ధుండై
యధ్యారూఢసముద్యమ, సిధ్యద్బలుఁ డగుచుఁ బరపె శితవిశిఖంబుల్.

ఉ. ఆతనిచెయ్యి గైకొనక యయ్యసురేంద్రుఁడు తద్బలంబుపై
నాతతకార్ముకధ్వనిత మష్టదిగంతవిభేదిగా శర
వ్రాతము నించుచుం గడఁగి వారణఘోటరథస్థమస్తముల్
భూతల మంతయుం దఱుచుప్రోవులు చేసె భయంకరోద్ధతిన్.

తే. దొరలు కడిమి విష్వక్సేనుతోడఁగూడి, భీతకోటినాశ్వాసించి పేర్చి సర్వ
సైన్యములఁ బురికొల్పి యాశత్రుమీఁదఁ, దెచ్చి క్రమ్మఱఁ దలపెట్టి రచ్చెరువుగ.

వ. అమ్మహాయుద్ధంబున నసాధ్య యగుసాధ్యధ్వజిని నుద్ధతద్విరదబృంహితంబులు బహుళహయహేషితంబులుం బ్రోత్థితనేమినినదంబులుఁ బ్రకటభటసింహనాదంబులు నుద్దండకోదండవిస్ఫారంబులు నిశ్శంకశంఖధ్వానంబులు నుదారభేరీనిస్సాణరావంబులు నొక్కటియై బ్రహ్మాండకర్పరదళనదర్పంబునఁ జెలంగ శరంబులుఁ దోమరంబులు శక్తులు గదలును గరవాలంబులు భిండివాలంబులుఁ బరిఘంబులుఁ బరశువులు మఱియు బహువిధంబు లగునాయుధంబులు శూరనికరకరోచ్ఛలితంబులయి సముచ్చండగోచులం జండకరసహస్రవిస్రంసనం బొనర్చె నాభీలం బగుధూళిజాలంబు సకలమాలిన్యకారియై యంధకారంబు ననుకరించె నట్లు దారుణం బగువైరులయాక్రమణంబు సైరింపక విరోచనుండు.

విరోచనుండువిష్వక్సేనప్రముఖదేవతలతో మార్కొని ఘోరయుద్ధంబు జేయుట

క. అసితఫణిభీషణం బగు, నసిచేకొని యాయత మగునంసమున నమ
ర్చి సముద్ధతి నరదము డిగి, మసరుకవిసి కదిసె మారి మసఁగినభంగిన్.

వ. ఇవ్విధంబునం గడంగి.

ద. ధనువులఁ దెగవ్రేసి తనువులఁ దెగవ్రేసి శిరములఁ దెగవ్రేసి కరములోలిఁ
దెగవ్రేసి పడగలు దెగవ్రేసి శరములు దెగవ్రేసి రథములు ద్రెవ్వనేసి
కరులఁ ద్రెవ్వఁగవ్రేసి తురంగంబులను వ్రేసి రథికుల వ్రేసి సాదుల వ్రేసి
యాశ్వికతతి వ్రేసి హాస్తికావలి వ్రేసి పదతలములు వ్రేసి బల మెలర్ప
నెచటికేనియు నుఱికి యెందేనిఁజొచ్చి, యెట్టివానిని మిగిలి యెల్లనిఁ జేసి
వేయితెఱఁగులఁజక్రంపువిన్ననువులఁ, జంపె నొప్పించెఁ బఱపె నిర్జరబలముల.

వ. ఇబ్బంగి నపహతసైన్యుండై విష్వక్సేనుండు పలాయనంబ పరాయణంబుగాఁ బాటించెఁ దత్సహాయులు నతనితోడన యరిగిరి జంభుం డంశునిం బెక్కుబాణంబులఁ బరిక్షీణప్రాణునిం జేసిన నయ్యాదిత్యుండు తనచుట్లనుం బన్నిన నగంబులంబోని నాగంబులం బదివేల నతనిపైఁ బురికొల్పిన నవి ప్రళయకాలకాళీకఠోరంబులై ఘోరగర్జాతర్జనంబులతోడ నడచిన హిరణ్యకశిపునందనుండు గదాహస్తుండై రథంబుడిగ్గి.

క. శతమన్యుఁడు శతకోటి, క్షతపక్షములుగ నొనర్చి శైలముల మహీ
పతితములుగఁ జేయుపగిది మతంగజప్రతతి నెల్ల మడియించి వెస్సన్.

వ. అంశునరదంబుదెసకున్నై యాదిగొనిన, నతఁడు నిలువంగ వెఱచి సురాధినాథు
దెసకు స్ఫురిఁగె రయంబునఁ దేరుడిగ్గి, యసురహారివృచ్ఛెఁ దరవారి నహితబలము

క. అశ్వినులమీఁద వృత్రుఁడు, విశ్వభయదభంగిఁ దీవ్రవిశిఖంబులు ప
త్రశ్వసనచలితఘనచయ, శశ్వత్ప్రసరముగఁ బఱపె సమదస్ఫూర్తిన్.

వ. తదీయసహాయులై తాఁకినయక్షరాక్షసవరులం దునిమి ఘూర్ణిల్లెడిన నశ్వులు
నతనిఁ దేఱిచూడనులేరైరి నాసత్యు లిద్దఱులోన నొక్కరుండు శూలంబున వైచె
నన్యుండు శరంబులు మూఁట నతనిపార్శ్వంబు భేదించె నట్లుప్రతిభటప్రహారం
బున నొక్కింతస్రుక్కి యారక్కసుండు గదాదండంబు గైకొని ఘూర్ణితంబుగాఁ
బట్టి బెట్టు వైచిన.

తే. కాలదండంబుక్రియవచ్చుగదకుఁదలఁకి, కైదువులువైచిరథములొక్కటఁదొలంగి
వేల్పువెజ్జులు తమవేగవిద్యలెల్ల, మెఱసిపఱచిరి శత్రుసమీపమునకు.

క. భీముఁ డనుపేరి రుద్రుని, భీమపరాక్రముఁడు కేశి పృథుబాణస్తో
తోమగ్నుఁ జేయ నాతం, డామెయి నిరతగొన కడరి యద్భుతలీలన్.

వ. శక్తిగదాపట్టిసత్రిశూలంబుల నోలిన నొప్పించెఁ దదీయానుచరు లనుపాఠిపదు
లసంఖ్యేయు లడరి దైతేయులం బొదివిరి వారిప్రాపున నమరు లనేకులు గడం
గిరి దివిజోత్సాహంబు సహింపక కేశిం దోడ్పడి దానవానీకంబును గ్రింగం
దఱిమె నట్లు బెరయుటఁ గెంధూళి యెగసిన నెదిరివారు దమవా రని యెఱుంగ
రాక కొండొకసేపు రెండుదెఱంగులవారు నిలక తారకయుద్ధంబు సేయ నయ్యె
నం గ్రమంబునం దొరఁగునెత్తురులు ధరణీతలంబు సంసిక్తంబుఁ గావింప సువ్య
క్తదర్శనులయి పేర్చి విచ్చలవిడిం బెనంగిరంత.

క. రుద్రానుచరులు తద్దయు, రౌద్రు లయి విరోధివితతిఁ ద్రవ్వఁగ సమరం
బుద్రిక్త మయ్యె నసురలు, విద్రుతులయి రెల్లదెసల విహ్వలభంగిన్.

వ. అట్టినిజసైన్యదైన్యంబు సూచి కేశి యక్లేశంబున నిలిచి వజ్రాస్త్రం బేసిన.

క. పారిషదులకు నసురలకు, సైరింపఁగ రానికడిఁదిసమరం బయ్యెం
బోర నొకటియును నేరక, యూరక భీముండు చూచుచుండె వికలుఁడై.

వ. వృషపర్వుండు తనబలంబులనెల్లను విశ్వగణముఖ్యుం డగునిష్కంభుండు భంగిం
చుచుండ నంతంతం గని సారథి నద్దెసం దేరువఱపం బనిచి బెట్టు దాఁకె నతని
తోడన దైత్యసైన్యంబులు గదలి ప్రత్యర్థిం జుట్టుముట్టె నట్టిసమ్మర్దంబునందు.

క. నిష్కంపహృదయుఁడై వెస, నిష్కంభుఁడు ప్రౌఢచాపనిర్ముక్తశరా
విష్కారంబులు గగనప, రిష్కారంబులుగ రౌద్రరేఖ వహించెన్.

క. ఆతనిప్రాపున దివిజ, వ్రాతము లభిముఖము లగుచు వచ్చి కడిమిమై
దైతేయులతో నుగ్రా, ఘాతం బొనరించె హేతికల్పన లమరన్.

క. శైలనిభుని నిష్కంభునిఁ, గాలాభ్రస్ఫురితమూర్తి గలవృషపర్వుం
డాలంబున సాయకధా, రాళం బగువృష్టి నిర్భరంబుగ ముంచెన్.

మ. తనసైన్యంబులఁ గాచుచున్ రథగతుల్ ధాత్రీసముత్కంపనం
బొనరింపంగ సమిద్ధహవ్యవహుఁడుం బోలెం బ్రదీప్తాకృతిన్
దనుజశ్రేష్ఠుఁడు ప్రత్యనీకముల నుద్దామాస్త్రదాహంబునన్
జనితోద్దాహత నొందఁ జేసెఁ ద్రిజగత్సంక్షోభసంపాదియై.

ఉ. దేవతలుం గడంగి గజతీవ్రచమూనివహంబుతోఁ గడున్
లావునఁ బూని దానవకులప్రభుపైఁ బటుహేతిదీధితి
వ్యావృతదిగ్విభాగముగ వారక క్రమ్మిన నాతఁ డుద్భట
భ్రూవికృతాస్యుఁడై యరదమున్ వెస డిగ్గి భుజాబలోద్ధతిన్.

వ. ఉదగ్రశాఖం బగుశాఖి యొక్కటి పెఱికి యుఱికి యురవడిం దొడంగినం దలరి దివిజులు వలలు వీఁకం దొడవు లూడ వలువలు సడల నొడళ్లు వడంక మగిడి మగిడి చూచుచుం గనుకనిం బఱచిరి నిష్కంభుండును జేయునది లేక చూచుచుండె వృషపర్వుండు మగిడి రథం బెక్కె.

క. జ్యారవములు రోదోంతర, పూరణ మొనరింపఁ దీవ్రభూరిశరౌఘం
బారెఁ బ్రపై నసరించె మహోగ్రోపత, నతఁడు నేఁ(?)లాడుచు నుండెన్.

——— ప్రహ్లాదుండు సకలసైన్యసమేతుండై యమునితో మహాయుద్ధంబు చేయుట. ———

వ. ప్రహ్లాదుండు దండధరుని గెలుచువాఁడై భార్గవు రావించి విజయావహం బగు క్రియానివహం బభ్యర్థించిన నతండు నియతుండై యభిమతహుతంబుల హుతాశను దర్పితుం జేసి యాథర్వణంబు లగుజప్యంబులు జపియించె నతనిశిష్యులు పదివేవురు గురుశాసనంబున నఖిలజైత్రమంత్రంబుల నాదితిజపతి తేజంబునకు నుత్తేజం బొనర్చి తదభిమంత్రితగంధమాల్యభూషణాదుల నలంకృతుండై విజయాశీర్వాదంబులం జేకొని యాహిరణ్యకశిపుతనయుండు హిరణ్యప్రముఖప్రభూతదానవులు ధాత్రీదివిజులం బ్రీతులం జేసి రథం బెక్కె తదీయబాంధవులు దత్సమాసు లనేకుల వివిధంబునన యనుష్ఠితకల్యాణులై వచ్చి యమ్మహారథుం బరివేష్టించిరి డెబ్బదివేలురథంబులు నన్నియ యేనుంగులు లక్షలకొలఁది ఘోటకంబులు నపరిమితపదాతులుం గలబలంబుల మోహరించి యంతటికిం గానేమినగ్రణిఁ గావించి యవ్వీరుండు భేరీసహస్రంబుల శంఖపణవకాహళశతసహస్రంబులఁ బ్రళయసమయచండస్వనంబుల నజాండంబు పరియలై పటునసుభీతి భూతంబుల చేతోగతుల నుత్పాదింప నుత్పాతపతనప్రేరణపూర్ణ వారం బగువారిధియుంబోలె నడచి యిరుగెలంకుల యోధులం గనుంగొని యిట్లనియె.

క. కడుఁ బెద్దగాలమునకి, ప్పుడు గలిగె సురాళితోడఁ బోరు కడు వెసన్.
బొడిచెద నొడిచెద నహితుల, నుడుగక నాచేయి చూచుచుండుఁడు ధీరుల్,

తే. తొంటిరణములఁ జచ్చి పుత్త్రులు గలిగియు, లేనివారయి యున్నట్టిదానవులకు
నేఁడు మార్తురనెత్తుటినీటఁ బలల, పిండములు గల్గుఁగాక సంప్రీతవిధుల.

మ బలపాదక్షతి మిట్టుఁ బల్లము సమీరాభావంబునంబొంది ని
ర్గళదస్రోదకసేకముం బడసి మాంగల్యస్థితిం బొల్చు భూ
స్థలిపైఁ నేఁడుశయించుఁగాత బలవత్కాకోలకల్పానలో
జ్జ్వలమత్తాయుకసర్పదష్టదివిషత్సంభూతతుంగాంగముల్.

ఉ. తప్పులు పెట్టిపెట్టి వివిధం బగుప్రాణిగణంబు నొక్కమై
ముప్పిరిగొన్నదర్పబలమోహము లెంచను బట్టలేక నే
యొప్పములం బొరిం బఱచు నుద్ధతుఁ బ్రేతపతిన్ వధించి నేఁ
డొప్పగ విశ్వముం బ్రియరసోత్కటలీలఁ దలిర్పఁ జేసెదన్.

ఉ. అక్షయబాణతూణములు సగ్రిమకార్ముకముం దపంబునన్
లక్షణయుక్తితోఁ బడసినాఁడ బలీంద్రునిప్రీతిచేఁత్కై
శిక్షితవిద్య యంతయుఁ బ్రసిద్ధిగఁ జూపెద నేఁడు నేను చు
ప్పేతుఁడ నయ్యెదన్ సురల నెవ్వరు శక్తులు సన్నదుర్పఁగన్.

ఉ. మీరును నేవిచారములు మిన్నక చేయక పెంపు మీఱ నా
చేరువ రండు గెల్చుటకు శ్రీయును గీర్తియు ముక్తియున్ మృతిం
జేరు రణప్రయత్నవిధి చెన్నటఁబోవును యజ్ఞదానసం
భారఫలంబులున్ సదృశభంగులె వీరలు పొందుపేర్మికిన్.

తే. అనిన నందఱుఁ దగుభంగి నతఁడు మెచ్చ, విక్రమోక్తులు బహుభంగి విస్తరించి
రమ్మహాసేన యొప్పె మేఘాభిగమవి, వర్ధితామరతటినీప్రవాహలీల.

సీ. ప్రహ్లాదతనయులు బహువిధాయుధకళాకుశలులు నిగమాదివిశదవిద్య
లన్నిటఁ బారగు లధ్వరశతయాజు లంచితసత్య శౌచాభిరతులు
బ్రాహ్మణప్రియులు సత్పాత్రమహాదాను లహితనిర్మథనకర్మైకధుర్యు
లెందఱేఁ గలరు వారెల్ల నప్పుడు సితగంధమాల్యాంబరకనకరత్న
భూషితాంగులై కైదువుల్ పొలుపుమిగులఁ, గరిహయస్యందనోదీర్ణగతులెసంగ
వచ్చి తండ్రికిఁ బొడసూపి యచ్చెరువగు, తెగువ వాలిరి మూఁకలుద్రేకమొంద.

వ. ఇట్లు బెట్టిదంపుటురవడిం బేర్చి కార్చిచ్చుకరణి నడరి దనుజబలంబు వైవస్వత
సైన్యంబుతోడం దలపడియెఁ బ్రహ్లాదుండు సేనలకుం దలకడచి యెక్కడెక్కడ
యని యక్కమలమిత్రపుత్రునిం దాఁకి యుక్కునం బెక్కమ్ములం బొదివె జము
నిపరివారం బగువివిధవ్యాధిసముదయంబు సాకారంబై కింకరనికరంబు మున్నుగ
గ్యా బగతురం దొడరి పెనంగం దొడంగె నప్పుడు.

మ. యమసైన్యంబులచేత దానవులు దైత్యానీకదర్పంబునన్
శమనాగ్రేసరులున్ విభగ్నవిహతప్రస్తావధూతక్షత
భగ్నిమితక్షోభితమూర్ఛితావదళితప్రాయాంగులై యాహవ
క్షమ నెల్లన్ బహురక్తమాంసకలితంగాఁ జేసి రస్త్రావళిన్.
క. కాలుఁడు దైతేయుండును, గాలాంబుదయుగముభంగిఁ గాంచనమణిచి
త్రాలగ్నచాపు లయి శర, జాలసలిలవృష్టి గురిసి సలిపిరి రణమున్.
మ. శరము ల్ప్రాణముఖంబునం దిగుచుట ల్సంధించుటల్ కర్షణం
బరుదారంగ నొనర్చుట ల్విడుచుట ల్నాటోపవేగంబునం
బరికింపంగ వశంబుగాక పరిధీభావంబునం జాపముల్
పరఁగం జొచ్చిరి వార లిద్దఱు సమప్రక్రాంతబాహూద్ధతిన్.
క. పిడుగులగతి నొండొరుపైఁ, బడువాలంబులదుసహ్యపాతంబుల క
ఱ్ఱడళులదూరుచుఁకాకె, క్కడఁ గలుగునె తత్సమానకాఠిన్యంబుల్.
క. ఎడసొచ్చునుభయబలములఁ, బొడిపొడిచేయుచు దిగంతములు మూఢముగా
నడగుచు నెడలేకినగుచు, లడఁచుచుఁ గడుబెరసెవారియస్త్రోద్గమముల్.
క. లే దెన్నఁగ మును నేఁడును, లే దిటమీఁదటను లేదు లే దెన పోల్పం
గా దానికి నని యని ప్ర, హ్లాదయముల పోరు మెచ్చి రంబరచారుల్.
వ. అంత నంతకంతకు సంతకుండు పరిశ్రాంతసత్త్వుం డగుచువచ్చె సత్త్వాధికుం
డగుట ననుకోత్తమువానసశారీరవృత్తంబులు భేదాయత్తంబులు గాకుండె
నయ్యంతరం బెఱింగి కృతాంతసారథి రథం బపక్రాంతంబు సేసెఁ బ్రహ్లాదుం
డాత్మగతంబున.
క. తనువ్రగలరియాత్మ లెల్లన్, దనవశముగఁ దనరుదండధరుఁ డట్లువిచే
తనుఁ డయ్యెమహ్భుజాఘా, తన కింతియచాలు మేటితన మని యెలమిన్.
క. ఆతని వెనుకొన నొల్లక, యాతత మగురథము దేవతానీకముపై
సూతునిఁ బఱపఁగఁ బనిచి ని, శాతశరవ్రాతపాతచలితము చేసెన్.

అనుహ్లాదుండు కుబేరుం దలపడి సంగ్రామంబు భీమంబుగాఁ జేయుట.

వ. తదీయానుజుం డగునహ్లాదుండు కుబేరుం దొడరి పోరునెడం బెక్కండ్రు యక్షు
యోధులు రథతురంగమాతంగబహుళపదాతికినీసమేతంబుగాఁ బతికి బాసటలై
న శతం డండటం దునుమాడి సమరధరణి రుధిరధారావర్షంబున నభిషేకించిన.
క. కినిసి ధననాథుఁ డాతని, ననవరతశరౌఘమగ్నుఁ డగునట్లుగఁ దా
నొనరింపఁగ సరదము డిగి; దనుజుం డొకతరువు వెఱికి దర్పస్ఫూర్తిన్.
క. పౌలస్త్యురథాశ్వంబులఁ, గూలఁగ వ్రేయుటయు నట్టిఘోరక్రియకుం
జాలంగ మెచ్చి నుతివా, చాలంబై యార్చెదైత్యసైన్యం బెల్లన్.

వ. వేఱొక్కరథంబెక్కి ముక్కంటినెచ్చెలి చిచ్చఱపిడుగులకు సంగడంబులగుకడింది యమ్ముల నమ్మహాసత్త్వ నేయుటయు నతండు పర్వతప్రమాణం బగుపాషాణం బొక్కటి యెత్తి యహితుపై వైచిన.

మ. గద నేతం గొని శీఘ్రలంఘనకళాకల్పజ్ఞుఁడై పాసె న
ర్థదుఃధారాయి హయధ్వజాస్త్రతతితోఁ దత్స్యందనం బంతయుం
జదియం దీవ్రరయంబునం బడియె యక్షుశ్రేష్ఠుఁ డొండొక్కచోఁ
బదిలంబారఁగ నిల్చి పెల్చె ననికిం బ్రత్యర్థి నత్యర్థిమై.

క. దితిసుతుఁడును వేఱొకప, ర్వతశిఖరముఁ బెఱికికొని జవంబున నలకా
పతిపైఁ బఱతెంచిన గద, నతఁ డతనియురంబు వైచె నతిరౌద్రముగన్.

క. వ్రేటు నరకుగొనక గిరి, కూటంబునఁ బ్రహతుఁ జేసె గుహ్యకవిభు న
మ్మేటిమగఁ డతఁడు మూర్ఛా, స్ఫోటితచైతన్యుఁడై వసుంధరఁ బడియెన్.

వ. ఆలోన నతిరయంబునం దదాప్తు లగుయక్షరాక్షసవీరు లందఱుం బఱతెంచి యతని నహితుని కగపడకుండం బరిరక్షణం బొనర్చి రేకక్షణంబున నేకపింగ ళుండు జడను దొఱంగి లేచి నిలిచి నింగియు దెసలు నద్రువ నార్చె నిట్లు మహా చలశృంగతాడితాంగుం డయ్యును భగ్నంబు నొందనియతని సవధ్యుంగా నెఱింగి దైత్యు లెవ్వరుం గోల్తలసేయక తొలంగినం గని పురికొల్పి కాలనేమి సుర నేమి తప్తనేమి నామంబులం గలయసురులతోడం గూడ ననుహ్లాదుండు దల పడినం గుబేరునిపై నికులు మూర్కొనిన నయ్యిరువాఁగునకు శక్తిగదాముసల ప్రాసపరిఘపరశ్వథాదుల గిరిశిఖరశిలావృక్షకాష్ఠంబులను బాహుముష్టినఖదం తంబుల నతిఘోరం బగుసంప్రహారంబు ప్రవర్తిల్లె నప్పుడు.

చ. గదగొని రాజరాజ జడరేఁ గ్రమ్మఱ శాత్రవుమీఁద నాతఁడున్
గదగొని తీవ్రుఁడై యెదురుగా నడతెంచి యతండు వ్రేసె నా
గద నది నుగ్గుగా నడిచె గ్రక్కున నాత్మగదాహతిం బలం
బొదవఁగ దానవేంద్రుఁ డసురోత్కర మొక్కటఁ బిచ్చలింపఁగన్.

వ. కిన్నరేశ్వరుం డొక్క గదగొని నిలిచిన ననుహ్లాదుండు చేతిగద యురివి కొండ చఱచివయ్యవాపి పుచ్చుకొని దీనం బగతుం బొరివుత్తు ననుచుం బ్రళయపద్ధ త్యాపహారి యగుమహాసమీరుండునుంబోలె దారుణరయంబునం బఱతేరం గనుంగొని.

క. దనుజులకు మేలుచేయును, ననిమిషులకుఁ గీడుపాటు నగుచుండఁ బెట నె
మ్మనమున నూహించి తలఁకి, ధనదుండు దొలంగె నాప్తతతియుం దానున్.

సీ. జితకాశి యగువిప్రచిత్తి పశ్చిమదిశానాథునిఁ దీవ్రబాణములఁ బొదివి
ప్రళయకాలమునాఁటిభానుదీప్తులుఁబోలె సర్వసత్త్వాళి శోషణముఁ జేయ

నతనియస్త్రముల విహ్వలుఁడై జలేశుండు క ర్తవ్యమేమియుఁ గానఁ డయ్యె
నగ్నిమండలచండమై మందుదైత్యునాననమును దేటిచూపును వశంబు
గాక యుండె నట్లు కడునుగ్రుఁడై యసు, రోత్తముండు వరుణు నుసుఱుగొందు
నింకఁ దడవుసేయ నేటికి నని యొక్క, పరిఘ మెత్తుకొనియె బలము మెఱయ.

వ. అమ్మహాపరిఘంబు కేలం గొని త్రిప్పునప్పుడు సప్తపవనస్కంధసప్తమునిసప్తా
శ్వసుధాకరగ్రహనక్షత్రదివ్యవిమానమేఘచయమండితం బగుగగనమండలం
బంతయు సదభ్రభ్రమితం బైనయట్లుండె నట్టియాయుధంబు పూఁచి యతండు
వరుణుముందటిసైన్యంబులం బొడిసేసి యతనిని వ్రేసినఁ దదీయగాత్రస్పర్శనం
బుననవితుత్తుము రయ్యెఁ దచ్ఛకలంబులు ఖద్యోతంబులపోలిక నెల్లదెసలం జెద
రె నట్టివ్రేటున నిశ్చలుం డై యున్న ప్రాచేతసుచేతనాస్థైర్యశారీరశక్తివిభవంబులు
సకలభూతంబులుం బ్రశంసించె నంత.

తే. సప్తపాతాళపతు లగుసర్పపతుల, నెల్లఁ గనుఁగొని యాదోగణేశ్వరుండు
పనిచెఁ బ్రత్యర్థిఁ దలపడ ప్రకటసత్త్వ, మంతయునుజూపుఁడని పేర్మి యతిశయిల్ల.

క. పలికి పనుచుటయు విష, జ్వాలోత్కటదంష్ట్రి లతులశస్త్రంబులుగాఁ
గాలాగ్నిచ్ఛటలకరణి, వాలి కడఁగె నురగతతు లవష్టంభమునన్.

వ విప్రచిత్తి యవ్విధంబునకు నల్ల నగుచు గారుడం బగునస్త్రంబు ప్రయోగించిన
ననేకంబు లగుగరుడాకారసాయకంబు లడరి ఘోరవిదారణం బొనర్చి సంగ
రోర్వి దర్వీకరశకలశకలంబులం గప్పెఁ దదనంతరంబ.

మ. తనకుం జేయఁగఁగల్లుభృత్యు లరిదోర్దర్పంబుచే గ్రుగ్గఁగాఁ
గని చిత్తంబున స్రుక్కియుం గడఁక దక్కంజాల కబ్ధిప్రభుం
డనిరోధోద్ధతబాణవేగమున దైత్యాధీశ్వరున్ ముంచె నా
తని నాతండును నొంచెఁ జాపధరుఁడై తత్తుల్యబాణావళిన్.

క. వరుణుండు విప్రచిత్తియు, నుర మొనరింపంగ నొక్కతూఁకున శౌర్యం
బరుదై చెల్లఁగ దైత్యుఁడు, పరిభవముగఁ దలఁచె నట్టిభావము దనకున్.

వ. అట్టిమత్సరంబునం దోడ్తోన వర్ధిల్లునుద్ధతిం బ్రదీప్తమానప్రాణుం డగుపూర్వ
గీర్వాణుగర్వంబుచేత నెత్తువడి వడిచెడి వరుణుం డపసరణంబ శరణంబుగా శత
మఖుం డున్నదిక్కునకునరిగె నతనితోడన సైన్యంబులుం జనియె నివ్విధంబున.

క. వసురుద్రాదిత్యాదులు, ప్రసభంబున రిపులచేతఁ బరిభవభూరి
వ్యసనము నొందుటఁ గనుఁగొని, యసహాయుం డగ్ని దేవుఁ డతికోపమునన్.

వ. ఆత్మగతంబున.

తే. అమరులకు నేన దిక్కు హవ్యములు మోచి, పెట్టి పోషింతు నిటు కేను పుట్టినప్పు
డగు నెయొప్పరికింపన్నామగంటిమియును, వేడిమియుఁజూపెపరిమూర్తివిమతతతుల.

అగ్నిదేవుండుసంరంభవిజృంభితుండై దైత్యసైన్యంబుల నెల్లన్యంబునొందించుట.

వ. అని తలంచి లోహితవాహనంబును వాయుచక్రంబును ధూమధ్వజంబును సర్పి
ర్మయంబును నగురథం బెక్కి రక్తవర్ణంబును పిశంగకేశశ్మశ్రుతనూరుహంబును
నగుదేహంబు చనరారం దైజసంబు లగునాయుధంబులు ధరియించి నిజోత్సా
హంబునకు నమర్త్యులు సంతసిల్ల మునులు ప్రస్తుతింప నడరి దైత్యసైన్యంబుఁ
జొచ్చి యొక్కొక్క మొత్తంబున వేలు పదివేలు లక్ష యనుసంఖ్యలం గలదాన
వులఁ బ్రేల్పం దొడంగెఁ దదీయసఖుం డగుజగత్ప్రాణుండు ప్రతిభటప్రాణాహారి
యగురభసంబునఁ జెలికానికడిమికిం దోడ్పడియె నంత నెల్లదెసల నాభీలంబు
లగుకీలంబులు రథంబులం దొడరి చక్రకూబరకేతనయుగత్రివేణుకంబుల
నుద్ధూతధూమంబులై యొసంగి యస్త్రధనుఃకవచంబులు సమరి ఖడ్గక్షురికాదు
లతిదాహభంగురంబులుగా నొనర్చి కరులం బొదివి కర్ణరంధ్రంబులు సొచ్చి కర
వివరంబులు దూఱి దంతంబులు గమల్చి కక్ష్యాకుథప్రముఖంబులు సుఱసుఱ
పుచ్చి తురగంబులం దగిలి మోరలు సఱిచి బంధురస్కంధకేసరపుచ్ఛరోమవల్ల
రుల బెరసి వీఁపు లెరియించి మహాశరీరు లగువీరుల నరికట్టి మకుటకేశవస్త్రమా
ల్యంబులు పొడవడంచి చర్మమాంసాస్థిమేదోవసామజ్జ లొక్కటిగాఁ గలంచి
సమరభూమి యంతయు సంతప్తమేదోమజ్జాప్రవాహబహుళంబుఁ గావించె
నివ్విధంబునం గల్పాంతకల్పం బగుమహాదహనవిహారంబునకు సమస్తభూతం
బులు భీతిభ్రాంతంబు లయ్యె దనుజులు తల్లడిల్లి పెల్లెసఁగునార్తస్వనంబులతోడ
మయశంబరులమఱుంగు సొచ్చి రది యంతయుం గనుంగొని.

క. పర్జన్యవరుణమాయా, సర్జన మొనరించి వారు సమధికయత్నం
బూర్జితముగ నయ్యనలుని, భర్జనశక్తి యడఁగించి పరఁగిరి కడిమిన్.

తే. అసురవర్యులమాయల నగ్నిదేవు, కడఁక పొనుపడఁ దొడఁగుట గని రయమున
దేవమంత్రి యే తెంచి యాదేవపూజ్యు, సలఘుఫణితుల నిట్లని తెలుచెఁ బ్రీతి.

సీ. కష్ఠకంబు నీ రేత మనిలుఁడు నీయాత్మ యేడుజిహ్వలతోడ నెంచు నొప్పు
దీవు జలంబుల నీవు పుట్టించితి సలిలంబు గ్రింపు పార్శ్వములు మీఁదు
నై సర్వతోగాము లగుముఖంబులపేర్మిఁ బరఁగుదు భూతసంభావకరుఁడవు
భూతధారకుఁడవు భూతసంహర్తవు యజ్ఞంబు నీవహవ్యంబు నీవ
హవ్యవాహుండవును నీవ హవ్యభుజుఁడ, వీవ నీ విత్తు లక్ష్మియు నిద్ధజయము
న్నాశ్రితులకు నీయాశ్రితు లఖిలసురులు, జాతవేద వేదములు నీసంస్తవములు.

క. అసురులదెస నీతేజము, ప్రసారితముఁ జేసి మగుడఁబడు టొప్పనె యిం
కసమానశౌర్య క్రమ్మఱ, మసఁగుము రక్షింపు మమరమండలిఁ గరుణన్.

వ. అనినసురేజ్యవాక్యరస మాజ్యహుతంబుగఁ బేర్చి క్రమ్మఱం
గనలి కృశానుఁ డుద్ధతశిఖాతతి నెప్పటియట్ల దైత్యవా
హినులపయిం బ్రకామగతి నేపెసలారె వినష్టమాయులై
దనుజులు వీఁగి రెంతయుముదంబునఁ బొంగిరి దేవపుంగవుల్.

వ. అప్పుడు ప్రహ్లాదుండు బలీంద్రుపాలికిం జని సబహుమానంబుగా నతని కిట్లనియె.

సీ. నీతపం బెదమెచ్చి నిఖిలలోకేశ్వరుం డెంతయుఁ గరుణ నీకిచ్చె వరము
లింద్రత్వ మగ్నిత్వ మిందుత్వ మర్కత్వ మర్కతనూజత్వ మబ్ధిపత్వ
మర్థేశ్వరత్వ మి ట్లమరినప్రభుతలు నణిమాదిసిద్ధులు నాహవమున
నపరాజితత్వంబు నమృతత్వమును మహాయోగీశ్వరత్వంబు నుదితయశము
లై నయవిమెల్లఁగలుగ దైత్యాపజయముఁ,జూచుచుండంగఁదగునెద దాహవమున
నమరపతి నోర్చి తద్రాజ్య మపహరించి, సత్యముగఁ జేయుమజువాణిసత్యధుర్య.

చ. అని తెలుపంగ నాత్మమహిమాతిశయం బఖిలంబు తెల్లగాఁ
గని దనుజేంద్రుఁ డాజిజయకౌతుక మాకృతి కెల్ల భూషయై
పెనుపొనరింప నష్ట గిరిభేదిరథంబునకై రథంబు చ
య్యన నడపంగ సూతుఁ బ్రియమారఁగఁ బంచె నుదగ్రదర్పుఁడై

క. ఆతనియుద్యోగము గని, దైతేయబలుంబు మగుడఁ దద్దయుఁగడఁకల్
చేతోగతు లొందఁగ నభి, యాతిహననకాంక్షఁ గూడె నాటోపమునన్.

ఇంద్రబలీంద్రులకు ద్వంద్వయుద్ధంబు సుప్రసిద్ధంబుగా జరగుట.

వ. ఇట్లు సైన్యసమేతుండై నడచుబలీంద్రునకుఁ బ్రశస్తమృగపక్షికులంబు లను
కూలగమనవిచేష్టితరుతంబుల నభిమతంబు సిద్ధించుట దెలిపె నాంగికంబు లగు
మంగళసూచకంబు లెన్ని యన్నియుం గలిగె వివిధసత్కారసంతర్పితు లగుధరణీ
సురులు వీర్యవంతంబు లగుమంత్రంబులు జపియించుచు జయం బాశాసించి
రతండు సర్వదిశల దరికొని ప్రబ్బుహుతాశనువిజృంభణం బంతంతం జూచి
యెంతయుఁ గలంగినను మహత్త్వంబున సదోద్రిక్తంబులు నుద్యుక్తంబులు
నగునసురవర్గంబు లనర్గళభంగిం దొడరి యనిమిషులం దాఁకు నప్పుడు.

మ. తనబాణావళి సర్వదిక్కుల సముద్యద్రశ్మిజాలంబుల
ట్లనుబద్ధోద్ధతిఁ బర్వఁగాఁ బ్రళయకాలార్కుండుఁ బోలెన్ రయం
బున నేతెంచుబలీంద్రుఁ జూచి భయసమ్మూఢాత్ములై కన్కనిం
జని రొక్కండును నిల్వలేక దివిజుల్ శక్రాంతికక్షోణికిన్.

వ. చని యతనితో నీవు సర్వామరస్వామివి ధాతవు విధాతవునై భూతంబుల రక్షించుపనికిం బూనినాఁడవు మూఁడుగజంబుల నీకుసమానుం డగుమానధనుం డు లేఁడు సైన్యంబులు గలంగి పాఱెడు దోరలయందు నిపాతితద్విరదుండును నిహతహయుండును నిర్మథితరథుండును నికృత్తాయుధుండునుం గానివానిం, బోడ గాన మేము నీమఱువు సొచ్చితిమి సముత్సాహంబునకిది సమయంబు మగఁటిమి పాటింపుము కడంగుము.

క. శూరుఁ డగువాఁడు బాహా, ధౌరేయత నాత్మసంశ్రితప్రతతిఁ గడుం
బోరామిఁ గావకుండినఁ, బేరు గలదె దక్కునయ్యె ప్రియజయలక్ష్మల్

సీ. అనుటయు నట్లకాకని సహస్రాక్షుండు హయసహస్రోపేత మైనరథము
మాతలిసారథ్యమహిమాభినీతమై తనరార నశనికేతనము వెలుఁగ
దివ్యకిరీటదీధితులతోఁ గర్ణికాంగదహారకుండలకంకణాంగు
ళీయకద్యుతులు జెలిర్ప సంధ్యాతపం బఖిలదిఙ్ముఖముల నావహింప
సన్నిహితవజ్రుఁడును హస్తసంగృహీత, కార్ముకుండు నక్షయతూణకల్పనుండు
నగుచుఁ జారణకీర్తన లతిశయిల్ల, నేచి దైత్యనాయకునకు నెదురు నడిచె.

క. బలియును హరిఁ గన్నంతస, బలవన్నారాచపటలపరిరుద్ధదిశా
వలయుఁ డగుచుఁ దోతేరఁగఁ, గలహం బిరువురకు నయ్యెఁ గడుఁజోద్యముగాన్.

క. ఆ తెఱఁగుకయ్యములు ము, న్నేతఱిఁజూచియును వినియు నెఱుఁగ రతివచ
శ్చేతోవిషయము ధృతసం, ఘాతము త్రైలోక్యభీతికంపన మొందున్.

తే. చేరి ప్రహ్లాదముఖులు ప్రసిద్ధబుద్ధి, ధుర్యు లగ్గింప బలి బాహుదోహలంబు
సిద్ధమునికోటి గొనియాడ జిష్ణుబలము, వర్ధనము నొందెఁ దమలోన వట్రపడక.

మ. బలిబాణావలి నింద్రుఁ డింద్రువిలసద్బాణాలిఁ దోడ్తోన నా
బలి ద్రెవ్వన్ వడి నేయ నేయఁ దునుకల్ ప్రద్యోతమానాకృతిన్
శలభశ్రేణులఁ బోలె మూసె దెస లుత్సాహంబునం బొందె స
గ్గలికల్ మీఱినతూపు లొండొరులఁ జిక్కం దాఁకె మర్మస్థలుల్.

క. నెఱకులు దాఁకినయమ్ములఁ, జొఱచొఱ నెత్తురులు వడియ శోభిల్లిరి వా
రెఱసంజ మీఁదఁ బర్వఁగ, గుఱియై యొప్పారుక్రొత్త కుధరములక్రియన్.

క. ప్రకృతిశరంబుల నిరువురు, నొకవడిఁ బోరాడి యుడిగి యుద్ధతదివ్య
ప్రకటప్రబలత గర్వము, ప్రకటించిరి రౌద్రవృత్తభంగులు వెలయన్.

తే. తనకుఁ గలలావు లన్నియుఁ దరతరంబ, యహితుదెసఁ జేసి చూపి యనంతరంబ
హరిహయుండు ప్రయోగింతు నని తలంచె, నఖిలశైలపక్షఘాతి యైనహేతి.

వ. ఇవ్విధంబున నుత్సహించి ప్రయత్నపూర్వకంబుగా నమ్మహాయుధంబు కరంబున నమర్చునంతలోన నంతరిక్షంబున నశరీరి యైనవాణి యతని కిట్లనియె.

సీ. ఓ దేవవల్లభ యీదైత్యనాథుండు వారిజోద్భవదత్తవరుఁడు గాన
నీకు నజయ్యుండు నీకకా దమరులలోన నెవ్వానికి నైన గెలువ
నలవడ దీతని నధికధార్మికుఁ డట్లుగావున మానుము కడఁక యిప్పు
డితనికి నపజయహేతువై యున్న కర్తఁ డయ్యెడు నింకఁ గాలాంతరమున
బ్రహ్మ సర్వస్వభూతుండు భవ్యధర్మ, మూలకందంబు దేవతామూర్ధరత్న
మాదిమధ్యాంతనిర్ముక్తుఁడాదిదేవుఁ, డచ్యుతుఁడువిశ్వమయుఁడునారాయణుండు.

క. అతఁ డెఱుఁగు భవత్పాలన, గతులెల్లను మీరు రిత్త కాఁజేయఁబడ క
య్యతిశయకరుణానిధి మీ, మతిలో శరణంబు నొంది మనుఁ డతిభక్తిన్.

వ. అనిన విని దంభోళి దైవంబూనిన కేలు సడలించి విషణ్ణుండై దివిషత్ప్రభుండు
దొరలం జూచి గణదేవతలనెల్లఁ గ్రమ్మఱుం డనిపలికి రథంబు మరల్చి యోట
మి కోర్చి తిరిగె నసురలు సింహనాదంబులు మున్నుగా విచిత్రవాదిత్రధ్వానంబు
లెసంగ నానందంబున బలిం బ్రస్తుతించి రివ్విధంబున విజయభాసితుండై.

క. స్వారాజ్యపదము గైకొని, వైరోచనుఁ డత్యుదగ్రవైభవమునఁ బెం
పారి జగత్త్రయపాలన, పారీణత నొంది ధర్మపరుఁడై వెలసెన్.

తే. తాత ప్రహ్లాదుఁ డాదినునీతిపథము, తెలిపి నడపంగ మయశంబరులు ప్రధాను
లై సురలకార్యములు ప్రతిహతములుగ నొనర్ప నాతనికలిమియున్నతివహించె

క. ఎవ్వఁడు దుశ్చరితుఁడు లేఁ, డెవ్వఁడు దుర్గతుఁడు లేఁడు హీనాత్ముఁడు లేఁ
డెవ్వఁడు బలిరాజ్యంబున, నెవ్వలనఁ గృతార్థమతుల యిలఁ గలమనుజుల్.

క. వర్ణాశ్రమధర్మంబులు, పూర్ణములుగ నడపుచుం బ్రభూతజనపదో
దీర్ణసమృద్ధుల నెంతయు, వర్ణన గని రతనియాజ్ఞవలన నరేంద్రుల్.

తే. యాగరతులును నిర్మలయోగమతులు, పీతవిష్ణుత నాత్మీయవిధులు నడువఁ
ద్రిదివమోక్షసాధనయత్నదీప్తులైరి, తగ బలీంద్రునిరక్షణోద్యమముపేర్మి.

వ. ఇట్లు చతుష్పాదంబై ధర్మంబు చరియింప నకంపితకల్యాణగౌరవుండై తేజరిల్లు
వైరోచనుపాలికిం బద్మహస్తయై చనుదెంచి పద్మవాసిని యగుపరదేవత ప్రసాద
సాముఖ్యం బమరనిట్లనియె.

మ. తగవుల్ ధర్మముఁ దప్పకుండ భుజసత్త్వప్రౌఢి ప్రఖ్యాతిగాఁ
బగవారిన్ బవరంబులో నొడిచి సంపన్నుండవై పేర్చి యీ
జగము ల్మూటిని నీవు గైకొనుటకున్ సంతుష్టనై వచ్చితి
న్నిగమైకస్తుత నేను లక్ష్మి ననఘా నీపాల దీపించెదన్.

క. ఘనుఁ డగుహిరణ్యకశిపుని, యనుపమసంతతికి నిట్టిమైశ్వర్యంబుల్
దనరుట యరుదే నీవా, తనిఁ గడచితి గాదె బాహుదర్పనిరూఢిన్.

వ. అని యద్దేవి తదీయగేహంబున వసియించె నబ్బంగిన యేతెంచి హ్రీయును ధీయును విద్యయు దయయును ధృతియు శ్రుతియుఁ బ్రీతియు వినీతియుఁ బుష్టియుఁ దుష్టియు దాంతియు శాంతియు ననువేల్పుం గలదేవత లతనియందు నెలకొనిరి గరుడగంధర్వాప్సరోగణంబులు గీతనృత్యకళావిన్యాసంబులం దుపాసనం బొనర్చిరి మఱియుం బరమేష్ఠి పురందరుల నెవ్వరెవ్వరు గొలుతురు వారలెల్లను దైత్యపతి భజియింపం దొడంగి రంత.

ఇంద్రుండు స్వారాజ్యహీనుండై యదితికడకుం జని నిజపరాభవంబు విన్నవించుట.

సీ. త్రిదశేంద్రుఁ డాత్మీయపదపరిభ్రష్టుండై యదితిఁ గానఁగఁ బోయి యాహవమున
బలి మేలుచేయైన భంగియు వజ్రంబు గైకొన్న తన్ను నాకాశవాణి
వల దన్న తెఱఁగును వరుసతోఁ జెప్పిన నద్దేవి యట్లైన సనఘతముని
పితాతండ్రి నుద్యదమేయతపోదీప్తు నడిగి యప్పుణ్యాత్ము నాజ్ఞ నడుత
మని యతండును దానును సకలసురలుఁ, గూడఁ బడసి సురాసురజనకుని గృహార్హునిఁ
గాశ్యపబ్రహ్మఁ గని కార్యగతి సకలము, నాదినుండియు నెఱిఁగించి విన్నవిభునకు.

క. విని యాతఁడు వారలఁ దోఁ, డ్కొని యప్పుడ యరిగె విశ్వగురుఁ డగుచతురాననుపాలి కప్పు డందఱు, వినయంబునఁ బ్రణతిపూర్వవిహితాంజలులై.

వ. బహువిధస్తోత్రంబు లొనరింపఁ గాశ్యపసమేతం బట్లు చనుదెంచిన సురాలిం జూచి సురజ్యేష్ఠుండు కరుణావిలాసవికసితుండై.

క. మీరాక కే నెఱుంగుదుఁ, గారణము బలీంద్రు గెలువఁగా నోపుటకుం
నారాయణునకుఁ దక్కఁగ, నేరికిఁ జేకుఱదు నిక్క మిది యెబ్బంగిన్.

క. బలి నొకనిఁ జెప్పనేటికి, బలవంతులనెల్ల నోర్వఁ బాల్పడినాఁ డా,
జలరుహనాభుఁడు లోకం, బుల నతనికి నెదురఁ గాలుపురుషులు గలరే.

వ. అమ్మహాయోగీశ్వరుండు నిజయోగాంశంబున నియ్యదితియందుఁ గాశ్యపునకుఁ బుత్రుండై జనియించి దివిజకార్యంబు నిర్వహింపఁగలవాఁ డట్టియవతారంబునకుం దేవుఁ బ్రార్థింప వలయు నతండు దన్నుం దాన కనియె నేనిం గాని యెవ్వరికిం గనుట దుర్లభంబు తపశ్శీలురకుం గాన నగుంగావున దుగ్ధాంబుధియుత్తరంబున నమృతం బనుపేరిపరమస్థానంబు గల దది యతనివిహారభూమి యచ్చటికిం జని తదీయప్రసాదంబు వడసి లబ్ధమనోరథులరయి రం డనిన నట్ల కాక యని యద్దేవుని వీడ్కొని.

ఉ. వార లుదఙ్ముఖప్రవణవర్తనులై బహుశైలసింధుకాం
తారమహీస్థలుల్ గడచి తత్పరతం జని సర్వజంతుసం

చారవిహీనమై రవినిశాకరదీప్తులు లేక చీఁకటుల్
పేరినయొక్కచోటు గని పెద్దయు విస్మయ మంది యందఱున్.

వ. ఆవ్వలం గడచిపోవం దమకు శక్యంబు గాకున్న నంతట నుండి.

క. వైయేఁడుల వ్రతమున కై, ధీయోగము సిద్ధి నొంద దీక్షించి మనః
కాయవచోనియమము నిర, పాయంబుగఁ దొడఁగి రుదుతపస్సాధనముల్.

తే. అందుఁ గాశ్యపసంయమి యంగనయును, దాను బ్రహ్మచర్యవ్రతధారణమున
నిల్చివీరాసనస్థుఁడై జలధిశయను, జలజనయనుఁ జేతోంబుజస్థాయిఁ జేసి.

క. మును మునిముఖ్యులు భక్తిం, గొనియాడఁగ నిఖిలనిగమగోప్యంబై యొ
ప్పినవాఙ్మయమున నిట్లని, వినుతించె ననంతమహిమువిశ్వాత్ము హరిన్.

చూర్ణిక. జయజయ జగదుద్భవస్థితిసంహారహేతుగుణనిర్ధారణవ్యవహితానేకమూర్తివిలసనసనకాదియోగీంద్రహృదయసరోరుహసౌరభ్యసంవిధానావేశవంశవర్ధనవచనవినిస్సృతానంతవాఙ్మయ ప్రవాహపవిత్రీకృతాఖిలలోక లోకాయతికాదిదుస్తర్కతిమిరాంధదురధిగమదివ్యానుభావభావనాపరాయణ ప్రణయపారణప్రవణ కరుణాపరిణామవత్కటాక్షనిరీక్షణక్షణదాచరాపసర్పణసగర్వదుర్వారసంచరణచటులచక్రధర దండహస్తకమలకోమలభక్త్యుత్పత్తినిమిత్తనిర్నిమీలననాభిశతపత్త్రపత్త్రరథేశ్వరపత్త్రపతాకభావ సేవాద్వైతవిద్యాసిద్ధ్యుత్పత్తిసాధసాముఖ్యముఖ్యమునినికర నిరంతరోద్గీతనామసహస్రసహస్రాంశుపరిభావవరప్రభావవిభవ భవరుజాభైషజ్యచరణసరోరుహసమ్యక్సమారాధనధనపతినిధినివహశత కామధేనువ్రజకల్పతరుగహనలక్ష్మసదృక్షణమాత్రమూర్తిసంస్మరణసుకృత కృతప్రముఖయుగచతుష్టయప్రతిష్ఠాపితసర్వధర్మప్రతిష్ఠాపనవ్యవసాయసంప్రవృత్తవివిధవిచిత్రావతార తారకానాధనలినీనర్మసఖస్వరూపనయనయుగళాలోకభ్రమితకాల చక్రవాళబాలభానుసమాననాభికౌస్తుభగభస్తిప్రసరసాంధ్యఘనాయితదోరంతరరతమాలకాననకాననాటశ్లోకితశ్లాఘ్యయశోమాక్తికావతంసితశ్రుతిసీమంతభాగ భాగధేయపరంపరాభోగభక్తివిభ్రమభ్రమదమితసంసృతిప్రపంచపరిణతయంత్రస్వతంత్రసూత్రధార ధారణక్రమాభ్యాసప్రాప్యపరమస్థానస్థానాభిమానియవిధృతవిశ్వవ్యాపకానేకరూప రూపగుణకర్మవ్యతిరిక్తముక్తశుద్ధబుద్ధావతారతాభాస భాసమానమధ్యమమార్గమసృణమహానిమనోమార్గ మార్గణభుజంగపీతాసురాసుపవమాన. మానసీయమహిమానందనందదిందిరాసుందరీహృషీక హృషీకేశ కేశవ నమస్తేనమస్తే నమస్తేనమః.

శ్లో. నమస్తే వల్యకల్యాణకల్యాణనందవిధాయినే
నారాయణాయమహతాంవరదాయవరీయసే.

క. అనివినుతించినకాశ్యప, మునిదెసఁ బ్రీతుండయి విశ్వమూర్తి ముకుందుం
డనుపమఘీరధ్వని ని, ట్లనియె నభోవీథి నిలిచి యంతర్హితుఁడై.

నారాయణుఁడు దితిగర్భంబున వామనుండయి జనియించెనుకథ.

చ. అమలచరిత్ర నీవు నియతాత్ముఁడవై నతెఱంగు నీయను
త్తమమగువాక్ప్రపంచమును దైవతవర్గము భక్తితోడ సం
యమమతి నున్నచందము మదాత్మకుఁ బ్రీతి యొనర్చె వేఁడు మి
ష్ట మయినయర్థ మెవ్విధము సర్వజగత్ప్రియ మవ్విధంబునన్.

వ. అనినం గాశ్యపమునీంద్రుండు దేవా దేవర మావలనం బ్రసన్నుండవై తేని నింద్రానుజుండవై సకలబృందారకబృందంబులకు నానందప్రదం బగునవతారంబు నంగీకరింపవే యనినయె నదితియుం బ్రాంజలియై పరమేశ్వరాదేశంబున నాకాశంబుఁ జూచి నమస్కరించి.

క. నాకపతికిఁ జెంపొదవఁగ, నాకంపితులై సురాసు లడఁగఁగఁ గృపతో
నాకడుపుచల్ల నయ్యెడు, నాకారముతో జనింపవయ్య ముకుందా.

చ. అనునెడ దేవతావరులు నంబరలంబివిలోచనాంశులై
మనములు భక్తిపూరపరిమగ్నములై యలరంగ సేవ నీ
వనుజత నొంది దేవవిభునయ్యయు నేలికయున్ గురుండు నే
ల్పును శరణంబునై భయవిలోప మొనర్చి యనుగ్రహింపవే.

క. నీ వదితిసుతుఁడ వగుటయు, దేవత లందఱును దేవదేవ ధ్రువముగ్గా
దేవాహ్వయంబు దాల్తురు, నీవాత్సల్యంబు గోర్కి నెఱయఁగఁ బడదే.

వ. అని యివ్విధంబున నంబఱు నభ్యర్థించిననేకవాక్యనిరూపితం బగుమతంబు మనంబున నవధరించి మధుమథనుండు మధురస్వరంబున వారి కిట్లనియె.

క. భరితతపస్కులు గాశ్యప, వరమునియును నదితియును ధ్రువంబుగ నేని
య్యిరువురకోర్కియు నిండఁగ, హరిహయసోదరసుఖంబు నందెదఁ బ్రీతిన్.

మ. క్రతుభాగంబులు గోలుపోయి కృశులై కార్పణ్యముం బొంది యే
గతియుం గానక యిట్లు దూలెడుసురల్ కల్యాణబుద్ధుల్ ధృత
వ్రతు లెబ్భంగి నిరీక్షణీయులుగ భావస్ఫూర్తి నేఁ జూచెదన్
దితిజుల్ నాకెదురే జయింతు నఖలద్వేషివ్రజంబున్ వెసన్.

క. క్రవ్యాదులు దమయెఱచులు, క్రవ్యాదుల కిత్తు రాజిఁ గడుమోదమునన్
గ్రావ్యాదులతోఁ గూడఁగ, హవ్యాదులు గాంతు రర్థి న్నాత్మపదంబుల్.

వ. మీరు నిశ్చింతంబు లగునంతరంగంబులతోడ నరుగుం డని యానతిచ్చిన మహాప్రసాదం బని యందఱు నానందధ్వనులతో నభినందించి నమస్కరించి యయ్యలక్షితమూర్తిచేత నామంత్రితులై నవారై తమమున్ను సనుదెంచిన మార్గంబున మగిడి రట్లరిగి దివిజులు కాశ్యపమహామునియాశ్రమంబునంద యుండి.

తే. జలధరోదయ మర్థించుచాతకముల, భంగి విభునవతారంబు వార్చియుండ
నదితిదేవి యంతర్వత్ని యై వహించె, బ్రిమదమునఁ జాలుదివ్యవర్షములు వేయి.

చ. హరిపరమేశ్వరేశ్వరుఁ డనంతుఁ డనంతగుణాశ్రయుండు పు
ష్కరదళలోచనుండు గుణగణ్యుఁడు సర్వశరణ్యుఁ డిందిరా
వరుఁడు వరప్రదుం డఖిలవంద్యుఁడు గర్భమునంద యుండి య
చ్చెరువుగ నిర్దహించె నవిజేయసురాహితశక్తు లన్నియున్.

తే. తల్లికడుపున నెలకొని దనుజదమనుఁ, డొదవి తానును బొదలుచుఁ బొదలఁజేసె
నిగమవై భవంబులు తపోనిలయములును, దివిజతేజంబులును గ్రతూద్దేశవిధులు.

క. అమృతాశనులం గాంచిన, కమనీయోదరమునందుఁ గమలోదరు న
య్యమితబలు నమృతుఁ దాల్చుట, నమృతాస్వాదినియ పోలె నదితి యెలర్చెన్.

వ. ఇట్లు పరిపూర్ణగర్భిణి యైనకాశ్యపగృహిణికిఁ బ్రసవసమయంబున సమధికతేజం డగుతనూజుండు జనియించి పూర్వదిశాగర్భప్రసూతి యైనసవితృ ననుకరించె నమ్మహాత్మునుదయంబునఁ బ్రత్యాసన్నులై మరీచ్యాదిబ్రహ్మలును భరద్వాజాదిమునులును సనకాదియోగీంద్రులు ననేకశ్రుతిసూక్తంబులం బ్రస్తుతించిరి తుంబురునారదపురస్సరంబుగా నఖిలగంధర్వులు దివ్యగానంబులం గీర్తించిరి రంభాసమేతులై యచ్చర లెల్ల నుల్లాసనృత్తంబులం గొలిచిరి వసురుద్రాదిత్యాశ్వివిశ్వసాధ్యులు సిద్ధవిద్యాధరయక్షగుహ్యకశ్రేష్ఠులు విహంగభుజంగప్రవరులుం బ్రమోదంబునం బ్రణామకలితంబు లగునుదారార్చనంబు లొనర్చిరి లోకపితామహుండు హంసవిమానంబుతో నేతెంచి యయ్యదితినందను నభినందించి యిక్కుమారుండు విశ్వస్తుతులకు నర్హుం డయ్యెం గావున విష్ణుం డనం బరఁగు నని నామధేయంబు నిరూపించి యభిరూపం బగునుత్సవం బనుష్ఠించి యాసమస్తసురసంయమిసముదయంబులు ననుసరింప నాత్మీయసదనంబున కరిగె నంత.

మ. ప్రతిపచ్చంద్రునిమాడ్కి నాతఁడు సమగ్రస్ఫూర్తితో వర్ధమా
నత నొందంగ నవాంబువాహనిభమున్ సంపూర్ణచంద్రాస్యమున్
సితపంకేరుహపత్రనేత్రముఁ బ్రభాశ్రీవత్సవక్షంబునై
యతిరమ్యం బగుగుజ్జరూపమర నొప్పారెం బ్రభాప్రాంశుఁడై.

క. వామనుఁడు బ్రహ్మచర్య, శ్రీమహితుం డగుచు నుల్లసిల్లెఁ దగఁ దదీ
యామితసౌందర్యము సుర, భామలచూపులకు నిచ్చపండువు నిచ్చెన్.

సీ. ఆఱంగములు గలమైశ్వర్యమునకు నివాసమై యొప్పు నెవ్వానిమహిమ
యెవ్వానియున్నచో టెఱిఁగినధన్యులు మగుడరు జన్మసమ్మర్దములకు
నిందునందును మేలు నొందఁగోరెడువారు క్రతుమూర్తి నెవ్వానిఁ గని భజింతు
రాకాశమవ్యక్త మజర మనామయం బానంద మమృత మెవ్వానితత్త్వ
మమ్మహాత్ముఁ దపోమయు నాద్యు నచలు, నీశు విశ్వైకధుర్యు మహేంద్రుఁడమ్ముఁ
జూచి రుత్ఫుల్లలోచనాంశువులతోడ, నర్థి నిచ్చలుఁ జనుదెంచి యమరవరులు.

వ. ఒక్కనాఁ డవ్విష్ణుండు నిజదర్శనసమాగతు లైనయదితిసుతుల నందఱం గరు
ణాతరంగితంబు లగునాలోకనంబుల ననుగ్రహించి తదీయప్రయోజనంబు
నెఱుంగనివాఁడ పోలె నిట్లనియె.

క. అలఘుమతులార మీర, స్ఖలితచరితు లతులధైర్యశౌర్యాదిగుణో
జ్జ్వలులు విశేషించి మదీ, యులు మీ కొకయర్థసిద్ధి యొనరింతుఁ దగన్.

క. ఎయ్యది ధర్మసమృద్ధం, బెయ్యది దుష్కరము లోకహిత మగుచుండం
బెయ్యది చెపుఁడా చేసెద, నయ్యుత్తమకార్య మేది యైనఁ గడంకన్.

వ. అనినఁ బురుహూతునగ్రభాగంబున నిడికొని యజ్ఞభాగభుజు లందఱు నయ్యు
కుంఠప్రజ్ఞున కిట్లనిరి.

## ఇంద్రాదిదేవతలు వామనుని బలినిర్జించి స్వారాజ్యంబుగొనం బ్రార్థించుట

సీ. బలి యనుదైత్యుండు పద్మసంభవుఁ దపోభరమున మెప్పించి వరము వడసి
శక్తి నెవ్వరికి దుస్సాధ్యుఁడై మముఁ ద్రోచి యఖిలవైభవములు నపహరించెఁ
జంపంగఁ జెఱుప నశక్తుల మాతని నీవుపాయంబున లావు కలిమి
నధికుఁడ వవిజేయహరితేజుండ వేవిధమున నైన నవ్విమతు నొడిచి
భవదుపాశ్రయైకవ్రతపరుల మైన, మాకు నొలసినయాపద మాన్ప వలయు
నొక్కఁడవు నిత్యకీర్తి వభ్యుదితవిశ్వ, గురుఁడ వగునినుఁ గడవఁగ నేరుఁడుగలఁడే.

చ. అనిమిషనాయకుం ద్రిభువనాధిపుఁగా మును నీవ నిల్పి తీ
యన యిటు తత్పదచ్యుతి ననాకలితద్యుతియై నశింపఁగాఁ
గనుఁగొన నీక కాదె వగ కాశ్యపసంయమి తత్పురంధ్రి యా
యనిమిషు లీబుధుల్ ప్రియము నందరె యింద్రుఁ బ్రతిష్ఠ చేసినన్.

శా. లోకాతీతుఁడ వయ్యు లోకములకున్ లోనై విహారేచ్ఛమై
మాకుం జుట్టమ వంచుఁ బేరొకటి సన్మానించి యున్నాఁడ వి
ట్లీకార్యం బొనరించి యిందఱబుణం బెల్లం దగన్ నీఁగు మ
స్తోకస్తోత్రసహస్రపాత్ర మగుచున్ శోభిల్లు నీపేర్మియున్.

వ. వైరోచనుం డిప్పుడు వాజిమేధమఖంబున దీక్షితుండై యున్నవాఁడు దీనికిఁ దగిన వెరవునం గార్యచింతనం బొనర్పుమనిన నుపేంద్రుండు తద్వచనంబుల దెసం జిత్తంబు నిలిపి వారిం గనుంగొని.

క. అగుఁగాక యట్ల చేసెదఁ, దగునింత యసంగ నేల దైవతకార్య
ప్రగుణసమాచరణంబున, నెగడిన నాకేమి వింత నేఁ డిది యెల్లన్.

మ. నను నాదానవనాథుజన్మమునకున్ సంప్రీతిపూర్వంబుగాఁ
గొనిపో నుత్తమబుద్ధి తత్త్వనిధి యొక్కం డర్హుఁ డమ్మేరకున్
ఘనుఁ డీదేవగురుండు గావలయు నిక్కం బేను వే పోయి నా
పనికిం బోలినయట్లు చేసి విజయస్ఫారుండనై వచ్చెదన్.

వ. అనియె నివ్విధంబునం గార్యనిశ్చయవిభాసి యైన యద్దేవునకు దేవతలు విజయ ప్రస్థానంబు సంఘటించిరి వాచస్పతియు నవ్వచోనిధికి సాహచర్యధుర్యుం డయ్యె నట్లు గదలి.

సీ. చిఱుతకూఁకటి నున్నచిగురువెండ్రుకలతో మెఱసి మాఁగుడువడిమిల్లి వ్రేల
ముచ్చుట్టు ముడిచినముంజితోఁ గట్టినచెలువంపుగోచిముంజెఱఁగు దూఁగఁ
గుశపవిత్రములతోఁ గూడ డాపలికేలఁ దనయంతపొడవైనదండ మమర
నిద్దంపుతెల్లజన్నిదము దీప్తులతోడఁ దోడరి కృష్ణాజినద్యుతు లెలర్ప
దబ్బవ్రేలియుంగరము మేదాపబొట్టు, మడుఁగుపేలిక పిరిచుట్టు బెడఁగుగాఁగ
వడుగుచందంబు దన కెడమడుగు గాఁగఁ, గొమరుగా నేగె నెలకట్టిగుజ్జువేల్పు.

వ. ఇవ్విధంబున నరిగి సర్వకాలకుసుమఫలభరితపాదపవనాకీర్ణంబును ననేకముని జనాధ్యాసితసిద్ధతీర్థసముదయంబును బురాతనదివిజయజనపరంపరాపరిణతలక్షణోపలక్షితంబును సముచితకాంచనమణిరచితశాలాకుడ్యకుట్టిమస్తంభకుండమండితంబును మహావిభవప్రాదారంబు నగుగంగాతీరంబునఁ బ్రవర్ధమానం బగు నధ్వరసంవిధానం బాలోకించి యజమానసదనంబు సేరంజని.

క. అంత బలీంద్రుని విజితపు, రందరు ధర్మార్థకరణరతు వైరోచను న
స్పందితదానవ్రతు నర, విందనయనుఁ డెదురఁ గాంచి వెర వొప్పారన్.

వామనుఁడు బలికడకుం బోయి మూఁడడుగులు భూమి యాచించుట.

వ. అల్లనల్లనం జేర నరిగి యాశీర్వాదం బిచ్చి మధురోదాత్తస్వరంబున నతని నుపలక్షించి యిట్లనియె.

మ. దితివంశంబు వెలుంగఁ బుట్టి కడిమిన్ దేవేంద్రు నిర్జించి యూ
ర్జితనీతిం గలితార్థసంచయుఁడవై శిష్టప్రమోదాత్తశీ
లత నిమ్మై బహుయజ్ఞదానతపముల్ గావించె దెవ్వారు నీ
ప్రతి లేరీభువనత్రయంబున జగత్ప్రఖ్యాత వైరోచనీ.

ఉ. చేయఁడె బ్రహ్మ యజ్ఞములు సేయఁడె రుద్రుఁడు సేయఁడే తగం
దోయజనాభుఁ డర్థపతి తోయపుఁ డింద్రుఁ డినుండుఁ జేయరే
శ్రీ యిటు నీమఖంబునకుఁ జెందినచాడ్పునఁ జెంద జెందుఁ దే
జోయుత పుణ్యలోకములు చూఱఁగొనం గల నీ ఘనకంబునన్.

తే. తురగమఖ మగ్నిమయంబు తత్తురగమేధ, యజనమున బ్రహ్మహత్యాదు లైనకడిఁది
పాతకంబులు చెచ్చెర భస్మసాత్కృతంబు లగునని వేదవాక్యంబు గలదు.

చ. అనఘ మనుష్యులందు వసుధామరుఁ డుం జతురాశ్రమంబులం
దును గృహమేధిధర్మమును సర్వము దైవత దైత్యకోటియం
దును సమసత్త్వవైభవసమగ్రుఁడ వీవును బోలె నశ్వమే
ధనియమ మెల్ల యజ్ఞసముదాయములందును మేటి యారయన్,

వ. ఇట్టిమహాధ్వరంబునం దుదితోత్సాహుండవై సర్వాపేక్షాపూరణవ్రతంబున నున్న నిన్ను నర్థించువారలు సకలార్థసమృద్ధు లగుట యేమి చోద్యం బనినవిని సంతసిల్లి బలిం బ్రచండ వామనదేవు నాలోకించి యల్లన నవ్వుచు.

క. కలుములమాటల మమ్ముం, గొలుచనడుగ నేల యింత గోసెక్కంగన్
నెఱయఁగ నీయిష్టము మా, కెఱిఁగింపుము సేక నిత్తు మెయ్యది యైనన్.

వ. అనిన నతం డేను గుర్వర్థం బర్థినై వచ్చితిఁ బదత్రయమాత్రం బగుధాత్రి యిచ్చినం జాలుఁ గృతకృత్యుండ నగుదు ననవుడు నవ్విరోచనకోవిదుం డవ్వేద విదునితోడ.

తే. చదువరులుగానివిప్రులు చాలముగ్ధు, లకట యిది యేమి బుద్ధిమాలెడు గుఱుగు
టేను శతలక్షపదమాత్రి యైనధన్య, ధరణి యిచ్చెదఁ గొను మొండుతలఁపు దక్క.

చ. అనునెడ శుక్రుఁ డాదితికులాగ్రణిఁ జేరఁగ వచ్చి రయ్య ని
ట్లను నిది యేల వేగపడ నచ్యుతకృత్యరతుండు దైత్యసూ
దనుఁ డిటు వంచనన్ సురహితం బొనరింపఁగ వచ్చినాఁడు నీ
మనమున నీగ్రహింపఁ గడఁక మానుము చూడకు మింక నీతనిన్.

క. ఏమి యొనరింపఁ బోయిన, నేమి యగునొ మనకు నేల యీతఁడసులు నా
నామూర్తిధరుఁడు హరిమా, యామయుఁ డనవిసమె యంచితామ్నాయములన్.

వ. అని చెప్పిన నక్కొంత చింతించి యసురవర్యుం డాచార్యుం గనుంగొని.

సీ. యిచ్చెద ననఁ గాని యీలే ననంగ నేరనినాడు దైన్యాక్షరములు పలుకు
టఖిలంబునకు నుమ్మీఁదయి యొప్పుహస్త మీఁగికిఁ జాఁపఁగాఁ దాఁ గ్రిందువడుట
నిత్యస్వతంత్రాదినిరతిఁ జెన్నగు మోము వేఁడుకష్టత వెలవెల్లనగుట
సర్వలోకములకు సంశ్రయ మగుమేను యాచకభంగి భయమున వడఁకు

టమ్ముతం బిట్టేఁడయి వచ్చి యబ్జనాభుఁ, డర్థి యగునట్టి దాత నేనగుట యరుదె
కలఁడె హరికంటెఁ బాత్రి మీఁగంటిమంటి, నిత్తునివ్వామమునికోర్కి యెల్లభంగి.

క. తనుతమవిద్యాతపముల, యమితఫలము లెవ్వనికి సమర్పించి మహా
త్మ్యముపడసిరామ్యులవ్విభుఁ, బ్రముదితుఁ జేయుటయకాదె భాగ్యము మనకున్.

క. మీ రడ్డము సెప్పక యీ, గౌరవము మదీప్సితంబుగా సిద్ధింపం
గోరుఁడని పలికి వామనుఁ, జేరంగాఁ బిలిచి చేయి చేకొని వినతిన్.

క. అయ్యా నీయడిగినయది, యెయ్యది యైన నగుఁగాక యిచ్చెద నిటుర
మ్మయ్యెడఁ గూర్చుండుము మనుచు, నయ్యుత్తమగుణు నుదఙ్ముఖాసనునింగన్.

వ. కావించి యతనియభ్యర్థితం బయినయర్థంబు సువ్యక్తంబుగా నుగ్గడించి.

శా. స్ఫీతానేకవినూత్నరత్నరచనం జెన్నొందుకుంభంబునం
బూతంబైనజలంబు పుచ్చుకొని యీభూదానసంపత్తిచేఁ
బ్రీతుండై హరి గాచు మమ్మనుచుఁ బెంపారంగఁ దద్ధారయా
దైతేయోత్తముఁ డమ్మహాపురుషుచేతం బోసె నుల్లాసియై.

క. వైరోచనకరవితరణ, ధారాసలిలంబు నిశ్చితంబుగఁ దనచే
యారం దొరఁగం దడవయ, వారణమెయి వామనుం డవామనుఁ డయ్యెన్.

వ. ఇట్లు విజృంభించి యద్దేవుండు సర్వదేవతామయం బైనయాత్మీయదివ్యరూపం
బుద్దీపితంబు సేసె నమ్మహామూర్తికి భూలోకంబు చరణంబులు నూర్ధ్వలోకం
బులుశిరంబును నయ్యెం జంద్రాదిత్యులు లోచనంబులఁ బిశాచంబులుపాదాం
గుళుల గుహ్యకులుహస్తాంగుళుల విశ్వేలుజానువుల సాధ్యులుజంఘల యక్షు
లునఖంబుల నచ్చరలురేఖల సూర్యాంశువులుకేశంబులఁ దారలురోమమూలం
బుల మహర్షులురోమాగ్రంబుల దిక్కులుబాహువుల నశ్వినులుశ్రవణంబులఁ
బవనుండుఘ్రాణంబున ధర్ముండుమనంబున సరస్వతిజిహ్వ స్వర్గద్వారంబునా
భిని మిత్రత్వష్టలుబొమలను బ్రజాపతిపుంస్త్వంబున వసువులువీఁపున రుద్రుం
డుహృదయంబున బ్రహ్మయూరువుల వేదంబులుదంతంబుల సముద్రంబులుధై
ర్యంబున లక్ష్మీమేధాధృతివిద్యలుకటిప్రదేశంబునఁ బరమపదంబులలాటంబున
నింద్రుండు స్రోతస్సులఁ దపోదమవ్రతంబులుఁదేజంబునఁ గ్రతుపూర్తంబు
లోష్ఠకక్షవక్షంబుల వసియింప నమ్మహాతేజుం డొప్పెఁ దత్తేజంబు సహస్రసూ

పాఠాంతరము మ. కమనీయోజ్జ్వలహేమరత్నరచనాకల్యాణమై యొప్పుకుం
భమునం బుణ్యజలంబుఁ బుచ్చుకొని యీభవ్యక్షితిత్యాగయో
గమునం బ్రీతుఁడుగాత విష్ణుఁడు ద్రిలోకస్వామి యంచుం బ్రహ
ర్షము నిండారఁగ నించె ధార నతఁ డాసర్వాత్ముహస్తంబునన్.

కోట్యుదయచంద్రదశశతంబని నిశ్చయింప రాదు గావున నప్రమేయం బట్టి యతర్కిత ప్రాదుర్భావంబున.

మ. బలి యైశ్వర్యము నొంది సంభ్రమభయప్రహ్వత్వసమ్మేళనా
కులభావంబునఁ జూచుచుండె నసురుల్ క్రోధోద్ధతిన్ వేలసం
ఖ్యలుదీప్తిస్ఫురదస్త్రశస్త్రవిటపిగ్రావోల్లసత్పాణులై
పెలుచం జుట్టును ముట్టి రవ్విభు మహాభీమాభిరామాకృతిన్.

చ. పదములు జాను లూరువులు బాహువు లంటఁగఁబట్టి యొంచనుం
గదలకయుండ నెత్తుఁ డనిక్రమ్మినయాబలవద్విరోధులం
బదములు జంఘ లూరువులు బాహువు లోలి నమర్చి త్రొక్కియున్
విదలిచియు న్నొగిల్చియును వ్రేసియుఁ ద్రుంచె నతండు వ్రేల్మిడిన్.

క. తుహినంబు నాత్మకిరణ, ప్రహతముఁ గావించి మించుభానునిక్రియ న
ట్లహితవిమర్దనలీలా, మహితుండై యుర్విధరుఁ డమంధరసరణిన్.

వ. విక్రమత్రయంబున లోకత్రయంబును నాక్రమించి త్రివిక్రమాభిధానంబున నిగ మంబులు ఘోషింపం బరితోషభరితహృదయుండై యవ్విశ్వరూపప్రపంచం బుపసంహరించి సర్వసాధారణరూపంబున నిలిచి దనుజేశ్వరున కిట్లనియె.

తే. నీవు నాకు మూఁడడుగులనేల యిచ్చి, తమలచారిత్ర సభ్యుచయం బెఱుంగ
నేను నాయడుగులపాటి నీజగత్త్రి, యమ్ముఁ గొలిచి కైకొంటి నాసొమ్ము గాఁగ.

క. నీ కింక నేల రాదే, లోకము కేట కేనిఁ బొమ్ము లుంఠితరాజ్య
శ్రీకుఁడ వై తనుటయు నతఁ, డాకంపితవినతదేహుఁడై కడుభక్తిన్.

తే. ఏననఁగ నెవ్వఁడను దేవ యీయొడలు న, మర్పితము దీన నీకు నెయ్యది యొనర్తు
నానతిమ్ము కృపార్ద్రుండవై శరణ్య, భక్తవత్సల శ్రీనాథ పద్మనాభ.

వ. అనినం బ్రసన్నుండై పరమేశ్వరుం డసురేశ్వరున కిట్లనియె.

వామనుఁడు బలినిసబాంధవంబుగాఁ బాతాళంబునకుఁ బోవంబనుచుట.

క. నీవలన సంతసిల్లితిఁ, గోవిందను తేష్టధనము గుణవత్పాత్రం
బై వచ్చిన నాకిచ్చితి, గావున నిర్భయుఁడ వగు జగంబులయందున్.

వ. పాతాళంబునందు సుతలంబనఁ బ్రసిద్ధం బైననెలవు గల దచ్చోటికిం జని సభృ త్యబాంధవుండవై వసియింపుము దివ్యంబులు నక్షయంబులు నపరిమితంబులు నగుభోగంబులు భవదిచ్ఛానురూపంబులై యందొదవెడు నధికదక్షిణంబు లగు నధ్వరంబులు నుదాత్తదానంబులు నాచరింప నర్హంబు లగువస్తువులునుం బరి చ్ఛదంబులు నఖిలకాలంబును సంపన్నంబులుగాఁ గలయవి వినుము మహేం ద్రుండు మహానుభావుండు గావున నాకు నర్చనీయుం డతనికి నీవు వినమ్రుండవై విబుధులయందునుం బూజ్యభావంబు గావించి నర్తింప వలయు నట్టిమదీయ

శాసనం బెప్పుడు దప్పిన నుగ్రఘనాధరంబులు ప్రాణాంతకదండంబున దండించు నవహితుండవై బ్రతుకుము మీఁద నెంతయు మేలొనర్చెద ననిన నవ్విభునకు విరోచనతనయుం డిట్లనియె.

క. క్రతుభాగభోగమున సుర, లతిముదముం బొందు క్రాల యచ్యుత యేఁ బ్రా
కృతభోగంబుల సంప్రీ, తత నెమ్మెయి నుండువాఁడఁ దలఁపుము దీనిన్.

సీ. నావుడు నంభోజనాభుఁ డశ్రోత్రియశ్రాద్ధంబు నవ్రతచర్యమైన
యధ్యయనంబును నపగతదక్షిణక్రతువు నమాంత్రికహుతము శ్రద్ధ
చాలనిదానంబు సంస్కారవిరహితం బగుహవిస్సును నన నాలుతెఱఁగు
లిచ్చితి నీభుక్తి కెవ్వఁ డీశ్వరున కప్రియకారి నన్నుగ్రహించు నెవ్వఁ
డగ్నిహోత్రియై క్రయవిక్రయముల బ్రతుకు, నెవ్వఁ డట్టివారలపుణ్యమెల్ల నీవు
గొనుము పొమ్మని వికల్ప దనుజపతియు, హర్షపూర్ణుఁడై హరికిసాష్టాంగమెరఁగి.

వ. సర్వదైత్యసమూహసమేతుండై పాతాళంబునకుం జని జనార్దననిర్దిష్టప్రకారంబున నుండె నంత.

క. తనబుద్ధివిక్రమంబుల, ననుపమ మగురాజ్యలక్ష్మి యవలీల మెయిన్
గొని విష్ణుఁడు త్రైలోక్యం, బును సురలకుఁ బూర్వమార్గమున విభజించెన్.

వ. అమ్మహాత్ముం డిట్లు పరిపాలించి యొసంగ నింద్రుండు పూర్వరాజ్యంబు గైకొనియె ధర్ముండు దక్షిణదిశాధిపత్యం బధిష్ఠించె వరుణుండు ప్రత్యగ్దిశానుశాసియై నిలిచెఁ గుబేరుం డుత్తరహరిత్పాలనం బంగీకరించె భుజంగవిభుండు భువనభరణంబున నుల్లసిల్లె సోముం డూర్ధ్వలోకాధీశ్వరుండై యొప్పెఁ దక్కినవారును దమతమ పదంబులఁ బ్రమదంబుం బొంది రిట్లు సర్వలోకశోకాపనోదనుండై నయద్దేవుండు.

మ. అదితిం గాశ్యపు నిత్యసత్కృతికృతార్థారంభులం జేయుచుం
ద్రిదశాచార్యుఁడు లోనుగాఁగలమునిశ్రేణిం బ్రియాహ్లాదనా
భ్యుదయప్రౌఢి ననుగ్రహించుచు సురల్ పూజింపఁ బ్రత్యాదర
ప్రదలీలం బ్రసరింపుచున్ భువనముల్ పాలింపుచుండెం గృపన్.

వ. అనిచెప్పి వైశంపాయనుండు.

క. ఈవామనావతారక, థావిస్తర మనఘ దేవతలకును ధరణీ
దేవతలకు సంభావ్యము, గావున వినఁ జనుపఁ గల్గుఁ గల్యాణంబుల్.

క. విను సర్వకాలముల ని, య్యనుపమకథనంబు వినిన నతినియతిఁ బఠిం
చిన నసురుల విష్ణుఁడు దా, గెలిచినక్రియ జనవిభుండు గెలుచును రిపులన్.

క. వామనదేవుఁడు భువన, ప్రేమాస్పదమైనభంగిఁ బ్రియుఁ డగుమనుజ
స్తోమములకు నవ్విభునిమ, హామహిమలు వినుమనుష్యుఁ డనవరతంబున్.

క. ధనములఁ గోరిన ధనములఁ, దనయులఁ గోరినఁ దనయులఁ దరలాక్షులఁ గో
రినఁ దరలాక్షులఁ బడయుదు, జనుఁ డీబలిమథనకథను జదివిన వినినన్.

క. ఆయువు నారోగ్యంబును, శ్రీయును బహుపుత్త్రపౌత్త్రచిరసౌఖ్యములుం
జేయుఁ ద్రివిక్రమచరితము, పాయక యాకర్ణితంబుఁ బఠితము నగుచున్.

క. అదితికిఁ గశ్యపునకుఁ దా, నుదయించినయాచరిత్ర ముల్లంబున నిం
పొదవంగఁ దలఁచుపుణ్యుని, సదయుండై ప్రోచు హరి నిజం బిది యెందున్.

తే. అస్మదీయగురుం డగునాదిమునిప, రాశరాత్మజుఁ డాగమరాశివలనఁ
బుచ్చుకొని మాకు నిచ్చె నిప్పుణ్యకథన, వస్తు వైహికాముష్మికావాప్తికొఱకు.

వ. నీవును నేతదీయస్వరూపనిరూపణతత్పరత్వంబునం గృతార్థుండ వగు మనినం బ్రీతమానసుండై జనమేజయుండు.

సీ. బంధురాష్టాదశపర్వనిర్వహణసంభావితం బగుమహాభారతంబు
హరివంశపరిపూర్ణ మగునట్లుగాఁ గ్రమవ్యాఖ్యాన మొనరించి తనఘ నీవు
విని పవిత్రుఁడ నైతి వినఁగ నింకొక్కటి గల దేమి నియతి నిక్కతవినంగ
వలయు వాచకుఁ డెట్టివాఁడు గాఁదగు నెన్నిమాఱులు విను టొప్పుమాటిమాటి
కగుఫలప్రాప్తు లెట్లు సమాప్తివేళఁ, బూజ్య లేవేల్పు లేదానములు విధేయ
సమితి ప్రత్యేకపర్వావసానకృత్య, మెవ్విధం బింతయును జెప్పు మింపు మిగుల.

వ. అని యడిగిన వైశంపాయనుం డతని కిట్లనియె.

క. విను నమ్మికయును భక్తియు, నెనయఁగ శుచియై శమంబు ఋజుతయు సత్యం
బును గల్గి విమత్సరమతి, వినవలయును భారతంబు విధియుక్తముగన్.

మ. అనసూయున్ జితకామరోషుఁ గమనీయాకారు సత్యోక్తశీ
లు నశేషాగమశాస్త్రతత్త్వనిపుణున్ లోకజ్ఞు వాగ్మిన్ ఋజున్
జనతాసమ్మతు భవ్యభక్తినియమశ్రద్ధాసమేతుం బ్రియం
బునసత్కారము లొప్ప వాచకునిఁగాఁ బూజించి యుంచం జనున్.

తే. అతఁడు విమలవస్త్రపవిత్రాంగరాగ, మాల్యభూషణశోభియై మహితలిఖిత
హృద్యయగుపుస్తకముగొని యెలమియొలయఁ, బ్రాఙ్ముఖోదఙ్ముఖత్వతత్పరతనుండి.

క. నారాయణు నరుని నమ, స్కారంబునఁ దలఁచి వాణి గల్యాణి నెదం
జేరిచి వేదవ్యాసుల, నారాధించి మఱి వలయుఁ బ్రారంభింపన్.

చ. మునుకొనిపోవ కెంతయును ముట్టక నిల్పక భావమున్ రసం
బును వెలియం దగుల్పడక పొందుగ వాక్యవిభాగ మొప్పఁగా
నెనిమిదితానకంబులను నేర్పడి వర్ణము లుల్లసిల్లనే
ర్పెనయఁగ వాచకుండు కడు నిం పగురీతిఁ బఠింపఁగాఁదగున్.

క. పదిరువ్వంబులు భక్తిం, బదిలుండై వినఁగ వలయు భారతము జగ
ద్విదితగుణ వానికన్నిటి, కొదవుఫలము లేర్పఱింతు నొలిన నీకున్.

సీ. లొలుతరువ్వము వినఁ గలుగునగ్నిష్టోమయాగంబుఫలము గామార్థసిద్ధు
లీలోకమునఁ గాంచి యాలోకమున నప్సరోగణసంకీర్ణ రుచిరదివ్య
యానంబు వడసి సమగ్రభోగంబులఁ బెద్దగాలంబు సంప్రీతి నొందు
వినుము రెండవరువ్వ విని యతిరాత్రయజ్ఞముపుణ్య మొంది భోగములనెలమిఁ
దుది నుదగ్రవిమానంబు త్రిదశవరులు, దేరనెక్కి వేచని మహాహారరతుల
విబుధయువతులు సొక్కింప వేనవేలు, వర్షములు నరుఁడుండు దివంబునందు.

వ. తృతీయవారశ్రవణంబున ద్వాదశాహం బనుమఖంబుఫలంబు సిద్ధింపం బ్రసిద్ధ
విభవుండై బ్రతికి మీఁదట మణిమయం బగువిమానంబున కొడయుండై పది
వేలేండ్లు వేల్పువెలందులతోడఁ గ్రీడించు.

ఉ. నాలవరువ్వమున్ విని జనస్తుత పొందు జనుండు వాజపే
యాలఘుభద్రమున్ జనన మంతయుసౌఖ్యమయంబుగాఁ జిర
శ్రీలభజించి కాంచుఁ దుది సిద్ధవధూరతిలక్షవర్షముల్
బాలపతంగతుంగరుచిభవ్యవిమానమనోజ్ఞసుస్థితిన్.

క. దీనికి నినుమడి మేలగు, నేనవమాటు వినఁగా నరేశ్వర యటుదో
ష్టో నెక్కొకగుణ మెక్కుఁ గ్ర, మానుగతిన్ షష్ఠసప్తమాకర్ణనలన్.

వ. కైలాసశిఖరాకారం బై నవజ్రమయవేదివిలసితం బగువిమానంబు నధిగమించి
విబుధాంగనాసంగీతమృదంగధ్వనులు వలభివివరంబులు ప్రతిఫలనద్విగుణంబు
లయి యింపు లొసంగ నిలింపులు పొగడ రెండవమార్తాండుపగిది వెలుంగుచు
నఖిలభువనంబుల నప్రతిహతగతియై చరించుటలె పర్యాయరూపంబుల వీనికి
సదృశంబు లగుఫలంబులు.

క. ఎనిమిదవపాగి వినిన, మనుజునకును రాజసూయమఖసిద్ధియు చే
రు ననంత మైహికసుఖం, బనఘా యటమీఁద నమరు లభినందింపన్.

తే. పూర్ణచంద్రోదయస్ఫూర్తిఁ బోలుచుకాంతి
యుతవిమానంబు గైకొను నుజ్జ్వలాంగుఁ
డై సుగంధివస్త్రాభరణాంగరాగ
రమ్యవేషంబుతో వత్సరములు కోటి.

ఉ. వేడుక వేల్పుఁదొయ్యలులు వ్రేఁగుచనుంగవమీఁద మన్మథ
క్రీడల వ్రాలి నిద్రలసుఖించి ప్రభాతములందు సాదరో
త్తాడనలోలతచ్చరణతామరసాంచితనూపురంబు లా
మ్రేడితనిస్వనంబులయి మేల్పునఁ దెల్పఁగ నొందు భోగముల్.

క. తొమ్మిదవసారి విన య, జ్ఞమ్ములకుం బతియనఁ జనుహయమేధఫలం
బమ్మెయిఁ గాంచు నభీష్టఫ, లమ్ములఁ దాఁబడసి నరుఁడు లక్ష్మీయుతుఁడై.

క. అమరీముఖాబ్జచికుర, భ్రమరీరుచిదుగ్ధముగ్ధభావుఁ డగుచుఁ దా
నమరావలి గొలువఁ దిరుగు, నమరావతి లోనుగాఁ బురావలినెల్లన్.

క. పదియగువరుస వినినయ, భ్యుదయఫలమునకుఁ గొలఁది యూహించి నిజం
బిదియన నేరఁడు బ్రహ్మయు, సదభిమతా యతఁడు ధన్యజన్ముఁడు పేర్మిన్.

క. ఇచ్చటఁ గలమేలెల్లను, నిచ్చ వలసినట్లు పొంది యెంతయు సుఖియై
యచ్చటికిఁ బోయి దివిజులు నెచ్చెలులై యనుసరింప నిత్యప్రీతిన్.

సీ. కామగమంబును గామితవస్తుసంభరితంబు తేజోవిభాసితంబు
నగువిమానంబున హారకేయూరచూడారత్నకటకకుండలనిబద్ధ
రత్ననూత్నద్యుతిరంభితమూర్తియై యుదయార్కుఁడును బోలె నుల్లసిల్లి
యనిమిషకాంతాకరాధూతచామరపవమానవర్తితభ్రమరకుండు
నిర్మలాతపత్రదుకూలనర్మలోల, చంచలోష్ణీషవిస్ఫురితాంచలుండు
నగుచు బహుకోటివర్షంబు లఖిలనాక, లోకముల సంచరించు నిశ్శోకుఁ డగుచు.

చ. క్రమమున నింద్రలోక మటఁ గంజవనప్రియలోక మావలం
గమలజలోక మప్రమితకామితరుద్రసదాశివాఖ్యలో
కము లసమగ్రపూజితసుఖంబులతోఁ జరియించి వెండి ని
త్యము నమృతంబు నౌపరమధామము నొందు నతండు ధన్యుఁడై.

సీ. వినుమబ్జసంభవవిష్ణురుద్రులు మొదలైనదేవతులు విద్యాధరాద్రి
దేవయోనులు మునిద్విజరాజవంశముఖ్యులు గిరిసాగరక్షోణినభము
లర్కేందుతారాగ్రహంబు లింకిట నెన్న నేల చరాచరజాలమెల్ల
భారతంబున ఋషిప్రభులచే వర్ణితం బైనది గావున నఖిలమునను
నాత్మగుణకీర్తనంబున నఖిలపాత, కములు సత్యంబు తొలఁగించుఁ గర్తకధిప
భారతాధ్యయనముపోలెఁ బాపుసులకు, బరమనిష్కృతి గలదె యెప్పాటనొందు.

క. పరువడి పర్వసమాప్తుల, నరవరపుణ్యాహవాచనపురస్సరభూ
సురభోజనపూజనవిధు, లిరవుగ నొనరింప వలయు నెంతయుఁ బ్రీతిన్.

---

* పాఠాంతరము. శా. దేహాంతంబున దివ్యయానగతుఁడై దివ్యార్కచంద్రద్యుతి
వ్యూహోద్భాసియు సర్వకామగము వజ్రోద్యద్గవాక్షాగ్రని
ర్వ్యూహంబున్ మణిబద్ధకుట్టిమము నై యొప్పారుయానంబునన్
మాహాత్మ్యం బెసఁగన్ జరించు సుఖియై మ్మానాతిగాభ్దావలుల్.

సేసి కాంచనరత్నదక్షిణల నిచ్చి, నరుని నారాయణుని సర్వసురుల నధిక
భక్తిఁ గీర్తింపవాచకప్రవరుఁబిలిచి, కొంతయొకచాయసదివించుకొనఁగవలయు.
వ. ఇట్లు పూజావిధి సమగ్రంబు గావించి.
చ. దివమువనుండి దేవతలు దివ్యము లైననిజాంశజన్మముల్
భువి గలిగించి భూరి యగుభూభరముం దొలఁగింప భారతా
హవకరు లైరిగావునఁ దదర్చనరూపము గాఁగ భారత
శ్రవణవిధాయి చేయునది సత్క్రియతో బహుదానధర్మముల్.
చ. నిజవిభవానురూపముగ నిర్మలరత్నసువర్ణరౌప్యస
ద్గజరథవాజిగోతతులు కన్యలు దాసులు భూగృహాంబర
వ్రజములు నిండియుర్ దనకు వాంఛిత మెయ్యది యెద్ది యుత్తమం
బజితభుజాఢ్య యన్నియును నంచితయోగ్యుల కిచ్చు టొప్పగుర్.
క. తదనంతరంబ యందఱ, నొదవఁగ హృద్యాన్నపానయుక్తిఁ బ్రమోదో
న్మద మమరఁ జేసి వాచకుఁ, బదిలంబుగ భవ్యపూజఁ బాటింపఁ దగుర్.
తే. పసిఁడిచీరలు గోవులుఁ బసులు గొల్చు, నూళు లిండ్లును బండ్లును నోలి నొసఁగ
వలయునివియెల్ల నొసఁగియవ్వలనమోడి, సేయ కెంతయుఁ సంతుష్టిసేయవలయు.
క. వాచకుఁడు సంతసిల్లిన, నాచతురాననునిఁ దొట్టి యమరవరులు భ
వ్యాచారతుష్టి నొందుదు,రాచంద మొనర్ప నిచ్చు నభ్యుదయంబుర్.
తే. అనఘ వాచకుఁ డెట్లట్ల యర్హుఁ డఖల, మునకు నాలేఖకుండుఁ దద్భూతితోడ
నిష్టశుభదంబు సభ్యుల నెల్ల నీగి, వలన నలరించి దీవన వడయవలయు.
క. భారతపంచమవేద, ప్రారంభమునపుడుఁ దత్సమాప్తిని వలయుర్
ధీరమతిని బహువిప్రస, మారాధన మది మహార్ధి నాపాదించుర్.
క. నీవడిగినవిధ మంతయు, భూవర చెప్పితి నజస్రమును గోప్యముగా
భావింపు మవ్విధము స, ద్భావుల కెఱిఁగింపవలయుఁ దగ దితరులకుర్.
క. భారతము నిర్మలప్రతి, భారతము న్వినినపఠనపరులకు శుభవి
స్తారము రవిశశితారక, తారకము తదీయపితృపితామహతతికిర్.
క. విన వలయుఁ జదువ వలయును, గొనియాడఁగ వలయు నధికగోప్యార్థముగా
నునుపఁగవలయును మనమున, మనుజోత్తమ భారతాఖ్యమహితాగమముర్.
ఉ. భారతపుస్తకప్రతతి పాయక యేసుకృతాత్మునింట నొ
ప్పారెడునిత్యపూజనల నందుచు నుండు దదీయవాసముం
జేరి తలిర్చునిష్టజయసిద్ధి నిజంబు పురాణపూరుషా
భాలకథామయం బగుటఁ దత్సదృశంబులె యొండుగ్రంథముల్.




# హరివంశము.

మ. మనుజులు గొనియాడవలయు, నని చెప్పట గొఱఁతయే మహామునులు సురల్
వనజజ్ఞ [illegible]గ భారత, మనిశముఁ జదువుచును వినుచు నలరుదురు మదిన్.
[illegible]రతులకు భవ్యయాన, దివిజసుఖములు సులభంబు లవుట యటుండె
ముక్తిపదము తదీయాంగమునను గల్గుఁ, దత్కథామూర్తి విష్ణుకీర్తనము గాదె.

క. భారతము గోవు విప్రుఁడు, భారతియును జాహ్నవియును బద్మావిభుఁడున్
గోరి నిరంతరచింత్యులు, గారూపించు సుజనుండు కల్యాణియగున్.

క. శ్రుతియును భారతమును రఘు, పతిచరితముఁ జదువువారు పరమపురుషు న
చ్యుతు మొదల నడుమఁ దుదిఁ బ్ర, స్తుతి సేయఁగవలయు విప్రచోదితమొందన్.

ఉ. ఏకథయందు విష్ణు జగదీశ్వరు నాద్యు ననంతు నంచిత
శ్లోక వరేణ్యుఁగాఁ దెలుపు సూక్తులు చాలఁగఁ గల్గుఁ బన్నుగా
నాకథ విస్తరింపఁ దగు నాకథ వీనులఁ గ్రోలఁగాఁ దగున్
శ్రీకరసద్గుణాకరవిశేషతనీకత కౌరవ్యోత్తమా.

క. అని చెప్పిన వైశంపా, యనువాక్యము హృషిత మైనయంగ మెలర్పన్
గొనియాడి యతని కభ్య, ర్చనఁ జేసెఁ బరీక్షిదాత్మజన్ముఁడు ప్రీతిన్.

క. మీరును బారాశర్యో, దారఫణితియందుఁ గల్గుతాత్పర్యంబుల్
ధీరము లగుచిత్రంబులఁ, జేరిచి యానందసిద్ధిఁ జెందుఁడు నియతిన్.

వ. శ్రీమహాభారతంబు హరివంశోత్తంసంబుగా నఖిలంబును యథాశ్రుతవ్యాఖ్యానంబుగాఁ జేసి మిమ్ము నారాధింపం గలిగె నే ధన్యుండ నైతి ననిన నారౌమహర్షణి వలనం బరితోషంబు నొంది.

ఉ. శౌనకుఁ డాదిగాఁ గలుగుసంయమిపుంగవు లందఱున్ బ్రమో
దానుభవంబునన్ బొదల నాంతరబాహ్యవిచేష్టితంబు లిం
పై నెఱయంగ నక్కథకు నంచితకీర్తనపూర్వభూరిస
న్మానములం బ్రహర్షమయమానసుఁగా నొనరించి రున్నతిన్.

క. శ్రీవేమక్ష్మావల్లభ, భూవల్లభపూజనీయ భుజవైభవ ల
క్ష్మీవల్లభ గుణవితరణ, పావన నినుఁ బొందుఁగాత భవ్యశుభంబుల్.

గద్యము. ఇది శ్రీశంకరస్వామి సంయమీశ్వరచరణసరోరుహ ధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైన హరివంశంబునం దుత్తరభాగంబునందు సర్వంబును దశమాశ్వాసము.

---

శ్రీకృష్ణార్పణము.